# సంస్కృతకవిజీవితము

ఇది

ఆంధ్రభాషానుశాసనాంధ్రభవిష్యపర్వదశరూపక

సంస్కృత వాఙ్మయ చరిత్రాదిబహుకృతికర్తలగు

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

రచియించినది.

K. Gopal Krishna Rao M. A.
Lecturer in Telugu,
Nizam College, Hyderabad-Dn.



ప్రథమ ముద్రణము.

ప్రథమముద్రణముప్రకాశకులు

వేంకట్రామా అండుకో,

విజయవాడ

1950



వెల రు. 6-0-0

# కృతికర్తృవిజ్ఞప్తి

సహృదయులారా!

శ్రీవేంకటగిరిసంస్థానపాలకులును కీర్తిశేషులు నగుమహారాజా వెలుగోటిరాజగోపాలకృష్ణయాచేంద్రబహాదరువారి యాస్థానకవిగా గౌరవ మందుచున్నకాలమున నేను వారి యనుమతి నంది శ్రీహర్షకాళిదాసాదు లగు ౧౫ గురు మహాకవులచరిత్రను వారికృతుల విమర్శనముతో "సంస్కృతకవిజీవిత" మనుపేర, ౧౯౧౧ లో ప్రకటించితిని. పాఠకలోకము దాని నెఱిఁగియున్నది. అందఱికవు లిం దున్నారు గాని, ఇది దానిపునర్ముద్రణము కాదు. పేరుమాత్ర మదే కాని, యిది కేవలము నూతనసృష్టి. మొదటియాకవిజీవితము పునర్ముద్రణస్థితికి వచ్చునప్పటికి ౧౯౧౪-నే ననంతపురరాజకీయకలాశాలలో నధ్యాపకుఁడనుగా నుండి సంస్కృతవాఙ్మయచరితము నిర్మించునుద్దేశముతో ఋగాదివైదికవాఙ్మయము పరిశోధించుచున్నాను. దానంజేసి వాఙ్మయచరిత్రరచనానంతరము, సవిమర్శముగా రచియించుతలంపుతో దానిని మరల ముద్రించలేదు. పిదప-

రాజమహేంద్రవరరాజకీయకలాశాలయందును, ఆంధ్రవిశ్వకలాపరిషత్కలాశాల యందును, సంస్కృతాంధ్రాధ్యాపకుఁడనై యుండి సంస్కృతవాఙ్మయచరిత్ర నిర్మించుచు వచ్చి ౧౯౩౩ లో వైదికవాఙ్మయసంపుటమును ౧౯౩౬ లో లౌకికవాఙ్మయ సంపుటమును పూర్తిగావించితిని. అవి రెండును తత్కాలమం దాంధ్రవిశ్వకలాపరిషత్తు ప్రకటింప నిచ్చితిని. తత్పునర్ముద్రణము ౧౯౪౦ లోనే యావశ్యక మయ్యెనుగాని, ఆపని నేఁటికిని సిద్ధించ లేదు. అనంతరము-

౧౯౪౧ లో నే నుద్యోగమునుండి విరమించి ధవళేశ్వరము వచ్చి స్థిరపడినంత సంస్కృతకవిజీవితముపై దృష్టి ప్రసరించినది. రచన నారంభించి వాల్మీకిమహర్షి మొదలుగా, ప్రాచీనులయు నర్వాచీనులయు నాధునికులయు జీవితచరితములు లభించినంతవఱకు సమకూర్చుచు వారివారికృతులను సంక్షేపముగా పరామర్శించుచు నీసంపుటము సంతరించితిని. ఇందు ప్రశంసింపఁబడినకవులసంఖ్య ౩౧౨. కాని, పెక్కండ్రచరిత్రలో ప్రాసంగికముగా వారివారికృతులతో స్మరింపఁబడినసారస్వతకవులు రమారమి ౩౦౦ ఉందురు. అయినా, యిది సంస్కృతకవులసంపూర్ణచరిత్ర కాఁజాలదుగాని, ముందు ముం దింకను యత్నించి, తక్కినకవులచరితముకూడా రచియింత మన్నభావముతో నున్నాను. అందుచేతనే దీనిని ప్రథమసంపుట మన్నాను.

నేను సంస్కృతవాఙ్మయచరిత్ర నిర్మించునపుడు సంస్కృతకృతులనుండియు నాంగ్లాదిభాషలఁ బ్రకటితములై యున్నసంస్కృతసారస్వతచరిత్రాదులనుండియూ విశ్వసనీ

యము లైనయేచరిత్రాంశములు గ్రహించితినో యవియు, తరువాతఁ బ్రకటితము లైనడాక్టరు యమ్. కృష్ణమాచార్యాదులసంస్కృతసారస్వతచరిత్రాదులనుండి సముచితము లని గ్రహించినవియు నిందు సందర్భోచితముగా నుద్ఘాటింపఁబడినవి. వారి కందఱకిని కృతజ్ఞుఁడను.

లెక్కకేపదిపదియేనుగురో తప్ప సంస్కృతకవులలో స్వవిషయము తెల్పినమహానీయులే లేరు. అట్టియెడ వారివాస్తవజీవితము ససాకల్యముగా రచియింప నెవరితరము? “వాల్మీకి త్రేతాయుగములోనివాఁడు, కృష్ణద్వైపాయనుఁడు ద్వాపరములోనివాఁడు” ఇత్యాదిపౌరాణికసంప్రదాయ మొకవంక, కాళిదాసాదులకాలము నిర్ణయింప నావిర్భవించినచరిత్రకారులమతభేదము లొకప్రక్క, శాసనపరిశోధకులనిర్ణయభేదము లొకమూల, గ్రంథప్రకాశకులవివిధాభిప్రాయము లొకచెంప, భ్రాంతి గొలుపుచుండ, చరిత్రాంశములు నిర్ణయించుటమాత్ర మెట్లు? అట్లని, అసలు పూర్వమహాకవిస్వరూపస్వభావములే తెలియకుండుటకంటె తెలిసినంతయేని తెలిసికొనుట మేలుగాదా! అనుభావముతో శక్తివంచన లేకుండ నుద్యమించి నిర్మించినయీకవిజీవితమును ప్రాజ్ఞపాఠకలోకమున కర్పించుచున్నాను. దోషైకదృక్కులు దోషములే వెదకి మురియుదురుగాక, గుణపక్షపాతులిందలిగుణము గ్రహించి సంతోషించుటయే నాకృషికి ఫలము. ఇందుకు, పూర్వమహాకవి ఆర్యక్షేమీశ్వరుఁ డన్నయీమాట స్మరింతము.

“ దృష్టం కిమపి లోకేఽస్మి న్న నిర్దోషం న నిర్గుణమ్,
ఆవృణుధ్వ మతో దోషాన్ వివృణుధ్వం గుణాన్ బుధాః ”

ఇఁక నొక్కమాట:- సుమా రాఱుసంత్సరములు దీక్ష వహించి తెలుఁగున నిర్మించినయీసంస్కృతకవిజీవితము సంస్కృతభాషలోఁ గూడ నున్నచో నితరదేశములవారికిఁ గూడ నుపకరించు నని భావించి యొకసంవత్సరముగా దీనిని దేవభాషకనువదింపఁ బూని నేఁటికి పూర్తిగావించితిని. అదియు నచిరకాలమున ముద్రణభాగ్యమందుఁగాక యని వాగ్దేవిని స్మరించుచున్నాను.

“ ఇదం కవిభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే,
వన్దేమహి చ తాం వాణీ మమృతా మాత్మనః కలామ్ ”

ధవళేశ్వరము
శా. ౧౮౭౨
వికృతి శ్రావణ శుక్ల పంచమి-

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

N. B. ముద్రణదోషము లిందు కొలఁదిగా నున్నవి. థ-ధ, వ-ప, ట-ఠ, న-స, ఇవి కొన్నిచోట్ల తాఱుమాఱైనవి. దయచేసి పాఠకులు సవరించుకొందురుగాక.

# కవిక్రమసూచిక

శ్రీరస్తు

ఓం నమః పరబ్రహ్మణే

# సంస్కృత కవిజీవితము

శ్లో. సర్వం బ్రహ్మేతి యదిదం, కథ్యతే తత్త్వవేదిభిః,
సత్యం జ్ఞానం సదానన్దం, తత్పరం ధామ ధీమహి.
భావప్రపఞ్చవైచిత్రీ, దర్శనాదర్శరూపిణే,
నమోఽతిక్రాన్తవృత్తాన్త, సాక్షిణే కవికర్మణే.
ధ్యాత్వా త్రయీవిలాసాం, వాణీమమృతాం శ్రియంమహర్షీణామ్,
నత్వాగురూన్ కవీన్ద్రాన్ సంస్కృతకవిజీవితం కుర్మః.

## వాల్మీకిమహర్షి

శ్లో. యన్నామ భారతీయానాం తారకం రామనామవత్
జీవన్తం తం కవిం వన్దే శ్రీమద్రామాయణాత్మనా.

వేదముల తరువాత నూతనచ్ఛందోవతారము శబ్దబ్రహ్మవివర్తమునైన రామాయణ మనెడి యితిహాసము నాదికావ్యముగా నిర్మించిన యాద్యమహాకవి వాల్మీకి. జగదేకవంద్యుఁడైన యితనిచరిత్రము నెందఱో యెన్నివిధములనో వర్ణించియున్నారు. నేనును నావాఙ్మయచరిత్రలో నితనిమహత్త్వమును గొంతవఱకు విశదీకరించియున్నాను. కావునఁ దెలిసినంతలో నితనిజీవితము నిందు సంగ్రహముగాఁ దెలియఁ జేయుచున్నాను.

ఈమహర్షి గంగాతీరమందో తమసాతీరమందో జన్మించినవాఁడయ్యును, ఆసేతుహిమాచలము భరతఖండమందలి వివిధప్రాంతములనే

కాక ద్వీపాంతరవిషయములనుగూడ నెఱిగినవాఁడు. వైదికధర్మనిరతుఁడయ్యు నిఖిలప్రపంచధర్మము లెఱిఁగిన లోకజ్ఞుఁడు. ఆశ్రమవాసి యయ్యు నుత్తమనాగరకుఁడు. వైదికశబ్దరాశి నవగాహించినవాఁడయ్యు లౌకిక భాషలో మృదుమధురమయఫణితి నుత్తమకావ్యసృష్టిగావించిన కవిపితామహుఁడు. శుచివర్తనుఁడు సుశ్లోకుఁడు. తపోనిధి బ్రహ్మనిష్ఠుఁడు.

మహాత్ములజన్మవృత్తాంతము కాలక్రమమున నత్యద్భుతముగాఁ బరిణమించుట సకలసారస్వతప్రసిద్ధము. మనవాల్మీకిదియు నట్టిదే. "వల్మీకస్యాపత్యం" వల్మీకముకొడుకనియు, "వల్మీకాద్బహి రాగతః" వల్మీకము నుండి బయటికి వచ్చినవాఁడనియు వాల్మీకిశబ్దమునకు వ్యుత్పత్తులు కలవు. ఇందు రెండవదానిని గూర్చి పద్మపురాణ మిట్లు చెప్పుచున్నది.

"ఒకకిరాతుఁడు మహర్షులయుపదేశమునుబట్టి రామనామము జపించుచు నొకవనమం దట్లే చిరకాల ముండఁగా నతనిదేహముచుట్టు చెదలు పుట్టపెట్టినవి. ఆపుట్టలో నతఁ డట్లే తారకనామము జపించుచుండ నొకనాఁడచ్చటికి సప్తమహర్షులు వచ్చి "కిరాతా" అని పిలిచిరి. ఆకేక విని యతఁడు పుట్ట చీల్చుకొని బయటికి వచ్చి వాల్మీకియను పేర బ్రహ్మతేజస్సంపన్నుఁడై నభూతపూర్వమై ప్రఖ్యాతి గాంచెను" ఇది యిట్లుండ "వల్మీకుఁడను నొకముని కొకప్పుడు రేతస్స్ఖలనము కాఁగా దాని నొకసర్పాంగన మ్రింగెననియు, అది గర్భము దాల్చి మగశిశువును గాంచె ననియు, ఆపిల్లవాఁడే వల్మీకుని పుత్త్రుఁడుగా వాల్మీకి యన్నపేరు గాంచె ననియు" స్కాందపురాణము చెప్పుచున్నది.

ఇతఁడు నిష్ఠాగరిష్ఠుఁడై తపస్సు చేసినస్థలమందు పుట్టలు పెరిగి యుండును. తపోదీక్షానంతర మితఁ డాపుట్టలనడుమ నుండి యీవలికి వచ్చుట గన్నవా రితనిని వాల్మీకియని పిలిచియుందు" రని మన మొక విధముగా పద్మపురాణసంప్రదాయమును సమర్థించుకొనవచ్చును గాని, వల్మీకముని కొడుకని భావించుటయే సముచితము. ఎట్లయిననేమి?

రామాయణకథతో సకలప్రపంచవ్యాప్తమైన వినుతి కెక్కినపేరిదే. ఇంక నితని తక్కిననామము లేవో చూతము.

ఇతనికి ఋక్షుఁడు, భార్గవుఁడు, ప్రాచేతసుఁడు అనుమూఁడుపేళ్లు వైదిక లౌకికవాఙ్మయములఁ గనఁబడుచున్నవి. కలసిపోయియున్నమంత్ర రాశిని ప్రతిద్వాపరము విభజించినముని వ్యాసుఁ డనుబిరుదు గాంచు ననియు, ఇరువదినాల్గవద్వాపరపరమునందట్లు వేదవిభజనము గావించిన వాల్మీకి యనెడిఋక్షుఁ డాబిరుదమందె ననియు విష్ణు వాయు కూర్మాది పురాణములు తెలుపుచున్నవి.

"ఋక్షోఽభూ ద్భార్గవ స్తస్మా ద్వాల్మీకి ర్యోఽభిధీయ తే" వి 3 . 3
"పరివ ర్తే చతుర్వింశే ఋక్షో వ్యాసో భవిష్యతి" వా. పూ. 23-
"తృణబిందు స్త్రయోవింశే వాల్మీకి స్తు తతః పరః" కూ.

వాల్మీకిపేరెత్తి యితనిమత ముదాహరించునకృష్ణయజుర్వేదప్రాతిశాఖ్య మితనికి వేదవిభజనముతో సంబంధము కల దనుటకుఁ బ్రమాణ మగుచున్నది. ద్వాపరములోనివాఁడన్నయతిశయోక్తి కేమి? వీనినిబట్టి వాల్మీకికిఁ బైమూఁడు నామములు కల వని స్పష్టమగుచున్నను, ఈవిషయమును ధ్రువపఱుచుట కొకింత చర్చింతము.

వైదికఋషులలో నొకపేరు గలవా రిద్దఱు ముగ్గురు చొప్పునఁ గన వచ్చుచున్నారు. సూక్తద్రష్టలకును అనుక్రమణికాపురాణకర్తలకును నడుమ పెద్దయంతర మున్నది. అందుచే వారిపేళ్లు కొన్ని వీరినాఁటికే తాఱుమాఱగుటయు స్మృతిపథము దాఁటుటయు సంభవించిన దని వీరిఋషివంశనిర్ణయవాక్యములే చెప్పుచున్నవి.[1] కావున వాల్మీకి వంశ నామములకు హేతుభూతు లైన భృగుప్రచేతసు లెప్పటివారో నిర్ణ

1. "చంద్రమా ఇతిసూక్తస్య త్రిత ఆప్త్యోఽథవా ఋషిః కుత్సః"
"ఆంగిరసస్య వీతహవ్యస్య, భారద్వాజస్య వాఽఽర్షమ్"
"ఏషాంతు గోత్రం క్వచి దప్రసిద్ధమ్-అనుక్తగోత్రో కాణ్వ ఇతి జ్ఞేయః"
బృహద్దేవతా-అనుక్తగోత్ర మాంగిరసం విద్యాత్ - శౌనకా.

యించుట యశక్య మన్నమాట యటుండ వారెవ్వ రనెడినిర్ణయము కూడా అంత సుగమము కాకున్నది. ఏమనఁగా, ఒక్కొక్కఋషి గోత్రమువారు మూలపురుషుని పేర భార్గవులు-ఆంగిరసులు-కాణ్వులు-ఇత్యాదిగా వాడఁబడుచున్నట్లే, ప్రతిగోత్రమునందును మూలపురుషుని పేరతనిపౌత్రునికిని, అతనిపేరతనిమునుమనికిని వచ్చుచుండుట యాచారము గావున దానినిబట్టి భృగువు ప్రచేతసుఁడు వరుణుఁడు ఇత్యాది నామములతో నయ్యాగోత్రములలో నెందఱో ఋషులుండు రని నమ్మవలసి యున్నది. అందుచే సమాననామము గలయాఋషులలో నేభృగువు పూర్వుఁడో ఏప్రచేతసుఁడు ప్రాచీనుఁడో నిర్ణయింపఁ జాలము కదా!

వరుణుఁడనునామాంతరము గలప్రచేతసుఁ డష్టదిక్పాలకులలోని వాఁడు. ఆంగిరోవంశమునందు మఱియొకప్రచేతసుఁ డున్నాఁడు. వీ రిరువు రొక్కరేయనుటకు ప్రమాణము దుర్లభము. భృగువు వరుణుని కొడుకని "భృగు ర్వై వారుణిః" అని తైత్తిరీయోపనిషద్వాక్యము. భృగువు అంగీరసుఁడు కలసి కొన్నిసూక్తములు సందర్శించి రనియు, భృగువుకొడుకు జమదగ్ని యనియు నతఁడు సప్తమహర్షులలోనివాఁడనియు, ఋగథర్వవేదానుక్రమణికలు. ప్రచేతసు నంగిరోగోత్రమునఁ జేర్చినయనుక్రమణికలు వరుణనామ మెత్తలేదు. వా రిద్ద ఱొకరే యన లేదు. భృగు వాంగిరసుఁ డని కాని, అంగిరసుఁడు భార్గవుఁడని కాని యెందును దెలియరాదు. అందుచే వాల్మీకి యని ప్రఖ్యాతి కెక్కినఋషుఁడు ప్రచేతోగోత్రమున జన్మించుటచే ప్రాచేతసుఁ డయ్యె ననియు, భృగు సంతతిని జన్మించినవాఁడగుటచే భార్గవుఁ డయ్యె ననియు సారస్వతసంప్రదాయములనుబట్టి విశ్వసింపవలసినదే కాని, వారిలో నెవరికెన్నవతరము వాఁడో యూహించలేము. కావున మనమహర్షి ప్రాచేతసాదినామములతో సారస్వతముల వర్ణింపఁబడుట సుసంగతమే యనియు వాల్మీకినామము గల మఱియొకఋషి యెందును కనరాఁడు గావున

శ్రీమద్రామాయణకర్తయైన యీవాల్మీకియే వైదికసారస్వతమున వేదవ్యాసబిరుదముతోఁ బ్రశంస కెక్కినవాఁడనియు నిశ్చయింతము.

## —* ఇతని కాలము *—

ఎవ రెంత దిగలాగినా, తైత్తిరీయారణ్యకోపనిషత్తుల యావిర్భావకాలము శాలివాహనశకారంభమునకు పూర్వము పదునైదవ శతాబ్దిని దాటి యీవలికి రాదు.[1] ఈ మాట నిజమైనా భృగువల్లిలోని వరుణభృగువుల సంభాషణమునుబట్టి, ఆతండ్రికొడుకు లా శతాబ్దిలోనివా రని మాత్రము భావింపరాదు. వా రేనాఁటివారో! కాని వారిగోత్రములోని మనవాల్మీకిమాత్ర మాశతాబ్దికి తరువాతివాఁడే. అయితే, ఎప్పటివాఁడు?_ఇందుకు ముందు సంగ్రహముగా రెండుమాటలు. పాణినికి పూర్వుఁ డాపస్తంబుఁడు, అతనికి పూర్వుఁడు మనువు.[2] మనుస్మృతికి పూర్వము భారతసంహిత, దానికి పూర్వము రామాయణము.

రామాయణమందును మనుస్మృతియందును రాజధర్మముల తోడి రెండుశ్లోకములు సమానముగా నున్నవి.[3] సంగతిసందర్భములను బట్టి, ఆధర్మములు శ్రీరాముఁడు వాలికిఁ దెల్పిన వని విదిత మగుచున్నది. దానంజేసి యాశ్లోకము లెపుడో యెట్లో మనుస్మృతియందు ప్రక్షిప్తములై యుండు నని విశ్వసింపవలసియున్నది; నిజమిది యై

1. చూ. సం. వా. చ. పరి ద్వి. సంపు. ద్వితీయాధ్యాయము.

2. చూ. సం. వా. చ. పరి. ౩౯. ౩౧.

3. "రాజభి ర్ధృతదండాస్తు కృత్వా పాపాని మానవాః,
నిర్మలాః స్వర్గ మాయాన్తి సన్తః సుకృతినో యథా
శాసనా ద్వా విమోక్షాద్వా స్తేనః స్తేయా ద్విముచ్యతే
రాజా త్వశాస త్పాపస్య త దవాప్నోతి కిల్బిషమ్"
రామా. కిష్కి౦-౧౮-౩౨'౩౩—మను. అధ్యా. ౩౧౮-౩౧౬.

యుండఁగా మనుస్మృత్యభిమాని యొకఁ డేనాఁడు చేర్చెనో కాని, రామాయణములోని యాశ్లోకములముందు—

"శ్రూయతే మనునా గీతౌ శ్లోకౌ చారిత్రవత్సలౌ"

ఇత్యాదిశ్లోకము చేర్చి మనుస్మృతి ముం దన్నభ్రాంతి గలిగించెను. సత్యము పరిశీలింపఁగా కొందఱు పరిశోధకులు భావించినట్లు మనుస్మృతిలో నితరగ్రంథముల శ్లోకములు కొన్ని కనవచ్చునుగాని, రామాయణములో నట్లు కనరావు. ఇంతకును, ఆదిమహాకావ్యకర్తకు తరువాతికృతులలోని వాక్యము లెట్లు లభించును? అయోధ్యాకాండయం దయోధ్యాపురనిర్మాతగా వర్ణింపఁబడినమనువు మనము కనుచున్న స్మృతిని రచియించిన మనువు కాఁడు[1] కావున మనుస్మృతికంటె రామాయణము పూర్వ మనుట కాక్షేప మేమి? ఇంక—

భారతసంహితకంటె మనుస్మృతి పూర్వ మన్నవాదము నిట్టిదే. భారతములో రెండుమూఁడుచోట్ల మనువుపేరును, మనుప్రోక్తములుగా రెండుశ్లోకములును[2] కనవచ్చుమాట సత్యమే కాని, అవి ముద్రిత మనుస్మృతిలో లేవు. అందలివిషయ మైనను మనుస్మృతిలోనిరాజధర్మవచనములలోఁ గనరాదు. ఇంక, మఱిరెండు శ్లోకములు[3] మనుస్మృతి భారతసంహితలరెంట సమానముగా నున్నవి కాని, భారతములోనచ్చట మనువుపేరు లేదు. ఉద్యోగపర్వములోని యాశ్లోకములస్థితి పరిశీలించి

1. చూ. సం. వా. చ. పరి. అధ్యా. ౯ స్మృతులు.
2. అపి చైతత్పురా రాజన్ మనునా ప్రోక్త మాదితః...శాంతి. ౧౨౧-౧౦
యథోక్త మేత ద్వచనం ప్రాగేవ మనునా పురా...శాంతి. ౧౨౧-౧౨
3. షడేతాన్ పురుషో జహ్యా ద్భిన్నాం నావ మి వార్ణవే
అప్రవక్తార మాచార్య మనధీయాన మృత్విజమ్
అరక్షితారం రాజానం భార్యాం చాప్రియవాదినీం
గ్రామకామం చ గోపాలం వనకామంచ నాపితమ్.
ఉద్యో. ౩౭-౪౪, ౪౫—ఇవే శాంతి ౫౭-౪౪, ౪౫. మను. రాజధ

నచో నవి తప్పక భారతకర్త వని తోచకపోదు. అందుచే వాటిని భారతమునుండి మనుస్మృతి గ్రహించి యుండు ననుట యుక్తమగును గాని, దీనినుండి యది గైకొనె ననుట తగదు గావున, మనుస్మృతికంటె భారతసంహితయే పూర్వ మనుట సముచితము. అయితే రామాయణ భారతేతిహాసములలో నేది పూర్వము ? నా వాఙ్మయచరిత్రలో విపుల ముగాఁ జర్చింపఁబడిన యీవిషయమం దలిసారాంశ మిది:—

ఆదిపర్వమున విదురుఁడు "భీష్మద్రోణులు ధర్మమునందు దాశరథి రామునికిఁ దీసిపోరు"[1] అని చెప్పెను. యుద్ధకాండములోని యీక్రింది శ్లోకార్థమును ద్రోణపర్వ మిట్లు గ్రహించినది.

"అపి చాయం పురా గీతః శ్లోకో వాల్మీకినా భువి
"న హన్తవ్యాః స్త్రియ ఇతి య ద్బ్రవీషి ప్లవంగమ !"

అయోధ్యాకాండములోని "సర్వే క్షయాన్తా నిచయాః— యథా కాష్ఠం చ కాష్ఠం చ సమేయాతాం మహార్ణవే" ఇత్యాదిశ్లోకములను శాంతిపర్వము యథోక్తముగా గ్రహించినది.[2] ఇది గాక పౌరాణికసం ప్రదాయము కావ్యోత్పత్తిమార్గము పరిశీలించినను పూర్వులకవిప్రశం సలు చూచినను భారతముకంటె రామాయణమే పూర్వమని తెలియక పోదు. అందుచే శా. పూ. ౧౧ శతాబ్దిలోనిమనుస్మృతికంటె భారత సంహిత యొకశతాబ్ది పూర్వమనియు దానికంటె రామాయణ మింకొక శతాబ్ది ముందనియు, ఆసమయము శా. పూ. ౧౩ వ శతాబ్దియగు ననియు భావింతము. రామాయణమింతకంటె నతిప్రాచీనమని స్వప్రమా ణముగా నెవ్వరైన నిరూపింతురేని ముదావహమే.

## —• కవి త్వో త్ప త్తి •—

వల్కలధారి యైన యీతపోనిధి యొకనాఁడు తమసాతీర్థమున స్నానమాడ భరద్వాజుఁ డనుశిష్యునిం గూడి పోవుచున్నతఱి నొక

1, అధ్యా. ౨౦౧- 2, శాం. ౨౭, ౩౧,

చెట్టుమీఁది క్రౌంచమిథునములో మగదానిని నొక నిషాదుఁడు బాణమునఁ గూల్చెను. క్రిందఁబడి గిజగిజలాడుచున్న దానిని జూచి యాఁడుపిట్ట శోకించుచు నార్చుచుండెను. వాటిగతి నవలోకించిన వాల్మీకినోట నప్రయత్నముగా వచ్చినశ్లోకముతోడిమాట లీక్రిందవిధముగా శ్లోకరూపము దాల్చినవి. నూతనచ్ఛందోఽవతార మననిదే—

“మా నిషాద! ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః,
యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్”

అనంతరము బ్రహ్మ యతనికి దర్శన మిచ్చి “నాసంకల్పమువల్లనే నీనోట సరస్వతి పలికినది. శ్రీరామకథ భూతలమున శాశ్వతమైనిలచునట్లు ఛందోబద్ధము గావింపుము” అని యానతిచ్చి యదృశ్యుఁడయ్యెను. అట్లు బ్రహ్మనుగ్రహమునకుఁ బాత్రుఁడైనవాల్మీకిమహర్షి పరమపావనమైన సీతారామేతిహాసము నమృతవాక్కుల మనోహరకావ్యముగా నిర్మించెనని మనకు బాలకాండద్వితీయసర్గ తెల్పినది.

—* రామాయణప్రశంస *—

“మధుమయఫణితీనాం మార్గదర్శీమహర్షిః,” అని వాల్మీకికి పేరు తెచ్చినయీమహాకావ్యము మృదుమధురభాషకు పుట్టిల్లు. కథాపాత్రరసౌచిత్యముల కాటపట్టు. నవరసముల కునికిపట్టు. త్రివిధకావ్యధర్మములకు దివ్యలక్షణము. వేదాధికార మున్నవారికిని లేనివారికిని గూడ నైహికాముష్మికవిజ్ఞాన ముపదేశించు నార్షవేదము, ఆదికావ్యము. దీనిని పూజింపనియాస్తికునియిల్లు భరతఖండమున లేదు. ఈయుత్తమకృతిని సన్నుతింపని యక్షరాస్యుఁడు భూమండలమున లేఁడు.

వేద ముపదేశించినధర్మాధర్మములను సోదాహరణముగా విశదీకరించుచు సత్యసంధత పితృభక్తి పితృవాక్యపరిపాలనము పాతివ్రత్యము సౌభ్రాత్రము తపోమహిమ శిష్టరక్షణము దుష్టశిక్షణము మొదలగు

ముఖ్యవిషయములను మనసున కెక్కునట్లు బోధించుటయే దీనిపని. ఇది పుట్టినతరువాత దేశమున నెన్నెని విప్లవములు వచ్చినవి. వర్ణాశ్రమాచారము లెన్నో విధముల మారుచు వచ్చినవి. ప్రాచీననాగరకతకు విదేశ నాగరకత భంగపాటు కలిగించుచునవచ్చినది. అయినా, రామాయణ మంటే ప్రామాణ్యముమాత్రము క్షీణించలేదు. దినమున కేడుసర్గలచొప్పున నిరంతరాయముగా నేడుసాగ్లు సుందరకాండము పారాయణము చేయువారి ప్రారప్రసిద్ధి గాంతు రన్నవిశ్వాస మేనాడు పుట్టినదో! నేటికి కూడా య ట్లాచరించువారు లేకపోలేదు. ఇంక—

కవిత్వసంపద చూతుమా, అది నిరుపమానము. భాసకాళిదాసాదిమహాకవులకు మృదుమధురకవిత్వము నేర్పినయాద్యగురువు రామాయణము. నాయికానాయకాదివివిధకావ్యలక్షణముల నాలంకారికుల కుపదేశించినది రామాయణము. పరమపావనమైన సత్ప్రవర్తనము నుత్తమపాత్రములద్వారా భారతీయుల కుగ్గుపాలతో పెట్టినది రామాయణము. అట్టిజగదేకవంద్యమైనయీయాఖ్యానమును మన మిట్టి దని ప్రశంసించుట కాఁగడాతో సూర్యుని చూపుటయే. గాయత్రీమంత్రము లోనియిరువదినాలు గక్షరములు క్రమముగా నొక్కొక్కశ్లోకసహస్రము మొదట నున్న వని నిరూపించుచు దీనిమహత్త్వము ప్రకటించిన గాయత్రీరామాయణము దీనిసుగుణసంపద నెల్ల నావిష్కరించి యున్నది. అది చాలును. రామాయణ మన్న పే రెంతమనోహరమో, ఇందేమహిమ యున్నదో! ఈపేరు పెట్టుకొని తరువాత వెలసినవివిధ రామాయణములే తెలుపఁగలవు. ఈరామాఖ్యానము మెంతమాధుర్యమున్నదో, ఇది యాధారముగా వెలసిన వందలకొలఁది వివిధకావ్యములే చాటఁగలవు. భరతఖండముపాలిటిభాగ్యదేవత రామాయణ మనిస్మరించుటకంటె దీనిని వేఱుగా నుతింపఁ జాలము. ఇంక—

## గ్రంథపరిశీలనము

ఇందు, ఆఱుకాండలు అయిదునందలసర్గలు ఇరువదినాలుగువేల శ్లోకములు నున్నవని బాలకాండచతుర్థసర్గలోని రెండవశ్లోకము చెప్పు చున్నది. కాని, లెక్కింపఁగా 32 సర్గ లెక్కువగా నున్నవి. 3300 శ్లోకములు తక్కువగా నున్నవి.[1] ఉత్తరకాండ కలుపుకొన్నచో 28 సర్గలు ౧౨౦౦ శ్లోకములు నెక్కు వగును. కాని, నిజముగా నుత్తర కాండ వాల్మీకికృతము కా దని దాని భాషయు శైలియు రీతియు తెల్పు చున్నవి. రామాయణము చదివి పరవశుఁడైన యొకపూర్వవిద్వాం సుఁడు భారతకథతో కృష్ణద్వైపాయనునికి సంబంధమున్నదిగదాయని రామకథతో వాల్మీకికి సంబంధము కల్పించి దానిని నిర్మించియుండును. అట్లుకాకున్న, త్రేతాయుగములోనివాఁడను కొనుచున్న రాముఁడెక్కడ? కలిలోని వాల్మీకియెక్కడ? అతఁడో, మఱియొకయర్వాచీనపండితుఁడో, ఉత్తరకాండప్రసక్తివచ్చునట్లు బాలకాండమున తృతీయచతుర్థసర్గలు కల్పించి చేర్చి యుండును. ఇవియే కాదు, ముద్రితపుస్తకములలో కనవ చ్చునధికపాఠములును కుండలీకృతశ్లోకములును బాలకాండములోని పెక్కుశ్లోకములు నట్లు ప్రక్షిప్తములే యని బహుపరిశోధకుల యభిప్రా యము. తత్స మరయఁగోరువారికి, బాలకాండద్వితీయసర్గతుద నున్న "రఘువరచరితం మునిప్రణీతం దశశిరసశ్చ వధం నిశామయధ్వం" అను శ్లోకముతో పంచమసర్గారంభమం దున్న "సర్వా పూర్వా మియం యేషా మాసీత్ కృత్స్నా వసుంధరా" అనుశ్లోకము సరిగా కథాప్రారం భమున కనుగుణముగా నతుకొన్నట్లు కనఁబడుచుండ, మూఁడు నాలుగు సర్గలును, మూఁడవసర్గచివర నున్న "వైదేహ్యా శ్చ విసర్జనమ్, అనాగ తం చ యత్కించి ద్రామస్య వసుధా తలే, త చ్చకారోత్తరే కావ్యే వాల్మీకి ర్భగవా నృషిః" అనుమాటలకును ప్రసక్తి గాని సందర్భశుద్ధి

1. వివిధముద్రణములు పరిశోధించినచో నీలెక్కలలో కొంచెము తేడా లుండవచ్చును.

గాని యేమియు లేదని తోచకపోదు. కావున నివి ప్రక్షిప్తములనక తప్పదు. అయోధ్యాకాండలోఁ గూడా యిట్టివి కొన్ని కలవు. ఇట్టివాని నెల్ల దీసివేసినచో సార్ధగ్రంథ మిరువది వేలకు సరిపడునేమో! అప్పుడు నాల్గువేలగ్రంథము నష్టమైనదనకతప్పదు. కాండాంతగద్యలును గాయత్రీరామాయణమును కొన్నియుపపురాణములును శ్రీమద్రామాయణ గ్రంథ మిరువదినాలుగువే లని యేకగ్రీవముగా చెప్పుచున్నమాట కాదనలేముగదా!

రామోపాఖ్యాన మిక్ష్వాకురాజులవంశమందు పుట్టినట్లు వినవచ్చుచున్న దనుచు, నిది సత్యమైన పురావృత్త మనెడివిశ్వాసమును వాల్మీకి వెల్లడించియున్నాఁడు. ఆరాజులచరితములు కొన్నిఋగ్వేదాదులందు వర్ణితములు. వారిరాజధాని యైన అయోధ్య యాపేరనే సరయూతీరమున నేఁటికిని కనవచ్చుచున్నది. అయినా, కొన్నియద్భుతచర్య లుండుటచే నిది కల్పితకథాకావ్య మని కొందఱు భ్రాంతిపడకపోలేదు. శుద్ధసత్వప్రసన్న మయ్యుఁ బ్రచండశౌర్యవిలసిత మైన శ్రీరామచరితము లోకోత్తరము అసాధారణము పరమపావనము నగుట మొదటినుండియు ప్రాజ్ఞులహృదయ మాకర్షించుచు వచ్చి క్రమముగా వాల్మీకినాఁటికి మహామహిమాభిరామ మైనపరమేశ్వర చరితముగా ప్రత్యక్ష మైనది. అందుచే ధర్మసంస్థాపనార్థ మవతరించినశ్రీమహావిష్ణువే శ్రీరాముఁ డని వాల్మీకి కథారంభము గావించెను. అది సముచితమే కదా!

లోకపూజ్యమగు నసాధారణమహత్త్వము చూపినగౌతమశంకరాదులును మొన్నమొన్నటిరామకృష్ణపరమహంసాదులును భగవదవతారపురుషులుగా గణింపఁబడుచుండ సకలసద్గుణపుంజ మైనరాముఁడానాఁడు పరమేశ్వరావతార మని భావింపఁబడినాఁ డన్న నాశ్చర్యమేమి! అవిమర్శనీయములైన యట్టి పురుషోత్తముల మానవాతీతకృత్యములే కదా భగవంతుఁడున్నాఁ డనెడియాస్తికుల కాధారములై యితి

హాసపురాణరూపమున జగ మావరించినవి! లేదేని, ఆస్తికమత మేమై యుండునో! ఇంతకును సుశీలుఁడు శూరుఁడు నైనయొకక్షత్రియకుమారుఁడు పితృవాక్యపరిపాలన మాచరించి దుష్టసంహారము గావించి ధర్మమును రక్షించె నన్నమూలకథ మానవాతీతము కాదుగదా! అదియే కాలక్రమమున వన్నెలు చిన్నెలు వెలయ నహల్యాశాపవిమోచనాదికము లైన కొన్నియద్భుతవిషయములతో పారంపర్యోపదేశమునభగవద్విలాసముగా పరిణమించి యాద్యమహాకవిచెవిని పడ్డది. కావున రామాయణమూలకథ కల్పితము గాక సత్య మనియే విశ్వసింపనగును.

## కథాపాత్రపోషణము

ఈకథ యింత విస్తరించుటకు ముఖ్యకారణము కైకేయీవరము. అది లేనిచో నిది సీతాకళ్యాణముతో సమాప్తముకావలసినదే. రామమూర్ధాభిషేకసందర్భమున మెల్లగా కథారంగముజొచ్చినయీవరమే మఱుఁగున నుండి నవరసభరిత మైనయీనాటక మాడించినది. ధర్మజ్ఞుఁ డైన దశరథుఁడు సత్యమునకు సౌశీల్య మర్పించి ప్రేమకు ప్రాణమర్పించెను. కులక్రమాగత మైనరాజ్యమునకు దూరుఁడై రాముఁ డడవులపా లయ్యెను. సుకుమారమూర్తి యైన సీత పడరానిపాట్లు పడెను. బంగారమువంటి భరతుఁడు బైరాగి యయ్యెను. దీని కంతకు నావరము కారణము కాదా?

శ్రీరాముని దుష్టశిక్షణ శిష్టరక్షణముల కవతరించినదివ్యమూర్తిఁగా కవి చిత్రించినమాట నిజము. లోక మంతయు నతనినిమనసార నట్లు ధ్యానించుచున్నమాట సత్యము. అయినా, దివ్యత్వముకన్న నుత్తమమానవత్వమే యిం దెక్కువ గోచరించుచున్న దని పాఠకులు భావింపకపోరు. అందుకు కూడా యీవరమేకారణ మనుట కొకయుదాహరణము—అడ

విలో నడుగు పెట్టిననాఁటిరాత్రి సౌమిత్రితో శ్రీరాముఁ డన్నమాటల సార మిది:—[1]

“తమ్ముఁడూ! ఆమహారా జిప్పుడు దుఃఖించుచునే పడుకొనియుండును, తనకోరిక తీరినది గావున కైకేయి సంతోషించు చుండును. భరతుఁ డిప్పటికి కోటకువచ్చియుండును గావున, ఆ దేవి రాజ్యముకోస మింక మనతండ్రిప్రాణాలు తీయుమలే. పాపము! పెద్దవాఁడు అనాథుడు నాతో నెడఁబాటు వచ్చినవాఁడు కైకేయికి వశ్యుఁ డైన కామాత్ముఁడు, అతఁ డేమి చేయును? మనతండ్రి మతిభ్రమను వ్యసనమును చూడఁగా ధర్మార్థములకంటె కామమే గొప్ప దని తోఁచుచున్నది. కాకపోతే ఎంత తెలివిమాలినవాఁడైనా మనతండ్రి నన్నువిడిచినట్లుగా ఆఁడుదానికోసము తనకు విధేయుఁడైన కొడుకును విడిచిపెట్టునా?”

“మాతండ్రి చెప్పకున్నను నీమాటనుబట్టియే నే నడవికిఁ బోదును” అని కైకకు మాట యిచ్చినయుదారహృదయుఁడు సుశీలుఁడు పితృభక్తిమూర్తి శ్రీరాముఁడు. అతడు తండ్రికి తనయందు గలవాత్సల్య మెఱుఁగనివాఁడుకాఁడు. కైకేయీవరస్వరూపము తెలియనివాఁడు కాఁడు. తా నడవిపాలుకావలసివచ్చిన దని యిసుమంతయు విచారించుచున్నవాఁడుకాఁడు. అయితేనేమి? ఎంతటిధీరుఁడైన నెంతటిప్రాజ్ఞుఁడైన దుఃఖసమయమున మనస్సు నాపుకొనఁజాలఁడు గదా! అది మానవస్వభావము. అందుచేతనే తండ్రిదుఃఖమునకు విచారించుచున్నయతని పైమాటలలోనింద యించుక తలచూపినది.

---

1. ధ్రువ మద్య మహారాజో దుఃఖం స్వపితి లక్ష్మణ! కృతకామా హి కైకేయీ తుష్టా భవితు మర్హతి, సాహి దేవీ మహారాజం కైకేయీరాజ్యకారణాత్, అపి న చ్యావయే త్ప్రాణాన్ దృష్ట్వా భరత మాగతం, అనాథ శ్చైవ వృద్ధశ్చ మయా చైవ వినా కృతః కిం కరిష్యతి కామాత్మా కైకేయీవశ మాగతః, ఇదం వ్యసన మాలోక్య రాజ్ఞశ్చ మతి విభ్రమం, కామ ఏ వార్థధర్మాభ్యాం గరీయా నితి మే మతిః, కో హ్యవిద్వా నపి పుమాన్ ప్రమదాయాః కృతే త్యజేత్, ఛందానువర్తినం పుత్రం తాతో మా మివ లక్ష్మణ! అయో. ౫౩ సర్గ.

దశరథునికి కైకేయియెడ మోహ మెక్కువే యందము. అవ్యసనమున నతనిమతి పరవశ మైనదే యందము. అయితే, ఆవర మేనాఁడో యిచ్చినది గాని యీనాఁ డిచ్చినదా ? అదియైనా, యీవిధముగా పరిణమించు నని తెలిసి యిచ్చినదా ? ఇపుడు కైక కోరిన ట్లావరము చెల్లింప నని నిషేధింపలేక దుఃఖములో మునిఁగెను గాని చెల్లింతు ననెనా ? రాముని తననోటితో నడవికి పొమ్మనెనా ? మూర్ఛితుఁడై నయూరా జితఁ డడవికి పోవుట యెఱుఁగునా ? ఈవిషయ మంతయు రామునికి తెలియనిది కాదు. అయితే, పితృవాక్యపరిపాలనమే తనధర్మమని మనసార భావించినరాముఁ డిప్పు డెందు కట్లు నిందించెను ? అది నింద యనుకొనుటకంటె తండ్రిదుఃఖపాటునకు వికలహృదయు డైన రామునిదుఃఖమనుకొనుట యుక్తము. మనస్సు చివుక్కుమన్నప్పుడు పాతగొడవలు త్రవ్వుకొని పరితపించుట మానవస్వభావము కదా ! కావున దీనినిబట్టి రామునిపితృభక్తి కలంకితము కాఁజాలదనుట నిజము. ఇట్లే రామునియెడఁబాటునకు దుఃఖించుచున్నకౌసల్య భర్తను నిందించియు వెంటనే పశ్చాత్తాపపడి యన్న యీక్రిందిమాటలచే నామెపతిభక్తియుఁ గలంకితము కాఁజాలదు.

"జానామి ధర్మం ధర్మజ్ఞ ! త్వాం జానే సత్యవాదినమ్,
పుత్రశోకార్తయా తత్తు మయా కిమపి భాషితమ్ "

ఇంతకును దశరథపాత్రము నిందాపాత్రము కాదని కైకకు వరము నిప్పించినదేవాసురసంగ్రామసాహాయ్యకథ సాక్ష్య మిచ్చుచునే యున్నది—ఇంక కైకేయీపాత్ర మందుమా, లోభగుణమున కాద్యనిదర్శనముగా పోషింపఁబడినయది నిందాపాత్రమే. భర్తప్రాణ మైన సరకుగొనక లోకనింద కొడిగట్టి స్త్రీజాతికి సహజ మగుకుసుమసుకుమారహృదయము నల్లరాయిగా వినయమూర్తి సుగుణరాశియు నైన

కుమారరామునితో "నీ వడవికి పొమ్మ" ని నిర్దాక్షిణ్యముగా పలికిన యీపాత్రము నింద్య మెట్లు కాకపోవును? ఈఘట్ట మిట్లుండకున్న కథ యెట్లు నడచును? మహాకవికూడా, ఈపాత్రము కేవలనింద్యముగా తోఁచకుండుటకై మంథరాదుర్బోధాదిహేతువులు చూపియు, తుదకు నిందకే పట్టముగట్టెను. కథాప్రవర్తనదృష్టితోడి పాత్రపోషణచాతుర్య మన నదే కదా! ఇఁక, తక్కినముఖ్యపాత్రములఁ గూర్చి యొకింత–

ఆకారము దాల్చినసౌభ్రాత్రమే భరతలక్ష్మణశత్రుఘ్నులు. సీతారాములపాదసేవయే జీవితఫల మని వనవాసమున కానందించినభక్తమూర్తి సౌమిత్రి. లోకాపవాదముపాలైన తల్లి తెచ్చినరాజ్య మొల్లక వానప్రస్థునివలె జటావల్కలధారియై ఫలమూలాశనుఁడై తమ్మునిఁ గూడి రామపాదుకల నారాధించినభక్తియోగి భరతుఁడు. ఇరువురు నిష్కపటభక్తులే కాని 'కైకను చంపెదను భరతుని పరిమార్చెద' ననుచు తాత్కాలికావేశమున నావేగము చూపినసౌమిత్రికంటె తల్లివలన వచ్చినయపకీర్తికితలవంచుకొనిజరిగినదానికి ప్రతిక్రియ చేయఁజాలక రామపాదుకలచే రాజ్యము చేయించినభరతుఁడు దీర్ఘదర్శి. ఇట్టియీపాత్రభేదములపరిశీలించియే కాఁబోలు రంగనాథుఁడు "భరతుండు నీకంటె భక్తుండు నాకు" అనుచు శ్రీరామునిచే ననిపించినాఁడు! ఇంక–

శ్రీహరి నెడఁబాసి యుండఁజాలక భూదేవి కవతరించినలక్ష్మి సీత తనువు దాల్చినపాతివ్రత్యము. "చచ్చినా బ్రతికినా సతికి పతియే గతి యఁట. మగనితో నున్నవనమే మగువకు పుట్టిల్లఁట. భర్త లేనిస్వర్గమైనను పాడుకొంప యఁట. వీరుఁడైనపురుషుఁడు తనభార్యను పోషింప నన్యుల కప్పగించఁగూడ దఁట!" ఆహా! అసూర్యంపశ్య యైనయీరాచబిడ్డ యరణ్యావాసజిగమిష! ఏమి సౌశీల్యము? ఇం తేందుకు? భర్తతోడిదే లోక మన్న భావ మొకటి తప్ప యితరచింత యిసుమంతేని హృదయమున లేని యీమాయిసురా లాసతీమణి యనుటకంటె సీతశీలమును

వేఱుగా వర్ణింపఁజాలము. కావుననే మారీచమాయకు భ్రాంతిపడి తన భర్త నిజముగా నాపదపా లయ్యె నని నమ్మి, ఏమంటే లక్ష్మణుఁడు కుటీర ముకదలి వెళ్లునో యట్టిపరుషవాక్యము లన్నది. ఆసమయమునకును ఆహృదయావేగమునకును తగినట్లుగా, నెంతటిసుశీలయైనస్త్రీ కయిన నట్టియవస్థలో సహజముగా నోటవచ్చునట్టిమాటలు సీతచే ననిపించి కవీంద్రుడుకథ సాగించెను. ఇది యొకటి తప్పు,సీతాపాత్రపోషణమున శంకింపఁ దగినవిషయము వేఱొండు కనరాదు. ఈనిష్ఠురోక్తు లైనను దుఃఖపరవశత్వమున వచ్చినవి గావున, సీతాపాత్రౌచిత్యమునకు కలంక మాపాదింపఁజాలవు.

## నాటి భరతఖండస్థితి

వేదములందు గనరానికొన్ని నదీద్వీపపర్వతజనపదపురాదులు రామాయణమునఁ గనవచ్చుచున్నవి. కిష్కింధాకాండములోనివీటివర్ణనలు చూచినచో వాల్మీకినాఁటి కార్యజాతులు భరతఖండ మంతట విస్తరించిన సూచనలు గనవచ్చును. ఆనాఁటిదేశములపేళ్లును వాటిసరిహద్దులును కొన్నియిపుడు మాఱినవి. కొన్ని రూపుమాసినవి. పశ్చిమసముద్రవేలాప్రాంతముల నున్నట్లు వర్ణింపఁబడిననాఁటి—మురచి-జటి—అంగలోప-అవంతి- అనునగరములలో, అవంతి యుజ్జయిని యయ్యెనని యూహింపవచ్చునుగాని సముద్రతీరమున లేదు. తక్కినపురములు కనరావు. శాంతసముద్రము లోహితసాగరము లోహాముఖ మైనయేకపాదనరజాతి నరవ్యాఘ్రము మనఁబడుకిరాతజాతి మొదలుగా దేశాంతరద్వీపాంతరఖండాంతరవిషయములను వర్ణించినవాల్మీకి భూగోళవిజ్ఞానము రామాయణమున ప్రతిఫలించి యున్నది. నాఁటి జనస్థానపంచవటీదండకారణ్యములను నేఁటిపరిశోధకులు వేఱువేఱుగా గుర్తించుచున్నారు గాని, యవి సిద్ధములే. అంతకుమున్ను నిర్మనుష్యము నిర్మృగము

తరుగుల్మలతాహీనము నైనవింధ్యదక్షిణభాగమున తరువాత దారుణకాంతార మేర్పడినది. అదే దండకారణ్యము. అగస్త్యుం డచ్చటికి వచ్చునాఁటికి కందు వానలు లేవు. హిమవచ్ఛిఖరమునుండి యతఁడు వచ్చినపిదప సక్రమ్ముగా వానలు కురియ మొదలుపెట్టినవి. ఇత్యాది విశేషవిషయము లెన్నో యందు కనవచ్చును.

ఆరట్టక శక కాంభోజ యవనజాతులవారిని సప్తరాజ్యశోభితమైనయవద్వీపమును రామాయణము వర్ణించినది. "క్రీ. పూ. ౩౨౬ లో నుత్తరహిందూదేశముపై దండెత్తిన అలగ్జాండరుతో వచ్చినగ్రీకు సైనికులేయవనులుగా భారతమున వర్ణింపఁబడిరి. రామాయణములోని యవనవర్ణనము ప్రక్షిప్తము" ఇత్యాదిగా, రామాయణము క్రీ. పూ. ఐదవశతాబ్దిలోను, భారతము రెండవశతాబ్దిలోను, జన్మించిన వనెడి తమయభిప్రాయము సమర్థించుకొనుటకై మార్గోనలు మొదలగు పాశ్చాత్యపరిశోధకులు చేసినచర్చలు నిస్సారములు. పాణిన్యాచార్యులు యవనులను యవనలిపిని గూడ పేర్కొనియున్నాఁడు. శాకటాయనుఁడు యవనశబ్దము వక్కాణించియున్నాఁడు. ఈప్రమాణములనుబట్టి చూచినా, వాల్మీకిమహర్షికి పూర్వమే యవను లుత్తరహిందూదేశము చూడ వచ్చినారని తెలియకపోదు.

## సీతారాముల వయస్సు

రాముఁడు విశ్వామిత్రునితో యాగరక్షణకు వెళ్ళునాఁటికి పదునాఱేండ్లకు కొంచెము తక్కువవాఁడు. స్వయంవరకాలమునకు సీత పతిసంయోగసులభవయస్కురాలు. వారు సుతీక్ష్ణాశ్రమము చేరునాఁటికి వనవాససంవత్సరములు పది గతించినవి. అడవిలో సీత రావణునితో చెప్పిన మాటలలో ఆమె యత్తవారియింట సకలభోగము లనుభవించినకాలము పన్నెండుసంవత్సరము లని కనఁబడును అరణ్యావాసమునకు బయలు

దేఱునాఁటికి రామునివయస్సు ఇరువదియైదు. సీతవయస్సు పదునెనిమిది ఇత్యాదిగా కనవచ్చుమాటలు, వీరివయస్సునెడ సందిగ్ధములు పరస్పర విరుద్ధములునై యున్నవి. వీనిలోనేవి ప్రక్షిప్తములో ఈమాటలకు సమన్వయమెట్లో! విచారణీయము.

## మఱికొన్ని విశేషములు

వాల్మీకినాఁటికి ద్విజాతివారు సంస్కృతమునను తక్కినవారు ప్రాకృతమునను మాటలాడుచుండెడివారు. రామాయణములోనిరాజ వంశక్రమములకును తరువాతిపురాణములలోని యావంశక్రమములకును భేదము కనఁబడు చున్నది. అందుకు కర్ణాకర్ణికగాను గురుసంప్రదాయ వశమునను వచ్చిన బహువిధపూర్వేతిహాసములపరిణామమే కారణము. ఈకవీంద్రునినాఁటికి లోకాయతమతము వ్యాప్తికి వచ్చినది కాని, వైదికధర్మపరాయణులు దానిని నిరసించుచువచ్చి రనుటకు "కచ్చి న్న లోకాయతికాన్ బ్రాహ్మణాం స్తాత! మన్యసే" అని శ్రీరాముఁడు భరతుని బ్రశ్నించుటయే ప్రమాణము. అయోధ్యాకాండ మందలి యీకచ్చిత్సర్గలోఁ బ్రశంసింపఁబడినరాజధర్మము లేనాఁటికిని మఱువరానివి. సహగమనాచారము వేదమందువలెనే యిందు నైచ్ఛికమై కనవచ్చినది. అనులోమవివాహాచార మానాఁ డున్నది. విగ్రహారాధనమున్న దనుట కయోధ్యాకాండలోనియీక్రిందిమాటలు చాలును.

"దేవస్థానైః ప్రపాభిశ్చ- కచ్చిద్గురూంశ్చ- దేవతాతిథీన్- కచ్చి ద్దేవాన్ పిత్ర్యాన్- ద్విజాతిదేవాతిథిపూజనం చ సంధాన మాహు స్త్రిదివస్యసంతః" ఇది కాక, రూపకల్పనముతోడియీశ్వరారాధనమును వేదములలోని విష్ణుసూక్తరుద్రసూక్తములు తెలుపుచుండఁగా పెక్కువేలసంవత్సరముల క్రిందటనే కేదారక్షేత్రమునందు కేదారనాథబదరీనాథాది దేవప్రతిష్ఠ జరిగినట్లు కనఁబడుచుండ నిందు సంశయ మేముండును?

"వధూనాటకసంఘైశ్చ సంయుక్తాం సర్వతఃపురీమ్" అనుమాట ప్రక్షిప్తమని యెవ రైన నందురేమోకాని, ఆనాఁ డొకవిధ మైనరూపకప్రదర్శన మున్న దనుకొనుట పొరపాటు కానేరదు. ఛాందోగ్యమున దేవజనవిద్యయనుపేర గాంధర్వవిద్య విదితమై యుండ, రామాయణము నాఁడు నృత్యకల విస్తరించియుండ దనుట కాక్షేప మేమి?

మంత్రబ్రాహ్మణారణ్యకోపనిషత్తులనుండి యుద్ధృతమైన వివిధ విద్యాజ్ఞాన మాకాలమున ద్విజాతులయందు విస్తరించినట్లుగా నిందలి యాయుర్వేద ధనుర్వేద గాంధర్వ ధర్మశాస్త్ర వ్యాకరణాన్వీక్షికీ వార్తా దండనీత్యాదులప్రశంసవల్ల తెలియవచ్చునుగాని, అది యేరూపమున నుండెనో నిరూపింపఁజాలము అయినా తరువాత నీపేళ్ల వెలసిన వివిధగ్రంథముల కానాఁటినుండియు పారంపర్యోపదేశమున వచ్చుచున్న యీ విజ్ఞానమే యాధార మనుట నిజము. అశ్లే జాబాల్యాదిమహర్షుల మాటలలోని వేదసారమైన తత్త్వజ్ఞానమే తరువాత వెలసినవివిధమత సూత్రములకు మూల మని నమ్మఁదగును.

## రసాలంకారపోషణము

ఈకావ్యమునందు ప్రధాననాయకుఁ డైనశ్రీరాముఁడు మహావీరుఁడు గావున నిందలిప్రధానరసము వీరము. శృంగారాదులు దాని కంగములు. హాస్యశృంగారవర్ణనము లిం దల్పముగా నున్నవి. అందం దద్భుతరసమును కరుణమును చక్కఁగాఁబోషింపఁబడినవి. ఇందలివీరము ముఖ్యముగా నస్త్రమహిమసంపన్నము. బ్రహ్మర్షితపస్తేజోరూపమానాఁటియస్త్రజ్ఞానము. ఆయస్త్రములయద్భుతచర్యలు శంకనీయములు కా వని నేఁటిప్రకృతి శాస్త్రజ్ఞులు నిర్మించినయాణవాస్త్రమహత్త్వము వినువారికిని చూచువారికిని తోఁచకపోదు, ఆనాఁటిమహర్షుల తపోబల మప్రతిహతశక్తిసంపన్న మని విశ్వసింపవలసిన దే. అర్వాచీన

భాసకాళిదాసాదులకు రసపోషణవిధానము నేర్పినరామాయణ మందలి రసవర్ణనము ' లుదాహరించుటయనావశ్యకము. శృంగారవర్ణనములు తక్కువగావున నందలి వొకటిరెండు:—

"దర్శయన్తి శరన్నద్యః పులినాని శనైః శ్శనైః,
నవసంగమసంవ్రీడాజఘునా నీవ యోషితః"
"చంచచ్చంద్రకరస్పర్శహర్షోన్మీలితతారకా,
అహో రాగవతీ సంధ్యా జహాతి స్వాయ మంబరమ్"

వాల్మీకి ధర్మనిష్ఠుఁడైనగృహమేధిగాని, శాశ్వతబ్రహ్మచర్యమాచరించినవాఁడు కాఁడనుట కీమాటలు చాలును. అన్నిటను మనోహరములైన వర్ణనములెన్నని యున్నమాట నిజమైనను, కిష్కింధాకాండము చక్కని వివిధవర్ణనలకు పుట్టిల్లని విద్వన్నుతి కెక్కినది. అందలి (3౦సర్గ) శరత్కాలవర్ణన మిది. మొదటిశ్లోకములో వర్ణింపఁబడినది శరత్కాలనది. అది యుపమేయము. దానికి నవసంగమసంవ్రీడ యగుముగ్ధాంగన యుపమానము. ఎందైన నుపమేయమునకు ప్రాధాన్య ముండునుగాని, యీశ్లోకము చదివినంతనే దానిని కప్పిపుచ్చి యుపమానమే ముందుగా సహృదయులహృదయ మాకర్షించుచు తనప్రాధాన్యమును చాటుచున్నట్లున్నది. అందుచే నిది యుపమాచమత్కారమున కాద్యనిదర్శన మగుచున్నది.

రెండవది సాయంసంధ్యావర్ణనము. ఇందు శ్లేషచే పతిసమాగమత్వరమాణప్రౌఢాంగనాచేష్టితము సూచింపఁబడినది. ఈవిధముగా ముగ్ధప్రౌఢనాయికలయనురాగచేష్టలు వర్ణించుచు మనమహాకవి శృంగారసారము ప్రకాశింపఁజేసె ననుటయే విశేషము. ఉపమారూపకోత్ప్రేక్షాద్యలంకారము లెన్నోచోట్ల వర్ణించినయీకవి క్రమాలంకారవర్ణనచాతుర్యమున కొకటి—కిష్కింధ, అయిదవసర్గ—

"సీతాకపీంద్రక్షణదాచరాణాం, రాజీవహేమజ్వలనోపమాని,
సుగ్రీవరామప్రణయప్రసంగే, వామాని నేత్రాణి సమం స్ఫురన్తి"

రామసుగ్రీవులకు మైత్రి కుదిరినసమయమందు జానకీవాలిరావణుల యెడమకన్ను లొక్కమారుగా నదరిన వట.

అయోధ్యాకాండమందు వర్ణింపఁబడినమంత్రిలక్షణముల కొకటి రెండుశ్లోకములు; ఉత్తమామాత్యనియోజనమునుగూర్చి శ్రీరాముఁడు భరతు నిట్లడుగుచున్నాఁడు.

"కచ్చి త్సహస్రా న్మూర్ఖా ణా మేక మిచ్ఛసి పండితమ్,
ఏకో౽ ప్యమాత్యో మేధావీ శూరో దక్షో విచక్షణః
రాజానం రాజమాత్రం వా ప్రాపయే న్మహతీం శ్రియమ్,
అమాత్యా నుపధాతీతాన్ పితృపై తామహాన్ శుచీన్,
శ్రేష్ఠాన్ శ్రేష్ఠేషు కచ్చి త్త్వం నియోజయసి కర్మసు?"

భాష

సంస్కృతాక్షరము లభ్యసించి విభక్తులు తెలిసికొన్నంతనే బాలురు తొలుతఁ జదువఁదగినంత సులభముగా నున్నది రామాయణ భాష యని పాఠకులకు విదితమే. మృదుమధురకవితకుం బోలె మృదు శమును సరళము నగుభాషకును వాల్మీకియే యాద్యగురువు. లోకము భాష యనునామముల నంతకుమున్ను వ్యవహరింపఁబడెడి యార్యశబ్దజాల మితనినాఁటి కేకశ్యపాపిశల్యాదివిద్వద్వరేణ్యులచే సంస్కరింపఁబడి సంస్కృత మనుపేరు వహించియున్నది. కాని వాల్మీకి భాషలోఁ గూడ సర్వస్వతం త్రుఁ డని మున్నే తెలిసికొనియున్నాము. పాణిన్యాచార్యుఁడు తాను వ్యాకరణము నిర్మించియు దానికి విరుద్ధముగా గృహ్య-అపశ్యతీ-అని ప్రయోగించినాఁ డని పరిశోధకు లందురు. మనవాల్మీకియో, ఆనాఁటికి పూర్వులవ్యాకరణము లున్నను వాటికి విరుద్ధముగా నిట్టి వెన్నో ప్రయో గించి యున్నాఁడు. ఇందు కొక్కయుదాహరణము (కిష్కింధ ౩౦ సర్గ) ఇదిరామునిమాట:—

"కథం సా రమతే బాలా పశ్యన్తీ మా మపశ్యతీ"

ఇంక 'గృహ్యా' వంటిప్రయోగములందుమా, రామాయణభారతములు రెంట నెన్నో కల వనుట విదితమే. ఇట్టివానినే తరువాతివా రార్షము లని శిరసా వహించియున్నారు. ఆగౌరవమునకు నాద్యుఁడీతఁడే.

ఇప్పటికి మూఁడువేలసంవత్సరములకు పైగా భరతఖండమును పావనము గావించుచున్నదీనిమహత్త్వము జగద్విదితమై యుండ నాలుగుమాటలతో వర్ణించుట యేపాటిది? ఇమ్మహేతిహాసమున కుదయించిన వ్యాఖ్యలలో నిరువది కనవచ్చుచున్నవి. తెలియరాక యణఁగిన వెన్నో!

శ్లో. కావ్యసృష్టిప్రణేతారం వాల్మీకిం మునినాయకమ్,
కావ్యకల్పతరుం శ్రీమద్రామాయణ మహం భజే,

—:o:—

# వ్యాసమహర్షి

శ్లో. నమ స్తస్మై వ్యాసనామ్నా, భాస్వతే బ్రహ్మతేజసే.
యదుపజ్ఞా జగద్వ్యాప్తా, భవ్యా భారతసంహితా.

భారతసంహితారచనకాలము శా. శ. పూర్వము ౧౨ వ శతాబ్ది యగు నని వాల్మీకిజీవితచరిత్రలో చదివియున్నాము. ఇపుడు దీనికర్తృత్వమును గూర్చి ముందు పరిశీలింతము. భారతకర్త యెవ రన్నవిషయ మెందఱో చర్చించి యున్నారు. ఎవ రేమివ్రాసినా, అవి యన్నియు నూహలే యగును గాని సిద్ధాంతము లనఁజాలవు. ఈవిషయ మిది యిత్థ మని నిర్ణయింపరాని దగుటయే యందుకు కారణము.

## భారతసంహితాకర్త ఎవరు?

వైదికలౌకికవాఙ్మయములరెంటను వ్యాసుఁడు లేక వేదవ్యాసుఁ డన్నపేరును భారతమునకు వైయాసికీసంహిత యనుపేరును ప్రసిద్ధములు

అందుచే వ్యాసుఁడు దీనికర్త యందు మేని, ఇది బిరుదనామము గాని, అసలుపేరుకాదు. పోనీ! ఆబిరుదము గలపరాశరపుత్రుఁ డందు మేని, పరాశరులు ముగ్గురు నలుగు రున్నారు. ఇతఁ డేపరాశరునికొడుకో! ప్రతిద్వాపర మేకరాశిగా నున్నవేదములను విభజించుమహర్షి వేదవ్యాసబిరుద మందుననుచు, ఇరువదినాల్గవద్వాపరమున వాల్మీకియు, ఇరవైయెనిమిదవద్వాపరమున కృష్ణద్వైపాయనుఁడును వ్యాసబిరుద మందిరని విష్ణుపురాణవాయుపురాణములుచెప్పినవి.[1] ఈమాటలు విశ్వసించి, ద్వైపాయనపారాశర్యవ్యాసుఁడు వాల్మీకికంటె తరువాతివాఁడని నిశ్చయింపవచ్చునుగాని, తైత్తిరీయారణ్యకము పేర్కొన్నపారాశర్యవ్యాసునిమాట యేమి?[2] అతఁడు నితఁడు నొకఁడే యందుమా, వాల్మీకితరువాత నితనిని చేర్చినపురాణవచనము లసంగతము లనవలెను. అట్లు గాక, ఆరణ్యకము పేర్కొన్నపారాశర్యుఁడే యీభారతకర్త యందుమా, రామాయణములోనికథను పాత్రములను వాల్మీకిని గూడఁ బేర్కొన్నభారతసంహితను[3] వాల్మీకికి పూర్వుఁడైన పారాశర్యుఁడు రచియించె ననుట మఱియు నసంగత మగును. అది గాక, ఆతైత్తిరీయారణ్యకకాలము నెవ రెంత దిగఁ దీసినా, అది శా. పూ. ౧౫వ శతాబ్ది కీవలికి రాదు. అందేమంత్రద్రష్టయో పేర్కొన్న యీపారాశర్యవ్యాసుఁ డానాఁటివాఁడు కూడా కాక యిప్పటికెంతప్రాచీనుఁడో! అతఁడే భారతసంహితాకర్త యగు నని యూహిం

1. అష్టావింశే పునఃప్రాప్తేపరివర్తే క్రమాగతే, యదా భవిష్యతి వ్యాసః, నామ్నాద్వైపాయనః ప్రభుః-వాయు పూర్వా ౨౩. (పరాశరః- జాతుకర్ణోఽభవ న్మత్తః కృష్ణద్వైపాయన స్తతః-విష్ణు. ౩-౩-౧౧-౧౯.

2. స హోవాచ వ్యాసఃపారాశర్యః. ప్రశ్న ౧. అను౯.

3. "రామాయణేఽతివిఖ్యాతః శ్రీమాన్ వానరపుంగవః" భార. అర ౧౪౭ "వాల్మీకిశ్చ మహాతపాః" సభా. ౭. ౧౬, అర. ౮౫, ౧౨౦.

తు మేని, భారతము నేఁటికే నాలు గైదువేలయేండ్లక్రిందటనో పుట్టి యుండు ననవలసివచ్చును. అట్లుతలంచువారును గలరు గాని, అది యంతకం బెనుగూడ నసంగతము. అందుచేతనే భారతకర్తృత్వనిర్ణయము మిక్కిలి సందిగ్ధమైనది. ఇట్లుపరాశరులు పారాశర్యులు వ్యాసులు పెక్కండ్రు కనవచ్చినా, కృష్ణద్వైపాయనుఁ డనఁబడుపారాశర్యవ్యాసుఁ డొక్కఁడే కనవచ్చుటంబట్టియు పురాణసంప్రదాయమును బట్టియు, భారతసంహితావతారికనుబట్టియు నతఁడే దీనికి కర్త యన్న పరమవిశ్వాసము లోకమున స్థిరపడియున్నది గావున దానినొకింత పరామర్శింతము.

సత్యవతీపరాశరతనయుఁ డగుకృష్ణద్వైపాయనుఁడు తల్లియానతిని విచిత్రవీర్యక్షేత్రమందు ధృతరాష్ట్రపాండువిదురులను గాంచి తపోవనమునకు మరలఁ బోయి, వారు పెరిగి పెద్దలై మృతులైనపిదప భారతము చెప్పెనని యున్నభారతపదార్థానుక్రమణికలోనివాక్యములను[1] పురస్కరించుకొని మహాభారతయుద్ధానంతరము వ్యాసుఁడు భారతము నిర్మించెనని పూర్వసంప్రదాయవేత్త లందురు. భారతసంగ్రామము ద్వాపరాంతమున జరిగిన దని సర్వపురాణములు చెప్పుచున్నవి. దీనినిబట్టి వ్యాసుఁడు కలియుగారంభమున కించుక పూర్వమే భారతము నిర్మించియుండు నన్నవాద మున్నది. భారతసంగ్రామకాలము నిర్ణయింప నెందరో ప్రాచ్యపాశ్చాత్యపరిశోధకులు చర్చించిరిగాని యందెవరిమతమును ప్రమాణము కాఁజాల కున్నది. కలియుగారంభము

1. మాతుర్నియోగా ద్ధర్మాత్మా గాంగేయస్య చ ధీమతః
క్షేత్రే విచిత్రవీర్యస్య కృష్ణద్వైపాయనః పురా...
ఉత్పాద్య ధృతరాష్ట్రంచ పాండుం విదుర మేవచ,...
తేషు జాతేషు వృద్ధేషు గతేషు పరమాం గతిం,
అబ్రవీ ద్భారతం లోకే మానుషే౽స్మి న్మహా నృషిః.

మొదలుగా క్రీస్తుశకారంభమువఱకును గొంచె మెచ్చుతక్కువగా ప్రతిశతాబ్దియు భారతసంగ్రామకాల మైనట్లు వారివారి వ్రాఁతలు తెలుపుచున్నవి.[1] మఱియు, చరిత్రకారుఁ డైనకల్హణుఁడు, కలియుగములో ౬౫౩ సంవత్సరములు గడచు తఱిని కురుపాండవు లున్నా రని చెప్పిన మాట[2] కొందఱికి రుచించలేదు. యుధిష్ఠిరుఁడు రాజ్యము చేయుకాలమున మఘానక్షత్రమందు సప్తర్షులు ప్రవేశించి రని వృద్ధగర్గుఁడు చెప్పినట్లున్నమాట కర్థమునిష్టము వచ్చినట్లు చెప్పుచున్నారు[3] అందుచే భారత కర్తృత్వము మిక్కిలి సందిగ్ధావస్థలో నున్న దనుట స్పష్టము గదా! అయినను కృష్ణద్వైపాయనునిపే రెత్తకపోయినా, తైత్తిరీయారణ్యక ప్రథమప్రశ్న ద్రష్ట పేర్కొన్న పారాశర్యవ్యాసుఁ డితఁడేయనియు, ఆనాఁటివాఁడే యనియు, కొందఱి యభిప్రాయమును విశ్వసింతము. రాజతరంగిణీశ్లోకమునకు కొందఱు చేసినవ్యాఖ్యానమును బట్టి కురుపాండవ జననము కలియుగములో[6] ౬౫౩ సంవత్సరములు గతించినపిదపనే యని యంగీకరింతము. అయినా, తన తరువాత కొన్నివందలసంవత్సరములు గడచినపిదప నుదయించిన రామాయణములోని శ్లోకములనుగ్రహించి యితఁడే భారతసంహిత రచించియుండు ననియెట్లు చెప్పఁగలము? ఎంతటి యోగనిష్ఠాగరిష్ఠుఁడును, చిరకాలజీవియు నైనా రమారమి వెయ్యేండ్లు జీవించి రామాయణము వెలసినపిదప దానిని జూచి యితఁడు భారతసంహిత రచియించె నని యెట్లనఁగలము? అందుచేతనే వర్ణితగ్రంథస్థితిని బట్టియు నితరకారణములను బట్టియు కౌరవ పాండవోదంతము కృష్ణద్వైపాయన

1. చూ. డాక్టరు కృష్ణమాచార్యులుగారి సం. సా. చరిత్ర. పుట. 45–64

2. శతేషు షట్సు సార్ధేషు త్ర్యధికేషు చ భూతవే
కవే ర్గతేషు వర్షాణా మభూవన్ కురుపాండవాః రాజ. ౧. ౫౧

3. ఆసన్ మఘాసు మునయః శాసతి పృథ్వీం యుధిష్ఠిరే నృపతౌ,
షడ్ద్వికపంచద్వియుత శ్శకకాల స్తస్య రాజ్యస్య. శరా. బృహ

వ్యాసప్రోక్తమని పరిశోధకులు భావింపవలసివచ్చినది. దీనికేకాదు, సకల పురాణగాథలకును ప్రథమోపదేష్ట యితఁడే యనుటకు పురాణోపపురాణములన్నియు నితనిపేర వెలయుటయే ప్రమాణము. భారతమున సౌతి వైశంపాయన[1] నిర్మితములుగా కొన్ని భాగములుకనవచ్చుటయు భారతారంభ మవ్యవస్థముగానున్న ట్లందలిమాటలే తెల్పుటయు[2] వాటి నెవ రెట్లు సమర్థించినా, వ్యాఖ్యాతలు మునులమతభేదము లంగీకరించుటయు, పై యభిప్రాయమును బలపఱుచుచున్నవి. కావుననే కృష్ణద్వైపాయన వ్యాసోపజ్ఞముగా శిష్యపరంపరాగతమై వచ్చినకౌరవపాండవోదంతము సౌతి వైశంపాయనవశమున సంహితారూపము తాల్చినదనియు నది వైయాసికీఖ్యాతి గాంచిన దనియు విశ్వాసమువెలసినది. దీనిచే నిఖిల పురాణకథలు వ్యాసప్రోక్తము లన్న విశ్వజనీఖ్యాతియు సముచిత మగును. భారతసంహిత కృష్ణద్వైపాయనుఁడను పారాశర్యవ్యాసుఁడు నిర్మించిన దన్నప్రతీతిని కదల్చువారు లేరు. అది లోకమునగట్టిగా వేళ్లు నాటుకొని యున్నది. నిజమే భారతకథ తదుపజ్ఞమైనపుడా ఖ్యాతి స్థిర పడుట కబ్బుర మేమి?

## భారతముకంటె రామాయణమే పూర్వము

పురాణములలోని యతిశయోక్తులతోడి వ్యాసబిరుదక్రమము సరి గాదన్నను, తైత్తిరీయారణ్యకము చూపినపారాశర్యుఁడే కృష్ణద్వైపాయనుఁడే యన్నను వాల్మీకికంటె నితఁడు పూర్వుఁడని విశ్వసింప వచ్చును గాని రామాయణముకంటె నితనిపేర నున్నభారతసంహిత మాత్రము పూర్వము కా దనుట నిజము. గ్రంథరచనరీతిని గ్రంథస్థ విషయమును పరిశీలించువారి కీమాట సత్యమని తోఁచకపోదు. విదు

1. ఈవైశంపాయనుఁడు తైత్తిరీయారణ్యకము పేర్కొన్న వైశంపాయనుఁడు కాఁడు—
2. మన్వాదిభారతం కేచి దాస్తీకాది తథా పరే, తథోపరిచరా దన్యే విప్రా స్సమ్యగధీయతే-భారతాను క్రమణి.

రుఁడు భీష్మద్రోణులగొప్పతనమును ధృతరాష్ట్రునికి తెలుపుచు "వారు సత్యధర్మములయెడ దాశరథిరామునికి తీసిపోరు" అనెను[1] రామకథ అరణ్యపర్వమున సంగ్రహముగా కనఁబడుచున్నది. ఇందుకు రామాయణేతిహాసశ్రవణము హేతువన్నను—స్త్రీవధ యుచితము కా దన్నరామాయణ యుద్ధకాండములోనిశ్లోకమును వాల్మీకిపే రెత్తి ద్రోణపర్వము స్వీకరించిన దనకతప్పదు.[2] రామాయణాయోధ్యాకాండములోనికొన్నిశ్లోకములు సరిగా నట్లే భారతశాంతిపర్వమున కెక్కినవి.[3]

అయోధ్యాకాండలోని "అరాజకే ధనం నాస్తి" త్యాది శ్లోకముల యర్థమును భారతము గ్రహించివిశదీకరించుచు నిట్లు తెల్పినది.[4]

"శ్లోక శ్చాయం పురా గీతో భార్గవేణ మహాత్మనా,
ఆఖ్యానే రామచరితే నృపతిం ప్రతి భారత!
రాజ న్యసతి లోకస్య కుతో భార్యా కుతో ధనమ్"

శాంత్యాదిపర్వములు ప్రక్షిప్తము లన్నవా రున్నారుగాని తక్కిన వట్టివి కావు గదా! అందుచే వాల్మీకిని రామాయణమును ద్రోణపర్వాదులందు పేర్కొన్నభారతసంహిత రామాయణముకంటె పర మని నిరాక్షేపముగా విశ్వసింపవచ్చునుగదా! ఈవిషయమున మఱొక్కమాట—రామాయణము కురుపాంచాలములను హస్తినాపురమును జనమేజయుని పేర్కొనలేదా! దీనినిబట్టి యది దీనికంటె పర మని యెందుకనరాదు? అని యెవ్వరైన నడుగవచ్చును. ఇందుకుసమాధానము.

---

1. ధర్మే చానవరో రాజన్ సత్యతాయాంచ భారత రామా ద్దాశరథే శ్చైవ గయా చ్చైవ న సంశయః-భా. ఆది. ౨౧౫ అధ్యా.

2. అపి చాయం పురా గీతః శ్లోకో వాల్మీకినా భువి, న హన్తవ్యాః స్త్రియ ఇతి యద్బ్రవీషి ప్లవంగమ! ద్రో. ౧౪౩. ౬౭.

3. సర్వే క్షయాన్తా నిచయాః పతనాన్తా స్సముచ్ఛ్రియాః...శాం. ౨౭. ౩౧ యథా కాష్ఠంచ కాష్ఠంచ సమేయాతాం మహార్ణవే...శాం. ౨౮. ౩౭

4. శాంతి. ౫౭. ౪౦.

కురుపాంచాలములు బ్రాహ్మణారణ్యకములందు కనవచ్చుచుండగా, కురుపాండవులకు పదుమూఁడుతరములు పూర్వుఁడైనహస్తిరాజు నిర్మించినహస్తినపురము పూర్వేతిహాసముల వినవచ్చుచుండఁగా, వాల్మీకి వాటిని పేర్కొనుటకు భారతసంహితయే గతి యయ్యె ననుట వింత గాదా! ఇంక, కురువంశమువాఁడని హస్తినాపురరాజని చెప్పక పోయినా, సగరశైబ్యదిలీపాదులతోఁ జేర్చి జనమేజయునిరామాయణము స్మరించినమాట నిజమే కాని, ఆజనమేజయుఁడు పాండవపౌత్రుఁడు కాఁడనియు, సగరాదులకు దగ్గఱగా పురూరవునితరువాతి యైదవ పురుషుఁడైనజనమేజయుఁడనియు సంగతిసందర్భములనుబట్టి విశదమే యగుచున్నది. కావున నింకెందుకు? భారతముకంటె రామాయణమే పూర్వ మనుట ముమ్మాటికి నిజము.

## భారత ప్రశంస

ఈమహేతిహాసము భారతీయులపెన్నిధి. గీర్వాణవాణికి రామాయణ మొకకన్ను భారత మొకకన్ను. దానికిని వేద మనుప్రతీతి కలదు గాని, పంచమవేద మన్నప్రఖ్యాతి దీనికి మాత్రమే కలదు. భరతఖండము చిరకాలముగా మతాంతరులదాడికి గుఱి యగుచు వచ్చుచున్నను, మొదటినుండియు నిది ప్రబోధించుచు వచ్చినధర్మములు హైందవుల కస్థిగతము లగుచుండుటచేతనే ధర్మమీమాంసాత్ర మైన దేశమున గోచరించుచున్న దనవచ్చును. రాజరాజనరేంద్రునియానతిని నన్నయభట్టారకుఁ డీమహాభారతము నాంధ్రీకరించి జనసామాన్యమున కర్పింపబూనుట జైనబౌద్ధములయులజడికి వైదికమతధర్మము లణఁగిపోకుండఁ జేయుటకే కదా! ఇట్లే యన్నిభాషలలోనికిననువదింపఁబడిన యీసంహిత దేశమునకు చేయుచు వచ్చినమహోపకారము విదితమే. ఇది కేవలము కౌరవపాండవకథగా లోకమును రంజింపఁ జేయలేదు. ధర్మశాస్త్రము

నీతిశాస్త్రము పురాణకథాసముచ్చయము మనోహరకావ్యము వేదాంతమునై యెవరి కేది కావలసిన దాని నర్పించుచు 'సకలజనరంజకమగుచు వచ్చినది. వింటే భారతమే వినవలె నన్నయశస్సు నార్జించుకొన్నది. ఖండాంతరములందు కీర్తి గణించుకొన్నది. ఆర్యజాతుల గృహములలో రామాయణముతో కలసి సరస్వతీపీఠమున పూజ లందుచున్నది. "య దిహాస్తి త దన్యత్ర, య న్నేహాస్తి న తత్ క్వచిత్" ఇం దున్న దింకొకచో నుండును గాని, ఇందు లేని దెందు నుండఁబోదనుచు, సర్వవిజ్ఞానఖని యన్నప్రసిద్ధికి గుఱియైనది. జగ మెఱిఁగినదీని నేమని నుతింతుము? సంస్కృతసారస్వతమున రామాయణము ననుసరించి జన్మించినవివిధకావ్యములకంటె మహాభారతము ననుగమించి యుదయించినపలురకములకృతులు రెట్టింపుండును. అది యటుండ, ఇతరవిద్య లెన్ని చదివినా, భారతము చదువనివాఁడు నేర్పరియే కాఁడన్న యీక్రిందిమాటలనుబట్టి బహువిధప్రపంచజ్ఞానమునకు భారతమే గతి యన్నభావము విదిత మగుచున్నది. దీనిమహాత్త్వ మిట్టి దనుటకీమాట యొకటియు చాలును.

"యో విద్యా చ్చతురో వేదాన్, సాంగోపనిషదో ద్విజః,
న చాఖ్యాన మిదం విద్యా, న్నైవ స స్యా ద్విచక్షణః"

"కృతం మ యేదం భగవన్ కావ్యం పరమపూజిత" మ్మని వ్యాసుఁ డన్నట్లును బ్రహ్మ యిది కావ్య మని యంగీకరించిన ట్లును ఉండుటంబట్టి కావ్యకీర్తిని గాంచినయిది లౌకికసారస్వతమున ద్వితీయమై యాద్యమైనరామాయణముకంటె విలక్షణమై వన్నెకెక్కినది. అది యేకనాయకము, ఇది బహునాయకము, రెంటియందు నయోనిజ నాయిక. రెంటిలోను వైరము స్త్రీమూలకము, అందు దుశ్శీలుఁ డగు రాక్షసుఁడు శత్రువు. ఇందు దుర్నీతి యగుజ్ఞాతి శత్రువు. అందు కామము ప్రధానము. ఇం దర్థము ముఖ్యము. అచ్చట శ్రీరాముఁడు

యుద్ధము చేసెను. ఇచ్చట శ్రీకృష్ణుఁడు చేయించెను. రెంటిలోను ధర్మ సంస్థాపనమే ప్రయోజనము. ఈవిధముగా నాంతరవిషయము లాలోచించినచో కావ్యధర్మములందు కథాసంవిధానమందు దానిని పోలుచు వేఱగుచు పెరిగినయుందలివైలక్షణ్యా మతిగోచర మగును. సకలజనాకర్షక మైనమహాత్త్వమును ప్రత్యక్ష మగును. భారతభాగ్యము భారత మనుటకంటె వేఱె ప్రశంసయేల? ఈసౌతిమాట చాలును.

"ధర్మార్థ కామమోక్షార్థై స్సమాసవ్యాసకీర్తనైః,

తథా భారతసూర్యేణ నృణాం వినిహతం తమః"

## గ్రంథపరిశీలనము

లిఖితములు కానీ ముద్రితములు కానీ! గ్రంథవిషయమున నొక దేశములోనిప్రతితో మఱియొక దేశమందలిప్రతి యేకీభవించదు. అనుక్రమణికలు చూపులెక్కలకును, ఆయాప్రతులలోనిశ్లోకసంఖ్యలకును సంబంధము కనరాదు. ఇది యిట్లుండ—పదునెనిమిదిపర్వములలోని యవాంతరపర్వములును హరివంశ విష్ణు భవిష్య పర్వములునుగలసి నూఱుపర్వము లని యొకలెక్క. దానిప్రకార మిది శతపర్వాత్మాయము— ఉపాఖ్యానములతోడి పదునెనిమిదిపర్వములలోని గ్రంథము నూఱువే లని యొకలెక్క. దానిప్రకారము మహాభారతము శతసాహస్రిక సంహిత— హరివంశాదిపర్వములు మూఁడును ఖిలసంజ్ఞితము లనియు నందలిశ్లోకసంఖ్య పన్నెండువే లనియు నొకలెక్క— రోమహర్షణి నైమిశారణ్యమున వ్యాసప్రోక్తములుగా వినిపించినవి పదునెనిమిది పర్వములే యని యొకమాట. గ్రంథగ్రంధిగా నున్న ౮౮౦౦శ్లోకములు వ్యాసుని వనియు, ౨౪౦౦౦ శ్లోకములు వైశంపాయనుని వనియు, తక్కినవి సౌతి వనియు, కొన్నిమాటలు పారాశర్యుఁడు, సుమంతు జైమిని పైల శుక వైశంపాయనులకు మహాభారతపంచమము వైన

వేదముల నుపదేశించె ననియు, నా రైదుగురును వేఱువేఱుగా నా సంహితలను ప్రకాశింపఁ జేసి రనియు వేఱొకమాట. ఇట్లుపొందిక లేని మాటలెన్నే నికలవు. ఈమాటలనుబట్టి గ్రంథస్థితి యన్నివిధముల సందిగ్ధముగా నున్నదనుట విదితముగదా! ఇందుకు చిన్నయుదాహరణము:—

నన్నయభట్టారకుఁడు తెల్పిన భారతశ్లోకసంఖ్య ౧౦౦౨౦౦, వావిళ్ళవారిప్రతిచూపినది ౮౮౨౨౦, నాచూచినతాటాకుప్రతి చెప్పినది ౬౬౦౪౨. ఈవిధముగా పదునెనిమిదిపర్వముల గ్రంథసంఖ్య కనవచ్చినది—ఇంక, పదార్థానుక్రమణి యర్వాచీనమైనా, అందు బహువిషయములలో సంప్రదాయసిద్ధము లైనముఖ్యాంశములు కొన్ని కనవచ్చును. భారతసంహిత చతుర్వింశతి సాహస్రి యని యన్నిప్రతులయనుక్రమణికలలో నున్నమాట దానివల్ల ధ్రువపడుట కవకాశ మెక్కువగా నున్నది. అం దతిముఖ్యము లైనవి కురువంశప్రతిష్ఠ పాండవసౌశీల్యము ధార్తరాష్ట్రదుశ్చరిత్ర మహాసంగ్రామము శ్రీకృష్ణమాహాత్మ్యము, అనునవి. వీటినిబట్టి చూచినచో భారతకథ మహాయుద్ధముతో ముగిసినట్లు తోఁచకపోదు. ఇందుకు స్త్రీపర్వాంతమం దున్న—

"ఇమం మహాయుద్ధముఖం మహాత్మనాం, శృణోతి నూనం
పఠతే చ యః పుమాన్"

ఇత్యాదిఫలశ్రుతియే నిదర్శనము. ఇది యెక్కడి కక్కడే చేసిన వ్రతకల్పాలలోనిఫలశ్రుతి వంటిది గాదు. మహాసంగ్రామాంత మే మహాభారత మన్నతత్త్వము తెల్పునది. యుద్ధము సమాప్తమైనపిదపఁ గర్మశేష ముండునా? శాంత్యాదిపర్వములలోనివిషయమునకు కల్పించిన సంబంధముగాని నిజముగాప్రధానకథతో సంబంధములేదన్నమత మున్నది. పెట్టినయతుకులమాట తలపెట్టకున్నచో, మొదటిపదునొకండు పర్వములలోనియుపాఖ్యానములు నట్టివే యందురు. వాటికి శాంత్యాదిసప్తపర్వములను వేఱు చేసి చూచినచో, అపుడు మూలగ్రంథ మిరువదినా

లుగు వేలకు సరిపడవచ్చు. భారతసంహిత జయ మను పేర చతుర్వింశతిసాహస్రిక యన్నయును క్రమణికోక్తియు సార్థక ముకావచ్చు. అయినా భారతగ్రంథభారతకర్తృత్వవిషయములు సత్యాన్వేషణతత్పరులకు సుగమములు గాక, అగోచరములుగా నుండుటచే నెవ రేమి భావించినా యెవ రెట్లు సమర్థించినా, అది విశ్వసనీయము కాజాల కున్న దనుట నిజము. అందుచే ఇక్కడ నొకమాట:—

కేవలమిది కురుపాండవ కథయే యైనచో దీని కింత యశస్సు రాదు. ఆయుపాఖ్యానములు ఆశాంత్యాదులు నుండుట చేతనే దీని మహత్త్వము హెచ్చినది. వేదములలోనిధర్మముల నెల్ల సంగ్రహించుకొని పంచమవేద మైనది. సకలవేదాంతసారమును భగవద్గీతగా సంగ్రహించుకొని యుత్తమవేదాంతశాస్త్ర మైనది. నిజముగా నీశ్వరునినోట వచ్చినదే యన్నట్లు ముముక్షువులకు జీవేశ్వర తత్త్వమును కర్మతత్త్వమును కరతలామలకము గావించు భగవద్గీత వంటి యుత్తమగ్రంథము నభూతో నభవిష్యతి యన్నలోకోక్తికి గుఱియై యున్నది. దీనితరువాత నెన్నదగినది సనత్సుజాతీయము లోకనీతి కాకరమైనది. విదురనీతి ఐహికాముష్మికములు రెంటికి మార్గదర్శకము శాంతిపర్వము – అట్టియీ మహాగ్రంథ మెపుడుపుట్టిననేమి? ఎట్లుపుట్టి యెట్లు పెరిగిననేమి? ఇదిభారతీయుల భాగ్య మందము. అట్టి యిదిపదు నెనిమిదిపర్వములగ్రంథ మనుకొనుట సమంజస మగునుగాని, శతపర్వామ్నాయ మనెడిదీనినామాంతరమును సమర్థించుటకై హరివంశాదిపర్వత్రయము నిందు చేర్చుట మాత్ర ముచితముకాదు. ఇది శతపర్వ మనెడివిశ్వాసముతోనే అర్జునమిశ్రుఁడు హరివంశాదిపర్వములకు కూడా వ్యాఖ్యానము నిర్మించెను గాని, కేవలము శ్రీకృష్ణమహత్త్వము బోధించువాటికి భారతకథతో నెట్టిసంబంధమును లేదు. అయినా, మహాభారతకథలో ధర్మపక్ష మవలంబించి దానికి జయము కలిగించినవాఁడగుటచే నవతారపురుషుఁ

దైనయా శ్రీకృష్ణునిమహిమను శౌర్యమును వర్ణించిన గ్రంథము హరివంశనామమున మహాభారతమున కనుబంధముగా దానివెంటనే యుదయించి యుండు నని భావించుట సముచితము. కాని, జైమినిభారత మట్టిది కాదు. అది రామాయణమునకు తరువాత దాని కనుబంధముగా నుదయించినయుత్తరకాండమును చూచి పుట్టిన దని యందలి కుశలవవృత్తాంతమే తెల్పుచున్నది. అందుచే హరివంశజైమినిభారతములు రెండును భారతసంహితాసమకాలికములు కావనియు, వాటికర్తృత్వము సందిగ్ధమనియు భావింపవలెను. ఈవిషయమును తక్కినపురాణోపపురాణముల వృత్తాంతములు నాసంస్కృతవాఙ్మయచరిత్రద్వితీయసంపుటములో సవిమర్శముగా విశదీకరించియున్నాను.

## కథాపాత్రరసపోషణము

భారతయుద్ధమునకు ప్రధానకారణము దుర్యోధనునిరాజ్యకాంక్షయే యైనను దాని కంగములుగా నెన్నో కారణములు వెలసి కథను పెంచినవి. గ్రంథకర్తయుం దేపాత్రము నెట్టిశీలమున కుదాహరణముగా లేవనెత్తెనో తుదముట్ట దాని నట్లే పోషించుచువచ్చె ననుటయే యిందలి గొప్పవిశేషము.

రాజ్యమును గూర్చి దుర్యోధనునికి పాండవులయెడ నసహనము. విలువిద్యను గూర్చి కర్ణుని కర్జునునెడ నసూయ. అట్టియిద్దఱికిని కుమారాస్త్రవిద్యాసందర్శనము గాఢమైత్రిని కలిగించినది. ద్రుపదానయన మత్స్యయంత్ర ఘట్టములు వారియసూయను మఱింత పెంచినవి. రాజసూయమున గాంధారేయునిహృదయము భగ్గు మన్నది. దానిపై ద్రౌపది నవ్వు నెయ్యిపోసినది. ఆపరాభవము జూదము కల్పించినది. పాంచాలిని సభ కీడ్పించినది. భీమార్జునులశౌర్యాగ్ని ధర్మజునిసత్యమున నివురుగప్పినని ప్పయినది. అంతటితో సుయోధనునిచల మణఁగినదా ? పునర్ద్యూతము వనవాసము ఘోషయాత్ర, ఒక టేమిటి? — అసహనము

తొట్టిలోనినిప్పు. అది స్వాశ్రయమును నశింపఁజేయక విడుచునా? తుద కంతే యైనది.

పాఠకప్రరోచనార్థమో మహత్త్వప్రతిపాదనార్థమో, ఇందలి కొన్ని ప్రధానపాత్రములజన్మవృత్తాంతము లద్భుతములుగా వర్ణింపఁబడినా, వానితరువాతిచర్యలు మానవస్వభావాతీతములు గా నుండుటచే భారతకథ నిజమనియే పెక్కండ్రుపరిశోధకులు భావించియున్నారు. ఇంక పాత్రపోషణమందునూ, అతి మనోహరము.

పితృభక్తి ప్రతిజ్ఞాపరిపాలన పరాక్రమముల భీష్ముఁడును సత్యధర్మపాలనమున ధర్మరాజును, బలశౌర్యసౌశీల్యముల భీమార్జునులును గుణపక్షపాతమున ద్రోణుఁడును పోషింపఁబడినవిధము నిరుపమానము. ధైర్యదాతృత్వశౌర్యములందు కర్ణుఁడును రాజనీతిని శ్రీకృష్ణుఁడు నౌచిత్యపారము గాంచినపాత్రము లనుట నిర్వివాదము. కథోచితముగా రసోచితముగా భారతకవి ద్రౌపదీపాత్రమును తీర్చిదిద్దినచాతుర్య మనన్యసామాన్యము. అవమానప్రతీకారచింతనయందు పాంచాలి కావ్యజ్ఞురాలు. అధర్మప్రతీకారకాంక్షిణియు ధీరయునైనను అతి రాజనీతిజ్ఞురాలు.

## దాయభాగనిర్ణయము

"ధృతరాష్ట్రుఁడు పుట్టుగ్రుడ్డి, విదురుఁడు పారశవుఁడు, వారు రాజ్యార్హులు కాలేరు. కావున పాండురాజు రాజయ్యెను—అర్హత లేని ఆంబికేయుఁ డిపుడు రాజు కాఁదగఁడు గదా! పూర్వమే రాజ్యము వదలుకొన్న భీష్ముఁడు మరల దానిని గైకొనఁడుగదా! కావున పాండవజ్యేష్ఠుని మూర్ధాభిషిక్తుని జేయుదము—ఇపుడు ధర్మరాజు రాజయ్యెనేని రాజ్యమతనివంశములోనివారికే స్థిరపడును. మేమును మాసంతతియు పరపిండోపజీవులము కావలసివచ్చును—పాండురాజు ధర్మపరాయణుఁడు. అతనికొడుకు నట్టివాఁడే. పితృపైతామహమైన రాజ్యమునుండి యతనిని తొలగించుటయెట్లు"—

అనుచు క్రమముగా వైశంపాయన పౌరజన దుర్యోధన ధృతరాష్ట్రు లన్నమాటలనుబట్టి తండ్రికి సంక్రమించినరాజ్యమునకు యుధిష్ఠిరుఁడు కర్త యైనట్లు విశద మగును. కాని, పాండురాజు రాజయినవెంటనే జైత్రయాత్ర యొనరించి ధనరాసులు తెచ్చి యొకనెలమాత్రమే రాజధానిలోనుండి వేఁటనెపమున భార్యలతో నడవికి వెడలెను. అతఁడు తిరిగిరాలేదు. కౌంతేయులు రాజధానికి వచ్చునప్పటికి భీష్మవిదురుల సాహాయ్యమున పరిపాలన మొనరించు నాంబికేయుఁడు రాజుగా స్థిరపడెను. ప్రకృతిరంజను లైనపాండవులను జూచి దుర్యోధనున కసూయ పొడమినది. వారిని జంపించుటకు చేసినయత్నములు విఫలములైనవి. కర్ణసాహాయ్యమున వారిని యుద్ధమున జయించవచ్చు నని యతఁడు నిశ్చయించుకొని యెవ రేమిచెప్పినను వినలేదు. అపుడు కురుపితామహుఁడు వంశహాని కలుగ కుండుటకై రాజ్యము చెఱిసగ మనుభవింప నిర్ణయము గావించెను. ఆభీష్ముని నిర్ణయమే పాండవుల యర్ధరాజ్యప్రాప్తికి ప్రమాణ మైనది. కౌరవపాండవదాయభాగమున కతని వచనమే ధర్మశాస్త్రమైనది. ఆధర్మవచనము తరువాత వెలసిన ధర్మశాస్త్రములనుబట్టి విమర్శింపరానిదికదా!

## అష్టాదశసంఖ్య

పర్వములు పదునెనిమిది. భగవద్గీతాధ్యాయములు పదునెనిమిది. రెండుపక్షముల సేనలయక్షౌహిణులు పదునెనిమిది. యుద్ధదినములు పదునెనిమిది. ఈసంఖ్యానియమ మెందుకు వచ్చెనో నిజము తెలియదు గాని, యిది యష్టాదశద్వీపములకును, అష్టాదశవిద్యలకును స్మారకమేమో యని తోఁచుచున్నది.

## కథాపరమార్థము

శ్రీమద్రామాయణ మహాభారత భాగవతములు మూడును భగవత్కథలను ప్రతిపాదించుటంబట్టి హైందవులకు పావనము లైన మతగ్రంథము లైనవి. భగవదవతార పురుషుఁ డగు శ్రీరాముఁడు

రామాయణకథానాయకుఁడు. రామకృష్ణావతారపురుషుఁ డగు శ్రీకృష్ణుఁడు భారతకథాప్రవర్తకుఁడు, భాగవతకథానాయకుఁడు. భారతకథకు నారాయణకథ యని నామాంతరము. ధర్మరక్షణార్థము నరనారాయణావతారములోని నారాయణుఁడు కృష్ణుఁడుగాను, అనరుఁ డర్జునుఁడుగాను మరల నవతరించిరి. మఱియు, "మమ ప్రాణా హి పాండవాః" అన్న మాటనుబట్టి పంచపాండవులు శ్రీకృష్ణునిపంచప్రాణము లని నిరూపిత మగుచున్నది. అందుచే జనసామాన్యమున కిది శ్రోత్రపేయ మైనరాజచరిత్రగాను, తత్త్వజిజ్ఞాసువులకు తరుణోపాయ మైన శ్రీమన్నారాయణకథగాను గోచరించుచున్నది. ఇందలి ప్రధానవిషయము ధర్మాధర్మముల పోరాటము.

కౌరవపాండవసంగ్రామము కేవలము కవికల్పితమని యెవరును చెప్ప సాహసింపరు గాని, ధర్మాధర్మసంగ్రామమున కనుగుణముగా పాత్రములను సమకూర్చి కవీంద్రుఁడు కథాపన్నవేశము గావించె నని మాత్ర మూహింపక తప్పదు. ధర్మమునకు జయమును, అధర్మమున కపజయమును తప్ప దన్నసత్యము నుపదేశించుటయే దీనిప్రధానోద్దేశము. అందుకు తగినట్లుగా ధర్మరాజపక్షమందు నరనారాయణరూప దైవమును దుర్యోధనపక్షమందు కర్ణరూప మైనపౌరుషమును చేర్చి కథ సాగించెను. కర్ణదుర్యోధనులు శ్రీకృష్ణునిమహిమను కనియున్నారు, అతఁడు భగవదవతార మని యెఱిఁగియున్నారు. అయితే నేమి? పార్థు నోడించు కోర్కియు పాండవుల నణఁగించుకాంక్షయు, వారి కావివేకము లేకుండఁ జేసినవి. అదే, అధర్మలక్షణము. కాని, ఆపక్షముమాత్రము దుర్బలమా? కాదు. అసమానపరాక్రమశాలి కర్ణుఁ డందున్నాఁడు. అతఁ డాపక్షమున లేకున్నను, అతనిజన్మవృత్తాంతమును కుంతి మఱుఁగు పుచ్చకపోయినను, యుద్ధమే లేదు. అంతేకాదు, ఆమె కర్ణుని వరమును గకపోయినచో దైవమునకు గెలుపే లేదు. అట్టివాఁడు కానీనుఁడు,

అందుకే కర్ణునితల భారత మన్నలోకోక్తి వెలసినది. అట్టి మహా శూరుని జంపుట కెంతో సామగ్రి సమకూడవలసివచ్చినది గదా! అట్లు కూడుటద్దైవలక్షణము. ఇఁక చెప్పెడి దేమి? దైవము సఫల మైనది, పౌరుషము విఫల మైనది. ఇదే యీకథయందలిపరమార్థము.

ఈమహాకావ్యమున ప్రధానరసము వీరము. అది యెంతయు చిత్రముగా సర్వతోముఖముగా నిందు వర్ణింపఁబడినదో రాజనీతియు దాని కనుగుణమై యుం దౌచిత్యపారము గాంచినది. ఆనీతిచాతురి యంతయు శ్రీకృష్ణునిమాటలయందును చేఁతలయందును ప్రస్ఫుటముగా ప్రతిఫలించినది. ఇతరత్ర వేదవేదాంతవేద్య మైనపరతత్త్వ మని కీర్తింపఁబడినయాకృష్ణుఁడే యిందు రాజనీతిప్రవర్తకుఁ డయ్యెను. ధర్మరాజాదులును నయశాస్త్రధురీణు లగుదురుగాక. కుంతీద్రౌపదులానయసారమును ప్రదర్శించి రని పాఠకులు భావింపకపోరు. శ్రీకృష్ణయానపర్వమందలి ద్రౌపది పల్కినప్రతిమాటయు క్షత్త్రియాంగన కుచిత మైన నీతిజ్ఞతను ప్రకటించుచున్నది. రాజనీతిసహాయ మైనవీరము ధర్మమును గెలిపించినది "యతో ధర్మ స్తతో జయః" అన్నసూక్తి సార్థక మైనది. పరమార్థమిది.

శ్లో. ఆదావఙ్కురితం వైరం, సభాయాం పల్లవాన్వితమ్,
పుష్పితం సమ్యగుద్యోగే, ఫలితం యుద్ధపర్వకే.

భాష

భారతభాష రామాయణభాషవలె నంతట నొక్కరీతిని మృదువు కాదు. కొన్నిపట్టుల కఠినముగాను క్లిష్టాన్వయముగాఁగూడ నుండును. పునరుక్తులవలన కథాగతి యందందు మందగించుచుండును. అది యటులుండ లౌకికియే యిందు సార్వత్రిక మైనను, వైదిక్యనుకరణమును వైదికియుఁగూడ నిందు క్వాచిత్కముగాఁ గనవచ్చును. శకుంతలదుష్యన్తునికి పుత్త్రుని జూపుచు పల్కినది మంత్రమే.

"అఙ్గా దఙ్గా త్సంభవసి హృదయా దధిజాయసే,
ఆత్మా వై పుత్రనామాసి స జీవ శరద శ్శతమ్"

పెక్కుస్థలములందు ఋక్పాదములే లౌకికచ్ఛందోబద్ధములై కన వచ్చును. ఈసందర్భమున భార్యాలక్షణములు భార్యాప్రయోజనములు నిట్లు వర్ణింపఁబడినవి. ఇవి పాఠకులు సర్వదా స్మరింపఁదగినవి.

"సఖాయః ప్రవివిక్తేషు భవన్త్యేతాః ప్రియంవదాః,
పితరో ధర్మకార్యేషు భవన్త్యార్తస్య మాతరః,
"సుసంరబ్ధోఽపి రామాణాం న కుర్యా దప్రియం వరః,
రతిం ప్రీతిఞ్చ ధర్మఞ్చ తా స్వాయత్త మవేక్ష్యహి"

గద్యరచనము యజుర్వేదారణ్యకోపనిషత్తులందే యారంభ మైనదిగాని, లౌకికభాషలో నాదిపర్వమునఁ గనవచ్చుగద్యమే యాద్య మనఁదగును. దానిరీతియు బాలురకుఁ సుఖబోధ్యముగా నున్నది.

బహువిధధర్మరాశి యైనభారతమున సాంఘికధర్మములు ససాక ల్యముగా వర్ణింపఁబడిన వనుటపునరుక్తము. హరివంశభవిష్యత్పురా ణాదులు వివరించినధర్మముల కెల్ల భారతోక్తధర్మసూత్రములే మూలము లనుట విదితము. ఇందలియరణ్యపర్వములోనిమార్కండేయోక్తి యొకటి చూతము.

"న కన్యాం యాచతే కశ్చి న్నాపి కన్యా ప్రదీయతే,
స్వయం గ్రాహా భవిష్యన్తి యుగాన్తే సముపస్థితే,
"రాజాన శ్చాప్యసంతుష్టాః పరార్థాన్ మూఢచేతసః
సర్వోపాయై ర్హరిష్యన్తి యుగాన్తే పర్యుపస్థితే,
"మ్లేచ్ఛీభూతం జగ త్సర్వం భవిష్యతి న సంశయః,
హస్తో హస్తం పరిముషే ద్యుగాన్తే సముపస్థితే"

కలియుగాన్తమునసంభవించుసాంఘికదురాచారము లని వర్ణిం పఁబడినయీకన్యాస్వాతంత్ర్యాదు లిపుడే యారంభ మైనట్లు కనఁబడు చున్నవిగదా! ఆహా! ఋషులదూరదర్శిత్వము!

## వ్యాఖ్యలు

భారతవ్యాఖ్యలలో లోకవ్యాప్త మైనది భావదీపము. దీనికి నీలకంఠీయ మనియు పేరు కలదు. గోవిందసూరితనయుం డగు నీలకంఠ పండితుండు దీనికర్త. గోదావరికి పడమరగా మహారాష్ట్రదేశమం దున్న కూర్పరమనుగ్రామ మితనివాసము. అర్జునమిశ్రుం డితనికి పూర్వము వ్యాఖ్య నిర్మించిన ట్లితనిరచనలో కలదు. అభయానందపూజ్యపాదుని శిష్యుండును విద్యాసాగరనామాంతరుండు నైన యానందపూర్ణమునీంద్రుండు రచించిన వ్యాఖ్యానరత్నమును లక్షాభరణ మనునింకొకటీకయు కలవు. సర్వజ్ఞనారాయణకృతవ్యాఖ్య యొకటి కలకత్తాపుస్తకభాండాగారమున నున్నదంట. ఇంక నేవేవి యెందణంగియున్నవో! నేటికి సుమారు మూండువేలసంవత్సరములుగా నాసేతుహిమాచల మార్యధర్మముల కవలంబనమై వెలయుచున్న యీమహాభారతముస్తుతికతీతము కదా! అయినన్నిట్లుభజింతము.

శ్లో. సర్వపౌరాణికకథాసంప్రదాయమహాగురున్।
కృష్ణద్వైపాయనం వందే పరాశరతనూభవమ్.

—:o:—

# పాణిన్యాచార్యులు

శ్లో. విగళితపూర్వనిబన్ధం, వివశం విహరన్త మార్యశబ్దగజమ్,
అష్టాధ్యాయీబద్ధం, య శ్చక్రే తం మునిం వన్దే.

ఆచంద్రార్కము తమకీర్తి నిలుచుమహాత్ములు ప్రపంచములో కొందఱుమాత్రమే యుందురు. అట్టివారిలో పాణినియొకఁడు. ఇపుడు

లాహోరనఁబడుశలాతురగ్రామ మితనిజన్మస్థలము. దాక్షీశలంకు లితని తల్లిదండ్రులు. ఇతనిపే రాహికుఁడు. పాణిని యనునదిగోత్రనామము. అదే యితని నామధేయముగా ప్రసిద్ధిగాంచినది. ఈమనీషి పాటలీపుత్రమున వర్షోపాధ్యాయునిశిష్యుఁడై విద్య లభ్యసించినవాఁడు. అంతకు మున్ను శాకటాయనాదులవ్యాకరణము లున్నను, శబ్దశాస్త్ర మన్నంతనే "పాణిన్యుపజ్ఞంవ్యాకరణ" మన్నమాటముందుగా విద్వాంసులనోటవచ్చును. లౌకికశబ్దజాలమునంత నంతమనోహరముగా ననుశాసించిన యితనియష్టాధ్యాయి జన్మించినపిదప నితరులవ్యాకరణగ్రంథములకు వ్యాప్తి తగ్గిపోయినది. ఇతనియష్టాధ్యాయీసూత్రములు ౩౯౮౧, అందలి లోపములను పూరించిన కాత్యాయనవరరుచివార్తికములు ౪౨౬౬, ఈపునాదులమీఁద లేచినదివ్యసౌధముపతంజలిమహాభాష్యము. ఇదంతయు కలసి పాణినీయ మనుపేర దేశదేశాంతరముల విఖ్యాతి కెక్కినది. ఇట్టి జగదేకవంద్య మైనశబ్దశాస్త్రము నిర్మించినయీమహాపురుషుని పాశ్చాత్యవిద్వాంసు లెందఱో నుతించి యున్నా రన నింక భారతీయులమాట చెప్పనేల?

ఇతనికాలము నా సంస్కృతవాఙ్మయచరిత్ర ప్రథమసంపుటమున నిర్ణీత మైనది. అం దభిప్రాయభేదము లనేకము లున్నవిగాని,[1] ఆపస్తంబునికి పరుఁడును కాత్యాయనునికి పూర్వుఁడు నైనయితఁడు క్రీ. పూ. ౭౦౦ ప్రాంతమందున్నవాఁ డన్నయభిప్రాయమే సముచితమగుచున్నది. కావుననీమహనీయుఁడు శా. శ. పూర్వము ౮౦౦ ప్రాంతమున జీవించియున్నవాఁ డని విశ్వసింతము.

---

1. "సత్యవ్రతసమాశ్రమినిర్మితయాస్కనిరుక్తోపోద్ఘాతమున"–క్రీ.పూ. ౨౪౦౦. గోల్డుస్టక్కరు మొదలగువారు (సంస్కృతమున పాణినిస్థానము) క్రీ. పూ. ౭౦౦. భండార్కారుపండితుఁడు క్రీ. పూ. ౫౦౦-మాక్సుముల్లరు- క్రీ.పూ.౩౫౦. మొద –

# పాణినికవిత్వము

పూర్వమహాకవులను ప్రశంసించిన యొకపూర్వశ్లోకములో[1] సుబంధుకాళిదాసాదులతో దాక్షీపుత్రుఁడున్నాఁడు. ఆపేర ప్రసిద్ధిగన్నవాఁడు వైయాకరణపాణినియే కాని యింకొకఁడు కాఁడన్నవిషయములో కవిశ్యాసముకు పతంజలివాక్యము ధ్రువపఱుచుచున్నది[2] ఒకానొక ప్రాచీన కవి గావించిన పాణిని ప్రశంసాశ్లోకము రాజశేఖరునిసూక్తిగ్రంథమున నిట్లున్నది.

"నమః పాణినయే తస్మై యస్య రుద్రప్రసాదతః
ఆదౌ వ్యాకరణం కావ్య మను జాంబవతీజయమ్"

క్షేమేంద్రుఁడు తనసువృత్తతిలకములో పాణినికుపజాతి యందభిరుచి యెక్కువ యనివర్ణించియున్నాఁడు[3]. అమరకోశటీకాకర్తయైన రాయముకుటుఁడు జాంబవతీవిజయములో పృషన్తి యనిఇకారాంతశబ్దము ప్రయోగింపఁబడినదనుచునీశ్లోకార్థ ముదాహరించియున్నాఁడు.

"పయః పృషన్తిభిః స్పృష్టా వాన్తి వాతా శ్శనై శ్శనైః"

అష్టాధ్యాయికి భాషావృత్తి నిర్మించిన పురుషోత్తమదేవుఁడు మొదలగు మఱికొందరు జాంబవతీవిజయము పాణిని దన్నారు. మఱియు సూక్తిముక్తావళి కవీంద్రవచనసముచ్చయము సుభాషితావళి సదుక్తికర్ణామృతము మొదలగు పద్యసంకలనగ్రంథములలో పాణినిపేర పెక్కుశ్లోకములు కనవచ్చుచున్నవి. ఇట్లున్నసాక్ష్యమునుబట్టి మనపాణిని జాంబ

1. సుబంధౌ భక్తి ర్నః క ఇహ రఘుకారే నరమతే
ధృతిర్దాక్షీపుత్రే హరతి హరి చంద్రో౽పి హృదయమ్.
విశుద్ధోక్తి శ్శూరః ప్రకృతిమధురా భారవిగిర
స్తథా ప్యన్త ర్మోదం కమపి భవభూతి ర్వితను తే-సదుక్తికర్ణామృతం

2. సర్వే సర్వపదాదేశా దాక్షీపుత్రస్య పాణినేః. మహాభాష్యం. ౧-౧-౨౦

3. స్పృహణీయత్వచరితం పాణినే రుపజాతిభిః
చమత్కారైకసారాభి రుద్యాన స్యేవ జాతిభిః,

వతీవిజయ మనునొక కావ్యమును నిర్మించి యున్నట్లు భావించుచు న్నారు. ఇదో యిట్లుండఁగా, రుద్రటాలంకారవ్యాఖ్యాత యగునమిసాధువు, పాణినిపాతాళ విజయములోని వని "గృహ్యా-అపశ్యతీ" అనెడి యపప్రయోగములను చూపుటంబట్టి[1]. వైయాకరణపాణిని కావ్యకర్తయే కాఁడనియు, పాతాళవిజయకర్తృపాణిని దాక్షీపుత్రపాణినికంటె నన్యుఁడనియు, జాంబవతీవిజయమునకు పాతాళవిజయము నామాంతరమై యుండు ననియు, వేఱువేఱుమతము లుదయించినవి. అందుచే నితని కావ్యకర్తృత్వము సందిగ్ధమగుచున్నది. అయినను, ఇందలితత్త్వ మించుక పరామర్శింతము:—

ప్రాచీనులు రచియించినకావ్యము లెన్నోకాలగర్భమునఁ దణఁగి పోయినవి. అట్లేవాటిలోని కొన్నికొన్నిశ్లోకములు విద్వత్పరంపరలో కర్ణాకర్ణికగా వచ్చినవి యొకకావ్యములోని దింకొకకావ్యములోనిదిగాను, ఒకకవిశ్లోకము వేఱొకకవిదిగాను మాఱిపోయినవి. ఒకపేరు గలవారిద్దఱు ముగ్గు రుండుటచే నట్టిప్రమాదములు కొన్నిజరిగినవి. ఇందుకు, జ్యోతిర్విదాభరణాదులు కొన్నిటినిరఘువంశాదికర్తయగుకాళిదాసున కంటఁగట్టుటయు, భారవిశ్లోకములుకొన్ని భర్తృహరివిగా వాడుకకు వచ్చుటయు రామాయణశ్లోకములు కొన్నిమనుస్మృతిలోనివిగా గణనకు వచ్చుటయు మొదలుగా నెన్నో యుదాహరణములు కలవు. కావున నమిసాధువు చూపినయపశబ్దములతోడిపాతాళవిజయము మనవైయాకరణపాణినిది గాక మఱేపాణినిదో యనవలెనుగాని, యితని దని విశ్వసింపరాదు. జాంబవతీవిజయమునకది నామాంతరమ నెడిమతమును నమ్మరాదనికొందఱందురు. నిజముగా నది మనపాణినిదే యైతే, నమిసాధువునకు దొరికిన యాయపప్రయోగములు రెండువేలయేండ్లక్రిందటిపతం

1. తథాహి పాణినేః పాతాళవిజయే-సంధ్యావధూం గృహ్య
కరేణ భానుః-అపశ్యతీ వత్సమివేందుబింబమ్-

జలికి దొరకకపోవునా? ప్రాచీనలాక్షణికు లైనదండివామనాదులకు లభిం చకపోవునా? అవి వైయాకరణపాణినితప్ప లని యొక్కఁనమిసాధువునకు మాత్రమే తెలిసెనా? ఇంతకంటె వింతకలదా? అతనిది ప్రమాదమనక తప్పదు. ఇంక రాయముకుటుఁడు చూపినప్రయోగ మందుమా? అదియు నిట్టిదే. అతఁడు పాణిని పేరెత్తలేదు. జాంబవతీవిజయ మన్నపేరుగల కావ్య మానాఁడు మఱియొకటి యుండవచ్చును. పోనీ! మనపాణినిదే యది యందమన్నను, అతఁడు చూచినయాప్రయోగము లేఖకప్రమా దపతితము కావచ్చును. అంతే కాని "పయఃపృషద్భిఃసంస్పృష్టాః" అని సవ్యముగా పాదము నడచుచుండఁగా, "పృషన్తిభిః" అనుచు పృషచ్ఛబ్ద మును, ఇకారాంతముగా మనపాణిని ప్రయోగించియుండు నని భావిం చుట సముచితమా? అందుచే, అపార మైన తప్పనవలెను. లేదా, అతఁ డన్నజాంబవతీవిజయము నామసామ్యమునుబట్టి పరిశోధకులు మనదాక్షీపుత్రుని దని పొరపడియుందు రనవలెను. అంతే-ఇంతవట్టు తత్త్వజిజ్ఞాసతో మనము గావించినవిషయపరామర్శకు ఫలముగా జాంబ వతీవిజయ మనేశియొకకావ్యము నీపాణిని నిర్మించియుండునన్నయాశ యంకురించుచున్నట్లే పతంజలి మొదలగుప్రాచీనులలో నొక రైన దీని పేరెత్తలేదే మన్నసందేహముకూడా తలయెత్తుచునే యున్నది- అయినా, పూర్వవిద్వాంసులు కంఠస్థముగావించుకొనుచువచ్చిన యతని చాటువులన్నభావముతో నీసరసము లైనకొన్నిశ్లోకములు మనమును పఠింతము. సరస్వతీకంఠాభరణవ్యాఖ్యాతయగుకృష్ణలీలాశుకుఁడుకూడా నమిసాధుమార్గ మనుసరించి పాణినికృతము లని యిందలి కొన్నిశ్లోక ములుదాహరించుకొన్నాఁడు.

"విలోక్య సంగమే రాగం, పశ్చిమాయా వివస్వతః,
కృతం కృష్ణముఖం ప్రాచ్యానహి నార్యో వి నేర్ష్యయా"

సూర్యుఁడు పశ్చిమ దిగంగనాసంగమమందు రాగముచూపుట కని పెట్టి ప్రాగ్దిశాంగనముఖము మాడ్చుకొన్నదఁట. ఈర్ష్య లేనిస్త్రీలు లేరుగదా!

"శరదిరవిరశ్మి తప్తా బిభ్రాణా శోషమతిశయగ్లపితాః,
జ్వరితా ఇవ లక్ష్యన్తే లంఘనయోగ్యా మహాసరితః,

లంఘన మనఁగా, దాటుట — జబ్బుచే నన్నముతినకుండుట. శరదృతువులో పెద్దనదులు సూర్యరశ్మిచే పరితప్తములై నీరుక్షీణించి పోవుటచేజ్వరపడ్డవారివలె లంఘనయోగ్యములగుచున్నవనిభావము. దిగి దాఁటిపోవుట కనుకూలములైనవనుట.

"ఉపోఢరాగేణ విలోలతారకం, తథా గృహీతం శశినానిశాముఖమ్
యథా సమస్తం తిమిరాంశుకం తయా, పురోఽపిమోహాద్గళితం
న లక్షితమ్"

ఇది చంద్రోదయసమయవర్ణన

నాయకునిపై వలపు హెచ్చుటచే తనచీఁకటి యనెడి కట్టుకోక జాఱిపోవుట కూడా యెఱుఁగనట్టియు, కదలుచున్న తారక లనెడి కనీనికలు కలిగినట్టియు, నిశావధూటిముఖమును, ఉదయరాగ మనెడియనురాగ ముతోడి చంద్రుఁడు ముద్దుపెట్టుకొనె నని భావము.

క్షేమేంద్రుఁడు పొగడినయితనియుపజాతిప్రియత్వమునకుకొన్ని—

శుద్ధస్వభావా న్యపి సంహతాని, నినాయ ఖేదం కుముదాని చంద్రః
అవాప్య వృద్ధింమలినాన్తరాత్మా, జడో భవేత్కస్య గుణాయ వక్రః"

ఇది చంద్రోపాలంభము

మలినాంతరాత్ముఁడు వక్రశీలుఁడు నైనజడుఁడు లోకములో నెవ నికైనా మంచి చేయునా ?

"సరోరుహాక్షీణి నిమీలయన్త్యా రవౌ గతే సాధు కృతం నలిన్యా
[illegible] ప్రియాలోకనమాత్రమేవ"

సూర్యుఁడు వెడలిపోఁగానే తామరలత తన కనుఁదమ్ములను మూసుకొన్నది. సెబాసు! అది మంచిపనిచేసినది. లోకమునంతను కంటితో చూచుచున్నా, ఉత్తమాంగనలకు ప్రాణప్రియుని దర్శించుట మాత్రమే ఫలము కదా!

"అథాసనా దాస్త మనింద్యతేజా, జనస్య దూరోజ్ఝితమృత్యుభీతేః,
ఉత్పత్తిమ ద్వస్తు వినాశ్యవశ్యం, యథాహ మిత్యేవ మివోపదేష్టుమ్"

పుట్టినవారంతయు తప్పకనావలెగిట్టెడువారేయని, జనమునకు బోధించుటకో యనసహస్రాంశుఁ డస్తమించెను.

"ఐంద్రం ధనుఃపాండుపయోధరేణ, శర ద్దధా నార్ద్రనఖక్షతాభమ్,
ప్రసాదయన్తీ సకలంక మిందుం, తాపం రవే రభ్యధికం చకార"

శరచ్చంద్రికాశరత్తాపముల నెందఱోవర్ణించినారు గాని, వాటికి విలక్షణమై యారెంటిని కలిసిన పైవర్ణన మొంతయు రసోదంచితమై మనోహర మగుచున్నది.

"నిరీక్ష్య విద్యు న్నయనైః పయోదో, ముఖం నిశాయా మభిసారికాయాః,
ధారానిపాతైః స్సహ కిన్ను వాన్త, శ్చంద్రోఽ యమిత్యార్తతరం రరాస,"

"ముఖాని చారూణి ఘనాః పయోధరా, నితంబపృథ్వ్యో జఘనోత్తమశ్రియః,
తనూని మధ్యాని చ యస్య సోఽభ్యగా, త్కథం నృపాణాం ద్రవిడీజనో హృదః?

"ప్రకాశ్య లోకాన్ భగవాన్ స్వతేజసా, ప్రభాదరిద్ర స్సవితాపి జాయతే, అహో చలా శ్రీ ర్బత మానినా మపి, స్పృశన్తి

"అసౌ గిరే శ్శీతలకందరస్థః, పారావతో మన్మథచాటుదక్షః
ఘర్మాలసాంగీం మధురాణి కూజన్, సంవీజతే పక్షపుటేన కాంతామ్"

"పాణౌ పద్మధియా మధూకకుసుమభ్రాంత్యా తథా గండయోః,
నీలేందీవరశంకయా నయనయో ర్బంధూకబుద్ధ్యా ధరే, లీయన్తే
కబరీషు బాంధవజనవ్యామోహజాతస్పృహా, దుర్వారా మధుపాః
కియంతి తరుణి! స్థానాని రక్షిష్యసి?"
"పాణౌ శోణతలే తనూదరి! దరక్షామాకపోలస్థలీ,
విన్యస్తాంజనదిగ్ధలోచనజలైః కిం మ్లానిమానీయతే.
ముగ్ధే! చుంబతు నామ చంచలతయా భృంగః క్వచి త్కందళీ
మున్మీలన్నవమాలతీ పరిమళః కిం తేన విస్మార్యతే?"

సుభాషితావళ్యాదులం దింక నిట్టివికలవు. పాఠకులు వాని నవలో కింతురుగాక:—

—;o:—

# కాత్యాయనవరరుచి

శ్లో. వైదికలౌకికభాషా, శాసనవిజ్ఞానదీప్తకీర్తిరుచిమ్,
సరసకవిత్వాభిరుచిం, కాత్యాయనవరరుచిం వందే.

లోకవిఖ్యాతి గాంచినమహాపురుషులనుగూర్చి యేవేవోకట్టు కథలుపుట్టుటయు, అట్టివి కొన్నిగ్రంథస్థములగుటయు మనదేశమందనాది సిద్ధమైనయాచారమే. అందుకు తగినట్లే "వరరుచి, వ్యాడి పాణినిఅను వారితోకలసిపాటలీపుత్రములో నర్షోపాధ్యాయునివద్ద విద్యనభ్యసించెను ఆగురువు తనకూతురైనఉపకోశను వరరుచి కిచ్చి పెండ్లిచేసెను"

ఇత్యాదిగా నున్నయొకకథ భోజదేవునిశృంగారప్రకాశములోను సోమదేవభట్టు కథాసరిత్సాగరములోనుకూడా కనవచ్చును. ఈకథ గుణాఢ్యునినాటికే వ్యాపించినదేమో కాని, పాణినికి రెండువందల సంవత్సరములతరువాత నున్నమనవరరుచి యతనికి సహాధ్యాయుఁ డగుట సంభావ్యమా? ఇట్లే యితనినిగూర్చి మఱి రెండు కథ లున్నవి.

"కలాపి యను బ్రాహ్మణునికూఁతు రగుకాత్యాయని యను కన్య, అగ్నిదేవుని వరమున గర్భము దాల్చెను. కులమువా రామెను వెలివేసిరి. నిండుచూలా లైనయామె యిల్లు విడిచి గోదావరికి వెళ్ళి యాగట్టుమీఁద ప్రసవించెను. ఆశిశువే కాత్యాయన వరరుచి" అని, అవంతిసుందరీకథాసారములో నొకకథ. ఈగ్రంథము కాళ్ళుతేనికథల పుట్టినిల్లు.

"వరరుచి పదునెనిమిదిజాతులకన్యలను పెండ్లాడఁగా బ్రాహ్మణు లాతని వెలివేసి చండాలునిగా చూచి"రని మలబారుదేశములో వ్యాపించినయొంకొకకథ, ఈవిషయముతో నున్నయొకశ్లోకమును భోజునిశృంగారప్రకాశముకూడా యుదాహరించినది. అందలిపాదము—

"ఘూర్జైర్యత్, శ్వసచీకృతో వరరుచి స్సర్వజ్ఞకల్పో ఽపి సన్"

ఇట్లు మనకాత్యాయనుని మహత్త్వము ప్రతిపాదించునవికొన్ని, వరరుచినామకు లెక్కువగా నుండుటచే వారివారికథ లితని కంటఁగట్టినవి కొన్ని కలవు గావున నీవరరుచి యెవరో ముందు తెలిసికొందము. ఈకాత్యాయనవరరుచినిగూర్చి నాసంస్కృతవాఙ్మయచరిత్ర రెండు సంపుటములలోను విపులముగా చర్చించి విషయనిర్ణయము గావించియున్నాను. అందలిసారమిది:—

ప్రాగ్దేశప్రాకృతభాష ననుశాసించుచు ప్రాకృతప్రకాశ మనుపేర సూత్రగ్రంథము నిర్మించినవరరుచి మనకాత్యాయనవరరుచికి పూర్వుఁడు. అతనిప్రాకృతసూత్రములకే మనవరరుచి ప్రాకృతమంజరి యనుపేర వ్యాఖ్య రచించియున్నాఁడు. లింగవిశేషవిధి యనఁబడులింగానుశాసనము నిర్మించినవరరుచి యీకాత్యవరరుచికంటె వే అని వామనసర్వానందాదులును క్షీరస్వామిహేమచంద్రాదులును గ్రహించిన యందలి మాటలనుబట్టి, విశద మగుచున్నది. వామనక్షీరస్వాములుగ్రహించిన నిర్విశబ్దనిర్వచనమునుబట్టి, మన యీ వరరుచి నామమాల యనునొక

కోశము రచియించియుండు ననియు, పూర్వులు పేర్కొన్న కాత్యకోశ మదే యగు ననియు నూహించుట కెక్కువ యవకాశ మున్నది కాని, లింగానుశాసనకర్త వరరుచిమాత్ర మితఁడు కాఁడు. అట్లే, ఐంద్రనిఘంటు కారుఁడైన వరరుచియు నితఁడు కాఁడు:—

"వరరుచి రీశ్వరదత్తః శ్యామిలకః శూద్రకశ్చ చత్వారః,
ఏతే భాణాన్ బభణుః కా శక్తిః కాళిదాసస్య"

కాళిదాసు భాణకర్మ మెఱుఁగకపోయినా యతని నధిక్కరించుచు నెవరో చెప్పిన యీ శ్లోక మాధారముగా, వరరుచి, ఉభయాభిసారిక, ఈశ్వరదత్తు ధూర్తవిటసంవాదము, శ్యామిలకుఁడు పాదతాడితకము, శూద్రకుఁడు పద్మప్రాభృతకము, అను భాణములు నిర్మించినా రను మాట పుట్టినది. ఆ భాణములును పాట్నాలో పాతికేళ్ళ క్రిందట నచ్చుపడినవి. ఈ కవులు నలుగురును వేఱువేఱు దేశముల వేఱువేఱు కాలములనున్నవారు. ఇందలి శూద్రకుఁడు మృచ్ఛకటికము నిర్మించినవాఁ డయితే దానిలో పద్మప్రాభృతకమునుగాని, దీనిలో దానినిగాని స్మరింపఁడా యని యొక సంశయము. అట్టియాచార మానాటి కవులలో లేదందము గాని, యీ వరరుచి వార్త్తికకార కాత్యాయన వరరుచియే యని యందు మేని, ఆ నాఁడు రూపకరచన మున్నదా యని సంశయము, పోనీ! ఇతఁడే మొదలు పెట్టె నందము గాని, యితని సుప్రసిద్ధవైదుష్యమున కీయభిసారిక తగి యున్నదా యన్న సంశయమో! ఇందలి శ్లోకములు రెండు మూఁడాలంకారికులు గ్రహించినట్లుండఁగా తగకపోవుట యేమి?—ఇంతకును వీరు నలువురును ప్రసిద్ధు లగుకవు లనియు. ఉభయాభిసారికాదిభాణములు నాల్గింటిని పూర్వాలంకారికు లెఱుఁగుదు రనియు విశ్వసింతము గాని, యీ నాల్గింటి నీనలుగురు నిర్మించినా రనుటకు పై గాలికబురుశ్లోకము తప్ప వేఱే ప్రబలప్రమాణము కనరాదుగదా! అందుచే నీ భాణము మన

కాత్యాయనిర్మితమా యని సంశయింపవలసివచ్చినది. ఇంక జ్యోతిర్విదాభరణము విక్రమార్కునిసభలోనివా రనుచు మూఁడుకట్టినధన్వంతర్యాది నవరత్నములలో నివరరుచియు మనకాత్యాయనుఁడు కాఁడు. అయితే నితఁ డెవఁడు?

ఇతఁడు పాణినీయమునిత్రయములో గణన కెక్కినవార్తికకారవర రుచి, శుక్లయజుర్వేదప్రాతిశాఖ్యము నిర్మించినవరరుచి. పారస్కరుఁ డనునామాంతరమున వైదికలోకమున నుతి కెక్కినవాఁడును శ్రౌతసూత్రగృహ్యసూత్రములు నిర్మించినవాఁడు నైనకాత్యాయనవరరుచి. విశ్వామిత్రునిసంతతిలో పెక్కుతరములుగడచినంత నుదయించినముని కతుఁడు. అతనిగోత్రమువారు కాత్యాయను లనఁబడుచు వచ్చిరి[1]. ఆగోత్రనామమున ఖ్యాతి కెక్కినవాఁడు మనవరరుచి. వైదికసారస్వతమున పెక్కువగా వ్యాపించినయితని 'కాత్య' నామముకూడా యితఁడు కతగోత్రమువాఁ డని ధ్రువపఱుచుచున్నది. మఱియు, హరచరితహారచింతామణ్యాదులు వర్ణించినమునిత్రయచరితము మహిమోద్యోతకమై యతిశయోక్తిభూయిష్ఠముగా నున్నమాట నిజమే కాని, ప్రాచీనసంప్రదాయమునుబట్టి కర్ణాకర్ణికగా వాటికి గోచరించిన నివాసగోత్రనామధేయాదులు కొన్ని విశ్వసనీయములు కాకపోవు. ఆచరితము మనవరరుచి కాత్యాయనగోత్రమువాఁ డనియు, కౌశాంబీనివాసి యనియు వసుదత్తాసోమదత్తులతనయుఁ డనియు శ్రుతధరుఁ డనునామాంతరము కలవాఁ డనియు మనకు తెలుపుచున్నది. ఇందు విశ్వాస్యము కాని దేదియు లేదు. వైదికలౌకికవాఙ్మయములకు సంబంధించినశాస్త్రజ్ఞానము పూర్తిగా నున్నయితఁ డానాఁడు శ్రుతధరుఁ డనుబిరు దందె ననుట కాశ్చర్య మేమి? కావున నీవిద్వత్కవిశేఖరుఁడు శా.పూ.౬౦౦ప్రాంతమున కౌశాంబిలో నున్నవాఁ డని భావింతము.

---

1. విశ్వామిత్రస్యతు సుతా దేవరాతాదయః స్మృతాః
దేవశ్రవాః కత శ్చైవ తతః కాత్యాయనాః స్మృతాః. హరివంశము.

ఈముని నిర్మించినకావ్య మేదో! అది మనకంటఁ బడదు గాని, ఇతఁ డొక కావ్యము నిర్మించినట్లు నమ్మఁదగినప్రమాణ మున్నది. అందలి వని సూక్తిముక్తావళ్యాదులు సేకరించినశ్లోకము లున్నవి. అందుచే, పాణిన్యాచార్యునిమాడ్కి నితఁడును మన కిందు పూజార్హముగా గ్రహించినకవి యయ్యెను.

పతంజలి తనమహాభాష్యమున "యస్తేన కృతం, న చ తేన ప్రోక్తం"అని వ్రాసి"వారరుచం కావ్యం"అని యుదాహరించియున్నాఁడు కాని, ఆకావ్యముపేరు చెప్ప లేదు. భైమరథీవాసదత్తాద్యాఖ్యాయికలను పేర్కొనెను గాని, తత్కర్తలను తెలుపలేదు. ఇది యిట్లుండ, సూక్తిముక్తావళిలో నున్నరాజశేఖరుని యీక్రిందిశ్లోకము వరరుచి కంఠాభరణమనుకావ్యము నిర్మించినట్లు తెలుపుచున్నది:-

"యథార్థతా కథం నామ్ని మాభూ ద్వరరుచే రిహ,
వ్యధత్త కంఠాభరణం, య స్సదారోహణప్రియః"

ఈమాటలనుబట్టి వరరుచి కంఠాభరణకావ్యము నిర్మించె నన వచ్చునుగాని, ఆవరరుచి మనకాత్యాయను డనుకొనుట యెట్లు? ఆ కావ్య మితనిదే యైతే, భోజరాజు తనశృంగారప్రకాశికలో వరరుచి నిర్మితచారుమతి యనుకృతిలోని దని యీక్రిందిశ్లోక ముదాహరించి యున్నాఁడు. ఆకావ్యముమాత్ర మితని దెందుకు కాదు?

" కనకకుండలమండితగండయా, జఘన దేశని వేశితవీణయా,
అమరరాజపురే వరకన్యయా, తవ యశో విమలం పరిగీయతే "

అవంతీసుందరీకథనుప్రకటించినవారు చారుమతి యనునది గద్యరూప మైనఆఖ్యాయిక యన్నారు. అయితే, భైమరథీవాసవదత్తాదులను పేర్కొన్నపతంజలి వారరుచకావ్య మైనచారుమతి నెందుకు పేర్కొనఁడు? ఇత్యాదిగా వచ్చుప్రశ్నలకు సదుత్తరములు చెప్పుట కష్టమే. అందుచే ప్రబలప్రమాణము లభించునంతవఱకును మనకాత్యాయనుని

చారుమతీకంఠాభరణకర్తృత్వము సందిగ్ధమందము గాని, మనవరరుచి యేదో యొక కావ్యము నిర్మించియుండె నని పతంజలిమాటనుబట్టి నమ్మక తప్పదు. అయితే నేమి? అది మృగ్యము. పోనీ! సుభాషితావళి మొదలగు సంకలనగ్రంథములలో వరరుచిపేర కనవచ్చు శ్లోకములు సుమా రిరువది యున్నవి. అవి యితనివే యందుమా, వరరుచినామబాహుళ్యము ప్రతిబంధకమగు ననుట యటుండ, సదుక్తికర్ణామృతములో వరరుచికృతముగా కనవచ్చు "చ్యుతా మిందో ర్లేఖా" మిత్యాదిశ్లోకము సుభాషితావళిలో చంద్రికకృతము గాను, శార్ఙ్గధరపద్ధతిలో క్రీడాచంద్రకృతము గాను కనఁబడుచున్నది, ఇట్టి వివాదగ్రస్త శ్లోకములను నిర్ణయించువా రెవరు? ఐన నివి మనకాత్యాయనుఁడు రచియించినవే యగు నన్నభక్తివిశ్వాసములతో రెండుశ్లోకములు చదువుదము.

"ఉపకారిణి విశ్రీణే శ్నైః కేదారవారిణి,
సానుక్రోశతయా శాలి, రభూ త్పాండు రవాఙ్ముఖః"

తనకుపకారము చేసినమడిలోనినీరు మెల్లగా క్షీణించి పోవుట చూచి, వరిచేను బెంగపెట్టుకొని తెల్లపడి తల వాల్చిన దని ఉత్ప్రేక్ష. ఇది శరద్వర్ణన:—

"వ్యోమ్ని నీలాంబుదచ్ఛన్నే, గురువృష్టిభయా దివ,
జగ్రాహ గ్రీష్మసంతాపో, హృదయాని వియోగినామ్"
"సాంద్రనీహార సంవీత తోయగర్భ గురూదరా,
సంతతస్తనితాభ్రాళీ, నిషసా ద్రాద్రిసానుషు"
"ఆలోహిత మాకలయ, న్కందళ ముత్కంపితం మధుకరేణ,
సంస్మరతి పథిషు పథికో, దయితాంగుళి తర్జనాలలితమ్"

ఇఁక నీసందర్భమందు, పాణినికాత్యాయనులతో పతంజలిని స్మరించుట సముచితమును పూజార్హము నగును. ఒకానొకపూర్వుం డితని నర్ణించినశ్లోక మిట్లు లోకమున సుప్రసిద్ధమై యున్నది.

"యోగేన చిత్తస్య, పదేన వాచాం,
మలం శరీరస్యతు, వైద్యకేన,
యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం
పతంజలిం ప్రాంజలి రానతోఽస్మి
ఓన్నమః పాణినికాత్యాయనపతంజలిభ్య శ్శబ్దవిద్యాసంప్రదాయ
కర్తృభ్యో మహద్భ్యో మునిభ్యో గురుభ్యః

---

## గోనందుఁడు

తొల్లి కాశ్మీరము రాజకవులకును కవిరాజులకును ప్రసిద్ధికెక్కినది. అందలికవు లెందఱో యీగ్రంథమున ముందుముందు కనవత్తురు. వారిలో మిక్కిలిప్రాచీనులు కొంద ఱున్నారు. వారికృతు లేవియు నిపుడు లభింపలేదు గాని, కొందఱిచాటుశ్లోకము లందందు కనవచ్చినవి. వాటిని బట్టి వారు కవు లని స్మరించుటయే యిపుడు ఫలము. అట్టివారిలో నితఁ డొకఁడు:— రాజతరంగిణినిబట్టి తెలియవచ్చినగోనందులు ముగ్గురు. నామరూపములు తెలియరాక యణఁగిపోయిన ముప్పదియైదుగురురాజులలో నీపేరు గలవా రుండియుందు రని యూహింపవలసినదే కాని లిఖితప్రమాణ మేదియు లేదు. "కౌరవపాండవసమకాలుఁడై జరాసంధుని మిత్రుఁడై మథురాపురముమీఁదికి దండెత్తివచ్చినప్రథమగోనందుఁడు బలరామునిచే హతుఁ డయ్యెను. అతనిపౌత్త్రుఁడైన ద్వితీయగోనందుఁ డానాఁటికి బాలుఁ డగుటచే కౌరవులు గాని పాండవులు గాని యతనిసహాయము కోరలేదు. తరువాత చిరకాలమునకు తృతీయగోనందుఁడు రఘువంశమున రఘుమహారాజువలెనే, గోనందాన్వయమున మొదటివాఁ డయ్యెను" అని రాజతరంగిణి తెల్పినముగ్గురిలో నొకఁ డితఁ డనుట కాధార మేమియు కనఁబడదు. అయినా, యితఁ డశోకునికి పూర్వుఁడై

శా. శకపూర్వ మాఱవశతాబ్దికడపటనో యేడవశతాబ్దిమొదటనో యున్నవాఁడగు నని యూహింపఁబడుచున్నది.

రాజశేఖరుఁడు గావించినగోనందప్రశంస సూక్తిముక్తావళిలో నిట్లు కనవచ్చుచున్నది.

"అనుప్రాసిని సందర్భే గోనందనసమః కుతః
యథార్థనామ త్రైవాస్య, యద్వా వదతి చారుతామ్"

కవీంద్రవచనసముచ్చయములో నితనిపేర నొకశ్లోక మున్నది– ఒకమాట పోయినది–

"సఖి! కలితః స్ఖలితో ... సా నైవ ప్రమాణమాత్రేణ,
చిర మనుభవతు భవత్యా, బాహులతాబన్ధనం ధూర్తః"

కౌరవపాండవులు రాజ్యముచేయుకాలమున (ప్రథమ) గోనందు డనుక్షత్రియవీరుఁడు కాశ్మీరరాజుగా నుండె నన్నచరిత్రాంశము దీనివల్ల తెలియుటయే విశేషము:—

—:o:—

## గోపాదిత్యుఁడు

ఇతఁడు నొకకాశ్మీరమహారాజు, స్మరశాస్త్రకర్త యైన[1] వసునంని ప్రపౌత్త్రుఁడు, అక్షభూపతితనయుఁడు. వైదికధర్మపరాయణుఁడైన యీపావనాత్ముఁ డనేకాగ్రహారములు నిర్మించి వేదశాస్త్రపారీణు లైన బ్రాహ్మణులను పోషించి, వర్ణాశ్రమాచారపాలనమున కలియుగమును

రాజత. ౧-౩౩౬ మొదలుగా-

1. "ద్వాపంచాశత మబ్దాన్ క్ష్మాం ద్వౌ చ మాసౌ తదాత్మజః,
అపాసీ ద్వసునందాఖ్యః ప్రఖ్యాత స్స్మరశాస్త్రకృత్,
నరః షష్టిం తస్య సూను స్తావతో౽క్ష శ్చ తత్సుతః,
వర్షా నభూ ద్విభు ర్గ్రామం యో౽క్షపాల మకారయత్,

కృతియుగము గావించినవాఁ డన్నయశస్సు నార్జించెను[1] అఱువదిసంవత్స రములయూఱురోజులు రాజ్యము చేసినయీభూవరునికాలమున కాశ్మీర దేశము వేదవేదాంగపాఠములతో వైదికకర్మలతో విరాజిల్లుచుండె నఁట ఈరాజకవి శా.ప్రా. ఆఱవశతాబ్దిలోనివాఁ డగును.విద్వత్పోషకుఁడును విద్వాంసుఁడు నైనయితఁడుసంస్కృతకృతికర్తగా కనఁబడుచున్నాఁడు గాని, ఆకృతు లంతరించినవి. ఇతనిపేర నొకటిరెండుశ్లోకములుమాత్రము సుభాషితావళ్యాదులకు లభించినవి. శృంగారప్రాయ మైనయందలి దీశ్లోకము.

"అద్య ద్యూతజితాధరగ్రహవిధా విశోఽసి తత్ఖండనా,
దాధిక్యే వద కో భవా నితి మృషాకోపాంచితభ్రూలతమ్,
సద్యస్స్విన్నకరా త్తకుంతలభరాయత్తీకృతాస్యాఽస్య మే,
ముగ్ధాక్షీ ప్రతికృత్య తత్కృతవతీ ద్యూతేఽపి యన్నార్జితమ్"

అధరచుంబనము పందెముగా నాయికానాయకులు జూదమాడిరి. అందు నాయిక ఓడిపోఁగా నాయకుఁడధరము చుంబించుటలో పల్లు గ్రుచ్చుకొన్నది. అపుడు "ఓష్ఠము గ్రహించుటకు నీ కధికార మున్నది గాని కొఱుకుటకు నీ వెవఁడవు?"అనుచు దొంగకోపము చూపి శిరోజ ములు సవరించుకొనుచు నభిముఖయై నయానాయికను కౌఁగిలించి ముద్దు పెట్టుకొన్ననాయకుఁడు పందెములో సంపాదించనిదానిని గూడా న్నాప్రి యురాలు నాకు కలిగించిన దని యానందించె నఁట.

సూక్తిముక్తావళిలో నీక్రిందిశ్లోక మున్నది. ఇందు నాయికాను రక్తుఁ డగునాయకునిహృదయావస్థ వర్ణింపఁబడినది.

---

1. జుగోప గోపాదిత్యో ఽథ క్ష్మాం సద్వీపాం తదాత్మజః,
వర్ణాశ్రమప్రత్యవేక్షా దర్శితాదియుగోదయః,
సఖోలఖాగికాహాడిగ్రామస్కందపురాభిధాం
శమాంగాససముఖాం శ్చాగ్రహారాన్ యః ప్రత్యపాదయత్..."

"ఆశ్లిష్టాపి కరోతి సా మమ తనుం కంఠగ్రహోత్కంఠితాం,
దృష్టాపి ప్రియదర్శనా నియమయ త్యక్ష్ణో ర్దిదృక్షాం పునః,
అన్తశ్చేతసి సంస్థితాపి హృదయం భూయో విశ త్యేవ మే,
రూఢప్రేమసమాగమాపి నవతాం ధత్తే ప్రియా ప్రత్యహం"

-;o:—

## అశోకుఁడు

ఇతఁడు కాశ్మీర మేలినమహారాజులలో ధర్మపాలకుఁ డన్న పేరుగాంచినవాఁడు. రాజతరంగిణి యితనిచరిత్రము వర్ణించినది[1] గాని కాలమును నిర్ణయించలేదు. ఇతఁడు మొదలుగా, అభిమన్యునివఱకుఁగల యైదుగురు రాజులును విస్మృతిసాగరమునఁ బడినవారే. వీరిచరితము పురాతనుల కించుక లభించిన దనుచు నిట్లన్నది ప్రథమతరంగాదిని—

"అశోకా దభిమన్యో ర్యే ప్రోక్తాః పంచమహీభుజః,
తే ప్యాపఞ్చాశతో మధ్యా దేవ లబ్ధాః పురాతనైః"

ఇతఁడు బౌద్ధమతావలంబియై తన్మతమున కెక్కువగా వ్యాప్తి తెచ్చుటకు కృషిచేసినధర్మాత్ముఁడై ధర్మాశోకుఁ డన్నపేరొందెను.

1. రాజత. ౧-౯౩ మొదలుగా-
ఆమ్నాయ భంగా న్నిర్నష్ట నామకృత్యా స్తతః పరం,
పంచత్రింశన్మహీపాలా మగ్నా విస్మృతిసాగరే...
ప్రపౌత్ర శ్శకునే స్తస్య భూపతేః(శచీనరస్య)ప్రపితృవ్యజః,
అథావహ దశోకాఖ్య స్సత్యసంధో వసుంధరామ్,
యః శాంతవృజినో రాజా ప్రపన్నో జినశాసనం,
శుష్కలేత్ర వితస్తాత్రౌ వితస్తాస్తూపమండలైః
ధర్మారణ్యవిహారాన్తర్వితస్తాత్రపురే ఽభవత్.
యత్కృతం చైత్య ముత్సేధావధి ప్రాప్తు మక్షమేక్షణమ్,

తొంబదియాఱులక్షలగృహములతో నితఁడు శ్రీనగరిని నిర్మించెనఁట[1] ఇతనిబౌద్ధమతావేశమే యితఁడు గౌతమబుద్ధునికి వెంటనే బయలు దేఱిన బౌద్ధమతప్రచారకుఁ డనుటకు చాలియున్నది.

ఇతఁడు ధర్మనిష్ఠ నుండుటయే కాక, సంస్కృతసారస్వతము నభివృద్ధికి తెచ్చి విద్వాంసులను పోషించుచు, కావ్యములు వ్రాయించుచు, స్వయముగా కవిత చెప్పి ఖ్యాతి గాంచియున్నవాఁడు. ఇతనికావ్య మేదియు కనరాదు గాని, కొన్నిశ్లోకములు సదుక్తికర్ణామృతాదిసంకలనగ్రంథములలోఁ గనవచ్చుచున్నవి. అందలి వొకటి రెండు:—

"అహమహమికాబద్ధోత్సాహం రతోత్సవశంసిని,
ప్రసరతి ముహుః ప్రౌఢస్త్రీణాం కథామృతదుర్దినే,
కలితపులకాసద్యఃస్తోకోద్గతస్తనకోరకా,
వలయతి శనైర్బాలావక్షస్స్థలే తరళాందృశమ్"

"దేవ స్వస్తుతి రస్తు నామ హృది వ స్సర్వే చ సంత్యాగమా
స్సిద్ధం న క్వచి దీదృశం భవతి కిం త్వత్ఖడ్గధారా యథా,
యా మేవ స్వశరీరసిద్ధి రసికో మూర్ధ్నా ప్రతీచ్ఛన్ క్షణం
ద్వైవిధ్యా దనుపంచతాం తదను చ త్రైదశ్య మాప క్షణాత్,

ఇందు, మొదటిదానిలోనిశృంగారమును రెండవదానిలోనివీరమును మారజిల్లోకజిజ్జినమతావలంబివర్ణించె ననుటసముచిత మగునా? అని సంశయము కలుగవచ్చునుగాని, అశోకుఁడు సన్న్యాసి కాలేదు, రాజ్యము విడువలేదు.

ఈక్రిందిది కీర్తివర్ణనము—ఉత్ప్రేక్షాశోభితము

"నిస్సృత్యాహవసాగరా దనుపున స్సంసృత్య పృథ్వీతలం,
కృత్వా ధోహిమశైల మీశ్వరశిరశ్శీతాంశులేఖా మపి.

---

1. స షణ్ణవత్యా గేహానాం లక్షై ర్లక్ష్మీసముజ్జ్వలైః,
గరీయసీం పురీం శ్రీమాం శ్చక్రే శ్రీనగరీం నృపః.

గంగేవ స్వకృతజన్మభూమి రమరై స్సాశ్చర్య ముల్లోకితా
త్యక్త్వోర్ధ్వం ప్రతిలోమ లంఘితవతీ బ్రహ్మాండ మారోహతి॥

శచీనరుఁ డపుత్రకుఁడై మృతి చెందఁగా మొదటిగోనందవంశము లోనివాఁడును శకునిరాజునకు ప్రపౌత్రుఁడు నైన యాయశోకుఁడు రాజయ్యెను. ఇతనిపౌత్రుఁ డైనదామోదరునియనంతరమే కనిష్కాదితురుష్కులుముగ్గురు కాశ్మీర మాక్రమించినా రనియు, అది బుద్ధనిర్వాణానంతరము ౧౫౦ఏండ్లనాఁడు జరిగిన దనియు రాజతరంగిణి తెలుపుచున్నది. బుద్ధనిర్వాణకాలము సందిగ్ధ మగుటచే కనిష్కకాలము సందిగ్ధ మగుచున్నది. కాని, అతఁడు శా.శకారంభము నాఁటివాఁ డని కొందఱు విమర్శకు లనుచున్నారు. బుద్ధనిర్వాణకాలము క్రీ.పూ.౫౪౩ అని కొందఱు ఊహించిరి. అట్లయినచో కనిష్కునికాలము సరి కా దనవలసి వచ్చుచున్నది. కల్హణుని యభిప్రాయము కూడా సునిశ్చితము కా దని యతనిపూర్వోక్త శ్లోకము వల్లనే తెలియుచున్నది. దానిని విశ్వసించినచో కనిష్కునిపూర్వము నూటేండ్లనాఁ డశోకుఁ డున్నాఁ డనవలసివచ్చును. వీరి కాలము లిట్లు సంశయాస్పదములైనను, బుద్ధనిర్వాణకాలమునకు దగ్గఱగానే యశోకుఁ డున్నాఁ డనిమాత్రము చెప్పవచ్చును. అది శా.శకపూర్వమునాల్గవ శతాబ్ది కించుకయావలికాల మగు నని యూహింతము ఇతఁడు బింబిసారుని కొడుకైనయశోకునికంటె వేఱు పూర్వుఁడు.

---

## భరతముని

నాట్యకలకే కాదు, సాహిత్యవిద్యకు నలంకార మైననాట్యశాస్త్రము నిర్మించినయితఁడు శా. పూ. ౩౨౦ ప్రాంతమువాఁడు. ఇతనిని, ఇతనినాట్యశాస్త్రమును గూర్చి నావాఙ్మయచరిత్రలో విపులముగా వ్రాసినదాని నిందు సంగ్రహించి తెల్పెదను.

భాసాదికవులును దండ్యాదిలాక్షణికులును కొంద ఱితనిని స్మరింప లే దనుచు నితఁడు శా. పూ. ౫౦ ప్రాంతమువాఁ డని కొందఱును, ఇంకను తరువాతివాఁ డని కొందఱును భావించుట సరిగాదు. ఇంతకంటె దామోదరగుప్తధనంజయాదు లితనినాట్యశాస్త్రము ప్రాచీన మని విశ్వసించుటయే సరి యగును. ఇందలియవతారికలోని యతిశయోక్తులు దామోదరగుప్తాదు లెఱుఁగనివి కావు. అది గాక. అలంకారములు నాలుగే యని తొలుత నిరూపించినవాఁ డితఁడు. తరువాతిలాక్షణికు లలంకారసంఖ్యను క్రమముగా హెచ్చించుచు వచ్చిరి. ఈహేతు వొకటియు నితఁడు పూర్వోక్తకాలమం దున్నవాఁ డనుటకు చాలక పోవునా?

దాని యుత్పత్తి తెలియరాక పోవుటచే, వేదమువలెనే యదియు నపౌరుషేయ మన్నభావముతో నాట్యవేదము బ్రహ్మప్రణీత మనెడి విశ్వాస మేనాఁడో స్థిరపడినది. నాట్యవేదము గాంధర్వవేదము నొకటియే యని కొంద ఱూహింతురుగాని, నాట్యవేదమందలియించుకవిషయము దానికి సంబంధించి కనఁబడుచున్నంతమాత్రమున రెండు నొకటియే యనుట సాహసము కాకపోదు. ఇంతకు నతిప్రాచీనకాలమునం దది సంప్రదాయరూపముననే కాని గ్రంథరూపమున లే దనియే తోఁచుచున్నది. ఇది యిటు లుండ, పాణిన్యాచార్యులు శిలాలికృశాశ్వు లనువారు నటసూత్రములు నిర్మించియున్నా రని తెలిపియున్నాఁడు గాని, అవియు నిపుడు లేవు. వాటిసంప్రదాయముమాత్రమే లోకమున వ్యాపించినది. దీనినంతనుబట్టి చూడఁగా, పై నాట్యవేదనటసూత్రసంప్రదాయములు పాణినితరువాత సుమారుమూఁడువందలయేండ్లకు గ్రంథరూపము దాల్చినవని తేలుచున్నది. అదే వృద్ధభరతప్రణీత మైనద్వాదశసాహస్రి. శారదాతనయుఁడు తనభావప్రకాశనములో 'భరతులు నాట్యవేదసారమును పన్నెండువేలశ్లోకములతో నొకగ్రంథముగాను, ఆఱువేలశ్లోకములతో మఱియొకగ్రంథముగాను నిర్మించి యున్నా రని చెప్పియున్నాఁడు, ఆభరతు

లలో మొదటివాఁడు వృద్ధభరతుఁడు. అతఁడు శా. శ. పూర్వము పంచమశతాబ్దిలోనివాఁడు. రెండవయతఁడైనయీభరతముని శా. శ. పూ. నాల్గవశతాబ్దిలోనివాఁడు. ధనంజయుఁడును ధనికుఁడును దశరూపకమందు భరతమునిని నుతించియున్నారు. దానివ్యాఖ్యాత బహురూపమిశ్రుఁడును ద్వాదశసహస్రీకారమత మెత్తియున్నాఁడు. కావున షట్సహస్రివలె ద్వాదశసహస్రియు, చిరకాలము వ్యాప్తిలోనున్న దనవచ్చును. కాని, అభినవగుప్తాచార్యుని యభినవభారతీవ్యాఖ్యతో భరతముని నాట్యశాస్త్ర మెక్కువవిఖ్యాతి కెక్కె ననుట నిజము. ఇతఁడు వృద్ధభరతునికృతి చూచి తనకృతి నిర్మించినట్లు చెప్పకపోయినా, దానిని చూచియే యితఁడు నాట్యశాస్త్రము నిర్మించె నని విశ్వసింపక తప్పదు.

ఇది రూపకప్రదర్శనము ప్రధానముగా నుదయించిన దైనను, ఇందు రసభావనాయకాదిలక్షణములును, అలంకారలక్షణములును మనోహరముగా వర్ణింపఁబడిన వగుట నిది సాహితీలక్షణములకు ప్రథమభిక్ష పెట్టిన దనవచ్చును. ఇది ముప్పదియేడు అధ్యాయముల గ్రంథము. లేఖకు లెవరో కడపటియధ్యాయమును రెండుగా విభజించుటచే ముప్పదియే డధ్యాయము లన్నప్రతీతి వచ్చినది. ఇందలి యిరువదియెనిమిదవయధ్యాయము మొదలుగా నేడధ్యాయములు సప్తస్వరగాత్రగానతంత్రీగానాదులను విశదీకరించుటంబట్టి యిది గాంధర్వవేదమును గొంత సంగ్రహించుకొన్న దనవలసియున్నది, రూపకప్రదర్శనవిధులకు తొల్లి దీనిమాట శాసనము. దేశకాలములనుబట్టి రుచి మాఱినను నేటికిని రూపకములందును రంగస్థలములందును దీనిప్రభావము గోచరించుచునేయున్నది. అర్వాచీనము లైనవివిధసాహిత్యలక్షణముల కిది మార్గదర్శకమనెడి యొక్కమాట దీనిఘనతకు చాలును. ఇఁక నితనినివాసప్రదేశమునుగూర్చి యొకింత.

ప్రాచీనకవులలో తమ జన్మనివాసాదిక విషయములను తెలుపుకొన్నవారు లేరనియే చెప్పవచ్చును. అందుచేతనే పరిశోధకులు వారి కృతులలోనిమాటలను ఇతరులమాటలను పురస్కరించుకొని యావిషయములను గుడికి బారెడెచ్చుతక్కువగా నిర్ణయించుచు వచ్చుచున్నారు కాని,మనభరతాచార్యుఁ డెచ్చటివాఁ డన్నవిషయము నెవ్వరును చర్చించినట్లు నాకు కనఁబడలేదు. ఇంతకు మున్ను నేను నీమాట యెత్తలేదు. ఇపుడు మరల నాట్యశాస్త్రప్రథమాధ్యాయము చదువుచుండ నాకిట్లు తోఁచినది-

"బ్రహ్మ, నాలుగువేదముల సారముగ్రహించి నాట్యవేదము నిర్మించి, "నీవు నీనూఱుగురు కొడుకులతో కలసి దీనిని ప్రయోగించు" మని దానిని తన కిచ్చినట్లును, "ఇది ప్రయోగమునకు మంచిసమయము మహేంద్రపర్వతముపై జరుగు విజయోత్సవమునందు దీనిని ప్రయోగింపుము" అని శాసించినట్లు నీతఁడు వ్రాసికొన్నమాటలలో గ్రంథమహత్త్వప్రశంస మిన్నంటినమాట నిజమే కాని, ఇందలిమహేంద్రపర్వతముమాత్రము లేనిది కాదు. నాట్యవేదప్రయోగమున కింతకంటె సమర్థములైన వింధ్యాదిమహాద్రు లెన్నో యుండఁగా, ఆబ్రహ్మకు మహేంద్రగిరిమాత్రమే యెందుకు గోచరించినది? దీనినిబట్టి చూడఁగా మనభరతాచార్యుఁడు మహేంద్రపర్వతప్రాంతమందలి యొకగ్రామమున నివసించినవాఁ డని తోఁచుచున్నది. ఇది త్రిలింగదేశమునకు తూర్పు సరిహద్దుగా నున్నదన్న పురాణభాషాలక్షణాదులమాటలు విశ్వసనీయములగును.

ఇది గంజాముమండలములోనిది. ఆబ్రహ్మ చెప్పినమహేంద్రపర్వత మిదే యని భారతము కూడా సాక్ష్యమిచ్చుచున్నది[1]. విజయుఁడు

---

1. స కళింగా నతిక్రమ్య దేశా నాయతనాని చ,
మహేంద్రపర్వతం దృష్ట్వా తాపసై రుపశోభితామ్,
సముద్రతీరేణ శనై ర్మణిపూరం జగామహ-భార ఆది. ౨౧౪ అధ్యా.

తీర్థయాత్ర చేయుచు కళింగదేశమును దాఁటి మునీంద్రులతపోభూమి యైనమహేంద్రపర్వతముమీఁదికి వచ్చెనఁట. అందు విజయోత్సవ మానాఁడే ప్రారంభ మైన దేమో!—ఎట్లయిన మనముని ఉత్కలాంధ్రదేశములసరిహద్దులలోనివాఁడని మాత్రము దీనినిబట్టి విశ్వసింతము. లోకప్రసిద్ధుఁ డైనకుమారిలభట్టుకూడా, ఆంధ్రోత్కలసంయోగభూమియందలిజయమంగళగ్రామమునజన్మించినవాఁడు గనుక, ఆపావనభూమికి లోకోత్తరవిద్వాంసులను ప్రసవించెడియాచార మనాదిగా నున్నదే యనియు స్మరించి సంతోషింతము—ఇతఁడు—

"విభావానుభావవ్యభిచారిసంయోగా ద్రసనిష్పత్తిః"

అని రసనిర్వచనముగావించి,రసభావసంబంధము నీక్రిందివిధముగా నిరూపించి యున్నాఁడు:

"యథా బీజా ద్భవే ద్వృక్షః,వృక్షా త్పుష్పం ఫలం యథా
తథామూలం రసా స్సర్వే తేషు భావా వ్యవస్థితాః
న భావహీనో ఽస్తి రసః, న భావో భావవర్జితః"

—o—

# గుణాఢ్యుఁడు

ఇతఁడు ప్రాకృతభాషాకవి యయ్యును సంస్కృతకవులకు వంద్యుఁ డైనకథాకావ్యసృష్టికర్త యగుటచే నిందు ప్రవేశించెను. భట్టబాణుఁ డితని బృహత్కథ నిట్లు నుతించెను:—

"సముద్దీపితకందర్పా కృతగౌరీప్రసాధనా,
హరలీలేవ నో కస్య విస్మయాయ బృహత్కథా"

దండిమహాకవి యిట్లు ప్రశంసించెను—

"భూతభాషామయీం ప్రాహు రద్భుతార్థాం బృహత్కథాం."

ధనంజయుఁడు దశరూపకమున నిట్లు గణించెను—

"ఇత్యాద్యశేష మిహా వస్తు విభేదజాతం,
రామాయణాదిచ విభావ్య బృహత్కథాంచ,
దానివ్యాఖ్యలో ధనికుఁ డిట్లనెను—
"తత్ర బృహత్కథామూలం ముద్రారాక్షసం"
వాసవదత్తలో సుబంధుఁడు దీని నిట్లు పేర్కొనెను.
"బృహత్కథాలంబైరివ సాలభంజికానివహైః"
కాళిదాసు దీనిప్రశస్తి నిట్లు స్మరించెను.
"ప్రాప్యావన్తీ ముదయనకథాకోవిదగ్రామవృద్ధాన్."

భాసమహాకవినిర్మిత ప్రతిజ్ఞా యౌగంధరాయణస్వప్నవాసవదత్త రూపకములలోనియితివృత్తము బృహత్కథలోని దగుట విదితము.

వీటినిబట్టి బృహత్కథప్రాశస్త్యము ప్రాచీనత్వము విదిత మగుచున్నను, పరిశోధకుల దృష్టిలో నితనికాలనివాసములు సందిగ్ధములే యైనవి. అవి తెలిసికొనుటకు ముందు కొంత:—

కాశ్మీరదేశమందును నేపాలదేశమందును గుణాఢ్యునిగూర్చియు నితని బృహత్కథోత్పత్తిని గూర్చియు మహిమాపాదకము లైన కథలు వ్యాపించి యున్నవి. మహామాహేశ్వరజయద్రథ విరచితమైన హరచరిత చింతామణి యిరువదియేడవ ప్రకాశమునందు గుణాఢ్యుని జీవిత మిట్లు వర్ణింపఁబడినది.

"అపూర్వవిచిత్రకథాశ్రవణకుతూహల యైనపార్వతికి శివుఁడు రహస్యముగా సప్తవిద్యాధరచక్రవర్తులకు సంబంధించినకథలు చెప్పుచుం చుండెను. అపుడు వారిభక్తుఁ డగుపుష్పదంతుఁడు తుమ్మెదయై యచ్చోటు చొచ్చి యాకథలు విని యీవలికి వచ్చి నిజరూపముతో నింటి కేగి తనప్రియురాలైనజయ కాకథలు వినిపించెను. తరువాత నొకనాఁడు దుర్గాదేవి చెలికత్తెల కాక్రొత్త కథలు వినుపించుచు, నంత కుముున్నే యవి జయకు తెలియుట యెఱిఁగి పుష్పదంతుని రావించి

నీవు మర్త్యుఁడవై పుట్టుమని శపించి, యతనిప్రాణమిత్రుఁడగు మాల్యవంతునిగూడ నట్లే శపించెను. అపుడు జయ గౌరీదేవిపాదములపై పడి క్షమింపు మని ప్రార్థింప, "కుబేరశాపహతుఁడైన సుప్రతీకుఁడు వింధ్యాటవిలో కాణభూతి యనుపేర తిరుగుచున్నాఁడు. వానికి నీప్రియుఁ డీకథలు చెప్పి శాపవిముక్తుఁ డగును. వానివల్ల నీకథలు విని మాల్యవంతుఁడు శాపవిముక్తుఁ డగును" అని యనుగ్రహించెను.

మాల్యవంతుఁడు భూలోకమున గుణాఢ్యుఁడై పుట్టి విద్య లభ్యసించి సుప్రతిష్ఠితదేశము పాలించు సా(శా)తవాహనునిమంత్రియై కొంతకాలముండి పిదప మౌన మవలంబించి వింధ్యాటవికి వచ్చి యక్కడ క్రొత్తగా వినవచ్చిన పిశాచభాష నభ్యసించుచున్నంతలో కాణభూతి కనవచ్చి యాకథలు చెప్పెను. గుణాఢ్యుఁ డాకథలు విని పరవశుఁడై యానందముతో వాని నపుడే పిశాచభాషలో నేడులక్షలగ్రంథముగా భూర్జపత్రములపై తనరక్తముతో లిఖించి దానికి బృహత్కథ యను పేరు పెట్టి దేశమున వ్యాపింపఁ జేయునన్నతలంపుతో నొక యాటవికుని చేతి కిచ్చి సాతవాహనునికి పంపెను. మదమత్తుఁడైనయారాజాపత్రము లందుకొని ఛీయని విసరివేసెను. వాఁ డాపత్రము లేరి తీసికొనివచ్చి కవి కిచ్చి జరిగినసంగతి తెలిపెను. అందు కితఁడు విచారించి యాగ్రంథ మొక్కొక్కపత్రము చదువుచు నగ్నిలో హోమము చేయఁజొచ్చెను. ఈ సంగతి విని రాజు తెలివి తెచ్చుకొని వచ్చి కాల్చవద్దని వేఁడుకొనెను. అపు డితఁ డాఱుకథల గ్రంథము హుతమైనది. నరవాహనదత్తునికథతోడి లక్షగ్రంథము శేషించి యున్నది కొనుమ్మని రాజున కిచ్చెను. రాజు సంతుష్టుఁడై యింటి కేగెను. గుణాఢ్యుఁ డనఁబడుమాల్యవంతుఁడు శాపవిముక్తుఁడై కైలాసమున కేగెను. ఆకథలువిన్నపిశాచములు దివ్యత్వము చెందెను.

ఇట్టికథలనుబట్టియే పైశాచీప్రాకృతములోని బృహత్కథను బృహత్కథామంజరి యనుపేర సంస్కృతీకరించిన క్షేమేంద్రుఁడు గోదావరీతీర

మండలి ప్రతిష్ఠానగరము గుణాఢ్యునిజన్మస్థల మని వ్రాసెను. దానిని కథాసరిత్సాగర మనుపేర సంస్కృతమున కనువదించిన సోమదేవభట్టు కూడా, ప్రతిష్ఠానరాజ్యరాజధాని యగుసుప్రతిష్ఠపుర మితనిజన్మభూమి యున్నాడు. ఆపుర మేలెడిసాతవాహనుఁడాంధ్రరాజవంశములోనివాఁడు, అరిష్ట శాతకర్ణిపుత్రుఁడు హాలుఁ డనునామాంతరము గలవాఁడు ననియు, అతఁడు క్రీ. పూ. ౪౯౦ ప్రాంతమున నున్నవాఁ డనికొందఱు భావించిరి. గుణాఢ్యునినాఁటి శాతవాహనుఁడే శాలివాహనుఁ డనియు, అతఁడే క్రీ.శ. ౭౮ లో శక మారంభించినవాఁ డనియు మఱికొంద ఱూహించిరి. ఇఁకఁ గొందఱు కొంద ఱీకవిని క్రీ. శ. ౧, ౨, ౩, ౪, శతాబ్దులలో చేర్చుచు వచ్చిరి. మఱికొంద ఱీకవి మధురలో జన్మించి యుజ్జయినిలో పెరిగె నని తలంచిరి. ఈవిధముగా నితనికాలనివాసములు సందిగ్ధములైనవి.

ఎందఱో మహాకవులనుగూర్చి యద్భుతకథ లుత్పత్తిల్లె నని మన మెఱిఁగియే యున్నాము. పూర్వోక్తకథనుబట్టి యితఁడు వింధ్య పర్వతప్రాంతమువాఁ డనమా? నేపాలమాహాత్మ్యమునుబట్టి హిమా లయప్రాంతమువాఁ డనమా? కాశ్మీరకథనుబట్టి కాశ్మీరీయుఁ డనమా? ఈకథ లన్నిటివల్లఁ దెలియదగినవి రెండే యంశములు. ఇతఁడు శివ భక్తుఁడు బృహత్కథ పైశాచీప్రాకృతమున రచియింపఁబడినది. తక్కినవి పరిశోధకులయూహలచేఁ బ్రతిహతములే యగుచున్నవి. కావునమనము నిట్లూహింతము.

భాసకాళిదాసు లైతిహాసకసంప్రదాయమున వత్సరాజుకథలు విన్నవా రనుటకంటె నప్పటి కుత్తరహిందూదేశమున మెల్లగావ్యాపిం చుచున్న గుణాఢ్యునిబృహత్కథ చూచి యున్నవా రనుటయే సము చితము. అవంతీపురమందలిపెద్ద లుదయనకథాకోవిదు లని సవిశేష ముగా కాళిదాసు ప్రసక్తి కలిగించుకొని చెప్పుటయే యిందుకు తార్కా ణము. మందాక్రాన్తావృత్తములో బృహత్కథాశబ్ద మిముడక పోవు

టచే నుదయనకథాశబ్దము వాడెను గాని లేకున్న దానినే వాడియుండును. బృహత్కథవలె కవిపేరు తనతో మఱుగుపుచ్చిన కావ్య మింకొకటి లేదు. సారస్వతములోని స్తుతివాక్యము లన్నియు బృహత్కథనే పేర్కొన్నవిగాని గుణాఢ్యుని పేరెత్త లేదుగదా! ఈ హేతువులనుబట్టి వారిద్దఱికిని పూర్వుఁడైన గుణాఢ్యుఁడు శా. శ. పూర్వము ౨౫౦ ప్రాంతము వాఁడై యుండు ననియు, ఉజ్జయినీప్రాంతమున జన్మించి యున్నవాఁడనియు ప్రస్తుతము భావితము.

బృహత్కథను పూర్వోక్తు లగువిద్దఱు గాక బుధస్వామి యను మఱియొకకవి బృహత్కథాశ్లోకసంగ్రహ మనుపేర ననువదించి యున్నాఁడు. వారిరెంటికంటె నిదే మొదటి దనియు, దీనికి నేపాలదేశమందలి పైశాచీప్రాకృతలిఖితపుస్తకము మాతృక యనియు తెలియుచున్నది. ఆద్యబృహత్కథ, శా.శ. ౧౩శతాబ్దివఱకును సజీవమై యున్నట్లు ధనంజయాదులప్రశంసలవల్లనే విదితమగుచున్నది. అయినను, గుణాఢ్యునికీర్తి నినుమడింపఁజేసినది కథాసరిత్సాగర మనుట నిజము. కథాకావ్యము లెన్నేని వెలసెను గాక. వానికి తల్లి బృహత్కథ. అట్టి కృతి రచియించిన గుణాఢ్యుఁడు మహామాన్యుఁడు.

---

## చంద్రకుఁడు

ఈకవి కాశ్మీరపాలకుఁడైనతుంజీనునిసభలోనివాఁడు, సర్వజనప్రేక్ష్య మైననాట్యము రచియించినవాఁడు, కృష్ణద్వైపాయనునియంశ మని ఖ్యాతి కెక్కినవాఁడు[1].

1. అథ వాక్పుష్టయా సార్థం దేవ్యా దివ్యప్రభావయా।
భువం తత్ప్రభవో భుంజన్ తుంజీనో ఽ రంజయత్ ప్రజాః...
నాట్యం సర్వజనప్రేక్ష్యం,యశ్చక్రే స మహాకవిః।
ద్వైపాయనమునే రంశ, స్తత్కాలే చంద్రకో ఽ భవత్,రాజత. ౨.

ఈతుంజీనుఁడు, శా. ౨౮౦లోనివాఁ డని కనింగుహాముశా. ౨౫౯నాటివాఁ డని పెక్కండ్రు. ఇం దేది నమ్మఁదగును? రాజతరంగిణినిబట్టి విమయము పరిశీలింతము. ఈచెప్పఁబోవునది మాతృగుప్తుని కాశ్మీరరాజుగా నియమించిన యుజ్జయినీ రాజగు శ్రీహర్షవిక్రమాదిత్యుని కాలమునకు సంబంధించి యుండును[2].

తుంజీనులు ముగ్గు రున్నారు. తృతీయగోనందుఁడు మొదలుగా నిరువదిమంది రాజ్యము చేసినపిదప నరేంద్రునికొడు కైన అంధయుధిష్ఠిరుఁడు రా జయ్యెను. కన్నులు మిక్కిలిచిన్న వగుటచే నతని కాపేరు వచ్చెను గాని, గ్రుడ్డివాఁడు కాఁడు-అతఁడు దుర్మార్గుఁ డగుటచే మంత్రులతనిని రాజ్యభ్రష్టుని చేసి దేశాంతరమునుండి(ఉజ్జయినియె కావచ్చును) విక్రమాదిత్యుని జ్ఞాతి యైనప్రతాపాదిత్యుని తీసికొనివచ్చి మూర్ధాభిషిక్తుని గావించిరి. అప్పటికి తృతీయగోనందాదుల రాజ్యకాలము తొమ్మిదికోజులెక్కువగా ౧౦౧౪ వర్షములు. ప్రతాపాదిత్యుఁడు, అతనికొడుకు జతౌకసుడును, ౬౪ఏండ్లు రాజ్యము చేసినపిదప, మనుమఁడు రాజయ్యెను. అతఁడే మొదటి తుంజీనుఁడు. ఆ సమయము శా. శక పూర్వము౧౦౨అగుచున్నది. వాక్పుష్టాభ ర్తయైన యీతుంజీనుని సభలోనే మనచంద్రక కవి యున్నాడనుటనిశ్చయమేకాని, రాజతరంగిణి చూపినరాజులకాలములను బట్టియీసమయమింకను సందిగ్ధమగునేమో! మాతృగుప్తజీవితమందా విషయము చర్చకువచ్చును.

సర్వజనప్రేక్ష్య మైనయితనినాట్య మొకవిధ మైనరూపకమై యుండును. కాని, దానిని జూచుభాగ్యము నేటివారికి లేదు. క్షేమేంద్రధనికాదులనాటి కదిసుఖముగా నున్న దేమో యని వా రుదాహరించుకొన్నశ్లోకములనుబట్టి యనుకోవచ్చును. ఈక్రింది రెండుశ్లోకము లౌచిత్యవిచారచర్చలో నితనిపేర నున్నవి.

---

౨. రాజత. ౧. ౩౪౬-౩౬౫-౨. ౫-౧౬-౩. ౯౭-౨౬౪.

"యుద్ధేషు భాగ్యచపలేషు న మే ప్రతిజ్ఞా,
దైవం నియచ్ఛతి జయంచ పరాజయంచ,
ఏ షైవ మే రణగతస్య సదా ప్రతిజ్ఞా,
పశ్యన్తి య న్న రిపవో జఘనం హయానాం."

ఈశూరుని ప్రతిజ్ఞావచనము శ్లాఘనీయము. మఱి—

"కృశః కాణః ఖంజః శ్రవణరహితః పుచ్ఛవికలః
క్షుధాక్షామో జీర్ణః పిఠరకకపాలార్పితగళః
వ్రణైః పూతిక్లిన్నైః కృమిపరివృతై రావృతతనుః
శునీ మన్వేతి శ్వా త మపి మదయ త్యేవ మదనః."

ఎట్టిదురవస్థలోనున్నను ప్రాణులను కామవికారము కలఁతపెట్టు ననుటకు దృష్టాంతముగా వికలాంగశునకావస్థయందు వర్ణితమైనది.

దశరూపకవ్యాఖ్యలో ధనికుఁడు, రతిశోకక్రోధములు మూఁడును ముఖ్యములై యొక్కమాఱు స్ఫురించుచున్నను స్థాయియొకటే యనుట కుదాహరించిన యీశ్లోక మిది:—

"ఏకే నాక్ష్ణా ప్రవితతరుషా వీక్షతే వ్యోమసంస్థం,
భానోర్బింబం సజలలులితే నాపరే ణాత్మకాన్తమ్,
అహ్న శ్ఛేదే దయితవిరహాశంకినీ చక్రవాకీ
ద్వౌ సంకీర్ణౌ రచయతి రసౌ నర్తకీవ ప్రగల్భా."

—o—

## భాసుఁడు

"భాషాసు రమ్యా గైర్వాణీ, తస్యాం కావ్యం మనోహరమ్,
తత్రాపి రూపకం రమ్యం, తత్ర భాసకవేః కృతిః"

అనెడి యుత్తమఖ్యాతి గాంచిన యీమహాకవి దృశ్యకావ్యకర్తలలో నాద్యుఁడు. వాల్మీకి మొదలగుమహాత్ములంబోలె నితనినిగూడ కొన్నికట్టుకథలు పట్టుకొని యున్నవి. ముందువాటిని వదల్చుకొందము.

"రత్నావళీప్రియదర్శికానాగానందములు. శ్రీహర్షుఁడునిర్మించి నవి కావు. ధావకుఁ డనునామాంతరము గలభాసుఁడు రచియించి యా రాజు పేరుపెట్టెను" అని తెల్పుకథ యిది.

"ఒకనాఁడు శ్రీహర్షవిక్రముఁడు వేఁటనుండి తిరిగివచ్చుచుండ దారిప్రక్క బట్ట లారవైచి చెట్టునీడను గూర్చుండి గంటముతో తాటా కులమీఁద వ్రాయుచున్నయొకచాకలి కనఁబడెను. రా జది చూచి యచ్చెరువడి, యేమి వ్రాయుచున్నా వని యడుగ, నాగానందము వ్రాయుచున్నా నని వాఁడు బదులుచెప్పెను. రాజు, వింతపడి వానిచే రెండుశ్లోకములు చదివించి యానందపరవశుఁడై తనకోటకు గొనిపోయి గౌరవించి నీ విప్పటికి నిర్మించిన రూపకములు నాపేరఁ బ్రకటింపు మని కోరెను. ఆరజకుఁడును సూత్రధారకృతారంభములు శ్రీహర్షనిర్మితము లుగా ప్రస్తావనలు రచియించి యామూఁడురూపకములు రాజునకిచ్చెను. సూత్రధారకృతారంభత్వమును భట్టబాణుఁడు తనహర్షచరిత్రలో నిట్లు వర్ణించెను.

"సూత్రధారకృతారంభై ర్నాటకై ర్బహుభూమికైః,
సపతాకై ర్యశో లేభేభాసో దేవకులైరివ"

పైకథ యంతయు నభూతకల్పన మని నేఁటిపాఠకులు భావింపక పోరు. దీనిని విమర్శింపనేల? మఱి యొకటి.

ఈధావకుఁ డనుభాసుఁడే యమకకావ్య మొకటి రచియించి యమకకవితలో నన్నెవ రోడింతురో వారి యింటికి కుండపెంకుతో నీళ్ళు మోయుదు నని యిట్లుప్రతిజ్ఞ చేసెనఁట.

"ఆలంబ్య చాంబు తృషితః కరకోశపేయం,
భావానురక్తవనితాసురతై శ్శపేయం,
జీయేత యేన కవినా యమకైః పరేణ,
తస్మై వహేయ ముదకం ఘటకర్పరేణ"

ఈశపథము విన్నకవు లోర్వలేక యితనికి ఘటకర్పరుఁ డనుపేరు పెట్టి రఁట. అది యిట్లు శ్లోకబద్ధ మైనది.

"...శ్రమ త్యేతిభాసకవిసోక్త మమృష్యమాణాః
ప్రాహు స్త మన్యకవయో ఘటకర్పరాఖ్యమ్"

ఈకథకు తగినట్లు ఘటకర్పరకావ్య మని యొకసర్గముద్రిత మైనది కనవచ్చుచున్నది గాని, అది మహభాసుఁడు నిర్మించిన దని యెవ రందురు? ఇంతకును భాసుఁడు యమకప్రియుఁడు కాఁడు గదా!— ఈధావకభాసుఁడే యిరువదినాలుగురూపకములు నిర్మించినట్లు తనయుదాత్తరాఘవప్రస్తావనలో నిట్లు చెప్పుకొనె నఁట.

"ధావకాపరనామాఽయం భాసో భాసయతే జగత్,
తత్త్వే రి వాదిపురుషై శ్చతుర్వింశతిరూపకైః"

ఈవిధముగా భాసుని కల్పితనామాంతరములు చాటుశ్లోకముల కెక్కి లోకమున వ్యాపించుటయే కాదు, రాజశేఖరకవి యాంధ్రప్రబంధములలో నొకటి యగుకవివిమర్శనములోనివని కర్పూరమంజరీ టీకాదులలో దుర్గాప్రసాద పండితాదులు చూపిన శ్లోకములును దేశమున వ్యాపించినవి.

"ఆద్యా భాసేనా రచితా నాటికా ప్రియదర్శికా,
నిరీక్ష్యస్య రసజ్ఞస్య కస్య న ప్రియదర్శనా.
తస్య రత్నావళీ నూనం రత్నమాలేవ రాజతే,
దశరూపకకామిన్యా వక్షస్యత్యన్తశోభనా.
నాగానందం సమాలోక్య యస్య శ్రీహర్షవిక్రమః
అమందానందభరిత స్స్వసభ్య మకరోత్కవిమ్.
ఉదాత్తరాఘవం నూన ముదాత్తరసగుంభితం,
య ద్వీక్ష్య భవభూత్యాద్యాః ప్రణిన్యు ర్నాటకానివై.
భాసనాటకచక్రేఽపి ఛేకైః క్షిప్తే పరీక్షితుం
స్వప్నవాసవదత్తస్య దాహకో ఽభూ న్నపావకః"

ఆకవివిమర్శ మెక్కడను కనఁబడదు. ఈశ్లోకములు రాజశేఖరుని వనుటకు తగినప్రమాణము లభింపదు. ఇట్టిశ్లోకములలో నొకటియు నతని యితరకృతులలో కనరాదు. అయినను కింవదంతిప్రబలినది. ఇట్లే భాసుని పేళ్లన్నియు గుదిగ్రుచ్చినచాటుశ్లోకములు మఱిరెం డిట్లున్నవి:—

"శ్రీహర్షవిక్రమార్కస్య సభాయాం శుశుభే చ సః,
నవరత్నేష్వన్యతమో ఘటకర్పరనామతః,
"స జయతి కవికులతిలకో, భాసకవి ర్ధావకాన్యనామా ఽయం,
సహృదయహృదయాహ్లాదీ ఘటకర్పరనామతః ఖ్యాతః"

పైకథలు విన్నమఱియొకయర్వాచీనుఁ డెవఁడో యీశ్లోకములు కల్పించినట్లు వీనిరీతియే తెల్పుచున్నదిగదా !— ఇంకొకచిత్రకథ:— ఘటకర్పరునిపేర నీతిసార మనుచిన్నకావ్య మున్నది. అతఁడే ధావకుఁడు అతఁడే భాసుఁ డన్నకింవదంతి బాగా యున్నది. ధావకుఁడు శ్రీహర్షునికి తనకృతు లమ్ముకొని ధనమార్జించినవాఁ డన్నప్రతీతి "శ్రీహర్షాదే ర్ధావకాదీనా ధన" మ్మనురీతిని గ్రంథాలకు కూడా యెక్కినది. కాళిదాసఘటకర్పరు లొకచోటనే విక్రమసభలోనున్నా రన్నమాట యున్నది. సమకాలికులకు స్పర్థలుంటుట నైజము. అందుచే దరిద్రుఁడై కృతులమ్ముకొన్నయితనిమీద కాళిదాసున కసూయ పుట్టిన దఁట. ఆవిషయ మెఱిఁగినయితఁ డతనికుమారసంభవములోని:—

"అనంతరత్నప్రభవస్య యస్య హిమం న సౌభాగ్యవిలోపి జాతం,
ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జ తీందోః కిరణే ష్వివాంకః,

అను శ్లోకమందలి యుత్తరార్ధ మెత్తుకొని—

"ఏకోహి దోషోగుణసన్నిపాతే నిమజ్జ తీందోః కిరణే ష్వివాంకః
నూనం నదృష్టం కవినాపి తేన దారిద్ర్యదోషో గుణరాశినాశీ."

అని యధిక్షేపించుచు నీతిసారములో వ్రాసె నఁట. "నిజముగా పెక్కుగుణములలో నొకచిన్నదోష మణఁగిపోవునన్నవిశ్వాసమే యీ

కవి కున్నచో, దారిద్ర్యదోషమొకటే కారణముగా నన్నితఁ డవమా నించునా? నాతక్కిన గుణములలో నాకేమి యనెడిదోష మణఁగిపోయి నట్లు భావింపలేనివాఁ డెట్లీమాట చెప్పెను?" అని యధిక్షేపమఁట, ఇట్టి పుక్కిటిపురాణకథలను తొల్లి వింతగా వినెడివారేమో కాని, యిపు డెవరు నమ్మెదురు?

ప్రసిద్ధకాళిదాసున కారోపింపఁబడినజ్యోతిర్విదాభరణ మెవ రెపుడు నిర్మించిరో అందలి:—

"ధన్వంతరిః క్షపణ కామరసింహ శంకు, వేతాలభట్ట ఘటకర్పర-
కాళిదాసాః, ఖ్యాతో వరాహమిహిరో నృపతే స్సభాయాం,
రత్నాని వై వరరుచి ర్నవ విక్రమస్య."

అనుశ్లోకమునుబట్టి యీ తొమ్మండుగురు విక్రమాదిత్యుని సభలో నొకకాలమున నున్నవా రన్నమూఢవిశ్వాస మేనాఁడు ప్రబలి నదో! ఆనాఁడే యిట్టికట్టుకథలు కాళ్ళు లేక నడవఁజొచ్చినవి. ఆనవ కవులు వేఱువేఱుకాలములలోనివా రన్నసత్యము బయటఁబడినంత నవి యన్నియు మటుమాయ మైనవి. అందుచే భాసుఁడు భాసుఁడే కాని, ధావకుఁడు కాఁడు ఘటకర్పరుఁడు కాఁ డన్ననిజమును విదిత మైనది.

## భాసుని దేశ కాలములు

ఇతఁడు కేరళదేశీయుఁ డని యొకరి వ్రద్ధ ఉన్న నేమి? ఉజ్జయినీ ప్రాంతమువాఁ డన్నభావమే సముచితముగాఁ గనవచ్చును—ఇతనికా లము నెందఱో చర్చించి తమయభిప్రాయములు ప్రకటించి యున్నారు. వాని నెల్ల నిందు క్రోడీకరించుట యనావశ్యకము—భాసుఁడు గుణా ఢ్యునికంటె పరుఁ డనుట నిర్వివాదము-అట్లే కాళిదాసుకంటె పూర్వుఁ డనుటయు, కాని, కాళిదాసకాలమును క్రిందికి దిగఁదీసినవారిమతము లనుబట్టి యితనికాలమును కొందఱియభిప్రాయమున సందిగ్ధ మైనది. అయినా కాళిదాసు క్రీ. పూ. ౫౭ లోనివాఁ డన్నవారు లెక్కవగా

మున్నారు. ఆయూశయము యుక్తమే యని ముందు తెలియఁగలదు. కావున నీమహాకవి శా. పూర్వము ౨౦౦ ప్రాంతమువాఁడగు నని విశ్వసింతము-కాని, యిచ్చట నొకింత:—

ఇతనిరూపకములలో భరతవాక్యములుగా "రాజసింహః ప్రశాస్తు నః-రాజా భూమిం ప్రశాస్తు నః-గాం పాతు నో నరపతిః-తథా ప్రభు ర్నో భగవా నుపేంద్రః-అనెడివాక్యము లున్నవి. కొందఱు మొదటి వాక్యములోని రాజసింహశబ్దమును క్రీ. ౧౫౦ ప్రాంతమం దున్నక్షత్రప రుద్రసింహున కన్వయించి యితనికాలమును దిగఁదీయుచున్నించిరి గాని, అది సాహస మనక తప్పదు. పైవాక్యములలో కడపటిది శ్రీకృష్ణపరము. తక్కిన వన్నియు రాజపరములు. రాజసింహుఁ డనఁగా రాజశ్రేష్ఠుఁ డని యర్థము. గాని ఆపేరు గలపరిపాలకుఁడు కాఁ డని మిగిలినరాజ శబ్దములే తెలుపుచున్నవి. ఇవి, "స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః" అనుదానివంటిస్వస్తివచనము లనుట విదితము. రాజసింహుఁ డనెడియొకరాజును ప్రశంసించుటయే భాసునియుద్దేశ మైతే, ఇన్నిరూపకములలో న తెక్కడ నైనన తనిని పరిశంసించి యుండఁడా? కావున నిట్టియూహలను విడిచి మనయీకవి పూర్వోక్తకాలమం దున్నవాఁ డని నమ్ముటయే సముచితము.

## భా స క వి త్వ వ్యా ప్తి

కాలకర్మవశమున నితనిరూపకములు తరువాత మఱుఁగుపడి పోయి మొన్నమొన్న ముద్రితము లైనవి గాని, అయిదువందలయేండ్ల క్రిందటివఱకు నివి భరతఖండమునలుగడల వ్యాపించి పూర్వకవిలాకుణి కులస్తుతు లందినవే యని యీక్రిందివచనములఁ దెలియఁగలదు.

"ప్రథితయశసాం భాససౌమిల్లకవిపుత్రాదీనా" మనుచు మొదట నీమహాభాస కాళిదాసుమాలవికాగ్ని ప్రస్తావనలోఁ గనవచ్చుచున్నది-

ఇతని బాలచరిత చారుదత్తములలోని "విస్మృతీవతమోఽఙ్గానీత్యాది

శ్లోకములను దండి కావ్యాదర్శములో సగౌరవముగా నుదాహరించు కొన్నాఁడు— ప్రతిజ్ఞా యౌగంధరాయణ స్వప్నవాసవదత్తములలోని "నవంశరావ" మిత్యాదిశ్లోకపాదమును, "శరచ్ఛశాంకగౌరేణ" త్యాది శ్లోకమును వామనాచార్యుఁడు కావ్యాలంకారసూత్రవృత్తిలో నలంకరించుకొన్నాఁడు. భోజుఁడు శారదాతనయుఁడు అభినవగుప్తుఁడు సర్వానందుఁడు సాగరనంది మొదలగువా రెందఱో యితనిస్వప్నవాసవదత్తను స్మరించియున్నారు. హేమచంద్రశిష్యులు రామచంద్రగుణచంద్రులు భాసునిదే కీర్తి స్వప్నవాసవదత్తలోనిదని యీక్రిందిశ్లోకమును తమ నాట్యదర్పణమున నుదాహరించియున్నారు. ఇది నేఁటిముద్రితనాటకములోఁ గనరాకున్నది గాని, యిది యందలిదే యనుట విశ్వసనీయమే.

"పాదాక్రాన్తాని పుష్పాణి సోష్మ చేదం శిలాతలమ్,
నూనం కాచి దిహాసీనా మాం దృష్ట్వా సహసాగతా"

ఇట్లే ధ్వన్యాలోకవ్యాఖ్యలో నభినవగుప్తాచార్యుఁ డుదాహరించుకొన్నయీక్రిందిశ్లోకము నేఁటిస్వప్నవాసవదత్తలోఁ గనరాదు.

"సంచితపక్ష్మకవాటం నయనద్వారం స్వరూపతాడేన,
ఉద్ఘాట్య సా ప్రవిష్టా హృదయగృహం మే నృపతనూజా"

మఱియు, భామహుఁడు ప్రతిజ్ఞలోని కపటగజవృత్తాంతమును తనకావ్యాలంకారమునందు న్యాయవిరోధమునకు నుదాహరించుట కూడా యితనిరూపకము లానాఁడు పఠనపాఠవ్యవహారమున వ్యాప్తి గాంచిన వనుటకు నిదర్శనమే. ఇంక, కవులు గావించిన భాసకవిస్తుతు లందుమా అవి యెన్నో! అందు ప్రసన్నరాఘవములో జయదేవుఁడుగావించినస్తుతి యిది:—

"భాసో హాసః కవికులగురుః కాళిదాసో విలాసః,
కేషాం నైషా కథయ కవితాకామినీ కౌతుకాయ?"

## ఇతని వైదుష్యాదికము

లోకజ్ఞుడు ప్రతిభామూర్తియు నైనభాసుఁడు వేదవేదాంగపారీణుఁడు, సదాచారసంపన్నుఁడు నీత్యర్థధర్మశాస్త్రపారదృశ్వ యని యితని రూపకములలోనిపెక్కుసందర్భములు విశదీకరించుచున్నవి. విశేషించిప్రతిమలో రావణునినోటఁ బలికించిన "వేద మధీయే సాంగోపాంగం-మానవీయం ధర్మశాస్త్రం మాహేశ్వరం యోగశాస్త్రం బార్హస్పత్య మర్థశాస్త్రమ్"ఇత్యాదివాక్యములు చాటుచున్నవి. వస్తుపాత్రరసపోషణమున నౌచిత్యపారము నందిన యితని వివిధరూపకములును దృశ్యకావ్యరచనమునఁగవులకు లక్షణగ్రంథములకంటె నెక్కువప్రమాణ మనఁదగియున్నవనుటకంటె నితనికవిత్వమహత్త్వమును వేఱుగా వర్ణింపఁజాలము. మధుమయఫణితికి వాల్మీకియట్లు దానికిని సామాజికహృదయంగమదృశ్యకావ్యచాతురికి నితఁడు మార్గదర్శి యని యనఁదగును.

## ఇతనికృతులు

ఇతఁ డిరువదినాలుగురూపకములు నిర్మించె నన్నప్రతీతి హెచ్చుగా నున్నమాట నిజమే కాని, ఇప్పటికి లభించినవి పదుమూఁడు మాత్రమే. వీటిలో కొన్ని యితనివి కావనెడివాదముకూడ లేకపోలేదు గాని, గ్రంథప్రకాశకులును విమర్శకులు నీపదుమూఁడు నితనివే యని విశ్వసించి యున్నారు. సవిమర్శముగా వీనినిపఠించిన నేనుగూడ నీయభిప్రాయము స్థిరపఱుచుకొనియే వీటిని భాసనాటకథలను పేర వచనముగా తెలుఁగున కనువదించియున్నాను. ఆపదుమూఁడు నివి:—స్వప్నవాసవదత్తము ప్రతిజ్ఞాయౌగంధరాయణము ప్రతిమ అభిషేకము చారుదత్తము అవిమారకము బాలచరితము మధ్యమవ్యాయోగము పంచరాత్రము దూతవాక్యము దూతఘటోత్కచము కర్ణభారము ఊరుభంగము— ఇందు మొదటియైదింటిని బృహత్కథను తరువాతిరెంటిని రామాయ

ణము ననుసరించినవి. చారుదత్తావిమారకములు కల్పితేతివృత్తములు. బాలచరితము హరివంశములోనికథను గైకొన్నది. కడపటియాఱును భారతకథ ననుగమించినవి.

రూపకకవి విఖ్యాతేతివృత్తము నైనా సహృదయరంజకముగా మార్పుచేయవచ్చు ననుటకు తొలుత దారి చూపినవాఁ డితఁ డని యితనిరామాయణభారతకథా రూపకములు తెలుపఁగలవు. అభూతకల్పనమున నప్రతిమాన మైనప్రతిమలోనిదిలీపాదిప్రతిమాకల్పనమే యుత్తర రామచరిత్రలోనిచిత్రప్రదర్శనకల్పనకు మార్గదర్శక మైనది. కేవలకల్పిత రూపకములలో నన్నివిధముల నవిమారక మగ్రస్థానమున కర్హము. ఇతని చారుదత్తమే సర్వాంగసౌష్ఠవము గాంచి మృచ్ఛకటిక మైనది. ప్రతిమలోని "సర్వశోభనీయం సురూపం నామ" అనుమాటయే "కిమివ హిమధురాణాం మండనంనాకృతీనా" మనుచు, కాళిదాసుచే నలంకరింపఁబడినది. ప్రకృతిసౌందర్యమును సుఖదుఃఖములయందలి మానవుల హృదయములను పాఠకులకు ద్రష్టలకు ప్రత్యక్షము గావించుకవితాచాతుర్యమున నితఁ డాద్యుఁ డని కాళిదాసభవభూత్యాదు లితనిమార్గము ననుసరించుటయే తెలుపఁగలదు. ఇతనినాటకములలో నే కాదు, రూపకప్రపంచమందే అద్వితీయ మైనది స్వప్నవాసవదత్తము. ఇందలికథాసన్నివేశమందలినవ్యత యనుకరించుటకు కూడా శక్యముగానిది. అలంకారికు లందఱు నందలి ఘటించి మెచ్చికొనదీనిమహిమ యిట్టి దని వినుటకంటె చదివి తెలిసికొనుట యుత్తమము. ఉత్తమలక్షణగ్రంథము లన్నియు రసస్వరూపమును వినిపించినవి. ఇది దానిని చూపించినది. ఇదే యిందలిమహావిశేషము. అందుకే, అన్నిటిని కబళించెడియగ్నికూడా దీనిని మ్రింగఁ జాలకపోయినదని "స్వప్నవాసవదత్తస్య దాహకో ఽభూ న్న పావకః" అనుచు రాజశేఖరుఁడు కవివిమర్శములో దీనిమహిమను పొగడియున్నాఁడు.

వత్సరాజు స్వప్నములో వాసవదత్తను చూచి పలుకరించుట యుందలిముఖ్యవిషయము. ఇందుకు ముఖ్యప్రయోజనములు రెండు. వాసవదత్త దగ్ధురాలు కాలేదు. జీవించియున్న దనెడియాశ రాజు మనస్సున కనఁబడీకనఁబడకుండ నంకురించుట యొకటి, తాను మృతి చెందినట్లు తెలిపినప్పుడుఁ గూడా తనభర్తకు తనపై నున్నపూర్వప్రేమ యట్లే యున్న దని వాసవదత్త తెలిసికొనుట మఱియొకటి.

రూపకమధ్యమం దున్న యీచిన్నయంశ మాధారముగా ముందువెనుకల నల్లుకొన్న యితరకథాంశము లెల్ల రసపాత్రపోషణమున నౌచిత్యపారము నందిన వనుటయే స్వప్నవాసవదత్త సకలరూపకశిరోభూషణ మగుటకు మూలము.

భాసుఁడు స్వతంత్రుఁడు నిరంకుశుఁడు, ఒక్కొకచో పాణినీయవిరుద్ధము లైనశబ్దములను ప్రయోగించుటయే కాక, నాట్యశాస్త్రమును గూడ లక్ష్యపెట్టక నాట్యరంగమున యుద్ధమును మరణమును గూడ చూపియున్నాఁడు. ఇందుకు బాలచరితములోని మల్లయుద్ధము చాణూరముష్టికకంసులమృతియు, ఊరుభంగములోని దుర్యోధనపతనమరణములు నుదాహరణములు. ప్రతిమలో సీతనారచీర ధరించుట రంగస్థలమున జరిగినదే. ఇతనిరూపకారంభమే యపూర్వము, "నాన్ద్యన్తే తతః ప్రవిశతిసూత్రధారః" అనుమాటతో రూపక మారంభ మగును. దీనినే బాణుఁడు సూత్రధారకృతారంభ మన్నాఁడు. ఇతఁడు ప్రస్తావన యన్నమాటకు బదులు స్థాపన యనుపదము వాడినాఁడు. అదియే బెడద లేకుండ రెండుమాటలతో ముగియును. అంకములు దీర్ఘములు గావు. చక్రిపాత్రసంభాషణములతో కథ రంగస్థలమున పరుగెత్తుచున్నట్లుండును, ప్రఖ్యాతవృత్త మని పాత్రములపేళ్ళు తెలుపును గాని, అది మిశ్రవృత్తమే. పంచరాత్రములోని యితివృత్తము భారతకథ కడ్డము తిరిగి యుద్ధము లేకుండ దుర్యోధనునిచే పాండవుల కర్ధరాజ్య మిప్పించి

నది. ఇట్టియితనిస్వాతంత్ర్య మన్నిటఁ గనవచ్చును ఇతివృత్తము పాత్ర రసోచిత మగునట్లు తుదముట్టును. ఇదియే యీదృశ్యకావ్యబ్రహ్మ రూపకనిర్మాణచాతుర్యము. లోకజ్ఞుఁడు నైనయితని నాటకములు చదివి యానందింపవలసినదే కాని నాలుగుమాటలతో వర్ణించినంతనే తనివి తీఱునా? అయినా, మచ్చున కందలినీతిబోధకము లైన నాలుగు శ్లోకములు:

"గుణానాం వా విశాలానాం, సత్కారాణాంచనిత్యశః,
కర్తారా స్సులభా లోకే, విజ్ఞాతార స్తు దుర్లభాః" స్వప్న.
"కాష్ఠా దగ్ని ర్జాయతే మథ్యమానాత్, భూమి స్తోయం ఖన్యమానా దదాతి,
సోత్సాహానాం నా స్త్యసాధ్యం నరాణాం, మార్గారబ్ధా స్సర్వయత్నాః ఫల న్తి" ప్రతిమ.
"యత్నే కృతే యది న సిధ్యతి కో ఽత్ర దోషః,కోవా న సిధ్యతి మ మేతి కరోతి కార్యం, యత్నైః శుభైః పురుషతా భవ తీహ నృణాం దైవం విధాన మనుగచ్ఛతి కార్యసిద్ధిః" అవి–
"నతు జతుగృహే సుప్తాన్ భ్రాతౄన్ దహ న్తి నిశాచరాః,
శిరసి న తథా భ్రాతుః పత్నీం స్పృశ న్తి నిశాచరాః
న చ సుతవధం సంఖ్యే వృత్తం స్మర న్తి నిశాచరాః,
వికృతవపుషోఽ ప్యుగ్రాచారా, ఘృణా న తు వర్జితా"

నిశాచరులు నీవు చేసినట్లు ఘోరకృత్యములు చేసినవారు కారని ఘటోత్కచుఁడు దుర్యోధనుని దెప్పిపొడుచుచున్న మాటలివి.

సదుక్తికర్ణామృతాదులందు భాసునివిగా కొన్నిశ్లోకము లున్నవి. వానిలో నొకటియు నేఁడు ముద్రితము లైన యితని యితరరూపకము లలోకనఁబడదు. అవి, బయటికి రాక యడఁగియున్న యితనియితరకృతు లలోనివే మో యని భావింత మన్నను, వానిలో, నొకగ్రంథమం

దితనిదిగా నున్న శ్లోక మింకొకదానిలో మఱియొకనిదిగా నున్నది. పోనీ! లెక్కలేవే యిఁకనివంద మన్నను, ఆశైలి యితనిదిగా తోఁచు కున్నది. అయినా ఒక్కటి యుదాహరింతును.

"ప్రత్యాసన్నవివాహమంగళవిధౌ దేవార్చనవ్యగ్రయా
దృష్ట్వాగ్రే పరిణేతు రేవ లిఖితాం గంగాధర స్యాకృతిమ్,
ఉన్మాదస్మితరోషలజ్జితరసై ర్గౌర్యా కథంచి చ్చిరా
ద్వ్యర్ధస్త్రీవచనా త్ప్రియే వినిహితః పుష్పాంజలిః పాతు వః"

వివాహముహూర్తమున కించుక ముందు దేవపూజ చేయు చున్న పర్వతకన్య వర్ణన మిది.

—o—

# కాళిదాసు

"కాళిదాసగిరాం సారం కాళిదాస స్సరస్వతీ,
చతుర్ముఖో ఽథవా సాక్షా ద్విదు ర్నాన్యే తు మాదృశాః"

సకలదేశాంతర్వ్యాపి యైనయీమహాకవి కాలనివాసాదివిషయములను పరిశోధింప యత్నించినప్రాచ్య పాశ్చాత్యవిద్వాంసు లెందఱో లెక్కలేదు. సవిమర్శము లైనవారివారియభిప్రాయము లన్నియు ముద్రితములై దేశముల వ్యాపించి యున్నవి. వాటిని పరామర్శించి సంస్కృత వాఙ్మయచరిత్రమందు నాయభిప్రాయ మావిష్కరించియున్నాను. ఆవిద్వాంసు లందఱును కాళిదాసజీవితకాలతత్త్వజిజ్ఞాసతోనే విషయము పరిశీలించి స్వాభిప్రాయము లావిష్కరించినా రనుట యథార్థమైనా, త్రోవలు వేఱగుటచే వాటి కేకీభావము దుర్లభ మైనది. ఈకవిరాట్టత్వము పరతత్త్వమువలె నగమ్యగోచర మగుటయే యందుకు కారణము. అందుచేతనే పూర్వపరిశోధకులు క్రీ. పూ. ఎనిమిదవశతాబ్ది మొదలుగా

క్రీ.శ.పన్నెండవశతాబ్దివఱకు నిరువదివందలయేండ్లలో నితని నిలుపుచు వచ్చుట సంభవించినది. దీనినిబట్టి యీవిషయ మిదమిత్థ మనినిర్ణయింప శక్యముకాని దని విదిత మగుచున్నను, ఇతనికాలమునుగూర్చి మున్ను నేను తెలిపినయభిప్రాయమే సముచిత మని యిప్పుడును భావించుచున్నాను. అది క్రీ. పూ. ౫౭. అనఁగా. శా. పూ. ౧౩౪. ప్రాంతము. ఇందుకు కొన్ని హేతువులు సంగ్రహించి తెలిపెదను.

విక్రమ- విక్రమార్క- విక్రమాదిత్య- శ్రీహర్షవిక్రమాదిత్య నామములు గ్రంథములందును కొన్నిశాసనములందును గనఁబడుటచే, ఆపేరు గలరాజులను నిరూపించుటలో వచ్చినమతభేదములు ప్రావాదికములు. విక్రమ (మాలవ) శకకర్త, ఉజ్జయినీరాజు నైన హర్షవిక్రముఁడు క్రీ. ౫౪౪ లోనివాఁ డనుచు నిర్ణయించిన ఫ్యూర్గ్వామతము, కొరూరుసిద్ధాంతము పొరపా టన్నబహువిమర్శకుల యభిప్రాయములచే నపాస్తమైనది. జయభటునికవిశాసనమును[1] మందసారశాసనము కూడా[2] మాలవశకము తత్పూర్వమే యున్నట్లు నిరూపించినవి.

" ధన్వంతర్యాదిజ్యోతిర్విదాభరణశ్లోకము విశ్వసనీయము కా దని యనేకులు నిరాకరించియున్నారు. కావున, శాకము ౫౦౯ లో మృతి నందిన ట్లున్నవరాహమిహిరునకు కాళిదాసు సమకాలికుఁడై క్రీ. ఆఱవశతాబ్దిలో నున్నవాఁ డన్నయభిప్రాయ మనుచితము.

క్రీ. ౬౩౪లో, ద్వితీయపులికేశి వ్రాయించిన దనుచు, నైహోలు శాసనములో[4] కనవచ్చిన భారవకాళిదాసులు సమకాలికులై యాకాల

1. చూ. ఇండియన్ ఏంటిక్వరీ-మాలవసంవత్సు ౪౩౦.
2. మాలవానాం గణస్థిత్యా యాతే శతచతుష్టయే, త్రినవత్యధికే ఽబ్దానా, మృతౌ సేవ్యఘనస్వనే, ౫౨౯ మాలవశకము.
3. బ్రహ్మగుప్తుని ఖండఖాద్యవ్యాఖ్యాంతమున- నవాధికపంచ శతసంఖ్యశాకే వరాహమిహిరో దివం గతః-
4. యే నాయోజి నవే ఽశ్మస్థిర మర్థవిధౌ వివేకినా జినవేశ్మ. స విజయతాం రవికీర్తిః కవితాశ్రితకాళిదాసభారవికీర్తిః.

షుం దున్నవా రనుచు నందర్గికారు మొదలగుకొందఱు భావించిరి గాని, రవికీర్తి, కాళిదాసభారవిరకవుల కీర్తివంటికీర్తికలవాఁ డని వర్ణించి నంతమాత్రమున వా రిద్దఱు కలసి రవికీర్తియాస్థానమున నున్నవా రని భావించుట యే విధముగాను పొసఁగదుగదా! అప్పటికి భారవికాళి దాసులు పూర్వులనుటకిదిచాలును.

కొందఱు జ్యోతిర్విదాభరణశ్లోకమును నమ్ముట యెట్టిప్రమా దమో మఱికొందఱు మాతృగుప్తుఁడు కాళిదాసు నొకఁడే యనియు, అతఁడు క్రీ. ఆ౫వశతాబ్దిలో కాశ్మీర నేలినహర్షవిక్రమాదిత్యునినాఁటి వాఁడనిచెప్పుటయు నట్టిప్రమాదమే[1] మాతృగుప్తుఁడు కాళిదాసు కంటె వే ఱని యతనిజీవితమున తెలియఁగలదు.

క్రీ. ౫౩౦ప్రాంతమున హూణరా జగు మిహిరకులుని యశోధర్మ బలాదిత్యు లోడించుట యెఱిఁగి కాళిదాసు రఘువంశములో హూణరాజ వర్ణనము గావించి యుండు నన్నమతము మిక్కిలి నిస్సారము. మహా భారతములో హూణులవర్ణన లేకపోయినదా ?

కాళిదా సనుపేరు గలకవు లైదాఱుగు రున్నారు. వా రందఱు నొక దేశమువారు కారు. ఒకనాఁటివారు కారు. కాని భరతఖండ మంత ట ఖ్యాతి కెక్కినవాఁడు మనకాళిదా సే. అందుచే తక్కినవారిలో నెవ రికి సంబంధించినకథ యైనా కర్ణాకర్ణికగా వచ్చి తుదకు ప్రసిద్ధకాళిదా సున కారోపింపఁబడుట యాచార మైనది. ఆకథలలో నొకటి యిది:—

"కాళిదాసునకు కవితావిషయమున నిచులుఁడు మిత్రుఁడు, దిఙ్నాగుఁడు శత్రువు. అందుచే నతఁడు మేఘసందేశములో నిచులుని పొగడి, దిఙ్నా గుని నిందించినాఁడు[2]" ఈకథ పండితపరంపరలో కింవదంతిగా వచ్చి

1. రమేశచంద్రదత్తు- డాక్టరుభౌదాజీ- Literary Remains- ఆప్టే- Date of Kalidasa

2. అద్రేః శృంగం...స్థానా దస్మా త్సరసనిచులా దుత్ప తో దఙ్ముఖః ఖం, దిఙ్నాగానాం పథి పరిహరన్ స్థూలహస్తావలేపాన్. ౧-౧౪.

మల్లినాథుని చెవిని పడ్డది. దీని నతఁడు నమ్మి యీశ్లోకమునకు వ్యాఖ్య వ్రాయుసందర్భమున "అ త్రేద మప్యర్థాంతరం ధ్వనయతి" అనుచు నీవిషయము తెలిపెను. ఇందును, దక్షిణావర్తనాథుఁ డనెడి మఱియొక మేఘసందేశవ్యాఖ్యాత యీ ధ్వన్యర్థము వ్రాయుటకు గూడ మల్లినాథునికి సహాయపడియుండును. కాని, అతిప్రాచీనవ్యాఖ్యాత యగు వల్లభదేవుఁ డీశ్లోకములోని యీమాటల కర్థాంతరము వ్రాయలేదు. అయితే నేమి? ఆయుద్ధృతిమాటలు కాళిదాసకాలనిర్ణయమున కొందఱికి ప్రమాణములైనవి. ఆర్యాసంగవసుబంధులశిష్యుఁడైనదిఙ్నాగునితో మనకవి క్రీ. ఆఱవశతాబ్దిలోనివాఁడయినాఁడు. ఇఁక నిందలి తత్త్వము:— దిఙ్నాగులు కూడా యిద్దఱు ముగ్గు రున్నారు కాని, యింతకు మున్న తెల్పినయతనినే గ్రహింతము. అతఁడు ప్రమాణాదిశాస్త్రములు చదివినవాఁడు. అతనిగురు వైనవసుబంధుని గ్రంథములు క్రీ. ౪౦౪లో చైనాభాషలోని కనువదింపఁబడినవనియు, బుద్ధనిర్యాణానంతరము ౯౦౦ నాఁ డార్యాసంగవసుబంధువు లున్నా రనియు (అనఁగా క్రీ. ౩౪౧) వసుబంధుఁడు క్రీ. ౪౩౦ ప్రాంతమందుండు, తచ్ఛిష్యుఁడు దిఙ్నాగుఁడు క్రీ. ౪౧౩-౫౦౩ నడుమ నున్నా రనియు బుద్ధనిర్యాణకాలము నేటికి ననిర్దిష్ట మనియుఁ దెలియుచుండ నాగురుశిష్యుల నెట్లో క్రీ. ఆఱవశతాబ్దికి లాగుట[1] యెట్లు పొసగును? ఇంతయును మల్లినాథుఁ డేదో విన్నకింవదంతిని గ్రంథస్థము గావించెను గాని, యతఁ డీవిషయము పరామర్శించలే దనుట నిజము. నిజముగా నాకాలమునం దొకదిఙ్నాగునితో నొకకాళిదాసునకు వివాదమే యున్నట్లు నమ్మవలసివచ్చె నేని, యీకాళిదాసు మన రఘువంశాదికర్త కాఁ డనియు, గణకకాళిదా సనియు చెప్పవలసియుండును. గణకచక్రవర్తియు స్వరశాస్త్రవేత్తయు నైనకాళిదా సొకఁడు

1. వీరికాల మిప్పటికిని వివాదగ్రస్తముగానే యున్నది. చూ. డా. కృష్ణమాచార్యులు గారి. సం. సా. చరిత్ర. 107.

శత్రుపరాభవ మను గ్రంథము రచియించియున్నాఁడు[1]. మతప్రామాణ్య వాదమున బౌద్ధపండితుఁడైన దిఙ్నాగు నతఁడోడించి యా గ్రంథము నిర్మించియుండు నని యూహించుట యసంగతము కానేరదు.

అశ్వఘోషుని బుద్ధచరిత్ర చూచి, అందలి తృతీయత్రయోదశసర్గలలోని పురంధ్రీవర్ణనాదులం బోలినవర్ణనలు రఘువంశసప్తమసర్గయందును కుమారసంభవతృతీయసర్గయందును కాళిదాసు కావించియున్నాఁడు గావున నతని కితఁడు పరుఁడని కొందఱూహించినారు గాని, ఆయూహ యుపహాసపాత్రము. కవితాప్రపంచమున కాళిదాసెక్కడ? అశ్వఘోషుఁ డెక్కడ? ఇద్దఱికృతులలోని యట్టివర్ణనలు పోల్చి పఠించువారికి కాళిదాసకవిత నశ్వఘోషుఁ డనుకరించినట్లు విస్పష్టము కాకపోదు. అందుచేత నీవిపరీతవాదము క్రీ. ౭౦—౧౫౦ నడిమివాఁడగునయశ్వఘోషునికంటె కాళిదాసు పూర్వుఁడన్నవారి యభిప్రాయము నెక్కువగా బలపఱుచుచున్న దనుట నిజము.

అలహాబాదునగరమునకు దగ్గఱగా నున్నభీతనామకగ్రామమున మార్షలుపండితుఁడు సంపాదించినపురాతనలోహపురేకులలో దుష్యంతుఁడు లేడిని తఱుముట మొదలుగా శాకుంతలనాటకప్రథమాంకకథ చెక్కఁబడియున్న దఁట, ఆ రేకులు క్రీ. పూ. ౧౮౫—౭౩ నడుమ పాలకులుగా నున్నసంగరాజులకాలమునకు సంబంధించిన వని పరిశోధకు లనుచున్నారు[2]

కాళిదాసు స్వవిషయముగాని స్వపోషకవిషయము గాని తన యే కావ్యములోను చెప్పియుండలేదు. గాని, మాలవికాగ్నిమిత్రము కడపటి భరతవాక్యమునమాత్ర మించుక సూచనచేసియున్నాఁడు. అది యిది.

1. "నత్వా సురాసుర శిరోమణిరత్నరశ్మి, చిత్రీకృతాంఘ్రియుగళం హరి మాదిదేవం, శ్రీకాళిదాసగణక స్స్వరశాస్త్రసారం, వక్ష్యా మ్యహం ప్రబల శత్రుపరాభవాఖ్యమ్."
2. డా॥ రమేశమోహన్ బోసు శాకుంతల పీఠిక.

"ఆశాస్య మీతివిగమప్రభృతిప్రజానాం,
సంపత్స్యతే న ఖలు గోప్తరి నాగ్నిమిత్రే"

దీనినిబట్టి అగ్నిమిత్రునికి మనకాళిదాసు సమకాలికుఁ డని విమర్శకులు భావించుచున్నారు. ఈనాటకమునకు వ్యాఖ్య నిర్మించినకాటయవేముఁడు కూడా "నాటకాంతమున భరతవాక్యముగా సర్వకాలసాధారణ మైనయాశీర్వచనము చేయవలసియుండగా, అగ్నిమిత్రుని పేర్కొనుట తత్కాలమందలిరాజును తెలుపుటకే" అని వ్రాసియున్నాఁడు[1]. ఈయగ్నిమిత్రుఁ డెప్పటివాఁ డనువిషయమునఁగూడా మతభేదములు లేక పోలేదుగాని, యితఁడు క్రీ. పూ. మొదటిశతాబ్దిలోనివాఁ డనెడివిశ్వాసము హెచ్చుగా నున్నది. ఇందుకు వాయుపురాణవచనమును తోడ్పడుచున్నది[2]. —మౌర్యరాజైనజయద్రథుని చంపి యతనిసింహాసన మాక్రమించినమహాసేనాని యగుపుష్య(ష్ప)మిత్రుఁడు సంగరాజ్యస్థాపకుఁడు. అతనికొడు కైనయీయగ్నిమిత్రుఁడు తండ్రికి ప్రతినిధియై దశార్ణరాజధాని యైనవిదిశాపురమున కొంతకాల ముండెను. పుష్యమిత్రుఁ డశ్వమేధము చేయఁబూని గుఱ్ఱమును రక్షింప తనపౌత్రు డైనవసుమిత్రుని నియోగించె నని దేశచరిత్ర చెప్పుచున్నది.

కాళిదాసు విక్రమాదిత్యునిసభలోనివాఁ డనెడియొకప్రతీతి చిరకాలముగా దేశమున వేళ్లు నాటుకొని యున్నది. దీనిని ప్రత్యక్షముగా బలపఱుచు ప్రబలప్రమాణములు లభించలే దని దానిని త్రోసివేయఁజాలము.–గర్దభిల్లునికొడు కైనవిక్రమాదిత్యుఁడు శకులను జయించి తన

---

1. "సర్వనాటకప్రయోగాంతే భరతేన సర్వకాలసాధారణే ఆశీర్వచనే కర్తవ్యే సతి అత్ర ప్రజానా మాశాస్యసిద్ధిం ప్రతి గోప్తు రగ్నిమిత్రస్య కథనం తత్కాలరాజోపలక్షణ మితి మన్తవ్యమ్"

2. పుష్యమిత్రస్తు సేనానీ రుద్ధృత్య వై జయద్రథం, కారఇష్యతి వైరాజ్యం సమా షష్టి స దైవ తు-వాయు-ఉత్తర-32అధ్యా.

పేర (సంవతు) శకము నిలిపెనని యు,అది శాలివాహన శకమునకు పూర్వము ౧౩౫ సంవత్సరముల క్రిందట ప్రారంభింపఁబడిన దనియు మేరుతుంగాచార్యుఁడు తనపట్టావళిలో వ్రాసినట్లు తెలియుచున్నది[1]. ఇది మనము భావించినకాలమునకు సరిపడుచున్నది. క్రీ.పూ.౫౬, లేక ౫౭లో శ్రీహర్షవిక్రమాదిత్యుఁ డనఁబడునొకశూరుఁ డుజ్జయిని నేలునాఁటికి మన కాళిదాసు జీవించియుండెననుటకు సందేహముకలుగఁబోదుగాని, భాదాజీపండితుఁడు తలఁచినట్లు మాతృగుప్తుఁడు మాత్రము మనకాళిదాసు కాఁడు.

పూర్వోక్తము లైనవిషయము లన్నియు మనకాళిదాసు క్రీ.పూ ౬౬, అనఁగా శా. పూర్వము ౧౩౪ ప్రాంతములోనివాఁ డనుటకు చాలును. ఇందుకు, అపాణినీయము లైనఛాందసశబ్దములు ప్రయోగించుట సంతతి లేకమృతుఁ డైనవానియాస్తి యతనిభార్యకు చెందక రాజునకు చెందు ననుట, రత్నాపహారి యైనచోరుఁడు వధార్హుఁ డనుట మొదలయినవి గూడ యితని ప్రాచీనతను తెలుపుచు భాసునికి తరువాతను అశ్వఘోషునికి ముందు నితఁ డున్నాఁ డన్నయభిప్రాయమునే స్థిరపరచుచున్నవి. ఇఁక నితనికి సంబంధించి యెన్నో కథ లున్నవి కాని పాఠకప్రరోచనార్థ మొకటిమాత్ర మిందు తెల్పెదను.

కవి తో త్ప త్తి క థ

" ఒకరాజునాస్థానమునఁ గొందఱు విద్వాంసు లుండిరి. నిబిడనితంబ యనుపేరు గలయారాజుకూఁతురు సకలశాస్త్రము లభ్యసించి గొప్పవిదుషి యై యపు డపుడు శాస్త్రవాదములం దాపండితులను నిరుత్తరులను గావించుచు వచ్చినది. అందుకు వా రసూయపడియుండ, నొకనాఁడు తనకొమార్తెకు తగినవరు నన్వేషింపవలసిన దని రాజు వారి కానతిచ్చెను. దీనిగర్వ మణంప నిదేయద నని వారుసంతోషించి వరాన్వేషణమునకు వెడలి విద్యావిహీనుఁ డై నయొకపరమమూర్ఖుని

1. చూ. డాక్టరు భాదాజీ కాళిదాసోపన్యాసము.

రాజకుమారవేషము వేసి తీసికొనివచ్చి "యితఁడు మహాకులీనుఁడు మహావిద్వాంసుఁ"డని రాజుతో చెప్పి యామె నిప్పించి పెండ్లిచేయించి, ఉష్ట్ర శబ్దము నుచ్చరింపలేనివానిని కూర్చినందుకు తమలో తా మిట్లు మురిసిరఁట.

"ఉష్ట్రే లుంపతి రంవా షంవా తస్మై దత్తా నిబిడనితంబా
కిం న కరోతి స ఏవ హి రుష్టః, కిం న కరోతి స ఏవ హి తుష్టః"

ఆపెండ్లికొడుకు ఉష్టము ఉట్రము అనును గాని, ఉష్ట్ర మని పలుకలేఁ డనుట.

పెండ్లి యైననాఁటిరాత్రి వరుఁ డంతఃపురమునఁ బ్రవేశించెను. మాటలాడుసందర్భమున నతఁడు విద్యాగంధ మెఱుఁగనివాఁ డని రాజపుత్రి తెలిసికొని విద్వాంసులు కావించినమోసమునకు కినిసియు, అవమానమునకు గుందియు, తండ్రితో చెప్పి పండితులను శిక్షింపఁజేయుట తగవు గాదని యాలోచించి ధైర్యము తెచ్చుకొని "నీవు కాళికేశ్వరి నారాధించి విద్యాజ్ఞాన మార్జించి రమ్ము. అపుడు మనము సుఖింపవచ్చు" నని భర్తతో చెప్పి యతనిని గాళికాలయమునకు పంపెను. భార్య చెప్పినచొప్పున నతఁడు దీక్షతో దేవి నారాధింపఁ గొంతకాలమున కా దేవి సంతుష్టయై యతనికి సకలవిద్యలు సత్కవిత్వము నబ్బునట్లు వర మిచ్చెను. వెంటనే యతఁడు కాళికాస్తవ మొనరించి కాళిదాసనుపేర వెలసి యింటికి వచ్చి జరిగినవృత్తాంతము భార్యకు నివేదించి తనకు వాక్చాతుర్య మబ్బిన దని "అస్తికశ్చిద్వాగ్విశేషః" అనువాక్యమునఁ దెలిపి త న్నంగీకరింపు మని కోరెను. నిర్దుష్ట మైనసంస్కృత వాక్య ముచ్చరించుట కామె సంతోషించియు, అతనివైదుష్య మెట్లున్నదో పరీక్షింపఁగోరి "నిరాక్షేపము నిరుపమానము నైన నీవిద్యాజ్ఞానమును బ్రకటించువఱకు ని న్నంగీకరింప న"ని పలికెను. అంత నతఁడు సరే యని వివిక్తం బగుప్రాసాదైకభాగమునఁ గొంతకాలము నివసించి, ఆమెతో మొదటఁ జెప్పినవాక్యమందలి యొక్కొక్కశబ్దము నొక్కొక్క-

గ్రంథము మొదల నుపయోగించుచు—అనఁగా "అస్తి" యుపయోగించి "అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా" ఇత్యాదిగా నారంభించి కుమార సంభవకావ్యమును, "కశ్చిత్" ఉపయోగించి "కశ్చిత్కాంతా విరహ గురుణా" ఇత్యాదిగా నారంభించి మేఘసందేశకావ్యమును, "వాక్" ఉపయోగించి "వాగర్థా వివ సంపృక్తౌ"ఇత్యాదిగా నారంభించి రఘు వంశకావ్యమును, "విశేషః" ఉపయోగించి "విశేషసూర్యః స్పృహణీయ చంద్రమాః" ఇత్యాదిగా నారంభించి ఋతుసంహారకావ్యమును రచి యించి, ఆ నాల్గింటిని రాజసభలో విద్వాంసులకు వినిపించి వారిమెప్పు గాంచి పిదప నిబిడనితంబానురాగమునకు పాత్ర మయ్యె నఁట. కాళి దాసుకవిత్వము కాళీవరప్రసాదలబ్ధ మనుటయే యీకథకు ఫలము. ఇతఁడు కుమారసంభవాదులను క్రమముగా రచియించినాఁ డన్నభావము తెలుపుట కాపూర్వోక్తవాక్యము కల్పిత మనఁదగియున్నది.

## ఇతని నివాసజాతిమతములు

కాళిదాసు వంగీయుఁ డని కాశ్మీరీయుఁ డని గుజరాతీయుఁ డని ఉజ్జయినీనివాసి యని, వారు వారు భావించినారుగాని, దేనికిని తగిన యాధారము లేదు. ఇతఁడు గావించిన యుజ్జయినీమహాకాలశ్రీప్రాస ద్యాదివిశేషవర్ణనలనుబట్టి యితఁ డుజ్జయినీప్రాంతమువాఁ డనెడియభిప్రా యమే యెక్కువగా నున్నది— అట్లే యితఁ డేజాతివాఁ డనునదియు నిశ్చితము కాదు గాని, పంచగౌడబ్రాహ్మణులలోనివాఁ డనుకొనుట యసంగతము కాఁజాలదు. మంత్రబ్రాహ్మణము లితఁ డెఱిఁగినవాఁ డను టకు గ్రంథస్థము లైనయితనిమాటలు భావములును ప్రమాణము. ఇఁక మతము.

కాళిదాసు తనకావ్యనాటకముల మంగళాచరణశ్లోకములందు శివస్తుతి చేయుటంబట్టి యితఁడు శైవుఁ డని కొందఱు భావించుచు న్నారు. కాని, ఇతఁ డద్వైతుఁ డనుటకే యవి యెక్కువ తోడ్పడును.

అద్వైతమతమువారందఱును శివకేశవభేదములేనివారైనను వ్యావహారికావస్థయందు వారిలో నొక్కరి నెక్కువగాస్తుతించుటయు, నిద్దఱిని ధ్యానించుటయుఁ గూడఁ గలదు. అద్వైతమూర్తియైనభర్తృహరి "తథాపి భక్తిస్తరుణేన్దుశేఖరే" యనుటయే యిందుకు తార్కాణము. జగద్గురుశంకరు లిద్దఱిని ధ్యానించియున్నారు. కాళిదాసు పార్వతీపరమేశ్వరులను స్తుతించినను, శివపర్యాయములైనకృత్తివాస స్థాణుశబ్దములు వాడినను, ఇతనియేకేశ్వరవాదిత్వమున కది భంజకము కాదు. ఇతఁడు జీవేశ్వరాభేదవాదియనుట కీవిక్రమోర్వశీయనాందియే చాలును.

"వేదాన్తేషు య మాహు రేకపురుషం వ్యాప్య స్థితం రోదసీ,
యస్మి న్నీశ్వర ఇ త్యనన్యవిషయ శ్శబ్దో యథార్థాక్షరః,
అన్తర్యశ్చ ముముక్షుభి ర్నియమితప్రాణాదిభి ర్మృగ్యతే,
స స్థాణు స్స్థిరభక్తియోగసులభో నిశ్శ్రేయసా యాస్తు వః"

ఈశ్లోకమున శివపర్యాయమైనస్థాణుశబ్దము కనఁబడుచున్నను, ఇందలివిషయ మంతయు భక్తియోగముతోడియద్వైతభావననే ప్రకటించుచున్నది. ఇట్లే శాకుంతలనాందీశ్లోకములోఁ గూడ స్థాణుశబ్ద మున్నను అందలివిషయ మంతయు, పరమేశ్వరుఁడు సకలజగదాకారుఁడు సర్వాన్తర్యామి యనునద్వైతభావమునే వెల్లడించుచున్నది. కావునఁ గాళిదాసద్వైతి యనుటస్పష్టము. ఇందుకు, కుమారసంభవద్వితీయసర్గలోని యీశ్వరస్తుతి—మఱియొకపరమప్రమాణము.

ఇతఁడు వింధ్యహిమాలయమధ్యదేశ మంతయుఁ జక్కఁగా సంచరించి సంపూర్ణలోకజ్ఞాన మార్జించినవాఁ డనుట కితనిరఘువంశములోని రఘుమహారాజదైత్రయాత్రావర్ణనము మేఘసందేశములోనియలకాపురమార్గవర్ణనము మొదలైనవి తెలుపఁగలవు. వేదశాస్త్రవిజ్ఞాతయు లోకజ్ఞుఁడునగు కవితాసామ్రాజ్యధురంధరుఁడు నగునీమహాకవిజీవితవృత్తాంతము తెలియలేదనుకొనుటకంటె నితఁడు సర్వాంతర్యామి యైన కవిబ్రహ్మ యని భావించుట మేలు:—

## ఇతని కృతులు

ఇతఁడు కుమారసంభవము మేఘసందేశము రఘువంశము మాల వికాగ్నిమిత్రము విక్రమోర్వశీయము శాకుంతలము, అనెడికావ్యత్రయ రూపకత్రయములురచియించె ననుట జగద్విదితము. ఇవిగాక యితనిపేర ఋతుసంహారము నలోదయము సేతుబంధము కుంతలేశ్వరదౌత్యము శృంగారతిలకము శృంగారరసాష్టకము శృంగారసారకావ్యము శ్రుతబోధ జ్యోతిర్విదాభరణము పుష్పబాణవిలాసము రత్నకోశము ప్రశ్నోత్తర మాల రాక్షసకావ్యము నవరత్నమాల మొదలుగా ననేకకృతులు కనఁ బడుచున్నవి గాని, వీనిలో ఋతుసంహారము మాత్ర మితని దనెడివిశ్వా సము హెచ్చుగా నున్నది. అది సంశయాస్పద మైనను, తక్కిన వితనివి కా వనుట నిరాక్షేపము:—

"తస్మా దాలోచితాశేషలోకశాస్త్రేణ ధీమతా,
కర్తవ్యం కాళిదాసాదేః కావ్యానాం పరిశీలనమ్"

అని యొకప్రాచీనాలంకారికుఁడు చెప్పిన దెంతయుసత్య మని యితనికావ్యరచనము సర్వత్ర చాటుచుండును. ఇతఁడు వాల్మీకిభాసకవుల యందలి గౌరవాతిరేకమున రామాయణమునుండియు, ప్రతిమాదినాట కములనుండియు కొన్నివర్ణనలను భావములను గ్రహించియు ననుకరిం చియు వానికి మఱింత శోభ తెచ్చినమాట నిజ మైనను, అది యితని కవితాస్వాతంత్ర్యమునకు భంజకము కాఁజాలదు.

"పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా"అనెడిబాలకాండ ములోనియుపమను, కాళిదాసు రఘువంశములో "జలాభిలాషీజలమా దధానాం, ఛాయేవ తాం భూపతిరన్వగచ్ఛత్" అని రఘువంశములో నందినీధేనువునను గమించు దిలీపునియెడ నుపయోగించెను. ఇందు లింగ భేదమున్నదను కొన్న కొందఱు లాక్షణికులయాశయ మెత్తుకొని, వామ నాచార్యుఁడు లౌకిక్యుపమకు లింగవచనములతో నిమిత్తము లేదన్నాఁ

డనుచు, దీనిని చారిత్రవర్ధనుఁడు సమర్థించి యున్నాఁడు. ఇట్టి రామాయణానుకరణము లితని కృతులలో నింకనుగలవు. కాని, యవియనుకరణములుగా పాఠకులకు గోచరింపనంత మనోహరములుగా నుండును. ఇంతకును కాళిదాసు వాల్మీకి పరోక్షశిష్యులలో నగ్రిముఁడుగదా! ప్రకృతిశోభావర్ణనమునకు దారి తీసినవాఁడు భాసుఁడైనను దానిని మనోహరముగా విస్తరింపఁజేసినవాఁ డితఁడు. తక్కినయద్భుతాదిరసములను గూడా నితఁ డందందు వర్ణించినను శృంగారరస మితని కత్యంత మభీష్టము. కుమారసంభవములోని పార్వతీపరమేశ్వర సమాగమ ఘట్టమందలిశృంగారము మార్దవము తప్పిన దని యాలంకారికవిమర్శకు లన్న మాట సత్యమే కాని, నాటకములలో నితఁడు వర్ణించినశృంగార మట్టిది కాదు. విప్రలంభశృంగారమున కాద్యనిదర్శన మనఁదగు మేఘసందేశముతద్రసవర్ణనకే కాదు, కావ్యజాతి కెల్ల మేలుబంతి.

ఇది యొకయమూల్యరత్నము. కాళిదాసప్రతిభామూర్తి. దీనికి సుమారు ముప్పదివ్యాఖ్యలు పుట్టుటయు, "మేఘే మాఘే గతంవయః" అనిమల్లినాథసూరి చెప్పుటయు దానిఘనతకు గుర్తు. రామాయణములోని హనుమత్సందేశము మనస్సున నుంచుకొని యితఁ డీసందేశకావ్యము రచియించె నను వ్యాఖ్యాతలయభిప్రాయము సరియే కాని, యితని కేవల స్వకపోలకల్పిత మైనయీకృతి ననుకరింప నెన్నిసందేశకావ్యము లవతరించినను, దీనిచెంత కైనఁ జేరఁజాలకపోయిన వనుట సత్యము. యక్షుఁడు తనభార్యకు పంపినయిందలిసందేశ మేమనువిషయమును వ్యాఖ్య లేవియు సూచింపలేదు. కాని, "త్వా మాలిఖ్యప్రణయకుపితా" మిత్యాదిశ్లోకములోని[1]. ప్రణయకలహమునఁ గోపగించిన ట్లున్నసీరూపము చిత్రించినీ

1. త్వా మాలిఖ్య ప్రణయకుపితాం ధాతురాగై శ్శిలాయా,
మాత్మానం తే చరణపతితుం యావ దిచ్ఛామి కర్తుమ్,
అస్రై స్తావ న్ముహు రుపచితై ర్దృష్టి రాలుప్యతే మే,
క్రూర స్తస్మి న్నపి న సహతే సంగమం నౌ కృతాన్తః. సర్గ. ౨, ౪౨.

కాళ్లమీఁదఁ బడుటకు యత్నించునంతలోఁ బొరలిపొరలివచ్చుకన్నీళ్లచే నాదృష్టి చెడిపోయినది. అకటా! పాడుదైవము చిత్తరువులోఁగూడ మన సమాగమము సహింపకుండెనుజుమీ! —అనుమాటయే సందేశముని తోఁచుచున్నది.

విద్వల్లోకమున మెప్పు గాంచినకొలఁదినాటకములలో ఖండాంతరపండితులకు కూడ నాహా పుట్టించినది శాకుంతలము. ఇది కథాపాత్ర రసౌచిత్యములత్రిపుటి. నాయికానాయకులహృదయావస్థలు కరతలామలకము గావించుటయందేమి, సామాజికహృదయము రసమయముగా వించుటయందేమి, భాషయందేమి, ఇది యద్వితీయ మనఁదగును. కావుననే "కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకుంతలా" అనునార్యోక్తి వెలసినది. కావ్యలోకమునఁ గాళిదాసత్రయమును నాటకచక్రమున శాకుంతలమును సుప్రసిద్ధము లనుట విదితము. విక్రమోర్వశీయ మాలవికాగ్నిమిత్రములు విద్వన్మనోరంజనము లైనను దీనివలె గణుతికెక్క లేదు. ఇఁక నితనికవితను పొగడిన కొందఱిమాటలు:—

"కవయః కాళిదాసాద్యాః కవయో వయ మప్యమీ,
పర్వతే పరమాణౌచ పదార్థత్వం వ్యవస్థితమ్"
"కాళిదాసకవితా నవం వయో, మాహిషం దధి సశర్కరం పయః,
ఏణమాంస మబలాచ కోమలా, సంభవంతు మమ జన్మజన్మని"
"సాకూత మధురకోమల విలాసినీకంఠకూజితప్రాయే,
శిక్షాసమయేఽపి ముదే రతలీలా కాళిదాసోక్తిః"
"పురా కవీనాం గణనాప్రసంగే, కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా,
దద్యాపి తత్తుల్యకవే రభావా దనామికా సార్థకనామధేయా"

సహజసౌందర్యవర్ణన మితనిసొమ్మనుట కొక్కశ్లోకము చాలును ఇది శాకుంతలములోనిది.

"సరసిజ మనువిద్ధం శైవలే నాపి రమ్యం,
మలిన మపి హిమాంశో ర్లక్ష్మ లక్ష్మీం తనోతి,

ఇయ మధికమనోజ్ఞా వల్కలే నాపి తన్వీ
కిమివహి మధురాణాం మండనం నాకృతీనామ్"

దశరూపకావలోకమున మాధుర్యమున కుదాహరింపఁబడినపై శ్లోకమునకు నాయనునాదపద్యమిది:—

చ. కమలము నీటిపాచి పయిఁ గ్రమ్మినఁ గూడ మనోహరం బగుఁ,
హిమరుచిలాంఛనంబు నలు పేనియు నెక్కువశోభఁ గాంచు, నీ
కమలదళాక్షి వల్కలము గట్టియుఁ జక్కఁదనాన మించు, ర
మ్యము లగునట్టిరూపముల కారయ భూషణ మేది కా దిలన్ ?

పైకడపటిపాదములోనిభావము భాసునిప్రతిమలోని "సర్వ శోభనీయం సురూపంనామ" అనుదానిననుకరించిన దనిమున్న చదివి యున్నాము. ఇట్టియనుకరణము లింకనుగలవు. అందలివి మఱి రెండు:- "యస్యాం న ప్రియమండనాపి మహిషీ దేవస్య మందోదరీస్నేహా ల్లుంపతి పల్లవాన్" అనెడియభిషేకనాటకములోని భావము నితనిశాకుంతల మిట్లు సరిగా గ్రహించినది.

"నాదత్తే ప్రియమండనాపి భవతాం స్నేహేన యా పల్లవమ్"

ఈక్రిందివానిలో మొదటిది, వసుదేవుఁడు కృష్ణుని నందునింటికి కొనిపోవునపు డీవలికి వచ్చి విచారముతో మరల గదిలోనికి పోవుదేవకి వర్ణనము, భాసుని బాలచరితములోనిది. రెండవది శకుంతలను విడచి సేన యున్నచోటి కేగుదుష్యంతునివర్ణనము ఇతనిది.

హృదయే నేహ త త్రాజై ర్ద్విధా భూతేవ గచ్ఛతి
యథాధవసితో యేచ చంద్రలేఖా ద్విధా కృతా"
"గచ్ఛతి పుర శ్శరీరం ధావతి పశ్చా దసంస్తుతం చేతః
చీనాంశుకమివ కేతోః ప్రతివాతం నీయమానస్య"

దేవకిమనస్సు ముందుకు దేహము వెనుకకు. దుష్యంతుని దేహము ముందుకు మనస్సు వెనుకకు, ఆకాశమందలిచంద్రకల నీటి

లోని ప్రతిబింబకల యుపమానము లక్కడ-గాలి కెదురుగా కొనిపోవు జెండాకట్టు దానికిఁగట్టినపట్టుగుడ్డ యుపమానము లిక్కడ. వేఱు వేఱుగా చదివి పరిశీలించునపుడు దేని క దే రత్న మని తోఁచక పోదు.

కాళిదాసంతటి మహాకవిగావించినయిట్టియనుకరణ మితనికి భాసరూపకములం దున్నగౌరవము వెల్లడించునది గాని వేఱు కాదు.

కాళిదాసు సర్వశాస్త్రజ్ఞుఁడు స్వతంత్రుఁడు. పాణినీయము నితఁడు చక్కఁగాఁ బఠించినవాఁ డయ్యు నిరంకుశుఁడై-అన్వైహి-త్రియంబకమ్-విశ్రామహేతోః- ఇత్యాదిశబ్దములు ప్రయోగించియున్నాఁడు. ఇందలి కడపటిప్రయోగము ప్రమాణముగా, చంద్రగోమి తనచాంద్రవ్యాకరణమున "విశ్రామోవా" అనుసూత్రమునిర్మించె ననుటయే యితనిప్రయోగముల కానాఁడే యెట్టిగౌరవము కలదో తెలుపఁగలదు.

"అథౌషధీనా మధిపస్య వృద్ధౌ తిథౌచ జామిత్రగుణాన్వితాయామ్"

ఇత్యాదు లెన్నో యితనిజ్యోతిర్విజ్ఞానమున కుదాహరణముగా నున్నవి. మఱియు,

"వీర్యవంత్యౌషధానీవ వికారో సాన్నిపాతికే"

"సంగవస్తుభిషజా మనాశ్రవః"

"ఆమయస్తు రతిరాగసంభవః"

రాజయక్ష్మపరిహాని రాయయౌ వైద్యయత్నపరిభావినం గదం

మహౌషధిం నక్తమి వావభాసః భోగీవ మంత్రౌషధిరుద్ధవీర్యః

"తేన దంశచ్ఛేదః పూర్వాకర్మేతి జ్ఞాయతే,

"ఛేదోదంశస్య దాహోవా క్షతే ర్వా రక్తమోక్షణమ్,

ఏతాని దష్టమాత్రాణా మాయుషః ప్రతిపత్తయః.

రఘువంశ కుమారసంభవమాలవికాగ్నిమిత్రాదులలోని యిట్టి వాక్యము లితనియోషధీరోగచికిత్సాది విజ్ఞానమును, నాఁటిచరకసుశ్రుతాది సంహితావ్యాప్తిని దెలుపుచున్నవి. తననాఁడు చీనాదేశమునం

డీయు నితరద్వీపములనుండియు భరతఖండమునకు లవంగపుష్పాదివస్తువులు వచ్చుచుండెడివనియు, భారతీయు లోడలపై యానముచేసి యితర ద్వీపములవాణిజ్యము చేయుచుండెడివా రనియు,

"కథం సముద్రవ్యవహారీ సార్థవాహో ధనమిత్రో నామ నౌవ్యసనే విపన్నః!"

"అనేన సార్థం విహారాంబురాశే స్తీరేషు తాలీవనమర్మరేషు,
ద్వీపా న్తరానీతలవంగపుష్పై రపాకృతస్వేదలవామరుద్భిః"
"సంతానకాకీర్ణమహాపథం త చ్చీనాంశుకైః కల్పితకేతుమాలమ్"

ఇత్యాదివాక్యములఁ దెల్పుచు దేశనాగరకతను సూచించి యున్నాఁడు.

వివిధవిజ్ఞాననిధి యగునితనిమహత్త్వ మిం దెం తని చూపనగును? రఘుమహారాజు దిగ్విజయయాత్రను వర్ణించినరఘువంశ చతుర్థసర్గ ప్రాచీనహిందూదేశచిత్రపటముకాదా! అందలిసర్గ లన్నియు మనోహరములే యైనను, పదునాల్గవసర్గవలెఁ బాఠకునిహృదయమును తన్మయముగావింపఁజాలవు. అందు సీతను విడుచు రాముఁడును వనముపాలయినసీతయు నన్నయీమాటలు రాతిని కరఁగించవా.

"అవైమి చైనా మన ఘేతి కింతు లోకాపవాదో బలవా న్మతో మే
ఛాయాహి భూమే శ్శశినో మలత్వే నారోపితా శుద్ధిమతః ప్రజాభిః"
"వాచ్య స్త్వయా మద్వచనా త్స రాజా, వహ్నౌ విశుద్ధా మపి యత్సమక్షం,
మాం లోకవాదశ్రవణా దహాసీః, శ్రుతస్య కిం తత్సదృశం కులస్య!"
"సా హం తప స్సూర్యనివిష్టదృష్టి రూర్ధ్వం ప్రసూతే శ్చరితుం యతిష్యే,
భూయో యథా మే జననాంతరేఽపి త్వ మేవ భర్తా నచ విప్రయోగః"

పాశ్చాత్యులహృదయమునుగూడ బరవశము గావించినశాకుం తలమును తక్కినయితని దృశ్యములు రెండును పోలవని కవితాభిజ్ఞులం దురుగాని, యితనిపాఠ్యములుమాత్రము మూఁడును మూఁడే. మల్లినాథుఁ డన్న ట్లిందలిసారమును విశదీకరింప మన మెవరము? ఇదియిట్టి దని దిఙ్మాత్రముగాఁ దెల్పుట కాగడాతో సూర్యుని జూపుటగాదా!

—o—

# మాతృగుప్తుఁడు

సుశీలుఁడు సత్వగుణసంపన్నుఁడు నైనయీబ్రాహ్మణోత్తము నిందు కవిగాను దేశపాలకునిగాను తెలిసికొనుటయే మనకు లభించు ఫలము. ఈపేర లౌకికవాఙ్మయమున విఖ్యాతుఁ డైనపురుషుఁ డింకొకఁడు లేఁడు. ఇతనిచరిత్రము చిత్ర మైనది. రాజతరంగిణి తృతీయతరంగమున ౧౦౦—౩౨౦ నడుమనున్నశ్లోకముల సంగ్రహతాత్పర్యమిందు తెలుపుచున్నాను.

“ గోనందవంశములో తుంజీనుఁ డనఁబడు ప్రవరసేనుని పెద్దకొడుకు హిరణ్యసేనుఁడును అతఁడు చెఱలో పెట్టించినయతనితమ్ముఁ డైనతోరమాణుఁడును కొంచె మెచ్చుతక్కువగా నొక్కమాఱే గతించిరి. కుమ్మరయింట రహస్యముగా పెరుగుచున్న తోరమాణుని కొడుకు (ద్వితీయ) ప్రవరసేనుఁ డనుబాలుఁడు తీర్థయాత్ర లొనరింప దేశము విడిచిపోయెను. కాశ్మీర మరాజకమై మంత్రులపరిపాలనములో నున్నయాసమయమం దుజ్జయినీపాలకుఁడు శ్రీహర్షుఁ డనఁబడు విక్రమాదిత్యుఁడు. కాశ్మీర మతనియాజ్ఞలో నున్నది[1]

1. తత్రానేహ స్యుజ్జయిన్యాం శ్రీమా౯ హర్షాపరాభిధః ఏకచ్ఛత్ర శ్చక్రవర్తీ విక్రమాదిత్యఇత్యభూత్ రా. త. ౩. ౧౨౫.

శ్రీహర్షుఁడు దిగంతవిశ్రాంతకీర్తి. అతనిదర్శనమునకు నిరంతరము వచ్చువిద్వాంసులు కవు లనేకులు. ఒకనాఁడు మాతృగుప్తుఁ డనువిద్వత్కవి యతనిసభకువచ్చి రాజును చూచి "యితనిని కొలుచుచు నిందుండుటయే జన్మసాఫల్యమునకు మూల" మనుకొని నిత్యము వచ్చి కొలువులో కూర్చుండి పోవుచుండెడివాఁడు. అంతేకాని యేవిద్యాగోష్ఠిలోను ప్రసక్తి కలిగించుకొనెడివాఁడు కాడు. తనమనోరథ మిది యని యేని కెవ్వరును తెలిపినవాఁడు కాఁడు. శ్రీహర్షుఁడు నతని సాత్వికవృత్తి కనిపెట్టియు, అడుగకుండఁగా సత్కారము చేయ నేల యని యుపేక్షించుచు వచ్చెనుగాని, అన్నపానీయము లెట్లు లభించుచున్న వనియడుగనైన నడుగలేదు. ఇట్లొకసంవత్సరము గడచినది

ఒకశీతకాలపురాత్రి రాజప్రాసాదములోని దీపములు పెద్దగాలికి కునుకఁ జొచ్చినవి. విక్రమాదిత్యుఁ డాసమయమున లేచి దీపములు బాగుచేయించుటకై "యెవ రక్కడ" అని కేకవేసెను. భటులందఱు నిద్రలో నుండిరి. క్రిందిద్వారముదగ్గఱ నున్నయాకవి "మాతృగుప్తుఁడను నే నున్నా" నని బదులుచెప్పి రాజునానతిని పైకి వెళ్ళి దీపములు చక్కఁజేసి తిరిగి పోవుచుండ నొక్కనిముష ముండు మని రా జాజ్ఞాపించెను. చలికి భయము తోడ్పడ నితఁడు వణఁకుచు నిలువఁబడెను. అప్పుడీసంభాషణము జరిగినది.

రాజు— ఇంకా రాత్రి యెంత యున్నది ?

మాతృ— జా మున్నర యున్నది మహారాజా !

రాజు— నీ కెట్లు తెలిసినది ? నీవునిద్రించ లేదా ?

మాతృ— "దీనితో నాదైన్య మైనా పోవలెను. లేదా, నాయూపిరైనా యడుగంటి పోవలెను" అని తలంచి ఆశువుగా—

"శీతే నోద్ధుషితస్య మాషశిమి వచ్చింతార్ణవే మజ్జతః,
శాంతాగ్నిం స్ఫుటితాధరస్య ధమతః క్షుత్ క్షామకంఠస్య మే.

నిద్రా క్వాప్యవమానితేవ దయితా సంత్యజ్య దూరం గతా,
సత్పాత్రప్రతిపాదితేవ వసుధా న క్షీయతే శర్వరీ"[1]

[ఈశ్లోకము మాతృగుప్తునిమాటగా కల్హణుఁడు కల్పించిన దని భ్రాంతిపడరాదు: అతని శ్లోకముగా నాఁటికి విద్వల్లోకమున వ్యాపించి యున్న దే- ఈశ్లోకముకార్పటుకునిదని క్షేమేంద్రుఁడౌచిత్యవిచారచర్చలో తెలుపుటప్రామాదికము]

అపుడు శ్రీహర్షుఁ డతనియవస్థకు జాలిపడి యింతకాల మితని నుపేక్షించుట పొరపాటే యని పశ్చాత్తాపపడి యితని కేమి యుపకారముచేసి యీదోషము పరిహరించుకొందునా యని యాలోచించి కాశ్మీర మరాజక ముగానుండుట స్మరించి 'సత్పాత్రప్రతిపాదితేవసుధా" యన్నకవిమాట తలంచి, సరే వెళ్లు మని సెలవిచ్చి "నాశాసనము తెచ్చినయీమాతృగుప్తుని గాశ్మీరసింహాసనారూఢుని జేయవలసిన" దని కాశ్మీరమంత్రులపేరనపుడే జాబు వ్రాసి గూఢచారుల కిచ్చి పంపించి మఱియు నపుడే శాసనము వ్రాసిసీలుచేసియుంచెను.

మఱునాఁ డుదయము యథాపూర్వముగా కొలువున కేగిన యితనికి రాజసన్నిహితోద్యోగి యాశాసనలేఖ నిచ్చెను. అపుడు రాజితనిని చూచి నీవు తిన్నగా దీనిని తీసికొని కాశ్మీరరాజధాని కేగి యచ్చటిమంత్రుల కిమ్ము. దారిలో నిది విప్పి చూడకు. అట్లు చేసితివేని నాతోడుసుమీ! అని చెప్పి పంపెను.

"ఇట్లితనిని బాధించుచున్నాఁడు రా జెందుకో" యని సభలోనివా రనుకొనిరి. "దైవ మేమి విధించెనో యదే యగు" నని

1. విచారసాగరమున మునిఁగి చలికి వణఁకిపోవుచు చల్లాఱినని ర్వ్రాఁదుకొనుచు పెదవి పగులఁగా, ఆఁకటిచిచ్చున కంఠము సన్నగిల్లఁగా కుషి౯ంచియున్న నన్నుఁ జూచి అవమానింపఁబడినప్రియురాలు విడిచిపోయినట్లు నిద్రాదేవి నన్ను విడిచి యెక్కడికో పోయినది. సత్పాత్రదత్తమైనభూమివలె రాత్రిమాత్రము క్షీణింప కున్న దని భావము.

యితఁ డనుకొని వెంటనే బయలుదేఱి కొన్నాళ్లకు శ్రీనగరముచేరి శ్రీహర్షవిక్రమాదిత్యుని దూతగా సభాభవనముఁ జొచ్చి యాలేఖను మంత్రుల కిచ్చెను. వారది చదువుకొని భయభక్తివినయములతో నతని గౌరవించి మూర్ధాభిషిక్తుని జేసిరి. మాతృగుప్తుఁడు ప్రజానురంజనముగాఁ బరిపాలన చేయుచున్నాఁ డని దేశమంతట మ్రోఁగినది. మాతృగుప్తుని కృతజ్ఞతాపూర్వకవిజ్ఞాపనపత్ర మందుకొని శ్రీహర్షవిక్రమాదిత్యుఁ డానందించెను.

ఇది యిట్లుండ ద్వితీయప్రవరసేనుఁడు దీక్షతో శివునిగూర్చి తపస్సుచేసి రాజ్యవరము నొంది సైన్యము సమకూర్చుకొని శత్రువిజయమునకు బయలువెడలి త్రిగర్తుల నోడించి యుజ్జయినీమీఁదికి దండెత్తి వచ్చి యాసమయమున విక్రమాదిత్యుఁడు స్వర్గస్థుఁ డైనవార్త విని యురాజధానిముట్టడించి వశ్యుఁ డైనయతనికొడుకు ప్రతాపశీలుఁ డను శీలాదిత్యుని కభయ మిచ్చి సింహాసనమున నిలిపి, పూర్వము తమరాజధాని యగు శ్రీనగరమునుండి యుజ్జయినీనాథుఁడు తెచ్చినసింహాసనమును మరల శ్రీనగరమునకు పంపించి కాశ్మీరమునకు బయలుదేఱెను. ఆవిషయమెఱిఁగి మాతృగుప్తుఁడిఁకలాభములేదని తెలిసి రాజ్యము విడిచి కాశీయాత్రకు బయలుదేఱెను. ఆసంగతి తెలిసి ప్రవరసేనుఁ డితని సమీపించి మీపరిపాలనము జనరంజకముగా నున్న దని విన్నాను. రాజ్యము విడువ వద్దని ప్రార్థించెను గానిమాతృగుప్తుఁడు వినక బ్రాహ్మణోచిత మైనసన్న్యాసమే నా కింకఁ గర్తవ్య మనియారాజపుత్రునికి నచ్చఁజెప్పి కాశి కేగి సన్న్యసించి బ్రహ్మనిష్ఠనుండెను. ద్వితీయప్రవరసేనుఁడు కాశ్మీరసింహాసన మధిష్ఠించెను. మాతృగుప్తుఁడు దాదాపు, ఆఱుసంవత్సరములు రాజ్యము చేసెననియు, కవియుఁ గవిపోషకుఁడు నై ప్రసిద్ధిగాంచె ననియు నిందలి యితనిచరిత్రమునఁ దెలిసెను గాని, యితని సంతతిమాట యిం దేమియుఁ దెలియరాదు.

ఇందు పేర్కొనఁబడిన శ్రీహర్షవిక్రమాదిత్యుని కాల మిదియనెడి నిశ్చయము నేఁటికిని లభింపలేదుగాని, చాలామంది విమర్శకు లితఁడు క్రీ. పూ. ౫౭ లోనివాఁ డన్నమతమునే బలపఱచిరి. కాళిదాసజీవితము లో నేనీవిషయము విశదపఱచియున్నాను. కల్హణుఁడు చూపినరాజుల రాజ్యకాలసంవత్సరములనుబట్టి శా. ౬౨౨ ప్రాంతమున యశోవర్మ నోడించిన కాశ్మీరరాజగులలితాదిత్యునికి పూర్వము ౬౩౮ సంవత్సరములక్రిందట మాతృగుప్త శ్రీహర్షవిక్రమాదిత్యు లున్నట్లు తెలియుచున్నది. పూర్వోక్తకాలమునకును దీనికిని ౧౨౨ సంవత్సరముల యంతరము కనఁబడుచున్నది గాని వీరాకాలము దాఁటి యీవలికి మాత్రము రారనుట కొకప్రమాణ మున్నది.

ప్రవరసేనుఁ డనురాజు రావణవధ యనునామాంతరము గలసేతుబంధ మనెడిప్రాకృతకావ్యము రచియించినట్లు దండి భట్టబాణాదిమహాకవులు స్మరించియున్నారు. క్షేమేంద్రాదు లందలిపద్యములనౌచిత్యవిచారచర్చాదులలో నుదాహరించియున్నారు. ఆప్రవరసేనుఁడు కాశ్మీరరాజనియు, శా. ౪౫ ప్రాంతమున నున్నవాఁ డనియు కావ్యమాలాప్రకాశకు లన్నారు. కాని, యతఁడు ప్రథమప్రవరసేనుఁడో ద్వితీయప్రవరసేనుఁడో నిర్ణయించలేదు. సేతుబంధకర్త ద్వితీయుఁడైనచో నతఁడు శా. శ. ౧౦౨ ప్రాంతములోనివాఁడై యుండు నని మఱికొందఱివ్రాఁతలవల్ల తెలియవచ్చుచున్నది. అపుడు మాతృగుప్తునివల్ల రాజ్యముగైకొన్న ద్వితీయప్రవరసేనుఁడు సేతుబంధకర్త కాఁడేమో యనవలసి వచ్చుచున్నది. ఆతాతమనుమ లిద్దఱికిని సుమారు ౪౭ సంవత్సరములయంతర మున్నది. ఇది యిట్లుండ, చంద్రికకవి నాదరించినప్రథమతుంజీనుఁడు మొదలుగా నేడుగురు కాశ్మీర మేలినపిదప నీమాతృగుప్తుఁడు విక్రమాదిత్యునిచే రాజుగా నియోగింపఁబడినట్లును, ఆయేడుగురికాలము ౨౨౨ సంవత్సరములయినట్లును రాజతరంగిణి యిచ్చిన లెక్కలవల్ల

దెలియుచున్నది. ఈప్రకారము మాతృగుప్త శ్రీహర్షవిక్రమాదిత్యులు శా. శ. ౪౦ లో (క్రీ. ౧౧౭) నున్నట్లు తేలుచున్నది. ఇది క్రీ. పూ. ౫౬ లో శకారి శకకర్త యైనవిక్రమాదిత్యుఁడున్నాఁ డన్నప్రసిద్ధవిశ్వాసమునకు వే ఱగుచున్నది. అందుచే నితనికాలము సందిగ్ధమే యగుచున్నది. ఏమయినను కాళిదాసున కితఁడు పరు డందము.

ఈమాతృగుప్తుఁడే ప్రసిద్ధకాళిదా సని యొక రిద్దఱుభ్రాంతిపడిరి గాని యది సరిగాదు. అదిగాక యితఁడు రఘువంశాదికృతులు నిర్మించి నట్లు గాని, అతఁడు దైన్య మనుభవించి రాజై తుదకు సన్న్యసించినట్లు గాని ప్రమాణ మొకటియుఁ గనఁబడదు. పైగా, మాతృగుప్తునిపేర లాక్షణికులు తమ కృతుల నుదాహరించిన శ్లోకములలో నొకటియుఁ గాళిదాసుపేర నున్నయొకకృతిలోను గనరాదు. కావునఁ గాళిదాసు వార్ధకదశలో మనమాతృగుప్తుఁ డుండియుండునేమో యని యూహింప వలసినదే కాని, యంత కెక్కువగా భావించుట కవకాశమే లేదు.

అభినవగుప్తాచార్యుఁడు తన త్రింశికావివరణావతారికలో తనవంశములోని మూలపురుషుఁ డైనమాతృగుప్తుఁ డంతర్వేదినుండి కాశ్మీరమునకు వచ్చినట్లు తెలిపియున్నాఁడు. కాని, కాశ్మీరపాలకుఁడు గా వచ్చినట్లు తెలుపలేదు. ఆనాఁటికి పూర్వము యశస్కరుఁడు కాశ్మీరరాజుగా నున్న ట్లాయవతారిక తెలుపుచున్నది. ఆపేరు ప్రథమప్రవరసేనునికి నామాంతర మేమో, కాని, రాజతరంగిణి యామాట చెప్ప లేదు. అయినా, అభినవగుప్తునికి సుమారు వెయ్యేండ్ల క్రిందటి యాచరిత్రాంశము లేయేవిధముగా మాఱి యతనిచెవిని బడెనో మనము నిర్ణయింపలేము గాని యభినవగుప్తపండితవంశమూలపురుషుఁ డైనయా మాతృగుప్తుఁడే మనమాతృగుప్తుఁ డనుటకు విద్వత్కవి యైనయితనిరచనల ప్రసక్తివల్ల భావింపవలసి వచ్చినది. ఈభావన సముచితము కాక పో దనుకొందును.

మాతృగుప్తుని మొదటినివాస మైనయంతర్వేది యేది యని సందిగ్ధముగా నున్నది. దిగ్విజయయాత్ర చేసినలలితాదిత్యుఁడు పూర్వదిక్కున నున్నరాజులవల్ల నరియప్పనములు గొని, అంతర్వేదిలో కీర్తి కిరీటము ధరించి ప్రకాశించె నని రాజతరంగిణి[1]. ఆయంతర్వేది ప్రయాగ దేశములోని గంగాయమునానదులమధ్యభూమి యని తత్ప్రకాశకులు. అదిలంక పేరు. తూర్పుగోదావరీమండలమున గౌతమీసాగర సంగమస్థలమున నృసింహస్వామిక్షేత్రము పురాతనమై యంతర్వేదిసంజ్ఞ చెందియున్నట్లు స్కాందాంతర్గత మైనగౌతమీమాహాత్మ్యము. ఈగ్రామము నేటికి నున్నది. ఈ రెంటిలో నేది కాశ్మీరమునకు తూర్పుగా నున్నదో లలితాదిత్యుఁడు త్రొక్కినదేదో విమర్శకు లూహింతురుగాక.

ఈ కాశ్మీరపాలక బ్రాహ్మణకవి రచియించినకృతు లేవియుఁ గనరావుగాని యితఁడుకొన్ని రచియించినమాటమాత్రము సత్యము. ఈక్రింది శ్లోక మొక కావ్యములోనిదై యుండు నని పాఠకులకు తోఁచకపోదు. ఇదియౌచిత్యవిచారచర్చలోనున్నది.

"నా యం నిశాముఖసరోరుహరాజహంసః
కీరీ కపోలతలకాంతతను శ్శశాంకః,
ఆభాతి నాథ! త దిదం దివి దుగ్ధసింధు
డిండీరపిండపరిపాండుయశ స్త్వదీయమ్"

ఇతఁడు భరతనాట్యశాస్త్రమునకు వ్యాఖ్యానము నిర్మించినట్లు సుందరమిశ్రుఁడు నాట్యప్రదీపమున సూచించియున్నాఁడు. అభినవగుప్త కుంతకాదు లితనిపే రెత్తి యితనిమాట లుదాహరించియున్నారు. సంగీతరత్నాకరమునందు శార్ఙ్గదేవుఁడు సంగీతశాస్త్రప్రసిద్ధు లగుపూర్వులలో నితనిని జేర్చిని యున్నాఁడు. వీటి నన్నిటినిబట్టి చూడ నితఁడు సంగీత

1. తతం పూర్వదిశో గృహ్ణన్ ప్రతాపానలసన్నిభా. అంతర్వేద్యాం మహారాజ స్స్వకీర్త్యుష్ణీషభృ ద్బభౌ. 3-౧3౨

సాహిత్యములు రెంటను బ్రామాణికుఁడై యేయే కృతులు నిర్మించినవాఁ డని తెలియకపోదు. అయితే నేమి? ఇట్టిసుప్రసిద్ధపురుషునికృతులను గూడా కాలము మ్రింగి వేసినది. ఇఁక నీతనిసభలోనిభర్తృమేంఠునిగూర్చి యించుక తెలిసికొందము.

—o—

# భర్తృమేంఠుఁడు

కొంతకాలము పెద్దవెలుఁగు వెలిఁగి చల్లాఱిపోయిన యితనికవితా తేజమును స్మరించుటయే మన కిపుడు ఫలము. పరిమళకాళిదాసు, వైదర్భమార్గ ప్రవర్తకులలో నగ్రేసరుఁడు ప్రాచీనుఁడు నని యీకవి నిట్లు స్తుతించియున్నాఁడు.

"తత్వాస్ప్వ్రశ స్తే కవయః పురాణాః, శ్రీభర్తృమేంఠప్రముఖాజయన్తి
నిస్త్రింశధారాసదృశేన యేషాం, వైదర్భమార్గేణ గిరః ప్రవృత్తాః"

ఇతఁడే వాల్మీకిమహాకవిరూపద్వితీయావతార మని, తన్ను నుతించుకొనుసందర్భమున రాజశేఖరకవి యిట్లు నుతించెను.

"బభూవ వల్మీకభవఃకవిఃపురా,తతః ప్రపేదే భువిభర్తృమేంఠతామ్
స్థితః పున ర్యో భవభూతిరేఖయా, స వర్తతే సంప్రతి రాజశేఖరః"

ఇతఁడే మేంఠశబ్దమునకుఁ గలమావటీఁ డనెడియర్థము సార్థకమగునట్లుగా, నితనివక్రోక్తి యనెడియంకుశము నాటుకొని కవిగజములు తలలాడించుచున్న వని యిట్లువర్ణించెను.

"వక్రోక్త్యా మేంఠరాజస్య, వహన్త్యా సృణిరూపతామ్,
ఆవిద్ధా ఇవ ధున్వన్తి, మూర్ధానం కవికుంజరాః."

కాశ్మీరీయుఁడైనమంఖకవి తనశ్రీకంఠచరితావతారికలో నితనిని స్తుతించియున్నాఁడు. కల్హణుఁడు రాజతరంగిణి తృతీయతరంగములో

భర్తృమేంఠుఁడు తనరచియించినహయగ్రీవవధకావ్య మప్పటికాశ్మీరరాజైనమాతృగుప్తునికి చూపి సత్కరింపఁబడి నట్లీక్రిందిశ్లోకములఁ దెల్పియున్నాఁడు.

"హయగ్రీవవధం మేంఠ స్తదగ్రే దర్శయ న్నవమ్
ఆసమాప్తి తతో నాప త్సాధ్వసా ధ్వితి వా వచః,
అథ గ్రథయితుం తస్మిన్ పుస్తకం ప్రస్తుతే న్యధాత్
లావణ్యానిర్యాణభియా తదధ స్స్వర్ణభాజనమ్
అన్తర్జ్ఞతయా తస్య తాదృశ్యా కృతసత్కృతిః
భర్తృమేంఠః కవి ర్మేనే పునరుక్తం శ్రియో ఽర్పణమ్"

క్షేమేంద్రుఁడు తనసువృత్తతిలకములో "అనుష్టుప్పు" సర్గబంధకావ్యమునకు మొదటను, కథావిస్తరము సంగ్రహించునపుడును, శమోపదేశవృత్తాంతము తెలుపునపుడును సత్కవులు వాడుదు రని లక్షణము చెప్పి సర్గబంధారంభమునకు భర్తృమేంఠునియీక్రిందిశ్లోకము నుదాహరించెను. ఇది యితని హయగ్రీవవధలోని దని రాజశేఖరుఁడు కావ్యమీమాంసలో నుదాహరించెను. గావున నితఁ డీకావ్యము రచియించె ననుటకు సందేహము లేదు. ఆశ్లోక మిది:—

"ఆసీ ద్దైత్యో హయగ్రీవః సుహృ ద్వేశ్మసు యస్య తాః,
ప్రథయన్తి బలం బాహ్వో స్సితచ్ఛత్రస్మితా శ్రియః.

మేంఠశబ్దమునకు పర్యాయమైనహస్తిపకపదమునుకూడా పూర్వు లితనియెడ "యథా భర్తృమేంఠస్య-యథా హస్తిపకస్య" అనుచు వాడియున్నారు. భోజమహారాజు తనశృంగారప్రకాశములో నీరెండుపేర్లు కూడా వాడియితని హయగ్రీవవధలోనియీశ్లోకము లుదాహరించియున్నాఁడు. ఇవిసదుక్తికర్ణామృతములోకూడ నితనిపేరనున్నవి.

"వాచో మాధుర్యవర్షిణ్యో నాభయ శ్శిథిలాంశుకాః,
దృష్టయశ్చ చలద్భ్రూకా మండనా న్యంధ్రయోషితామ్.
"తథా ప్యకృతకోత్తాలహాసపల్లవితాధరమ్,

ముఖం గ్రామవిలాసిన్యా స్సకలం రాజ్య మర్హతి"
"న తథా నాగరస్త్రీణాం విలాసా రమయన్తి నః,
యథా స్వభావముగ్ధాని వృత్తాని గ్రామ్యయోషితామ్"

భర్తృమేంఠు డాంధ్రదేశము బాగా తిరిగినవాఁడైనఁ గావలెను లేదా, మాతృగుప్తుఁ డాంధ్రదేశములోని యంతర్వేదినుండివెళ్లినవాఁడే యైతే, అతనియింట మెలఁగినవాఁడైనఁ గావలెను. లేకున్న నంధ్రస్త్రీ వర్ణనమింత సహజముగాఁ గావింపలేఁడు. మఱియు, గ్రామ్యనాగరకాంతలవిలాసభేదముల నతిమృదువుగా స్వభావోచితముగాఁ బ్రత్యక్షముగా వించినయితని ప్రకృతిసౌందర్యవిజ్ఞాన మందుమా, సాటి లేనిది. అట్టియీ మహాకవికృతియుఁ బోషకునికృతులతోఁ గాలగర్భమున నణఁగిపోయినది. మాతృగుప్త భర్తృమేంఠులనామములుమాత్రమునిలచినవి- సదుక్తికర్ణామృతములోనున్న యితని శ్లోకములు మఱిరెండునిలచినవి.

"ఘాసగ్రాసం గృహాణ త్యజ కరికలభ! ప్రేమబంధం కరిణ్యాం,
పాశగ్రంథివ్రణానా మవిరత మధునా దేహి పంకానులేపం,
దూరీభూతా స్తవైతే శబరవరవధూ విభ్రమోద్భ్రాన్తదృష్టా
రేవాతీరోపకంఠచ్యుతకుసుమరజోధూసరా విన్ధ్యపాదాః"
"త్యక్తో విన్ధ్యగిరిః పితా భగవతీ మాతేవ రేవా నదీ,
తే తే స్నేహనిబంధబంధురధియ స్తుల్యోదయా దన్తినః,
త్వల్లోభా న్ననుహస్తిని స్వయ మిదం బంధాయ దత్తం వపు,
స్త్వం దూరే ధ్రియసే లుఠన్తి చ శిరఃపీఠే కఠోరాంకుశాః"

—o—

## అశ్వఘోషుఁడు

ఇతఁడు బౌద్ధుఁడు విద్వత్కవి మతగురువు. ఇతని మొదటినివాసము పాటలీపుత్రము. తరువాత పెషావ రనఁబడుపురుషపుర మనియు నితఁడు

కనిష్కమహారాజునాస్థానమున నున్నవాఁ డనియు నందురు. కనిష్కుని కాలము విమర్శకలోకమున మిక్కిలిసందిగ్ధమైనది. అతనికాలము గౌతమబుద్ధనిర్వాణకాలమునకు సంబంధించి యున్నది. బుద్ధనిర్వాణా నంతరము ౧౫౦ ఏండ్లనాఁడు హుష్కజుష్కకనిష్కు లనుతురుష్కులు కాశ్మీరమున తమనామముల మూఁడుపురములు నిర్మింపఁజేసి రనియు మఠచైత్యాదులు కట్టించి రనియు, ఆకాలమున కాశ్మీరము బౌద్ధభోజ్య మైన దనియు, తాను విన్నపురాతనమతమును కల్హణుఁడు తెల్పెనుగాని దానివల్ల బుద్ధనిర్వాణకాలము గోచరింపదు. ఆకనిష్కుని కీయశ్వఘో షుఁడు సమకాలమువాఁ డనియు తెలియరాదు[1] చరిత్రకారులు కనిష్కుని కాలమును బహువిధముల భావించియున్నారు. రాజతరంగిణిబట్టి చూచి నచో, అశోకుని పౌత్త్రుఁ డగుదామోదరునియనంతరము కనిష్కుఁడు కాశ్మీర మేగినట్లు కనవచ్చును. అతనికాలమునుబట్టి చూచిన నో కని ష్కుఁడు శా. శకపూర్వము నాల్గవశతాబ్దిలోనివాఁడు కావచ్చును. అశోకునికాలమును క్రిందికి దింపినమతములనుబట్టి క్రిందికి దిగవచ్చును. ఇంతకును మనయశ్వఘోషుఁడు కల్హణుఁడు చూపిన కనిష్కునియాస్థాన ములోనివాఁ డనుటకు ప్రబలప్రమాణ మేమున్నది ? కావున నీకవి శా. శకారంభకాలమువాఁ డని మాత్రమే తలఁతము. శ్రీ. కొలుపండి తుఁడు బుద్ధచరిత్రపీఠికలో చూపినకాలము శా. శ. ౭౦–౧౫౦.

ఈకవి ఆర్యస్వర్ణాక్షీతనయుఁడు పార్శ్వపండితుని శిష్యుఁడు ఇతఁడు బుద్ధునిజీవితవృత్తాంతమును బుద్ధచరిత్ర యనుపేర పద్యకావ్య

---

1. అథాభవన్ స్వనామాఙ్కపురత్రయవిధాయినః హుష్కజుష్క కనిష్కాఖ్యా స్త్రయస్తత్రైవ పార్థివాః। తే తురుష్కాన్వయోద్భూతా అపి పుణ్యాశ్రయా నృపాః। శుష్కలేత్రాదిదేశేషు మఠచైత్యాది చక్రిరే ప్రాజ్యే రాజ్యక్షణే తేషాం ప్రాయః కాశ్మీరమండలం భోజ్య మాస్తే స్మ బౌద్ధానాం ప్రవ్రజ్యోర్జితతేజసాం తదా భగవత శ్శాక్యసింహస్య పరనిర్వృతేః। అస్మి న్మహీలోకధాతౌ సార్ధం వర్ష శతం హ్యగాత్ రాజత. ౧ తరం—

ముగా నిర్మించెను. అది ౧౭ సర్గలకావ్యము కాని యితఁడు రచియించినవి ౧౩ సర్గలుమాత్రమే యనియు తక్కిననాలుగుసర్గలును అమృతానందుఁ డనెడియర్వాచీనకవి నిర్మించిన వనియుఁ గొందఱందురు. నేపాలదేశీయుఁ డైనయితఁడు క్రీ. ౧౮౩౦ ప్రాంతమువాఁడు[1].

అశ్వఘోషుని రెండవకృతి సౌందరనందము. ఇది పదునెనిమిది సర్గలకావ్యము. ఇందు బుద్ధునియుపదేశమునకు కట్టువడి నందుఁడు సన్న్యాసియై తనభార్య నెడఁబాసినందుకు పరితపించుట, అతనిపత్ని సుందరి పతివియోగమునకు దుఃఖించుట యనువిషయములు ప్రధానములు. ఇతఁడొక యలంకారగ్రంథము రచియించెనందురుగాని, యది కనరాదు.

అశ్వఘోషుఁడు కాళిదాసుకంటెఁ బరుండని వెనుకఁ దెలిసికొని యున్నాము. ఇతని కవిత్వ మతనికవిత్వమును బోల కున్నను, తక్కిన యనేకుల కవితకు తీసిపోదు. ఇందు కుదాహరణము:—

“ నావజానామి విషయాన్, జానే లోకం తదాత్మకమ్,
అనిత్యంతు జగ న్మత్వా, నాత్ర మే రమతే మనః,
జరా వ్యాధిశ్చ మృత్యుశ్చ, యది న స్యా దిదం త్రయమ్,
మ మాపి హి మనోజ్ఞేషు, విషయేషు రతి ర్భవేత్,

“ పరస్పరేణ స్పృహణీయశోభం,న చేదిమం ద్వంద్వమయోజయిష్యన్
అస్మిన్ ద్వయే రూపవిధానయత్నః, పత్యుః ప్రజానాం వితథో
ఽభవిష్యత్. ”

1. కనిష్కుఁడు బుద్ధనిర్వాణానంతరము ౯౦౦ ఏండ్లనాఁటివాఁ డని హుయిన్‌త్సాంగు, ౪౦౦ ఏండ్లనాఁటివాఁ డని మాక్సుముల్లరు, భండార్కరు క్రీ. ౨౭౮-పొంచి మొదలగు కొందఱు క్రీ. రెండవశతాబ్దివాఁ డశ్వఘోషుఁ డని, వి. స్మిత్తు వగయిరాలు క్రీ. ౭౮ అని............

అనురఘువంశశ్లోకము ననుసరించినా, యీక్రిందిసౌందరనందశ్లోక మెంతేని హృద్య మగుచున్నది.

"తాంసుందరీం చేన్న లభేత నందః, సా వా నిషేవేత న తం నతభ్రూః, ద్వంద్వం ధ్రువం తద్వికలం న శోభే, తాన్యోన్యహీనా వివ రాత్రిచంద్రా"

సుందరిని నందుఁడు పొందకపోయినా, సుందరి నందుని కూడక పోయినా, అయిద్దఱును, ఒకరి నొకరు విడిచి యున్నరాత్రిచంద్రుల వలె శోభింపరు. ఇంకను, కాళిదాసకవిత నితఁ డనుకరించె ననుటకు—

దిశః ప్రసేదు ర్మరుతో వవు స్సుఖాః–రఘువం–

దిశః ప్రసేదుః ప్రబభౌ నిశాకరః–బుద్ధచ,

వాతా వవు సౌఖ్యకరాః ప్రసేదుః—కుమార,

వాతా వవు స్స్పర్శసుఖా మనోహరాః—బుద్ధచ,

క స్యైకాన్తం సుఖ ముపనతం దుఃఖ మేకాన్తతో వా–మేఘసం.

అతోఽపి నైకాన్తసుఖోఽస్తికశ్చి న్నైకాన్తదుఃఖః పురుషఃపృథి వ్యాం–బుద్ధ.

ఇంక నిట్టివి కలవు గాని, యింతమాత్రమున నశ్వఘోషునికవిత్వ ప్రజ్ఞకు లోపము లేదు. కాళిదాసంతటిమహాకవి కూడా నొకటిరెండు చోట్ల భాసు ననుకరించలేదా? ఇట్టి యనుకరణము కొంచముగానో గొప్పగానో కవులయందు సాధారణముగాఁ గనవచ్చునదే. రఘువంశ సప్తమసర్గను కుమారసంభవతృతీయసర్గను చూచి బుద్ధచరిత్ర పురంధ్రీ వర్ణనమును కామవర్ణనమును గావించిన దనియు నిట్లే తెలియఁగలదు. దీనినిబట్టి కాళిదాసున కశ్వఘోషుఁడు పరుఁ డన్నమతము సమంజస మ్మనియుఁ దెలియఁగలదు.

—o—

# భర్తృహరి

శ్లో. మహాన్తః కవయ స్సన్తు, మహాన్తః పణ్డితా స్తథా,
మహాకవి ర్మహావిద్వా, నేకో భర్తృహరిః స్మృతః.

వ్యాకరణాచార్యుఁడు లోకజ్ఞానమూర్తి బ్రహ్మవేత్తయు నైన యీమహాకవి "చంద్రగుప్తుఁ డను బ్రాహ్మణునికి నాలుగుజాతులభార్యల యందును క్రమముగా జన్మించిన వరరుచి విక్రమార్కుఁడు భట్టి, భర్తృహరి యను భిన్నోదరులలో శూద్రస్త్రీయం దుదయించినవాఁ" డనియు, "వలభీపాలకుఁ డైనభట్టారకుఁ డనెడిభట్టిరాజునాస్థానకవి" యనియు, నొక దేశమునకు రాజుగా నుండి, యొక బ్రాహ్మణుఁడు తన కిచ్చినపండు తనభార్య కిచ్చి, ఆమె తనప్రియుని కిచ్చుట కనిపెట్టి విరక్తి చెంది సంసారము విడిచిన వాఁ" డనియు నేవేవో కట్టుకథలు లోకములో వ్యాపించిన వని పాఠకు లెఱుఁగుదురు. అందలి వైరాగ్యకథ నమ్మి త్రిశతికి వ్యాఖ్య వ్రాసినయర్వాచీనుఁ డావంచరామచంద్రపండితుఁడు.

" విప్రేణాభూతపూర్వం ఫల మధితప సా లబ్ధి సూర్యప్రసాదాత్ "

ఇత్యాదిశ్లోకమున నితనివిరక్తిని వర్ణించియున్నాఁడు. ఆకథలు కట్టిపెట్టి యితనిసత్యవృత్తాంతము కనుఁగొనయత్నింతము. పాతంజల భాష్యమునకు మహాభాష్యత్రిపది మహాభాష్యదీపిక యనురెండువ్యాఖ్యలు నిర్మించినయితనిని దనప్రదీపవ్యాఖ్యావతారికలోఁ గైయటుఁ డీట్లు స్తుతించియున్నాఁడు.

" భాష్యాబ్ధిః క్వా తిగమ్భీరః? క్వాహం మన్దమతి స్తతః ?
ఛాత్రాణా ముపహాస్యత్వం యాస్యామి పిశునాత్మనామ్.
తథాపి హరిబద్ధేన సారేణ గ్రన్థసేతునా,
క్రమమాణ శ్శనైః పారం తస్య ప్రాప్తాస్మి పఙ్గువత్ "

కాశ్మీరరాజగు ముక్తాపీడుని మంత్రి యైన లక్ష్మణుని వంశములోని వాఁడును, భూపతి రాజసుతుఁడు నైన హేలారాజీతని వాక్యపదీయమునకు వ్యాఖ్య వ్రాయుచు నవతారికలో నిట్లు నుతించెను.

"త్రైలోక్యగామినీ యేన త్రికాణ్డీ త్రిపదీ కృతా,
తస్మై సమస్తవిద్యాశ్రీకాన్తాయ హరయే నమః"
"సూక్తిశ్రియః స్ఫుటా ఏతా జయన్తి జగతాం గురోః,
హరే ర్వాక్యాబ్ధిపీయూషచ్ఛటాచ్ఛురితవిగ్రహాః"

దానికే మఱియొకటీక వ్రాసినపుణ్యరాజు గ్రన్థాంతమం దిట్లు కీర్తించెను.

"గురవే భర్తృహరయే శబ్దబ్రహ్మవిదే నమః,
సర్వసిద్ధాన్తసన్దోహసారామృతమయాయ చ"

పూర్వశ్లోకములలోని హరిశబ్దము భర్తృహరినామైకదేశముగా వైయాకరణలోకమున స్థిరపడినది. ఇతని హరినామఖ్యాతికిని, మహావైదుష్యవిఖ్యాతికి నివి చాలును. ఇంక నితని సుభాషితత్రిశతీభట్టికావ్య పురుషార్థదశకాదులకు వ్యాఖ్యలు వ్రాసినవారును తత్తత్కావ్యలేఖకులును, అవతారికలయందును గ్రన్థాన్తములందు నేవిధముగా నితనిని బేర్కొన్నారో చూతము.

౧. సహృదయానందినీవ్యాఖ్యాతుఁడ నన్నమాట యిది:—
"ఇతి శ్రీభర్తృహరియోగీంద్రవిరచితా సుభాషితత్రిశతీసంపూర్ణా"
౨. ఇత్యాచార్యభర్తృహరిప్రణీతం పురుషార్థదశకం సంపూర్ణమ్"
౩. "వ్యాఖ్యానే భట్టికావ్యస్య శ్రీధరీయే మనోహరే"
౪. భర్తృహరి ర్నామ కవిః శ్రీరామకథాశ్రయం మహాకావ్యం చకార ముగ్ధబోధిన్యాం భట్టిటీకాయామ్" ఇతనిదే వెండట—
"భట్టిటీకాం ప్రకురుతే భరతో ముగ్ధబోధినీమ్"
౫. "శ్రీమద్గోవిందదీక్షితసూనువిక్రమావరజభట్టిమహాకవివిరచితే మహాకావ్యే—"(ఇది కట్టుకథ నమ్మి వ్రాసినమాట.)

౬. "ఇతి భర్తృకావ్యటీకాయాం జయమంగళాయామ్"

౭. "...వలభీవాస్తవ్యస్య శ్రీస్వామిసూనో ర్భట్టిమహాబ్రాహ్మణస్య మహావైయాకరణస్య ..."

౮. "శ్రీస్వామిసూనుః కవి ర్భట్టినామా రామకథాశ్రయం మహాకావ్యం చకార ..."

౯. కందర్పచక్రవర్తిమాట యిది:—

"అత్ర తావ న్మహామహోపాధ్యాయశ్రీభర్తృహరికవినా విరచితే భట్టికావ్యే శబ్దకాణ్డయో ర్లక్షణమ్ ..."

౧౦. నారాయణవిద్యావినోదునిమాట యిది:—

"అత్ర కవినా శ్రీధరస్వామిసూనునా భర్తృహరిణా సర్గబన్ధః ..."

౧౧. ఇంకొకప్రతిలో-భట్టికావ్యేతిజ్ఞన్తకాండే ద్వావింశస్సర్గః [1].

ఇంకనిట్టివెన్నేనికలవు. వీటినిబట్టి యితనికి హరి, భర్తృ అనెడి వాడుక కలదనియు, "భర్తృ" ప్రాకృతరూపముభట్టియనియు, భర్తృ, భట్టి నామములవ్యాప్తమైనభట్టికావ్య మితఁడు నిర్మించినదే యనియు నిస్సంశయముగ నమ్మవచ్చును. ఇతనితండ్రి శ్రీధరస్వామియనుటయు విశ్వసనీయమే.

ఒక్క జయమంగళావ్యాఖ్యతో నున్న కొన్నిపుస్తకములందు మాత్రమే కడపట నాలుగు శ్లోకము లున్నవి. అదే నిర్ణయసాగరముద్రణమునకు లభించినది. ఆశ్లోకము లెవరివోయాలోచింపక, అందే మూలమున "శ్రీధరసేన" యనియు టీకలో 'శ్రీధరసూను' అనియు, ద్వివిధముగా నున్నపాఠములగతి విచారింపక, మూలపాఠమును వలభీపురపాలకులగుధరసేనులకు సరిపుచ్చుచు నాధునికు లొకరిద్దఱు భట్టికావ్యము

1. తంజావూరులైబ్రరీ కేటలాగు, నం 3707 - The name of the author appears in some mss. as Bhartrhari.

భర్తృహరి రచియించినది కాదని యొకవాదము లేవనెత్తిరి[1]. ఆశ్లోకము లివి:—

"ఇద మధిగతముక్తిమార్గచిత్రం, వివదిషతాం వదతాం చ సన్నిబంధాత్, జనయతి విజయం సదా జనానాం యుధి సుసమాహిత మైశ్వరం యథాస్త్రమ్"

"దీపతుల్యః ప్రబన్ధో ఽయం, శబ్దలక్షణచక్షుషామ్,
హస్తాదర్శ ఇ వాన్ధానాం, భవే ద్వ్యాకరణా దృతే"

"వ్యాఖ్యాగమ్య మిదం కావ్య, ముత్సవ స్సుధియా మలమ్,
హతా దుర్మేధస శ్చాస్మిన్, విద్వత్ప్రియతయా మయా"

"కావ్య మిదం విహితం మయా వలభ్యాం శ్రీధరసేననరేంద్రపాలితాయామ్, కీర్తి రతో భవతా న్నృపస్య తస్య, ప్రేమకరః క్షితిపో యతః ప్రజానామ్"

గ్రన్థాన్తమున తాను రచియించి చేర్చిన శ్లోకములలో కడపటిదానికి జయమంగళుఁడు వ్రాసినటీకలోనిమాట లివి.

"మ యేదం కావ్యం విహితం కృతం శ్రీధరసూనునా నరేంద్రనామ్నా నృపేణ పాలితాయాం వలభీనామకపుర్యామ్ అతఏవ కావ్యవిధానాయ యా కీర్తిః సా త స్యైవ రాజ్ఞో భవతాత్"

ఇందలినరేంద్రుఁడు శ్రీధరసూనుఁడా? మూలములోనున్నట్లు శ్రీధరసేననృపాలుఁడా? అయితే అతనికి నరేంద్రుఁడనునామాంతరమున్నదా? వలభీరాజులలో నాల్గవధరసేనునివఱకుఁగాని, తరువాతఁగాని నరేంద్రుఁ డనురా జున్నాఁడా? శ్రీధరసేన, శ్రీధరసూనుశబ్దములయర్థమెట్లు సరిపడును? తాను విన్నయేదో కట్టుకథ విశ్వసించి ధరసేనుని తెచ్చిపెట్టి జయమంగళుఁడు కల్పించినపైశ్లోకములు మూలకర్త వని భ్రాంతిపడి వలభీరాజునరేంద్రునికి (క్రీ. ౫౦౦-౬౫౦) అంకిత

1. చూ. పి. వి. కాణేపండితునిసాహిత్యదర్పణాంగ్లపీఠిక-

ముగా భట్టి యనుకవి యీకావ్యము నిర్మించినాఁ డన్నయభిప్రాయము ప్రకటించుట ప్రామాదిక మని పైశ్లోకములు పరామర్శించినవారికి విదిత మగును. అయినా, పైశ్లోకములరీతి యొకింత యాలోకింతము.

పైశ్లోకములలో మొదటిరెండును గ్రంథప్రశంసాపరములు. తృతీయశ్లోకార్థము దురహంకారపూరితము. పరకోపయోగార్థము కావ్యము నిర్మించిన యేకవి యైనను "శాస్త్రజ్ఞానములేని దుర్మేధసుల నీకావ్యమం దణఁచివైచితి" ననుచు మతిమాలినమాటలు వ్రాయునా? నిజముగా భట్టియే కావ్యకర్త యైనచో నతఁ డిట్టిదురహంభావముకలవాఁ డనిచెప్పఁగలమా? ఇది యి ట్లుండనిండు.

"కీర్తి రతో భవతా న్నృపస్యతస్య" అను చతుర్థశ్లోకములోని వాక్యమేకదా భట్టి యనుపేరుగల యొకకవి క్రీ. ౫౦౦-౬౫౦ నడుమ నొకానొకధరసేనవంశరాజున కంకితముగా నీకావ్యము నిర్మించినాఁ డన్నవిమర్శకుల యభిప్రాయమున కాధారము? సరే కానిండు. ఈకావ్య యశోదాన మెట్టిది? కావ్యమును తద్రాజనామాఙ్కితముఁ గావిం చెనా? లేదు. కావ్యము భట్టి కావ్యమే. పోనీ! త ద్రాజవంశవర్ణనము గాని తద్రాజగుణవర్ణనముగానియొం దైనఁగనఁబడెనా? లేదు. అట్టియవ తారికయే లేదు. అహో ఏమిరాజభక్తి? ఏమికావ్య యశః ప్రదానము? అపూర్వముగదా? ఇం కెందుకు?

వ్యాఖ్యాతయైన జయమంగళుఁ డర్వాచీనుఁడు. వలభీపురప్రాన్త వాసి. భర్తృహరియని భట్టియని చాటుకథలు విన్నవాఁడు గాని వారి తత్త్వము తెలిసినవాఁడు కాఁడు. శ్రీధరసూనునరేంద్రుని యాస్థానమున భట్టి యనుకవి యుండె నని విన్నవాఁడుగాని యతనితత్త్వ మెఱిఁగినవాఁడు కాఁడు. ఆవిన్నవిషయము చేర్చుటకును తనవ్యాఖ్యానమహత్త్వము ప్రకటిం చుటకును పైనాలుగుశ్లోకములు కల్పించి గ్రంథాంతమునఁ జేర్చినాఁ డనుట నిజము. పైశ్లోకములు పరామర్శించిన వారి కీవిషయమున శంక యుదయింప దని నాయాశయము,

భట్టికావ్యమున కెంతో వెనుకఁబుట్టినది భామహుని కావ్యాలంకారము. అందు భామహుఁడు కావ్యపరిసంగము కావించుచు నానాధాత్వర్థయు యమకవ్యపదేశినియునైనప్రహేళిక సుఖబోధ్యము కానేరదనుతలంపుతో నిట్టికావ్యముఁలుకూడా శాస్త్రములవలె వ్యాఖ్యాగమ్యములైతే వీనివల్ల మంచివిద్వాంసు లానందింతురుగాని ప్రజ్ఞచాలనివా రణఁగిపోవుదురు గదా! అనుచుఁ దన్నిరసనముగా.

"కావ్యా న్యపి య దీమాని వ్యాఖ్యాగమ్యాని శాస్త్రవత్,
ఉత్సవ స్సుధియా మేవ హ_న్త దుర్మేధసో హతాః"

అని యొకశ్లోకము వ్రాసియున్నాఁడు. ఈశ్లోకమందలివిషయము బహువిధముల భట్టి కావ్యమునకు సరిపడుట యెఱింగి జయమంగళుఁడు తా నట్టికావ్యమునకు వన్నె తెచ్చినట్లు ప్రకటించుకొనుటకై యీభామహునిమాట లుపయోగించి మూఁడుశ్లోకము లితఁడు నిర్మించె ననుట స్పష్టము. కావున నిం కెందుకు వృథాచర్చ? భట్టికావ్యకర్త భర్తృహరియే

ఇ త ని కృ తు లు

ఈమహనీయుని మహాభాష్యవాఖ్య లిపుడ డణఁగియున్నవిగాని చాలాకాలము పాణినీయుల మెప్పుగాంచినవే. ఇతనివాక్యపదీయమందుమా, నాఁటినుండి నేటిఁ దనుకవిద్వదాదరపాత్రమై వెలయుచున్న దనుట విదితమే. దానికి లక్ష్యముగానే యీకవీంద్రుఁడు రామకథాశ్రయమైనభట్టికావ్యము నిర్మించెనని పూర్వులవిశ్వాసము. అది సముచితమే.

భట్టికావ్య మిరువదిరెండు సర్గలమహాకావ్యము. ఇందు ప్రకీర్ణాధికారప్రసన్నతిఙంతములను నాలుగుకాండములు కలవు. ఇందలి ప్రసన్నకాండము దశమసర్గ మొదలుగా నాలుగుసర్గలలో నలంకారములు కావ్యగుణములు మొదలగు కావ్యధర్మములు సలక్ష్యములుగా విశదీకరింపఁబడినవి. తరువాతవారికావ్యలక్షణముల కిది మార్గదర్శక మనఁదగును. ఇతనితనిసుభాషిత త్రిశతి యందుమా, తరువాత వెలసిన వందలకొలఁది నీతి

కావ్యముల కాద్యనిదర్శన మనుట పునరుక్తము. నీతిజ్ఞానవైరాగ్యములు మూఁడింటిని ముద్దులొలుకుమాటలతో మనసు కరఁగించుభావములతో వర్ణించినయితనిశైలి నిరుపమానము. ఇందలి యీక్రిందికాలస్తవము చూచి "భర్తృహరిరాజై రాజ్యము పోఁగొనసిదప విరక్తి చెంది యిట్లు చెప్పినాఁ" డనికథకల్పించినారు కొందఱు. వలభీరాజులయాస్థానమున నుండి వారిసంపద లడుగంటినపు డిట్లు వర్ణించినా రన్న కథకల్పించినారు కొందఱు:—

"సా రమ్యా నగరీ మహాన్ స నృపతి స్సామన్తచక్రం చ తత్,
పార్శ్వే తస్య చ సా విదగ్ధపరిష త్తా శ్చంద్రబింబాననాః,
ఉద్వృత్తః సచ రాజపుత్త్రనివహ స్తే వందిన స్తాః కథాః,
సర్వం యస్య వశా దగా త్స్మృతిపథం కాలాయ తస్మై నమః,

తనపేరే గ్రంథముపేరుగా ప్రసిద్ధి కెక్కినయీమహానీయుని త్రిశతి చదువనిచదువరి యుండఁడు పెక్కండ్రువ్యాఖ్యాతల నాకర్షించి పెక్కుభాషలలోని కనువదింపఁబడి జగమెల్ల నావరించినయీకృతి వర్ణనాతీతము—అయినా, రెండుశ్లోకములు—

"అజ్ఞ స్సుఖ మారాధ్య, స్సుఖతర మారాధ్యతే విశేషజ్ఞః,
జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపి నరం న రంజయతి"
"య స్యాస్తి విత్తం స నరః కులీనః, స పండిత స్స శ్రుతవాన్
గుణజ్ఞః, స ఏవ వక్తా స చ దర్శనీయః, సర్వే గుణాః కాంచన
మాశ్రయన్తి"
"నూనం హి తే కవివరా విపరీతవాచో, యే నిత్య మాహు రబలా
ఇతి కామినీ స్తాః యాభి ర్విలోలతరతారకదృష్టిపాతైః, శ్శక్రాదయో
ఽపి విజితా స్త్వబలాః కథం తాః".
"క శ్చుంబతి కులపురుషో, వేశ్యాధరపల్లవం మనోజ్ఞ మపి,
చారభటచోరచేటకవిటనటనిష్ఠీవనశరావమ్"

"ఆయు ర్వర్షశతం నృణాం పరిమితం రాత్రౌ తదర్ధం గతం,
త స్యార్ధస్య పరస్య చార్ధ మపరం బాలత్వవృద్ధత్వయోః,
శేషం వ్యాధివియోగదుఃఖసహితం సేవాదిభి ర్నీయతే,
జీవే వారితరంగచంచలతరే సౌఖ్యం కుతః ప్రాణినామ్"

ఈక్రిందిశ్లోకములలోని క్రియాపదప్రయోగమందలిపోలిక కూడ నితఁడే భట్టికావ్యకర్త యనుట కొక ప్రమాణము కాఁగలదు. ఇందు మొదటిది భట్టికావ్యములోనిది రెండవది వైరాగ్యశతకములోనిది.

"పపాత రాక్షసో భూమౌ, ররాట చ భయంకరం,
తుతోద గదయా చారిం, తం ముద్రా వ్యాదిశా కపిః,
"అశీమహి వయం భిక్షా, మాశావాసో వసీమహి,
శయీమహి మహీపృష్ఠే, కుర్వీమహి కి మీశ్వరైః"

సర్వసముద్ధండగునీమహాకవి రచియించిన సుభాషితత్రిశతిలోఁ గాలక్రమమున నితరులశ్లోకములు కొన్ని ప్రక్షిప్తము లైనవి. ఇందు కొకయుదాహరణము. ముద్రారాక్షసద్వితీయాంకములోని యీక్రింది శ్లోకము విషయసారస్యమునుబట్టి త్రిశతిధైర్యపద్ధతిలోఁ జేరినది.

"ప్రారభ్యతే నఖలు విఘ్నభయేన నీచైః,
ప్రారభ్య విఘ్నవిహతా విరమన్తి మధ్యాః
విఘ్నై ర్ముహు ర్ముహు రపి ప్రతిహన్యమానాః,
ప్రారబ్ధ ముత్తమగుణా న పరిత్యజన్తి"

ఇతనిత్రిశతిలోనికొన్నిశ్లోకము లితరులకృతులకు నెక్కినవి. ఇందుకు; దౌర్మంత్ర్యాన్నృపతి రిత్యాదినీతిశ్లోక మొకటి రెండుపదముల మార్పుతో పంచతంత్రమునఁ గనవచ్చుట యొకనిదర్శనము.

ఈమహనీయుఁడు సకలశాస్త్రపారంగతుఁడు. జ్ఞానయోగి, అద్వైతమతావలంబి. ఇందు కితనిమాటలు,

"దిక్కాలాద్యనవచ్ఛిన్నానంతచిన్మాత్రమూర్తయే,

స్వానుభూత్యేకమానాయ నమ శ్శాంతాయ తేజసే"
"మహేశ్వరేవా జగతా మధీశ్వరే జనార్దనేవా జగదంతరాత్మని
నవస్తుభేదప్రతిప త్తి ర స్తి మే తథాపి భ క్తి స్తరుణేన్దుశేఖరే"

సామాన్యముగా నద్వైతు లందఱు శివభక్తు లనుట విదితము గదా! ఇతని భట్టి కావ్యములోని ప్రసన్నకాండము కావ్యాలంకార లక్షణములు కొన్ని నిర్వచించినది గాని, దాని కాలంకారికలోకమునం బ్రశస్తి రాలేదు. వాక్యపదీయము నైయాకరణలోకమందును, సుభాషితము నీతికావ్యప్రపంచమునందు నత్యుత్తమఖ్యాతి గణించిన వనుట ప్రసిద్ధము. ఇతఁడు చిత్రి మన్నయొకవిషయము. సర్వకాలసర్వావస్థలందు ప్రాజ్ఞులు స్మరింపఁదగినది గావున దాని నిం దుదాహరించెదను.

"వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయ న్తీ
రోగాశ్చ శత్రవ ఇవ ప్రహర న్తి దేహమ్,
ఆయుః పరిస్రవతి భిన్నఘటా దివాంభః,
లోక స్తథా ప్యహిత మాచర తీతి చిత్రమ్"

భట్టికావ్యము పాణినీయసిద్ధశబ్దస్వరూపజ్ఞానబోధనము పరమ ప్రయోజనముగా నుదయించినదైనను, అం దితఁడు చూపిన కవితా చాతురి ప్రశంసనీయముగానే యున్న దనుటకు రెండుశ్లోకములు, ఇందు మొదటిది సీతావర్ణనము. రెండవది భ్రమరధ్వనివర్ణనము.

"హిరణ్మయీ సాలల తేవ జంగమా, చ్యుతా దివఃస్థా స్నురి వా
చిరప్రభా,
శశాఙ్కకా న్తే రధిదేవతాకృతిః,సుతా దదే తస్య సుతాయ మైథిలీ"
"న తజ్జలం య న్న సుచారుపంకజం, న పంకజం య త్తదలీన
షట్పదం,
న షట్పదో౽ సౌ న జుగుఞ్జ యః కలం, న గుఞ్జితం త న్న జహార
య న్మనః

ఇఁక నితనికాలమునుగూర్చి యొకింత. సందిగ్ధము లైనకవుల కాలములలో నిది యొకటి. ఎందఱో యితనికాలమునుగూర్చి చర్చించిరి గాని[1] యెవరిమతము వారిదే యైనది. వాని నెల్ల నిందు పరామర్శించుట వృథాపరిశ్రమ. తెలిసినంతలో మనమార్గము మనది-ద్వితీయపులికేశి వేయించిన ఐహోలుశాసనములో పేర్కొనఁబడిన భారవి యప్పటికి పూర్వుఁ డనుట స్పష్టము.

భట్టికావ్యము తుద నున్న వని నెనుక తెల్పుశ్లోకములు నాలుగును జయమంగళుఁడు కల్పించినవే యైనా, అతనివిశ్వాసములో భట్టియైనమనభర్తృహరి యాతృతీయద్వితీయధరసేనులనాఁటికి పూర్వుఁడనుట కవి చాలును-మాఘునిచాటువుగా వల్లభదేవునిసుభాషితావళిలో కనవచ్చెడియీక్రిందిశ్లోకము భర్తృహరినీతిశతకములోనిది. ఇది యెట్లో మాఘునిదిగా వాడుక కెక్కినా, యతనికంటె నితఁడు పూర్వుఁడనుట సముచితము గాని, యతని శ్లోక మిందు ప్రక్షిప్త మనుటసమంజసము కాదనుకొందును.

"శీలం శైలతటా త్పత త్వభిజన స్సందహ్యతాం వహ్నినా,
మాంశ్రోషం జగతి క్షుతస్య విఫలక్లేశస్య నా మాప్యహం
శౌర్యే వైరిణి వజ్ర మాశు నిపత త్వర్థోఽస్తు మే సర్వదా,
యే నైకేన వినా గుణా స్తృణబుసప్రాయా స్సమస్తా అమీ"

మాఘునికంటె భారవిపూర్వుఁడు అతనికంటె నితఁడు పూర్వుఁడనిపండితసంప్రదాయము. ఏ. బి. కీతుపండితుఁడు భట్టికావ్యము వాక్యపదీయకర్త యగుభర్తృహరి వ్రాసినది కా దన్నను, అది దండిభారవుల కంటె మున్నుపుట్టినదే యన్నాఁడు. మఱియొక రిద్దఱు నిట్లభి

1. కమలాశంకరప్రాణశంకరత్రివేదీగారిభట్టికావ్యపీఠిక
పి. వి. కాణేగారిసాహిత్యదర్పణపీఠిక
ఏ. బి. కీతుపండితునిCl. San· Lit. *118-131* etc.

వ్రాయుచున్నారు. భట్టి భర్తృహరు లొకఁడే యన్నమననిర్ణయమునుబట్టి భట్టి కావ్యకర్తయైన యీభర్తృహరి భారవికి పూర్వుఁడనుటవిదితము. త్రిశతీపీఠికలో తిలాంగుపండితులు, భర్తృహరి క్రీ. ౧-౨ శతాబ్దులలోనివాఁడనిరి. ఇవన్నియు పరిశీలించినసిదపనే, భర్తృహరి శా. శ. ౩౭౦ ప్రాంతమున నుండి యుండు ననినాకుతోఁచినది. క్రీ. ౬౦౦ కాని అంతకు పూర్వము గాని యని కొందఱన్నారు. ఇతఁడు బౌద్ధుఁడన్నవారిమతమున నితఁడు క్రిందికి వచ్చు ననుట స్పష్టము. చరిత్రజ్ఞులు పరిశీలింతురుగాక.

—o—

# వ త్స భ ట్టి

ప్రాచీనకవులలో నొకఁడగునితనికృతు లేవియు లేవు గాని, మందసారశాసనమందు ४౧ శ్లోకములప్రశస్తిమాత్రము మిగిలియున్నది. దానిని శాసనసంపుటములలో భద్రపఱిచియున్నారు[1]. సూర్యదేవతాలయమందలి "యీాదశపుర" మందసారశాసనప్రశస్తి నీవత్సభట్టి మాలవసంవతు. ४౯౩, అనఁగా-శా. ౩౯४ లో రచియించెను. దీనిని పరిశోధించిన క్లీల్హార్న బహ్లూరు మొదలయినయాంగ్లపండితు లీకవి కాళిదాసుకావ్యములలోనివర్ణనలు కొన్నిటి ననుకరించె నని వ్రాసియున్నారు. సంపూర్ణమైనప్రశస్తి నాకు లభించలేదు. ఏడుశ్లోకములు మాత్రమే యిందుదాహరింపలభించినవి[2]. ఇతనిప్రశస్తిని పరిశోధించిన బహ్లూరు "వత్సభట్టిప్రయోగములు కొన్ని వ్యాకరణవిరుద్ధములుగా నున్నవనుచు నితనిభాషాజ్ఞానమును శంకించియున్నాఁడు. తక్కినశ్లోకములలోనట్టి వేవేని

---

1. ఇండియన్ ఏంటిక్వరీ; ఫ్లీటుగారిగుప్తశాసనములు; సం. ౧౫వగయిరాలు.
2. చూ. యమ్. కృష్ణమాచార్యులుగారి సం. సా. చరిత్ర(ఆంగ్లము)పుట౯४,

యున్న వేమో తెలియదుగాని, అతఁడు కనిపెట్టినయపప్రయోగములలో నీక్రిందిరెండవశ్లోకములోని "మనోజ్ఞవధవః" అనుప్రయోగముకూడా ఉన్నట్లయితే యతని యభిప్రాయము ప్రామాదిక మనకతప్పదు. "మనోజ్ఞాః వధ్వఃయేషాంతే, మనోజ్ఞవధవః" అనుపుంలింగబహువచన రూపము సిద్ధించును. అయినా, యతనివిమర్శనమేమో! లభించినశ్లోకములలోని వీనాలుగు:—

"కేచి త్స్వకర్మ ణ్యధికా స్తథాన్యే, విజ్ఞాయతే జ్యోతిషమాత్మవద్భిః, అద్యాపి చాన్యే సమరప్రగల్భాః, కుర్వ న్త్యరీణా మహితం ప్రసహ్య,

"ప్రాజ్ఞా మనోజ్ఞవధవఃప్రథితోరువంశాః,
వంశానురూపచరితాభరణా స్తథాన్యే,
సత్యవ్రతాః ప్రణయినా ముపకారదక్షాః,
విస్రంభపూర్వ మపరే దృఢసౌహృదాశ్చ"
"విజితవిషయసంగై ర్ధర్మశీలై స్తథాన్యైః,
మృదుభి రధికసత్త్వై ర్లోకయాత్రామరైశ్చ.
స్వకులతిలకభూతై ర్ముక్తరాగై రుదారై
రధిక మభివిభాతి శ్రేణి రేవం ప్రకారైః"
"రామా సనాథరచనే దరభాస్కరాంశు
వహ్నిప్రతాపసుభగే జలలీనమీనే,
చంద్రాంశుహర్మ్యతలచందనతాలవృన్తే,
హారోపభోగరహితే హిమదగ్ధపద్మే"

వెదకినచో నొకకవిమాటలు భావములు నింకొకకవికావ్యములో కనరాకపోవు. అంతమాత్రమున నది యనుకరణ మనుట కారంభించినచో కవు లందఱు ననుకర్తలే యగుదురుగదా! ఋతుసంహార ఐదవసర్గలోని "నిరుద్ధవాతాయనమందిరోదరం—నచందనం చంద్రమ

ఙ్క్షచి శీతలం—ఇత్యాది శ్లోకములను పూర్తిగా ననుకరించి యీవత్స భట్టి 'రామాసనాధే' త్యాదిశ్లోకమును నిర్మించె ననికీల్హారన్‌పండితుఁ డనుట యట్టిదే. ఇతఁ డంతగొప్పకవి కాకపోవచ్చునుగాని పూర్వోక్త శ్లోకము లితఁడు కవి యనుటకు చాలకపోవు.

—o—

# చంద్రగోమి

ఇతఁడు బౌద్ధుఁడు గొప్పవైయాకరణుఁడు. తనపేర చాంద్రవ్యాకరణము నిర్మించినఘనుఁడు. శా. ౪౦౦ ప్రాంతమున నున్నవాఁడు. ఇతఁడు తారాసాధనశతకమును శిష్యలేఖాధర్మకావ్యమును నిర్మించినట్లు తెలియుచున్నది. ఇందు,

రెండవది, రత్నకీర్తి యనుసామంతరాజొకఁడు తన్నవమానించినపుడు, అతనికి బుద్ధి చెప్పుచు వ్రాసి పంపినపద్యలేఖ. ఇందు ౧౧౪ శ్లోకము లున్న వఁట. వల్లభదేవునిసుభాషితావళిలోఁ గనవచ్చు నీక్రింది శ్లోకములు చంద్రగోమిధర్మకావ్యములోనివిగాఁ గనఁబడుచున్నవి. ఆగ్రంథము రష్యాలోఁ బ్రకటితమైనట్లు తెలియుచున్నది. ఆశ్లోకములు రెండు

"విషస్య విషయాణాం చ దూర మత్యన్త మన్తరమ్,
ఉపభుక్తం విషం హన్తి విషయా స్స్మరణా దపి"
"కేచి ద్భయేన హి భజన్తి వినీతభావ,
మన్యే జనా విభవలోభకృతప్రయత్నాః,
కేచిచ్చ సాధుజనసంసది కీర్తిలోభాత్,
సద్భావవాన్, జగతి కోఽపి న సాధు రస్తి"

జయాదిత్యుఁడు కాశికావృత్తి నిర్మించుచు నీతనివ్యాకృతిని గూడా ప్రమాణముగాఁ గైకొన్నాఁడు. ఇది బహువిధములఁ బాణినీ

యము ననుసరించిపదే యైనను, అది సాధింపని యనేకశబ్దరూపముల నిది సాధించినది. అందుచేతనే ఇది స్వకాలమున వ్యాప్తికి వచ్చినది. అందలి మంగళాచరణపద్య మిది.

సిద్ధం ప్రణమ్య సర్వజ్ఞం సర్వీయం జగతాం గురుమ్
లఘువిస్పష్టసంపూర్ణ ముచ్యతే శబ్దలక్షణమ్.

—;o;—

## బుద్ధఘోషుఁడు

ఇతఁడు బౌద్ధుఁడు, మంచిపండితుఁడు, కవి. ఇతనిపద్యచూడామణి యనుపదిసర్గలకావ్యము మొన్నమొన్ననే బయటఁ బడినది. అశ్వఘోషునిబుద్ధచరిత్రవలెనే యిదియు గౌతమబుద్ధునిజీవితమును వర్ణించినది:—

ఇతనికాలమునుగూర్చి మతభేదము లున్నవి. జేమ్సుగ్రేపండితుఁడీకవి క్రీ. ౩౩౭ లో బౌద్ధగ్రంథములకై సిలోను వెళ్లెనన్నాఁడు, అది ౩౮౭ అనిమఱియొక రన్నారు. సేనవరత్నేపండితుఁడు క్రీ. ౪౮౩ లో వెళ్లెనన్నాఁడు, కొందఱీకవి క్రీ. ౫౫౦ ప్రాంతమువాఁడనిభావించినారు. పద్యచూడామణిలోనినవమసర్గ బహువిధముల మాఘునిశిశుపాలవధలోని రెండవసర్గను పోలియున్నది. కావున నతనికంటె నితఁడు పరుఁడై క్రీ. ౬౦౦ ప్రాంతమందుండి యుండు నని పరిశోధకు లనుచున్నారు[1]. ఇట్టియభిప్రాయభేదములనుబట్టి, ఏమి నిర్ణయించుటకును వీలు లేకున్నది గావున నలుగురు త్రొక్కినత్రోవనే పోయి నవరత్నేపండితునిమాటయే నమ్మి యితఁడు శా. ౪౦౫ ప్రాంతమం దున్నవాఁ డని యిప్పటికి విశ్వసింతము.

1. చూ. యస్. కుప్పుస్వామిశాస్త్రిగారిపద్యచూడామణిపీఠిక.
యమ్. కృష్ణమాచార్యుల క్లాసికల్ లిటరేచరు.

మాఘునికవిత నితఁ డనుకరించె నన్నవిమర్శనము సయుక్తికము గాదని తత్ప్రకాశకుల నిర్ణయము.

ఈకవి లలితవిస్తరము బుద్ధచరిత్ర చదివియే, అందలిబుద్ధునిజీవిత చరిత్రాంశములను గ్రహించియే యీకావ్యము వ్రాసె ననుట నిరాక్షేపము గాని, అందు లేనికొన్ని నూతనాంశముల నిందు చేర్చకపోలేదు. ఇతనికవిత్వము రసవంతము, శైలియు హృదయంగమము – ఇందుకు రెండుశ్లోకములు:—

"యదింద్రనీలోపలకుట్టిమేషు, ప్రవిష్ట, బింబాం ప్రథమేందులేఖామ్,
మృణాళఖండస్పృహయామరాళా, శ్చంచూపుటైశ్చుంబితుముత్సహన్తే
"రరాజ తస్యానవరోమరాజి రారోహతస్తుంగపయోధరాద్రిమ్,
శృంగారయోనే రవలంబనార్థ మాలంబితేందీవరమాలికేవ"
"కృతాభిషేకాః ప్రథమంఘనాంబుభిః, ధృతోత్తరీయాశ్శరదభ్రసం
చయైః, విలిప్తగాత్ర్యశ్శశిరశ్మిచన్దనైః, దిశోదధుస్తారకహారయష్టికామ్.

—:o:—

# రణాదిత్యుఁడు

ఇతఁడు కాశ్మీరపాలకుఁ డగురాజకవి. ఇతనిమహిమ నెక్కువగా వర్ణించిన రాజతరంగిణి యితనిరాజ్యకాలము 300సంవత్సరము లని యది చెప్పినమాట మన కిపుడు విచారణీయము కాదు. ఇతనిరాజ్య సమాప్తికాలము శా. ౪౪౨ ప్రాంత మనిమాత్రమే దానిని బట్టిమనము గ్రహింతము.

ఇతఁడాచరిత్రమునుబట్టి రెండవతుంజీనుఁ డనఁబడును. ఇతని భార్య రణారంభ, ఆమె రతిసేనుఁడను చోళరాజుకూఁతురు. ఈదంపతుల పెద్దకొడుకు విక్రమాదిత్యుఁడు, రెండవకుమారుఁడు బాలాదిత్యుఁ డన్నఁ

బడుప్రతాపాదిత్యుఁడు. వీ రిద్దఱును క్రమముగా రాజ్యము చేసినవారే. వీరిప్రసక్తి ముందుమరలవచ్చును.

ఈరణాదిత్యుఁడు గొప్పవిద్వాంసుఁడు, కవి, విద్వత్పోషకుఁడు ఇతఁ డేవో కృతులు నిర్మించి యుండు నని క్షేమేంద్రాదు లుదాహరించినశ్లోకములవల్లను సుభాషితావళ్యాదులలో నితనిపేరఁ గనవచ్చుపద్యములవల్లను దెలియుచున్నది. అవి రెండు:—

"త్వన్ముఖచంద్రనిరీక్షణవర్త్మా,య స్సుతరా మిహ నిర్మలనేత్రః
సర్వజనస్య పురః స్థిత మేత, త్సో౽స్తక ర్త్మ న పశ్యతి చిత్రమ్"
"యద్య ప్యున్నతవంశవా న్నవసుధా ధామాభిరామం వపుః,
సంప్రాప్తో ఽతిశయస్వభావసుభగచ్ఛాయ స్సతాం తాపహృత్,
తత్రా ప్యేష విసంస్థులస్థితి రహో లక్ష్మీం నిజాత్మోచితాం,
ప్రాయ శ్చక్రికయా వినా న లభతే ప శ్యాతపత్త్రం యథా"

—:o:—

## సుందరపాండ్యుఁడు

ఇతఁడు మధుర రాజధానిగా పాండ్యమండల మేలినపాండ్యరాజవంశములోనివాఁడు. శా. ౬౭౦ ప్రాంతమందలి అరికేసరిరాజుశాసనములో నితఁడు పాండ్యరాజ్యస్థాపకులలోనిపురుషుఁడు గా వర్ణింపఁబడి యున్నాఁడు. మఱియు నితని నీతిద్విషష్టికలోనిశ్లోకములు విష్ణుశర్మపంచతంత్రాదులందు గనవచ్చుచున్నవి. అందుచే నితఁడు, శా. ౫౦౦ ప్రాంతమందలివాఁ డని యూహింపఁబడుచున్నది.

తననీతిద్విషష్టిక కవులస్తుతికిఁ బాత్రమైన దని యితఁడే వ్రాసికొనెను.

"ఇమాం కాంచనవీక్షస్థాం సమేత్య కవయో భువి,
ఆర్యాం సుందరపాండ్యస్య స్నాపయన్తి వధూమివ"

ఈనీతికావ్య మఱువదిరెం డార్యావృత్తముల చిన్నగ్రంథము. అయినా, శ్లోకములు లోకజ్ఞాన ముపదేశించుచు మనోహరముగా నున్నవి, ఇందు కొకశ్లోకము.

"సహ వసతా మప్యసతాం జలరుహజలవ ద్భవ త్యసంశ్లేషః,
దూరేఽపి సతాం వసతాం ప్రీతిః కుముదేన్దువ ద్భవతి"

—:o:—

# భా ర వి

కిరాతార్జునీయ మనుమహాకావ్యము రచియించినయీప్రౌఢకవి యుత్తరహిందూదేశమువాఁ డనియు దక్షిణహిందూదేశమువాఁ డనియు ఆంధ్రదేశీయుఁ డనియు భిన్నమతములు కలవు. ఇతనికి సంబంధించిన యొకకథ తెలుఁగుదేశములో నేఁటికిని వాడుకలో నున్నది. ఆకథయే చిన్నచిన్నమార్పులతో నొకయుత్తరదేశీయుఁడు ప్రకటించియుండెను. అందుచే నితనినివాసస్థల మిది యని నిశ్చయింపఁజాలను గాని, పాఠక ప్రరోచనార్థ మాకథ మాత్ర మిందు సంగ్రహించుచున్నాను.

"భారవి పదునాలేండ్లప్రాయమునాఁటికే పాణినీయవిజ్ఞానము తోడిచక్కనిసాహిత్యమలవఱుచుకొని విద్వద్రంజక మైనకవిత్వము చెప్పుట కనిపెట్టిన పండితులు కొందఱతనితండ్రితో సంభాషించుతఱిని "మీవాఁడు మంచివిద్వత్కవియై వన్నె కెక్కు నని" పొగడుచుండెడి వారు. "ఆఁ! మీరంతగా నుతింపవలసినవాఁడు కాఁడు, చిన్నవాఁడు వానికేమి తెలియును లెండి" అని తండ్రి యనుచుండెడివాఁడు. ఆమా టలు వినుచున్న భారవి తనయభ్యుదయమునకుజనకుఁ డసహనపడుచున్నట్లు భావించి, అతఁడు పోయినఁ గాని తనకు యశస్సు రా దనుకొని, తన

తండ్రి యన్నమాటలు తల్లితో చెప్పుమనే తుద కొకనాఁడు తండ్రి భోజనము చేయుసమయమున నతనినెత్తిమీఁద విసుచుట్టకై తిరుగటి రాయి తీసుకొని యటుక యెక్కి కూర్చుండెను. అపుడు తల్లి "ఏమండీ అబ్బాయి నెవ రేని పొగడునప్పుడు వారితో మీరుఁగూడ నని నిరసించుచున్నా రఁట. వాఁడు వ్యసనపడుచున్నాఁడు. ఉన్న నేల?" అని భర్తతో ననఁగా, నతఁడు "వెఱ్ఱిదానా! మనపిల్లవానిని మనము పొగడుకొనుట వానికి శ్రేయస్సు కా దనినే నట్లనుచున్నాను గాని వానిశక్తి కసహానపడు చున్నానటే!" అని వారిద్దఱికి తెలివితక్కువను సూచించునట్లు నవ్వెను. అంత భారవి పాపచింతనభీతచేతస్కుఁడై మఱియొకప్రక్కనుండి మెల్లఁగా దిగివచ్చి "నాయనా! పూజ్యులకు హాని చేయఁ దలఁచువారికి దండన నే" మని యడిగెను. అట్టివా రాఱునెల లత్తవారి యింటనుండుటయే తగిన ప్రాయశ్చిత్త మనెను. అపుడు భారవితనదుర్వృత్తి తెలిసి కొడుకని యట్టిసూక్ష్మదండనము చెప్పె నని భావించి "నేనే యట్టిపాపిని క్షమింపుఁ" డనుచు సాష్టాంగనమస్కార మాచరించి వెంటనే యత్తవారింటికి పయనమై వెళ్లెను. పిలువకుండఁగానే వచ్చినందుకు అత్తవారు సంతోషించి యాదరించిరి. అయిదాఱురోజులు గడచినవి. స్వగ్రామమున కల్లుఁడు బయలుదేఱుసూచనలు లేవు. అందుచే వారించుక విసుగుకొనుచు నొకవిధముగా ననాదరణచేయఁ జొచ్చిరి. భారవి కవు డర్థమైనది. కాని, ఉండక తప్పదు. ఏమి చేయును?—

"శ్వశురగృహనివాస స్స్వర్గతుల్యో నరాణాం,
యది వసతి దినాని త్రీణి పంచాథ సప్త,
దధిమధుఘృతభక్ష్యక్షీరసారప్రవాహః
తదుపరి నివసేచ్చే దన్నసారప్రవాహః"

అన్నట్లు పశ్చాత్తాపబుద్ధితో పరితపించుచు నట్టె యొకనెల గడపెను. అంత నొకనాఁడు "తేరతిళ్ళుతింటూ తేన్చడం, కూని రాగాలుతీసూ కూర్చోవడంకాదు ఏదేనాపనిచేసూ ఉండు" మని

మామగారు కసరెను. "ఆకూ గంటమూ పుచ్చుకొని శ్లోకాలు గీకడ మనుకొన్నావా? వేళ్లు వేయడం చేఁతగాక పోతే పెళ్ళానికి కూడెల్లాగు పెడతా" వనిబావమఱఁదులు నిందించిరి. ఆ పలుకు లతనికే కాదు, యుక్తవయస్సు సమీపించినయతనిభార్యకును ములుకు లైనవి. అట్లే మఱియొకనెల వెళ్ళినది. అంతట వా రతనిని జొన్నచేనికాఁపునకు నియోగించిరి. భారవి యీదండనముకన్న మరణమే మేలనుకొనియు విధి లేక యాపని చేయుచు, మంచెపైఁ గూర్చుండి కిరాతార్జునీయము వ్రాయుచు, భార్య తెచ్చి పెట్టుచున్నయన్నము తినుచు బవళ్ళక్కడనే పడియుండి మఱి రెండుమాసములు గడపెను. ఆనడుమ నొకనాఁడు తన కన్నము తెచ్చినభార్య లజ్జావిషాదములతో తలవంచుకొని "రేపు వ్రతదినము. మావదినెలు నోఁచుకొందురు. డబ్బు లేదని మాఅమ్మ విసుగుకొనుచు నీమగని నడిగి డబ్బు తెచ్చుకొమ్మన్నది" అని కంట నీరుపెట్ట నతఁడు తనయవస్థకు పరితపించియు ధైర్యముతో "నీవు విచారింపకు. ఈశ్లోక మేవర్తకుని కమ్మినా నీకు కావలసినవస్తువు లన్నియు నిచ్చు"నని చెప్పి స్వానుభవమునకును కథాసందర్భమునకును సరిబడున ట్లపుడే కూర్చినయీక్రిందిశ్లోకమును వేఱొకయాకుమీఁద వ్రాసియిచ్చెను[1].

"సహసా విదధీత న క్రియా, మవివేకః పర మాపదాం పదమ్,
వృణతే హి విమృశ్యకారిణం, గుణలుబ్ధా స్స్వయ మేవ సంపదః"

ఆమె యది తీసుకొని యూరిలోనికి వెళ్ళి యొక పెద్దవర్తకుని కాశ్లోక మమ్మఁజూప నతఁ డది తీసుకొని చదువుకొని సంతోషించి నూఱువరా లిచ్చెను. ఆతరుణి యానందించి వ్రతాదులు జరుపుకొనెను. భారవియు నట్లే యాఱుమాసములు గడపి పాపవిముక్తుఁడై బ్రతుకు

1. దీనికి నాయనువాదము.

గీ. కోరి తొందరపడి చేయఁగూడ దెట్టి పనియు, నవివేక మెల్లయాపదల కిరవు,
తగ విమర్శించి చేయునాతనిఁ దమంత, ధన్యగుణలుబ్ధ లగుసంపదలు వరించు.

జీవుఁడా యని భార్యను వెంటఁ బెట్టుకొని స్వగ్రామము చేరి తల్లిదండ్రుల దీవన లంది సుఖ ముండెను. ఆవర్తకుఁడును తనభార్య గర్భవతి యైన నెలలోనే ద్వీపాంతరవాణిజ్యమున కేగి పెక్కుకష్టములుపడి పన్నెండేళ్ళకు తిరిగివచ్చిననాఁటిరాత్రి తనభార్యపక్కలోపడుకొనియున్న వాఁడు పరపురుషుఁ డని భ్రాంతిపడి యాయిద్దఱిని జంపఁ దలంచి, కత్తి తీసినంతలో, మంచముపంచిటికి వ్రేలాడఁగట్టినవెనుకటిశ్లోకపత్రము కంటఁబడెను. అదిచూచి తదర్థము స్మరించుకొని భార్యను లేపెను. ఆమెయు నాశ్చర్యానందములతో భర్తపాదముల కఱఁగి కొడుకును లేపి వానిచే తండ్రికి నమస్కరింపఁజేసి వీఁడు మీపుత్త్రుఁ డని తెలిపెను. అంతవర్తకుఁ డాశ్లోకము తనవంశమును రక్షించిన దని సంతోషించి భార్యాపుత్త్రులతో సుఖ ముండెను"

ఇదికాళిదాసాదుల కంటఁగట్టినకట్టుకథలవంటి దనుట పునరుక్తము. ఇదియిట్లుండ, అవంతిసుందరీకథాతత్కథాసారములలో నితనివిషయము మఱికొంత మఱియొకవిధముగా నున్నది.[1] ఆగ్రంథము కట్టుకథలతో వ్యాపించినభోజచరిత్రవంటిది, అయినా దానిరీతి తెలియుదము.

"భారవి మొదటిపేరు దామోదరుఁడు. ఇతఁడు నారాయణస్వామికొడుకు, కౌశికగోత్రుఁడు, ఉత్తరహిందూదేశము వాయవ్యభాగములోని ఆనందపురమున నితనిపూర్వు లుండెడివారు. ఇతనితండ్రి యాపురము విడిచి నాసిక్యదేశమునకు వలసవచ్చెను ... భారవికవిత విని సింహవిష్ణు వనురాజు కాంచీపురమున కతనిని పిలిపించెను. భారవి యారాజుకుమారుఁ డైనమహేంద్రవర్మకు మిత్త్రుఁ డయ్యెను. భారవికొడుకు మనోరథుఁడు, అతనికొడుకుకొడుకు ప్రసిద్ధదండ్యాచార్యుఁడు" ఇత్యాది—

1. చూ. యమ్. కృష్ణమాచార్యులు యమ్. ఏ. యమ్. యల్ గారి సంస్కృతసారస్వత చరిత్ర. పుట. 147-49

ఇది కేవలము కట్టుకథ యనుట కొక్కమాటచాలును. నిజముగా భారవి తనకు ప్రపితామహుఁడే యైనచో దండ్యాచార్యుఁ డితనిని తన కృతిలోనె ందైన సగౌరవముగా స్మరింపఁడా? ఒక్కవ్యాఖ్యాతయైన నితని దామోదరనామము నెత్తఁడా? తన పోషకప్రభువు కాంచీపురరాజను మాట యైననితఁడు సూచింపఁడా? చాటుకథలకు రూప మిచ్చినయిట్టి గ్రంథములలోనిమాటలు చరిత్ర కుపయోగింపునవి కాఁజాలవుకదా!

## ఇ త ని కా ల ము

కాళిదాసకవిజీవితమున నైహోలుశాసనపద్యముచదియున్నాము అందు పేర్కొనఁబడినకాళిదాసభారవికవు లాశాసనములోనిరవికీర్తికి సమకాలికులు కా రనియు తెలిసికొనియున్నాము. కాని, ఆనాఁటి కితఁడు పూర్వుఁ డనుట కాశాసనమునే పరిశోధకులు ప్రమాణముగా గ్రహించియున్నారు. ఆశాసనకాల మైన క్రీ. ౬౩౪ నాఁటి కితఁ డొక శతాబ్దిపూర్వుఁ డన్నయభిప్రాయము నావిష్కరించియున్నారు. మఱియు, కిరాతార్జునీయములోని నాయకప్రతిభలు నాయకవర్ణనము చూచియే దండి "వంశవీర్యప్రతాపాదీ వర్ణయిత్వాదిపోరపి, తజ్జయాన్నాయకోత్కర్ష కథనం చ ధినోతినః" అను లక్షణము చెప్పినట్లు కనఁబడుచున్నది. అందుచే భారవి, శా. శ. ౪౫౦ ప్రాంతమువాఁ డని భావింతము. ఉద్భటునిమాటలనుబట్టి యితఁడు మాఘునికంటె పూర్వుఁ డని తెలియుచున్నది[2]. గావున పైయభిప్రాయము సరి యగు నన వచ్చును.

ఈకవి భారతములోనిపాండవుల యరణ్యావాసకథను గ్రహించి కిరాతవేషధారి యైనయీశ్వరునికిని విజయునికిని జరిగినయుద్ధము పాశుపతప్రదానము మొదలగు నంశములను ప్రబంధశైలి నతిమనోహరముగా

2. తావ ద్భా భారవే ర్భాతి, యావ న్మాఘస్య నోదయః, ఉదితే చ పునర్మాఘే భారవే ర్భా రవే రివ.

నతిప్రౌఢముగా వర్ణించుచు కిరాతార్జునీయ మనుపేరంబరగు నెనిమిదిసర్గల మహాకావ్యము నిర్మించెను. ఇందు మొదటి మూఁడుసర్గలు పాషాణత్రయ మనంబడును. "నారికేళఫలసమ్మితం వచో భారవేః సపది తద్విభజ్యతే" అని మల్లినాథసూరియన్నట్లితనికవిత్వము నారికేళపాక మనుట స్పష్టము. అర్థగౌరవమున కిది పుట్టినిల్లనుటకు "ఉపమా కాళిదాసస్య భారవే రర్థగౌరవం" మనువిద్వదుక్తియే ప్రమాణము. దీనికి జోనరాజు, ఏకనాథుఁడు, నరహరి మొదలగు నితరపండితులుకూడా వ్యాఖ్యానములు చేసియున్నారు గాని మల్లినాథసూరి ఘంటాపదవ్యాఖ్యయే దేశమంతట నెక్కువగా ఖ్యాతిగాంచినది.

భారవి పాణినీయాదిశాస్త్రనిష్ణాతుఁడు రాజనీతిశాస్త్రమున నిపుణుఁడు చిత్రయమకబంధకవిత్వప్రియుఁడు. కాళిదాసత్రయముతరువాతఁ బఠనీయముగా వ్యాప్తి గాంచిన దితనికృతియే. ఇందలిప్రతిసర్గతుద నుండుశ్లోకమున లక్ష్మీవాచకపదము నియతముగా నుండుటచే నీకావ్యమునకు లక్ష్మీపదలాంఛన మనుపేరు వచ్చినది. ఇది, లక్ష్మీభక్తుఁడైన యితనినియతమైనయిష్టదేవతాస్మరణమునకు సూచక మగుచున్నది. అపూర్వమైనయీపద్ధతిని చూచి, ఆలక్ష్మి కొల్లాపురశ్రీమహాలక్ష్మియేమో యనియు, నితఁడు తత్ప్రాంతమువాఁడేమో యనియు, కొందఱనుకొనకపోరు.

మఱియు గాలి కెగిరి యాకాశమున దట్టముగా నావరించినసరోజపరాగమును గొడుగుతోఁ బోల్చుచు నందును శోభాపరముగా లక్ష్మీపదము ప్రయోగించియున్నాఁడు. అదికూడా పైయభిప్రాయమునకు ప్రోద్బలకము కాకపోదు.

"ఉత్ఫుల్లస్థలనళినీవనా దముష్మా, దుద్ధూతః సరసిజసంభవః పరాగః
వాత్యాభి ర్వియతి విసర్పిత స్సమంతా దాధత్తే కనకమయా
తపత్రలక్ష్మీమ్"

ఈవర్ణనమున నితనికి ఛత్రభారవి యనుపేరు వాడుకలోనికి వచ్చినది. ఉత్తమప్రాచీనకవులలో గణనీయుఁడైన యితనికవిత ప్రకృతి మధురముగా నుండు నని సదుక్తికర్ణామృతములోనియీక్రిందిశ్లోకమునఁ గనవచ్చును.

"సుబంధౌ భక్తి ర్నః క ఇహ రఘుకారే న రమతే
ధృతి ర్దాక్షీపుత్రే హరతి హరిచంద్రోఽపి హృదయమ్,
విశుద్ధోక్తి శ్శూరః ప్రకృతిమధురా భారవిగిరః,
తథా ప్యన్తర్మోదం కమపి భవభూతి ర్వితనుతే"

భారవి భావరసములకు తాదాత్మ్యమును విదితముగావించినవాఁ డని శారదాతనయుఁ డితనిని నుతించియున్నాఁడు.

"తాదాత్మ్యం భావరసయో ర్భారవిః స్పష్ట మూచివాన్"

ఇట్లే యితనికవిత్వమును శ్లాఘించినశ్లోక మింకొకటి.

"ప్రదేశవృత్త్యాపి మహాన్త మర్థం ప్రదర్శయన్తీ రస మాదధానా,
సా భారవే స్సత్పథదీపికేవ రమ్యాకృతిః కైరిహ నోపజీవ్యా ?

భారవివాక్కులు నారికేళఫలసమ్మితము లనుట క్లిష్టపదభూయిష్టము లనుట కాదు. అక్కడక్కడ యమకాదులం దట్టి వున్నను చిన్నమాటలలో పెద్దయర్థము చక్కనిభావమునిముడునట్లు శ్లోకములు రచియించుట యే యితనిరీతి. ఇందుకు:—

"శుచి భూషయతి శ్రుతం వపుః ప్రశమ స్తస్య భవ త్యలంక్రియా,
ప్రశమాభరణం పరాక్రమ స్స నయాపాదితసిద్ధిభూషణః"

"జీయతాం దుర్జయా దేహే రిపవ శ్చక్షురాదయః,
జితేషు నను లోకోఽయం తేషు కృత్స్న స్త్వయా జితః"

ఇందు వీరము ప్రధానరసము. నాయకునిదివ్యాస్త్రలాభము కావ్యముఖ్యప్రయోజనము. శృంగారాదు లంగములు. అర్థాలంకారములుకూడా నిందు హృద్యములై లేకపోలేదుగాని యమకాదిశబ్దాలం

కారములు తెలుచు. ఇతనికృతినిబట్టి యానాఁడు శబ్దాలంకారప్రీతి హెచ్చునవచ్చును. వ్యాఖ్యాతలన్నట్లురసగర్భనిర్భరమే- భరతఖండమంతటపంచకావ్యములలో గణనకెక్కినదీనిని వేఱుగానుతింపనేల?

—:0:—

## విష్ణుశర్మ

ఇతఁడు సకలజగ మెఱిఁగినపంచతంత్రమను నీతిశాస్త్రము నిర్మించిన మహాకవి. ఇతఁడుకృత్యాదిని దెల్పినమాటలివి:—

" మనవేవాచస్పతయేశుక్రాయపరాశరాయ ససు తాయ,
చాణక్యాయచ విదుషే నమోఽస్తు నయశాస్త్రకర్తృభ్యః"
" సకలార్థశాస్త్రసారంజగతిసమాలోక్యవిష్ణుశర్మేదమ్,
తంత్రైఃపంచభిరేత చ్చకారసుమనోహరంశాస్త్రమ్"

వీటినిబట్టియితఁడు మనుపరాశరస్మృతులను భారతమును కౌటిల్యార్థశాస్త్రమును శుక్రబృహస్పతులుచేర వెలసిన నీతిగ్రంథములను చక్కఁగాఁబఠించి యీకృతినిర్మించెననుట విదితము. మఱియునితఁడు "దక్షిణదేశమందలి మహిళాపురమునఁ నెలెడి అమరశక్తియనురాజు దుర్వినీతులైన తన కొడుకులకు నీతినేర్పుమనికోరఁగా వారికై నేనీనీతిశాస్త్రము రచియించితి" నని గ్రంథావతారికలో వ్రాయుటనుబట్టి, యీకవి దక్షిణదేశవాసియై యాతేనియాస్థానమున విద్వత్కవిగా నుండెనని భావింపవచ్చునుగాని, ఈవిషయమునేపరిశోధకులును గుర్తించి యుండలేదు. అందుచే నీమాట గ్రంథప్రశస్తికై యితఁడుకల్పించివ్రాసినదో లేక నిజమోయూహింపనలవిగాకున్నది.

ఈకృతి గుణాఢ్యుని బృహత్కథలోనికొన్ని కథలకు వచనరూపమైనసంగ్రహానువాదము. ఇందు కనవచ్చుశ్లోకములు కొన్నియీకవివైనను

గావచ్చునుగాని పెక్కుశ్లోకములు మనుస్మృతి మొదలగు పూర్వగ్రంథములలోనివే. ఈగ్రంథము భరతఖండమునవ్యాపించిన కొలఁదిని కాలక్రమముననిందర్వాచీనుల శ్లోకములు ప్రక్షిప్తములగుచువచ్చినవి. ఇందుకు, శా. శ. ఏడవశతాబ్దిలోని దామోదరగుప్తుని కుట్టనీమతమందలి "పర్యఙ్కః స్వాస్తరణః పతిరనుకూల" ఇత్యాదిశ్లోక మిందలి ప్రథమతంత్రమందును, శా. ఎనిమిదవశతాబ్దియందలి రుద్రభట్టు శృంగారతిలకములోని "సార్థం మనోరథశతైః" రిత్యాదిశ్లోక మిందలి చతుర్థ తంత్రమందును ప్రవేశించుటయేనిదర్శనము. సి. పి. బ్రౌనుపండితుఁడుకూడా ఇంగ్లండులోను జర్మనీలోను ముద్రితమైన పంచతంత్రమునకును నేఁటి భరతఖండమందలి పంచతంత్రమునకును కొన్నిచోట్ల భేదము కనవచ్చుచున్నదన్నాఁడు. కవికాలదృష్టితోఁబరామర్శించువారి కీవిషయము గోచరించును.

క్రీ. శ. ౫౩౧-౫౭౯ నడుమరాజ్యముచేయుచున్న ఔషరువా ననెడి పారసీకరాజుకాలమం దిది పహ్లవీభాషలోని కనువదింపఁబడిన దని తెలియుటంబట్టి యంతకుమున్నే యిది పుట్టిన దనికొందఱు, భర్తృహరి సుభాషితములోని "దౌర్మన్త్ర్యాన్నృపతి" రిత్యాదిశ్లోకము నిదిగ్రహించియుండుటంబట్టి దాని తరువాత నిదిజనియించిన దనికొందఱు, ఆశ్లోక మిందు తరువాతఁజేరిన దన్నభావముతో దానికంటెనుగూడ నిదిపూర్వ మనికొందఱు నూహించియున్నారు. అందుచే విష్ణుశర్మకాలము సునిశ్చితము గాకున్నదిగాని, యెట్లయినని తఁడు శా. శ. ౭౫౦ పూర్వుఁడుగాని పరుఁడుకాఁ డనిమాత్రము మన మూహింతము.

## పంచతంత్రవ్యాప్తి

ఎన్నో సంస్కృతగ్రంథము లెన్నోభాషలలోని కనువదింపఁబడినవి గాని దీనివలె బహుభాషలలోనికి పరివర్తన మందినకృతి యింకొకటి లే దనుట యతిశయోక్తికాదు. హెర్టలనుపాశ్చాత్యపరిశోధకుఁడు "పంచతంత్రమును సుమారు రెండువందలమంది సుమారేఁబదిభాషల

లోనికి మార్చియున్నా రని తన హిందూదేశకథాకావ్యచరిత్రలో వ్రాసియున్నాడు. దీని మహత్త్వ మంతటి దనుట కీమాట చాలును. దీనిననుసరించియు ననుకరించియు నుదయించిన నీతికావ్యములమాట యటుండ దీనికి సంగ్రహములైన పంచతంత్రకావ్య- పంచతంత్రకావ్యదర్పణ- పంచోపాఖ్యానసంగ్రహాదులును పెక్కుగలవు. ఇందు కడపటిదానికర్త అనంతభట్టు. అం దిందలి యైదుకథలును వచనముగా సంక్షిప్తములైనవి. ఇతనిమాటనుబట్టి పంచతంత్రమునకు పంచోపాఖ్యాన మను పేరుకూడ వాడుకలోఁ గల దని తెలియుచున్నది. అతనిమాట లివి.

"పదవాక్యప్రమాణజ్ఞోఽనన్తభట్ట ఇతిశ్రుతః
భట్టశ్రీనాగదేవస్యతనూజః కాణ్వశాఖినః"
కౌతుకాత్తన్యతే తేనపఞ్చోపాఖ్యానసఙ్గ్రహః

ఈకవి ఆంధ్రుఁ డని తోఁచుచున్నదిగాని, భారతచంపువు నిర్మించిన యతనికంటె నన్యుఁడు.

సులభగద్యకావ్యనిర్మాణమునఁ దరువాతికవులకు మార్గదర్శకుఁడైన యితనిపంచతంత్రము సకలదేశములలోని సంస్కృతవిద్యార్థులకు హస్తభూషణము, వాగ్భూషణమునై విరాజిల్లుచున్న దనుట పునరుక్తము. రుచికి రెండుశ్లోకములు.

" మాతృవత్పరదారాంశ్చపరద్రవ్యాణి లోష్టవత్,
ఆత్మవత్సర్వభూతాని యః పశ్యతిసపశ్యతి"
"వివాదేఽన్విష్యతేపత్రం, పత్రాభావేతుసాక్షిణః
సాక్ష్యభావేతతో దివ్యం ప్రవదన్తిమనీషిణః"

—:o:—

# శూద్రకుఁడు

ఇతఁ డొకరాజకవి, కవిరాజు. ఆదినుండియు విద్వాంసులను విమర్శకులను మిక్కిలి యాకర్షించుచు వచ్చినయుత్తమకవిజీవితములలో నితని దొకటి. ఇతని నాయకుని గావించి పూర్వులు కొందఱు కావ్యములు నిర్మించినా రనుటయే యితని ఘనతకుఁ దార్కాణము. రామిల సోమిలకవులు శూద్రకకథ రచియించినట్లు సూక్తిముక్తావళిలోనియీ చాటువు చెప్పుచున్నది.

" తౌ శూద్రకకథాకారౌ వన్ద్యౌ రామిలసోమిలౌ,
యయో ర్ద్వయోః కావ్య మాసీ దర్ధనారీశ్వరోపమమ్"

పఞ్చశిఖుఁ డను ప్రాకృతభాషాకవి యీరాజుచరితమును వైక్రాంత శూద్రక మనుపేరఁ గావ్యముగా నిర్మించినట్లును మఱియొకకవి శూద్రక చరితము రచియించినట్లును భోజునిశృంగారప్రకాశమందును హేమచంద్రునికావ్యానుశాసనమందు నున్నయీక్రిందివాక్యములవల్లఁ దెలియుచున్నది.

"శుకో జరద్గిరః శూద్రకకథాయాం హరిమతీవృత్తాన్తే యథా-శృం
"ఆసన్దః పఞ్చశిఖస్య శూద్రకకథాయామ్-కావ్యా.
"సమాభిన్న స్త్వరిత మసౌ మలిమ్లుచానాం,
మూర్వీశ శ్శమిత మయోధ య ద్ధనుష్మాన్॥ శృం

మఱియు "శూద్రకుఁడు బ్రాహ్మణుఁడు. శాలివాహనునికి మిత్రుఁడు. అతఁడు విక్రమాదిత్యు నోడించి యుజ్జయినికి రా జగుటకు సహాయ పడినవాఁడు. శాలివాహనునికొడుకు శక్తికుమారుఁడు వా రిరువురు గతించినపిదప శూద్రకుఁ డుజ్జయినికి రా జయ్యెను" ఇత్యాది కథను తనవీరచరితములో ననంతకవి వర్ణించియున్నట్లు తెలియుచున్నది. ఇట్టి రచనలనుబట్టి, అగాధసత్త్వుఁడు శౌర్యశాలియు నైనశూద్రకుఁడు వీరి

నాఁటికి మిక్కిలి పూర్వుఁడనియు, కాలక్రమమున మహిమాభిరామము లగుచు దేశమునవ్యాపించిన యితనికథల నాయాకవు లాయావిధముగా వర్ణించి రనియుఁ దెలియవచ్చును. ఇవి యిట్లుండ విఖ్యాతగ్రంథము లితని విషయ మెట్లు తెల్పినవో యించుక చూతము.

శూద్రకుఁడు, విదిశాపురీపాలకుఁ డని కాదంబరి, శోభావతీప్రభు వని కథాసరిత్సాగరము, వర్ధమానపురనాథుఁ డని వేతాలపంచవింశతి, చకోరరాజైనచంద్రకేతువున కితఁడు శత్రు వని హర్షచరిత్ర, విక్రమాదిత్య శూద్రక ప్రవరసేనులు మహాధైర్యసంపన్ను లని రాజతరంగిణి[1]. ఇట్టిమాటలను బట్టియితఁడు బ్రాహ్మణుఁడో క్షత్రియుఁడో విప్రుఁడై దేశమునకు రాజైనవాఁడో, అయితే యేదేశము నేలినవాఁడో నిర్ణయించుట యెట్లు? పూర్వకవులే తత్త్వము తెలియక యెవరికిఁ దెలిసినట్లు వారు వర్ణించియుండ నేఁటిచరిత్రకారులకుఁ బరిశోధకులకు నితనిసత్యచరిత్ర గోచరింప లేదన్న నాశ్చర్యమేమి? ఇఁక నితనికాల మందుమా, ప్రాచ్యపాశ్చాత్యపరిశోధకులవివిధాభిప్రాయములనుబట్టి క్రీ. పూ. 300 క్రీ. పూ. ౬౦౦ నడుమ నెందున్నవాఁ డన్న ననవచ్చును[2]. కావున నితని జీవితతత్త్వము తెలుపుటకై చర్వితచర్వణముగా వారివారివ్రాఁతలు క్రోడీకరించిచర్చించుచు గ్రంథము పెంచుటకంటెఁ దెలిసినంతలో సంగ్రహముగా నితని యుదంతము తెలుపుటయే సముచిత మని తోఁచినది.

శూద్రకుఁడు మృచ్ఛకటిక మను పదియఙ్కముల ప్రకరణము నిర్మించెను. ఇది దండి రచియించినదిగాని యితనిదికా దని పిష్ఛెలు మాగ్డోనలు మొదలగు పాశ్చాత్యు లభిప్రాయపడిరిగాని, మనపరిశోధకు లాయభిప్రా

1. మార్గమధ్యమున ప్రవరసేనునితో రాక్షసుఁ డన్నమాటలు-రాజ ౩. తరం-
"సంత్యజ్య విక్రమాదిత్యం సత్త్వోద్రిక్తశ్చ శూద్రకమ్,
త్వాంచ భూపాల! పర్యాప్తం ధైర్య మన్యత్ర దుర్లభమ్"
2. చూ. డాక్టరు కృష్ణమాచార్యులసంస్కృతసారస్వతచరిత్ర-(ఆంగము) పేజీ. 575

యము నెన్నఁడో నిరసించినాఁడు. దీని ప్రస్తావనలో సూత్రధారోక్తములుగా నున్నమాట లివి:—[1]. ఇట్టియాత్మప్రశంస యెట్లపూర్వమో, ఇన్నిశుభలక్షణములు గలకవియు నట్లపూర్వుఁడని మేము భావింతుము.

“సౌందర్యమూర్తియు ద్విజాతిశ్రేష్ఠుఁడును అగాధసత్త్వుఁడును ఋగాదివిద్యాపారంగతుఁడు నీశ్వరానుగ్రహమున జ్ఞాననేత్రము వికసించినవాఁడు నగు శూద్రకవి కుమారునికిరాజ్య మిచ్చియశ్వమేధయాగ మొనర్చి నూఱేండ్లపదిదినములు జీవించి యగ్నిలోఁ బ్రవేశించెను” ఇత్యాదిగా నున్నమాటల కొకవ్యాఖ్యాత పృథ్వీధరుఁడు వ్రాసినయర్థమిది:—[2].

క్షత్రజాతిశ్రేష్ఠుఁడైనశూద్రకుఁడు జాతకాదిగణితము ద్వారా తనయాయుఃపరిమితిని దెలిసికొని తరువాతఁ జేయబోవునగ్నిప్రవేశము నాసూత్రధారోక్తిగా ముందే తెలుపుట విరుద్ధము కాదని మర్మజ్ఞులనుచున్నారు. దీనినిబట్టి ప్రస్తావనతోడియీరూపకమును శూద్రకుఁడను రాజు నిర్మించె నని స్పష్టమగుచున్నది. ఈవ్యాఖ్యాతమాట విశ్వసనీయ మనుటకు, ప్రసిద్ధలాక్షణికుఁడైనవామనాచార్యుఁడు తనకావ్యాలంకారసూత్రవృత్తిలో నొకచో శూద్రకుని గావ్యకర్తఁగాఁ బేర్కొనుటయు నొకచో

1. ద్విరదేంద్రగతి శ్చకోరనేత్రః పరిపూర్ణేందుముఖః సువిగ్రహశ్చ,
ద్విజముఖ్యతమః కవి ర్బభూవ ప్రథితః శూద్రక ఇత్యగాధసత్త్వః,,
ఋగ్వేదం సామవేదం గణిత మథ కలాం వైశికీం హస్తిశిక్షాం,
జ్ఞాత్వాశర్వప్రసాదా ద్వ్యపగతతిమిరే చక్షుషీ చోపలభ్య
రాజానం వీక్ష్య పుత్రం పరమసముదయే నాశ్వమేధేన చేష్ట్వా,
లబ్ధ్వా చాయు శ్శతాబ్దం దశదినసహితం శూద్రకో ఽగ్నిం ప్రవిష్టః,,

2. లబ్ధ్వా చాయుశ్శతాబ్ద మగ్నిం ప్రవిష్ట ఇతిజాతకాదిగణితద్వారా జ్ఞాత్వా, ఆగామిసూత్రధారవచనాపేక్షయాఽగ్నిం ప్రవిష్ట ఇత్యాదిభూతకాలప్రత్యయో న విరుద్ధ ఇతిమర్మజ్ఞాః.

మృచ్ఛకటికములోనివాక్య ముదాహరించుటయుఁ బ్రమాణ మగు చున్నది[1]. ఇఁక నీవిషయమున సంశయ మేల ?

శూద్రకుఁడు ధీరుఁడు వేదవేదాంగవేత్త శివభక్తుఁడు జ్ఞాని కర్మ నిష్ఠుఁడు. శరభంగునివలె యోగాగ్నికి దేహమర్పించినవిరాగుఁడు నని యింతకుమున్న తెలిసినది. ఈక్రిందిప్రస్తావనాశ్లోకమునుబట్టి యితఁడు తపోనిధి యుద్ధప్రియుఁడు గజయుద్ధమునందు మహాబలుఁడునై యున్నాఁడు నని తెలియుచున్నది.

"సమరవ్యసనీ ప్రమాదశూన్యః కకుదం వేదవిదాం తపోధనశ్చ,
పరవారణబాహుయుద్ధలుబ్ధః క్షితిపాలః కిల శూద్రకో బభూవ"

దీనినిబట్టి యితఁడు పరరాజులతోఁ బోరాడి రాజ్యము సంపాదించినవాఁ డన్నకథలలోఁ గొంత సత్య మున్న దని తోఁచకపోదు. శాలివాహనవిక్రమాదిత్యులసంగ్రామము సత్యమని బలవత్ప్రమాణాంతరమున స్థిరపడినచో నితఁడుజ్జయిని నేలినవాఁ డనవచ్చును గాని యట్టిది లభింపకున్నది. పురాణములదారి వేఱు పరిశోధకులదారి వేఱు. అందుచే నితనికాల మజ్ఞేయ మగుచున్నది. అయినాఁ గొంత:—

శా. ౭౦౦ ప్రాంతమందలి వామనాచార్యుని కంటె నితఁడు పూర్వుఁ డని యతనిమాటలవల్ల నిప్పటికిఁ దెలిసినది. శా. ౫౦౮ లో దివంగతుఁడైన వరాహమిహిరునికంటెఁ గూడా పూర్వుఁ డని యితని మాటవల్లనే యిపుడు తెలియుచున్నది. జాతకస్కంధములో యవనేశ్వరుని మతము ప్రసిద్ధము. వరాహమిహిరుఁ డతనిమతమును బృహజ్జాతకములో పెక్కుచోట్ల స్మరించియున్నాఁడు. వ్యాఖ్యాత లతనిశ్లోకముల నుదాహరించియున్నారు. కాని, కుజునికి గురుఁడు శత్రువన్నయవనమతమును[2] యథోక్తముగా గ్రహించి శూద్రకుఁడు మృచ్ఛకటికనవమాంకములో

1. శూద్రకాదిరచితేషు ప్రబన్ధేష్వస్య భూయాన్ ప్రపఞ్చో దృశ్యతే. అధి. 3
ద్యూతంహి నామ పురుషస్యాసింహాసనం రాజ్యమ్-అధి. ४

"అఙ్గారకవిరుద్ధస్య ప్రక్షీణస్య బృహస్పతేః" అని వ్రాసియున్నాఁడు. ఈ యవనమతముఁ గూడ నుద్ఘాటించుచునే తననాఁటికి వ్యాప్తమైన సత్యాచార్యమతమునకుఁ బ్రాధాన్య మిచ్చి, "జీవేన్దూష్ణకరాః కుజస్య సుహృదః" అని కుజునికి గురుఁడు మిత్రుఁ డన్నాఁడు వరాహమిహిరుడు[1] దీనినిబట్టి యతనికిఁ గవి మిక్కిలి పూర్వుఁడై యవనేశ్వరమత మెక్కువగా వ్యాప్తిలో నున్న కాలమునందు మృచ్ఛకటికము నిర్మించియుండు నని విశ్వసింపవచ్చును. అయితే, ఆకాల మేది? స్కాందమునుబట్టి కలిలో 3300 గతించినసమయమా? లేక యుత్తరపరిశోధనలనుబట్టి క్రీ. రెండవశతాబ్ది యగునా? కాక, నాల్గవశతాబ్ది యగునా? ఏ మనఁ దగును? శా. శ. ౪౦౦ కాలమున కీవలివాఁడు కాఁడని భావించుటయే యిప్పటికి సముచిత మని నాయభిప్రాయము. ఇఁకఁ గృతి—

రూపకసారస్వతమున విఖ్యాతి గన్నకొలఁదిరూపకములలో మృచ్ఛకటిక మొకటియనుటయు, ఇది భాసునిచారుదత్తము నెల్లవిధముల ననుసరించిన దైనను దానికంటె మనోహరమై వెలయుచున్న దనుటయు నిస్సంశయము. ఇందునఁ గథాసన్నివేశముచేఁ గొంత నవ్యత చూపట్టుటయే మొదటికారణము.

ఇందు దరిద్రచారుదత్తుఁడు నాయకుఁడు, ధీరశాంతుఁడు. వేశ్యయైన వసంతసేన నాయిక గుణానురక్త ధనవిరక్త యుత్తమశీల. శృంగారము ప్రధానరసము. పాత్రౌచిత్యమునకు పెట్టినది పే రన్నట్లున్న యిది సహృదయహృదయంగమమై ప్రదర్శనరమ్యమై ఖ్యాతి గాంచినది. ఇందలిప్రతిపాత్రము తత్తత్కార్య నిర్వహణమున సమర్థమై ప్రధాన కథాసంవిధానమునఁ జక్కఁగా నతుకుకొన్నది. ఇఁక రసమందుమా, ఔచిత్యపారము గాంచి సామాజికులను పాఠకులను తన్మయులను గావించునట్లు పోషింపఁబడినది. సాంఘికనాటకములలో నిది యగ్రగణ్యము,

1. బృహ. అధ్యా ౨ శ్లో. ౧౬,

ఈరాజకవి నిర్మించినమఱియొకకృతి కనిపించదు. ఇతఁడొకభాణము వ్రాసినట్లుచెప్పు "వరరుచిరీశ్వరదత్తః" ఇత్యాదిచాటువునమ్మరాని దని మున్నే చదివితిమి.

చారుదత్తములో నీసజ్జలకుఁడు కన్నము వేయుచు ఖరపటుని ధ్యానించెను. ఇందు శర్విలకుఁడు నాలుగురకముల కన్నము లుపదేశించిన కనకశక్తిని స్మరించెను. దీనినిబట్టి భాసునినాఁటికి చౌర్యోపాయవక్త ఖరపటుఁడనియు, ఈకవినాఁటికి కుమారకార్తికేయునిసంప్రదాయము ననుసరించి కనకశక్తిమొదలగువారి చౌర్యసూత్రము లుదయించిన వనియు తెలియ నయ్యెడి. కాని, ఆచౌర్యశాస్త్రగ్రంథము లిపుఁ డడు గంటినవి.

శూద్రకునికవిత్వము మృదుమధురము. భావములు హృదయంగమములు. దీనినుండి రెండుశ్లోకములు చవిచూతము.

"వర్షోదక ముద్గిరతా శ్రవణాంతవిలంబినా కదంబేన,
ఏకః స్తనోఽభిషిక్తో నృపసుత ఇవ యౌవరాజ్యస్థః"

ఇదిసాటిలేని యుత్ప్రేక్ష,

" యత్నేనసేవితవ్యః, పురుషః కులశీలవాన్ దరిద్రోఽపి
శోభా హి పణ్యస్త్రీణాం, సదృశజనసమాశ్రయః కామః"

ఆహా! ఎంతచక్కనియుపదేశము ?

ఇతఁడు చారుదత్తమెన్నోసార్లు చదివి యందలి విశేష విషయములననుకరించుటయేకాక, భాసునిమాటలుకూడా కొన్ని సంగ్రహించినమాటనిజము. ఇదే భాసునియందితనికి కలభక్తిగౌరవములకు నిదర్శనము "యాసాంబలిర్భవతి-విషాదస్రస్తర్వాంగీ-మార్జారః ప్లవనే-ఇత్యాది చారుదత్తశ్లోకములుకొన్ని మాటలమార్పుతో సరిగా మృచ్ఛకటికమున కనవచ్చును. అయినా, ఇది గ్రంథచౌర్యము కానేరదు. చారుదత్త మిపుడు వీథికివచ్చినా, దానిఖ్యాతిదానిదే దీనిప్రసిద్ధి దీనిదే-ఇఁక మనసు కరిగించు నాయకుని మాటలువెందు:

" మన్యే నిర్ధనతా ప్రకామమపరం షష్ఠం మహాపాతకమ్,
" పాపం కర్మ చ యత్పరైరపి కృతం తత్తస్య సంభావ్యతే"
" ద్వయమిద మతీవ లోకే ప్రియం నరాణాం సుహృచ్చ వనితా చ,
సంప్రతి తు సుందరీణాం శతాదపి సుహృద్విశిష్టతమః"

# మాఘుఁడు

ఈ మహాకవి "శ్రీవర్మల రాజునాస్థానమున సర్వాధికారిగా నున్న సుప్రభదేవుని పౌత్రుఁడు, ఉదారుఁడు సత్యసంధుఁడు నైనదత్తకుని పుత్త్రుఁడు" అనిమాత్ర మితనికావ్యము తుద నున్నశ్లోకములవల్లఁ దెలిసినది[1]. కాని, దేశకాలనివాసములను దెలుపుమాట లందు లేవు. లిఖితపుస్తకాంతములందు కొన్నిట నారాజుపేరు, ధర్మనాభుఁడు ధర్మలాతుఁడు వర్మనాముఁడు వర్మనాభుఁడు నని వివిధముగా నున్నది. మల్లినాథుఁ డాశ్లోకముల కర్థము వ్రాయక పోవుటను బట్టి యవి సందిగ్ధము లని కొందఱనుచున్నారు. ఒకవ్రాఁతప్రతిచివర "భిన్నమాలవవాస్తవ్యదత్తకసూనోర్మహావైయాకరణస్య మాఘస్య కృతౌ" అని యున్నగద్యనుబట్టి యితని నివాసము భిన్నమాలవపుర మని తెలియుచున్నదిగాని[2] అది శ్రీమాల భీనమాల భిన్నమాల యని త్రివిధముగా కొందఱిచే వ్రాఁతలఁగనఁబడుచున్నది[3]. గూర్జరమాలవదేశములసంధిలో "భిన్నమాల"యను గ్రామమున్న దని కొందఱన్నారు. రాజపుతానాలోని" "వసంతగడ"గ్రామ

1. సర్వాధికారీ సుకృతాధికారః, శ్రీవర్మలాఖ్యస్య బభూవ రాజ్ఞః,
అసక్తదృష్టి ర్విరజాః సదైవ దేవోఽపరః సుప్రభదేవనామా,
తస్యాభవ ద్దత్తక ఇత్యుదాత్తః, క్షమీ మృదు ర్ధర్మపర స్తనూజః,
2. దుర్గాప్రసాదపండితుని శిశుపాలవధపీఠిక (బొంబాయి)
3. బలదేవోపాధ్యాయుల సంస్కృతకవిచర్చ (హిందీ)

మందలి శిలాశాసనమం దున్నశ్లోకములనుబట్టి[1] యీ కవిపితామహుని కాశ్రయభూతుఁ డైనరాజు వర్మలాతుఁ” డని తెలియుటచే పూర్వోక్త మగుసన నివాసము వేఱగుచున్నది. కవి తెలిపినదానికంటె రాజుపేరును వేఱగుచున్నది. ఈవిషయ మిట్లుండ నితనికాలము పరిశోధకుల మతభేద ములనుబట్టి మఱియు నవ్యవస్థముగాఁ గనఁబడుచున్నది.[2] కవుల దేశ కాలాదినిర్ణయమున భోజప్రబంధము ప్రబంధచింతామణి ప్రభావక చరితము ప్రమాణము కాఁజాల వని బహుపరిశోధకులు తలంచుచున్నను ఒక రిద్దఱు వాటినిబట్టి దారిద్ర్యపీడితుఁ డైనమాఘుఁడు పత్నీసహితుఁడై భోజమహారాజును యాచింప వచ్చె ననియు, నితని పినతండ్రికొడుకు సిద్ధ కవి ఉపమితిభావప్రపంచకథ నిర్మించి భోజుని యాదర మందె ననియు నేవేవో వ్రాసిరి. ఇట్లే మఱికొందఱీకవి క్రీ. ౧౦, ౧౧, ౧౨, శతా బ్దులలోనివాఁ డని భావించుచు వచ్చిరి. కాని, ధ్వన్యాలోకమునుబట్టి ఆనందవర్ధనాచార్యునికిఁ బూర్వుఁ డైనట్లు తెలియుచున్న మాఘుఁ డతని తరువాత నుండె నని వ్రాసినవ్రాఁత లెవరు నమ్ముదురు? కావున నతని కితఁ డెంతపూర్వుఁ డన్నవిషయ మొక్కటియే మన కిపుడు విచారణీయము.

ఆనందవర్ధనుఁడు శా. శ. ౭౭౭—౮౦౬ నడుమనున్నవాఁడు. అతఁడు మాఘుని శ్లోకమును ధ్వన్యాలోకములో నుదాహరించి యున్నాఁడు.[3] జయాపీడుఁడు, ఉద్భటుఁడు శా. ౭౦౦ ప్రాంతమువారు. తారానాథ తర్కవాచస్పతి మాఘునిగూర్చి వ్రాయుచు, వాచస్పత్య మునం దీయుద్భటునిదిగా నీక్రిందిశ్లోక ముదాహరించియుండెను.

1. ద్వ్యశీత్యధికే కాలే షణ్ణాం వర్షశతోత్తరే,
జగన్మాతు రిదం స్థానం స్థాపితం గోష్ఠిపుంగవైః,
జయతి జయలక్ష్మీ లక్ష్మీతవక్ష స్థలసంశ్రియోదారః,
శ్రీవర్మలాతనృపతిః పతి రవనే రధికబలవీర్యః.

2. డాక్టరు కృష్ణమాచార్యుల సంస్కృతసారస్వతచరిత్ర. పుట. 155, 156.

3. త్రాసాకులఃపరిపతన్పరితోనికేతాన్' ఇత్యాది. శిశు ౫-౨౬.

"తావ ద్భా భారవే ర్భాతి యావ న్మాఘస్య నోదయః,
ఉదితే చ పున ర్మాఘే భా రవేర్భారవేరివ"

ఈశ్లోక మాద్భటుఁడు నిర్మించినది కా దని యూహించినవా రుందురు గాక. అతఁడు మనకుఁ దెలియని మఱియొకఁడైనను విద్వల్లోక సంప్రదాయమున భారవిమాఘుల సన్నిహితత్వము విన్నవాఁడు రచియించినదే యనుకొనుట కాక్షేప మేమి? కావున భారవికి మాఘుఁడెంతో యంతరము లేని యర్వాచీనుఁడై యుండునని భావింతము. కాని, యిందు కొక చిన్నయడ్డము దాఁటవలసియున్నది.

పాణినిసూత్రములకు వామనజయాదిత్యులు వృత్తి నిర్మించినారు. వారికాలమునుగూర్చి యభిప్రాయభేదము లేకపోలేదు గాని, పెక్కండ్ర మతమున వృత్తినిర్మాణకాలము శా. శ. ౫౭౦ ప్రాంత మగుచున్నది. ఆవృత్తికి జినేంద్రబుద్ధి న్యాస మనుపేర వ్యాఖ్య నిర్మించెను. అతని కాలము నించుక సంశయాస్పద మైనను, న్యాసనిర్మాణకాలము శా. శ. ౬౨౦ ప్రాంత మనవచ్చును, ఇది యిట్లుండ—

మాఘుఁడు శిశుపాలవధలో రాజనీతిని వర్ణించుచు నొక శ్లోకమునందు వృత్తి, న్యాస, పదముల నర్థసమన్వయోచితముగా వాడియున్నాఁడు.[1] ఆపదములు పైవ్యాకరణగ్రంథబోధకములుగా నిందు శ్లేషించియున్న వని యెట్లోమల్లినాథుఁడు భ్రాంతిపడి యర్థమువ్రాసినాఁడు. జినేంద్రబుద్ధికృతిన్యాసమునకు, ఉద్ద్యోత మనుపేర వ్యాఖ్య నిర్మించిన యతని కట్టిభ్రాంతి కలుగుట సహజమే. అంతేకాని, యావృత్తిన్యాసగ్రంథములకు శిశుపాలవధ పర మని యెఱిఁగి యట్లు వ్రాసినవాఁడు కాఁడు. అట్టియెడ నతనిమాట పట్టుకొని జినేంద్రబుద్ధికంటె మాఘుఁడు పరుఁడనుట యెట్లు సముచిత మగును? ఇంతకును మాఘకవిని దేర్కొన్న

1. అనుత్సూత్రపదన్యాసా సద్వృత్తి స్సనిబన్ధనా,
శబ్దవిద్యేవ నోభాతి రాజనీతి రపస్పశా. శిశు. ౨. ౧౧౨-దానివ్యాఖ్య.

హరదత్తుని పదమంజరిలోని మాటలను గ్రహించిన జినేంద్రబుద్ధి వారిద్దఱి కంటె మిక్కిలి పరుఁ డని స్పష్ట మగుచున్నది కదా? ఇంక.—

సంవతు ౬౮౨ లోని వసంతగడశాసనమునందలి వర్మలాతుఁడు మాఘునిపితామహు నాదరించినవాఁ డని విశ్వసింతుమేనియతని పౌత్రుఁ డైనయితఁడు శా. శ. ౫౯౦ ప్రాంతమువాఁ డగును. కీల్హార్న పండితుని మత మిదే-జాకోబీదుర్గాప్రసాదపండితులమతము నంగీకరింతు మేని మాఘుఁడు శా. శ. ౪౮౦ ప్రాంతమువాఁ డగును. ఇది పూర్వోక్త, 'తావ ద్భా భారవే', రిత్యాదిశ్లోకార్థమునకు సరిపడుచున్నది. కావున నితఁ డీకాలమువాఁడే యని భావింతము.

మాఘుఁడు శబ్దతర్కవేదాంతశాస్త్రనిష్ణాతుఁడు. కవితాకన్యకు భారవి నేర్పిన యర్థభావగాంభీర్యములప్రౌఢిమ నింకను సరిదిద్దినప్రౌఢకవి. చిత్రయమకబంధకవిత్వప్రియుఁడు కవితాకలాభిజ్ఞుఁడు ఇతనికృతి చదివి యానందించినయొక యర్వాచీనవిద్వాంసుఁ డితని నిట్లు స్తుతించి యున్నాఁడు.

“ఉపమా కాళిదాసస్య భారవే రర్థగౌరవమ్,
దండినః పదలాలిత్యం మాఘే సంతి త్రయో గుణాః”

ఇది కేవలము స్తుతివచనముగాని మాఘునికంటె దండిపూర్వుఁ డని యెఱిఁగి యిట్లుచెప్పిన దని భావింపరాదు, వ్యాఖ్యాన మంటే నల్లేరు మీఁద బండి యైన మల్లినాథుఁడు “మేఘే మాఘే గతం వయః” అని తాను పడ్డక్లేశమును దెలుపుటయే యితనికృతిమహత్త్వ మెంతటి దనుటకు చాలును.

ఇతఁడు దుష్టశిక్షకుఁ డగు శ్రీకృష్ణుఁడు శిశుపాలుని వధించుట యను భారతభాగవతాదిప్రసిద్ధ మైన కథను గ్రహించి స్వేచ్ఛగా కావ్యశైలి నిరువదిసర్గల యీకావ్యమును నిర్మించి యున్నాఁడు:—

పూర్వమహాకవు లందఱును వేదవేదాంగదర్శనము లెఱిఁగినవారగుట నందలివిజ్ఞానమును తమకృతుల నందందు చూపుచు వచ్చి రనుట పాఠకలోక మెఱుఁగనిది కాదు కాని, యితఁ డాపని యెక్కువ చేసినాఁడనుట కితనికావ్య మన్నిసర్గలలోను చక్కని యుదాహరణములు కలవు. అందును వివిధశాస్త్రజ్ఞానము నెక్కువగా చూపినది పదునాల్గవసర్గ. నాట్యశాస్త్ర సంగీతశాస్త్రములం దితని కధికపరిచయము కల దనుటకును, బౌద్ధదర్శన మితఁడు చక్కఁగా నెఱుఁగు ననుటకు నెన్నేనియుదాహరణము లిందు లభించును[1]. రెండవసర్గ రాజనీతిమూర్తిభావము. అందలిశ్లోకము లెల్లతెల్లని యాంధ్రదేశ ప్రతీతి. ఆసేతుహిమాచలము సంస్కృతభాషాపాఠకులు పఠించు పంచకావ్యములలో నిది యొకటి యగుటయే కాదు, ఇది చదివినచో శబ్దజాల మంతయు నవగత మగు నన్నభావముకూడా యెన్నఁడో పుట్టినది.

“ నవసర్గగతే మాఘే నవశబ్దో న విద్యతే ”

అనేకగ్రంథములకు వ్యాఖ్యలు రచియించిన మల్లినాథునివంటి మహావిద్వాంసుఁడు:—

“ ధన్యో మాఘకవి ర్వయం చ కృతిన స్తత్సూక్తిసంసేవనాత్ ”

అని ప్రశంసించి యుండ నిఁక దీనిమహత్త్వ మిట్టి దని మనము వేఱుగా పొగడ నేల?—

ఇతనియీకృతిలో శ్రీకృష్ణుఁడు నాయకుఁడు శృంగారాదు లంగములుగా వీరము ప్రధానము శిశుపాలవధ కావ్యఫలము.

1. ఉదాసితారం నిగృహీతమానసై ర్గృహీత మధ్యాత్మదృశా కథం చన, బహి ర్వికారం
ప్రకృతేః పృథ గ్విదుః పురాతనం త్వాం పురుషం పురావిదః-౧-౩౩
శ్రుతిసమధిక ముచ్చైః పంచమం పీడయన్తః
సతత మృషభహీనం భిన్నకీకృత్య షడ్జం-౧౧-౧,
సర్వకార్యశరీరేషు ముక్త్వాంగస్కంధపంచకం,
సౌగతానా మి వా త్మాన్యో నాస్తి మంత్రో మహీభృతాం-౨-౨౮

ఈమహానీయునికృతి మఱియొకటి యేదియు కనరాదు గాని, ఔచిత్యవిచారచర్చాసుభాషితావళ్యాదు లితనివి గా మూఁడు శ్లోకములు చూపినవి. అందులో నితనిదన్న "శీలం శైలతటాత్" అనుశ్లోకము భర్తృహరినీతిశతకములో కనఁబడుచున్నది. క్షేమేంద్రాదు లాకవులకు మిక్కిలి తరువాతివా రగుటచే నెవరిశ్లోక మెవరి కారోపించిరో! తెలియదు1.

లోకప్రసిద్ధమై బహువ్యాఖ్యాతలవినుతినిగన్నయీమహాకవి మహాకావ్యమునుగూర్చి యెంత యని వ్రాయఁగలము. ఇందలిగుణ మెంతయని చూపఁగలము? ఇఁక రుచిచూపుటకు రెండు:—

"అన్యథాభూషణం పుంసాం, శమో లజ్జేవ యోషితామ్,
పరాక్రమః పరిభవే వైయాత్యం సురతేష్వివ
"మాజీవన్ యః పరావజ్ఞాదుఃఖదగ్ధోఽపిజీవతి,
తస్యాజననిరేవాస్తుజననీక్లేశకారిణః"
"మనాగనభ్యావృత్త్యావా, కామం క్షామ్యతుయఃక్షమీ,
క్రియాసమభిహారేణ, విరాధ్య న్తంక్షమేతకః?"

ఒకవంక నుదయించుసూర్యునితోను, వేఱొకవంక నస్తమించు చంద్రునితోను వెలయుచున్నరైవతకాద్రియిరుపార్శ్వముల ఘంటలతో

---

1. "స జయతి గిరికన్యామిత్రతాశ్చర్యమూర్తిః,
త్రిపురయువతిలీలావిభ్రమభ్రంశహేతుః,
ఉపచయవతి యస్య ప్రోన్నతైకస్తనత్వా,
దుపరిభుజగహారః స్థానవైషమ్య మేతి"
"నారీనితంబఫలకే ప్రతిబధ్యమానా, హంసీవ హేమరశనా మధురం రరాస,
తన్మోచనార్థమివ నూపురరాజహంసాః, చక్రందు రార్తముఖరం చరణావలగ్నాః"
"అంబరం వినయతః ప్రియపాణే ర్యోషితశ్చ కరయోః కలహస్య,
వారణా మివ విధాతు మభీక్ష్ణం కక్ష్యయా చ వలయైశ్చ శిశింజే" సూక్తిము-
"బుభుక్షితైర్వ్యాకరణం నభుజ్యతే, పిపాసితైః కావ్యరసో నపీయతే,
నవిద్యయా కేనచిదుద్ధృతం కులం, హిరణ్యమేవార్జయనిష్ఫలాః కలాః, ఔచిత్య"

నొప్పుచున్న మత్తగజములవలె నున్నదని వర్ణించుటంబట్టి యితనికి ఘంటామాఘుఁడన్న పేరువచ్చినదట—ఆశ్లోకమిది:—

"ఉదయతివితతోర్ధ్వరశ్మిరజ్జావహిమకరే, హిమధామ్నియాతి చాస్తమ్,
వహతిగిరిరయం విలంబిఘంటాద్వయపరివారితవారణేంద్రలీలామ్"

—:o:—

# దండ్యాచార్యుఁడు

ఈమహాకవి భామహునికిఁ బూర్వుఁడా పరుఁడా యని యెందఱో చర్చించి యున్నారు. నా సంస్కృతవాఙ్మయచరిత్రలో నేను పరిశీలించియున్నాను. అందలి సారాంశ మిది

నాట్యశాస్త్రమతము ననుసరించి—అపార్థము—వ్యర్థము—ఏకార్థము ఇత్యాది కావ్యదోషదశకమును గణించి, ప్రతిజ్ఞాహేతుదృష్టాంతహాని దోష మగునా కాదా యని విమర్శించుట నిష్ప్రయోజన మని యితఁ డన్నాఁడు[1]. భామహుఁడు దానిని కావ్యదోషముగా సాధించుటకై పంచమపరిచ్ఛేదమును వినియోగించినాఁడు. ఇతఁ డలంకారము లన్న హేతు సూక్ష్మ లేశములను భామహుఁడు కా వన్నాఁడు. ఇతఁడు వైదర్భీరీతి మంచి దన నతఁడు గౌడీవైదర్భీభేదము పాటించుట తప్పన్నాఁడు. ఉపమాదోషపరిగణమున నితని మత మతఁడు ఖండించి యున్నాఁడు. పేళ్ళు వే ఱైనను కథాఖ్యాయికలు రెండు నొకజాతివే యని యితఁ డనఁగా నతఁడు వానిభేదము పాటించి వేఱుగా లక్షణములు వ్రాసినాఁడు. ఇతఁడు ప్రహేళికాభేదమున కుదాహరించిన

"విజితాత్మభవద్వేషిగురుపాదహతో జనః
హిమాపహామిత్రధరైర్వ్యాప్తం వ్యోమాభినందతి"

1. చూ. కావ్యాద. 3, ౧౨౫, ౨౬, ౨౭. కావ్యాలం. ౪, ౧, ౨౬

అనుశ్లోకములోని యుత్తరార్థము గ్రహించి యతఁడిది యవాచక మనెడిదోష మని నిరసించినాఁడు. పైశ్లోకము దండి దని శార్ఙ్గధరుఁ డనుటనుబట్టి యీశ్లోకము దండిభామహులిద్దఱుకూడా నితరకృతి నుండి గ్రహించియుందు రనుటకు వీలులేదు-ఇత్యాది హేతువులనుబట్టి భామహునికంటె నించుకపూర్వుఁ డనదగినయీదండి శా. ౫౦౦ ప్రాంతమువాఁ డనుట యుక్త మగును[1]. ఇతఁడు భారవికి ప్రపౌత్రుఁడుకాఁ డనియు, మాఘుని కించుకపరుఁ డనియు వెనుకఁ జదివియున్నాము.

ఇ త ర కృ తు లు

"త్రయోఽగ్నయ స్త్రయో వేదా స్త్రయో దేవా స్త్రయో గుణాః
త్రయో దణ్డిప్రబన్ధాశ్చ త్రిషు లోకేషు విశ్రుతాః"

అను రాజశేఖరుని ప్రశంసనుబట్టి కావ్యాదర్శ దశకుమారచరితములుగాక యింకొకటి యుండవలసియున్నది. అది ఛందోవిచితి యనియు మృచ్ఛకటిక మనియు కవిహృదయ మనియు కలాపరిచ్ఛేద మనియు అవంతిసుందరీకథయనియు వాదుచు రనుచుండ దశకుమార చరిత్ర యీదండిదికా దని త్రివేదీ-డిసుని ప్రతాపరుద్రీయటీక చెప్పుచున్నది. ఇం దేమతమును గ్రాహ్యముగా నేరము.

దండి కర్మవశమున చర్మరోగము పాలై యౌషధసేవచే ఫలము లేక, గురూపదేశమునుబట్టి శివారాధకుఁడై యనామయ స్తవ మొనరింప, దానివలన నారోగ్యము సంభవించె నని వీరశైవసంప్రదాయ మొకటియున్నది: మందాక్రాంతావృత్తములతోడి యీ స్తవము శివపంచ స్తవిలో చేరి సికింద్రాబాదులో ముద్రితమైనది. ఫలశ్రుతిశ్లోక మి ట్లున్నది.

"ఇతి విరచిత మేత చ్చారుచంద్రార్థమౌళే,
ర్లలితపద ముదారం దండినా పండితేన,

---

1. క్రీ. ౫౫౦-౬౫౦ నడుమ రాజ్యముచేసినశిలాదిత్యుని నాఁటికిదండిబాగా పెద్దవాఁడని ఆర్. సి. దత్తుగారియభిప్రాయము.

స్తవన మవనకామే నాత్మనో ఽనామయాఖ్యం
భవతి విగతరోగో జంతు రేతజ్జపేన.

మఱియు ౨౭వ. శ్లోకములోని "దండిన" మ్మనువిశేషణమును స్వనామజ్ఞాపకముగా నితఁడు ప్రయోగించినట్లు కనఁబడుచున్నది.

"వన్దే రుద్రం వరద మమలం దండినం ముణ్డధారం
దివ్యజ్ఞానం త్రిపురదహనం శంకరం శూలపాణిమ్"

ఇది యీవిధముగా ప్రమాణబద్ధమును సంప్రదాయసిద్ధము నై కనవచ్చుచున్నది గావున, నితనిమీఁదవకృతి అనామయ స్తవ మని విశ్వసించుట సముచితమగును. దండినః పదలాలిత్య మ్మనుసూక్తికి నీస్తుతి సమర్థ మగుచున్నది. ఇందు కొకటి-

"మన్త్రాభ్యాసో నియమవిధయ స్తీర్థయాత్రానురోధో
గ్రామే భిక్షాచరణ ముటజే బీజవృత్తి ర్వనేవా,
ఇత్యాయాసే మహతి రమతా మప్రమేయ ప్రగల్భః
స్మృత్వైవాహం తవ చరణయో ర్నిర్వృతిం సాధయామి.

ఇతఁడు భరతనాట్యశాస్త్రాదిగ్రంథములను పరిశీలించి రచియించినకావ్యాదర్శములో నాటకాదులలక్షణములు తప్ప, తక్కినకావ్యాలంకారభేదములలక్షణము లన్నియు విశదీకరించియున్నాఁడు. ఇది ౬౬౨ శ్లోకములతోఁడి మూఁడు పరిచ్ఛేదముల లక్షణము.

"శరీరం తావ దిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ"

ఇష్టమైన యర్థముతోఁ గూడినశబ్దసరణి కావ్యశరీర మన్న యితఁడే కావ్యమున కాత్మ యేది యనెడి సాహిత్యమీమాంసావిషయక మైన సూక్ష్మపరిశీలనకు దారితీసినవాఁడు. ఇతఁడు మార్గ మన్నదానినే వామనుఁడు రీతి యన్నాఁడు. భరతాచార్యుఁ డుపమాభేదము లైదుచూపి యుండ, దండివాటిని ముప్పదినాలుగు చేసిచూపి, తరువాతివారికిమార్గదర్శకుఁ డైనాఁడు. ఇతఁడీకావ్యాదర్శములో పూర్వగ్రంథకర్తలమతము

లెత్తి యుదాహరించినశ్లోకము లన్నియు నితనివే కాని, చర్చకై యితరులశ్లోకములు కూడా కొన్ని గ్రహించియున్నాడు. ఇందుకు భాసుని బాలచరితచారుదత్తము లందు కనవచ్చునీక్రిందిశ్లోక ముదాహరణము.

“ లింపతీవ తమో உఙ్గాని, వర్షతీవాఞ్జనం నభః,
అసత్పురుషసేవేవ దృష్టి ర్విఫలతాం గతా”

ఇది యుత్ప్రేక్షగా కనవచ్చినా, ఇవశబ్దమునుబట్టి యుపమా భ్రాంతి కలిగించుచున్న దన్నాడు. ఇంక:—

“ జాతే జగతి వాల్మీకౌ, కవి రిత్యభిధా భవత్,
కవీ ఇతి తతో వ్యాసే, కవయ స్త్వయి దండిని”

అనుచు విద్వన్నుతి గాంచినదశకుమారచరిత్రమందుమా, నిరుపమానము. మృదుమధురపదములతోడి చక్కని వాక్య విన్యాసమునకు నిలయ మైన యిది భాషాభిలాషులపాలిటికల్పతరు వగు మొదటిగద్యకావ్యము. రాజవాహనాదు లగుదశకుమారుల చిత్రచరిత్రల వెలయునది యెనిమిదుచ్ఛ్వాసముల ప్రబంధము. ఈప్రధాన గ్రంథమునకు ముం దైదు చిన్నయుచ్ఛ్వాసములతోడిగ్రంథము పూర్వపీఠికగాను, కడపట నైదుపుటలగ్రంథ ముత్తర పీఠికగాను చేరి యున్నవి. పూర్వపీఠికలోనికడపటి యవన్తిసుందరీపరిణయకథ దండికవిరచితము కా దన్నవాదము ప్రబలముగా నున్నది. తత్వజ్ఞానాభిలాభిలాషతో జదువువారి కది ప్రక్షిప్తముగాఁ దోచుమాట నిజము. దండిమహాకవిసత్యచరితము మఱుఁగుపడుట కిట్టివే కారణములు. ఇందు కొకనిదర్శనము—భోసలరాజాస్థానములోనిఘనశ్యామకవి యీకృతికి సంజీవన మనుటిప్పణము వ్రాయుచు నవతారికలో వ్రాసినయీక్రిందిమాట లెంతయసంగతములో పరిశీలించువారికి, అవన్తిసుందరీకథ నెవరో దండికవి కంటఁగట్టుట యాశ్చర్యముగాఁ దోఁచదు గదా! ఆమాట లివి:— అథ భోజసభాయాం కాళిదాసభవభూతిప్రముఖవ దఖిలమాననీయో బాణఇవ కాదమ్బరీం, దశకుమారచరితాఖ్యాం ప్రహేళికాం రచయిష్యన్ ...దణ్డీ—”

ఈమహాకవి తనకృతిలో నందందు మనోహరములైనకొన్ని శ్లోకములను గూడఁ గూర్పుచువచ్చినాఁడు. అందలి దొకటి:—

"కిం క్రూరం? స్త్రీహృదయమ్,
కిం గృహిణః ప్రియహితాయ? దారగుణాః,
కః కామః? సంకల్పః,
కిం దుష్కరసాధనం? ప్రజ్ఞా"

ముద్రితము లైనదశకుమారచరితవ్యాఖ్యలలో పదదీపిక పూర్వపీఠికకును, తక్కినగ్రంథమునకు పదచంద్రికా భూషణాలఘుదీపికలును కనఁబడుచున్నవి. అముద్రితములింకనుగలవు.

అప్పయామాత్యుఁ డను నొకకవి దీనిని సంగ్రహించి దశకుమారచరితకథాసార మను పేరఁ జిన్నపద్యకావ్యము నిర్మించెను. అందు పూర్వపీఠికమాత్రమే కలదు. అప్పయదీక్షితులు దశకుమారచరిత సంక్షేపముగా దీనిని మార్చియున్నాఁడు. దీక్షితచక్రపాణికవి దీనియుత్తరపీఠికను పెంచి దశకుమారశేష మను పేర నొకపద్యకావ్యము నిర్మించినాఁడు. రాజాధిరాజగోపీనాథుఁడు గద్యముగానే దశకుమారకథ యనుపేర గ్రంథము పెంచి వ్రాసియున్నాఁడు. తెలుఁగులో కేతనార్యుఁడు దీనిని గ్రహించి పద్యకావ్యము నిర్మించియున్నాఁడు—ఇట్లీగ్రంథముజన్మించిన దాదిగా దేశమునఁ బఠనపాఠవ్యవహారమున స్థిరపడుటయే కాక మనోహరమగుటచేఁ గవులవాక్కుల కెక్కి రూపాంతరములను గూడా చెందినది.

ఇతనిపద్యకవిత్వము కుసుమపేశలమై విన నింపుగా నుండుననుట కొకటి రెం డుదాహరణములు.

"కలకణితగర్భేణ కంఠేనాఘూర్ణితేక్షణః,
పారావతః పరిభ్రమ్య రిరంసుశ్చుంబతి ప్రియామ్" కావ్యా. ౨.

సుభాషితావళ్యాదులం దితనివిగా రెండుమూఁడు శ్లోకములు కనఁబడుచున్నవి. అందలి యీక్రింది శివస్తుతి యనాయాసముగ స్తవమిత్త డు నిర్మించినదన్న భావమును దృఢపఱచుచున్నది.

"క్వచి దమరసరి త్క్వచి త్కపాలం, క్వచి దురగాః క్వచిదైందవీచ రేఖా
ఇతి విషమవిభూషణై రుపేతా, ప్రమథపతే రవతా జ్జటాటవీవః"

ఇఁక నొక్క చిన్నవిషయము. దండికావ్యాదర్శములో యౌవన వర్ణనముతోడి యీక్రిందిశ్లోక మున్నది.

"అరత్నలోకసంహార్య మవార్యం సూర్యరశ్మిభిః,
దృష్టిరోధకరం యూనాం యౌవనప్రభవంతమః"

అనుకరణము పూర్వకవులందుసాధారణముగా నందందు కన వచ్చుచున్నదే కావున నది ప్రజ్ఞాలోప మని యెవ్వరును భావింపఁబోరు. పైశ్లోకమును చూచి బాణుఁడు కాదంబరిలో నీక్రిందివాక్యము నిర్మించి యుండు నని యూహింపవలసియుండఁగా దీనినిచూచి దండియే పై శ్లోకము నిర్మించియుండునని పేటర్సనుపండితుఁడు దశకుమారచరిత్రపీఠికలో వ్రాయుట వింతయే కదా! ఆకాదంబరివాక్యమిది:—

"కేవలంచ నిసర్గత ఏ వాభానుభేద్య మరత్నలోకోచ్ఛేద్య
మప్రదీపప్రభాపనేయ మతిగహనం తమో యౌవనప్రభవమ్"

---

## భట్టారహరిచంద్రుఁడు

వారికృతులు లభింపకపోయినా, ప్రాచీను లన్నగౌరవముతో నిందు స్మరించుచున్నకవులలో నితఁ డొకఁడు. ఇతనిని, ఇతనికావ్యమును ముఖ్యముగా మనస్మృతికి తెచ్చినయతఁడు భట్టబాణుఁడు, అతనిహర్ష చరితావతారికలోనిపద్య మిది:—

"పదబన్ధోజ్జ్వలో హారీ కృతవర్ణ క్రమస్థితిః,
భట్టారహరిచంద్రస్య గద్యబన్ధో నృపాయతే"

ఇందలిభట్టారపదము పూజార్థకము. హరిచంద్రులు ముగ్గురు నలుగు రున్నారుగాని[1] బాణునికి పూర్వుఁడు గద్యకావ్యకర్త కావలెను. అతఁడు బాణకవికిఁ బూర్వుఁ డనునిర్ణయము లేకున్నను, కాయస్థుఁడును రాధార్ద్రదేవులతనయుఁడును జైనుఁడు నగుధర్మశర్మాభ్యుదయకర్త యితఁ డని కొందఱూహించిరి గాని యది విశ్వసనీయము కాదు. వారియూహనుబట్టి యతఁడు తరువాతగద్యకావ్యము వ్రాసియుండు నంద మన్నను, అతఁడే బాణునినుతిగన్నవాఁ డనుట యెట్లు? ఇంక:—

విశ్వప్రకాశ మనెడిలోకోత్తరనిఘంటువు నిర్మించినమహేశ్వరుని పూర్వపురుషులలో నొకహరిచంద్రుఁ డున్నాఁడు. అతఁడువిద్వత్కవి వైద్యుఁడును. వైద్య మావంశమున నానుపూర్విగా వచ్చుచున్నది కాఁబోలు నీమహేశ్వరుండును వైద్యుఁడే. ఇతని విశ్వప్రకాశము తుది మాట లివి:—



“యస్సాహసాఙ్కచరితాదిమహాప్రబన్ధ,
నిర్మాణనైపుణగుణాగతగౌరవశ్రీః,
యో వైదికత్రయసరోజవనైకబన్ధుః,
బన్ధుస్సతాఞ్చ కవికైరవకాననేన్దుః”

ఇతి శ్రీ వైద్యరాజ చక్రముక్తాశేఖరస్య కవిరాజపరమేశ్వరస్య పద్యగద్యవిద్యానిధేః శ్రీమహేశ్వరస్యవిశ్వప్రకాశే.

“విద్యా మాయుర్వేదం వేత్తీతి వైద్యః” అని వ్యుత్పత్తి. ఈమహేశ్వరుఁడు పద్యగద్యకవిత్వమునకును వైద్యమునకునునిధి యనిదీనినిబట్టి తెలియుచున్నది. విశ్వప్రకాశము వ్రాఁతప్రతులుకొన్నిట నున్నశ్లోకమునుబట్టి[2] యితఁడు శా ౧౦౩౩లోనున్న ట్లూహింపబడినది. చరకమునకుఁ గూడ

1. జీవంధరచంపూకర్త, శా. ౮౫౦-దేవగిరిసంస్థానవర్తి రుద్రకవిపుత్రుఁడు, శా. ౧౦౨౦.

2. రామానలవ్యోమరూపైశ్శకకాలేఽఖిలక్షితే,
కోశం విశ్వప్రకాశాఖ్యం నిరమాత్సీ న్మహేశ్వరః

వ్యాఖ్యానము నిర్మించినయితఁడు (భట్టార) హరిచంద్రునివంశములోని వాఁడ నని తెలుపుకొనియున్నాఁడు. అతఁ డితని కెన్నితరములపూర్వుఁడో నిర్ణయింపఁజాలముగాని, బాణభట్టునికిఁ బూర్వుఁడో సమకాలమువాఁడో నైయుండు నని యూహించియతఁడు మనభట్టారుఁ డని చెప్పినఁ జెప్పవచ్చును. వేదశాస్త్రవిజ్ఞానము వైద్యజ్ఞానమునుగలవంశములోనిమూలపురుషుఁ డగునాతఁడు బాణునివినుతికిఁ బాత్రుఁ డనవచ్చును. అయితే యిందు కొకవిప్రతిపత్తి కనబడుచున్నది–పూర్వమీమాంసాధర్మసూత్రములకు గొప్ప భాష్యము నిర్మించినశబరస్వామి నాలుగుజాతులకన్యలను పెండ్లాడె ననియు అతని వైశ్యకాంతయందు జన్మించిన హరిచంద్రుఁడు వైద్యతిలకుఁడనియు నొకచాటుశ్లోకమువిద్వల్లోకమునఁ బ్రతీతమైయున్నది. అందలి విషయము కట్టుకథలకుఁ జేరినదని పాఠకులకే తోఁచునుగాని, వైద్యుఁడునుడైన హరిచంద్రుఁ డొకడు ప్రాచీనుఁడు కలఁ డనిమాత్రము గ్రహింపవచ్చును. ఆ శ్లోక మిది.

"బ్రాహ్మణ్యా మభవ ద్వరాహమిహిరో జ్యోతిర్విదా మగ్రణీః
రాజా భర్తృహరిశ్చ విక్రమనృపః క్షత్త్రాత్మజాయా మభూత్,
వైశ్యాయాం హరిచంద్ర వైద్యతిలకో జాతశ్చ శంకుః కృతీ,
శూద్రాయా మమరః షడేవ శబరస్వామిద్విజ స్యాత్మజాః"

వరాహమిహిరభర్తృహరివిక్రమామరసింహశంకుహరిచంద్రులు నలుగురును శబరస్వామిపుత్రులన్నయీమాట యెవ్వరు నమ్మరుగాని యీ పేళ్ళవా రందఱు ప్రసిద్ధులు, ప్రాచీనులు నగుట నిజముగావున, విశ్వప్రకాశకర్తవంశములోనిమూలపురుషుఁడు నీవైద్యతిలకుఁడు నొకఁడే యని భావించినచో, బాణభట్టు మనకుఁ దెలిపినభట్టారహరిచంద్రుఁడీవైద్యహరిచంద్రుఁడే యగు ననవచ్చును, అయినా, యీవిషయ మింకను విచారింతుము. ఇంతకును భట్టబాణవినుతహరిచంద్రుని దెలియ నింత యత్నించితిమి గాని, ఆమహాగద్య ప్రబన్ధము మనకంట బడదు గదా!

# భామహుఁడు

ఇతఁడు దండి కించుక పరుఁడని మున్నె చదివితిమి గావున శా. 430 ప్రాంతమువాఁడని విశ్వసింతము. దండిగ్రంథముకంటె నితనిది చిన్నది. ఇందు నాలుగువందలశ్లోకము లున్నవి. ఇది మొన్న మొన్ననే విద్వల్లోకముకంటఁ బడినది.

"ప్రణమ్య సార్వం సర్వజ్ఞ" మ్మనెడిమంగళాచరణశ్లోకములోనివాక్యమునుబట్టి యితఁడు బౌద్ధుఁడని గ్రంథప్రకాశకులు నరసింహయ్యంగారు వ్రాసిరి. కాఁడని కాణేపండితుఁడు వ్రాసెను. కావ్యాలంకారమం దెల్లెడ వేదశాస్త్రబ్రాహ్మణయాగాదులస్తుతి గనవచ్చుటయు, ఒక్కచో బౌద్ధులయన్యాపోహవాదఖండనము గనవచ్చుటయుఁ గారణములుగా, బుద్ధునికిం బోలెఁ బరమేశ్వరునికిని సమన్వయించెడి సార్వసర్వజ్ఞశబ్దములు ప్రయోగించుటంబట్టి యితఁడు బౌద్ధుఁ డనుట యుక్తముగా దని తోఁచెడిని[1]. ఇతఁడు రక్రిలగోమి యనుపండితుని పుత్రుఁడు. రక్రిలసంజ్ఞ రాహుల పోతలాదిబౌద్ధసంజ్ఞలనుబోలి యుండుటచే వారట్లు భ్రాంతిపడియుందురు. "గోమిన్పూజ్యే" అనుచాంద్రవ్యాకరణోక్తినిబట్టి యిందలి గోమిశబ్దము పూజ్యార్థక మనుట స్పష్టము. నిజముగా నితఁడు బౌద్ధుఁడే యైనచో, వేదబ్రాహ్మణప్రశంస గావించినవాఁ డొక్కచోటనైన బౌద్ధమతబుద్ధదేవప్రశంస గావింపఁడా! అట్టి దెందును గనరాదు. కావున నితఁడు శుద్ధవైదికుఁడే యందము.

"శబ్దార్థౌ సహితౌ కావ్యం గద్యం పద్యంచ తద్ద్విధా"

అనుచు నితఁడు శబ్దార్థములు రెంటిను గావ్య మనుమతము నావిష్కరించెను. ఇతని కృతిలోఁ గావ్యశరీరము అలంకారములు

1. అవలోక్యమతాని సత్కవీనా మవగమ్య స్వధియా చ కావ్యలక్ష్మ,
సుజనావగమాయ భామహేన గ్రథితం రక్రిలగోమిసూను నేదమ్,

కావ్యదోషములు న్యాయనిర్ణయము శబ్దశుద్ధి యనెడియైదుప్రధానవిషయములు లక్ష్యలక్షణపూర్వకముగాఁ బరిశీలింపఁబడినవి[1]. ఆఱుపరిచ్ఛేదముల యీగ్రంథము కావ్యాదర్శమువలెనే సర్వలక్షణ విమర్శనపరమై హృదయంగమ మగుచున్నది. ఇందు పాణిని కణభుఙ్న్యాసకారమతము లుద్ఘాటింపఁబడినవి.

“శ్రద్ధేయం జగతి మతం హి పాణినీయమ్”

అనుచు నితఁడు పాణినీయమతము నెక్కువగా గౌరవించియు నీక్రిందివిధముగా స్ఫోటవాదమును మిక్కిలి నిరసించియున్నాఁడు.

“శపథైరపి చాదేయం వచో న స్ఫోటవాదినామ్,
నభఃకుసుమ మస్తీతి శ్రద్దధ్యాత్క స్సచేతనః?”

భరతమునికిని దండిభామహులకు నడుమఁ గొన్ని కావ్యలక్షణము లుదయించిన సూచనలు గనవచ్చునుగాని, వానిలో భట్టికావ్యములోని ప్రసన్నకాండము మాత్రమే యాలంకారికుల కించుక మార్గదర్శకమైనది. తక్కిన వన్నియు నంతరించినవి.

కాని, దండిభామహులు దానిమాట యెత్తలేదు. అది రామకథాకావ్యము గాని లక్షణగ్రంథము కాకపోవుటయే యందుకు కారణమై యుండును.

ఇతఁడు తనకృతిలో కొందఱు పూర్వకవులను, కొందఱికృతులను పేర్కొని కొన్ని శ్లోకముల నందం దుదాహరించి యున్నాఁడుగాని వానిలో ననేకకృతు లిపు డెందును గనరావు. ఇతఁడు పేర్కొన్నవారిలో రామశర్మ శాఖవర్ధనుఁడు మేధావి మొదలగుమహాపండితు లున్నారు కాని, దైవవశమున వారిగ్రంథము లెందో యడఁగిపోయినవి.

1. ఒకవ్రాతప్రతిచివర నున్నశ్లోకము లివి:—
షష్ట్యా శరీరం నిర్ణీతం శతషష్ట్యా త్వలంకృతిః, పంచాశతా దోషదృష్టిః
సప్తత్యా న్యాయనిర్ణయః, షష్ట్యా శబ్దస్య శుద్ధిః స్యా దిత్యేవం వస్తుపంచకం,
ఉక్తః షడ్భిః పరిచ్ఛేదై ర్భామహేన క్రమేణ తు.

దండి చెప్పినయుపమాదోషములకు మఱిమూఁడింటిని జేర్చి మేధావి యవి యేడని నిర్ణయించియున్నాఁడు. దండి పేరెత్తక మేధావిమతము నీశ్లోకమునఁ దెలియఁజేసెను ప్రథమపరిచ్ఛేదములో—

"త ఏత ఉపమాదోషా స్సప్త మేధావి నోదితాః"

రామశర్మ నతనికావ్యము నిట్లు రెండవదానిలో స్మరించెను.

"నానాధాత్వర్థగంభీరా యమకవ్యపదేశినీ,
ప్రహేళికా సా హ్యుదితా రామశర్మాచ్యుతోత్తరే"

శాఖవర్ధనునిశ్లోకము నందే యి ట్లుదాహరించెను.

"నిష్పేతు రాస్యా దివ తస్య దీప్తాః శరా ధనుర్మండలమధ్యభాజః,
జాజ్వల్యమానా ఇవ వారిధారా దినార్ధభాజః పరివేషిణో ఒర్కాత్"

మార్గము—రీతి—అనుసంజ్ఞలను వాడక యితఁడు వైదర్భ గౌడీయము లనుపేళ్లెత్తి, ఈరెండును వే అనుట యుచితము కా దని పూర్వులమతమును నిరసించుచు—

"అలంకారవ దగ్రామ్య మర్థ్యం న్యాయ్య మనాకులమ్,
గౌడీయ మపి సాధీయో వైధర్భ మితి నా న్యథా"

అనుచు స్వమతము నిరూపించెను గాని, యివి దేశీయభేదమున వచ్చిన కావ్యభేదసంజ్ఞ లనుభావము సూచింప నైనను సూచింపలేదు. మఱియు నితఁడు భరతాదులమతములు వక్కాణించుపట్ల "అన్యైః—కేషాంచిత్"అనుచు వచ్చెను గాని వారిపే ళ్లుచ్చరించలేదు. అంత మాత్రమున నితనికి వారియెడ గౌరవము లే దనరాదు. తరువాతి లాక్షణికు లితని నెంతో గౌరవమున స్మరించుటయే యీపండితోత్తముని కాలంకారికలోకమునఁ గలఖ్యాతికి నిదర్శనము.

భామహాలంకారమును పరామర్శించినవారిలో పెక్కం డితనిని క్రీ. ఆఱేడుశతాబ్దులకు చేర్చిరి[1]. పరిత్యక్తపరిమాణము చూపినవా రెవ

1. యస్. కే. డే పండితుని Poetics-డాక్టరు కేన్. అలంకారచరిత్ర-

రును లేరు. ఇంతకును కొంచె మెచ్చుతక్కువగా మన మనుకొన్నకాలము కొందఱియభిప్రాయములకు సరిపడుచునే యున్నది. గావున² నిం దాచర్చ యనావశ్యకము. భట్టికావ్యముతుద నున్న వ్యాఖ్యాగమ్యమిత్యాదిశ్లోకము భట్టిదే యని భ్రాంతిపడి, యది భామహుని "కావ్యాన్యపి యదీమాని" ఇత్యాదిశ్లోకము చూచి యతఁడు రచియించెననుకొని భామహునికంటె భట్టి పరుఁ డనుకొన్నారు. ఈ భ్రాంతి కలిగించినమహాపురుషుఁడు భట్టికావ్యవ్యాఖ్యాత యైనజయమంగళుఁ డని వా రాలోచింపలేదు. ఈవిషయము భర్తృహరిజీవితమున విశదీకరింపఁబడినది.

ఈతఁడు వక్రోక్తి లేనియలంకార మేమి టనుచు వక్రోక్తి నిట్లు ప్రశంసించియున్నాఁడు.

" సైషా సర్వైవ వక్రోక్తి రనయార్థో విభావ్యతే,
యత్నో ఽస్యాం కవినా కార్యః, కోఽలంకారో ఽనయా వినా"

ఈభావమును తరువాతియాలంకారికు లనుకరించినారు – ఇతని కవిత్వము సరస మైన దని కావ్యాలంకారము లోని యీ క్రిందిశ్లోకములు తెలుపుచున్నవి.

" కింశుక వ్యపదేశేన, తరు మారుహ్య సర్వతః,
దగ్ధాదగ్ధమరణ్యానాం పశ్య తీవ విభావసుః"
" తస్యా హారీ స్తనాభోగః, వదనం హారి సుందరం,
హారిణీ తను రత్యంతం, కియ న్నహరతే మనః"

ఇతఁడు వ్రాసినకావ్య మేదియు లభింపదు గాని యితనిదిగా సదుక్తి కర్ణామృతములో నొకశ్లోక మున్నది. ఇది చందనవృక్షవర్ణనము:—

" కకుభి కకుభి భ్రామం భ్రామం విలోక్య విలోకితం,
మలయజసమో దృష్టో ఽస్మాభి ర్నకోఽపి మహీరుహః,

2. పి- త్రివేది-ప్రతాపరుద్రీయపీఠిక- పి. వి. కాణేసాహిత్యదర్పణపీఠిక

ఉపచితరసో దాహచ్ఛేదై శ్శిలాతలఘర్షణై రధిక మధికం
య తౌ్సరభ్యం తనోతి మనోహరమ్"

-:o:—

# కు మా ర దా సు

ప్రాచీనమహాకవుల లో నొక్కఁడై పూర్వలాక్షణికుల ప్రశంస కెక్కిన యితనిచరితము విస్పష్టముగాఁ దెలియరాక మఱుఁగుపడి యున్నది. నవీనపరిశోధకు లితనివృత్తాంతము బయటఁ బెట్టుటకు లభించిన దొక టే యాధారము. అది యితనిజానకీహరణముతుదఁ గనవచ్చిన శ్లోకచతుష్టయము. దానినిబట్టి పాశ్చాత్యులు ప్రాచ్యులు కూడా పెద్దపెద్ద వ్యాసములు సవిమర్శముగా వ్రాసియున్నారు. మఱం దాశ్లోకములు చదువుదము:—

" నిత్యం సద్గుణభక్తి రింద్రియ దమ శ్రీసంయత స్సంయతః,
శత్రుద్యోతితమూర్ధ్ని ముక్తహృదయో ఽభిసంగత స్సంగతః
విద్వా నస్య కవేః పితార్యహృదయం ధీమా నితో మానితో
లంకైశ్వర్యభుజః కుమారమణే రిత్యాసన్నయ స్సన్నయః "

" యే నాన్యప్రకృతిం నిరాకృతవతా సంమానితో మానితో,
యస్య స్వాజ్ఞ మభిఘ్నతో రిపువ(భృ)శం నాశో ఽభిత శ్శోభితః,
శ్రీమేఘో ఽస్య కవే రసౌ కిల బృహద్ధామాతు లో మాతులో,
దృష్టస్తాసజడం ద్విషా మధిగత స్త్రాసేన యాసేనయా "

" శ్రీమా నేక శ్శరణ్యః పరిభవవిపదాం భాజనానాం జనానాం,
రూపే ణానుప్రయాతో దివమతిసుభగం రంజయ స్తం జయ స్తమ్,
భ్రాతా తన్మాతు రస్యా శశిధవళయశః కారణానాం రణానాం,
కర్తుం పుత్రో ఽగ్రబోధి ర్జనశిరసి లసద్భాసురాజ్ఞ స్సురాజ్ఞః "

“ఆదావైనం దశాయాం స్థిత మపి తదహః స్త్రీనాభ్యాం స్తనాభ్యాం,
తుష్టే తస్మి న్నదానా మరిహతపితృకే పారయన్తౌ రయన్తౌ,
ఆత్మాపత్యావిశేషం పుపుషతు రహతప్రేమదాన్తౌ మదాన్తౌ,
యత్సానాథ్యా త్స కావ్యం వ్యరచయ దసురద్విణ్మహార్థం మహార్థమ్”

అన్యులు వ్రాసినట్లుగా నీకవి స్వవిషయము తెలిపిన ట్లున్నశ్లోకములభావ మిది:—“లంకా (సింహాల) రాజైనకుమారమణి యీకవి తండ్రి. అతఁడు శత్రునిహతుఁడైననాఁడు జన్మించినయితనిని మేనమామలైనమేఘుఁడు అగ్రబోధి యనువారు గొనిపోయి కొడుకుంబోలె బోషించిరి. అట్టి యీకవి యీకావ్యము రచియించెను”

ఈశ్లోకము లోకవ్రాఁతప్రతిలో నిరువదియవసర్గచివర నున్నదఁట. ఇంకొకవ్రాఁతప్రతిలో లేదఁట, అందు. “ఇతిసింహాలస్య కుమారదాసస్య కృతౌ జానకీహరణే మహాకావ్యేవింశతి స్సర్గః పరిసమాప్తిమగాత్” అనుమాటలుమాత్రమే యున్నవఁట. ఇది యిరువదిసర్గలకావ్యమే యని పైకృత్యంతశ్లోకములు దెలుపుచుండ, దీనిని ప్రకటించినధర్మారామపండితులప్రతిలో నిరువదియైదుసర్గ లున్నట్లును, దానిచివర పైనిజూపినశ్లోకములలో నాల్గవశ్లోకము నుత్తరార్థముమాత్ర మున్నట్లును దెలియుచున్నది. దీనినిబట్టి యీకావ్యముపరిమితియు, ఈశ్లోకములస్థితియు సందేహాస్పదము లగుచున్నవిగదా? ఇంక—

గ్రంథాంతగద్యములోని సింహాళ కుమారదాససంజ్ఞలాధారముగా, పాశ్చాత్యపరిశోధకులు మహావంశ మన్గ్రంథమునుబట్టి “క్రీ. ౫౧౫-౫౨౪ నడుమ సిలోను పాలించిన కుమారధాతుసేనుఁడే యీకుమారదా” సని యొకదారి తీసిరి కాని, ఆగ్రంథములో కుమారధాతుసేనునితండ్రి “మొగ్గలనుఁ” డని యున్నదిగాని, పైశ్లోకములో నున్నట్లు “కుమారమణి” యని లేదు. దీనినిబట్టి యానిర్ణయముకూడా సందిగ్ధమైనది. ఇఁక మనపూర్వగ్రంథకర్త లేమన్నారో చూతము.

రాజశేఖరుఁడు కావించిన ప్రశంసగా సూక్తిముక్తావళ్యాదులలో నీ క్రిందిశ్లోకము కనఁబడుచున్నది:—

" జానకీహరణం కర్తుం, రఘువంశే స్థితే సతి,
 కవిః కుమారదాసశ్చ రావణశ్చ యది క్షమః"

అని శ్లేషించి చమత్కారముగా వర్ణించుచు, కుమారదాసు జానకీహరణకావ్యము నిర్మించినాఁ డన్న ప్రధానవిషయమును బయటఁబెట్టి నాఁడు. అతఁడే తన కావ్యమీమాంసాచతుర్థాధ్యాయములో—

"ప్రతిభాశాలులు మహాకవులు నని పేరు గాంచిన మేధావి రుద్ర కుమారదాసాదులు జాత్యంధు లని వినుచున్నాను" అని వ్రాసియున్నాఁడు. ఆవిన్నమాటలనుబట్టి యితఁడు పుట్టుగ్రుడ్డివాఁడో కాఁడో నిర్ణయించలేము గాని, యతని కితఁడు బాగా పూర్వుఁడై యుండు నని మాత్రము చెప్పవచ్చును. అతనితరువాత—

సోడ్ఢలుఁ డుదయసుందరీకథావతారికలో నీకుమారదాసును పూర్వమహాకవిగా నిట్లు వర్ణించియున్నాఁడు, కాని యితనినిగూర్చి వే తేమియుఁ జెప్పలేదు.

" బభూవు రన్యే ఽపి కుమారదాస
 భాసాదయో హంత కవీందవ స్తే,
 యదీయవాగ్భిః కృతినాం ద్రవన్తి
 చేతాంసి చంద్రోపలనిర్మలాని"

తరువాత క్షేమేంద్రుఁ డౌచిత్యవిచారచర్చలో నుపసర్గానౌచిత్యమునకు "నతు కుమారదాసస్య" అని యీ క్రిందిశ్లోక ముదాహరించి యున్నాఁడు—

" అయి విజహీహి దృఢోపగూహనం, త్యజ నవసంగమభీరు వల్లభమ్
 అరుణకరోద్గమ ఏష వర్తతే, వరతను సంప్రవదంతి కుక్కుటాః"

ఇట్లే, ఉజ్జ్వలదత్తాదు లితనివిగాఁ గొన్నిశ్లోకముల నుణాది సూత్రవృత్తిమొదలగువాటిలో నుదాహరించియున్నారు. కాని, ఒకరై

నను మనకుమారదాసును సింహళరాజని కాని, రాజని కాని పేర్కొన లేదు. నివాసము ప్రభుత్వము నిట్లనుమానాస్పదము లగుచుండ నితని కాల మింకను సందిగ్ధ మగుచున్నది.

“వ్యక్తవాచాం సముచ్చారణే” అనుపాణినిసూత్రమునకు, ౧-౩-౧౮ అర్థము వ్రాయుచు, అవ్యక్తవాక్కులు కలసి పలుకునపుడు వది ధాతువుపరస్మైపద మగు నని చెప్పి భగవత్పతంజలి వరతను సంప్రవదన్తి కుక్కుటాః” అనువాక్య ముదాహరించెను. ఇది పైశ్లోకములోని నాల్గవపాదముగా నున్నది గావున, పతంజలికంటె కుమారదాసు పూర్వుఁ డని యొక రభిప్రాయపడిరి. కాని, పైశ్లోకము ముద్రితజానకీహరణపుస్తకములో లేదు. పైగా, ఈపాదముతో నున్నమఱియొకశ్లోకము హరదత్తుని పదమంజరిలో నిట్లున్నది. కాని, యతఁ డిది కుమారదాసుదన లేదు.

“అపనయ పాదసరోజ మజ్కతః, శిథిలయ బాహులతాం గళాదృతామ్,
క్వచ వదనేఽం శుక మాకులీకృతం, వరతను! సంప్రవదన్తి కుక్కుటాః

దీనినిబట్టి పతంజలి యుదాహరించినవాక్యమే ఛందోబద్ధమై యుండ దానిని తరువాతివారు సమస్యగా గ్రహించి పూరించుకొన్నా రని పరిశోధకు లభిప్రాయపడిరి. అది సముచితమే. క్షేమేంద్రుఁడు పై శ్లోకము కుమారదాసు దన్నాఁడుగాని జానకీహరణములోని దన లేదు. అదిగాక, కాళిదాసు రఘువంశమునుజూచి జానకీహరణము పుట్టినట్లు రాజశేఖరుని పైప్రశంసాశ్లోకము స్పష్టముగాఁ జెప్పుచుండ, కాళిదాసునికే పరుఁడైనకుమారదాసు పతంజలికి పూర్వుఁ డని యెవ్వ రనుకొందురు! ఈవిధముగా నితనికాలము సందిగ్ధ మైనా, ఇతనిని గొప్పగా నుతించినరాజశేఖరునికంటె నితఁడు బాగా పూర్వుఁ డని విశ్వసింపవలసి యున్నది. గావున, కుమారదాసు, శా. ౫౮౦ ప్రాంతమువాఁ డని

యిప్పటికి భావింతము. ఇతనిసింహలరాజత్వము నిస్సంశయముగా నిర్ణీత మగువఱకు నితనిచరిత మింతే. ఇంక:—

రాజశేఖరుఁడు ప్రశంసించిన ట్లితనికవిత్వము కాళిదాసకవిత్వము వలె మృదుమధురముగా నుండు ననుట కుదాహరణము:—

"స్త్రియో న పుంసా ముదయస్య సాధనం, తపేన తద్ధామవిభూతి హేతవః
తటిద్వియుక్తోఽపి ఘనః ప్రజృంభతే, వినా న మేఘంవిలసన్తి విద్యుతః"

"కరోతి శీలేన పతివ్రతా పతిం. గుణస్పృహం వశ్య మవశ్య మంగనా
పరాభవం భర్తు గుపైతి దుస్తరం, వినష్టచారిత్రగుణా గుణైషిణః"

"ఫుల్లం య దీదం కమలం కి మేత త్తస్యైవ నీలోత్పలయో ర్వికాసః,
ఇ త్యాత్తశంకాంతర స్తరన్త్యా, హంస స్సిషేవే వదనం సుదత్యాః"

రావణుఁడు జానకి నపహరించుట హేతువుగా దీని కీపేరు వచ్చినది. ఇందలికథ రామాయణములోనిదే కాని, ఇం దీకవి రఘువంశము ననుకరించి కావించినట్టియు, స్వయముగాఁగల్పించినట్టియు వర్ణనలు లేకపోలేదు. ఇందుకు, తృతీయసర్గములోని ఋతువర్ణనలు, చతుర్థసర్గలోని యగ్నివర్ణనలు నుదాహరణము దైవికముగా నిది చాలాకాల మణఁగి యున్నదిగాని పూర్వమహాకావ్యములలో నిది గణనీయ మనుటసత్యము.

—:o:—

# శ్రీహర్షదేవుఁడు

ఇతఁడు రత్నావళీప్రియదర్శికానాగానందముల కర్తయని వాటి ప్రస్తావనలు చెప్పుచున్నవి:—

" రాజ్ఞః శ్రీహర్షదేవస్య పాదపద్మోపజీవినా రాజసమూహేన నోక్తః "—

" శ్రీహర్షో నిపుణఃకవిః పరిష దప్యేషా గుణగ్రాహిణీ "

కాని, యీకవి యైన శ్రీహర్షునిగూర్చి ప్రాచ్యపాశ్చాత్యవిమర్శకు లెన్నోవిధములఁ జర్చించియున్నారు. అవి యన్నియు దేశమున విస్తరించియున్నవి. నేనును, ఇతనిరత్నావళ్యాదికర్తృత్వమును నావాఙ్మయ చరిత్రలో నిరూపించియున్నాను. కావున నితనిప్రభుత్వకృతికర్తృత్వములనుగూర్చి యిందు సంగ్రహముగాఁ దెల్పెదను.

శా. ౬౭౭-౭౦౮ నడుమజన్మించినదామోదరగుప్తుని కుట్టనీమతములో రత్నావళీనాటికావృత్తము వర్ణింపఁబడినది గావున, నేతత్కవి తత్పూర్వుఁడగుట స్పష్టముగదా! తత్కర్త, శా. ౧౩౪. ఉజ్జయిని నేలినశ్రీహర్షవిక్రమాదిత్యుఁడు కాఁడనియు, ధావకనామముతో భాసుఁడు రచియించినరూపకములను దనపేరఁ బ్రకటించుకొన్నవాఁడు కాఁడనియు భాసజీవితమునఁ గనియున్నాము—కావున శ్రీహర్షుఁడనిప్రసిద్ధికెక్కినకాన్యకుబ్జరాజే యీరూపకములకర్త యని విశ్వసింపవలసియున్నది.—అతనికిఁగల వర్ధనసంజ్ఞ రత్నావళ్యాదులందు గాని బాణునిహర్షచరితాదులందు గాని కనఁబడకపోయినను, రెండవశీలాదిత్యుఁడనఁబడు హర్షవర్ధనుఁడే శ్రీహర్షదేవుఁడే యనిపాశ్చాత్యపరిశోధకులు భావించియున్నారు. కావున నీరాజకవి శా. ౫౨౮-౬౭ నడుమ కాన్యకుబ్జమేలిని మహారాజని విశ్వసింతము.

కావ్యప్రకాశములోని "శ్రీహర్షాదే ర్ధావకాదీనా మివ ధనం" (బాణాదీనా మివ ధనం) అనుమాట యెత్తుకొని యొవరో యెన్నివిధములనో చర్చించిరి గాని, యీ రొకరును, ఆధావకుఁ డెవఁడు? ఆ శ్రీహర్షుఁ డెవఁడు? అనుసంశయములు నిర్ణయించి చరితార్థులు గాలే దనుట విదితము. ధావకుఁ డనువాఁ డీకృతు లితని కమ్మె ననుట కట్టు కథ. ఆగర్భశ్రీమంతుఁ డైన బాణుఁ డీరూపకములు రచియించి ధనాశచే శ్రీహర్షునిపేరఁ బ్రకటించె ననుట కల్ల. ఇంకెందుకు? రత్నావళ్యాదికర్త హర్షవర్ధనుఁడనఁబడెడి యీశ్రీహర్షదేవుఁడే—

ఈరూపకములు పుట్టిన దాదిగా లాక్షణికులను విద్వాంసుల నాకర్షించి ప్రశంస కెక్కినవి. ఈకవికి కాళిదాసురూపకము లెక్కువ యభిమానపాత్రములు. అతని మాలవికాగ్నిమిత్రము చూచి యితఁడు రత్నావళి వ్రాసె నని యీ రెంటిని సరిచూచి చదివినవారికి తోఁచక పోదు. కథానుకరణము సత్యమైనట్లే, కవిత్వము హృదయంగమమై నాటికా ప్రపంచమున రత్నావళికి పెద్దపేరు తెచ్చిన మాటయు సత్యమే. ప్రియదర్శికకూడా మనోహరమైనదే కాని దీని కున్న పేరు దానికి లేదు. ఇఁక నాగానంద మందుమా, ఇందలివస్తు వుదయనునికథలలోని దగుట విదితము. ఇందలిరసపోషణవిధానము నిరుపమానము. రతి శోక శమము లనుస్థాయిభావముల నెడనెడ నెగఁజిమ్ముచున్న యిందలి ప్రధానరస మగుదయావీరమునునిరూపించుపట్లఁ గనవచ్చినలాక్షణికుల చాతుర్యమే దీనిఘనతకు తార్కాణము.

ఈరూపకత్రయమందలిపద్యములు మృదుమధురములై ద్రాక్షా పాకమునఁ బడి పాఠకులకు చవులు పుట్టించుచున్న వనుట విద్వల్లోకవిదితము. వీటినుండి మూఁడుశ్లోకము లుదాహరించుచున్నాను. కువలయానందకర్త యనుభయతాద్రూప్యరూపకాలంకారమున కుదాహరించిన రత్నావళీశ్లోక మిది:—

“ కిం పద్మస్య రుచిం నహన్తి నయనానన్దం విధత్తే న కిం
వృద్ధింవా ఝుషకేతనస్య కురుతే నాలోకమాత్రేణ కిం,
వక్త్రేన్దౌ తవ సత్యయం యదపర శ్శీతాంశు రుజ్జృంభతే
దర్ప స్స్యాదమృతేన చేదిహ తవా ప్యస్త్యేవ బింబాధరే ”

దీనికి నా తెలుఁగుపద్య మిది:—

చ. తనరుచిఁ గస్తవం దనుపదా ! కమలంబులసొం పణంపదా ?
పెనుపద మీనకేతనునివీక్షణమాత్రతఁ ? చెలీ ! భవన్ముఖేం
దుని గనియుఁ మఱెందు కటుతోఁచువిధుం ? డమృతంపుగర్వమే
న్వినఁ డను మాసుధారసమునీయధరంబున నున్నమాటయుఁ.

విషము త్రాగి బాధపడుచున్న ప్రియదర్శికను రక్షింపు మని వాసవదత్త వేడుకొనఁగా రా జన్నమాట లివి:—

" సంజాతసాంద్రమకరందరసాం క్రమేణ
పాతుం గత శ్చ కలికాం కమలస్య భృంగః,
దగ్ధా నిపత్య సహ సైవహిమేన చైషా
వామే విధౌ నహి ఫల స్త్వభివాంఛితాని "

తన్ను భక్షించుచున్న గరుత్మంతునితో జీమూతవాహను డన్న మాటలు:—

" శిరాముఖై స్స్యన్దత ఏవ రక్త
మద్యాపి దేహే మమ మాంస మస్తి,
తృప్తిం న పశ్యామి చ తే మహాత్మన్
కిం భక్షణా త్త్వం విరతో గరుత్మన్ ? "

ఈశ్లోకమును దశరూపకకర్త దానవీరమున కుదాహరించి యున్నాఁడు. దీనికి నా తెలుఁగు పద్యము:—

గీ. రక్త మిదె కాఱుచుండె శిరాముఖముల
మిగిలియున్నది కండ నామేన నింకఁ,
గనఁబడదు నీకు సంతృప్తి కలిగినట్లు
లోవిహగరాజ! తిన కూరకుంటి వేల ?

సూత్రధారోక్తిగాఁ గవి యనుకొన్న. " శ్రీహర్షో నిపుణః కవిః అనుమాటసత్యము"

ఇతఁడు బాణమయూరాదికవుల నాదరించి సంస్కృతభాషను పోషించిన మహావిద్వాంసుఁడు, మహాకవి. ఇట్టి మహారాజులే యశఃకాయులై శాశ్వతజీవనులై సారస్వతమున ప్రాసాదము నిర్మించుకొని సుఖులై యున్నారు.

ఇతనికృతి యింకొక టేదియు కనరాదుగాని "ఇందు శమ, రతి క్రోధములకు సమప్రాధాన్యము లేదా యనిశంకించుకొని, లేదు, ఇందు

శమమే ప్రధానము రతిక్రోధము లంగము" లనుచు నితని పేరు చెప్పక యీక్రిందిశ్లోక ముదాహరించినాఁడు ధనికుఁడు దశరూపకవ్యాఖ్యలో- ఇది శ్రీహర్షదేవుని దని సదుక్తికర్ణామృతము చెప్పుచున్నది.

"ఏకంయోగనియోజనా న్ముకుళితం చక్షుర్ద్వితయం పునః
పార్వత్యా జఘనస్థల స్తనతటే సంభోగభావాలసమ్, అన్య
ద్దూరవికృష్టచాపమదనక్రోధానలోద్దీపితం
శంభో ర్భిన్నరసం సమాధిసమయే నేత్రత్రయంపాతువః"

ఇందు ధనికునిపాఠమున కిది కొంచెము వేఱుగా నున్నదిగాని పెద్దభేదము లేదు. జఘనస్థల-వదనాంబుజ-ఇత్యాదులు. ధనికునిపాఠము ననుసరించిననాయనువాద మిది:—

చ. ఒకనయనంబు మూతవడె యోగముచేత మఱొండు పార్వతీ
కుచకుచాననాంబుజవిలీనగతిఁ రతిలీన మయ్యె, వే
ఱొకటి వెలింగె మన్మథునియుద్ధతి మాన్పఁగఁ గోపవహ్నినాఁ
బ్రకటసమాధిభిన్నరసవన్నయనత్రయమిమ్ముఁ బ్రోచెడున్

—o—

# మయూరకవి

ప్రసిద్ధ సంస్కృతపూర్వకవులలో నితఁ డొకఁడు. ఇతఁడు భట్టబాణు నిశ్వశురుఁ డని యొకరును శ్యాలకుఁ డని యొకరును చెప్పుచు, వృద్ధభోజునిసభలోనున్నవాఁ డని భక్తామరస్తోత్రవ్యాఖ్యలో మానతుంగాచార్యుఁడును, ప్రబంధచింతామణిలో మేరుతుంగాచార్యుఁడును వ్రాసిరి తక్కినవిషయ మెట్లున్నను వీటినిబట్టి యితఁడు బాణునికి బంధు వని నమ్మవచ్చును. లేదా, సమకాలికుఁ డని విశ్వసింపవచ్చును. దీనిని బల పఱుచుచున్న రాజశేఖరుని శ్లోక మొకటి శార్ఙ్గధరపద్ధతిలోఁ గనవచ్చు చున్నది.

"అహో ప్రభావో వాగ్దేవ్యా యన్మాతంగదివాకరః,
శ్రీహర్ష స్యాభావ త్సభ్య స్సమో బాణమయూరయోః,

పరిమళకాళిదా సనుపద్మగుప్తుఁడు కూడా నవసాహసాంకచరిత్రములో శ్రీహర్షుఁడు బాణమయూరసంఘటనకావించెననియిట్లువర్ణించెను.

"సచిత్రవర్ణ విచ్ఛిత్తిశాలినో రవనీపతిః,
శ్రీహర్ష ఇవ సంఘట్టం చక్రే బాణమయూరయోః"

రాజశేఖరుఁడు పేర్కొన్నమాతంగదివాకరుఁడు హర్షవర్ధనుని సభలో నున్నవాఁ డనుటకిదితప్ప వేఱే ప్రమాణము కనరాదు. ఈదివాకరుఁ డెవరోఏమి గచియించెనో తెలియదు. ఇట్లే మాధవాచార్యులు సంక్షేపశంకరవిజయములో, శంకరాచార్యులు బాణమయూరదండిప్రభృతుల నోడించినట్లు వ్రాసినమాటకూడా విశ్వసనీయము కాదు. శంకరాచార్యులు బాణుని కొకశతాబ్దితరువాతివాఁ డనుటకు ప్రబలప్రమాణములు కనఁబడుచున్నవి. దండి బాణునికి పూర్వుఁ డనుటకు సాక్ష్యమున్నది. కావున, కాలనిర్ణయాదికచరిత్రవిషయముల నిట్టిమాటలు విశ్వసనీయములు కాఁజాలవు: ఆశ్లోకమిది:—

"స కథాభి రవన్తిషు ప్రసిద్ధాన్ విబుధాన్ బాణమయూరదండిముఖ్యాన్ శిథిలీకృతదుర్మతాభిమానాన్ నిజభాష్యశ్రవణోత్సుకాం శ్చకార"

పూర్వోక్తకవులమాటలనుబట్టియు కవిపండితసంప్రదాయమునుబట్టియు మన మిపుడు గ్రహింపఁదగినసారాంశము బాణునితోఁగూడా మయూరుఁడు హర్షవర్ధనునియాస్థానమున నున్నవాఁ డనునదొక్కటే. ఆసమయము శా౹౬౦౬—౬౭.

ఇతనిసూర్యశతకము లోకప్రసిద్ధము. ఇది గాక మఱియొకకృతి యితనిది కనరాదుగాని యితనివిగా కొన్నిశ్లోకములుసుభాషితావళ్యాదులలో నున్నవి. అందుభక్తిశ్లోకములుమయూరుఁడునిర్మించినశివస్తము లోనివందురు. పాల్కురికిసోమనాథుఁడు పండితారాధ్యచరిత్రములో

పేర్కొన్నయితనియాస్తవమెం దంతరించినదో కాని, పద్యసంకలనగ్రంథము లలో నాచూచినంతలో నితని శివస్తుతిశ్లోకములు నాకు కనఁబడలేదు.

వల్లభదేవ త్రిభువనపాల మధుసూదనాదు లెందఱో వ్యాఖ్యలు నిర్మించియితనిసూర్యశతక మానాఁ డెట్టివిఖ్యాతి కెక్కెనో చదువరు లూహింపఁగలరు. జయమంగళుఁ డితనివాణి నిట్లు స్తుతించెను.

" భక్తమాయూరవక్త్రాబ్జపదవిన్యాసశాలినీ,
నర్తకీవ నరీనర్తి సభామధ్యే సరస్వతీ "

ఈశతకమును పారాయణచేసినభక్తు లారోగ్యము చెందుచు వచ్చిరని పండితప్రతీతి. ఈకవియు ఫలశ్రుతిగా నీశ్లోకము రచియించెను.

" శ్లోకా లోకస్య భూత్యై శత మితి రచితాః శ్రీమయూరేణ భక్త్యా,
యుక్తశ్చైతాన్ పఠేద్య స్సకృదపి పురుష స్సర్వపాపై ర్విముక్తః,
ఆరోగ్యం సత్కవిత్వం మతి మతుల బలం కాంతి మాయుఃప్రకర్షం,
విద్యా మైశ్వర్య మర్థం సుత మపి లభతే సోఽత్రసూర్యప్రసాదాత్,

ఇట్టిఫలశ్రుతులు సాధారణముగా వినవచ్చునవే కాని, మయూరశతకపఠన మారోగ్యప్రద మైనదన్నకింవదంతిని కాదనలేము. ఇఁక నితని కవిత్వఘనత కీక్రిందిరాజశేఖరునిమాట యొకటియే చాలును.

" దర్పం కవిభుజంగానాం గతా శ్రవణగోచరం
విషవిద్యేవ మాయూరీ మాయూరీ వాఙ్నికృంతతి"

ఇతనివిగా సదుక్తి కర్ణామృతములో నున్నశ్లోకములలో నిదియొకటి:

" సంవ్యానాంశుకపల్లవేషు తరలం వేణీగుణేషు స్థితం,
మందం కంచుకసంధిషు స్తనతటోత్సంగేషు దీప్తార్చిషం,
ఆలోక్య త్రిపురావరోధనవధూవర్గస్య ధూమధ్వజం,
హస్తస్రస్తశరాసనో విజయతే దేవో దయార్ద్రేక్షణః "

ఇతరాంశములు బాణునిజీవితమునఁ జూతము:—

—o—

# భట్టబాణుఁడు

ఈమహాకవి తక్కినవారివలెఁ గాక నిజోదంతము కొంత తెలిపి చరిత్రకారులకు సహాయపడినసుకృతి. ఈతఁ డాపస్తంబసూత్రుఁడు వాత్స్యాయనవంశసంభూతుఁడు. శోణానదికి దక్షిణముగా నున్నప్రీతికూట మితనిమొదటినివాసము. ఇతనితండ్రి చిత్రభానుఁడు తల్లి రాజదేవి. చంద్రసేన మాతృషేణు లితనిపారశవులైన తమ్ములు-పెండ్లియాడిన శూద్రస్త్రీయందు బ్రాహ్మణునికి జన్మించినవాఁడు పారశవుఁ డనఁబడును. మనుస్మృత్యాదివిహితమైనయనులోమవివాహ మితనినాఁడు కలదనుట కిది యొకదృష్టాంతము. భాషాకవి యైనయీశానుఁ డితనిపరమమిత్రుఁడు. ఇట్టియంశముల కెల్ల నితనిహర్షచరిత్రయే ప్రమాణము.

ఇతఁ డధీతవేదవేదాంగుఁడు సాహిత్యనిధి కవిత్వకలాప్రియుఁడు. సంపన్నగృహస్థు. ఇతనికవిత్వవైదుష్యములమహత్త్వము విన్నశ్రీహర్షమహారాజు నాజ్ఞచే నతనిసోదరుఁ డగుకృష్ణభూపాలుఁడు తనకు సందేశ మంప నీకవి యుతనిమాట తీసివేయలేక శ్రీహర్షచక్రవర్తియాస్థానమునకు వచ్చినవాఁడు.

ఈశ్రీహర్షుఁడే కాన్యకుబ్జ మేలినహర్షవర్ధనుఁ డనియు నితఁడే ద్వితీయశిలాదిత్యుఁ డనఁబడె ననియు దేశచరిత్ర నిర్ణయించినది. తూర్పున కళింగదేశమును, దక్షిణమున నర్మదానదివఱకునుగల జనపదమును పడమట వల్లభీరాజ్యమును, ఉత్తరమున నేపాలదేశమును స్వాధీనము గావించుకొనివీరాతివీరుఁడై వన్నెకెక్కి యీసార్వభౌముఁడు శా. ౬౦౬-౬౪౮ నడుమ కాన్యకుబ్జము రాజధానిగా దేశము పరిపాలించినవాఁడు. సత్కవిప్రియుఁడును సత్కవియు నైనయీహర్షవర్ధనుఁడు తననాఁడు పేరుపడసిన విద్వత్కవి యగుభట్టబాణుని దనయాస్థానమునకు రప్పించుకొనుట సహజముగదా! మనబాణుఁ డీతనియుదంతమునే హర్షచరితగా నిర్మించిన

ళ్లెల్లరు నంగీకరించుటనుబట్టి యితఁడు పూర్వోక్తకాలమున నున్నవాఁ డని నిశ్చిత మగుచున్నది.

ఈకవి ప్రథమవయస్సునందు పార్వతీపరిణయ నాటకము శివాష్టకము చండీశతకము నిర్మించెనందురు. ఇందు మొదటిది సందిగ్ధమే కాని తక్కినవి రెండు నితని వనుట విశ్వాస్యమే. మధ్యవయస్సునందు శ్రీహర్షుఁడు కృతినాయకుఁడుగా నుండు శైలిని హర్షచరిత మనుగద్యకావ్యము రచియించి యపరవయస్సున "బాణోచ్ఛిష్టం జగత్సర్వ" మ్మనిపించినకాదంబరి రచియించెను. "అస్తి కవిసార్వభౌమో వాత్స్యాయనవంశసంభవో బాణః" అని నిజస్తుతి గావించుకొనఁ దగినవిద్వత్త్వకవిత్వముల వెలయు నితఁడు "కాదంబరీరసజ్ఞానామాహారోఽపి న రోచతే" అను ప్రశంసకు గుఱి యైనయీగద్యకావ్యము నిర్మించి లోకస్తుత్యుఁ డయ్యెను. ఈకావ్యశైలి కఠినమే కాని కష్టపడి చదివినవారు సకలశబ్దార్థవిజ్ఞానముతో రసమాస్వాదింతురు. ఇది బృహత్కథలోని కాదంబరీచంద్రాపీడుల కథయే కాని, దానినిరసవంతముఁ గావించినయవాంతరకథ లెన్నో యందు ప్రవేశించినవి. ఇందలికల్పనాచమత్కృతియు వర్ణనాచమత్కారము ననన్యాదృశములు. చంద్రాపీడునికి శుకనాసుఁడు గావించినయుపదేశ మెన్నిసార్లు చదివినా విసుగుపుట్ట దనుటయే దానిసరసత్వముఁ దెలుపఁగలదు.

కాదంబరి యుదయించినంతనే దేశమున వ్యాపించి కవిపండితులస్తుతికిఁ బాత్ర మయ్యెను. కాశ్మీరీయుఁడైనకాశీనాథకవి దీనియందలియత్యాదరమున నిందలికథ సంగ్రహించి సంక్షిప్తకాదంబరి నిర్మించి నట్లిందలియీక్రిందిశ్లోకము తెలుపుచున్నది.

" శా. కాశ్మీరాభిజనో ద్విజ స్సుమతిమాన్ దృష్ట్వాతు కాదంబరీం
బాణాఖ్యేన కవీశ్వరేణ రచితాం దీర్ఘాం సుగూఢార్థకామ్,
కాశీనాథసమాఖ్యయా సువిదితః పద్మోర్జనాథప్రభో
రాదేశా దకరో దిమాం సులలితాం సంక్షిప్తకాదంబరీమ్"

మణిరామకవి యనునింకొకవిద్వాంసుఁడు దీనిసార మెత్తి కాదంబర్యర్థసార మనుపద్యకావ్యము నిర్మించెను[1]. ఇట్లాకాలముననే ఖ్యాతి గాంచినయీకావ్యము పూర్తి కాకుండఁగానే భట్టబాణుఁడు దివంగతుఁ డగుట శోచనీయమే. ఇతనికుమారుఁడు,

భూషణభట్టు

తండ్రియందలిగౌరవముచేతను, కాదంబరీకావ్యమందలి యాదరముచేతను దీనిని పూరించినట్లుగా నిట్లు చెప్పుకొనియున్నాఁడు.

" యాతే దివం పితరి తద్వచసైవ సార్థం
విచ్ఛేదమాప భువి యస్తు కథాప్రబంధః,
దుఃఖం సతాం తదసమాప్తికృతం విలోక్య
ప్రారబ్ధ ఏవ స మయా, న కవిత్వదర్పాత్ "

ఇతఁడు పూరించిన దుత్తరభాగ మనఁబడుచున్నది. ఇది పూర్వభాగమువలెఁ బ్రౌఢము కాదు గాని, తండ్రి ననుకరించి యతఁడు విడిచిన కథను గ్రమముగా సరసముగాఁ బెంచుటలో నితఁడు మిక్కిలి శ్రద్ధ వహించెనని మాత్రము తోఁచకపోదు — ప్రియవిరహపీడిత యగు కాదంబరిమాటలను పత్రలేఖ చంద్రాపీడునకు వినిపించుట యనుకథాభాగముతో నితనిరచన మారంభ మైనది. కథ శుభాంతముగాముగిసినది.

హర్షచరిత్రలో నాఁటియుత్తరహిందూదేశపాలకులు కొందఱు గనిపింతురు. నాఁటిదేశనాగరకత కొంత గోచరించును. కాదంబరిలో నాఖ్యాయికా కల్పనమందలి చాతుర్యమును, గద్యరచనయందలిశోభయు నిగనిగలాడుగీర్వాణవాణీవిలాసమును గోచరించును.

బాణభట్టప్రశంస

అర్వాచీనులలో గద్యకవిసార్వభౌముఁడైన యితనిని ప్రశంసింపని వారు లేరు. వానిలో కొన్ని:—

---

1. కాదంబరీనామముతోఁ దరువాత నుదయించినకృతు లెన్నేని కలవు.

శ్రీహర్షదేవుఁడితనికి కనకాభిషేకము గావించి సరస్వతీదేవికి హర్షము గూర్చినవాఁడై గీర్వార్షుఁడయ్యె ననుచు సోడ్ఢలుఁ డుదయసుందరీ కథలో నిట్లనెను.

" శ్రీహర్ష ఇత్యవనివర్తిషు పార్థివేషు,
నామ్నైవ కేవల మజాయత వస్తుతస్తు,
గీర్వార్ష ఏవ నిజసంసది యేన రాజ్ఞా
సంపూజితః కనకకోటిశతేన బాణః "

కీర్తికౌముదిలో నెక్కుడుగా సోమేశ్వరదేవుఁ డిట్లువర్ణించెను.

" యుక్తం కాదంబరీం శ్రుత్వా కవయో మౌన మాశ్రితాః,
బాణధ్వానా వనధ్యాయో భవ తీతి స్మృతి ర్యతః "

సరస్వతియే బాణుఁడయ్యె నని గోవర్ధనుఁ డిట్లు స్తుతించి యున్నాఁడు.

" జాతా శిఖండినీ ప్రా గ్యథా శిఖండీ త థావగచ్ఛామి,
ప్రాగల్భ్య మధిక మాప్తుం వాణీ బాణో బభూవేతి "

బాణునివాణిని గంగాదేవి యిట్లన్నది.

" వాణీపాణిపరామృష్టవీణానిక్వాణహారిణీం,
భావయన్తి కథం వాన్యే భట్టబాణస్య భారతీమ్ "

త్రివిక్రమకవి నలచంపువులో నిట్లు స్తుతించెను—

" శశ్వద్బాణద్వితీయేన నమదాకారధారిణా,
ధనుషేవ గుణాఢ్యేన నిశ్శేషో రంజితో జనః"

రాఘవపాండవీయకర్త కవిరాజు, బాణుఁడు వక్రోక్తినిపుణుఁ డన్నాఁడు.

" సుబంధు ర్బాణభట్టశ్చ కవిరాజ ఇతి త్రయః,
వక్రోక్తిమార్గనిపుణా శ్చతుర్థో విద్యతే నవా "

ధర్మదాససూరి తనవిదగ్ధముఖమండనకావ్యమున నిట్లు స్తుతించినాఁడు.

" రుచిరస్వరవర్ణపదా రసభావవతీ జగన్మనో హారతి,
తత్కిం తరుణీ? నహి నహి వాణీ బాణస్య మధురశీలస్య "

బాణుఁడు సర్వసమర్థుఁ డని చంద్రదేవుఁ డిట్లు స్తుతించెను.

" శ్లేషే కేచన శబ్దగుంఫవిషయే కేచి ద్రసే చాపరే-,
లంకారే కతి చిత్సదర్థవిషయే చాన్యే కథావర్ణనే,
ఆసర్వత్ర గభీరధీరకవితావింధ్యాటవీచాతురీ
సంచారే కవికుంభికుంభభిదురో బాణస్తు పంచాననః "

ఇట్టి వింక నెన్నెని స్తుతులు కలవు. వీని నిట్లుంచి బాణమయూరులకు సంబంధించినయొకకథను వినోదార్థ మిందు చూతము.

జ న శ్రు తి

బాణభట్టుభార్య మయూరునిచెల్లెలు. మయూరుఁ డొకనాఁడు వారియింటికి వచ్చి రాత్రి వారిచావడిలో పరుండెను. ఆరాత్రి ప్రణయకలహమున ప్రతికూలురాలైనభార్య యెంతకును పట్టు విడువక యున్నట్లుండఁగా బాణుఁడు ప్రాణము విసిగి యామెకు నమస్కరించి బ్రతిమాలెను. కాని, ఆసుందరి ప్రసన్నురాలు కాలేదు. అపుడు కోపశాంతి యభిలషించుచు నీక్రిందిపద్యము రచించి యిట్లు చదువఁదొడఁగెను—

" గతప్రాయా రాత్రిః కృశతను! శశీ శీర్యత ఇవ,
ప్రదీపో ఽయం నిద్రావశ ముపగతో ఘూర్ణిత ఇవ,
ప్రణామాన్తో మానః, త్యజసి న తథాపి క్రుధ మహో!

[ప్రేయసీ! రాత్రి తెల్లవాఱవచ్చినది. చంద్రుఁడు క్రిందికి జాఱుచున్నాఁడు. దీపము కునుకుచున్నది. నమస్కారముతో కోప ముడిగిపోవునందురు కాని, అట్లయినా నీవు కోపము విడువకున్నావు. అయ్యో!]

అపుడే మెలకువ వచ్చినమయూరునిచెవి కీపైపాదములు మూఁడును సోఁకినంతనే, యతనినోటినుండి యప్రయత్నముగా నీక్రిందిపాదము

వచ్చెను—ఈచరణము పద్యపూర్తిగా నతఁడు చెప్పినది గాని, అసలు విషయము తెలిసి చెప్పినది గాదు—

"కుచప్రత్యాసత్త్యా హృదయ మపి తే చండి! కఠినమ్"[1].

[స్తనములనంటియుండుటచే నీహృదయముకూడా కఠినమైనది.]

ఈమాట విన్నంతనే కోపముతో బాణుఁ డీవలికి వచ్చి నీసహోదరి నిట్లనుచితముగా వర్ణించినావు గావున నీవు కుష్ఠరోగి వగుదువుగాక యని శపించెను. తత్వము తెలియక శపించినందుకు క్రుద్ధుఁడై మయూరుఁడు నీవు క్షయరోగమున కృశింతువుగాక యని ప్రతిశాప మిచ్చెను."

ఈకథ యెంతమాత్రము విశ్వసనీయముకాదు. ఒకసంస్థానమం దున్నవీరిద్దఱికి బాంధవ్య మున్న దని తెలుపుటకును మయూరుఁడు సూర్యశతకము, బాణుఁడు చండీశతకమునిర్మించుటకు హేతువు కల్పించుటకును, ఆర్వాచీనుఁడు కల్పించిన దనుట నిజము. కాని, యీకింవదంతి మెల్లగా జైనగ్రంథముల కెక్కినది. మయూరుఁడు సూర్యస్తవమునను, బాణుఁడు చండీస్తవమునను రోగవిముక్తులైరన్నమాట మమ్మటుని కావ్యప్రకాశములోని "ఆదిత్యాదే ర్మయూరాదీనామివానర్థనివారణ" మ్మన్న వాక్యమువల్లఁగూడా సూచింపఁబడుచున్నది.

## కాదంబరీకథ

గుణాఢ్యునిబృహత్కథలోని కాదంబరీకథ దీనికి మూలము. కాదంబరీచంద్రాపీడులు కథానాయికానాయకులు. రసము శృంగారము ప్రధానము. తక్కిన వంగములు. మూలకథను పెంచుటయందును వర్ణనలందును భాషయందు నితఁడు తనయసమానచాతుర్యమును స్వాతంత్ర్యమును చూపి మిక్కిలిప్రౌఢశైలి నీకథ నడపెను. ఇందలిమున్యాశ్రమవన హిమాలయవర్ణన లతిసైజములు. అచ్ఛోదసరోవర్ణనము మనోహరి.

1. ఈకథతోడిశ్లోకమీయుంణ్ణి వీరరాఘవాచార్యులుగా రిచ్చిరి.

మహాశ్వేతాప్రస్తావ మసమానము. యౌవరాజ్యపట్టాభిషేకసమయమునకుముందు మంత్రియగుశుకనాసుఁడు చంద్రాపీడున కుపదేశించిన నీతివచనములు నిరుపమానములు, విన నింపులు. వాని నిందు కొంత తెలిగించి చూపెదను.

“ నాయనా ! చంద్రాపీడ ! యౌవనము గాఢాంధకారము. ధనసంపద దారుణము. ఆగర్భశ్రీమత్త్వము అభినవయౌవనము రూపసంపద అమానుషశక్తి యనర్థదాయకములు. ఎంత చదివినవానికైనా యౌవనమున బుద్ధి కలుషము కాకపోదు. గురూపదేశము ధీరునిచిత్తమున కెక్కును. అభాగ్యునిచెవులకు నీళ్లవలె పీడ కలిగించును. గురూపదేశము బుద్ధిగలవారికి నిర్మలజలస్నానము, అస్వర్ణకర్ణాభరణము. కుమారా ! లక్ష్మి చంచల. అది లభించియు లభించకయు దుఃఖము కలిగించును. కులమును చూడదు. శీలమును పరిశీలించదు విద్యను వినదు ధర్మము ననుసరింపదు దానము నాదరింపదు గుణమును కోరదు పౌరుషమును పాటింపదు. మానమును మన్నింపదు. జ్ఞానమును స్మరింపదు. లక్ష్మిని పరిగ్రహించి రాజులు దుర్వినయముపా లగుదురు. కావున, అతికష్టచేష్టాదారుణ మగురాజ్యతంత్రమందును మహామోహకారణమైన జవ్వనమందును పొరపాటు నందక సకలజనసమ్మతముగా సంచరింప యత్నింపుము. ఎంతటిసత్కులమువానినైనా లక్ష్మి దుర్మార్గుని గావించునన్నమాట మాత్రము మఱచిపోకు ”

## పార్వతీపరిణయము

ఈనాటకము భట్టబాణునిదిగా దన్నవాదము కలదు. ప్రాచీనాలంకారికులు దీనిపై రెత్తలేదు. కాదంబరీశైలి రుచిచూచినవారికి దీనిశైలి పేలవముగా కనవచ్చు మాట నిజము. శైలీరసవర్ణనలందును పాత్రౌచిత్యమునందును మిక్కిలి తీసికట్టుగా నున్నయీరూపక మితనిది కా దను

టకు, తనకూఁతురికి పెండ్లియీఁడు వచ్చిన దని చెప్పహిమవంతునియీ క్రిందిమాటలే నిదర్శన మనుభావము కలుగకపోదు.

" ఆభోగశాలికుచకుట్మలమాయతాక్ష్యా
వక్షోఽవకాశ మభివాంఛతి సంనిరోద్ధుం,
అస్యాస్తినాస్తివచసాం విషయే ఽవలగ్నే
తస్మిన్ సముల్లసతి కాచన రోమరేఖా "

కూఁతురి స్తనాదులను తండ్రివర్ణించుట యనుచితమే కదా! అయి దంకములయీనాటకములోని వస్తు వందుఁ గూ కాళిదాసుకుమారసంభవములోని దనుట స్పష్టము. అయినా, రసవంతమా? ఆపాదము స్తకమునీరసమే. అందుచే నిది వామనభట్టబాణకృత మేమో కాని యీప్రసిద్ధబాణు నిది కా దనిపెక్కండ్రు భావించిరి. మనబాణభట్టుబాల్యమున నిర్మించినది కావచ్చు నని కొందఱు తలంచిరి. పాఠకులే యీవిషయము పరిశీలింతురుగాక.

హర్షచరితము నితఁడు నిర్మించి చరిత్రగ్రంథకర్తలకు మార్గదర్శకుఁడయ్యె ననవచ్చును. ఇందు బాణుఁడు తనవంశమును తనజీవితమును తొలుత వర్ణించుకొని, పిదప శ్రీహర్షునిచరితమును సమగ్రముగా వర్ణించెను. తనయిష్టదేవతకు సంబంధించిన వారిచర్యలు తెలిపెను. హర్షుఁడు మాలవరాజగౌడరాజులతో పోరాడుట, హూణరాజులపై దండెత్తుట, కాన్యకుబ్జ మాక్రమించుట మొదలగు సత్యచరితాంశములను విశదీకరించెను. భట్టారహరిచంద్ర సాతవాహన ప్రవరసేనవ్యాసభాసకాళిదాసాఢ్యరాజకవులను వాసవదత్తాబృహత్కథలను పేర్కొనెను. కాని వాల్మీకినిగాని రామాయణమునుగానిస్మరింపలేదు కారణమేమో! ఎనిమిది యుచ్ఛ్వాసములయీమహాగ్రంథము కాదంబరివలెనే పఠనపాఠవ్యవహారమున వ్యాప్తిగాంచి దేశమునలుగడల వన్నెకెక్కెను. ఇంక, రెండు గ్రూపకములనుగూర్చి యొకింత:—

ముకుటతాడితకము శారదాచంద్రికయనెడి రెండురూపకము లీ బాణునివే యని యొకవిమర్శకప్రవాదమున్నది. ఇందుకు భోజుఁడు శృంగారప్రకాశికలో మొదటిదానిలోనిశ్లోక ముదాహరించె ననియు, నలచంపూవ్యాఖ్యలో గుణవిజయగణి బాణునిపే రెత్తియందలియీక్రింది శ్లోక ముదాహరించె ననియు నందలి హేతువులు.

" ఆశాః ప్రోషితదిగ్గజాఇవ, గుహాః ప్రధ్వస్తసింహాఇవ,
ద్రోణ్యః కృత్తమహాద్రుమాఇవ భువః ప్రోత్ఖాతశైలాఇవ,
బిభ్రాణాః క్షయకాలరిక్తసకలత్రైలోక్యకష్టాం దశాం
జాతాః క్షీణమహారథాః కురుపతే ర్దేవస్య శూన్యాః సభాః "

మఱియు శారదాతనయుఁడు భావప్రకాశములో

" కల్పితా బాణభట్టేన యథా శారదచన్ద్రికా,
దివ్యేన మర్త్యస్య వధః కావ్య స్యావశ్యభావతః"

అని శారదచంద్రికను స్మరించెనని యింకొక హేతువు. కాని, చాటుప్రబంధములును కింవదంతులు నెవరికృతు లెవరి కారోపించెనో తెలియరాదు. కాదంబరీకర్తయే యీరూపకములు నిర్మించె నని నిర్ణయించుట కాధారములా లేవు. అందుచే నీవిషయము చర్చింపకుండుటయే యుచితము.

—:o:—

# ధర్మకీర్తి

ఇతఁడు గొప్పబౌద్ధమతప్రచారకుఁడు, ఆలంకారికుఁడు కవి, ధిఙ్నాగాచార్యుని ప్రమాణసముచ్చయమునకు వ్యాఖ్య నిర్మించిన యితఁడు బౌద్ధసంగతి బుద్ధనిర్వాణస్తోత్రము మొదలగుకృతులు రచియించి, బౌద్ధమతమును ఖండించుచున్న యానాఁటిమహాపండితుఁ డగు

కుమారిలభట్టు ప్రచారమునకు వ్యతిరేకప్రచారము గావించినమతాభిమాని. కాని యితనికృతు లన్నియు నిపుడు కనరావు.

సుబంధుఁడు తనవాసవదత్తలో "శాద్ధసంగతి మివాలంకారశోభితామ్" అను యితనియొకకృతిని పేర్కొన్నాఁడు. ఆనందవర్ధనాదు లితనివి గాఁ గొన్నిశ్లోకము లుదాహరించియున్నారు. ధ్వన్యాలోకతృతీయోద్ద్యోతములో—

"లావణ్యద్రవిణవ్యయో న గణితః క్లేశో మహా నర్జితః,
స్వచ్ఛన్దం చరతో జనస్య హృదయే చింతాజ్వరో నిర్మితః,
ఏషాపి స్వయమేవ తుల్యరమణాభావా ద్వరాకీ హతా,
కోఽర్థ శ్చేతసి వేధసా వినిహిత స్తన్వ్యా స్తను●తన్వతా"

అనుశ్లోక ముదాహరించి "ఇది వ్యాజస్తుత్యలంకారమని యొకరు వ్యాఖ్యానము చేసిరిగాని, అది సరి గాదు, ఇందు తోఁచునది అప్రస్తుతప్రశంసాలంకారము. ఇంతకు నీశ్లోక మొకప్రబంధములోనిది కాదని వినుచున్నాను. కాని, యిది ధర్మకీర్తిశ్లోక మని ప్రసిద్ధి కలదు. ఇది యతని దగుటకు తగిన దే. ఏమనఁగా నీక్రిందిశ్లోకములోఁ గూడా యిట్టి యభిప్రాయమే ప్రకటింపఁబడినది" అనివిమర్శించి యితని యీక్రింది శ్లోకమును కూడా ఆనందవర్ధనుఁ డుదాహరించెను.

"అనధ్యవసితావగాహన మనల్పధీశక్తినా,
ప్యదృష్టపరమార్థతత్త్వ మధికాభియోగై రపి,
మతం మమజగ త్యలబ్ధసదృశప్రతిగ్రాహకం,
ప్రయాస్యతి పయోనిధేః పయ ఇవ స్వదేహే జరామ్"

ఇందు మొదటిశ్లోకము చిన్నచిన్నపాఠభేదములతో క్షేమేంద్రునియౌచిత్యవిచారచర్చలో నున్నది. ఈ పైవిషయములనుబట్టి చూడఁగా నితఁడు శా. ౬౨౦—౬౮౦ నడుమనున్నవాఁ డనియు, కుమారిలభట్టు నెఱుఁగుననియు నమ్మవచ్చును. చాలామందిపరిశోధకు

లితఁడు క్రీ. ౯–౭ శతాబ్దులనడుమ నున్నవాఁడని భావించిరి. ఆభావన కూడ నేను చూపినకాలమునకు సముచితముగానే యున్నది. సదుక్తికర్ణామృతములో నితనిదిగాఁ గనవచ్చినయీక్రిందిశ్లోకము సరసముగా నున్నది.

"శశిన ముపూత ప్రాచీ, నృత్యతి మదనో హసన్తి కకుభోఽపి,
కుముదరజః పటవాసం, వికిరతి గగనాఙ్గణే పవనః"

ఇతఁడు బౌద్ధమతగ్రంథములు నిర్మించినమాట యటుండఁగా రూపావతారమనెడి వ్యాకరణగ్రంథమును సుబోధ్యముగా రచియించియున్నాఁడు. మఱియు, ధ్వన్యాలోకసాహిత్యదర్పణకువలయానందాదులితనిపేరుచెప్పియు చెప్పకయు కొన్నిశ్లోకము లుదాహరించుకొన్నవి. అవియు మఱికొన్నియు సుభాషితావళ్యాదులం దితనిపేర నున్నవి. ఆపద్యములరీతి పరిశీలింపఁగా నితఁడేదో శృంగారకావ్యము నిర్మించియుండెనని తోఁచినది. అందు కొన్ని:—

"వక్త్రేందో ర్నహరన్తి బాష్పపయసాం ధారా మనోజ్ఞాం శ్రియం,
నిశ్శ్వాసా న కదర్థయన్తి మధురాం బింబాధరస్య ద్యుతిమ్,
తస్యా స్త్వద్విరహే విపక్వలవలీ లావణ్యసంవాదినీ
ఛాయా కాపి కపోలయో రనుదినం తస్యాః పరం శుష్యతి"

"సంగమవిరహవికల్పే, వర మిహ విరహో న సంగమ స్తస్యాః,
సంగే సైవ తథైకా, త్రిభువనమపి తన్మయం విరహే"

"శిఖరిణి క్వను నామ కియచ్చిరం, కి మభిధాన మసా వకరో త్తపః?
తరుణి! యేన తవాధరపాటలం, దశతి బింబఫలం శుకశావకః"

"అవివేకి కుచద్వంద్వం, హంతు నామ జగత్త్రయం,
శ్రుతిప్రణయినో రక్ష్ణో రయుక్తం జనమారణమ్"

ఇదికువలయానందములోనిది భావనాలంకారమున కుదాహృతమైనది.

"నపుంసక మితి జ్ఞాత్వా, ప్రియాయై ప్రేషితం మనః,
తత్తు తత్రైవ రమతే, హతాః పాణినినా వయమ్"

ఈపైశ్లోకములలో పురుషవిరహము సరసముగా వర్ణింపఁబడినట్లు తెలియుచుండఁగా నివి చాటువు లనుకొనుటకంటె నొకగ్రంథములో నివే యని భావించుట సముచితముకాదా! ఇంక నొకటి—

"శైలై ర్బంధయతిస్మ వానరహృతై ర్వాల్మీకి రంభోనిధిం,
వ్యాసః పార్థశరై స్తథాపి న తయో రత్యుక్తి రుద్భావ్యతే,
వాగర్థౌచ తులాధృతా వివ తథాప్యస్మత్ప్రబంధా నయం
లోకో దూషయితుం ప్రసారితముఖ స్తుభ్యం ప్రతిష్ఠే! నమః"

వైదికమతమువారు బౌద్ధమతమువారికృతులను దూషించురీతిని సొల్లుంఠనముగా నితఁడిట్లు తెలుపుచున్నాఁడు—కోఁతులచే కొండలు తెప్పించి వాల్మీకిసముద్రమున సేతువుబంధించినాఁడు. వ్యాసుఁడుపార్థునిబాణముల సాగరము నింకింపఁజేసినాఁడు. ఇవివారి యతిశయోక్తులుకావఁట! పాపము! శబ్దార్థములను త్రాసులోపెట్టితూఁచినట్లుగా మాగ్రంథముల నుమాత్రమీపండితలోకము దూషింపనోరువిప్పుచున్నది. ఆహా! గౌరవమా! నీకొక్కనమస్కారము.

బౌద్ధవైదికమతములవివాద మాదినుండియు నున్నదేకాని, యితనినాఁడే రాలేదు. అందుచే నీమాటలు సాధారణపండితుల నుద్దేశించి యున్నవి కావనియు, ఆకాలమున బౌద్ధమతగ్రంథములను కూలంకషముగా విమర్శించి, అందలియొక్కొక్కమాటయు ఖండించుచు, వైదికమతము వ్యాపింపఁజేయ దేశ మంతయుసంచరించిన కుమారిలభట్టు బౌద్ధమతఖండనము చెవులార విని యతనితో వాదింపలేక, యతని నుద్దేశించి యున్న వనియు విశ్వసింపవచ్చును—శ్లోకమందలిప్రతిష్ఠాశబ్దము ప్రతిష్ఠానపర మనుకొంటే, కుమారిల భట్టాపురమున బౌద్ధమతము ఖండించి నపు డీమాటలు ధర్మకీర్తి యనియుండు ననియు భావింపవచ్చును.

కుసుమపేశలమై మధురమైనయితనికవిత్వమున కింకొకటి:—
" హారోఽయం హరిణాక్షీణాం, లుఠతి స్తనమండలే,
ముక్తానా మప్యవస్థేయం, కే వయం స్మరకింకరాః "

—:o:—

# కుమారిలభట్టు

ఆనాఁటిపూర్వమీమాంసకులలో నగ్రగణ్యుఁడై వైదికమతరక్షణమున నసహాయశూరుఁడై లోకైకపండితుఁ డన్నఖ్యాతి వహించిన యీమహాపురుషుఁడు శాస్త్రకవిగా విద్వన్నుతి గన్నవాఁడైనను, భవభూతివంటిమహాకవికి గురు వగుటను శ్లోకాత్మకశాస్త్రకృతి నిర్మించుటను విశేషించి యాంధ్రుఁ డగుటను మన కిందు ధ్యాతవ్యుఁ డగుచున్నాఁడు.

ఇతఁ డాంధ్రుఁడు తైత్తిరీయశాఖాధ్యేత. ఆంధ్రదేశమునకును ఉత్కలదేశమునకును సరిహద్దున మహానదికి దగ్గఱగా నున్నజయమంగళ మనుగ్రామమున జన్మించినవాఁడు. ఇతనితల్లి చంద్రగుణ తండ్రి యజ్ఞేశ్వరుఁడు. ఇతనిని గూర్చి యెన్నేని కథలు కలవు గాని, పరమతమువాఁడు తనజినవిజయ మనుగ్రంథమున వ్రాసిన దెక్కువ విశ్వాస్యము గదా! అం దీపైమాటలే కాక, కుమారిలుఁడు "జైనఘాతుకుఁడు గురుద్వేషి పాపి వేదవేత్త" యనెడిమాటలు కూడా కలవు.

" ఆంధ్రోత్కలానాం సంయోగే పవిత్రే జయమంగళే,
గ్రామే ఽ స్తికే మహానద్యా భట్టాచార్యః కుమారిలః,
ఆంధ్రజాతి స్త్రిత్రికో, మాతా చంద్రగుణా సతీ,
యజ్ఞేశ్వరః పితా యస్య స వైదికమహాపథే,
మహావాదీ మహాన్ ఘోరః, శ్రుతీనాం చాభిమానవాన్,
జినానా మస్తక స్సాక్షా ద్గురుద్వేష్టా ఽతిపాపవాన్ "

జైనమత మిట్లు గ్రహించి జైనులను దూషించుట యాశ్చర్యముగాదు. కుమారిలభట్టాచార్యుఁడు జైనులను చంపించక పోయినా చంపించినంతపని చేసినాఁడని దీనివల్ల తెలియవచ్చును. ఒకానొక జైనాచార్యునివద్ద జైనమతరహస్యము లెఱిఁగి యితఁడామతమును ఖండించుటచే జినాంతకుఁడు గురుద్వేషి యన్న నిందకు గుఱి యయ్యెనని యు దీనినిబట్టి నమ్మనచ్చును. నిజముగా, ఆనాఁటిజైనబౌద్ధుల కితఁడు పక్కలోనిబల్లెమై దేశమునలుగడల సంచరించి యాపరమతవాదుల వాదములను మాటమాటకు ఖండించి సభలలో తనవేత్తృత్వవక్తృత్వములు వెల్లడించి విజయము గాంచినవాఁడగుట తెలిసియే శత్రుపక్షమువాఁడు గూడ నితనిని మహావాది యని ప్రశంసించెనని విశ్వసింపవచ్చును.

కుమారిలునాఁటికి భర్తృమిత్రాదులమూలముగా మీమాంసా మతము లోకాయత (నాస్తిక) మన్నయపవాదమువాలైనది. దానిని తొలఁగించి పూర్వమీమాంసను ఆస్తికమార్గమున నిలుపుట కితఁడు ప్రయత్నించి నట్లితనిశ్లోకవార్తికము మొదట నున్నయీక్రిందిశ్లోకము చెప్పుచున్నది.

"ప్రాయేణైవహి మీమాంసా లోకే లోకాయతీకృతా,
తా మాస్తికపథే కర్తు మయం యత్నః కృతో మయా"

జైమినిమతమం దాత్మ విజ్ఞానస్వరూపముకా దన్నభావమును పెక్కండ్రు వెల్లడించిరి. కాని, శబరస్వామి నాస్తికత్వనిరాకరణమునకై విజ్ఞానాస్తిత్వ మొకచో సూచించె నని యితఁడిట్లు తెలిపియున్నాఁడు

"ఇత్యాహ నాస్తిక్యనిరాకరిష్ణు రాత్మాస్తితాం భాష్యకృ దత్రయుక్త్యా,
దృఢత్వ మేతద్విషయః ప్రబోధః ప్రయాతి వేదాన్తనిషేవణేన"

శ్లోకవార్తికారంభమున నున్న యీక్రిందిశ్లోక మీశ్వరస్తుతిపరము కా దని కొంద అన్నారుగాని, వృత్తికారుఁడగువాసుదేవదీక్షితుఁడు మొదలగు కొందఱు కుమారిలభట్టేశ్వరాస్తిత్వ మంగీకరించిన

వాఁడే యన్నారు. కాని, ఈశ్వరుఁడు జగత్కారణ మని యీశాస్త్ర మం దెచ్చటను స్పష్టముగా చెప్పినవాఁడు కాఁడన్నమాట మాత్రము కలదు. ఆశ్లోక మిది.

"విశుద్ధజ్ఞానదేహాయ త్రివేదీదివ్యచక్షుషే,
శ్రేయఃప్రాప్తినిమిత్తాయ నమ స్సోమార్ధధారిణే"

ఇతఁడుజైమినిసూత్రములకును శబరస్వామిభాష్యమునకును భాష్య మగునట్లు తంత్రవార్తిక మనుమహాగ్రంథము నిర్మించి మీమాంసా శాస్త్రము నలంకరించెను. అదిశ్లోకవార్తికము తంత్రవార్తికము టుప్టీక యని త్రివిధముగా స్వతంత్రగ్రంథముగా నున్నది. కృష్ణదేవునితంత్ర చూడామణిలో కుమారిలుఁడు బృహట్టీక మధ్యమటీక యనుపేళ్ళ శాబరభాష్యమునకు మఱిరెండు టీకలు నిర్మించె నన్నమాట కలదు గాని, అవి యిపుడు కనరావు.

మీమాంసాశాస్త్రమునగొప్ప పేరుగాంచిన ప్రభాకరమిశ్రుఁడితని శిష్యుఁ డన్న మతము ప్రబలముగా నున్నది. ఇందుకు శంకరాచార్య మాధవాచార్యులమాటలుకూడా ప్రమాణ మగుచున్నవి. కాని, వీరి గురుశిష్యభావము నంగీకరింపనివారును కలరు. అయినా, వీరిద్దఱికిని సంబంధించినకథ లర్వాచీనగ్రంథములకు కూడా యెక్కినవి. అవి కుమారిలునికి "తుతాత" బిరుదమును, ప్రభాకరునికి గురుబిరుదము నిచ్చినవి. పరస్పరవిరుద్ధములుగా నున్నయీకథలు విశ్వాస్యములు కావుగాని, ఆబిరుదములుమాత్రము వారిని విడువ లేదు. ప్రభాకరునిశిష్యత్వమును విడువలేదు. ఆకథ లితరత్ర విదితములు:—

ఈకుమారిలుఁడు శా. ౫౯౦—౬౫౦ నడుమ నున్నవాఁడు[1] తనమత జైత్రయాత్రలో నప్పటికి వృద్ధుఁడైనధర్మకీర్తితో మతవాదము గావిం

1. కొందఱు క్రీ. 590-650అన్నారు. S. P. పండితుఁడు, వేధకుపండితుఁడు మొదలగువారు. క్రీ. 700అన్నారు.—ఇదే బహుసమ్మతము.

చినవాఁడు. ఇతనినాఁటికినలాందలో బౌద్ధవిద్యాపీఠము వర్ధమానదశలో నున్నది. అప్పటికి విజయార్థము వెళ్ళినయితఁడు ప్రసిద్ధబౌద్ధమతప్రవక్తయైనధర్మకీర్తిని చూచియున్నవాఁడనువిషయమున సంశయింపఁ బనిలేదు. బౌద్ధులను వారిమాటలతోనే నిరుత్తరులను చేసినయితనియుక్తిప్రమాణ వాదవిధానమే పరమతఖండనమున జగద్గురుశంకరులకు మార్గదర్శకమయ్యెనని భావించుట సుసంగతము. ఇంక, మహాకవిభవభూతి యితని శిష్యుఁడన్నవిషయమాకవిజీవితమున తెలియవచ్చును గనుక ఇతనితుతాతనామముతో సదుక్తికర్ణామృతాదులలో కనవచ్చు రెండుమూఁడు శ్లోకములలోనిదియొకటి—

"ద్వారస్తంభనిషణ్ణయా దయితయా వక్రీకృతగ్రీవయా
నాసాగ్రాగతవారిబిందువిసరైస్సంసిచ్యమానాంగయా
మన్యుస్తంభితకంఠగద్గదగిరా ప్రోచ్చారితార్ధాక్షరం
సందిష్టం తవ కాంతయా పథిక! తద్వాక్యం న యత్పార్యతే"

ఇది మనమీమాంసకశిరోభూషణమైనకుమారిల భట్టాచార్యుని దనఁదగునో కూడదో పాఠకులే నిర్ణయింతురుగాక—

—:O:—

## లలితాదిత్యుఁడు

ఇతఁడు కాశ్మీరదేశపాలకులలోనియొకమహాశూరుఁడు సంస్కృత భాషాపోషకుఁడు పండితుఁడు కవి. ఇతనిజన్మవృత్తాంత మిది:—

రెండవతుంజీనుఁ డనఁబడురణాదిత్యుని రెండవకుమారుఁడు బాలాదిత్యుఁ డనఁబడుప్రతాపాదిత్యుఁడనియు, అతఁడు కాశ్మీర మేలె ననియు వెనుకఁ జదివియున్నాము—అతనికి బింబాదేవియందనంగలేఖ యను నొకకూఁతురు మాత్రము పుట్టెను. ఆకన్య యౌవనము గాంచుచున్న

తటి నొకనాఁ డొక దైవజ్ఞుఁ డతనిసభకు వచ్చి ప్రసంగవశమున నీతరువాత నీయల్లుఁడు కాశ్మీరపాలకుఁ డగు "నని పలికెను-అందు కిష్టపడక యతఁడు" క్షత్త్రియుఁడు కానివాఁ డీరాజ్యమున కర్హుఁడు కాడు గనుక నక్షత్త్రియునకు నాకన్య నిచ్చి దీనిని బరిహరింతుననుకొని కర్కోటనాగ వంశమునఁ బుట్టినదుర్లభవర్ధనుఁ డనుక్షత్త్రియేతరునికి తనకూఁతును నిచ్చి పెండ్లిచేసెను. తండ్రిచేసినపని యనుచిత మని తలంచియనంగలేఖ భర్త నాదరింపకయుండెను. ఇట్లుండఁగొన్నియేండ్లకు ప్రతాపాదిత్యుఁడు దివంగతుఁ డయ్యెను. మంత్రులను ప్రజలను వశపఱుచుకొని దుర్లభవర్ధనుడు కాశ్మీరరా జయ్యెను. అప్పు డనంగలేఖయు భర్తను ప్రేమించెను. ఆదంపతుల కుదయించినదుర్లభుఁడు మాతామహవంశమునకు దత్తుఁడై మాతామహునిపేరఁ బ్రతాపాదిత్యుఁడై తండ్రియనంతరము కాశ్మీరరాజయ్యెను. దీనినిబట్టి బాలాదిత్యనామకప్రతాపాదిత్యునితో కాశ్మీరరాజగోనందవంశము సమాప్త మయ్యెననియు, అతనిదౌహిత్త్రుఁడైనదుర్లభనామకప్రతాపాదిత్యునితో కాశ్మీరరాజకర్కోటనాగవంశ మారంభమైనదనియుఁ దెలియుచున్నది.

ఈప్రతాపాదిత్యుఁడు దేశాంతరమునుండి వచ్చికాశ్మీరరాజధానీనగరమున వాణిజ్యము చేయుచున్నగొప్ప సంపన్నుఁడైననోణుఁ డను వణిజునిభార్యను నరేంద్రప్రభయనుదాని నొకనాఁడు చూచుట తటస్థించెను. అపుడు వారికి పరస్పర మనురాగ మంకురించినది. కాని, పరదారపరిగ్రహణమున కిష్టపడక మనోవ్యథచే నితఁడు కృశించుచుండెను. ఇతని యవస్థ తెలిసికొని యానోణుఁడు తనభార్యను విడిచి దేవాలయమున నర్తకిని జేసి యిపుడు నరేంద్రప్రభ దేవదాసి యైనది నీవు పరిగ్రహింపుమని కోరెను. అపు డీరాజు దానిని స్వీకరించెను. ఆదంపతులకు పుట్టిన ముగ్గురుకొడుకులలో మన ముక్తాపీడలలితాదిత్యుఁడు మూఁడవవాఁడు ఇతఁడు రాజై దిగ్విజయయాత్ర యొనరించినమహావీరుఁడు ఇతఁడు

శా. ౬౧౭-౬౫౭ నడుమఁ గాశ్మీర మేలినవాఁడు. ౬౫౦ ప్రాంతమున కాన్యకుబ్జరాజగు యశోవర్మ నోడించి యతనిసన్నుతి నందినవాఁడు, విద్వాంసుఁడు కవి కవిపోషకుఁడు. ఇతనికృతులు కనరావు కాని, యితని పేర సుభాషితావళ్యాదులలో నీక్రింది శ్లోకము లున్నవి.

" వస న్త్యరణ్యేషు చర న్తి దూర్వాం, పిబ న్తి తోయా న్యపరిగ్రహాణి,
తథాపి వధ్యా హరిణా నరాణాం, కో లోక మారాధయితుం సమర్థః "

" త్యక్తం జన్మ వనం తృణాం కురవతీ మాతేవ ముక్తాస్థలీ,
విస్రంభస్థితిహేతవో న గణితా బంధూపమాః పాదపాః,
బాలాపత్యవియోగదుఃఖవిధురా నాపేక్షితా సా మృగీ,
మృగ్యన్తఃపదవీం తథా ప్యకరుణా వ్యాధా న ముంచం త్యమూం "

—:o:—

# యశోవర్మ

విద్వాంసుఁడు కవి కవిపండితపోషకుఁడు నైనయీమహారాజు శా. ౬౧౦-౬౫౫ నడుమ కాన్యకుబ్జము పాలించినవాఁడు. సుమారు నలువదియేండ్లురాజ్య మేలినయితఁడు భవభూత్యాదిమహాకవుల నాదరించుచు సారస్వతసేవ చేయుచు యశస్కాముఁడై విల్లసిల్లినపుణ్యమూర్తి. అయిన నేమి ? ఇంతకు ముందు మనము పేర్కొన్న ముక్తాపీడలలితాదిత్యుఁ డితని నోడించి సామంతుని కావించుకొన్నట్లు రాజతరంగిణిలోని (౪-౧౪౪) యీక్రిందిశ్లోకమువల్ల తెలియుచున్నది.

" కవి ర్వాక్పతిరాజశ్రీభవభూత్యాదిసేవితః,
జితో యయౌ యశోవర్మా తద్గుణస్తుతివందితామ్ "

ఈరాజు రామాభ్యుదయాదికావ్యములు నిర్మించినట్లు క్షేమేంద్రుఁడు అభినవగుప్తుఁడు శారదాతనయుఁడు ధనికుఁడు మొద లగులాక్షణి

కులమాటలవల్లను, వా రుదాహరించినశ్లోకములవల్లను విశదమగుచున్నదిగాని, ఆకృతులు మాత్రముకనఁబడకున్నవి. కనవచ్చినయాశ్లోకములు చూచినవారి కిట్టిమహాకవి రచనలు మృగ్యము లయ్యెనుగదా యని విచారము కలుగకపోదు. ఆగ్రంథములు లభింపకపోయినా, ఆశ్లోకములు కొన్నియైనను శేషించి మనకు పాఠ్యము లగుట మహాభాగ్యమే యని భావింతము. ఇంతటిసత్కవిత్వసంపదకలవాఁడు కావుననే భవభూతివంటి మహాకవిని తనసభకు రప్పించుకొనె నన్నతత్త్వము గ్రహింతము:—

క్షేమేంద్రుఁడు తనసువృత్తతిలకములో — యథాశ్రీయశోవర్మణః— అని యీక్రిందిశ్లోకము చూపెను.

“ యత్త్వన్నేత్రసమానకాంతి సలిలే మగ్నం త దిందీవరం,
మేఘై రంతరితః ప్రియే! తవ ముఖచ్ఛాయానుకారీ శశీ,
యేఽపి త్వద్గమనానుకారిగతయ స్తే రాజహంసా గతాః,
త్వత్సాదృశ్యవినోదమాత్ర మపి మే దైవేన న క్షమ్యతే ”

ఇవి సీతావియోగమును సహింపలేక వర్షాకాలమున నామెను స్మరించుకొని దుఃఖించుచున్న శ్రీరామునిమాట లగును.

అభినవగుప్తాచార్యుఁడు ధ్వన్యాలోకలోచనమున నాటకముపేరు కవిపేరు కూడా యిట్లు తెలిపియున్నాఁడు— యదుక్తం కథామార్గే నచాక్రమః. ఇతి రామాభ్యుదయే యశోవర్మణా—

శారదాతనయుఁడు భావప్రకాశికలో

“ షడంకం దృశ్యతే లోకే రామాభ్యుదయనాటకమ్ ”

అనుచు, నది యాఱంకములనాటక మని నిరూపించియున్నాఁడు. ఆనందవర్ధనాచార్యుఁడు ధ్వన్యాలోకమున నుదాహరించినయీక్రింది శ్లోకము రామాభ్యుదయములోనిదని సుభాషితావళి చెప్పినది. ఇందలి యలంకారమును విమర్శించి శ్లేషవ్యతిరేకలక్షణ మైనయలంకారాంతర మనియానందుఁ డంటె, అభినవగుప్తుఁడు సంకర మన్నాఁడు. దీనినే అప్ప

యదీక్షితులు కువలయానందములో ఉపమానన్యూనత్వపర్యవసాయి యైనవ్యతిరేకాలంకార మన్నారు.

" రక్త స్త్వం నవపల్లవై రహ మపి శ్లాఘ్యైః ప్రియాయాగుణైః,
త్వా మాయాన్తి శిలీముఖా స్స్మరధనుర్ముక్తా స్తథా మా మపి,
కాంతాపాదతలాహతి స్తవ ముదే తద్వ న్మమా, ప్యావయోః
సర్వం తుల్య మశోక కేవల మహం ధాత్రా సశోకః కృతః "

క్షేమేంద్రునిసువృత్తతిలకములో నీక్రిందిశ్లోకము యశోవర్మపేర నున్నది.

" స యస్యదశకంధరం కృతవతోఽపి కపోంతరే,
గత స్స్ఫుట మవంధ్యతా మధిపయోధి సాంధ్యో విధిః,
తదాత్మజ ఇ హాంగదః ప్రహిత ఏష సౌమిత్రిణా,
క్వ స క్వ స దశాననో నను నివేద్యతాం రాక్షసః "

ఆయాలంకారికులమాటలనుబట్టియు నీశ్లోకములరీతినిబట్టియు నివి తప్పక యశోవర్మరామాభ్యుదయములోని వని స్పష్ట మగుచున్నది. ఆనందవర్ధనాదులానాటకము చదివినా రనియు విదితమగుచున్నది. అయితే నేమి ? అయిదువందలయేండ్లక్రిందటివఱకు నున్నయాదివ్యనాటకము కాలగర్భమున నణఁగిపోయెను గదా ! ఇదే కాదు, ఆనాఁటిదేశవిప్లవమున నిట్టి వెన్నో యడుగంటినవి.

—:0:—

## భ వ భూ తి

" ప్రాచేతసేన యాఽఽసీతా, పాలితా భవభూతినా,
సర్వత స్సర్వ్యతే వాణీ సై వాద్య కవిమానిభిః"

ఇతనికృతులలోనిమాటలనుబట్టి మనకు తెలియవచ్చినయితనియుదంత మిది:—దక్షిణాపథమున విదర్భదేశమునందలి పద్మపుర మితనిజన్మ

స్థానము. అందు వేదవేదాంగవేత్తలు తైత్తిరీయులు పంచాగ్నులు సోమపీథులు కాశ్యపగోత్రులు కర్మనిష్ఠులు నైనఉదుంబరమువారనంబడు బ్రాహ్మణులు కలరు. వారిలో వాజపేయయాజి యైనమహాకవి యను విద్వద్వరుని కితఁడు మనుమనిమనుమఁడు. భట్టగోపాలపండితునికిపౌత్రుఁడు జతుకర్ణీనీలకంఠ పండితులపుత్రుఁడు. జ్ఞాననిధి యనుమహావిద్వాంసుని శిష్యుఁడు. ఇతని మొదటిపేరు శ్రీకంఠుఁడు, బిరుదుపేరు భవభూతి. శ్రీపద వాక్యప్రమాణజ్ఞుఁడనని యితఁడే తెలుపుకొనియున్నాఁడు. విదర్భదేశమును ప్రాచీనాంధ్రులు వెలనాఁ డన్నారు. కావుననే యందుండి యిక్కడికి వచ్చినవారికి విదర్భజు లనియు వెలనాటివా రనియు వాడుక వచ్చినది.

ఇతనిజన్మగ్రామ మగుపద్మపురమునకు పద్మావతి యని నామాంతరము కొన్నివ్రాఁతప్రతులలో కనఁబడుచున్నది. ఆగ్రామ మిపుడేపేర నున్నదో యేప్రాంతమున నున్నదో! దానిని నిరూపింప వారువారేమేమో వ్రాసిరిగాని, యందు డాక్టరు గోపాలకృష్ణభండార్కరు మాలతీమాధవపీఠికలో తెలిపినదే కొంత విశ్వసనీయముగా నున్నది. ఈనాఁడు కూడా తైత్తిరీయశాఖీయు లాప స్తంబసూత్రులు నైనబ్రాహ్మణులు నాగపురప్రాంతమందును, దానికి దక్షిణముగాను ఆగ్నేయముగాను చేరియున్న తెలంగాణాలోను నివసించియున్నారు. కావున (చంద్రపురము) చాందాకు దక్షిణముగా గోదావరికి దగ్గఱగా నితని జన్మగ్రామమానాఁ డున్న దని భావింతము. నాఁటి విదర్భసరిహద్దులు నేఁడు నిరూపింప శక్యము కావు గాని, ఇప్పటి తెలంగాణ విదర్భరాష్ట్రములోని యాగ్నేయభాగ మనవచ్చును.

ఇతఁ డాంధ్రుఁ డని పెక్కండ్రయాశయము. ఇది క్రొత్తది గాదు కొమారిలభట్టశిష్యత్వముతోనిదియు సిద్ధమే. కొమారిలుఁడు శా.౫౫౦-౬౮౦నడుమ నున్ననాఁ డని చదివియున్నాము. భవభూతిపోషకుని కాలము గనియున్నాము. కావున విద్యాభ్యాసానంతరము కవియై గణుతి

కెక్కి యశోవర్మయాస్థాన మలంకరించిన మనభవభూతి శా. ౬౮౦-౭౭౦ నడుమ జీవించియున్నవాఁ డని విశ్వసింపవచ్చును. బహు విమర్శకాభిప్రాయ మిదే.

## కుమారిల శిష్యత్వము

భవభూతి కుమారిలభట్టమీమాంసాశాస్త్రశిష్యుఁ డనివిద్వల్లోక ప్రసిద్ధి. మాలతీమాధవము వ్రాఁతప్రతులలో కొన్నిట నీక్రిందిగద్య లున్నట్లు శంకరపాండురంగపండితుఁడు మొదలగువారు తెలిపియున్నారు.

"ఇతిశ్రీభట్టకుమారిలశిష్యకృతే మాలతీమాధవే తృతీయోఙ్కః"

"ఇతిశ్రీకుమారిలస్వామిప్రసాదప్రాప్తవాగ్వైభవశ్రీమదుం
బేకాచార్యవిరచితే మాలతీమాధవే షష్ఠోఙ్కః"

ఇవి భవభూతి కుమారిలశిష్యుఁ డని స్పష్టముగా చెప్పుచున్నవి. ఉంబేకసంజ్ఞనిర్ణయించవలసియున్నది. భవభూతినాటకములు చదివిన విమర్శకు లందఱును, వేదవేదాంగవేత్తలవంశములో పుట్టి వేదాధ్యయనముచేసినభవభూతి పూర్వమీమాంస కుమారిలునొద్ద చదివినాఁ డనుట యాశ్చర్యముకాద ని వ్రాసియున్నారు[1]. కావున మీమాంసక లోకమున భవభూతి కున్నఉంబేకసంజ్ఞను ముందు గ్రహింతము.

ఖండనఖాద్యవ్యాఖ్యాతఆనందపూర్ణుఁడు, శాస్త్రదీపికావ్యాఖ్యాత రామకృష్ణుఁడు, తంత్రవార్తికవ్యాఖ్యాత నారాయణుఁడు, శ్లోకవార్తిక వ్యాఖ్యాత పరమేశ్వరుఁడు, తత్త్వప్రదీపికావ్యాఖ్యాత చిత్సుఖాచార్యుఁడు, తత్త్వశుద్ధికర్తయగు బోధఘనాచార్యుఁడు, షడ్దర్శన సముచ్చయమందుహరి భద్రసూరియు, ఉంబేకుని పేర్కొన్నారు.

ఉంబేకుఁడు కుమారిలునిశ్లోకవార్తికమునఁ గొంతవఱకు వ్యాఖ్య నిర్మించినట్లును, తక్కినభాగమునకుఁ గుమారిలభట్టు కుమారుఁడు జయమిశ్రుఁడు టీక రచియించినట్లును, కనఁబడుచున్నది. ఉంబేకునివాక్య

1. K. T. తిలాంగు, బుహ్లరు, భండార్కరు, శం. పా. పండితుడు.

నెత్తుకొని తత్త్వప్రదీపికావ్యాఖ్యాత యైన చిత్సుఖాచార్యుఁడు తననయనప్రసాదినీవ్యాఖ్యలో “ఉంబేకో భవభూతిః” అని తెలిపియున్నాఁడు. గుణరత్నుఁ డనుజైనుఁడు భవభూతి యనుభావముతోనే “ఉంబేకో కారికాం వేత్తి” అని పొగడి యున్నాఁడు. మాలతీమాధవములోఁ గన వచ్చుచున్న “యే నామ కేచి దిహ నః ప్రథయ న్త్యవజ్ఞా” మిత్యాది శ్లోకము ఉంబేకవిరచితముగా మున్ను చెప్పఁబడినశ్లోకవార్తికవ్యాఖ్యా వతారికలోఁ బ్రత్యక్షమై ఉంబేకుఁడు భవభూతియే యన్నవిషయమును ధ్రువపఱుచుచున్నది. కాని, ఇక్కడ నింకొకమాట.

విద్యారణ్యమాధవాచార్యుఁడు తనశంకరవిజయ మేడవసర్గలో మండనమిశ్రుని కుంబేకసంజ్ఞ యున్న ట్లీక్రిందివిధముగాఁ దెలిపియున్నాఁడు.

“ అయంచ పన్థా యది తే ప్రకాశ్యః
సుధీశ్వరో మండనమిశ్రనామా
ఉంబేక ఇత్యభిహితస్య హి తస్య లోకై
రుంబేతి బాంధవజనై రభిధీయమానమ్ ”

“ఉంబేక” అనునదిముద్దుపేరని దీనివల్లఁ దెలిసినది. అది మండన మిశ్రునికిఁ గూడ నుండవచ్చును గాని భవభూతి కాముద్దుపేరు లేదని యెట్లు చెప్పఁగలము? కావున భవభూతి కుమారిలభట్టునొద్ద మీమాంస గట్టిగాఁ జదివి యానాఁడు మీమాంసకలోకమునం దెక్కుడగా వాడుకలో నున్నయాఉంబేకసంజ్ఞతోనే గురునిశ్లోకవార్తికమునకు వ్యాఖ్య వ్రాయుచుఁ బ్రథమప్రయత్న మగుటచే వినయమును శాస్త్రజ్ఞానమందలి దృఢవిశ్వాసముచే నిర్లక్ష్యభావమును దోఁప నవతారికలో నీక్రిందిశ్లోకము వ్రాసె నన్నమాట కాదనఁజాలము.

“ యే నామ కేచిదిహ నః ప్రథయ న్త్యవజ్ఞాం,
జానన్తి తే కిమపి తాన్ ప్రతి నైష యత్నః,

ఉత్పత్స్యతే మమతు కో౽పి సమానధర్మా,
కాలో హ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ "

తరువాత నీశ్లోకమునే వ్యాజవినయమును కవిత్వోత్కర్షయు వెల్ల డించుచు మాలతీమాధవప్రస్తావనలోఁ జేర్చెను. ఉంబేకుఁ డెవఁడో యైయుంటే యాతనియీశ్లోకము నీమహాకవి యపహరించి యుండు నని యెవ రయినఁ జెప్ప సాహసింతురా! కావున భవభూతికుమారిలుని మీమాంసాశిష్యుఁడనుట విస్పష్టము.

## ఇ ం టి పే రు

ఇతనివంశమువా రుదుంబరంవా రని యితని "ఉదుంబరనామా నః" అన్నమాటయే చెప్పుచున్నది. భవభూతి విదర్భకు చేరిన తెలంగాణా లోనివాఁ డై యుండు" ననిడాక్టరుభండర్కరు చేసినసూచన కిదియునొక కారణ మగును. కర్మనిష్ఠుఁ డయినయితనివంశములోనిపూర్వపురుషుఁ డొకఁడు తఱుచు కావలసివచ్చుమేడాకుల కై మేడిచెట్టు పెంచినవాఁ డగుటచే నది గుర్తుగా నీవంశమువారు మేడివారై యుందురనియు గ్రామ నామముంబోలె వంశనామము నితఁడు సంస్కృతీకరించి "ఉదుంబరనా మానః" అని వ్రాసియుండు ననియు భావింపవచ్చును. వేప చింతా రావి మొద లగునింటిపేర్ల బ్రాహ్మణు లిపుఁడు తెలుఁగుదేశమునలుగడల నున్నారు గదా! ఇం దసంభావ్య మేమి? ఇది కూడా యితనియాంధ్రత్వమునకు జ్ఞాపకమే.

## భవభూతి బిరుదు

ఇతఁ డొకరాజసభకు వెళ్ళి "సాంబా పునాతుభవభూతిపవిత్ర మూర్తిః" ఇత్యాదిగా నాశీర్వదింపనారా జానందించియితనికి భవభూతి బిరుద మిచ్చె ననియు.

" తపస్వీ కాం గతో౽ వస్థా మితి స్మేరాననా వివ,
గిరిజాయాః స్తనౌ వన్దే భవభూతిసితాననౌ "

అని యితఁడు రసవంతముగాఁ గావించినయీశ్వరీస్తుతికి మెచ్చు కొని పండితకవు లితనిని భవభూతి యని పిలువఁజొచ్చి రని యు, భవుఁడు (ఈశ్వరుఁడు) భిక్షురూపమునఁ గనవచ్చి యితనికి భూతి నిచ్చుటంజేసి యితఁడు భవభూతి యయ్యె ననియుఁగథలు కలవు. ఘనశ్యామకవియు వ్యాఖ్యాత వీరరాఘవాచార్యుఁడు నీబిరుదము నిట్లే సమర్థించిరి. స్వకాల మందలి విద్వాంసులమెప్పు గాంచినయీమహాకవి సవినయముగాను సాహంకారముగాను తనవైదుష్యమును తానే మాలతీమాధవప్రస్తావ నలో నిట్లు వర్ణించుకొనియున్నాఁడు.

" యద్వేదాధ్యయనం తథోపనిషదాం సాంఖ్యస్య యోగస్య చ
జ్ఞానం తత్కథనేన కిం నహి తతః కశ్చి ద్గుణో నాటకే,
యత్ప్రౌఢిత్వ ముదారతా చ వచసాం య చ్చార్థతో గౌరవం,
త చ్చే దస్తి తత స్తదేవ గమకం పాండిత్యవైదగ్ధ్యయోః "

ఇతఁడు శుద్ధాద్వైతుఁడు అద్వైతులకు శివకేశవభేదము లే దనుట వాస్తవము. అయినను శివభక్తి తెలుచుగా వారియెడ గోచరించును. అందుకుఁ దగినట్లే యితఁడు శివస్తుతితోనే మాలతీమాధవ మారంభించి యున్నాఁడు. పూర్వమీమాంస చదివినవారి కుత్తరమీమాంస చదువ కున్న నుత్తమగతి లే దని విద్వల్లోకవిశ్వాసము. దానికిఁ దగిన ట్లితఁ డుత్తరమీమాంస పఠించి, బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానమే జీవన్ముక్తి యన్న పరమార్థము నెఱిఁగినవాఁ డని యితనిరామనాటకమంగళాచరణశ్లోక ములే తెలుపఁగలవు. మఱియు "ఏక మేవాద్వితీయం బ్రహ్మ" యనెడి యితనిమతవిశ్వాసము నుత్తరచరితషష్ఠాంకములో విద్యాధరోక్తిగా నున్నయీమాటయె తెలుపఁగలదు.

" బ్రహ్మణీవ వివర్తానాం క్వాపి విప్రలయః కృతః "

## కావ్యములు—కవిత్వప్రశంస

ఈప్రతిభాశాలి తొలిదొల్తనే రూపకరచనకు కడంగిననాట్యకలా భిమాని. భరతనాట్యశాస్త్రాదులు పఠించియు లక్షణమునకు లక్షణము

దిద్దినకళాచతురుఁడు, ఉత్పాత్యము ప్రఖ్యాతము మిశ్రము ననువూఁడు వృత్తములను గ్రహించి, శృంగారము వీరము కరుణము ననుమూఁడును ప్రధానరసములుగా మాలతీమాధవము మహావీరచరితము ఉత్తరరామచరితము ననుమూఁడురూపకములు క్రమముగానిర్మించి నాట్యసామ్రాజ్యాభిషిక్తుఁ డైననటరాజరాజునవతారము. అందుకే భవభూతి రాజశేఖరునిమూఁడవయవతార మని రాజశేఖరకవితనకై యితని నిట్లు స్తుతించియున్నాఁడు.

" బభూవ వల్మీకభవః కవిః పురా
 తతః ప్రపేదే భువి భర్తృమేంఠతామ్
 స్థితః పున ర్యో భవభూతిరేఖయా
 స వర్తతే సంప్రతి రాజశేఖరః "

ఇతనిభావరసపదన్యాసాదులు భావించి పరమానందము నొందిన తిలకమంజరీకర్త ధనపాలుఁ డితని నిట్లు కీర్తించినాఁడు.

" స్పష్టభావరసా చిత్రైః పదన్యాసైః ప్రవర్తితా
 నాటకేషు నటస్త్రీవ భారతీ భవభూతినా "

తరువాతివా రెవరో పొగడి రన్నమాట యెందుకు? ఇతనిసమకాలమువాఁడు, ఒకయాస్థానములో నితనితో నున్నవాఁడు నైనవాక్పతిరా జితనికావ్యామృత మాస్వాదించి తన "గఉడవహ" మనుకావ్యములో నన్నమాట లివి:—

" భవభూతిజలధినిర్గతకావ్యామృతరసకణా ఇవ స్ఫురన్తి
 యస్య విశేషా అద్యాపి వికటేషు కథానివేశేషు "

కృ తి ప రి శీ ల న ము

మాలతీమాధవములోని యితివృత్తము నితఁడు స్వదేశములోనే పుట్టించి పెంచెను. ఇందు బ్రాహ్మణు లైనమాలతీమాధవులు ప్రధాననాయికానాయకు లైనను, తత్తుల్యులై మదయంతికామకరందు లిందు

ప్రవర్తించిరి. వీరిమేలుకోరిన కామందకి ప్రౌఢబ్రహ్మచారిణి, సకల విద్యలునేర్చినది. ఇందు శృంగారము ప్రధానమైనను వీరకరుణాద్భుతాదు లంగములై యిందు ప్రధానరసముపోషింపఁ దొడఁగినవి. ప్రకరణనాయకుఁడు శాంతుఁడు కావలెనన్ననియమమున్నను ఇందు మాధవుఁడు మహామాంసవిక్రయమునకై చాముండాదేవిగుడిచెంత కేఁగుటయు, మాలతిని బలి యివ్వఁబూనినయఘోరఘంటునికత్తి లాగుకొని వానిని నఱుకుటయు, మకరందుఁడు శార్దూలముబారిఁ బడిన మదయంతికను దప్పించి యాపులిని నఱుకుటయు ననుచర్యలచే వారు వీరులైరి. ఇందు దేశాచారమతాచారవివిధనాగరకత లెన్నో సమయోచితముగా రసోచితముగా వర్ణింపఁబడి హృదయంగమము లగుచున్నవి.

ఈ ప్రకరణముపుట్టినది మొదలుగా నేఁటిదనుక భరతఖండము నలుగడల వ్యాపించియున్న దనుటకు దీనివ్యాఖ్యలే తార్కాణము. కవితాశైలి యందమై, అనర్గళము మృదుమధురము. ఇందుకు మాలతీసౌందర్యగర్భితమై కరుణ మెఁగఁజిమ్ముచున్నయీమాధవునిమాట యొకటియుఁ జాలును.

" అసారం సంసారం పరిముషితరత్నం త్రిభువనం
నిరాలోకం లోకం మరణశరణం బాంధవజనమ్,
అదర్పం కందర్పం జననయననిర్మాణ మఫలం
జగజ్జీర్ణారణ్యం కథ మసి విధాతుం వ్యవసితః"

ఇతఁడు భాసకాళిదాసులకవిత్వమందు తనకుఁ గలగౌరవాతిశయము నందించుక యిట్లు స్మరింపఁజేసినాఁడు. అవిమారకుఁ డాత్మహత్యాదోషము లేనియుపాయ మని మరుత్ప్రపాతమున కుద్యోగించినట్లే మాధవుఁడు మహామాంసవిక్రయముపేర మరణమునకు యత్నించె నన నచ్చును. ఇది యంతగా, జెప్పఁదగినయనుకరణము కాదందురేని, మేఘసందేశమందలి యాదరమున యక్షుఁడు దూత్యమునకై మేఘుని ప్రార్థించినట్లేమాధవుడు ప్రార్థించుటమాత్రము చెప్పఁదగినదే.

" దైవాత్పశ్యేర్జగతి విచరన్ మత్ప్రియాం మాలతీం చేత్,
ఆశ్వాస్యాదౌ తదను కథయే ర్మాధవీయా మవస్థామ్,
ఆశాతంతు ర్నచ కథయ తాత్యన్త ముచ్ఛేదనీయః
ప్రాణత్రాణాం కథ మపి కరో త్యాయతాక్ష్యా స్స ఏకః"

మహావీరచరిత్రలో కొన్నివిష్కంభములును దృతీయాంకమం తయు నితఁడు రూపకోచితముగాఁ గల్పించిన దైనను, ప్రధానకథ యంతయు రామాయణము ననుసరించిన దే. ఇందు దేశజ్ఞానము ఆథర్వణ విజ్ఞానము శ్రుతిస్మృతివిజ్ఞానము నెక్కువగాఁ బ్రకటించెను. "ప్రాగ్ధర్మస్య భవన్త ఏవ పరమం ద్రిష్టార ఆసన్" అనుచు ధర్మసంహితలలో వసిష్ఠ ధర్మసంహిత ప్రాచీన మైనదన్నభావము సూచించెను.

ఈనాటకము మాలతీమాధవమువలెఁ దొలుత నెల్లెడల నంతగా వ్యాపించలేదు. ఇతనికి పూర్వము రామాయణనాటకములు నిర్మించినవాఁడు భాసుఁ డొక్కఁడే ఇతఁడు రచియించుచుండఁగానో రచియించినతరువాతనో యితనిపోషకుఁ డైనయశోవర్మ రామాభ్యుదయము నిర్మించియుండును. ఈనాటకములో నైదవయంకమున.
" హంత ప్రత్యూత దారుణం వ్యవసితం ధి క్సఖ్య మేవంవిధమ్"

అనునంతవఱకే గ్రంథము నిలచినది. తరువాత రెండంకములున్నగ్రంథము నష్ట మైనది. దానిని సుబ్రహ్మణ్యకవి యనునర్వాచీనుఁడు పూరించెను. నేఁటిముద్రితపుస్తకములకు లభించినమాతృకలు పూరణముతోడివే. అట్లు గ్రంథము నశించుట కాకాలమున దీనికి వ్యాప్తి తక్కువయగుటయే హేతు వనుట నిజ మైనను, ఒకతంజావూరుప్రాఁతప్రతిలో నీక్రిందిమాట లున్నవి.
" శ్రీవస్యవాచా భవభూతిమహాకవినా విరచితం మహా
వీరచరిత మేతావ దే వాస్మి న్దేశే దృశ్యతే శేషంతు
రాజశేఖరేణ దగ్ధ మితి ప్రసిద్ధిః"

ఈప్రతీతి యెట్లు పుట్టినదో కాని, యితని నీశ్వరావతారముగా స్తుతించినయతం డట్టిఘోరకృత్యము చేసె నన్న నెవరు విశ్వసింతురు! ఇది నన్నయభట్టారకుం డధర్వణభారతము తగులఁబెట్టించె ననుటవంటిది. కొంద ఱిట్లు నిర్హేతుకముగా నపవాదపా లగుట యెప్పుడు నున్నదే. ఇంక—ఉత్తరరామచరితనాటకము:—

"యం బ్రాహ్మణ మియం దేవీ వా గ్వశ్యే వాన్వవర్తత"

అని తనవశ్యవాక్త్వము వెల్లడించినయీకవిబ్రహ్మ దేనిని నిత్యము పారాయణము చేసి వశ్యవాణి యయ్యెనో ఆరామాయణము నిట్లు వర్ణించి వాల్మీకిపరోక్షశిష్యత్వమును బ్రకటించుకొనెను.

"చిత్ర మామ్నాయా దన్యత్ర నూతన శ్ఛన్దసా మవతారః"

"అథ భగవాన్ ప్రాచేతసః ప్రథమం మనుష్యేషు శబ్ద
బ్రహ్మణ స్తాదృశం వివర్త మితిహాసం రామాయణ
మృషిః ప్రణినాయ"

ఈతత్త్వము తెలిసికదా నీలకంఠదీక్షితులు "ప్రాచేతసేనయానీతేత్యాదిగా స్తుతించినాఁడు!" ఇందలిరసము తనివి దీర నాస్వాదించికదా యింకొక మహనీయుఁ డిట్లు నిజము చెప్పినాఁడు!

"భవభూతికవే ర్వాచః స్వదన్తే రసరంజితాః,
సుమనోభ్య స్సుధాస్యందిబంధమాధుర్యబంధురాః"

ఇందలియితివృత్తము చిత్రము మిశ్రము నై అననుమేయకల్పనమున విలసిల్లుచున్నది. దీనికి శోభ దెచ్చినవి చిత్రప్రదర్శనపంచవటీరంగములును, అంతర్నాటకమును. ఇందలిప్రధానరసము కరుణ మనుట విదితము, అరుంధతీకౌసల్యాజనకసమావేశమందును, శ్రీరామకుశలసమావేశమందును భవభూతి చూపినపాత్రౌచితియు రసౌచితియు ననుకరించుట కుఁగూడ నశక్యములు కదా! ఇందలిప్రధానరసము కరుణమే యని ముందుగా కవియే—

"దేవీ ఊటఅడిల్లుమూఅడిల్లుము" అనుచునాటకమారంభించినాఁడు——

"బహువిధం బైనదుఃఖానుభవముకొఱకె, నేను శ్రీరాముఁ డనఁగ జన్మించినాఁడ"

"రాముకరుణరసంబు దురంతతాపకారియై పుటపాకసంకాశ మయ్యె"

"ఇపుడైన విలాపము లాభమేకదా" ఇత్యాదిగా జ్ఞాపకముచేయుచు వచ్చినాఁడు. అక్కడికి తృప్తి లేక యిట్లు నిర్ణయించినాఁడు.

"ఏకో రసః కరుణ ఏవ నిమిత్తభేదాత్
భిన్నః పృథ క్పృథ గి వాశ్రయతే వివర్తాౝ
ఆవర్తబుద్బుదతరంగమయా న్వికారా,
నంభో యథా సలిల మేవహి త త్సమస్తమ్"

"కరుణరస మొక్కటే వేఱుకారణముల
వేఱువేఱువిధంబుల మాఱుచుండు,
సలిల మొక్కటె బిందుతుషారభంగ
బుద్బుదావర్తరూపముల్ పొందునట్లు"

తరువాత భోజరాజు "శృంగార ఏక ఏవ రసః" అని తనశాస్త్రముచే సిద్ధాంతీకరించినాఁడుగాని, అంతకుముందే మనకవి "ఏకోరసః కరుణఏవ" యని చెప్పి, చెప్పినట్లుచేసి సామాజికులచే సిద్ధాంతీకరింపఁ జేసినాఁడు, వాల్మీకిచే వ్రాయించినయంతర్నాటకప్రస్తావనలో నిది కరుణాద్భుతమిశ్ర మనిసూత్రధారునిచేఁ జెప్పించినాఁడు. ఆనాటకము చూచిననాయకునిచే "హా సచ్చరితదేవతా! దీనినిబట్టి నీవులోకాంతరమున విశ్రమించియున్నా వనుట నిశ్చయ" మనిపించి మూర్ఛిల్లఁజేసినాఁడు. ఇంక, తరువాతిగొడవ యెందుకు?

జనాపవాదమునుబట్టి రాముఁడు సీతను వాల్మీక్యాశ్రమము చెంత విడిచిపెట్టించె నన్నముఖ్యవిషయమునుమాత్రమే యుత్తరోత్తర

1. పాఠకుల కీయీమాటలు తెలిగించిననానాటకమునుండిమాత్రేని.

కారడమునుండి గ్రహించి తక్కినకథాంశముల నెల్ల దృశ్యకావ్యోచితముగాఁ గల్పించియున్నాఁడు. వాల్మీకి త్రిప్పినదక్షిణారణ్యమార్గముల నితదలి రాముఁడు తిరుగుటయు, అతఁడు చూపనిగోదావరీతీరగిరికాననాది విశేషము లెన్నో చూచుటయు నిందుకు నిదర్శనము. గోదావరియంటే భవభూతికి ప్రాణము. యశోవర్మయాస్థానమునఁ జేరకపూర్వ మితఁడెన్నిసార్లు గిరికాననసహజశోభ గాంచుచు గోదావరీప్రదక్షిణము చేసి నాఁడో యూహింపఁజాలముగాని, అక్కడికి వెళ్ళినపిదపఁ గూడా తఱచుచుగా గోదావరీతీర్థయాత్ర చేయుచునే వచ్చె నని యిందలిగోదావరీతీర వర్ణనమే వేనోళ్ళఁ జాటుచున్నది. జన్మస్థలాభిమాన మట్టిదే కదా!

ప్రస్రవణాద్రిమీఁదితమయునికిని జ్ఞాపకముచేయుచు రాముఁడు సీతతో నన్నయీమాటలు జనస్థానము కొన్నాళ్ళు భవభూతివిహారస్థానమై యుండు నని చెప్పకపోవునా!

“స్మరసి సుతను! తస్మిన్ పర్వతే లక్ష్మణేన” నిత్యాదిశ్లోకము.

“ తలఁతువె లక్ష్మణుండు బహుధా పరిచర్యలు చేయ దానిపై
నలగుచునున్నయాదినము ? లాసరసోదక గౌతమీనదిన్
దలఁతువె ! దానిచెంతఁ బులినంబుల ముచ్చటలాడుచున్కియుం
దలఁతువె ! నాఁటివర్తన మెఱుం దలఁతే లలితాంగి జానకీ ! ”

ఈకథలో, తృతీయాంకమందు జనస్థానరంగముతోఁ గూడా జానకి నీకవిబ్రహ్మ క్రొత్తగా సృజించినాఁడు గాని, పిల్లలు పాలు విడిచినంతనే తనతల్లిలో విలయ మొందినసత్యసీత యెక్కడిది ? అయితేనేమి ? ప్రకృతిసౌందర్యవర్ణనపాఠము చెప్పిన పంచవటియందలి యభిమానమునే సీతారాముల నిద్దఱ చేర్చి విలపింపఁజేసినయీరంగమే రసమున కాలయముపట్టు పాత్రౌచిత్యమునకు పరమోదాహరణ మైనది—ఇఁక వర్ణనలందామా, అకృత్రిమములు ఆనందకందములు, స్వాభావసిద్ధములు సాంసారికములు సాంఘికములు సామాజికరంజకములు—సీతాపహృదయావస్థల నిట్లు తమసవర్ణించుచున్నవి.

" తటస్థం నైరాశ్యా దపిచ కలుషం విప్రియవశా "దిత్యాది–

" ఎఱిగి యూరకయ న న్నొడఁబాసె నితఁ డొంతవంచనం బని కోపగిం
చినట్లు
నాయాస లడుగంటె నా కెందు కిఁక నంచు నాస్థ మాని తటస్థ
మైనయట్లు,
ఘనవియోగమున నాకస్మికఘటనచేఁ బరవశంబయి భ్రమానుపడినయట్లు
సహజసౌజన్యభాస్వర మాటఁ బతిభక్తి నల్కఁ దేఱి ప్రసన్న మైనయట్లు

గీ. భర్తదుఃఖంబునకు దుఃఖపడినయట్లు
ఘనతరం బగుననురక్తిఁ గరఁగినట్లు
పాలుపో కున్నయట్లు నీపట్టునందు
నీదుహృదయంబు గనవచ్చు నిర్మలాంగి !

ఆహా ! ఒక్కనిమిషములో నంకురించినయిన్నిహృదయవికార ములనొక్కమాలుగా నీప్రతిభాయోగి యేయంత్రమున కనిపెట్టెనో, దానిని కనుఁగొన్నచతురుఁడు నేటికి పుట్టలేదు. భవభూతిప్రతిభావిశేష మనని దే. ఇతనికరుణరసమర్మజ్ఞత యన నిదే. అందుకే గోవర్ధనాచార్యుఁడు "అపిగ్రావారోదిత్యపిదళతివజ్రస్యహృదయ" మ్మనువాక్యముచదివి పరవశుఁడై, యిట్లుస్తుతించినాఁడు.

" భవభూతే స్సంబంధా ద్భూధరభూరేవ భారతీ భాతి,
ఏతత్కృతకారుణ్యే కి మన్యథా రోదితి గ్రావా "

భవభూతితోడిస్నేహమువల్ల పర్వతప్రదేశమే వాగ్రూపముధరించినట్లుకనఁబడుచున్నది. అట్లుకాకపోతే, జాలిపుట్టించెడియితని మాటలకు రాయియేడ్చునా ?

ఈనాటకములో నెక్కడపట్టిన నక్కడకరుణముగాక మతేమి కన వచ్చును ?—సుమంత్రుఁడు శౌర్యముచూపులవని చూచి సీతకొడుకే యాయనుకొని, అయోధ్యాపితదారిని పోయెదవేమని మహిన్నులోనను.

మనోరథస్యయద్బీజమిత్యాది–

గీ. నీదుకొమల కెత్తునభిలాష కాదియైన
బీజమును ముందుగా దుష్టవిధి హరించె,
హృదయమా! యెక్కడైనను మొదలుకోసి
నట్టిలీఁగను మొగ్గలుపుట్టు నొక్కొ?

కుశలవులనురాముఁడు చూచితనకొడుకులేమోయని యూహిం చుచు, కంటినీరుపెట్ట, అదేమండీ! యనిలవుఁడనును. అదేమిటిరా! అట్లడిగెదవు? అనిమందలించి కుశుఁడిట్లనును.

"వినా సీతాదేవ్యా కిమివ నచ దుఃఖ మిత్యాది—"

ఉ. ఆయెను సీత లేనిబ్రతు కక్కట! దుఃఖము రాదె తేనికిఁ?
ప్రేయసి పోయినన్ జగము పెద్దయరణ్యము, వారిప్రేమ మ
జ్ఞేయ మపార మీవిరహసింధువు దీని నెఱుంగవొక్కొ? రా
మాయణ మెన్నఁడుం జదువనట్టులు ప్రశ్నలు వేయఁజూతువే?

ఈమహాకవికి కరుణరసమువలెనే నదీగిరికాననమృగాదులలో గోదావరి ప్రస్రవణాద్రి పంచవటి ఏనుఁగు లేడి నెమలి కదిమిచెట్టు, అత్యంతప్రియములు. వృత్తములలో శిఖరిణి ప్రియము, ఈమాట క్షేమేం ద్రుఁడు సువృత్తతిలకములో తెలియఁజేసినాఁడు.

"భవభూతే శ్శిఖరిణీ నిరర్గళతరంగిణీ,
చకితా ఘనసందర్భే యా మయూరీవ నృత్యతి"

ఈమహాకవికృతు లీమూఁడే లోకమున వ్యాప్తములై యున్నవి కాని, సంకలనగ్రంథములలో నందం దితనిపేర ౧౨ శ్లోకములు కన వచ్చుచున్నవి. వానిరీతిచూడఁగా నవి యితని చాటువులైతే కావ చ్చును గాని, యొకగ్రంథములోనివికా వని తోచినది. అందలివి రెండు

కల్పాంతమందలిక్షౌద్ర మైనయీశ్వరునికపాలవ్రత మిట్లు వర్ణిం పఁబడినది.

" వైకుంఠస్య కరంక మంకనిహితం, స్రష్టుః కపాలం కరే,
ప్రత్యంగం చ విభూషణం విరచితం నాకౌకసాం కీకసైః,
భస్మ స్థావరజంగమస్య జగత స్స్వభ్రం తనౌ బిభ్రతః,
కల్పాంతేషు కపాలినో విజయతే రౌద్రం కపాలవ్రతం "

తక్కినవి:—

" శౌర్యం శత్రుకులక్షయావధి యశో బ్రహ్మాండభాండావధి,
త్యాగ స్సప్తసముద్రముద్రితమహీ నిర్వ్యాజదానావధిః,
వీర్యం యత్తు గిరాం న తత్పథి నను వ్యక్తంహి తత్కర్మభిః.
సత్యం బ్రహ్మతపోనిధే ర్భగవతః కింకిం న లోకోత్తరమ్ "

" ఉషసి గురుసమక్షం లజ్జమానా మృగాక్షీ,
రతిరత మనుకర్తుం రాజకీరే ప్రవృత్తే,
తిరయతి శిశులీలానర్తనచ్ఛద్మతాల
ప్రచలవలయమాలాస్ఫాలకోలాహలేన "

" భువాం ఘర్మారంభే పవనచలితం తాపహతయే,
పటచ్ఛత్రాకారం వహతి గగనం ధూళిపటలం,
అమీ మందారాణాం దవదహన సందేహితధియో,
న శాకంతే పాతుం ఝుకితి మకరందం మధులిహః "

ప్రత్యేకగ్రంథముగా వ్రాయఁదగినమహాకవుల జీవితములు కొన్ని యున్నవి. అందు భవభూతి దొకటి. ఇతనికృతులు చదివి యానంది కావలసినదే కాని యందుకు వేఱుమార్గము లేదు. ఇంక లోకములో అప్రతిమాన మహాహ్లాదకరమునై వ్యాపించిన "కిమపి కిమపి మందంమంద మిత్యాదిశ్లోకమునకు నాయనువాద ముదాహరించి దీనికి స్వస్తి చెప్పెదను.

" ఒక్కొక బాహుతోడ నొడ లుబ్బఁగ బిగ్గఁ గవుంగిలించి, ను
న్నక్కిళు లొక్కటై కదియ నెమ్మదిగా మన మేమి యేమియో

మక్కువ మీఱ మాటపయిమాటగ ముచ్చట లాడుకొంచు న
న్నక్కడినాఁటిరాత్రి నలుయామము లంతన యంతరింపవే!
ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే.

—:0:—

## వాక్పతి రాజు

ఇతఁడు పూర్వోక్తయశోవర్మయాస్థానమున నున్నప్రాకృతమహా కవి, భవభూతిమిత్రుఁడు, హర్షదేవునితనయుఁడు. గౌడవహ మనుకావ్యము నిర్మించి ఖ్యాతి గన్నసత్కవీంద్రుఁడు, సంస్కృతసాహిత్యనిష్ణాతుఁడు. ఇతఁడు నిర్మించినసంస్కృతకావ్య మేదియు కనరాదుగాని, అందందు కనవచ్చిన విష్ణుస్తుతిశ్లోకములనుబట్టి యితఁ డేదేనిస్తుతికావ్యము రచించి యుండునని తోఁచినది. విష్ణుభక్తుఁ డైనయీకవిశ్లోకములు రెండు.

"సే యం ద్యౌ స్తదిదం శశాంకదినకృ చ్చిహ్నం నభ స్సా క్షితిః
త త్పాతాలతలం తవేవ గిరయ స్తేఽంభోధరా స్తా దిశః
ఇత్థం నాభి వినిర్గతేన సశిరః కంపాద్భుతం వేధసా,
య స్యా న్తశ్చ బహిశ్చ దృష్ట మఖిలం త్రైలోక్య మవ్యా త్సవః"
"ఖర్వ్యగ్రంథి విముక్త సంధి వికసద్వక్షఃస్ఫురత్కౌస్తుభం,
నిర్యన్నాభిసరోజకుట్మలకుటీగంభీరసామధ్వని,
పాత్రావాప్తిసముత్సుకేన బలినా సానంద మాలోకితం
పాయా ద్వః క్రమవర్ధమానమహిమాశ్చర్యం మురారే ర్వపుః"

# విశాఖదత్తుఁడు



గొప్పనాటకకర్తలలో నితఁ డొకఁడు. వీరరసప్రధానము రాజనీతిప్రయోగబంధురము చరిత్రాత్మకము నైనయితనిముద్రారాక్షసము సాటిలేనిది. ఇందలిప్రధానేతివృత్తమునకు మూలము గుణాఢ్యునిబృహత్కథలోనినందమౌర్యకథాంశమని "తత్ర బృహత్కథామూలం ముద్రారాక్షసం" దశరూపకవ్యాఖ్యలో ధనికుఁడు చెప్పియున్నాఁడు. అది సత్యము. దానినిబట్టి గుణాఢ్యునినాఁటికి నందరాజమౌర్యకథ లోకమున నితిహాస మగుటచేతనే యతఁడు బృహత్కథలోదానిని వర్ణించె ననుట స్పష్టము. ఇందలిచంద్రగుప్తకౌటిల్యులకాలము విమర్శకులయభిప్రాయభేదములపాలై సునిశ్చితము కానిమాట నిజమే కాని, ఎట్లయినను పుష్పమిత్రుని పేర్కొన్నపతంజలికంటె [క్రీ.పూ. 320] వా రిద్దఱు పూర్వు లనుట విదితము గావున నీకథ క్రీ. పూ. ఆఱవశతాబ్దిలోనిదై యుండు నని యూహింపఁబడుచున్నది. ఈవిషయమునుగూర్చియు, ముద్రారాక్షసకాలమునుగూర్చియు విమర్శకాభిప్రాయములు నాసంస్కృతవాఙ్మయచరిత్రద్వితీయభాగమున చూడనగును.

ఈనాటకప్రస్తావననుబట్టి యీకవి సామంతరాజైనవటేశ్వరదత్తునిపౌత్త్రుఁడు మహారాజైన పృథున్‌పాలునిపుత్త్రుఁడు నని మాత్రము తెలిసినది. ఇతఁ డేకాలమువాఁడను విషయము పరామర్శించినవారిమార్గము లన్నియు విభిన్నములే కాని యొకప్రమాణముమాత్ర మొకింత దారి చూపినది. ఈనాటకము ద్వితీయాంకమున విరాధగుప్తుఁ డమాత్యరాక్షసునితో నన్నమాట లివి.

"ప్రారభ్యతే నఖలు విఘ్నభయేన నీచైః,
పారభ్య విఘ్నవిహతా విరమన్తి మధ్యాః,

విఘ్నైః పునః పునరపి ప్రతిహన్యమానాః
ప్రారబ్ధ ముత్తమగుణా స్త్వమి వోద్వహన్తి"

ఈశ్లోకము "నపరిత్యజన్తి" అనుకడపటిమాటలమార్పుతో భర్తృహరినీతిశతకమున కనఁబడుచున్నది. దశరూపకావలోకముద్వితీయప్రకాశమున ధనికుఁడు "యథావాభర్తృహరిశతకే" అనుచు నాయకునిస్థిరత్వమునకు మొదటిపాఠముతోడిశ్లోకము నట్లె యుదాహరించియున్నాఁడు. దీనినిబట్టి పైముద్రారాక్షసనాటకశ్లోకమును భర్తృహరినీతిశతకమున చేర్చినవారు మార్పేమియు చేయలేదనియు, తరువాతివారెవరో నీతిశతకములో-త్వమివోద్వహన్తి-పాఠము సుసంగతము కాకుండుట తెలిసి-నపరిత్యజన్తి-పాఠముచేర్చిరనియు తత్వము తేలినది[1]. భర్తృహరినీతిశతకములో నిట్లె యితరులశ్లోకములు కొన్ని చేరిన వనుట విదితమే కావున పైశ్లోకము ముద్రారాక్షసములోని దనువిషయమున నెవ్వరును సంశయింపలేరు. దీనినిబట్టి శా. ౯౧౦ ప్రాంతమందలిధనికుఁడు ముద్రారాక్షసము నెఱిఁగియుండుటయేగాక యప్పటికే పైశ్లోకము భర్తృహరినీతిశతకములో ప్రవేశించుటచే నట్లు ప్రమాదపడివ్రాసినా, యీనాటక మతనికంటె నెంతో ముందు పుట్టినదే యన్నసత్యవిషయము మాత్రము బయటఁబడినది. ఈప్రమాణమువల్ల విశాఖదత్తుఁడు క్రీ. ౧౦-౧౧-౧౨ శతాబ్దుల లోనివాఁడన్నవిమర్శకులమతము లన్నియు ప్రతిహతము లైనవి. ఇంక, వామనాచార్యునికిని ఆనందవర్ధనాచార్యునికిని ముద్రారాక్షసము దొరకలేదని యూహించినచో, వారీనాటకములోనిశ్లోకములను తమలక్షణములం దుదాహరింపలేదన్నయాక్షేపమును త్రోసిపుచ్చి వారికంటె నితఁడు పూర్వుఁడని భావింపవచ్చును.

ఈనాటకములో పేర్కొనఁబడిన శకయవనమ్లేచ్ఛహూణాదు లసలుకథ జరిగిననాఁటివారనుట సహజమై యుండఁగా, మలయకేతువు

1. ఇప్పటి బొంబాయిముద్రణములో మొదటిపాఠము క్రిందికిని రెండవపాఠము మూలములోనికిని చేరుట చిత్రమే.

సేనలోనియవనులు గ్రీకులై యుందు రని భావించి వారు హిందూదేశమునకు వచ్చినసమయమున కీనాటకరచన సరిపెట్టఁజూచుట తగదు. అట్లే బౌద్ధప్రసంగ మున్నదిగదా యనిబౌద్ధమతము హెచ్చుగా నున్న కాలమునకు దీనిని ముడిపెట్టుటయు సమంజసము కాదు. సరి యైనప్రత్యక్షప్రమాణము లభింపకపోవుటచే వారు వారు త్రొక్కినవేఱువేఱు త్రోవలే యీకవికాల మిద మిత్థ మని నిశ్చయించుటకు వీలుకానిదని తెల్పుచున్నవి. అందుచే చర్వితచర్వణముగా వారివ్రాఁత లిందు తెలిపి విమర్శించుట యనావశ్యకము. అది గాక, కాశీనాథత్ర్యంబకతెలాంగు పండితులు ప్రాచ్యపాశ్చాత్యమతము లన్నియు పరామర్శించి, యీరూపకము క్రీ. ఎనిమిదవశతాబ్దిపూర్వభాగములో నిదని భావించిరి. అది, శా. ౬౭౦ ప్రాంతమగును. అది శా. ౭౩౦ ప్రాంతమందలివామనాచార్యునికాలమున కించుక పూర్వ మగును. కాదేని, వామనునికావ్యాలంకారసూత్రవృత్తి కీనాటకము సమకాలికమైనా యగును. అంత కంటె నర్వాచీనము మాత్రముకాదు.

నాటకాంతమందు భరతవాక్యముగా నున్నశ్లోకములో నున్న "పార్థివ శ్చంద్రగుప్తః" అనుమాటను తీసికొని, శకులను హూణులను జయించిన చంద్రగుప్తవిక్రమాదిత్యుఁడే యీచంద్రగుప్తుఁ డని భావించి యతని నాశీర్వదించినశ్లోకముతోడి యీనాటకము క్రీ. ౩౮౦ ప్రాంతమున పుట్టినదేమో యని కొంద ఱూహించిరి గాని, మఱికొంద ఱది సముచితము కా దని ఖండించిరి. ఆభరతవాక్యములో నున్న చివరిపదము "స శ్రీమద్బంధుభృత్య శ్చిర మవతు మహీం పార్థివ శ్చంద్రగుప్తః" అని ముద్రితపుస్తకములలో నిపుడు కనవచ్చెడి—చంద్రగుప్తః అనునదికాదనియు, పార్థివోఽవన్తివర్మా, పార్థివోర న్తివర్మా, పార్థివోదన్తివర్మా—అనుచు మూఁడువిధము లైనపాఠములు లిఖితపుస్తకములలో నున్నవనియు, ఇందు కడపటిపాఠము సరి యనియు, ఆదంతివర్మ క్రీ. ౭౭౯—

౬౩౦ నడుమ పల్లవరాజ్యముపాలించినవాఁ డనియు చెప్పుచు, అతనికి దీవనగా నున్నయీ శ్లోకముతోడినాటకము శా. ౭౦౦ ప్రాంతములోని దని భావించిరి. ఈభావన మనపూర్వోక్తకాలమున కనుగుణము గానే యున్నది గాని, ఈపాఠాంతరము సర్వవిమర్శకసమ్మతము కాదు.

చాణక్యుఁడు చంద్రగుప్తుని నందసింహాసనమునఁ బ్రతిష్ఠించి, వివిధోపాయములు పన్ని మంత్రిరాక్షసు నతనిమంత్రిఁగాఁ జేయుట యిందలిప్రధానవస్తువు. చందనదాసునింట దొరకినమంత్రిరాక్షసుని యుంగరము (ముద్ర) ఆధారముగా నతఁడు వశ్యుఁ డగుటచే నిది ముద్రారాక్షస మైనది. కథాకల్పన మతిగభీరము. కవిత్వము మృదు మధురము ప్రౌఢము—రాజనీతి కుశలుఁ డైన రాక్షసుఁడు చాణక్యు నికిఁ దీసిపోవువాఁడు కాఁడు. అయిన నేమి? తనయుంగరమును చందన దాసును శత్రుహస్తమునఁ బడుట మొదలుగాఁ గలకొన్ని హేతువులచే రాక్షసునియుపాయములు ఫలించినవి కావు. అది గాక, అధికారము చేతిలో నున్నచాణక్యునివంచనముతోడి రాజనీతి కతనినీతి చాలినది కాదు. ప్రాణమిత్రుఁ డైనచందనదాసు తనకై శత్రువశ్యుఁ డగుట యెఱిఁగి విచారించినరాక్షసునిమాట లివి:—

“ కిం గచ్ఛామి తపోవనం? న తపసా శామ్యే త్సవైరం మనః
కిం భర్తౄ ననుయామి? జీవతి రిపౌ స్త్రీణా మియం యోగ్యతా
కింవా ఖడ్గసఖః పతా మ్యరిబలే? నై తచ్చ యుక్తం భవేత్,
చేత శ్చందనదాసమోక్షరభసం రుద్ధ్యాత్ కృతఘ్నం నచేత్”

మంత్రిరాక్షసుఁడు గొప్పరాజనీతివేత్త. అయితే నేమి? దైవ ప్రాతికూల్యమున నతనియెత్తులు విఫల మైనవి. చాణక్యుని యుపా యము లన్నియు సఫలమైనవి. చందనదాసు బద్ధుఁడు గాకపోతే రాక్ష సుఁడు లొంగఁడు. అతనిని లొంగదీసి మంత్రిఁగాఁ జేయకపోతే చంద్ర గుప్తునిరాజ్యము నిలవదు. తుద కంతే యైనది. ఎత్తుపై యెత్తుగా

నప్పటి కవులకు పేక్షకు లాశ్చర్యవిషాదసంతోషపరవశులై కథామయ హృదయు లగునట్లు బహుపాత్రములను ప్రవర్తింపఁజేసి రసోచితముగాఁ బోషించినయీకవిప్రతిభ యనన్యసామాన్యము. ఇచ్చటనొక్కమాట—

" అమాత్యరాక్షస! సాధుసాధు మంత్రిబృహస్పతే!
సాధుసాధు-శ్రోత్రియోత్తమ! సాధుసాధు"

అనుచు, లోకములో ధనాశచే రాజును సేవించువా రున్నారు గాని, చచ్చినరాజులకోసము నీవలె కార్యభారము వహించిన రాజభక్తిపరు లెందును లేరు సుమీ! యనుచురాక్షసుని బొగడిన యీరాజనీతిజ్ఞుని గుణజ్ఞత యెట్టిదో చూడుఁడు.

" ఐశ్వర్యా దనపేత మీశ్వర మయం లోకో ఽర్థత స్సేవతే,
తం గచ్ఛం త్యను యే విపత్తిషు పున స్తే తత్ప్రతిష్ఠాశయా,
భర్తు ర్యే ప్రలయేఽపి పూర్వసుకృతాసంగేన నిస్సంగయా,
భక్త్యా కార్యధురం వహన్తి బహవ స్తే దుర్లభా స్త్వాదృశాః "

ఈమహాకవి రచియించినమఱియొకకృతి యేదియు నిప్పటికి లభింపలేదు గాని, యితనిపిగా సుభాషితావళిసదుక్తికర్ణామృతము మొదలగు సంకలనగ్రంథములలో ౧౨శ్లోకములు కనఁబడుచున్నవి. అందు వైరాగ్యబోధకములు కొన్ని. అందితరుల వని యాలంకారికులు గుర్తించినవి రెండు.ముద్రారాక్షసములోనివే యనుకొన్నవి కొన్ని.కాని,యిందు కనఁబడవు. అందుచే నీవిషయము నిర్ణయింపరాదు. అయినా, ఒక్కశ్లోకము:

" రామోఽసౌ భువనేషు విక్రమగుణైః ప్రాప్తః ప్రసిద్ధిం పరా
మస్మద్భాగ్యవిపర్యయా ద్యది పరం దేవో న జానాతి తమ్,
వందీ వైష యశాంసి గాయతి మరు ద్యస్యైకబాణాహతి
శ్రేణీభూతవిశాలసాలవివరోద్గీర్ణై స్స్వరై స్సప్తభిః "

ఇందు శ్రీరాముఁడు సప్తతాళములను కూల్చుట చమత్కారముగా వర్ణింపఁబడినది.

—:0:—

# స్త్రీ కవులు

సంస్కృతములో కవిత చెప్పి తమనాఁటివారి మెప్పు గాంచిన స్త్రీలు పెక్కుండ్రు వినవచ్చుచున్నారు. అందు కొందఱి రచనలు కన రావు గాని వారి ప్రశంసలు కనవచ్చును. చాలామందికాలమును గోచ రింపకున్నది. అయినా, ప్రాచీననాగరకతకు జ్ఞాపకముగా తెలిసినంత వఱకు వారి నందఱి నొక్కచో స్మరింతము. రాజశేఖరునికవివిమర్శము లోనివిగా నీక్రిందిశ్లోకములు కనవచ్చును. వీరిలో ప్రశంసింపఁబడిన కవయిత్రులలో కొందఱు, ధనదేవునివిగా శార్ఙ్గధరపద్ధతిలో కనవచ్చు శ్లోకములందును కనవత్తురు వారినామములతో డిపద్య మిది.

"శీలా విజ్జా మారులా మోరికాద్యాః,
కావ్యం కర్తుం సన్తి విజ్ఞాః స్త్రియోఽపి
విద్యాం వేత్తుం వాదినో నిర్విజేతుం,
విశ్వం వక్తుం యః ప్రవీణః స వంద్యః.

వీరిలో ముందు విజ్జ—

—:0:—

# విజయాంక

ఈమెకు విజ్జా విజ్జికా విజ్జకా, అనునామాంతరములు కలవు. సరస్వతి బిరుదనామము. ఈక్రిందిచాటుపద్యము విజ్జక శ్యామలాంగి సరస్వతీబిరుదాంక, దండిమహాకవి కర్వాచీన యని తెలుపుచున్నది.

"నీలోత్పలదళశ్యామాం విజ్జకాం తా మజానతా.
వృథైవ దండినా ప్రోక్తా సర్వశుక్లా సరస్వతీ"

వైదర్భీరీతికవితలో నీమె కాళిదాసువంటి దని రాజశేఖరునిస్తుతి వచన మిట్లున్నది.

"సరస్వతీవ కర్ణాటీ విజయాంకా జయ త్యసౌ,
యా వైదర్భగిరాం వాసః కాళిదాసా దన న్తరమ్"

ఈమె తాను కర్ణాటరాజప్రియురాల ననియు, పద్యగద్యకవితలో తన్ను మెప్పించినవారియెడమకాలు నెత్తిని పెట్టుకొందు ననియు వినయము గర్వము తోడం జెప్పినమాట లివి.

"ఏకోఽభూ న్నలినా త్తతశ్చ పులినా ద్వల్మీకత శ్చాపరః,
తే సర్వే కవయో భవంతి గురవ స్తేభ్యో నమస్కుర్మహే,
అర్వాంచో యది పద్యగద్యరచనై శ్చేత శ్చమత్కుర్వతే
తేషాం మూర్ధ్ని దధామి వామచరణం కర్ణాటరాజప్రియా"

ఈకర్ణాటకరాజుపే రేమో! ఎక్కడివాఁడో! ఎప్పటివాఁడో! తెలియదు—ఇంక, ధనికుఁడు దశరూపకవ్యాఖ్యలో విజ్జకపేర నుదాహరించినశ్లోక మిది. ఇది మొదలుగా నిందు చూపుశ్లోకములనుబట్టి యీమె కవిత యెంతటిరసవంతమో తెలియఁగలదు, ఇందు జారిణి మఱుఁగు మాటలరీతి తెలియనయ్యెడి.

"దృష్టిం హే ప్రతివేశిని! క్షణ మహా ప్యస్మిన్ గృహే దాస్యసి,
ప్రాయే ణాస్య శిశోః పితా న విరసాః కౌపీ రపః పాస్యతి,
ఏకాకి న్యపి యామి తద్వర మితః స్రోత స్తమాలాకులం,
నీరంధ్రా స్తను మాలిఖన్తు జరఠచ్ఛేదానలగ్రంథయః"

ఈక్రిందిపద్యములో, వేశ్యమాత కూఁతురికి చేయునుపదేశము—

"వయం బాల్యే బాలాం స్తరుణిమని యూనః పరిణతా
వపీచ్ఛామో వృద్ధాం స్తదిహ కులరక్షా సముచితా,
త్వ యారబ్ధం జన్మ క్షపయితు మనే నైకపతినా
న నో గోత్రే పుత్రి క్వచిదపి సతీలాంఛన మభూత్"

మోదుగుమొగ్గలోనికింజల్కమును మన్మథునిధనుస్సుతో పోల్చి యిట్లు వర్ణించినది.

" కింశుకకలికాంతర్గత, మిందుకలాస్పర్ధి కేసరం భాతి.
రక్తనిచోళకపిహితం ధనురివ జతుముద్రితం మనంగస్య "
ఈక్రిందిమన్మథోపాలంభ మపూర్వ మనఁదగును.
" దేవేన ప్రథమం జితోఽసి శశభృల్లేఖాభృతాఽనంతరం.
బుద్ధే నోద్ధతబుద్ధినా స్మర! తతః కాంతేన పాంథేన మే,
త్యక్త్వా తాఙ్ బత హంసి మా మతికృశాం బాలా మనాథస్త్రియం
ధి క్త్వాం ధి క్తవ పౌరుషం ధి గుదయం ధి క్కార్ముకం ధి క్శరాఙ్ "
వ్యంగ్యప్రధానకావ్యము మనోహర మని వర్ణించినపద్య మిది-
" కవే రభిప్రాయ మశబ్దగోచరం, స్ఫురంత మార్ద్రేషు పదేషు కేవలం,
వదద్భి రంగైః కృతరోమవిక్రియై,ర్జనస్య తూష్ణింభవతోఽయమంజలిః,
పద్యసంకలనగ్రంథములం దిట్టిపద్యము లింకను గలవు " విద్యాయాః"
అనుపేర. ఇట్టిసరసకవిత నేర్చినయీవిజయాంక తనకాలమున "సరస్వతి"
యని పొగడొందిన దనుటయే మన కిపుడు తెలిసినది —

కొందఱు పరిశోధకులు, కర్ణాటదేశముసరిహద్దున నున్నమహారాష్ట్రమండల మేలినచంద్రాదిత్యునిరాణి విజయభట్టారిక యీవిజయాంకయై యుండు నని భావించిరి గాని[1] జారిణీచర్యాదులను వర్ణించిన యీమె రాజధర్మపత్ని యగునా యని సంశయము కలుగకపోదు. దండి కర్వాచీనురా లగునీవిజ్జక, శా. ౭౦౦ప్రాంతమున నున్నదికావచ్చును.

---

## శీలాదేవి

రాజశేఖరుఁ డీశీల నిట్లు స్తుతించియున్నాఁడు.
" శబ్దార్థయో స్సమో గుంఫః పాంచాలీ రీతి రుచ్యతే,
శీలా భట్టారికావాచి బాణోక్తిషుచ సా యది "

---

1. చూ, సంస్కృతకవిచర్చ- (హిందీలో)

భట్టారిక యనఁబడిన యీయామె రాజపత్ని కావచ్చును. లేదా, వైదుష్యముచే పూజ్యురాలైనయుత్తమకులస్త్రీ కావచ్చును. బాణ భట్టుకైవడి పాంచాలీరీతిని కావ్యరచన గావించినయీయామె కావ్య క్షేమైనదో! సుభాషితావళిలో నీమెది గా నీక్రిందిపద్య మున్నది.

"ప్రియావిరహిత స్యాద్య, హృది చింతా మ మాగతా,
ఇతి మత్వా గతా నిద్రా, కే కృతఘ్న ముపాసతే"

ఇది నిద్ర లేనివియోగదుఃఖితునిమాట—సదుక్తికర్ణామృతములో నివి యున్నవి.

"దూతి త్వం తరుణీ యువా స చపలః శ్యామా స్తమోభి ర్దిశః,
సంకేత స్సరహస్య ఏష విపినే, సంకేతకావాసకః,
భూయో భూయ ఇమే వసన్త మరుత శ్చేతో నయం త్యన్యథా,
గచ్ఛ క్షేమ సమాగమాయ నిపుణం రక్షంతు తే దేవతాః"

"యః కౌమారహర స్స ఏవహి వర స్తా శ్చంద్రగర్భా నిశాః,
ప్రోన్మీలన్నవమాలతీసురభయ స్తే తే చ వింధ్యానిలాం,
సా చైవాస్మి తథాపి చౌర్యసురతవ్యాపారలీలాం భృతాం,
రేవారోధసి వేతసీవనభువాం చేత స్సముత్కంఠతే"

సుభాషితావళ్యాదులందును కావ్యప్రకాశమందును కనవచ్చునీ మెశ్లోకములనుబట్టి మమ్మటరాజశేఖరులకు పూర్వురా లగుచున్న యీశీలాదేవి శా. శ. ౮౦౦ పూర్వమం దున్న దనుట విదితము. ఈమెనివాసము గాని భర్తపేరుగాని తెలియకున్నది. పూర్వోదాహృత శ్లోకములోని రేవానదీస్మరణమునుబట్టి యీకవయిత్రి నర్మదానదీతీరమం దేదేనియొకపురమున నివసించిన దని భావింపవచ్చును.

—:◆:—

# వికటనితంబ

ఇది పెట్టుపేరగునుగాని పుట్టుపేరు గాదు, రాజశేఖరాదు లీమెను ప్రశంసించినట్లు కవీంద్రవచనసముచ్ఛయాదులలో రెండుమూఁడు శ్లోకములున్నవి. అందలి దిది:—

" కే వైకటనితంబేన గిరాం గుంఫేన రంజితాః,
నిందంతి నిజకాంతానాం న మౌగ్ధ్యమధురం వచః "

ఈమె తుమ్మెదపేరుపెట్టి కావించినయీ క్రిందియన్యాపదేశశ్లోకము సుభాషితావళిలో నున్నది.

" అన్యాసు తావ దుపమర్దసహాసు భృంగ!
లోలం వినోదయ మన స్సుమనోలతాసు,
బాలా మజాతరజసం కలికా మకాలే
వ్యర్థం కదర్థయసి కిం నవమల్లికాయాః "

రజస్వలకానిపిల్లతో క్రీడించుమూఢునినింద యిందలివ్యంగ్యము-
ఈక్రిందిశ్లోకము విక్రమాదిత్యుని దని యొకరనుకొన్నారు గాని, సదుక్తికర్ణామృత మీమె దని నిరూపించినది. ఇదినాయికాలావణ్యవిశేషవర్ణనము:—

" లావణ్యసింధు రప రైవ హి కేయ మత్ర,
యత్రోత్పలాని శశినా సహ సంప్లవన్తే,
ఉన్మజ్జతి ద్విరదకుంభతటీ చ యత్ర,
యత్రాపరే కదళకాండమృణాలదండాః "

పద్యసంకలనగ్రంథములలో నొకరిశ్లోకములు మఱొయొకరిపేరఁ గనవచ్చుటయుఁ గలదు. అట్టివానిలో నీమె దని రెండుగ్రంథము లన్న యీక్రిందిశ్లోకము మాలవరుద్రుని దని యొకరు, భల్లటశతకములోని దని యొకరునన్నారు.

"అయం వారా మేకో నిలయ ఇతి రత్నాకర ఇతి,
శ్రితో ఽస్మాభి స్తృష్ణా తరళితమనోభి ర్జలనిధిః,
క ఏవం జానీతే నిజకరపుటీకోటరగతం
క్షణా దేనం తామ్య త్తిమి మకర మాపాస్యతి మునిః"

ఇది రత్నాకర మనుకొని యాశ్రయించి నాము గాని, మకరాదిక్రూరజంతువులతో డిదీనిని నిమిషములో నగస్త్యుఁడు మ్రింగు నని యెవ రనుకొన్నారు?

—:0:—

# ప్ర భు దే వి - సు భ ద్ర

ఈయిద్దఱిని స్తుతించినరాజశేఖరునిపద్యము లున్నవిగాని, వీరి పద్యములు లభించలేదు. వీరు శా. ౭-౮ శతాబ్దులలోనివారై యుందురు.

"సూక్తీనాం స్మర కేళీనాం, కలానాంచ విలాసభూః,
ప్రభుదేవీ కవి ర్లాటీ గతాపి హృది తిష్ఠతి"

ఈమె లాటదేశస్త్రీ యగును.

"పార్థస్య మనసి స్థానం, లేభే లఘు సుభద్రయా,
కవీనాంచ వచోవృత్తిచాతుర్యేణ సుభద్రయా,

ఈమె ప్రియుఁ డైనయాపార్థుఁ డెవఁడో!

—:0:—

# జ ఘ న చ ప ల

ఇది పెట్టుపేరే. ఈమెను పరిహాసించుచు నొకఁడు చెప్పిన పద్యము కవీంద్రవచనసముచ్చయములో నున్నది.

"దుర్దినినిశీథపవనే, నిస్సంచారాసు నగరవీథీషు,
పత్యౌ విదేశయాతే, పరం సుఖం జఘనచపలాయాః"

## ఇందులేఖ

ఈమెపేర సుభాషితావళిలో నీక్రిందిసూర్యాస్తమయవర్ణనము కనఁబడుచున్నది. సూర్యుఁ డస్తమించి యేమాయగునని చెప్పినసాక్ష్యము లేనిమాటలు నమ్మరఁట. అస్తమించినసూర్యుఁడు పాంథుల భార్యలహృదయములలో నుండు నఁట.

"ఏకే వారినిధౌ ప్రవేశ మపరే లోకాన్తరాలోకనం,
కేచి త్పావకయోగితాం నిజగదుః క్షీణేఽహ్ని చండార్చిషః,
మిథ్యా చైత దసాక్షికం ప్రియసఖ! ప్రత్యక్షతీవ్రాతపాత్,
మన్యే ఽహం పున రధ్వనీనరమణీచేతో ఽధి శేతే రవిః"

—:0:—

## మారుల

ఈమె శా. ౧౦ శతాబ్దిలోనిది కావచ్చును. ఈప్రాజ్ఞురాలికవిత్వము శ్రావ్యము మనోహరము. సుభాషితావళిలోని యీక్రింది శ్లోకమే యిందుకు ప్రమాణము.

"కృశా కే నాసి త్వం? ప్రకృతి రియ మఙ్గస్య నను మే,
మలా ధూమ్రా కస్మాత్? గురుజనగృహే పాచకతయా,
స్మర స్యస్మాన్ కచ్చిత్? నహి నహి న హీత్యేవ మగమత్
స్మరోత్కమ్పం బాలా మమ హృది నిపత్య ప్రరుదితా"

చిరకాలమునకు పరదేశమునుండి వచ్చినభర్త భార్యను చూచి పలుకరించి తరువాత నామెచేష్టలను స్మరించుచున్నాఁడు.

## మోరిక

ఈమెకవితకు సుభాషితావళిలోనియీక్రిందిశ్లోకమే మిగిలినది.

" మాగచ్ఛ ప్రమాదాప్రియ! ప్రియతమ త్వైర్యాభయ స్త్వ ముక్తో మయా,
బాలా పాఙ్గణ మాగతేన భవతా ప్రాప్నోతి నిష్ఠాం వశాం,

కిం చాన్యత్కుచభారపీడనసహై ర్యత్నపరిబద్ధై రపి,
త్రుట్యత్కంచుకజాలకై రనుదినం నిస్సూత్రితా మస్మద్గృహమ్ "

వేశ్యమాత విటులను వశపఱుచుకొనురీతి యిందు వర్ణింపఁబడినది—

# భా వ దే వి

రసికజనరంజకము లైనశృంగారభావములకు రాణియై తనపేరు సార్థకము గావించుకొన్న యీమెవిషయ మేమీ తెలియదు గాని మనోహరము లైనయీదేవిశ్లోకములు మాత్ర మీమెను మనకంటఁ బెట్టుచున్నవి. పద్యసంకలనగ్రంథము లీమెశ్లోకములు రెండుమూఁడింటిని మఱియొకరి వన్నవి. శృంగారవర్ణనలో అమరుకుఁడు ప్రఖ్యాతుఁడు గనుక, కవిపేరు తెలియని కొంద ఱట్టివాని నతనికంటఁగట్టుటయు వాడుక యైనది. ఈ క్రిందిశ్లోకము భావదేవి దని సుభాషితావళ్యాదులు తెలుపఁగా అమరుకుని దని సదుక్తికర్ణామృత మన్నది. కాని యీపద్యము నేను చూచినయమరుకశతకములో లేదు. అందుచే సాక్ష్యబలమునుబట్టి యీమెదే యనవలసివచ్చినది.

"తథా భూ దస్మాకం ప్రథమ మవిభిన్నా తను రియం
తతో ను త్వం ప్రేయా నహ మపి హతాశా ప్రియతమా,
ఇదానీం నాథ స్త్వం వయ మపి కళత్రం కి మపరం,
మ యా ప్తం ప్రాణానాం కులిశకఠినానాం ఫల మిదమ్"

ఇవి తప్పుచేసిననాయకునితో మానవతి యైననాయిక యన్నమాటలు. దీనికి సంబంధించినదిగా కనవచ్చెడి యీక్రిందిశ్లోక మీమెదే యని రెండుమూఁడు గ్రంథము లన్నవి. కవీంద్రవచనసముచ్చయము మాత్రము వాక్పాటుని దన్నది. కాని యిదియు నీమెదేయనుట యుక్తము.

"కిం పాదాన్తే పతసి విరమ స్వామినో హి స్వతంత్రాః,
కం చిత్కాలం క్వచి దసి రత స్తేనక స్తేఽ పరాధః,
ఆగస్కారి ణ్యాహ మిహామయా జీవితం త్వద్వియోగే,
భర్తృప్రాణా స్త్రియ ఇతి నను త్వం మ యై వానునేయః"

కోపియైన భర్తనుగూర్చి మృదువుగా భావగర్భితముగా సన్న శీలవతియు మానవతియు నగు స్వీయకాంతవచనము లివి. ఈక్రింది శ్లోకము రాజశేఖరుని దని యొక్కగ్రంథ మన్నదిగాని, తక్కినవన్నియు నీమెదే యన్నవి.

"సజన్మానౌ తుల్యావభిజనభువా జన్మచ సహ
ప్రవృద్ధౌ నామ్నాచ స్తన ఇతి సమానా వుదయినౌ
మిథ స్సీమామ్రాతే య దిద మనయో ర్మండలభృతో
రపి స్పర్ధా యుద్ధం త దిహహి నమస్యా కఠినతా"

ఈ స్తనవర్ణన మపూర్వము, ఒకచోట నొకమారు పుట్టి సమానముగా పెరిగిన స్తననామకులు, అయితేనేమి! మండలభర్తలుకాఁగానే సరిహద్దాక్రమించుటలో వీరికి పోరాటము వచ్చినదా! అహా! కాఠిన్యమెంత కయినా తగును. అది నమస్కార్యముగదా!

## ప్రియంవద

ఈమె తూర్పువంగదేశమున ఫరీద్పురమున నివసించినది. ఈమె తండ్రి శివరాముఁడు, భర్త రఘునాథుఁడు. శా. ౧౫౭౦ ప్రాంతమం దీమె శ్యామరహస్య మనుపద్యకావ్యము నిర్మించినట్లు తెలియుచున్నది. అదిముద్రిత మైనట్లు కనఁబడదు. ఈవిద్యావతి కావించిన శ్రీకృష్ణస్తుతి లోనిపద్య మొకటి.

"కాళిందీపులినేషు కేళికలనం కంసాదిదైత్యద్విషం,
గోపాలీభి రభిష్టుతం వ్రజవధూనేత్రోత్పలై రర్చితం,

బర్హాలంకృతమస్తకం సులలితైః రంగైః త్రిభంగం భజే,
గోవిందం వ్రజసుందరం భవహరం వంశీధరం శ్యామలమ్ ”

# వైజయంతి

తూర్పువంగదేశమందలి ఫరిద్పురమండలములోని ధనుకపుర మీమెజన్మభూమి. ఈమెతండ్రి మురారిభట్టు. దుర్గాప్రసాదతర్కవాగీశుని కుమారుఁడు కృష్ణనాథుఁ డీమెభర్త. వీరు శా. ౧౫౭౦ ప్రాంతమువారు. భార్యాభర్త లిరువురు సంస్కృతము బాగా అభ్యసించినవారు, తర్క మీమాంసలు చదివినవారు, కవిత్వము చెప్పనేర్చినవారు. కృష్ణనాథుఁడు భార్యతో కలసి ఆనందలతికాచంపువురచించినట్లీవిధముగా చెప్పియున్నాఁడు.

“ ఆనందలతికాచంపూర్యేనాకారి ప్రియయా సహ ”
అందీమె కావించిననాయికావర్ణన మిది:—

“ అహిరయం కలధౌతగిరిభ్రమాత్,
స్తన మగాత్త్రివల నాభిహ్రదోత్థితః,
ఇతి నివేదయితుం నయనే హి యత్,
శ్రవణసీమని కిం సముపస్థితే ”

ఈకల్పన మీమెది కాదు. పూర్వాలంకారికులు గ్రహించిన యొకనాయికావర్ణనములోనిది. అది:—

“ గంగావర్తసమాననాభివిలసద్వల్మీకరంధ్రాంతరాత్,
తస్యాః శ్యామలరోమరాజిభుజగీ నిర్గత్య బాలే తవ,
వక్త్రేందుం గ్రసతీతి పన్నగభియా పీనౌ కుచౌ సంగతౌ
వ్యాఖ్యాతు మిదం త్వదక్షియుగళం కర్ణాంత మాశిశ్రియే ”

# గంగాదేవి

ఈమె మధురావిజయ మనునుత్తమకావ్యము నిర్మించి ఖ్యాతి కెక్కినవిదుషీమణి; వీరకంపరాయనిభార్య. అతఁడు విజయనగరసామ్రాజ్యస్థాపకుఁడైన మొదటిబుక్కరాయనిరెండవకుమారుఁడు. తననాయకునే కృతినాయకుని జేసి యతనివీరచరితమునే యిందు వర్ణించినది. ఆకంప భూపతికే సాయణాచార్యులు తనరచియించిన సుభాషితసుధానిధి యను నీతికావ్యమును సభలో వినిపించెను. అతఁడే శా. ౧౨౮౦ ప్రాంతమున దక్షిణదేశము పాలించినవాఁడు. ఆసందర్భమును బురస్కరించుకొనియే భర్త గావించినమధురావిజయముపేర నీకావ్య మీగంగాదేవి రచియించినది. వీరకంపనుఁడు సుల్తానును సంహరించినంత దక్షిణదిగంగన యెట్లున్నదో వర్ణించుటతో నీకావ్యము సమాప్తమైనది.

" ప్రశాన్తదావేవ వనాన్తలక్ష్మీః, గతోపరాగా గగనస్థలీవ,
కళిన్దజా మర్దితకాళియేవ, దిగ్దక్షిణాసీత్ క్షతపారసీకా "

ఈకావ్యమున తొమ్మిదిసర్గలు కలవు. కాని, ప్రత్యంతరము లభింపమిచే నెనిమిదితొమ్మిదిసర్గలందుమ లోపించినగ్రంథమును పూరింప వీలులేక ప్రకాశకు లట్లే దీనిని ప్రకటించిరి.

కవిత్వము రసవంతమై వైదుష్యము వెల్లడించుచున్నది, నాఁటి స్త్రీకవులలో నీమె రసోచితవర్ణనమున సమర్థురా లనిపించుకొన్నది. ఇందు కీగురూపదేశవర్ణన ముదాహరణము.

" గురూపదేశః కిల కథ్యతే బుధైః, రకర్కశం కించన రత్నకుండలం,
అమేచకం నూతన మంజనం సతాం, మజాతగాత్రక్షయ మద్భుతంతపః,

# తిరుమలాంబ

ఈమె విజయనగరసామ్రాజ్య మేలిన శ్రీకృష్ణదేవరాయలకూఁ తురు, అళియరామరాజుభార్య, ఈమె తండ్రివద్దను పినతండ్రి అచ్యుత

రాయలవద్దను విద్య నభ్యసించి సంస్కృతసాహిత్యమున మంచిజ్ఞాన మార్జించి కవితచే నప్పటివారిమెప్పు గాంచిన విదుషి. శా. ౧౪౨౦ ప్రాంతమున జన్మించి తండ్రికి పినతండ్రికి నల్లారుముద్దుబిడ్డయై సకల రాజకుమారీభోగము లనుభవించిన సుకుమారాంగి యయ్యు నియమ పూర్వకముగా విద్య నేర్చినబుద్ధిమతి.

ఈమె తనపినతండ్రియు గురువు నైన అచ్యుతరాయలు వరదాంబి కను పెండ్లాడుట యను కథాంశము ప్రధానముగా వరదాంబికాపరిణయ మను చంపువు నిర్మించినది. అందు ముందుగా తనపితామహుఁ డగు నరసరాజు ఓబమాంబను వివాహ మాడుట, ఆదంపతులకు అచ్యుత రాయ లుదయించుట మొదలుగా పూర్వవృత్తాంతము కొంత వర్ణింపఁ బడినది. తరువాత వరదాంబాచ్యుతరాజులకు చినవెంకటాద్రి జన్మించుట యను కథాంశముతో కావ్యము ముగిసినది. ఈదివ్య మైనచరిత్ర కావ్యము ముద్రితము కాలేదు.

## రామభద్రాంబ

తంజావూరుపాలకు లైననాయకరాజులలో కవియు కవిపోష కుఁడు నైనరఘునాధరాజుచరితము విదితము. అతఁడు శా. ౧౫౩౬_ ౧౫౫౫ నడుమ రాజ్యము చేసినవాఁడు. అతని ధర్మపత్ని యీకవ యిత్రి, తనభర్తయే కృతినాయకుఁడుగా రఘునాథాభ్యుదయ మను పన్నెండుసర్గలకావ్యము నిర్మించినది. మొత్త మిందలిశ్లోకసంఖ్య ౯౦౦

ఈమె సంస్కృతప్రాకృతాదిభాషలు చక్కఁగా నేర్చి చతుర్విధ కవిత చెప్ప నేర్చినప్రతిభాశాలిని. నిర్దుష్ట మైన పాండిత్యము ఉత్తమ సాహిత్యవిజ్ఞానము తెలయునీస్త్రీకవి సర్గాంతముల వ్రాసినగద్యము లి ట్లున్నవి.

"అష్టభాషాకల్పిత చతుర్విధకవితానుప్రాణిత సాహిత్య
సామ్రాజ్యభద్ర పీఠారూఢరామభద్రాంబా విరచితే"

రఘునాథజీవితచరిత్ర మిందు చక్కఁగాఁ బ్రతిఫలించి దృగ్గోచరమగుచున్నది. కవిత్వ మతిసులభము ప్రసాదగుణవిశిష్టము.

"అధికశ్రియ మచ్యుతేంద్రసూనుం, రఘునాథం రఘునాథమేవసాక్షాత్
హృదయే కలయన్తి యే మహాన్తః, పరమానందభరాత్తఏవధన్యాః"

తన యీకృతినిర్మాణమందు తననాథుఁడు సహాయుఁడైనట్లీ విధముగాఁ దెలిపినది.

"శబ్దార్థయోర్మర్మసమప్రధానం, వశంవదం యస్య వదన్తి సర్వే,
కృతీ స ఏ వాత్ర కృతౌ సహాయో, నాథో మమ శ్రీరఘునాథనేతా

రఘునాథనాయకునితండ్రి అచ్యుతనాయకుఁడు రాజ్యముచేయు కాలమందు వేంకటపతిరాయలు చంద్రగిరిరాజుగా నుండెను. ఆసమయమునఁ బారసీకులతో నతనికి యుద్ధము ప్రాప్తించఁగాఁ కర్ణాటరాజ్యరక్షణమున కుపాయ మాలోచించుచు, రఘునాథనాయకునిసహాయ మతఁ డభిలషింపఁగా, నచ్యుతనాయకుఁ డితనిని బంపెను. ఇత్యాదివిషయము లిందు విశదీకరింపఁబడినవి.

"కర్ణాటరక్షాకరణే నితాంతం విచారవాన్ వేంకటదేవరాయః
గంధాంధభూమీధవగంధనాగకంఠీరవం శౌర్యకథానిదానం
రణే సహాయం రఘునాథదేవ, మయాచ తేజస్వల మచ్యుతేంద్రం
గురో ర్నిదేశా ద్గురురాజ్యకార్య, నిర్వాహకో నీతిపరాధ్వనీనః
సామంతభూపాలశతానుయాతో, జయప్రయాణాయసముద్యతోఽభూత్

ఈకావ్య మీమె వైదుష్యపాతివ్రత్యములను రఘునాథనాయకుని ధైర్యశౌర్యసాహసౌదార్యములతోడి వివిధవిద్యాచాతుర్యమును వెల్లడించుచున్నది. ఇది కృత్యాదిశ్లోకము.

"ఆనందితౌ భూమితలే హరీశవిభీషణౌ యేన విశిష్య తాభ్యామ్
నామ్నాచ భక్త్యా రఘునాథనేతు ర్భద్రాణి కుర్వీత సరామభద్రః

# మధురవాణి

ఈమె పూర్వోక్తరఘునాథనాయకునియాంపుమకత్తె. శా.౧౫౭౦ ప్రాంతమం దున్నది. సంస్కృతాంధ్రములు చక్కఁగాఁ బఠించి యందు మృదుమధురరీతిని కావ్యము రచియించునేర్పు గాంచినయాంధ్రవారాంగన. రఘునాథుఁడు తెలుఁగున రామాయణసారకావ్యతిలక మనుకృతి నిర్మించి యీమెచే సంస్కృతీకరింపఁజేసిన ట్లాకావ్యములోని యీక్రిందిమాటలవల్ల నే తెలియుచున్నది. ఆనాఁడు తంజావూరుమండలమున జన్మించినసంస్కృతాంధ్రగ్రంథములు వేలకొలఁది తంజావూరు పుస్తకభాండాగారమున నిద్రించుచుండఁగా నది మాత్రము బెంగుళూరుమల్లేశ్వరములోని వేదవేదాంతగ్రంథాలయమున నున్నట్లు తెలియ వచ్చినది. అందలివిషయము తెల్పుశ్లోకములు:—

"రసోత్తరం రామకథానుబంధ, కావ్యం మయా కల్పిత మాంధ్రవాణ్యా
కార్యం కయా సంస్కృతవాగ్భి రేత, దిత్యేవ చిత్తే గణయ న్నవాసీత్

"అజహదలంకృతిక్రమ మనేకరసోల్లసితం,
సరసపదార్థసంగతిసమగ్రగుణానుగుణం,
రఘురమణప్రబంధతిలకం రసికాభిమతం,
సుదతి! విధీయతా మితి సుధీ రగదీ న్నృపతిః"

తనకుఁ దనప్రియుఁ డయినయారాజు మధురవాణీబిరుద మిచ్చినట్లుగా నందే తెలుపుకొన్నది. మొదటిపే రేదో!

"చతురమధురవాణీం సమ్య గాకర్ణ్య యాస్యాః
సదసి మధురవాణీనామ దత్తం త్వయైవ"

ఈమధురవాణి చదువుకొన్నకుటుంబములోఁ బుట్టినది. సంగీతసాహిత్యములందు నిపుణురాలు. వ్యాకరణశాస్త్రము పఠించినది. అవధానము లొనర్చుప్రజ్ఞాశాలిని. రఘునాథరాజసభలోనిజంత్రపుబొమ్మలు తమచేతులలోని వింజామరలు విసరుచు నాట్యముచేయుకాంతల శ్రమ బోఁగొట్టుచున్న వని యిట్లు వర్ణించినది.

" యదంతరావర్తితనర్తనానాం సీమంతినీనాం శ్రమ మాక్షిపంతి,
షర్యంతయంత్రప్రతిమాకరాగ్రప్రకీర్ణజాతాః పవమానపోతాః " '
" కంజాతనూతిప్రియదాంఘ్రిభూషా, శింజారవోదారవచా స్స రాజా,
పుంజా సమూలాన్ దధతీం మణీనాం, తంజాపురీం శాస్తి తరంగితౌజాః "

అనుచుం దనమనోహరునితంజాపురపాలనమును మనోహరముగా వర్ణించినది. రామకథ యెన్నివిధముల నెన్నిసారులు విన్న నెప్పటి కప్పుడే క్రొత్తరుచి పుట్టించు ననుభావము విశదీకరించుచు నిట్లు వర్ణించినది.

" పారే శ్చరిత్రం బహు, తత్ర రామ కథాసుధా కర్ణరసాయనం నః
ఆస్వాద్య మానాపి సహస్రవార, మయాతమైవ సుఖస్య దోగ్ధ్రీ "

ఈవిధముగా సీవారసుందరి కవిత్వము కర్ణరసాయనముగా నుండు ననుటకు మఱిరెండుశ్లోకములు

" సంఖ్యావతాం సర్వపథీనధీభి,
స్సంశోధితా చే త్కవితా కవీనామ్,
కస్తూరికా చందనకుంకుమాద్యై
ర్యుద్వర్తితాఙ్గీ యువతీవ దీవ్యేత్ "
" మధ్యేమణీభి ర్త్యనుచించితం స్వం
మత్వా రమాం యత్ర విసన్తి కామా
కరే తదీయే కమలం తథాసీ
మసీతిఖ్యానా తిపతే నతాంగీ "

# త్రివేణి

ఈమె యాదవరాఘవపాండవీయము రచియించిన ఉదయేంద్రపురం అనంతాచార్యునికూతురు. శ్రీపెరుంబూదురునివాసి తాతగుప్రతి

వాదిభయంకరం వెంకటాచార్యునిభార్య. ఈ విదుషి శా. ౧౭౩౮-౧౮౦౫ నడుమ జీవించియున్నది. తండ్రివద్ద చక్కఁగా కావ్యనాటకాలంకారగ్రంథములు చదివి విద్వాంసురాలై కవిత్వనిపుణురాలై పిదప భర్తవద్ద వేదాంతశాస్త్రము చదివి తత్త్వజ్ఞాన మార్జించినది.

ఈ కవయిత్రి రంగనాథసహస్రము లక్ష్మీసహస్రము రంగాభ్యుదయము సంపత్కుమారవిజయము రంగరాట్సముదయము తత్త్వముద్రాభద్రోదయము శుకసందేశము భృంగసందేశము హారతీపంచకము మొదలగు సంస్కృతకృతులు నిర్మించి శ్రీరంగస్వామి నారాధించుచు కాలము గడపినది. మైసూరు మొదలగుసంస్థానముల సత్కారము లందినది. సంపాదించినద్రవ్యము శ్రీరంగప్రీతిగా వ్యయపఱచినది. జన్మము ధన్యముగా పావనచరిత యైనయీమె కావ్యములు తంజావూరు సరస్వతీభాండాగారమున నున్నవి.

## లక్ష్మి

ఈమె మలబారులోని యొక చిన్నసంస్థానాధీశునిభార్య. శా. ౧౮౧౦ ప్రాంతమందలిది. సంస్కృతసాహిత్యచతుర యైనయీరాజ్ఞి సంతానగోపాల మనెడి మూఁడుసర్గలకావ్యము నిర్మించినది-ఇందలికథ:-

"ఒక బ్రాహ్మణునికి పదిమంది పిల్లలు పుట్టిరి. ఒకరితరువాత నొక రందఱు చనిపోయిరి. ఆవిప్రుఁడు విచారగ్రస్తుఁడై అర్జును నర్థింపఁగా కడపటిపిల్లవానిని బ్రతికించి తెప్పించెద నని వాగ్దానము చేసెనుగాని, యతఁ డట్లు చేయలేక పోయెను. అంత నాబ్రాహ్మణుఁడు నిరాశుఁడై అగ్నిప్రవేశము చేయుటకు సిద్ధపడినంతలో శ్రీకృష్ణుఁడు ప్రత్యక్షమై నివారించి పదిమందిబిడ్డలను జీవింపఁజేసెను. ఈ కావ్యము ముద్రిత మైనది.

# జ్ఞానసుందరి

ఈమె యొకవారకాంత, కుంభకోణనివాసిని. శా. ౧౭౬౦ ప్రాంతమున జన్మించి ౧౮౩౦ ప్రాంతమున గతించినది. చక్కనివిద్వత్త్వ కవిత్వములచే విద్వాంసులను రంజింపఁజేయునీమె నైపుణి కానందించి యాకాలమందలి మైసూరుమహారాజు "కవిరత్న" బిరుద మిచ్చి యీ కవయిత్రిని సత్కరించెను. ఈకవితానిపుణురాలు చాలాకృతులు రచియించినట్లు తెలియవచ్చును గాని, అందలి హాలాస్యచంపువుమాత్రము సజీవమై యిపుడు ముద్రిత మైనది. ఇది, ఆఱుస్తబకముల గ్రంథము. ఈమె తనయౌవనదశలో మధురలో నుండి కవితాగానము చేయుచుండెడి దఁట.

మీనాక్షీసుందరేశ్వరులవివాహకథ శ్రుతిరమ్యముగా వర్ణించిన యీమె చాతుర్యము శ్లాఘ్యము: అందలి యొకటి రెండు:—

" మధురీకృతగరళత్వా, న్మధురాభిఖ్యా తదాది సా నగరీ,
నిజసీమస్థఫణిత్వా, ద్విభాతి హాలాస్యనామ త శ్చేహ,
తస్యా లలాటలీన, స్వాహాపతి రేవ శాంతసంతాపః,
రేజే కుంకుమతిలక, వ్యాజా న్మానం బుధాహి కాలవిదః.

# పుష్పదంతుఁడు

స్తుతికావ్యములపై రెత్తినంతనే మొట్టమొదట గణనకు వచ్చునది మహిమ్నస్తోత్రము. దీనికి మహిమ్నస్తవ మనియు వాడుక కలదు. పెద్ద లందఱును దీనిని సంగ్రహనామముతో "మహిమ్న" మని వ్యవహరింతురు. అట్టియీకృతి నిర్మించినయతఁ డెవఁడు? ఏదేశమువాఁడు? ఏకాలమువాఁడు? అన్నప్రశ్నలకు తగినసమాధానము లభింపదు.

జయద్రథునిహరచరిత్రచింతామణి యిరువదియేడవసర్గ పుష్పదంతుఁడు మహేశ్వరునిప్రియకింకరుఁ డైనప్రముఖుఁ డని వర్ణించినది. స్కాంద పద్మ దేవీ భాగవతములు పుష్పదంతుఁడు గంధర్వరా జని వర్ణించినవి. శివరహస్య మను మఱియొకగ్రంథమందు పుష్పదంతచరిత్రముతో మహిమ్న స్తవమే కల దని కొంద ఱనుచున్నారు. అధోక్షజపఙ్క్తిక, యతఁ డితఁడే యని నిర్ణయింపలేముగాని పుష్పదంతు నిట్లు స్మరించినది.

" వాక్పతిం పుష్పదంతంచ, కాణ్వాం సోమ మథర్వణమ్,
హేమచంద్రం నమస్కృత్య, వక్ష్యేఽ ధోక్షజపఙ్క్తికామ్ "

శివభక్తుఁ డగుటచే కానీ వేత్త యగుటచే కానీ, ప్రసిద్ధి గాంచిన యొకపుష్పదంతుఁడు పైవర్ణనలకు గుఱియై యుండు నని విశ్వసింపవచ్చును గాని, అతఁడే యీస్తుతికావ్యకర్త యనుట యెట్లు? సత్యమే కాని, మహిమ్నస్తోత్రముతో సంబంధము కలమఱియొక పుష్పదంతుఁ డున్నాఁ డని నిరూపించుటమాత్ర మెట్లు? కావున ప్రాచీనస్తుతికృతులలో నుత్తమ మైనయీస్తోత్రము నిర్మించినపుష్పదంతుఁ డనువిద్వత్కవి శివభక్తశిరోమణి మహిమసంపన్నుఁడు నగుటచే, పూర్వులతని నీశ్వర సేవకునిగాను శివభక్తాగ్రేసరుఁ డైనగంధర్వరాజుగాను భావించి యట్లు వర్ణించియున్నా రనుకొనుటయే యిప్పటికి సముచిత మైనసమాధానము అయితే, ఇతనికాలనివాసములమాట యేమి? శివపంచస్తవీ ప్రకాశకులు పుష్పదన్తకృత మీస్తోత్ర మనుటకుశిలాశాసనప్రమాణము సంపాదించిరి

హిందూదేశము మధ్యభాగమున (సి. పి) నీమాడ్ జిల్లాలో ఓంకారక్షేత్రమం దమరేశ్వరలింగాలయ మున్నది. ద్వాదశజ్యోతిర్లింగములలో అమరలింగ మొకటి. ఆగుడి కాగ్నేయభాగమున మాంధాతృమండప మున్నది. దానిరాతిగోడపై నీమహిమ్నస్తోత్ర శ్లోకములు

చూ. శివపంచస్తవీపీఠిక—శివధర్మగ్రంథమాల సికిందరాబాదు.

చెక్కఁబడియున్నవి. ఆశిలాలేఖప్రతిబింబము శివపంచస్తవిలో ప్రకటిత మైనది. ఆలేఖసమయము విక్రమసంవత్సు, ౧౧౨౦-అనఁగా, శా.౯౮౬. దీనినిబట్టి, అప్పటి కెంతో పూర్వమునుండి విద్వత్పరంపరాయత్త మగుచు వచ్చినయీ స్తవము స్వమహిమచే శిలాలేఖనగౌరవమందెనని తెలియవచ్చును. ఇది యిట్లుండ నుత్తరదేశమందును గుజరాతుమహారాష్ట్ర దేశములందును రుద్రాభిషేకసమయమం దీస్తవము పారాయణము గావించుట యాచారము. రుద్రానువాకముతో సమముగా నిది పఠనీయ మగుచున్నయీ దేశాచారము కూడా దీనిప్రాచీనతను బలపఱుచుచున్నది. మఱియు—

ఈమహిమ్న స్తవము శంకరాచార్యులకు పూర్వ ముదయించిన దన్నప్రతీతి యేనాఁటినుండియో వచ్చుచున్నది. ఈచిన్నస్తుతికావ్యమునకు సుమారు పాతికమంది వ్యాఖ్యానములు నిర్మించియున్నారు. వారందఱు దీనిప్రాచీనతను ప్రశంసించుట యటుండ, శంకరాచార్యులదక్షిణామూర్త్యష్టకమునకు టీక వ్రాసినస్వయంప్రకాశస్వామి, అందలి "భూరంభాంసి" యనుశ్లోక మిందలి "త్వమర్కః" అనుశ్లోకము ననుకరించియున్నదని వ్రాసియున్నాఁడు. ఈమాత్రపుభావము శంకరాచార్యుని వంటిమహానుభావునికి తోఁచకపోయెనా యనెడిశంక కిది స్థానము కాదు, ఆయననాఁటి కీపుష్పదంతునిస్తుతి పూర్వ మనుటయే యిచ్చట గ్రాహ్యము. ఈక్రిందివానిలో మొదటిది పుష్పదంతునిది, రెండవది శంకరాచార్యునిది:—

"త్వమర్క స్త్వం సోమ స్త్వ మసి పవన స్త్వం హుతవహ,
స్త్వ మాప స్త్వం వ్యోమ త్వము ధరణి రాత్మా త్వ మితి చ,
పరిచ్ఛిన్నా మేవం త్వయి పరిణతా బిభ్రతు గిరం
న విద్మ స్తత్త్వం వయ మిహ తు య త్త్వం న భవసి"
"భూరంభాంస్యనిలో ఽనలో ఽమ్బర మహర్నాథో హిమాంశుః పుమా నిత్యాభాతి చరాచరాత్మక మిదం యస్యైవ మూర్త్యష్టకమ్,

నా స్యత్కించన న విద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్విభో,
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే”

ఇందు పుష్పదంతునిశ్లోకము “ఇంద్రం మిత్ర” మిత్యాదిఋఙ్మంత్రము ననుసరించిన దని మధుసూదనసరస్వతి యన్నాఁడు. ఇట్లే శివానందలహరిలోనికొన్నిశ్లోకములును పుష్పదంతునిపద్యముల ననుకరించుచున్నవి— అనామయస్తవకర్త యైనదండికవి యిందలిశ్లోకముల ననుకరించిన ట్లందలిమొదటి పదిశ్లోకములు చెప్పుచున్నవి. గావున దండికంటె పుష్పదంతుఁడు ప్రాచీనుఁ డనియు, ఇందలి “త్రయీసాంఖ్యం యోగ” ఇత్యాదిశ్లోకము ననుకరించి కాళిదాసురఘువంశము (౧౦—౨౬) లోని “ బహుధాప్యాగమై ర్భిన్నాః ” ఇత్యాదిశ్లోకము నిర్మించిన ట్లున్నది గావున నతనికంటె కూడా ఇతఁడు పూర్వుఁ డనియు పశ్చాత్యవిమర్శకులు వ్రాసి యున్నారు. విచారణీయము లైనయీయంశములమాట యెటులున్నను, పుష్పదంతుఁడు శంకరాచార్యులకు పూర్వుఁ డనిమాత్రము నిస్సంశయముగా విశ్వసింపవచ్చును.

అన్ని దేశములలోను అనాదిగా వ్యాపించినకృతులలో నిది యొకటి. కావ్యము మిక్కిలి చిన్న దైనను ప్రక్షిప్తశ్లోకములు కొన్ని యుండుటచే శ్లోకసంఖ్యయం దొక దేశపుప్రతితో నింకొక దేశపు ప్రతి పోలకున్నది. ఫలశ్రుతిశ్లోకములతో ౪౩ కొన్నిట నున్నవి. కొన్నిట ౪౨ ఉన్నవి. కొన్నిట ౩౧ మాత్రమే యున్నవి. అసలుస్తుతి ౩౧ శ్లోకములతోడిదే యనిప్రతీతి—

ఈస్తుతికి కేవలము శివపరముగా నర్థము వ్రాసినవ్యాఖ్యాతలు ౨౦టు. శివకేశవపరముగా వ్రాసినవారు మధుసూదనసరస్వతీ శ్రీధరస్వాము లిద్దఱు.

ఈదివ్యకావ్య మెన్నో దేశభాషలలోని కనువదింపఁబడినది. ఉదయపురరాజవంశములోని శివభక్తాగ్రేసరుఁ డగుకరజాలిచతురసింహామహారాజు లీనమేవాడహిందీభాషలోని కనువదించియున్నాఁడఁట.

గంభీరార్థ మయ్యుపరతత్త్వమును సుఖబోధ్యము గావించు నిది శ్రావ్యమును మనోహరము నగుశిఖరిణీచ్ఛందోబద్ధమై యున్నది. సంస్కృత మభ్యసించినవిద్యార్థి కిందలిశ్లోక మొకటేని నోటికి రాకుండ నుండ డనుటకంటె దీనివ్యాప్తిని ప్రశస్తిని వర్ణింప నక్కఱలేదు. ప్రత్యక్షముగానో పరోక్షముగానో సకలశాస్త్రప్రస్థానములకును పరమేశ్వరు నియందే తాత్పర్య మనుచు బోధించు నీక్రిందిశ్లోకము చదువుఁడు.

"త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవ మితి,
ప్రభిన్నే ప్రస్థానే పర మిద మదః పథ్య మితిచ,
రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిలనానాపథజుషాం,
నృణా మేకో గమ్య స్త్వ మసి పయసా మర్ణవ ఇవ"

కోటినక్షత్రము లైన నొకచంద్రునిసాటి యగునా? శాశ్వతకీర్తి కిట్టి కృతి యొకటి చాలదా? ఈ పుష్పదంతుఁడే గణేశమహిమ్న స్తుతి కూడ నిర్మించినట్లు తెలియుచున్నది. నా కది లభింపలేదు.

ఒకరాజుతోఁటలోని పుష్పము లపహరించుచున్నయొకగంధర్వుఁడు (పుష్పదంతుఁడు) తన్ను పట్టుకొనుట కేర్పఱచినశివనిర్మాల్యము నెఱుఁగక దాఁటి తోఁటకు ప్రవేశించినవాఁడై యాయపచారమున శక్తిహీనుఁ డయ్యెను. ఆవిషయము తోఁటమాలివల్ల తెలిసికొని పశ్చాత్తప్తుఁడై భగవంతుఁ డైనమహేశ్వరుని స్తుతించి పునశ్శక్తిలాభముతో విజ్ఞాత యయ్యె నన్నకథ, యీస్తుతి ప్రాచీన మనుటకు సాధన మగుచున్నది.

"మహేశా న్నాపరో దేవో, మహిమ్నో నాపరా స్తుతిః,
అఘోరా న్నాపరో మన్త్రో, నాస్తి తత్త్వం గురోః పరమ్"

# అమరుకకవి

"పుణ్యై ర్యశో లభ్యతే" అన్నమాట యెప్పుడు పుట్టిన నేమి! దాని కుదాహరణము కాఁదగినవారిలో నితఁ డొకఁడు. పదులు ఏబ

దులు కృతులు నిర్మించినవారి కైన లభింపని ప్రఖ్యాతి నొక్క శృంగార శతకమున నార్జించి, భాసకాళిదాసభవభూత్యాదిమహాకవులవలె సాహిత్యనిధుల స్తుతికి పాత్రమైనయమరుకునిపుణ్యమే పుణ్యము. ఇతని దేశ నివాసకాలాదులను తెలిపెడి ప్రమాణవచనము లేవియు నింతకు లభించ లేదు గాని, ఇతనికిని శంకరాచార్యునికిని సంబంధించిన యొక కథమాత్రము లోకమున నెపుడో యెట్లో పుట్టినది. అది మాధవాచార్యాదుల శంకరవిజయములకు నెక్కినది, దాని సంగ్రహ మిది.

శంకరాచార్యు లద్వైతమతప్రచారము గావించుచు మాహిష్మతీ పురమునకు వచ్చినపుడు మండనమిశ్రునితో శాస్త్రవాదము సలుపుట సంభవించినది. అందు మండనుఁ డోడిపోయినసందర్భమున నతనిభార్య భారతి శంకరునితో శాస్త్రవాదమునకు దిగి యేశాస్త్రములోను శంకరునియుక్తికి పైయుక్తి చెప్ప లేక యితని నోడించుట కిదే యుపాయ మనుకొని కామశాస్త్రములో ప్రసంగమున కారంభించినది. అపుడు శంకరుఁ డామె ప్రశ్నలకు సమాధానము చెప్పఁజాలక, యిందు కొకనెలగడు విమ్మని యామెను కోరి శిష్యులతో నర్మదాతీరమం దున్నయొకయడవి కేగి, నేను తిరిగివచ్చి దేహములో ప్రవేశించునంతవఱకును దీనిని కాపాడుచుండుఁ డని శిష్యులకు చెప్పి యొకపెద్దచెట్టుతొఱ్ఱలో శరీరము విడిచి యీవలికి వచ్చి నంతలో, ఆదేశపాలకుఁ డైనఅమరుకుఁడు మృతి చెందెను. వెంటనే శంకరాత్మ యాకళేబరమున ప్రవేశించుటయు, మంత్రులు పౌరులు నందఱును రాజు జీవించినందు కానందపరవశు లైరి. కాని, రెండుమూఁడురోజులలోనే మంత్రు లతనిచర్యలనుబట్టి యెవఁడో మహాత్ముఁడు తనదేహ మెందో విడిచి రాజదేహమున ప్రవేశించె నని యనుమానించి యట్టిదేహమును వెదకి పట్టుకొని కాల్చివేయుఁ డని గూఢచారుల కాజ్ఞాపించిరి. శంకరుఁడు రాణితో క్రీడించుచు వాత్స్యాయనకామసూత్రభాష్యములగంభీరార్థము విస్పష్టమగునట్లమరుకుని పేర శృంగారపద్యశతకము నిర్మించెను.

తరువాత, గడువు దాటినది గురువు రాలే దని పరితపించుచు శిష్యులు వచ్చి రాజప్రాసాదమునెదుట నిలచి శంకరుల కర్థ మగునట్లు వేదాంతశ్లోకములు పఠించి రనియు, అది విని యాచార్యు లాదేహము విడిచి తన దేహమున మరల ప్రవేశించునంతలో, దానిని చితిపై పెట్టి రాజభటులు నిప్పంటించి రనియు, శంకరుఁ డందు ప్రవేశించి కాలిన కాలుసేతులు బాగుపడుటకై "లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబ" మిత్యాదిగా నిష్టదేవతాస్తుతి గావించి యథాపూర్వశరీరుఁడై వచ్చి మండనమిశ్రునిభార్యను కామశాస్త్రవాదమున నోడించె ననియు, కథ సాగినది. ఇం దమరుశతకనిర్మాణము పరకాయప్రవేశము చేసినశంకరాచార్యునిదే యన్నభావమును తెల్పుశ్లోకము విద్యారణ్యశంకరవిజయమున నిట్లున్నది.

" వాత్స్యాయన ప్రోదిత సూత్రజాతం,
తదీయభాష్యంచ విలోక్య సమ్యక్,
స్వయం వ్యధ త్తాభినవార్థగర్భం,
నిబంధ మేకం నృపవేషధారీ"

ఇది నమ్మరానికట్టుకథ యందురుగాని, దీనినిబట్టి అమరుకుఁ డొకరా జనియు శంకరాచార్యునికి సమకాలికుఁడై యుండు ననియు శంకరుఁడు పరకాయప్రవేశము చేయ దగినయోగమహిమ కలవాఁ డనియు, అమరుకశతకము వాత్స్యాయన కామసూత్రభాష్యముల ననుసరించిన నవనవార్థగర్భిత మైనదివ్యశృంగారకావ్య మనియు నొకవిధముగా మనము భావింపవచ్చును. జగద్గురుని యోగమహిమతో నమరుకశతకమాహాత్మ్యమును ముడిపెట్టుట యీకథ కల్పించినవారియుద్దేశ మని విశ్వసింతము.

ధనిక మమ్మటానందవర్ధనాదిలాక్షణికు లితనిశతకములోని శ్లోకముల నుదాహరించుకొనుటయే కాదు, శా. ౬౭౭_౭౦౫ నడుమ

కాశ్మీర మేలినజయాపీడనృపాలునియాస్థానమంత్రియు మహాల్లామ్రొన్ని కుఁడు నైన వామనాచార్యుఁడు తనకావ్యాలంకారసూత్రవృత్తిలో వర్ణ ఘటన యనెడిశ్లేష కీశతకములోనియీక్రిందిశ్లోకము నుదాహరించి యున్నాఁడు.

"దృష్ట్వైకాసనసంగతే ప్రియతమే పశ్చా దుపేత్యాదరా,
దేకస్యా నయనే పిధాయ విహితక్రీడానుబంధచ్ఛలః,
ఈష ద్వక్రితకంధర స్సపులకః ప్రేమోల్లసన్మానసా
మ న్తర్హాసలసత్కపోలఫలకాం ధూర్తో உపరాం చుంబతి"

దండిభామహులు లితనిశతకమును స్మరింపకుండుటయు వామనుఁడు స్మరించుటయు చూడఁగా, అమరుకుఁడు వీరికి నడుమ క్రీ. ౫౭౦-౭౫౦ నడుమ నున్నవాఁ డని విశ్వసించుట సముచిత మనితోఁచుచున్నది.

కావ్యాలంకారాదిసాహిత్యలక్షణములు రచియించిన విద్వాంసు లెల్లరు నితనిశ్లోక మొకటియో రెండో గ్రహించినవారే. అందును, పెక్కండ్రు స్వీకరించిన యీక్రిందిశ్లోకమువలె వ్యంగ్యమున కుదాహ రింపఁదగిన యింకొకశ్లోక మున్నదో లేదో!

"నిశ్శేషచ్యుతచందనం స్తనతటం నిర్మృష్టరాగో உధరో,
నేత్రే దూర మనంజనే పులకితా తన్వీ తవేయం తనుః,
మిథ్యావాదిని దూతి! బాంధవజన స్యాజ్ఞాతపీడాగమే!
వాపీం స్నాతు మితో గతాసి న పున స్తస్యాధమ స్యాంతికమ్"

ఇందలినూటరెండుశ్లోకము లిట్లే శృంగార మొలుకుచున్న ట్లున్న వనుట యతిశయోక్తి కాదు. దశరూపకవ్యాఖ్యలో ధనికుఁడు రతప్రగల్భ కుదాహరించినశ్లోక మిది:—

"కాంతే తల్ప ముపాగతే విగళితా నీవీ స్వయంబంధనా,
ద్వాసః ప్రశ్లథమేఖలాగుణధృతం కించి న్నితంబే స్థితమ్,

ఏతావ త్సఖి! వేద్మి కేవల మహం తస్యాంగసంగే పునః
కోఽసౌ కాస్మి రతం ను కిం కథ మితి స్వల్పాపి మే న స్మృతిః"

దీనికి నాయనువాదములోనిపద్య మిది:—

మ. చెలియా! రేయి ప్రియుండు తల్పమున విచ్చేయంగ నుప్పొంగె మే
నలకై దండ గళంబు చేరఁగఁ దనంతన్ నీవి జాఱెన్, గటి
స్థలిపై మాత్ర మొకింత కొంగు రశనాసంబద్ధమై నిల్చెనా
వల నేమయ్యెనొ? నే నెవర్తె నతఁ డెవ్వండో? యెఱుంగన్ గదా!

ఈకృతికి రవిచంద్రుఁడు అర్జునదేవవర్మ వేమభూపాలుఁడు మొదల గువారు టీకలు రచియించిరి. వాటిలో వేమునిశృంగారదీపికయే విద్వ ద్రంజకమై విఖ్యాతి గాంచినది. అర్జునదేవవర్మరసికసంజీవిని దీని నిట్లు స్తుతించినది.

"అమరుకకవిత్వడమరుక, నాదేన వినిహ్నుతా న సంచరతి,
శృంగారఫణితి రన్యా, ధన్యానాం శ్రవణయుగళేషు"

సుమా రిరువదిమందివ్యాఖ్యాతల నాకర్షించి దేశమునలుదెసల కాఁగ ప్రాకినదీనిఘనత పాశ్చాత్యులనుకూడా విస్మయానందపరవశులను గావించిన దనఁగా నిఁక భారతీయులమాట చెప్పనేల?

ఇది చూచుటకు మిక్కిలిచిన్నకావ్యమే కాని గుణమున మిక్కిలి పెద్దది. ఇది వివిధశృంగారనాయికానాయకులబహువిధశృంగారభావము లను చేష్టలను మనోహరముగా చిత్రించి ప్రదర్శించినచిత్రశాల యను టకంటె దీనియౌచిత్యమును వేఱుగా వర్ణింపఁజాలను. ఇది అమరుకక వీంద్రుని శాశ్వతయశఃకాయము.

# శంకరాచార్యులు

"శ్లో. శ్రుతిస్మృతిపురాణానా మాలయం కరుణాలయమ్,
నమామి భగవత్పాదశంకరం లోకశంకరమ్"

మహాత్ములచరిత మద్భుతముగా పరిణమించుట సహజము. అట్లే యీజగద్గురునిజననాదివృత్తాంతము చిత్రవిచిత్రకథలతో భరత ఖండమంతట విస్తరించినది. సంస్కృతమందే కాదు. దేశభాషలలోను విదేశభాషలలోనుగూడ నీమహాపురుషునిజీవితము వివిధభంగుల మహా మహిమసంపన్నముగా వర్ణింపఁబడియున్నది. అందలిసత్యచరిత్రాంశ ములను మన మిందు గ్రహింతము.

ఇపుడు మలబారనఁబడు కేరళదేశమున పూర్ణానదీ (ఆల్వాయి-చూర్ణి) తీరమందున్నవృషాద్రికి దగ్గఱగా నుండుకాలటి యనెడియగ్రహార మితనిజన్మభూమి.విద్యాధిరాజనువిద్వద్వర్యుఁడితనిపితామహుఁడు. పండితోత్తముఁడైనశివగురు వితనితండ్రి. సతీమణియైనఆర్యాంబ యితనితల్లి మాటలతోనే విద్యలు వచ్చినయీతఁడెనిమిదవయేఁట నుప నీతుఁడై యుపదేశమాత్రమున నే వేదవేదాంగములు స్వాయత్తము గావించుకొన్నప్రతిభాశాలి. అయినను, నిమిత్తమాత్రముగా నితని గురువు గోవిందభగవత్పాదాచార్యులు. తల్లియనుమతిఁగొని యాయన యుపదేశమున నితఁడు బ్రహ్మవిద్యారహస్యవేత్తయై సన్యసించి వైదిక ధర్మరక్షణము పరతత్త్వజ్ఞానబోధనము తనప్రధానకార్యములుగాభావించి పరమతఖండనము గావించుచు నద్వైతమతప్రచారము గావించుచు నాసేతుహిమాచలము సంచరించి జగద్గురువిఖ్యాతి గాంచెను. ఇమ్మహా నీయునిజీవితకాల మంతయు ముప్పదిరెండేండ్లని ముప్పదియాఱేండ్లని రెండు మతములు కలవు. ఎట్లయిన నల్పాయుర్దాయమేకదా!

కొన్నిప్రాచీనార్వాచీన గురువిజయశంకరవిజయములును ద్వార కాదిమఠములకొన్నిచరిత్రలును, ఈజగద్గురువు కలియుగము 2593లో జన్మించి 2625 లో బ్రహ్మీభూతుఁడైనట్లు తెల్పుచున్నవి. వీటినిబట్టి శ్రీశంకరులు నేఁటికి 2526 సంవత్సరములక్రిందట జన్మించినట్లు భావించవలెను. మాక్సుముల్లరుమొదలగు పాశ్చాత్యపండితులుకొంద

ఱితఁడు క్రీ. ౭౮౮ ప్రాంతమువాఁ డనిరి. తిలాంగుపండితాదు లితఁడు క్రీ.౯౦౦ప్రాంతమువాఁ డనిరి. భండార్కరుపండితుఁడు నిట్లె యభిప్రాయ పడెను. ఇట్లే మఱికొందఱుపరిశోధకు లితనిని క్రీ.ఏడవశతాబ్దిలోను ౮వ శతాబ్దిలోను తొమ్మిదవశతకములోను, పదవశతాబ్దిలోను కూడా చేర్చి యున్నారు[1]. పైపరిశోధకులయభిప్రాయము లన్నియు పరిశీలించిన వెంక టేశ్వరపండితులు "శంకరాచార్యులు క్రీ. ౮౦౫-౮౯౭ నడుమ ౯౨ సంవ త్సరములు జీవించియున్నా" రని వ్రాసినారు[2]. ఇట్లున్నమతభేదములను బట్టి యితనికాలము మిక్కిలిసందిగ్ధముగా నున్న దని విదిత మగుచు న్నది. కాని, పెక్కం డ్రయభిప్రాయము గ్రాహ్యమనుపక్షమున నితఁడు క్రీ. ౭-౮ శతాబ్దులమధ్య నున్నవాఁ డని విశ్వసింపవలసియున్నది. శంకర విజయకర్తలు, మిక్కిలియర్వాచీనులును శంకరులు మహేశ్వరునియవ తారమని విశ్వసించినవారు నగుటచే కాలనిర్ణయమున మొదటిశంకర విజయకర్త చెప్పినయతిశయోక్తినే ప్రమాణముగా గ్రహించినారు గాని, యావిషయమును సప్రమాణముగా నిరూపించినవారు కారు. వా రంద ఱును తక్కినపరిశోధకులును నిర్ణయించినట్లు జగద్గురునిజీవితకాల మత్యల్ప మనుట నిజము గాని, ఒకానొకరు భావించినట్లు ౯౨ సంవత్స రము లితఁడు జీవించినవాఁ డనుటమాత్రము విశ్వసనీయము కాదు.

ఆకాలమున జైనబౌద్ధమతములదాడికి గుఱియై చితికిపోవుచున్న వైదికధర్మముల నుద్ధరింప నడుముగట్టి యాసేతుహిమాచలము జైత్ర యాత్ర సలిపినమహనీయుఁడు కుమారిలభట్టు. ఆనాస్తికమతముల నణఁ గింప సమకట్టి భరతఖండమంతట నద్వైతమతము స్థాపింప మతవిజయ యాత్ర సలిపినమహానుభావుఁడు శంకరాచార్యులు. వీ రిద్దఱు నొకరినొ కరు పేర్కొనిరనుమాటనిజము. ఆనాఁ డట్టిగ్రంథములలో నట్లు పేర్కొను

---

1. మా. కృష్ణమాచార్యులుగారి (ఆంగ్లమున) సంస్కృతసారస్వతము. 831 పు.
2. రాయల్ ఏషియాటిక్ సొసైటీజర్నలు. P. 151—1916

డియాచారమును తక్కువ. గురుద్రోహదోషము శాంతించుటకై కుమారిలభట్టు తుషాగ్నిలో ప్రవేశించినసమయమున తనభాష్యమునకు వార్త్తికము వ్రాయవలసిన దని యీశంకరుఁ డతనిని కోరినట్లుచెప్పెడికథయు విశ్వసనీయము కాదు. అయినా యిట్టికథలనుబట్టి వీ రిద్దఱు నెంతో యంతరము లేనిసన్నిహితు లని మాత్రము భావింపవచ్చును. కావున, దేశమంతట వ్యాపించుచున్నయానాస్తికమతములను క్షీణదశకు తెచ్చి పరమపదించిన కుమారిలభట్టుపరమతవిదళనకృత్యము నీశంకరుఁడు తుదముట్టించె నని విశ్వసించుట సముచితము కాకపోదు. దానంజేసి కుమారిలభట్టునకు నతనిశిష్యుఁ డైనభవభూతికి నించుక పరుఁడై శంకరాచార్యులు శా. శ. ౬౭౦-౭౨౦ నడుమ నున్నవాఁ డని భావింతము. ఇదే బహుపరిశోధకసమ్మత మైనశంకరులకాలము.

ఈమహాత్ముఁడు శతాధికగ్రంథకర్త. ఇతనికృతు లన్నియు నిరువదిసంపుటములుగా ప్రచురింపఁబడి లోకమంతట వ్యాపించి యున్నవి. ఈవశ్యవాణినోట వచ్చినమాట లెల్ల కృతు లైనవి గాని, లేకున్న నేమానవమాత్రుఁ డైన నింతటిస్వల్పజీవితములో నిన్నికృతులు నిర్మింపఁ గలుగునా? ఎంతటియసాధారణప్రతిభాశాలి కైనా వేదవేదాంగవేదాంతదర్శనములు చదువుటకే ముప్పదియేళ్ల కాలము చాలదు. అవి చదివి తత్సార మెఱిఁగి ప్రస్థానత్రయ మనఁబడెడిబ్రహ్మసూత్ర దశోపనిషద్భగవద్గీతాభాష్యముల వంటిజగ దేకపూజ్యము లైనమహాగ్రంథములు రచియించుట కింకెంతకాలము పట్టునో యూహింపవలసిన దే. మఱియు, నొకదృఢగాత్రుఁ డైనబలశాలి యాసేతుహిమాచలము పాదచారియై పట్టితీర్థయాత్ర చేయుటకే కొన్నిసంవత్సరములు పట్టును. అట్టియెడ దేశమంతట నలమికొన్ననాస్తికమతముల నణఁగించుచు, అద్వైతమతము స్థాపించుచు, తద్రక్షణార్థము నలుదెసల జగన్నాథ శృంగేరీ ద్వారకా బదరీకేదారముల మఠములు స్థాపించుచు మతయాత్ర చేయుట కెన్నిసం

వత్సరములు పట్టునోకదా! అట్టియెడ నిట్టిమహాకార్యము లన్నియు ముప్పదిరెండేళ్ల జీవితకాలములో నిర్వహించినయీమహామహిమసంపన్నుడు శంకరావతార మని విశ్వసించుట యాశ్చర్యమా? ఇట్లు విశ్వసించినది సామాన్యలోకముమాత్రమే కాదు. ఈయనగ్రంథములకు వ్యాఖ్య లనువ్యాఖ్యలు కారికలు వృత్తులు నిర్మించినమహావిద్వాంసులు లోకోత్తరచరితులు నైనఆనందగిరి వాచస్పతిమిశ్ర గోవిందానందాది యోగీంద్రులే యితని నీశ్వరావతార మని మనసార భావించియున్నారు. ఈజగద్గురునిజీవితచరిత్రను శంకరవిజయ మనుపేర నుత్తమకావ్యములుగా నిర్మించినచిత్సుఖాచార్యశంకరానంద గోవిందనాథ వల్లీసహాయ సదానంద రాజచూడామణిదీక్షి తానంతానందగిరి చిద్విలాస విద్యారణ్య మాధవాదిమహనీయులెందఱో యీభగవత్పాదుఁడు భగవదవతార మని భావించి భక్తితో ప్రణమిల్లి ప్రశంసించినారు.

ఇతఁడు జీవేశ్వరైక్యవాది యయ్యును జిజ్ఞాసువులకు సాధనచతుష్టయసంపత్తి క్రిందిమెట్టుగా దేవతారాధనభక్తిమార్గము నుపదేశించి మానసికపూజావిధానోపయుక్తము లైన స్తవము లష్టకములు మొదలైనబహుకృతులు నిర్మించెను. అం దొక్కొక్కటియు నీశ్వరారాధనపర మయ్యు నాత్మజ్ఞానము బోధించునదే కాని యన్యము కాదు. ఇదే యీయద్వైతమూర్తి భక్తుల కుపదేశించినసులభముక్తిమార్గము. ఒక భక్తుఁ డారాధించు దేవత యేదైనా, అది పరమాత్మస్వరూపమే యని బోధించుటయే యితనికృతులలోనిపరమార్థము. ఇతఁ డుపదేశించినశాక్తమంతయు, ప్రకృతిపురుష తత్త్వజ్ఞానపర మనుట విదితము.

"మన్త్రాం స్తాంత్రికవైదికాన్ పరిపఠన్ సానన్ద మత్యాదరాత్,
స్నానం తే పరికల్పయామి జనని! స్నేహాత్త్వ మఙ్గీకురు."

ఇత్యాదిక మైనదేవీమానసికపూజావిధానము మనోనిగ్రహమునకు మూల మనుట నిరాక్షేపము. ఈయనసౌందర్యలహరీశివానందలహరీకావ్యముల శైలి నిరుపమానము. అనుకరింత మన్నను శక్యముకానిది.

శ్రీవిష్ణునాభీకమలమును వర్ణించినయీశ్లోకమందలికల్పన మెంతమనోహరమో !

" పాతాళం యస్య నాళం వలయ మపి దిశాం పత్రపంక్తిం నగేంద్రా
విద్వాంసః కేసరాళీ ర్విదు రిహ విపులాం కర్ణికాం స్వర్ణశైలమ్,
భూయా న్మాయత్స్వయంభూమధుకరభువనం భూమయం కామదం నో
నాళీకం నాభిపద్మాకరభవ మురు తన్నాగశయ్యస్య శౌరేః "

ఈక్రింది త్రిపురసుందరీమానసికపూజావిధాన మెంతటిమాధు ర్యైన భక్తిమార్గమునకు త్రిప్పును గదా !

" మమ న భజనశక్తిః పాదయో స్తే న భక్తిః
న చ విషయవిరక్తి ర్ధ్యానయోగే న సక్తిః,
ఇతి మనసి సదాహం చింతయ న్నాద్యశక్తే!
రుచిరవచనపుష్పై రర్చనం సంచినోమి.

ఈకవికులగురునిస్తుతికావ్యము లన్నిటిలో పండితపామరసాధార ణముగా లోకమంతట వ్యాపించినవి భజగోవిందశ్లోకములు. అందలి—

" నారీ స్తనభరనాభీదేశం, దృష్ట్వా మాగా మోహావేశమ్,
ఏత న్మాంసవసాదివికారం, మనసి విచింతయ వారం వారమ్ "

ఇత్యాదిశ్లోకములు భక్తిజ్ఞానవైరాగ్యములను పామరులకు కూడా సులభముగ బోధించుచు నెంతో హృదయంగమములుగా నున్న వనుట విదితము.

ఇతనిదక్షిణామూర్త్యష్టకము సర్వాంతర్యామి యైనయష్టమూ ర్తియే. సకలవేదాంతసారమును కరతలామలకము గావించుచు, ఆత్మ జ్ఞాన మక్షిగోచరము గావించునది నిరుపమానము. దీనికి సాటియైనది మనీషాపంచకము. ఆత్మైకత్వవిజ్ఞానమున కది యవధి. ఈరెంటినుండి రెండు—

" నానాచ్ఛిద్రఘటోదరస్థితమహాదీపప్రభాభాస్వరం
జ్ఞానం యస్యతు చక్షురాదికరణద్వారా బహిః స్పందతే
జానామీతి తమేవ భాంత మనుభా త్యేత త్సమస్తం జగత్
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే "

" శశ్వ న్నశ్వరమేవ దృశ్య మఖిలం నిశ్చిత్య వాచా గురో,
ర్నిత్యం బ్రహ్మ నిరన్తరం విమృశతా నిర్వ్యాజశాన్తాత్మనా,
భూతం భావిచ దుష్కృతం ప్రదహతా సంవిన్మయే పావకే,
ప్రారబ్ధాయ సమర్పితం స్వవపు రి త్యేషా మనీషా మమ "

ఉత్తమ మధ్యమాధికారివివక్షతో నాయాతరగతులవారి కాత్మజ్ఞానము కలిగింప నర్హము లైనకృతులు రచియించి ప్రబోధము గావించిన జగద్గురువు పరమకారుణికోత్తముఁడు సచ్చిదానందమూర్తి యైన యీశంకరభగవత్పాదుఁడు బదరీనారాయణసన్నిధిని శరీరముపరిత్యజించి బ్రహ్మీభూతుఁ డయ్యెను.

గీ. అఖలవేదాంతవాక్యసమన్వయంబు
సకలమతభేదవాదైక్యసాధనంబు
నైనయద్వైతమును దెల్పునఖిలగురుఁడు
శంకరాచార్యులకు నమస్కారశతము.

# సుబంధుఁడు

బాణుఁడు ముందా, సుబంధుఁడు ముందాయన్నచర్చ విమర్శకలోకమున కొట్టినపిండి. సంస్కృతవాసవదత్తాపీఠిక సుబంధుని బాణభట్టవామనాచార్యులనడుమ చేర్చినది. ఆంగ్లీకృతవాసవదత్తాపీఠిక బాణుని కించుక పూర్వమే సుబంధుఁ డున్నాఁ డన్నది. నే నీకవిజీవితప్రథమముద్రణమున సుబంధుఁడు బాణునితరువాతివాఁ డనియే తెలిపియున్నాను.

ఆవిషయమే సంగ్రహించి యిందు తెలుపుచున్నాను. అసలీ చర్చకు మూల మైనవి మూఁడే విషయములు.

(౧) పతంజలి మహాభాష్యములో " లుబాఖ్యాయికాభ్యో బహులమ్ " అనువార్తికము వివరించుచు, ఆఖ్యాయికకు వాసవదత్త నుదాహరించుట.

(౨) బాణునిహర్షచరిత్రావతారికలోను, ఒకానొకలిఖితవాసవదత్తాపుస్త ముకడపటను, ఈక్రిందిశ్లోకము కనవచ్చుట " కవీనా మగళద్దర్పో నూనం వాసవదత్తయా, శక్త్యేవ పాండుపుత్రాణాం గతయా కర్ణ గోచరమ్ "

(3) సుబంధుకవికృతముగా గద్యకావ్యము కనవచ్చుట.

ఇపుడు దేశమున విస్తరించినవాసవదత్త కాళిదాసభవభూతి కృతులలోని కథాంశములను స్మరించినది గావున[1] నిది పతంజలి పేర్కొన్నవాసవదత్త కా దనుట స్పష్టము—అది యేమైనదో తెలియదు. ఇంక—రెంటిలోను గనవచ్చుపైశ్లోక మెవరి దన్నవివాదములో నదిబాణు నిదే యని తేలినది—పతంజలి యుదాహరించినవాసవదత్తను కనియో లేక దానిఘనత వినియో బాణుఁడు దానిని ప్రశంసించి యుండఁగా, లభ్య మైననేఁటి (సుబంధు) వాసవదత్త చదివినయర్వాచీనపండితుఁ డొకఁడు బాణునిహర్షచరిత్రలోని వాసవదత్తాప్రశంసాశ్లోకము సుబంధునివాసవ దత్తకు సంబంధించినదే యని భ్రాంతిపడి, ఆశ్లోకమును తానుగన్నలిఖిత వాసవదత్తాపుస్తకము చివర చేర్చియుండును. అందుచేతనే లిఖితపుస్తక

1. —ముక్తై వేందుమతీ మహిమ్న్య ప్యజానురాగిణీ బభూవ-
—విఫల మేవ దుష్యంతస్య కృతే దుర్వాసస శ్శాప మనుబభూవ శకుంతలా.
—సదారామాశ్రితై ర్మహావీరచరితై రివ నారీకేళీధరైః
మాలతీమాధవము వాసవదత్తను పేర్కొన్నది గాని, ఆమె ఉదయనుని పెండ్లాడినది. ఈముద్రితకావ్యములోనివాసవదత్త కందర్పకేతుని పెండ్లాడినది. కావున సంశయింపఁ బనిలేదు.

ముల నన్నిట నీశ్లోకము లేకుండుట తటస్థించినది. ఇంక-పైవిమర్శనము నుబట్టి ప్రాచీనవాసవదత్త యీసుబంధుకృతవాసవదత్త కాదనుట విదితమైనది గావున, దీనికర్తయైనసుబంధుఁడు బాణునికి కాదు సరిగదా, భవభూతికి కూడా పూర్వుఁడుకాఁజాలఁ డని స్పష్టపడినది. ఇఁకనో వామనాచార్యుఁడు తనకావ్యాలంకారసూత్రవృత్తిలో నుత్కలికాప్రాయమున కుదాహరణముగా నీవాసవదత్తలోని యీక్రిందివాక్య ముదాహరించియున్నాఁడు కావున నతని కితఁ డించుక పూర్వుఁ డని విశ్వసింపవచ్చును. ఆవాక్య మిది:—

" కులిశ శిఖర ఖర నఖర ప్రచండ చపేటాపాటితమత్త
మాతంగకుంభస్థ" లేత్యాది-

ఇంక, బాణునితరువాతివాఁ డయినకవిరాజు తనరాఘవపాండవీయములో తనగొప్ప చెప్పుకొనుచు వ్రాసినయీక్రిందిశ్లోకములో బాణుని ముందు సుబంధుని చేర్చెను గావున నితఁడే ముం దని యెవరేని భ్రాంతిపడవచ్చును. కాని, పౌర్వాపర్య నిర్ణయమున నిట్టిమాటలు ప్రమాణములు కానేరవు.

" సుబంధు ర్బాణభట్టశ్చ కవిరాజ ఇతి త్రయః,
వక్రోక్తిమార్గనిపుణాః, చతుర్థో విద్యతే న వా "

ఇట్టిమాటలే ప్రమాణములైతే " సుబంధౌ భక్తిర్నః క ఇహ రఘుకారే నరమతే, ధృతి ర్దాక్షీపుత్రే " ఇత్యాదిపూర్వకవిప్రశంసాశ్లోకమునుబట్టి పాణినికంటె కాళిదాసు, అతనికంటె సుబంధుఁడు పూర్వుడని చెప్పవలసివచ్చును. కావున భట్టబాణునికి పరుఁడై వామనాచార్యుని కించుక పూర్వుఁడునై మనసుబంధుఁడు శా. ౬౭౦ ప్రాంతమున నుస్నవాఁ డనుట విశ్వసనీయము.

ఇతని వాసవదత్త మిక్కిలి ప్రౌఢగద్య కావ్యము. ఈ మాట యితఁడే గ్రంథాంతమందు వ్రాసికొనెను.

" ప్రత్యక్షరశ్లేషమయ ప్రపంచ విన్యాసవైదగ్ధ్యనిధిం ప్రబంధం,
సరస్వతీదత్తవరప్రసాద శ్చక్రే సుబంధు స్సుజనైకబంధుః "

ఇందలికథ ప్రసిద్ధ వాసవదత్తాకథలకంటె వేఱుగా నున్నది. భాసకాళిదాసశ్రీహర్షాదులు వాసవదత్తతండ్రి ఉజ్జయినీరా జగుమహాసేనుఁడు ప్రద్యోతుఁడని ద్వివిధముగా పేర్కొన్నారు. అం దొకటి నామాంతర మనుటస్పష్టము. ఈకావ్యమో కుసుమపురరా జగుశృంగారశేఖరుఁడు వాసవదత్తతండ్రి యన్నది. ఈకథకు మూల మైనబృహత్కథ ననువదించిన బృహత్కథామంజరీకథాసరిత్సాగరములు చండమహాసేను డేయన్నవి. గ్రంథమధ్యమం దొకచోట "అపూర్వా బృహత్కథామయానుశ్రితా ప్రత్యక్షీకృతాచ" అనుమాట లున్నవి గాని, వర్ణితకథావిషయముమాత్రము దానికి వేఱే. ఇతరకవు లందఱివాసవదత్త ఉదయనుని (వత్సరాజును) వరించినది. ఈ సుబంధునివాసవదత్త కందర్పకేతునివరించినది. భవభూతి మాలతీమాధవములో బృహత్కథ ననుసరించియే" వాసవదత్తాచ పిత్రా రాజ్ఞే సంజయాయ దత్త మాత్మాన ముదయనాయ ప్రాయచ్ఛత్" అని వ్రాసియున్నాఁడు, ఈవిధముగా నితఁడు కథాకల్పనాస్వాతంత్ర్యము చూపియు, పాఠకరంజక మైన ప్రౌఢశైలితో సరసవర్ణనలతో మనోహరముగ నీవచనకావ్యము రచియించె ననుట నిరాక్షేపము.

ఇందలినాయకుఁడు చింతామణిరాజపుత్రుఁ డైనకందర్పకేతువు కలలో నొకసుందరాంగిని చూచి, తనమిత్రుఁ డైనమకరందునికి చెప్పును శృంగారశేఖరునిపుత్రి యగువాసవదత్త యట్లే కలలో నొకసుందరాంగుఁ డగురాజపుత్రుని చూచి, తనమాలిక యనుతనపెంపుడుశారికతో చెప్పును. ఆయిరువురిసహాయమున నీనాయికానాయకుల మనోరథము నెఱవేఱును.

ఈకవి కాశ్మీరీయుఁ డని కొందఱు, ఉజ్జయినీప్రాంతమువాఁ డని కొందఱు భావించిరి. ఇతఁడు శుద్ధాద్వైతమతావలంబియనియు, వైది

కాచారసంపన్నుఁ డనియు నితనిరచనవల్లనే తెలియును, ఇతఁడు నిర్మిం చినకృతి యింకేదియు గోచరింపదు. ఈవాసవదత్తకు శ్రీకృష్ణసూరి జగద్ధర - త్రివిక్రమ - తిమ్మయసూరి - రామదేవమిశ్ర - శివరామాదులు సుమారు పదిమంది వ్యాఖ్యలు వ్రాసిరి. వివిధప్రాంతములలోనియింత మంది నిది యాకర్షించుటయే యానాఁటిదీనివ్యాప్తికి నిదర్శనము. మంఖ రాజశేఖరాదు లీసుబంధుని శ్లాఘించియున్నారు. వామనభట్టబాణుఁడు భట్టబాణుని ప్రశంసించుచు, శ్లేషించి సుబంధు నిట్లు కొనియాడియు న్నాఁడు.

"ప్రతికవిభేదనబాణః, కవితాతరుగహనవిహరణమయూరః,
సహృదయలోకసుబంధుః, ర్జయతి శ్రీభట్టబాణకవిరాజః,

## హలాయుధుఁడు

ఈపేరు గలకవు లిద్దఱు ముగ్గు రున్నారు గాని[1]. అభిధానరత్న మాల యనెడి గొప్పనిఘంటువు స్తుతించిన హలాయుధుని గూర్చి మన మిపుడు ప్రసంగింతము——వంగదేశములోని దక్షిణరాఢ మండలమందలి "నవగ్రామ"మితనిజన్మస్థలము. ఈ మండలము హుగ్లీ జిల్లా ఖురీషుత్ పరగణాలో చేరినది. విద్యావంతుఁ డైనపిదప నితఁ డేకారణముననో దక్షిణాపథమునకు వచ్చి మాన్యఖేటమును పాలించుచున్న రాష్ట్రకూట రాజగుకృష్ణరాజునాదరము గాంచి తదాస్థానవిద్వత్కవి యయ్యెను. ఆమాన్యఖేట మిపుడు "మల్ఖేడు" అనుపేర నైజామురాజ్యములో చేరియున్నది. ఈవిషయము లితనికృతులవల్లనే విశద మగుచున్నవి. శివభక్తుఁ డైనయితఁడు రచియించిన హలాయుధస్తవములోని తుదిశ్లోక ములలోని దిది:——

1. వైష్ణవసర్వస్వము నిర్మించినయతఁడును, శ్రాద్ధకల్పసూత్రము రచించినయతఁడును హలాయుధులే-వారు వేఱు. శా. ౧౧౦౦ ప్రాంతమువారు,

" ద్విజో దక్షిణరాఢీయో, నవగ్రామవినిర్గతః,
హలాయుధబుధ శ్శంభో, రిమాం స్తుతి మరీరచత్ "
" ఇతి సమాప్త మవాప్తగుణోదయం, కవిరహస్య మిదం రసికప్రియం,
సదభిధాననిధానహలాయుధ, ద్విజవరస్య కృతి స్సుకృతాత్మనః "

దీనినిబట్టి, అభిధానరత్నమాల నిర్మించుటచే సదభిధాననిధానుఁడనుఖ్యాతి గాంచిన హలాయుధుఁ డనుద్విజుఁడే యీకవిరహస్యకర్త యని విశద మైనది—ఈకవిరహస్యమునకు కవిగుహ్యము అపశబ్దాభాస కావ్యము నని నామాంతరములు కలవు. అపశబ్దములుగా కనవచ్చు వందలకొలఁదిశబ్దముల సాధుత్వప్రకటనముతోడి కావ్య మిది. దీనివ్యాఖ్యాత యగురవిధర్మనిమాట లివి:—

" కవిగుహ్యం ప్రసక్త్యాదిభావగమ్య మనేకథా,
యస్య యే నోపసర్గేణ ధాతోః కవిపదంచయత్,
అర్థత శ్శబ్దతో వాపి సమార్ణ ధాతూన్ నిబధ్నతా,
తథా హలాయుధే నేదం కృతం కవిరహస్యకమ్,
ఆభాసన్తి పదా న్యత్ర ప్రచురా ణ్యపశబ్దవత్,
తద్వ్యైవమ్యం స్వభావేన నిబద్ధన మపేక్షతే,
అపశబ్దాభాసాఖ్యే కావ్యే టీకాశతాని చతుర్దశాని,
రచితాని కవిరహస్యం నామ కావ్యం సమాప్తమితి"

ఇతనిని పోషించినరాష్ట్రకూటరాజు మొదటి కృష్ణరాజే యని చరిత్రపరిశోధకులలో కొందఱు భావించిరి. అదే సముచితము. పుష్పదంతుని మహిమ్నస్తవము, ఓంకారక్షేత్ర మైనఅమరేశ్వరమండపము నందు శిలలపై చెక్కఁబడిన దని మున్ను చదివియున్నాము. అట్లే ఈ హలాయుధస్తవముకూడా శా. గూలే లో ఆమందిరమందే రాళ్ళమీదఁ చెక్కఁబడినది. శిరియాళునిభక్తిని పరీక్షింపవచ్చిన శివుని కతఁడు పుత్రమాంసము వండించి విందుచేసె నన్నకథ విని హలాయుధుఁడు

కోపగించి, అభోజ్యవస్తువు పెట్టినయాభక్తుని దానిని తిన్నశివుని వెలి వేసె ననియు పిదప పార్వతి వచ్చి కోరఁగా నితఁడావెలి తొలఁగించె ననియు నొకకథ బసవపురాణాదుల కనఁబడుచున్నది. ఈ రెంటినిబట్టి, ఈహలాయుధుఁడు, శా. ౯౫౫-౭౦౫ నడుమమాన్యఖేట మేలిన మొదటి కృష్ణరాజునాదరము గాంచినవాఁడన్నశివపంచస్తవీపీఠికమాట విశ్వసనీయ మగును.

హలాయుధుఁడు సారసత్వమున పెక్కువిషయములలో స్వతంత్రుఁడు ఇతఁడు, అభిధానరత్నమాల బ్రాహ్మణసర్వస్వము శివసర్వస్వము న్యాయసర్వస్వము మత్స్యసూక్తతంత్రము కవిరహస్యము నను కృతులనే కాక, పింగళనాగకృతచ్ఛందస్సునకు మృతసంజీవిని యనుటీక కూడా నిర్మించి నట్లితనియీక్రిందిమాటయే తెల్పుచున్నది.

"పింగళాచార్యరచితే ఛందశ్శాస్త్రే హలాయుధః,
మృతసంజీవినీం నామ వృత్తిం నిర్మితవా నహమ్"

ఇతనిహలాయుధస్తవమునకు మధ్యదేశమం దెక్కువప్రచారము కలదు. పుష్పదంతునిశివస్తుతివలె భక్తలోకమునకు పఠనీయ మైనదీని గుణసంపదను వేఱుగా వర్ణింపఁబనిలేదు. శైలికై రెండుశ్లోకములు.

"బంధచ్ఛేదా దిహ తనుభృతాం య త్త్వయా సాక మైక్యం,
సా చే న్ముక్తి శ్శివ! కి మనయా యాతు య ద్వాంధకూపం,
త్వ మ్మే స్వామీ భవదనుచర శ్శర్వ యత్సర్వ దాహం,
త ద్ధి శ్లాఘ్యం స్వపతిపదవీం కామయన్తే న భృత్యాః
"కాలేన నీత స్స ర్గోఽపి, పున రావర్తతే జనః
మహాకాలేన నీతస్య, నావృత్తి ర్విద్యతే పునః.
"జ్ఞానం న స్యాత్ క్వచి దపి కిల జ్ఞేయసంబంధశూన్యం,
జ్ఞేయం సత్తా మపి న లభతే జ్ఞానబాహ్యం కదాచిత్,
ఇ త్యన్యోన్యగ్రథిత ముభయో ర్వ్యాపకం య త్స్వరూపం,
త త్తే ప్రాహుః ప్రకృతిపురుష స్యార్ధనారీశ్వరత్వమ్"

# శివయోగి

ఇతఁడు ప్రాచీనుఁడైనవీరశైవాచార్యుఁడు. ఇతఁడు రచియించిన సిద్ధాన్తశిఖామణిలోనిశ్లోకములను శ్రీపతిపండితారాధ్యుఁడు నతనిపూర్వుఁడైనశ్రీకంఠాచార్యుఁడును తమశైవసూత్రభాష్యములలో నుదాహరించుటంబట్టి వారికి పూర్వుఁడైనయీశివయోగి శా. శ. ౨౦౦ ప్రాంతమువాఁడై యుండును. ఇతనితండ్రి సిద్ధనాథుఁడు. అతఁడు రేణుకవిజయకర్తయైనసిద్ధనాథుఁడు కాఁడు.

సిద్ధాంతశిఖామణి యేకవింశతిపరిచ్ఛేదములగ్రంథము. ఇందు భక్త-మాహేశ్వర-ప్రసాది- ప్రాణలింగి-శరణ-ఐక్యస్థలనామకములైన యాఱుస్థలములను, వానిలోనియవాంతరభేదములును విశదీకరింపఁబడినవి. ఇది వీరశైవవిజ్ఞాననిధి యని తన్మతమువారు దీని నారాధింతురు. ఇందలివి నాలుగు శ్లోకములు:—

" అజ్ఞానతిమిరం చిత్తదర్పణం యో విశోధయేత్,
ప్రజ్ఞావిభూతియోగేన త మాహు ర్గురుసత్తమమ్ "
" అపరోక్షితతత్త్వస్య జీవన్ముక్తస్వభావినః,
గురోః కటాక్షసంసిద్ధా కో వా లోకేషు దుర్లభః ? "
" వేదశాస్త్రపురాణేషు కామికాద్యాగమేషుచ
లింగధారణ మాఖ్యాతం వీరశైవస్య నిశ్చయాత్,
" శివప్రసాదే సతి యోగభావః, సర్వం శివైకాత్మతయావిభాతి,
స్వకర్మముక్త శ్శివభావితాత్మా స ప్రాణలింగీతి నిగద్యతేఽసౌ "

అనామయస్తవకర్త ప్రసిద్ధదండ్యాచార్యుఁ డని వీరశైవమతాచార్యులవిశ్వాసము. దానినిబట్టి చూడఁగా నతనికి మున్నే యీశైవమతము దేశమున నెలకొనియున్న దనియు సీశివయోగిశివాచార్యునితండ్రి నాఁటికే వీరశైవసారస్వతము రూపొందఁ జొచ్చె ననియు చెప్పవలసియున్నది.—

# మాయురాజు

పూర్వాలంకారికుల మాటలనుబట్టి యితఁ డుదాత్తరాఘవనాటకము నిర్మించినవాఁ డని తెలిసినదిగాని, ఆరూపక మిప్పుడు మృగ్యము. ఇతని దేశకాలాదులును సరిగా తెలియరావు. కాని, ఈనడుమ నితనిని గూర్చి కొందఱుపరిశోధకులు ప్రకటించినయభిప్రాయములనుబట్టి రెండు క్రొత్తవిషయములు తెలియవచ్చినవి. అం దొకటి:- "మాహిష్మతీపురము రాజధానిగా చేదిమండల మేలినఖలచరి (కాలచురీ) పాలకుఁడు, నరేంద్రవర్ధనుని కుమారుఁడు నైనఅనంగహర్షుఁడే మాయురాజు. కుట్టనీమతములో దామోదరగుప్తుఁడు వేశ్యాప్రసంగమున స్మరించిన అనంగహర్షుఁ డతఁడే[1] మురారికవి అనర్ఘరాఘవమున సంభాషణవశమున వర్ణించిన అనంగుఁడే యీయనంగహర్షుఁడు. ఉదాత్తరాఘవము నిర్మించిన మాయురాజే యనంగుఁడగుటచేతనే తన రామనాటకమున కించుక పూర్వముదయించిన దానిపై నీర్ష్యచే మురారి సందర్భముఁ కల్పించుకొని యనంగుని నిందించి యుండెను[2]".

ఈయద్భుతకల్పనము పాఠకుల కెట్లు రుచించునోకాని, దామోదరగుప్తుఁడు వర్ణించినయనంగహర్షుఁడే మాయురాజని నమ్ముటకు బలవత్ప్రమాణ మేది? పూర్వాలంకారికులలో నొక్కఁడైన నితని యనామాంతరమును స్మరింపలేదుగదా? పూర్వోదాహృతమైనమురా

---

1. "వయమపి దేవనికేతన మనంగహర్షే గతే త్రిదివలోకమ్" ౨౨౨ శ్లో.

2. అన్యతో దర్శయన్ ఇయంచ ఖలచరీనరేంద్రాసాధరణాగ్రమహిషీ మహిష్మతీ నామ చేదిమండలమండనమాలా నగరీ ఇహహి.

శ్లో. ఆశ్లేషచుంబనరతోత్సవకౌతుకాది,
క్రీడాదురోదరపణప్రతిభూ రనంగః,
భోగస్స యద్యపి జయే చ పరాజయే చ,
యూనాం మన స్తదపి వాంఛతి జేతు మేవ. అనర్ఘరాఘవసప్తమాంకే.

రిశ్లోకములోనివర్ణితవిషయ మెఱిఁగినవారి కందలి యనంగశబ్ద మనంగహర్షరాజును సూచించున దన్నభావ ముదయింపదుగదా? ఇఁక నెట్టికల్పము విశ్వసనీయ మగును? ఇంక—

మాయురాజు తాపసవత్సరాజము నిర్మించె నన్నవిషయము నాలోచితము: ఆనందవర్ధనుఁడు నభినవగుప్తుఁడు మొదలగులాక్షణికులు స్మరించిన యీపేరుగలనాటక మొకటి పూర్వము పండితలోకము నాదరము గాంచిన దనియంగీకరింపక తప్పదు. కాని, యిపుడు విపుల మైనపీఠికతో ముద్రిత మైనతాపసవత్సరాజ[1] మీమాయురాజు నిర్మించినదేనా? యన్నవిషయమును పాఠకులు నిర్ణయించుకొనవలసియున్నది.

“తాపసవత్సరాజములోని కొన్నిమాట లెత్తిన యానందవర్ధనాదులలో నొకరు నిది మాయురాజుకృతియనలేదు. మాయురాజుపే రెత్తి హేమచంద్రధనికాదిలాక్షణికు లుదాహరించినమాటలు, ఉదాత్తరాఘవములోనివే యని స్పష్టముగా తెలియుచున్నది. ధనికుఁడు తాపసవత్సరాజములోనిమాటలు దశరూపకవ్యాఖ్యలో నుదాహరించె నని కొంద ఱన్నారు గాని, అది వట్టిమాట. అతఁడు దీనిపేరే యెత్తలేదు. ఇంక, భోజరాజు, కవిపేరు గాని గ్రంథముపేరుగానిచెప్పక యుదాహరించినయొకశ్లోకములోనియుత్తరార్ధమును,[2] నేఁడు ప్రకటిత మైనతాపసవత్సరాజము నొకశ్లోకములోని యుత్తరార్ధమును సమాన

1. శ్రీమానవిల్లిరామకృష్ణకవిగారు (మద్రాసు) ప్రకటించిరి.
2. “సంధ్యాకాన్తికషాయితేనవభసాప్రత్యక్ష శస్తై
ర్లీలావేశ్మని దీపరశ్మిజటిలం నీలం తమో జృంభతే,
వేల్లద్బాహులతావిలోలవలయస్వానై రితి స్సూచిత,
వ్యాపారాః ప్రనియోజయన్తి వివిధా వారాంగనా వర్ణకాన్”
3. “ప్రారబ్ధో మణిదీపయష్టిషు సమం పాతః పతంగై రితో,
గంధాంధై రమితో మధువ్రతకులై రుత్పక్ష్మభి ర్నీయతే,
వేల్లద్బాహులతావిలోలవలయ స్వానై రితి స్సూచిత,
వ్యాపారాః ప్రతియోజయన్తి వివిధా వారాంగనా వర్ణకాన్”

ముగా నున్నవి గావున, అదియు దాత్తరాఘవములోనిదే యనుకొని దానికర్తయగు మాయురాజే దీనికర్త యని నిర్ణయించుట యెంతవఱకు సముచితమో యూహింపవలసినదే.

భాసునిస్వప్నవాసవదత్త చారుదత్తాదులలోని శ్లోకమో తదర్ధమో తద్భాగమో కుంతలకావ్యదర్పణ మృచ్ఛకటికాదులలో గ్రహింపఁబడి యున్నవికదా! ఇదియు నట్టిదే కావచ్చును.

ఇంతికునుభోజుఁడుదాహరించిన శ్లోకముదాత్తరాఘవములోనిదే యనిసప్రమాణముగా నిరూపింపఁబడినవి కావు. అట్లునిరూపింపఁబడి నను, ముద్రితమైన తాపసవత్సరాజము మాయురాజనిర్మితమనుటకు గాని, ఆనందవర్ధనాదులు చూచినతాపసవత్సరాజ మిదే యనుటకు గానియుత్తమప్రమాణము లభించువరకు, దీనినిమాయురాజున కారోపించుట శూద్రకాదులకు పద్మప్రాభృతకాదు లారోపించుటవంటిదే యగును.

ఈమాయురాజనంగహర్షుఁడు కాఁడు గావున, చేదిమండలేశ్వరుఁడు కూడా కాఁడు కాని, యెట్లయినక్షత్రియుఁడని పేరునుబట్టి నమ్మవచ్చును. మురారి కావించె ననియారోపింపఁబడిన " యనంగ " నింద యితని కెట్లును సంబంధించినది గా దనుట వాస్తవమైనా " యది క్షుణ్ణం పూర్వైః " అనుచు నతఁడు తనకు మున్నెన్నో రామకథానాటకములు వెలసినవనియుచెప్పుటనుబట్టి మహావీరచరితము మాఘ్యనాకాలమున విద్వాదాదరము గాంచినయుదాత్తరాఘవముకూడాము రారికి ముందే జనించి యుండు నని భావించుట సముచితమే యగును. అందుచే నితఁడు శా. ౭౦౦ ప్రాంతమువాఁ డనుట యిప్పటికి యుక్తము

తక్కినలాక్షణికులు కొందఱితని యుదాత్తరాఘవములోనియొక్కమాట యుల్లేఖించి చూచినంతమాత్రమున నితఁడుమహాకవి యని భావించుట లేదు. ఇతనికవిత్వమహత్త్వమును ధనికుఁడు చూపినాఁడు

గనుక నానందవర్ధనాదులపరిశంస కితఁడు పాత్రుఁడే యని భావించుచున్నాము.

ధనికుఁడు చూపినరాక్షససంవాదమును, చిత్రమాయ శ్రీరామ సంభాషణమును, కథాకల్పనవైచిత్రిని తెలుపుచున్నవి. రసనాయకవిరుద్ధములు పరిత్యాజ్యములను లక్షణమున కనుకూలోదాహరణముగా "మాయురాజు నెపమొకటి కల్పించి వాలివధ విడిచిపెట్టె" ననుచు నితనిపాత్రౌచిత్యపోషణమును ప్రశంసించియున్నాఁడు[1]. వస్తుపాత్రముఖబీజములలో నొకదానిని సూత్రధారుఁడు సూచింపఁ దగునన్నలక్షణమునకు వస్తుసూచకమైన యీక్రింది శ్లోకము నుదాహరించెను.

"రామో మూర్ధ్ని నిధాయ కానన మగాన్మాలా మివాజ్ఞాం గురో
స్తద్భక్త్యా భరతేన రాజ్య మఖిలం మాత్రా సహైవోజ్ఝితమ్,
తౌ సుగ్రీవ విభీషణా వనుగతౌ నీతౌ పరాం సంపదం,
ప్రోద్వృత్తా దశకంధరప్రభృతయో ధ్వస్తా స్సమస్తా ద్విషః"

మాయేంద్రజాలాదులచే కల్పింపఁబడిన కృత్రిమవస్తువున కుదాహరణముగా, రాక్షసమాయచే నుత్పన్నమైనకటికిచీఁకటి సూర్యకిరణకాంతిని గూడ జయించిన దని తెలిపెడి యీక్రిందిశ్లోకము చూపెను.

"జీయన్తే జయినోఽపి సాంద్రతిమిరవ్రాతై ర్వియద్వ్యాపిభిః,
భాస్వన్తస్సకలా రవే రపి రుచః కస్మా దకస్మా దమీ,
ఏతా శ్చోగ్రకబంధరంధ్రరుధిరై రాధ్మాయమానోదరా
ముంచం త్యాననకందరానలముచ స్తీవ్రారావాః ఫేరవాః"

అనిష్టశ్రవణమున కుదాహరణముగా, ఖరదూషణత్రిశిరాదులు శ్రీరామునిహతు లగుట రాక్షస సంభాషణమునఁ దెలుపఁబడినది—

1. యథా ఛద్మనా వాలివధో మాయురాజే నోదాత్త రాఘవే పరిత్యక్తః- దశరూ. ౩. ప్ర.

మారీచుఁడు తనమాయామృగరూపము విడిచి సౌమిత్రితో పోరాడుచున్నట్లు చిత్రమాయుఁడు చెప్పఁగా శ్రీరాముఁడు సంభ్రాంతుఁడై యన్నమాట లివి:—

" వత్స స్యాభయవారిధేః ప్రతిభయం మన్యే కథం రాక్షసాత్,
త్రస్త శ్చైష ముని ర్విరౌతి మనస శ్చాస్త్యేవ మే సంభ్రమః,
మాహాసీ ర్జనకాత్మజా మితి ముహు స్స్నేహా ద్గురు ర్యాచతే,
న స్థాతుం నచ గంతు మాకులమతే ర్మూఢస్య మే నిశ్చయః"

ఇత్యాదిగా ధనికుఁడు చూపినయుదాహరణములనుబట్టి యతని నాఁటి కుదాత్తరాఘవము దేశమున బాగా వ్యాపించి విద్వాదాదరము గాంచి యున్న దని తెలియుచున్నది.

## భట్టనారాయణకవి

వేణీసంహార మనెడి సుప్రసిద్ధనాటకము నిర్మించిన యితని కాల నివాసాదులనుగూర్చి ప్రాచ్యపాశ్చాత్య విమర్శకు లెందఱో యెన్నిరీతు లనో వ్రాసియున్నారు. అవి యన్నియు ముద్రితములై దేశమున వ్యాపించినవే. అందుచే వారివారి యభిప్రాయములు మాత్రమే యిందు గ్రహింతము.

ఈకవి కాన్యకుబ్జమునుండి వంగదేశమునకు శా. ౭౫౫ లో నలసవచ్చినాఁ డని యొకరు. ఆవలస వచ్చినసమయము క్రీ. ౬౪౦ ప్రాంత మని యింకొకరు. క్రీ ౭౮౦ లో భట్టనారాయణునికి దాన మిచ్చినట్లు ఖలింపురశాసనము చెప్పుచున్న దని మఱియొక రనఁగా, ఆదానము క్రీ. ౭౦౦-౭౮౦ నడుమ వంగరాష్ట్రము నేలినధర్మపాలుఁడు భట్టనారాయణుని కుమారుని కిచ్చిన దని తరువాతిపరిశోధకు లన్నారు. దండి రచియించిన మూఁడవగ్రంథము, అవంతిసుందరీకథ యని యు

దానిలో నారాయణుఁడు మూఁడుగ్రంథములు రచించినట్లు[1] చెప్పు చున్న శ్లోక మీభట్టనారాయణునికి సంబంధించినదే యనియు నవీన పరిశోధకు లూహించి, మన యీకవి దండికి పూర్వుఁ డని యుపదేశించుచు, నితఁడు మఱి రెండు కావ్యములు నిర్మించినవాఁ డని యభిప్రాయ పడి యున్నారు[2] ఇంక నిట్టి భిన్నమతములు కలవుగాని, ఒక్కటియు నితనికాల మిదియని నిరూపించినది లేదు. ఆనందవర్ధనుఁడును వామనాచార్యుఁడును వేణీసంహారశ్లోకములను తమలక్షణములం దుదాహరించుకొన్నారు గావున వారికంటె నితఁడు పూర్వుఁ డన్న మాట మాత్ర మందఱు నెఱుఁగుదురు. నేఁటి కీయంశ మొకటే యాధారము. అందుచే నితఁడు శా. ౬౫౦-౭౨౦ నడుమ వేణీసంహారము నిర్మించి యుండు నని భావింతము. పైని పేర్కొన్న తామ్రశాసనములోనిదాన మితని పుత్రుని కిచ్చిన దన్న మతముచే కూడా మనభావన బలపడుచున్నది. కాణేపండితాదులు వేణీసంహారటీకాదులం దీకవి క్రీ. సప్తమశతాబ్ది లోనివాఁ డనుటయు సరిపడుచున్నది.

వేణీసంహార మాఱంకములనాటకము. ఇందు వీరము ప్రధానము. దుశ్శాసనుఁడు ద్యూతసభ కీడ్చుకొని వచ్చినపుడు విడిపోయిన ద్రౌపదివేణిని భీముఁడు ముడివేయుట యను కథాభాగ మిందలి యితివృత్తము. ఈక్రింది భీమవచన మీనాటకమందలి సారాంశమును తెల్పుచున్నది.

“ చత్వారో వయ మృత్విజ స్స భగవాన్ మర్మోపదేష్టా హరిః,
సంగ్రామాధ్వరదీక్షితో నరపతిః పత్నీగృహీతవ్రతా,
కౌరవ్యాః పశవః ప్రియా పరిభవక్లేశోపశాంతిః ఫలం
రాజన్యోపనిమంత్రణాయ రసతి స్ఫీతం యశోదుందుభిః”

---

1. వ్యాప్తం పదత్రయేణాపి య శ్చక్రే భువనత్రయమ్,
తస్య కావ్య త్రియావ్యాప్తౌ చిత్రం నారాయణస్య కిమ్”

2. చూ. కృష్ణమాచార్యులుగారి ఆంగ్ల సం. సా. చ, పు. 612-18

ఈనాటకమునకు జగద్ధరజగన్మోహనాదివిద్వాంసులు వ్యాఖ్యలు రచించిరి. ఇది పెక్కు భాషలలోని కనువదింపఁబడినది. క్రీ. దశమ శతాబ్దిలో మహాభారతము జావాభాషలోనికి పరివర్తిత మైన దనియు అందాదిపర్వము మొదట మూడుశ్లోకము లున్నవనియు వానిలో నీక్రింది వేణీసంహారశ్లోక మొకటి యనియు తెలియవచ్చుచున్నది. దీనిని బట్టి యీ నాటకము జావా దేశమునం దా కాలమున వ్యాపించిన దనవచ్చును.

" జయతి సనాభి ర్జగతాం స్వనాభి రన్ధ్రోద్భవజ్జగద్విజః,
దామోదరో నిజోదర గహ్వరనిక్షిప్తజగదండః "

భీముఁడు దుశ్శాసనునిపొట్ట చీల్చి నెత్తురు త్రాగి దుర్యోధనుని తొడలు విఱుగఁగొట్టి యతని నెత్తురు మేనఁ బూసికొని యా నెత్తుటి చేతులతో ద్రౌపదిశిరోజములు ముడుచుటకై ద్రౌపదియెక్కడ యెక్కడ -

" ఊరూ కరేణ పరిఘట్టయత స్సలీలం
దుర్యోధనస్య పురతో ఽపహృతాంబరా యా,
దుశ్శాసనేన కచకర్షణభిన్నమౌళిః
సా ద్రౌపదీ కథయత క్వ పునః ప్రదేశే? "

అనుచుఁ బరుగెత్తుకొనివచ్చుచుండుటయు, ధర్మరాజ తనిని జూచి దుర్యోధనుఁ డని భ్రాంతిపడి కౌఁగిటఁ బట్టుటయు, భీముఁ డని తెలిసి యందఱు సంతసించుటయు ననుకథాభాగ మెంతేని రసోచితమై సామాజికులకు వీరావేశము పుట్టించునదిగా నున్నది. సుప్రసిద్ధ మైన యీనాటకమునుగూర్చి విశేషించి వ్రాయఁబనిలేదు. వామనానందవర్ధనాది లాక్షణికు లందఱు దీనిశ్లోకములను దమకృతుల స్వీకరించుటయే దీని ఘనతను జాటఁగలదు. దశరూపకము ఛలోక్తి కుదాహరించిన దిది:—

" కర్తా ద్యూతచ్ఛలానాం జతుమయశరణోద్దీపన స్సోఽభిమానీ
రాజా దుశ్శాసనాదేర్గురు రనుజశత స్యాంగరాజస్య మిత్రం,
కృష్ణాకేశోత్తరీయవ్యపనయనపటుః పాండవా యస్య దాసాః

క్వా స్తే దుర్యోధనో౽సౌ కథయత పురుషా ద్రష్టుమభ్యాగతౌ స్వః
ఇతఁడు శాండిల్యగోత్రుఁడు, మృగరాజనామాంతరుఁడు, ధర్మకీర్తి భట్టబాణులకు సమకాలికుఁడు, ధర్మకీర్తితోఁ గలసి రూపావతారము రచించినవాఁడు” ననుచు నొకక్రొత్తమత ముదయించినది గాని, అది విశ్వాస్యము కాదు.

# జయాపీడ నృపాలుఁడు

సంస్కృతభాషాపోషకుఁడును విద్వత్కవియు నైనయీకాశ్మీర రాజు శా. ౭౭౭-౭౦౮ నడుమ రాజ్యము చేసినట్లు రాజతరంగిణిని బట్టి చరిత్రకారులు నిర్ణయించిరి, కాని, యిటీవల మఱికొంద ఱితని కాలమును కొంచెము వేఱుగా నిర్ణయించిరి[1] ఇతనితాత లలితాదిత్యముక్తాపీడుఁడు. ఇతనితండ్రి వజ్రాదిత్యుఁడు బప్పియ లలితాదిత్యనామాంతరుఁడు. సంగ్రామాదిత్యుఁ డితనియన్న. అతనిని దప్పించి యితఁడు రాజయ్యెను. క్షీరస్వామిబుధునిశిష్యుఁడై వ్యాకరణాదిశాస్త్రము లభ్యసించినయితని నాకాలమున జయాపీడపండితుఁ డని పిలిచెడివా రని రాజతరంగిణి:-

“ క్షీరాభిధా చ్ఛబ్దవిద్యోపాధ్యాయా త్సంభృతశ్రుతః,
బుధైస్సహ యయౌ వృద్ధిం స జయాపీడపండితః,
తావ త్పండితశబ్దో౽భూ ద్రాజశబ్దా దపి ప్రథా”

ఇతనిమంత్రులు పండితులు, సభలోనిసభ్యు లందఱు పండితులు. ఇంత యేల ? ఇతనినాఁడు కాశ్మీరరాజధాని పండితమయము. శబ్దశాస్త్రప్రియుఁ డైనయీరాజపండితుఁడు తనదేశమందు మహాభాష్యపాఠము విచ్ఛిన్న మగుట కనిపెట్టి దేశాంతరమునుండి పండితులను రావించి దానినివిద్యార్థిలోకమున బ్రవర్తింపఁజేసినవాఁడు. క్షీరస్వామి-దామోదర

1. క్రీ. 751-782,-779-813. రాజతరంగిణి మాపిన కాలములను నిర్ణయించుటలో పాశ్చాత్యు లించుక వేఱయిరి.

గుప్తుఁడు—వామనుఁడు ననుముగ్గురు నితనిముఖ్యమంత్రులు, ఆస్థానకవులు. మనోరథుఁడు—శంఖుఁడు—దత్తుఁడు—చటకుఁడు—సంధిమంతుఁడు ననునైదుగురు నాస్థానకవులు. ఇంక నెందఱుండిరో! ఈకవిపండితసభ కధ్యక్షుఁ డుద్భటభట్టు.

" విద్వాన్ దీనారలక్షేణ ప్రత్యహం కృతవేతనః
భట్టో౽భూ దుద్భట స్తస్య భూమిభర్తు స్సభాపతిః"
స దామోదరగుప్తాఖ్యం కుట్టనీమతకారిణమ్,
కవిం కవిం బలిరివ ధుర్యం ధీసచివం వ్యధాత్,
మనోరథ శ్శంఖదత్త శ్చటకః సన్ధిమాం స్తథా,
బభూవుః కవయ స్తస్య వామనాద్యాశ్చ మన్త్రిణః" రాజ.౪

మొదటిశ్లోకములోనిలక్షశబ్దమునకు శతసహస్రమర్థము కాదు. "లక్షదర్శనాఙ్కనయోః" అను లక్షధాత్వర్థమునుబట్టి యిక్కడ దీనార మనుగుర్తుగల యొకనాణె మర్థ మగును. దీనినిబట్టి యుద్భటునికి దినమున కొకదీనారము వేతన మని చెప్పనగును. జయాపీడుఁడు తనపేర తొంబదితొమ్మిది కోట్లదీనారములు ముద్రింపఁజేసె నఁట. ఆదీనారము విలువ యెంతో తెలియరాదు.

అట్టి యీసభాపతిని పైని పేర్కొన్నకవులను ధీరశంకరస్వామి యను కామకోటిపీఠాధిపతి శాస్త్రవాదమున నోడింపఁగా నీజయాపీడుఁడు మెచ్చుకొని భక్తినమ్రుఁడై యాస్వామిని శారదాదేవియెదుట నుండు సర్వజ్ఞపీఠ మెక్కించి గౌరవించె నని సద్గురుసంతానపరిమళములోనిశ్లోకములు తెల్పుచున్నవి. ఆస్వామి, శా. ౭౧౦ లో పుట్టి ౭౬౨ లో సిద్ధిపొందె నని తన్మఠచరిత్రలు చెప్పుచున్న వఁట. అవి చెప్పినకాలము విశ్వాస్యమైనచో మనజయాపీడుఁడు శా. ౭౦౧—౭౩౫ నడుమ రాజ్యము చేసె నని చెప్పవలసి వచ్చును. కాని, యీమఠచరిత్రాదుల మాటలు అంతవిశ్వసనీయములు కా వందురు.

ఇతనికృతి యేదియు నిపుడు కనరాదు గాని, హృదయరంజకము లైనజయాపీడునిశ్లోకములు నేఁడు గూడా పండితులు చదువుచున్నా రని కల్హణుఁ డనియున్నాఁడు.

"అవస్థావేదికా స్తత్ర గ్రథితాః పృథివీభుజః,
ఆర్ద్రాన్తఃకరణైః శ్లోకాః స్మర్యన్తేఽద్యాపి సూరిభిః

సుభాషితరత్నావళిలో నీజయాపీడునిదిగా నీక్రిందిశ్లోకము కనఁబడుచున్నది.

"పురో రేవాపారే గిరి రతిదురారోహశిఖరః
సర స్సవ్యే, వామే దవదహనదాహవ్యతికరః,
ధనుష్పాణిః పశ్చాత్, శబరహతకో ధావతితరాం.
న యాతుం న స్థాతుం హరిణశిశు రేష ప్రభవతి"

వేఁటగాఁడు వెంబడించు లేడిపిల్లదురవస్థ యిందు వర్ణింపఁబడినది.

## ఉద్భటుఁడు

ఇతఁడు జయాపీడునిపండితసభ కధ్యక్షుఁ డని యిపుడే చదివి యున్నాము. అతనికాలమునందును, ఆసభలోనిపండితులకాలమందును మతభేదము లున్నవి. వానినిబట్టి జయాపీడరాజ్యకాలమున సుమా రిరువదిసంవత్సరములు తేడా కనఁబడుచున్నది. జయాపీడుని రాజ్యారంభము శా. ౬౭౭ అనుటయే సరి యని భావించినచో నతఁడు ధీరశంకరస్వామిని శా. ౭౩౦ ప్రాంతమున శారదాపీఠ మెక్కించె నన్న కథ విశ్వసనీయము కాదు. ఉద్భటవామనాదులకాలము శా. ౭౦౧–౭౩౫ అని విశ్వసించినచో, కాశ్మీరసంస్థానమున జయాపీడుఁడు శా. ౭౦౦ ప్రాంతమునందు పండితసభ స్థాపించె ననవలసివచ్చును. వెయ్యేండ్లక్రిందటివిషయమున నిరువది సంవత్సరముల తేడా గణింపఁదగినది కాదు కావున నెట్లయిన నుద్భటదామోదరవామనమనోరథాదులు కాశ్మీరసం

స్థానమున మంత్రులు పండితులునై శా. ౭౦౦ ప్రాంతమం దున్నా రని నమ్మవచ్చును.

దేశమున వన్నె కెక్కినయాలంకారికకృతులలో నితనికావ్యాలంకారసంగ్రహ మొకటి. ఇది యాఱువర్గముల గ్రంథము. ఇందు ప్రతిపాదింపఁబడినయలంకారములు ౪౧. ఉదాహరణశ్లోకములు గాక యిం దున్నకారికలు ౭౯. ఇందు ముఖ్యముగా ననుప్రాసరూపకాద్యలంకారముల లక్ష్యలక్షణసమన్వయమే కనవచ్చును గాని సాహిత్యవిశేషచర్చ లంతగా గోచరింపవు-భామహునిమతము నితఁడు కొన్నిచోట్ల ఖండించి యున్నాఁడుగాని, అతనియెడ గౌరవము చూపక పోలేదు.

అనుప్రాసలలో పరుషానుప్రాసను చేర్చుట, ప్రేయోఽలంకారమును భావాలంకారముగా మార్చుట, శ్లేష నర్థాలంకారములలో చేర్చుట యితనిస్వాతంత్ర్యమునకు గుర్తు. ప్రతీహారేందురాజు రచియించినలఘువృత్తి యితనికృతి కెక్కువ వ్యాప్తి తెచ్చిన దనుట నిజము. ఆనందవర్ధనాచార్యుఁ డితనియెడ మిక్కిలి గౌరవము చూపినమాట యు సత్యము.

రాజాదులుఇంక నితనిరచన లేవియు కనరావు గాని ప్రతీహారేందు కొంద ఱితఁడు భామహాలంకారవివరణమును, కుమారసంభవకావ్యము నిర్మించి నట్లును, ఇతనికృతిలో నుదాహరింపఁబడినరెండుమూఁడుశ్లోకము లాకావ్యములోని వైనట్లును పలికియున్నారు. ఆకృతులు కనరావు గాని యితనికుమారసంభవములోని వని సుమారు ముప్పదిశ్లోకములు కనవచ్చును. కాని[1] యవి యెక్కడివో తెలియదు.

నిజముగా నితనిశ్లోకము లిన్ని యింతకాలము జీవించియుంటే, ఇతనికి సుమారు నూఱుసంవత్సరములతరువాత నున్నవ్యాఖ్యాతకు నాలు గైనా లభింపవా !

1. చూ. డా. కృష్ణమాచార్యుల క్లాసికల్ లిటరేచరు. పే. ౩౨౩

"అనేకగ్రంథకృతా స్వోపరచితకుమారసంభవైకదేశో౽త్ర ఉదాహరణత్వే నోపన్యస్తః" అని యుద్భటుఁ డుదాహరించిన యొకశ్లోకమునుగూర్చి ప్రసంగించెను గాని, ఆయనేకకృతు లేవో పేర్కొనలేదు. తాను వేఱుగా కుమారసంభవములోని యింకొక శ్లోకము నెత్తి చూపలేదు. ఇతని నెంతో మెచ్చుకొన్నయానందవర్ధనుఁ డితరులశ్లోకము లెన్నో గ్రహించెనుగాని యితని దొకటియు నుదాహరించ లేదు. ఆనాఁటికే నష్టమైన యీకృతిలోని ముప్పదిశ్లోకము లీనాఁడు కనవచ్చుట యాశ్చర్యమే. ఇంతకును లభించినయీశ్లోకము లుపపురాణ శ్లోకశైలి నున్నవి గాని ప్రబంధశైలిని లేవు అయినా, అందలివి రెండు శ్లోకములు పాఠకులు పరిశీలింప నుదాహరింతును.

"తతః ప్రభృతి నిస్సంగో నాగకుంజరకృత్తిభృత్,
శితికంఠః కాలకంఠః సతీశోకానలవ్యథః"

"స గౌరీశిఖరం గత్వా దదర్శోమాం తపఃకృశామ్,
రాహుపీతప్రభ స్యేన్దో ర్జయన్తీం దూరతస్తనూమ్"

"కిం వా౽త్ర బహునోక్తేన వ్రజభర్తార మాప్నుహి,
ఉదన్వన్త మనాసాద్య మహానద్యాః కి మాసతే"

## దామోదరగుప్తుడు

కుట్టనీమత మనెడినీతిబోధక మైనస్వతంత్రకావ్యము నిర్మించిన యితని దేశకాలాదివిషయ మింతకు మున్ను తెలిసియున్నది.

కుట్టని యనఁగా, తార్పుకత్తె. కాశీనగరములోని మాలతి యను వేశ్య వికరాల యను దూతియింటి కేగి విటుల వశపఱుచుకొనెడి యుపాయములు తెలుపు మని కోరగా, అది సోదాహరణముగా వాటి నుపదేశించుట యిందలివస్తువు. ఇందుకుఁ గారణ మామాలతి మీఁదపై

నుండి యొకనాఁడు వీథిని బోవుచో కగాయకుఁడు చదివిన యీ క్రింది శ్లోకము వినుట.

" యౌవనసౌందర్యమదం దూరే త్యాజాస్య వారవనితాభిః
యత్నేన వేదితవ్యాః కాముకహృదయార్జనోపాయాః"

ఈకావ్యము చదివినవారు వారకాంతలమాయోపాయము లిట్టివని తెలుసుకొని వాళ్ళకు లోఁబడకయుండుట కవియాశయము. ఇందు కొంతగ్రంథము పోయినదిగాని, మిగిలినదైనను చిన్నదికాదు. ఇది చిరకాలము మఱుగుపడియుండి కావ్యమాలాసంపాదకుల ప్రయత్నమున లభ్యమై ౯౩౭ ఆర్యావృత్తములతో పాఠకులకు దృగ్గోచరమగుచున్నది. నేఁటికిని దీనికడపటిభాగము లభింపలేదు.

గ్రంథము మన్మథస్తుతితో నిట్లారంభమైనది.

" స జయతి సంకల్పభవో రతిముఖశతపత్రచుంబనభ్రమరః,
యస్యానురక్తలలనా, నయనాన్తవిలోకనం వసతిః"
" అవధీర్య దోషనిచయం, గుణలేశే సంనివేశ్య మతి మార్యాః,
కుట్టన్యా మత మేత, ద్దామోదరగుప్తవిరచితం శృణుత"

ఈకృతికి శంభలీమత మనునాఁబేరు గలదు. శంభలియనఁగా కుట్టని—

ఈగ్రంథములో కొన్నిగ్రామపురనామములు కొండలు రాజపుత్రులపేళ్లు కవులనామములు కావ్యములనామములు కూడా కనవచ్చుచున్నవి. అందు కొన్ని శ్లేషబద్ధములు గా నున్నవి. కథోచితముగా నున్నకొన్నిపదములు కవికావ్యాదిసంజ్ఞలుగా పాఠకులకు భ్రాంతి కలిగించుచున్నవి. కొందఱి నీకవి స్పష్టముగా పేర్కొన్నట్లే యున్నది. ఇందుకు కొన్నియుదాహరణములు:—

"భరత విశాఖిల దంతిల, వృక్షాయుర్వేదచిత్రసూత్రేషు,

ఇందు క్రమాలంకారమునుబట్టి, భరతుఁడు నృత్యశాస్త్రమును, విశాఖిలుఁడు ఆయుర్వేదగ్రంథమును, దంతిలుఁడు వర్ణచిత్రశిల్పగ్రంథ

మును నిర్మించినట్లు సూచన కనవచ్చుచున్నది. ఈ క్రిందిశ్లోకము శ్రీహర్షునిరత్నావళీప్రియదర్శికలను సూచించుచున్నది.

" వత్సేశ్వరభూమికయో ర్ద్వయ మనుకురుతే నరేశ్వరవయస్యః,
వాసవదత్తాద్వితయప్రయోగ మేషా విడంబయతి"

" ఆశ్లిష్టసంధిబంధం, సత్పాత్రసువర్ణయోజితం సుతరామ్,
నిపుణపరీక్షకదృష్టం రాజతి రత్నావళీరత్నం"

అనుశ్లోకము శ్లేషబద్ధమై రత్నావళీనాటికాసౌందర్యమును సూచించుచున్నది. ఇంక నిట్టి వెన్నేనివి శేషము లిందు కలవు. కవిత్వము మృదుమధురము భావగర్భితము ననుటకు రెండు శ్లోకములు—

" క్షణ దృష్ట నష్ట వల్లభ, జన్మజరావ్యాధిమరణపరిభూతే,
పరివర్తిని సంసారే, కః కుర్యా ద్వాగ్రహం మతిమాన్"

" పురుషాన్తరగుణకీర్తన మన్యోద్దేశేన చాత్మనో నిందామ్,
శృణ్వ న్నపి య స్స్వస్థః స్వస్థోఽసౌ కాలపాశబద్ధోఽపి"

వాత్స్యాయనితో మఱికొందఱు కామశాస్త్రకర్త లిట్లు పేర్కొనఁబడిరి.

" వాత్స్యాయన మదనోదయ దత్తక విటపుత్రరాజపుత్రాద్యైః"

వారస్త్రీస్వభావము స్వభావోక్తితో నిం దెక్కువగావర్ణింపఁబడినది. అందలిదొకటి:—

" రాగోఽధరే న చేతసి సరళత్వం భుజలతాసు న ప్రకృతౌ,
కుచభారేషు సమున్నతి రాచరణే నాభినందితే సద్భిః"

## వా మ నా చా ర్యుఁ డు

కాశ్మీరీయుఁ డైనయీపండితోత్తముఁడు పూర్వోక్తజయాపీడనరేంద్రునిమంత్రి, కావ్యాలంకారసూత్రములను తద్వృత్తిని రచియించినవాఁడు.

" కావ్యాలంకారసూత్రాణాం స్వేషాం వృత్తి ర్విధీయతే "

దండిమార్గమతమును రీతిమతమనుపేర వన్నెకుఁ దెచ్చిన యీ మహావిమర్శకుఁ డాలంకారికశిరోమణుల పాగ డ్త కెక్కెను. "రీతి రాత్మా కావ్యస్య" అనుమతము లేవ నెత్తి చక్కనిచర్చ గావించినయీకృతి యుదయించుచునే పండితలోకమున విఖ్యాతి నొందినది. ఆయిదధికరణముల యీకృతిలో బహువిషయములు సిద్ధాంతితము లైనవి. ఇందు ౩౧౯ సూత్రము లున్నవి. శారీర-దోషదర్శన-గుణవివేచన-అలంకారిక-ప్రాయోగికము లనెడి పంచాధికరణముల యీలక్షణములోఁ బూర్వ శాస్త్రకావ్యనాటకములలోని వాక్యములును ప్రాచీనులమతములును సందర్భోచితముగా నుద్ఘాటింపఁబడినవి. ఇతనిమతము నొకింత మమ్మట పండితరాజజగన్నాథా ద్యర్వాచీను లాక్షేపించిరి కాని, యితనిచర్చలును సిద్ధాంతములు నతిమనోహరములు. అర్థాలంకారము లన్నిటికి మూల ముపమ యనియు, సమాసోక్తిరూపకాదు లుపమలో నంతర్భూతము లనియు నితఁడు గావించిననిర్ణయమే యితనిప్రతిభను జాటును. ఈకృతికి వివృతి రచియించినసహదేవపండితుఁడు దీనివృత్తాంతము నిట్లు వ్యాఖ్యావతారికలోఁ జూపియున్నాఁడు.

"వేదితా సర్వశాస్త్రాణాం భట్టోఽభూ న్ముకుళాభిధః,
లబ్ధ్వాకుత శ్చిదాదర్శం భ్రష్టామ్నాయం సముద్ధృతమ్,
కావ్యాలంకారశాస్త్రం య త్తేనైత ద్వామనోదితమ్,
అసూయాత న్నకర్తవ్యా విశేషాలోకిభిః క్వచిత్.
అకర్ణ్యే భవత స్తస్మా ద్దయితస్య విధీయతే,
వివృతి స్సహదేవేన వామనీయస్య సంప్రతి"

ప్రచారము లేక కొంతకాల మణఁగియున్నయీగ్రంథమును ముకుళపండితుఁ డెట్లో సంపాదించి పునరుద్ధరణము గావించిన ట్లీమాటలవల్ల దెలియుచున్నది. కాని, ఆముకుళునికి పూర్వము దీని కీసహ

దేవుఁ డన్నంతగా వ్యాప్తి లేకపోలేదు. ఆనందవర్ధనాచార్యుఁడు ధ్వన్యాలోకములో రీతిమత మెత్తుటయే యిందుకు నిదర్శనము[1] "వామనాభిప్రాయే నాయమాక్షేపః" అనెడి యతనిభావమును లోచనములో సభినవగుప్తుఁ డావిష్కరించియున్నాఁడు[2]

ఈవామనుఁడు శాకుంతలము మృచ్ఛకటికము ఉత్తరరామచరిత్ర అమరుకము మొద లగుపూర్వకావ్యములనుండి శ్లోకము లుదాహరించియున్నాఁడు.

శా. ౧౪౭౦ లో గోపేంద్రత్రిపురహరభూపాలుఁడు వామనుని కృతికి కామధేను వను పేర చక్కనివ్యాఖ్య నిర్మించెను. ఆవ్యాఖ్యలో భామహునివిగా నుదాహరింపఁబడినకొన్నిశ్లోకములు ముద్రితభామహాలంకారములో కనరాకున్నవి. కాని, దీనినిబట్టి వామనుఁడు భామహుని మతము చర్చించె నని మాత్రము తెలియవచ్చును. ఇందలిప్రథమాధికరణములోని "సందర్భేషు దశరూపకంశ్రేయః" అనుసూత్రమునుబట్టి ధనంజయుని దశరూపకలక్షణము నితఁడు పేర్కొనె నని భావింపరాదు. దశరూపకం నాటకాది అనెడివామనునివృత్తి, యీపదము నాటకాది దృశ్యకావ్యపర మని తెల్పుచున్నది.

వామనసంజ్ఞ గలకృతికర్త లిద్దఱు ముగ్గు రుండుటచే నితనివిషయమున కొందఱు విమర్శకులు సంశయించిరి కాని, కాశికావృత్తి యనెడిపాణినీయసూత్రవృత్తినిర్మించిన వామనుఁ డితఁడు కాఁ డనుట విదితమే. ఉద్భటునితో జయాపీడనరేంద్రునియాస్థానమం దితఁ డుండుటే నొకరి నొకరు తమకృతులలో స్మరింపరా? కావున మంత్రివామనుఁడు

1. అస్ఫుటస్ఫురితం కావ్యతత్త్వ మేత ద్యథోదితమ్,
అశక్నువద్భి ర్వ్యాకర్తుం రీతయ స్సంప్రవర్తితాః" ఉ. 3. శ్లో. ౫౨

2. ఉ. ౨. శ్లో.౧3 వ్యాఖ్య.

కావ్యాలంకారసూత్రకర్త కాఁడని యొకరనిరి గాని, యది యుచితము కాదు. ఆనందవర్ధనునికి పూర్వము రీతిమతము లేవనెత్తుట కర్తయైన మతిరొక్క వామనుఁడు కనఁబడఁడు గావున జయాపీడుని సభలో నితఁడే మనోరథాదులతో విద్వత్కవియు మంత్రియునై యున్నవాఁడను టయు నితఁడే యీకృతి నిర్మించినవాఁ డనుటయు, నిరాక్షేపముగా విశ్వసింప నగును.

ఇతఁడు శా. ౭౧౬ తరువాత కొంతకాలము రాష్ట్రకూటరా జైనజగత్తుంగనరేంద్రునిసభలో నుండె నని యొకరనిరి. జయాపీడుఁడు గతించినతరువాత నితఁ డాయాస్థానమునకు వెళ్లె ననవచ్చును. ఇందు, కాలవైషమ్యము లేదు గాని, యీవిషయము సహేతుకముగా నిర్ణ యింపవలసియున్నది. అమరకోశవ్యాఖ్యలో లింగాభట్టు"వరరుచివాగురి వామనాదికృతాన్ త్రికాండ్యుత్పలనీ ప్రభృతీన్" అని వ్రాయుటచే వామనుఁ డొకశబ్దకోశము నిర్మించెననవచ్చును గాని, ఆవామనుఁడు మనవామనుఁ డని యెట్లనఁగలము? ఇంతకు నాకోశము కనరాదు.

సాహిత్యపరిశోధనమందును, లక్షణనిర్వచనమందును, ఇతని భావములు స్వతంత్రములు విలక్షణములు. ఇం దితఁడు కొన్నిలక్షణ ములు లక్ష్యములు శ్లోకమయములు గావించి యున్నాఁడు. వాటిలో కావ్యశోభాకరము లోజఃప్రసాదాదిగుణములే కాని యలంకారములు కావు. అవి గుణములు తెచ్చినశోభ నించుక యతిశయింపఁజేయునే కాని, స్వయముగా శోభ కలిగింపఁ జాల వనుచు వ్రాసినపద్యము లివి

"యువతేరివ రూప మంగ కావ్యం, స్వదతే శుద్ధగుణం త దప్యతీవ
విహితప్రణయం నిరన్తరాభి స్సదలంకారవికల్పకల్పనాభిః"

"యది భవతి వచ శ్చ్యుతం గుణేభ్యో, వపు రివ యౌవనవంధ్య మం గనాయాః
అపిజనదయితాని దుర్భగత్వంనియ తమలంకరణాని సంశ్రయంతే"

# మనోరథుఁడు

జయాపీడునిసభలోని కవియు వామనదామోదరాదుల మిత్రుఁడు నైనయితనికృతు లేవియుఁ గనరావు గాని, ఆనందవర్ధనుఁడుతన ధ్వన్యాలోకము మొదల "తథా చాన్యేన కృత ఏ వాత్ర శ్లోకః" అని యీక్రిందిశ్లోక ముదాహరించియున్నాఁడు. ఇది యానందవర్ధనునిసమకాలుఁ డగుమనోరథుని దని యభినవగుప్తుఁడు లోచనములో వ్రాసియున్నాఁడు. ఇతఁడు వామనాదులసహవాసి గాని, ఆనందవర్ధనునినాఁటివాఁడు కాఁడు. అయినా, యీశ్లోకముమాత్రము మనోరథుని దని గురుసంప్రదాయమునుబట్టి యభినవగుప్తుఁడెఱుఁగునని నమ్మవచ్చును. అది:-

" యస్మి న్నస్తి న వస్తు కించన మనః ప్రహ్లాది సాలంకృతి,
వ్యుత్పన్నై రచితంచ నైవ వచనై ర్వక్రోక్తిశూన్యం చ యత్,
కావ్యం తద్ధ్వనినా సమన్విత మితి ప్రీత్యా ప్రశంస న్జడో
నో విద్మో ఒభిదధాతి కిం సుమతినా పృష్టః స్వరూపం ధ్వనేః "

దీనినిబట్టి యితఁ డొక లక్షణగ్రంథము రచించెనేమో యని తోఁచుచున్నది.

# రుద్రటుఁడు

పేరునుబట్టి యితఁడు కాశ్మీరియుఁడుగా నున్నాఁడు. ఇతఁడు సామవేదీయుఁడు, వాముకభట్టుతనయుఁడు. ఈ పండితుఁడు పదునాఱుధ్యాయములయలంకారగ్రంథము నిర్మించెను. అందు 23రశ్లోకము లున్నవి. ఐదవ యధ్యాయమున ఖడ్గ ముసల ధను శ్చర శూల శక్తి హల బంధములతోడియెనిమిదిశ్లోకములయష్టారచక్రము గూర్చుచు నందు స్వవిషయ మంతర్భావిత మగున ట్లీక్రిందిశ్లోకమున నిమిడ్చియున్నాఁడు. ఇం దితనిమాఱుపేరు శతానందుఁ డని యున్నది.

" శతానందాపరాఖ్యేన, భట్టవాముకసూనునా,
సాధితం రుద్రటే నేదం సామాజా ధీమతాం హితమ్ "

ఇతనికాలమునుగూర్చియు నితనికృతులనుగూర్చియు భేదాభిప్రాయము లుదయించినవి. అవ్వాని లన్నియు నిపు డుద్ఘాటించుట గ్రంథవిస్తరమే కాక లాభము లేదు. ఉద్భటాలంకారమునకు వ్యాఖ్య నిర్మించినప్రతిహారేందురా జందలి విక్రమశకవత్సరములనుబట్టి శా. ౯౨౫ లో ని వాఁడనుట నిశ్చయముగదా! అతఁ డీరుద్రటునివాక్యము లుదాహరించి యున్నాఁడు. నమిసాధు వీరుద్రటాలంకారమునకు శా. ౯౯౧ లో టీక రచియించియున్నాఁడు[1] ఆనందవర్ధనుని ధ్వనిమతమును మనరుద్రటుఁ డెఱిఁగినట్లు కనఁబడదు. ఇతఁడు ద్వితీయాధ్యాయమున పాంచాలీ లాటీయా గౌడీయా వైదర్భరీతులను ప్రశంసించుటనుబట్టి వామనాచార్యుని రీతిమత మెఱిఁగినవాఁడుగా తోఁచుచున్నది. అందుచే వామనునికి సమకాలికుఁడు నించుక తరువాతివాఁడునై యితఁడు శా. ౭౪౦ ప్రాంతమం దున్నవాఁ డని భావింపవచ్చును. పెక్కండ్రమత మిదే.

ఇతనికృతి కితనిపేరే వచ్చినది. ఈకావ్యాలంకారములోని లక్ష్యలక్షణశ్లోకము లన్నియు నితనివే. వీనిలో నేరెండుమూఁడో తప్ప, తక్కిన వన్నియు నార్యావృత్తములే. ఇందు సాహిత్యమునకు సంబంధించినయెల్లవిషయములు పరామర్శింపఁబడినవి. అలంకారవిషయమున—

" అర్థ స్యాలంకారా వాస్తవ మౌపమ్య మతిశయ శ్శ్లేషః,
ఏషా మేవ విశేషా, అన్యేతు భవంతి నిశ్శేషాః"

అని రూపకాదులు వాస్తవౌపమ్యాదులభేదములుగా నిరూపింపఁబడుట యిందలివిశేషము. నమిసాధు వితనిమతము నెక్కువగా సమర్థించుచు, పూర్వగ్రంథములనుండి సముచితము లైనశ్లోకము లుదాహ

1. పంచవింశతిసంయుక్తై రేకాదశసమాశతైః, విక్రమా త్సమతిక్రాంతైః
ప్రావృషీదం సమర్థితం.

రించియున్నాఁడు. ఆశాధరుఁడు దీనికి మఱియొకవ్యాఖ్య రచించెను. వన తరంగిణి మొదలగు మఱికొన్ని వ్యాఖ్యలును దీని కుదయించినవి.

ఇందు మొదటి ౧౧ అధ్యాయములలోను, అలంకారశాస్త్ర కావ్యరచన ప్రయోజన కావ్యలక్షణ రీతిలక్షణ షడ్భాషాస్వరూప వక్రోక్తి యమకానుప్రాసాదులు, అర్థాలంకారభేదాదులు తద్దోషములు వర్ణింపఁబడినవి. తరువాతి రెండింటిలో దశవిధరసనాయికానాయక భేద శృంగారస్వరూపవీరాదిస్వరూపాదులును కడపటిదానిలో కథాఖ్యాయి కాదికావ్యభేదలక్షణములును నిరూపింపఁబడినవి.

రుద్రకవి లేక రుద్రభట్టు నిర్మించిన శృంగారతిలకము త్రిపురవధకావ్యము నితని వని కొందఱు భ్రాంతిపడిరి గాని, అవి యిత నివి కా వని యిప్పుడందఱు నంగీకరించుచున్నారు. ఈవిషయమును రుద్రభట్టుజీవితమున పరామర్శింతము.

## భట్టలోల్లటుఁడు

పూజార్హమిందు గ్రహింపఁబడుచున్న సుగృహీతనామధేయులలో మఱిముగ్గురి నిందు స్మరింతము. వారిలో నితఁడు రసవిచారమున నుత్ప త్తివాదము లేవనెత్తినవాఁడు. భరతనాట్యశాస్త్రవ్యాఖ్యాతలలో నొకఁడు. అభినవగుప్తాచార్యుఁ డితనివ్యాఖ్యానమును స్మరించెను గావున నతని కితఁడు పూర్వుఁడు. మఱియు భట్టశంకుకుఁ డితనియుత్పత్తివాద మును ఖండించెను గావున నతనికిని బూర్వుఁడు. అందుచే నితఁడు శా. ౭౨౦ ప్రాంతమున నున్నవాఁ డని చెప్పవచ్చును. ఇంతకంటె నితర మేమియు గోచరింపదు. ఇతనికృతి యేదియు నిపుడు కనిపించదు. కాని యితని యుత్పత్తివాదముమాత్రము తరువాతిలాక్షణికు లందఱికిని పని కల్పించిన దనుట వాస్తవము. సారస్వతమునం దితనిపేరు వ్యాపించుట

కదే కారణము. ఇతఁడు కాశ్మీరీయుఁ డనెడియభిప్రాయమును కొందఱావిష్కరించిరి. రాజశేఖరుఁడు తనకావ్యమీమాంసలో నితనిమాటలను శ్లోకముల నిట్లుదాహరించియున్నాఁడు.

" అస్తునామ నిస్సీమా అర్థసార్థః, కిన్తు రసవత ఏవ
నిబన్ధో యుక్తః, న నీరసస్య, ఇత్యాపరాజితిః యథా "

" మజ్జన పుష్పాపచయన సన్ధ్యా చన్ద్రోదయాది వాక్య మిహ,
సరసమపినాతి బహుళం ప్రకృతరసానన్వితం రచయేత్ "

" యస్తు సరిదద్రిసాగర పుర తురగరథాదివర్ణనే యత్నః,
కవిశక్తిఖ్యాతిఫలో వితతధియాం నో మతః సఇహ "

హేమచంద్రుఁడు తనకావ్యానుశాసనములో, నించుక మార్పుతో పైశ్లోకమును, మఱియొకశ్లోకమును "యథాహ లోల్లటః" అనుచు నిట్లుదాహరించియున్నాఁడు.

" యస్తు సరిదద్రి సాగర నగ తురగ పురాదివర్ణనే యత్నః,
కవిశక్తిఖ్యాతిఫలో వితతధియాం నో మతః ప్రబన్ధేషు "

" యమకానులోమతదితరచక్రాదిభిదో ఽతిరసవిరోధిన్యః,
అభిమానమాత్ర మేత ద్గడ్డరికాదిప్రవాహో వా "

వీటినిబట్టి లోల్లటుఁ డేకకావ్యలక్షణము నిర్మించె ననియు, అపరాజితునితనయుఁ డనియు నూహింపఁబడుచున్నది. అపరాజితునియొకశ్లోకమును వల్లభదేవుఁడు తనసుభాషితావళిలో కూర్చియున్నాఁడు. నిందాగర్భితమైన యాశ్లోక మిది:—

" క్షుత్ క్షామేన కథం కథం చి దనిశం గాత్రం కృశం బిభ్రతా,
భ్రాన్తం యేన గృహే గృహే గృహవతా ముచ్ఛిష్టపిణ్డార్థినా,
" అస్సః ఖణ్డ మవాప్య దైవపతితం శూన్యాం త్రిలోకీ మిమాం
మన్యానో ధి గహో స ఏవ సరమాపుత్రో ఽద్య సింహాయతే "

# భట్టశంకుకుఁడు

ఈవిద్వత్కవి. శా. ౭౩౬-౭౭౩ నడుమఁ గాశ్మీర మేలిన అజితాపీడ నరేంద్రునిసభలోనివాఁడనియు, భువనాభ్యుదయ మనుకృతి నిర్మించిన వాఁడనియు రాజతరంగిణి యిట్లు చెప్పుచున్నది.

" కవి ర్బుధ మన స్సిన్ధు శశాఙ్కః శంకుకాభిధః.
య ముద్దిశ్యాకరోత్కావ్యం భువనాభ్యుదయాభిధమ్ "

ఇతఁడీకావ్యమే కాక భరతనాట్యశాస్త్రమున కొకవ్యాఖ్య రచియించిన ట్లాలంకారికప్రతీతి కలదు. అభినవగుప్తపాదుఁ డితనివ్యాఖ్యలోనిమాటలు పరామర్శించి యున్నాఁడు. కాని, యివి రెండును దుర్లభములే. ఇతనిపేర నొకశ్లోకము సూక్తిముక్తావళిలో కలదు. గాని, అదియే సుభాషితావళిలో మయూరునికొడుకైనశంకుకునిపేరఁ గన వచ్చుచున్నది. అది యెవరిదో నిర్ణయించుట శక్యము గాదు. ఆశ్లోక మిది:—

" దుర్వారాః స్మరమార్గణాః ప్రియతమో దూరే మనోఽత్యుత్సుకం,
గాఢం ప్రేమ నవం వయోఽతికఠినాః ప్రాణాః కులం నిర్మలమ్,
స్త్రీత్వం ధైర్యవిరోధి మన్మథసుహృత్ కాలః కృతాన్తోఽక్షమః,
నో సఖ్య శ్చతురాః కథంను విరహ స్సోఢవ్య ఇత్థం శఠః "

ఈకవి తనభరతనాట్యశాస్త్రవ్యాఖ్యలో భట్టలోల్లటునిమతము విమర్శించినవాఁ డగుటయు నితఁడు పైకాలములోనివాఁ డగుటకు సరిపడుచున్నది. ఈహేతువుచేతనే యితఁడు మయూరతనయుఁడైన శంకుకునికంటె నితరుఁ డని చెప్పవలసి వచ్చుచున్నది.

# భట్టఘంటకుఁడు

ఇతఁ డుత్తరదేశీయుఁడే కాని, యితనినివాసము తెలియకున్నది. ఈకవి శంకుకునికంటెఁ బరుఁ డనుట కభినవగుప్తునిమాట లొకింత తోడ్ప

డుచున్నవి. అతనిమాటలనుబట్టి యితడు దృశ్యకావ్యలక్షణ మొకటి నిర్మించియుండు ననుట కవకాశ మేర్పడినది. అభినవగుప్తునిమాట లివి:—

"శ్రీశంకుకస్తు, అయుక్త మేత దిత్యభిధాయ అష్టధేతి వ్యాచష్టే. ఘంటకాదయ స్త్వాహుః, నాయకో నృపతి రిత్యేతావన్మాత్రమ్ నాటకాదా వుపజీవితం నతు ప్రఖ్యాతత్వ మపి తద్భేదద్వయా దస్యే షోడశభేదా ఇతి"

ఈక్రిందిశ్లోక మితనిదిగా సుభాషితావళిలో నున్నది—

"ధనుర్మాలా మౌర్వీక్వణదళికులం లక్ష్య మబలా,
మనో భేద్యం శబ్దప్రభృతయ ఇమే పంచ విశిఖాః,
ఇయా న్జేతుం యస్య త్రిభువన మదేహస్య విభవః
స కామః కామా న్వో దిశతు దయితాపాంగవసతిః"

దీనికంటెఁ బరమే కాని, యింతకంటెను సరసమైన శ్లోక మొకటి యీభావమునే విశదీకరించున భోజునిసభలో కొటువంటికవులలోనికోడలు నిర్మించినసమస్యాపూరణముగా భోజప్రబంధము లో నున్నది. అది:—

"ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ చంచలదృశాం,
దృశాంకోణో బాణః సుహృదపి జడాత్మా హిమకరః,
స్వయం చైకోఽనంగ స్తదపి భువనం వ్యాకులయతి,
క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే"

సంస్కృతసారస్వతమున నిట్టియనుకరణములు వందలకొలఁదిగా నున్నవి.

## మురారిభట్టు

స్వకాలమున వినుతి గన్నయుత్తమపండితకవులలో నితఁ డొకఁడు మౌద్గల్యగోత్రుఁడు తంతుమతీ వర్ధమానులపుత్రుఁడు బాలవాల్మీకి బిరు

దాంచితుండు సర్వశాస్త్రజ్ఞుండు నైనయీకవి మధ్యమదేశీయుండని సూత్రధారోక్తినిబట్టి యూహింపవచ్చును. ఈకవి నివాసము తెలియరాదుగాని, రత్నాకరకవి హరవిజయములో (౩౮సర్గ) శ్లేషోక్తిగా మురారిని నాటకమును సూచించినట్లు గోచరించుచున్నది గావున నతనికి తఁడు పూర్వుఁడన్న యభిప్రాయము వెలసినది. అది యుక్తమన వచ్చును. కావ్యాలంకార సూత్రవృత్తింగో ననర్ఘరాఘవశ్లోక మొకటియు నుదాహృతము కాలేదు గావున వామనాచార్యుని కీకవి పరుఁడని యూహించుటయు సముచితమే మఱియు, మహావీరచరిత్ర రామాభ్యుదయము ఉదాత్తరాఘవము నను రామనాటకములకంటె నితని యనర్ఘరాఘవము పరమని ప్రస్తావనలోని యితనిమాటలే సూచించుచున్నవి.

"యది క్షుణ్ణం పూర్వై రితి జహాతి రామస్య చరితం,
గుణై రేతావద్భి ర్జగతి పున రన్యో జయతి కః"

కావున శా. ౭౭౭ లోని రత్నాకరకవికి పూర్వుఁడైనయితఁడు ౭౨౦ప్రాంతము వాఁడనఁదగును.

ఇతని కావ్యముగా నేకంకముల యనర్ఘరాఘవనాటక మొకటియే కనవచ్చుచున్నది. విష్కంభాదులం దక్కడక్కడ చిన్నకల్పనలున్నను, ఇది వాల్మీకిరామాయణకథను సరిగా ననుసరించినదే యని యితనిమాటయే చెప్పుచున్నది.

"వాల్మీకివాగమృతకూపనిపానలక్ష్మీ
మేతాని బిభ్రతి మురారికవే ర్వచాంసి"

గురుకులముల నివసించి మిక్కిలి క్లేశము సహించి యార్జించిన యితని వైదుష్యము సారస్వతకూలంకష మని యీక్రిందిస్తుతివచనము తెలుపుచున్నది.

"దేవీం వాచ ముపాసతే హి బహవ స్సారంతు సారస్వతం,
జానీతే నితరా మసౌ గురుకులక్లిష్టో మురారిః కవిః,

అబ్ధిర్లంఘిత ఏవ వానరభటైః కిం త్వస్య గంభీరతా,
మాపాతాళనిమగ్నపీవరతను ర్జానాతి మంథాచలః"

ఇతనికావ్యము శబ్దకాఠిన్యమునకు నర్థగాంభీర్యమునకు ప్రసిద్ధికెక్కిన దని "మురారినాటకము చదువవలె నంటే ముందు మాఘకావ్యము చదువు" మన్నయొకపూర్వోక్త చాటూక్తి యిట్లు విశదీకరించుచున్నది.

"మురారిపదచిన్తా చేత్తదా మాఘే మతిం కురు,
మురారిపదచిన్తా చేత్తదా మాఽఘే మతిం కురు"

ధారాశుద్ధితోడియితనిరూపకము చదువ నింపుగా నుండునుగాని, గూఢార్థశబ్దప్రచుర మగుటచే లోకమాత్రము సాహిత్యజ్ఞానము కల వానికి చదివినంతనే యర్థము గాకుండు నదుటవిదితము. అందుచేతనే భాషాజ్ఞాన మెక్కువగా నలవఱచుకొనఁ జూచువిద్యార్థులు పాఠ్యకావ్యములలో నైషధమువలెనే దృశ్యకావ్యములలో ననర్ఘరాఘవమును కడపటఁ జదువుట మన దేశమునం దాచారమైనది. ఇది యట్టిది కావుననే, శబ్దశాస్త్రము చక్కఁగా నధిగమించి నిఘంటువులు శ్రద్ధగా పరిశీలించినవారికి మాత్రమే మురారినాటకము చదువ నధికారము కలదన్నయొక చాటూక్తి యిట్లు పుట్టినది.

"యే శబ్దశాస్త్రనిష్ణాతా యే శీలితనిఘంటవః,
తేషా మే వాధికారో ఽస్తి మురారికృతనాటకే"

ఇందు వీరము ప్రధాన మైనను, అద్భుతహాస్యాదిరసము లెడనెడ వర్ణింపఁబడినవి. చతుర్థాంకములోని రామపరశురామ సంవాదమున వీరముకన్న హాస్యమే హెచ్చు, పంచమాంకమున సుగ్రీవుని విషయమై లక్ష్మణుఁ డన్నమాట లంతగా నాపాత్రమున కుచితములు కావు. అయినా, ఆసందర్భములోని యీక్రిందిశ్లోకముమాత్రము వీరావేశము చూపుచు మనోహరముగా నున్నది.

“స్పితాయం రేతోభాస్త్వ తరణి రస్మత్కులగురుః.
మను ర్వైవమాత్రేయ స్తదపి సహజం మిత్ర మసి నః,
అథాపి జ్ఞాతేయం శిథిలయసి కాలేయతరళః,
శరా స్తస్మై వాలిక్షతజరసలోలాః ప్రతిభువః”

సూర్యాస్తమయ సూర్యోదయములందలి తామరరేకుల సంకోచ వికాసములు లిట్లుత్ప్రేక్షింపఁ బడినవి.

“ఏక ద్వి త్రి చతుః క్రమేణ గణనా మేషా మివాస్తం యతాం
కుర్వాణా సముకోచయ ద్దశశతా న్యంభోజసంవర్తికాః,
భూయోఽపి క్రమశః ప్రసారయతి తాః స్సంప్రత్యమూ నుద్యతః.
సంఖ్యాతుం సకుతూహలేవ నలినీ భానోః స్సహస్రం కరాన్”

రామరావణపర మైనయర్థమును సూచించు నీక్రింది సూత్రధార వచనము మనోహరమై నీతిదాయక మగుచున్నది.

“యాన్తి న్యాయప్రవృత్తస్య తిర్యంచోఽపి సహాయతామ్,
అపన్థానంతు గచ్ఛన్తం సోదరోఽపి విముంచతి”

పుష్పకారూఢులై లంకనుండి యయోధ్యకు వచ్చునపుడు శ్రీరాముఁడు సీతాదేవికి చూపుచు వచ్చిన గిరినదీకాననపురాదివర్ణనలు మనోహరములును, మురారికవి దేశజ్ఞానజ్ఞాపకములు నగుచున్నవి. ఆంధ్రదేశములో గోదావరిని ద్రవిడదేశములో కాంచిని అవంతీదేశములో నుజ్జయినిని మహారాష్ట్రదేశములో కుండినగరమును, చేదిమండలములో మాహిష్మతీనగరిని చూపెను. సప్తమాంకమందు సందర్భవశమున వర్ణింపఁబడిన యీవర్ణనలు కవికాలనిర్ణయమున కాధారములు కాఁదగవు కావున “ఆశ్లేషచుమ్బ నేత్యాదిశ్లోకమునందలి “అనంగ” పదము నరంగహర్షపరముగా నన్వయించి చేదిమండలపాలకుఁ డతఁడే యని కొందఱు నిర్ణయించుట సముచితము గాదు. ఈయంశము మాయురాజ జీవితమున విమర్శింపఁబడినది.

ఇది ప్రదర్శనమున సామాజికహృదయరంజన మయ్యెనో లేదో కాని, పఠనపాఠవ్యవహారమున దేశమంతట వ్యాపించిన దనుటకు నలుదెసల దీని కుదయించిన వ్యాఖ్యానబాహుళ్యమే సాక్షి—ఇతఁడు పాణినీయపారంగతుఁ డయ్యును శబ్దప్రయోగమున నిరంకుశుఁ డని "సంశృణుమహే" యనుప్రయోగము చెప్పుచున్నది. భట్టోజీదీక్షితు లివి ప్రామాదిక మన్నాఁడు. శాస్త్రార్థవిచారణయందు మురారి ప్రజ్ఞాశాలియై క్రొత్తదారి త్రొక్కునంతటి ధీరుఁ డని "మురారే స్తృతీయః పన్థాః" అన్న విద్వల్లోకోక్తియే చాటుచున్నది. ఇది రూపకరచనలో క్రొత్తదారిత్రొక్కుటచే వచ్చిన దని కొందఱు భ్రమించుచున్నారు గాని యది సరిగాదు. ఇతఁడు మీమాంసయందును న్యాయశాస్త్రమునందును విశేషపరిశ్రమ చేసి కొన్నిగ్రంథములు నిర్మించి యున్నాఁడు. అవి యిపుడు కనరావు గాని, యితనిమతమును, తర్కసంగ్రహదీపికకు ప్రకాశాఖ్యటీక వ్రాయుచు నీలకంఠపండితుఁ డిట్లుద్ఘాటించియున్నాఁడు— తర్కసంగ్రహదీపికాయాం ప్రామాణ్యవాదే— నీలకంఠీయవ్యాఖ్యానే— తత్ప్రామాణ్యేత్యాది తాదృశగ్రహః, గురుమతే వ్యవసాయః, మురారిమిశ్రాణాం మతే ఽనువ్యవసాయః—భాట్టమతే జ్ఞాతతాలింగకానుమితిః—ఇందు, అనువ్యవసాయ మనుట యితనితృతీయమార్గము:—

ఈవిద్వత్కవి తననాఁడు మంచివ్యాప్తికి వచ్చినభవభూతిమహావీరచరిత్రనాటకమును దిగద్రొక్కవలె నన్నజిగీషతో ననర్ఘరాఘవము రచియించె నన్నకింవదంతి విద్వల్లోకమునఁ గలదు. దానికి తగినట్లుగా ననర్ఘరాఘవపక్షపాతి యగు నొకపూర్వపండితుఁడు మురారిని పైకెత్తుచు భవభూతిని క్రిందికి దింపుచు నిర్మించిన రెండుశ్లోకములు కూడా దేశమున వ్యాపించినవి. అందుచేతనో మఱేందుచేతనో కాని, తరువాత మహావీరచరిత్ర చిరకాల మణఁగి పోవుటయు తుద కందలికడపటి రెండున్నరయంకములగ్రంథము నష్ట మగుటయుఁ గూడ సంభవించినది. ఆచాటుశ్లోకము లివి:—

"మురారిపదచిన్తాయాం భవభూతే స్తు కా కథా?
భవభూతిం పరిత్యజ్య మురారి మురరీకురు"
"భవభూతి మనాదృత్య నిర్వాణమతినా మయా,
మురారిపదచిన్తాయామిద మాధీయతే మనః"

శివకేశవభేదమును మాటుపెట్టుకొన్నయీనిరసనము మహావీర చరిత్రను మనస్సునం దుంచుకొని కావించిన దనుట స్పష్టము. ఈరెండును పూర్వరామాయణకథానాటకము లగుటయే యందుకు కారణము. అట్లు గాక భవభూతికృతులు మూఁడింటిని స్మరించియే యతఁడట్లు నిరసించి యుండు నని యెవరేని భావింతురా, అయితే యానిందకుఁడు దృశ్యకావ్యములవస్తుపాత్రరసౌచిత్యము నిసుమంతయేని యెఱుఁగనివాఁ డనవలసివచ్చును. సకలసామాజికహృదయరంజనమున విశ్వజనీనవిఖ్యాతిని గన్నయుత్తరరామచరిత్ర యెక్కడ? కేవలపాండిత్యప్రకర్షప్రకటనార్థ మైనయనర్ఘరాఘవ మెక్కడ? లోకోత్తరనాటకనిర్మాతలనుప్రసిద్ధిని గన్నభాసకాళిదాసాదులై దాఱుగురిలో నెవరైన నొకరైన భవభూతిని గణింతురు గాని మురారి నెవ్వరును గణింపఁబోరు. కావునఁ బైనిరసనము మహావీరచరిత్రకు మాత్రమే సంబంధించిన దగుట నిజము. అట్లయినను, అనర్ఘరాఘవముతోఁ బోల్చి యాదూషకుఁ డొక్కఁడు నిరసించినంతమాత్రమున మహావీరచరిత సహృదయరంజకముగా లే దని విశ్వసించువా రెవ రుందురు? ఇఁక నీవిచార మేల? పై చాటువచనములనుబట్టి కూడా మురారినాటకము విద్వాంసుల హృదయ మాకర్షించున ట్లున్నదన్నభావ మొక్కటియే మనము గ్రహింతము:—

## రుద్రభట్టు

రుద్రటకవిజీవితమునఁ బేర్కొనఁబడినయితఁ డేదేశమువాఁడో తెలియదు గాని యాత్తరాహుఁ డగును. దామోదరగుప్తునిశ్లోకముల

వలెనే యితనిశ్లోకములును గొన్ని విష్ణుశర్మపంచతంత్రమునం దరువాతం బ్రక్షిప్తము లగుట విశ్వసనీయము గావున నితఁడు విష్ణుశర్మకు పూర్వుం డు కాఁజాలఁడు. ఇతఁడు కావ్యరసాలంకార మనుశృంగార తిలకమును రచియించెను. ఇది సంభోగశృంగార—విప్రలంభశృంగార—హాస్యాదిరస నిరూపణ— నామకము లగుమూఁడుపరిచ్ఛేదములగ్రంథము— కవిత్వము మృదువుగా నుండును. ఇందలి లక్షణ లక్ష్యశ్లోకము లన్నియు నితనివే. శా. నవమశతాబ్దిలోనిలాక్షణికు లెవరును దీనిమత మెత్తిన ట్లెందును గానరాదు. కాని, అంతమాత్రమున నితఁ డంతకుఁ బరుఁ డనుట సము చితము కాఁజాలదు— పరిశీలింపఁగా రుద్రటాలంకారమందలి రసవిషయక విచారమును జూచియే యీగ్రంథ ముదయించిన దేమో యన్నసం శయ ముదయించుచున్నది గావున, నితఁడు రుద్రటునికి పరుఁడై శా. ౭౭౦ తరువాత నున్నవాఁ డగు నని యూహింపవలసివచ్చినది.

ఇతఁడు గ్రంథాదిని, భరతాదులు నాట్యరసమును వర్ణించిరి. నేను కావ్యరసము ప్రతిపాదించుచున్నా ననుచు నీక్రిందివిధముగా ప్రతిజ్ఞ చేసియున్నాఁడు.

" ప్రాయో నాట్యం ప్రతి ప్రోక్తా భరతాద్యై రసస్థితిః,
యథామతితథా ప్యేషా కావ్యం ప్రతి నిగద్యతే "

కాని, యేకారణముననో దీనికి లోకమున నెక్కువ విఖ్యాతి రాలేదు. కైశికీవృత్తి శృంగారహాస్యకరుణంబులఁ బ్రయోగింపఁదగిన దనుచు నిచ్చినయుదాహరణ మిది:—

" సౌందర్యం శశలాంఛనస్య కవిభి స్త్విత్థ్యైవ త ద్వర్ణ్యతే,
సౌభాగ్యంక్వను పంకజస్య రజనీసంభోగభగ్నత్విషః,
ఇత్యాలోచ్యచిరాయచారు రుచిమ త్త్రస్యత్కురంగీదృశో,
వీక్షే తే నవయౌవనోన్నతముఖామన్యే స్తనా వాననమ్ "

ఈగ్రంథము తుదఁ గనవచ్చిన—

"త్రిపురవధా దేవ గతా ముల్లాస మమూం సమస్తదేవనుతాం
శృంగారతిలకవిధినా పున రపి రుద్రః ప్రసాదయతి"

అని చమత్కారముగా ముందు తాను త్రిపురవధకావ్యము నిర్మించినట్లు తెలుపుకొనియున్నాఁడు. కాని యదియును వ్యాప్తికి రాలేదు.

పణ్యస్త్రీవలె రసికులహృదయముల నాకర్షించుకవితయే కవిత యనుభావము నిట్లు వెల్లడించియున్నాఁడు.

"సత్యం సన్తి గృహే గృహే సుకవయో యేషాం వచ శ్చాతురీ,
స్వే హర్మ్యే కులకన్యకేవ లభతే జాతైర్గుణై ర్గౌరవమ్,
దుష్ప్రాపస్సతు కోఽపి కోవిదపతి ర్యద్వా గ్రసగ్రాహిణాం,
పణ్యస్త్రీవకలాకలాపకుశలా చేతాంసి హర్తుం క్షమా".

ఇతఁ డన్నట్లాకాలమున ననఁగా శా. ౬, ౭, ౮ శతాబ్దులలో కవులసంఖ్య యెక్కువగా నున్న దన్నమాట నిజము. అందును, ఆలంకారికగ్రంథములయభ్యుదయస్థితి యాకాలమం దనుట నిర్వివాదము.

## జినసేనుఁడు

సంస్కృతమహాకవు లైనజైనులలో నితఁ డొకఁడు. జైనమతప్రసిద్ధుఁ డైనవీరాచార్యునిశిష్యుఁడు. గురువుతోనుండి రాష్ట్రకూటరాజైన అమోఘవర్షుని జైనమతములోనికి మార్చినవాఁడు. ఆరాజుశాసనములనుబట్టి యతనికి సమకాలికుఁ డైనమనకవి, శా. ౭౭౫ ప్రాంతమున నున్నవాఁ డని విదితమైనది[1] ఇతఁడు రచియించినపార్శ్వాభ్యుదయము ముద్రిత మైనది. ఇందు పార్శ్వనాథుఁ డనునిరువదిమూఁడవతీర్థంకరుని

---

1. ఆదిపురాణము హరివంశము నను కావ్యములు నిర్మించిన జినసేనుఁడు వేఱు-అతఁడు శా. ౭౦౫ ప్రాంతమువాఁడు.

చరిత్ర వర్ణింపఁబడినది. కవిత్వము సరసమై సులభశైలి నున్నది. వర్ణ
నలు రుచికరములు:—

" తమాలవనవీథీషు సంచరంత్యో యదృచ్ఛయా,
మనో ఽస్య జహ్రురారూఢయౌవనాః కేరళస్త్రియః "
" క్వచి చ్ఛుకముఖాకృష్టకణాః కణిశమంజరీః
శాలివప్రేషు సో ఽపశ్యద్విటై ర్భుక్తా ఇవ స్త్రియః "

## అభినందుఁడు

ఇతఁడు వంగదేశీయుఁడు. శతానందుని కుమారుఁడు ఉదయసుం
దరీకర్త యైనసోఢలపండితునికి పూర్వుఁడు. అతఁ డాకృతిలో నితని
నెక్కువగా పొగడియున్నాఁడు. హారవర్షయువరాజనరేంద్రుఁ డితని
తెలివికి మెచ్చుకొని సింహాసనముపఁ దనప్రక్కను గూర్చుండఁబెట్టుకొనె
నని వర్ణించి యున్నాఁడు—

" తథా తూర్ణం కవేః కస్య నిర్గతం జీవతో యశః,
హారవర్షప్రసాదేన శాతానందే ర్యథాధునా "
" స్పష్టం యదత్ర యువరాజజనేశ్వరేణ, యద్భుష్కరం కిమపి యేన గిర
శ్శ్రియశ్చ, ప్రత్యాయనం స్ఫుట మకారి నిజే కవీంద్ర, మేకాసనే
సముపవేశయ తా భినందమ్ "

వంగదేశములోని పాలరాజవంశమునందు ధర్మపాలుని కుదయిం
చినరెండవకుమారుఁ డైన దేవపాలుఁడే హారవర్షయువరాజదేవుఁ డను
పేర రా జయ్యెను. ఇతనియన్న యైన త్రిభువనపాలుఁ డే కారణము
చేతనో యువరాజుగానే యుండెను. హారవర్షుఁడు శా. ౭౭౫ ప్రాంత
మున రా జగుటంబట్టి యతనిసత్కార మందినమనకవి యాసమయమున
నుండె నని విదిత మగుచున్నది.

ఇతఁడు రామచరిత మనుపేర శ్రీమద్రామాయణకథను సంగ్రహించి పెద్దపద్యకావ్యము నిర్మించెను. ఇందు తుదిసర్గలు కొన్ని పోయినా, ఇపుడు సుమారు ౩౬ సర్గలగ్రంథము ముద్రితమై యున్నది. ఇతనిశ్లోకములను భోజ మమ్మట మహిమభట్టాదులు తమలక్షణముల నుదాహరించి రనుటయే దీనియోగ్యతను తెలుపఁగలదు. హనుమంతుఁడు సముద్రము దాఁటుటకు మహేంద్రశిఖరమునుండి యెగురుట యిట్లు వర్ణింపఁబడినది.

"మూర్ధ్నా జాంబవతో ఒభివాద్య చరణా వాపృచ్ఛ్య సేనాపతీ,
నాశ్వా స్యాశుముఖా న్మహూః ప్రియసఖాన్ ప్రేష్యాన్ సమాదిశ్య చ,
ఆరంభం జగృహే మహేంద్రశిఖరా దంభోనిధే ర్లంఘనే
రంహస్వీ రఘునాథపాదరజసా మూర్చ్ఛ స్స్మరన్ మారుతిః"

ఇతని శ్రీకృష్ణస్తవశ్లోకము లెన్నో సంకలనగ్రంథములం దున్నవి. వాటిరీతి చూడఁగా కృష్ణభక్తుఁ డైన యీకవి కృష్ణచరితమును గూడ నొకకావ్యముగా నిర్మించె నని తోఁచుచున్నది. అట్టివి రెండు:—

బాలుఁ డైన శ్రీకృష్ణునిచేష్టిత మిట్లు వర్ణింపఁబడినది.

"వత్స! స్థావరకందరేషు విచరం శ్చారప్రచారే గవాం
హింస్రా న్వీక్ష్య పురఃపురాణపురుషం నారాయణం ధ్యాస్యసి,
ఇత్యుక్తస్య యశోదయా మురరిపో రవ్యా జ్జగన్తి స్ఫుర
ద్బింబోష్ఠద్వయగాఢపీడనవశా దవ్యక్తభావం స్మితమ్"

భూదేవీ! నీవు ధైర్యముతో నుండుము. నేను కంసుని పరిమార్చెద ననెడిబాలకృష్ణుని కలవరింత లిందు వర్ణింపఁబడినవి,

"ధీరా ధరిత్రి! భవ భార మవేహి శాంతం,
న న్వేష కంసహతకం వినిపాతయామి,
ఇత్యద్భుత స్తిమిత గోపవధూశ్రుతాని
స్వప్నాయితాని వసుదేవశిశో ర్జయన్తి"

కొంతయు పూర్వకవులను పేర్కొనుచు నుత్తమకవితామార్గమును వర్ణించిన యితనిశ్లోక మిది:—

"ఉన్నీతో భవభూతినా ప్రతిపదం బాణే గతే యః పురా,
యశ్శీర్ణః కమలాయుధేన సతతం యో నాగమ త్కేశటః,
యశ్శ్రీవాక్పతిరాజపాదరజసాం సంపర్కభూతి శ్చిరం,
దిష్ట్యా శ్లాఘ్యగుణస్య కస్య చిదసౌ మార్గ స్సమున్మీలతి"

## అవంతివర్మ

ఇతఁడు శా, ౭౭౭-౮౦౬ నడుమ కాశ్మీరరాజ్య మేలిన మహారాజు. విద్వత్కవీంద్రులను పోషించి సంస్కృతసారస్వతము నభివృద్ధికి తెచ్చిన మనీషి. స్వయముగా కవియై కృతులు నిర్మించినవాఁడు. కాని, అవి యిప్పుడు కనరాకున్నవి. ఇతనివిగా సుభాషితావళ్యాదులలో నీక్రింది శ్లోకములు కొన్ని మనకు లభించినవి. కవిపోషకుఁడన్నకీర్తికి కవియన్న గౌరవమున కివి చాలును. ఇంద్రధనుస్సు దుష్టునివలె వెంటనే నశించునఁట:—

"అసారో నిర్గుణో వక్ర, శ్చిత్రరూపత యాన్వితః,
అవాప న చిరా ద్భ్రంశం, శక్రచాపః ఖలో యథా."

మాధ్యందినాతపమును చెట్లు కూడా సహింపలేకున్నవఁట—
"దుస్సహ సంతాపభయా త్సంప్రతి మధ్యస్థితే దివసనాథే,
ఛాయా మివ వాఞ్ఛన్తి ఛాయాపి గతా తరుతలాని"

ఇది మన్మథమహాత్మ్యవర్ణనము.
"ప్రహర్తా క్వా నఙ్గ స్సచ కుసుమబాణో ఽల్పవిశిఖః,
చలం సూక్ష్మం లక్ష్యం వ్యవహిత మమూర్తం క్వచ మనః
ఇతీమా ముద్భూతాం స్ఫుట మనుపపత్తిం మనసి మే
రుజా మావిర్భావా దనుభవవిరోధ శ్శమయతి."

# ముక్తాకణుఁడు

అవంతివర్మయాస్థానమందలి యనేకకవీశ్వరులలో నైదుగురిని రాజతరంగిణి పేర్కొన్నది. వారిలో మొదటివాఁ డితఁడు:—

“ ముక్తాకణః శివస్వామీ కవి రానందవర్ధనః,
ప్రథాం రత్నాకరశ్చాగాత్ సామ్రాజ్యే௨వన్తివర్మణః ”
“ అనుగ్రహాయ లోకానాం భట్టాః శ్రీకల్లటాదయః
అవన్తివర్మణః కాలే, సిద్ధా భువ మవాతరన్. ౫౩౪,౬౬ ”

ఇతని కావ్య మొకటియు కనరాదు కాని, లోకప్రసిద్ధుఁ డయిన ఆనందవర్ధనాచార్యుని సహవాసి గదా యని యితని నిందు స్మరించుచున్నాము— ఈ పేరు గల మఱియొకకవి సారస్వతమునఁ గనరాకపోవుటచే, ఉజ్జయినీనివాసుఁ డైన నారాయణ పండితుని వంశములోనివాఁడును భగవద్గీతావ్యాఖ్యాతలలో నొకఁడు నైన రామపండితుని యన్నయైన ముక్తాకణుఁ డితఁ డేమో యని యీక్రింది మాటలనుబట్టి యూహించుచున్నాను.

“ యోనారాయణ ఇత్యభూచ్ఛ్రుతనిధిః శ్రీకాన్యకుబ్జే ద్విజః,
తద్వంశే స్వగుణప్రకర్షఖచితే ముక్తాకణాఖ్యో௨భవత్,
తస్యైషా సదృశానుజేన రచితా రామేణ విద్వజ్జన
శ్లాఘ్యత్వాత్సఫలశ్రమేణ భగవద్గీతాపదార్థప్రథా ”

ఈ రామపండితుఁడు భట్టకల్లటుని శిష్యుఁ డైన రాజానకరాముఁ డనెడి యభిప్రాయముతో నితని యన్న ముక్తాకణుఁడే మనముక్తాకణుఁ డని భావించుచున్నాను. ముక్తాకణుని పేర నందందు కొన్ని శ్లోకములు కనవచ్చుచున్నవి గాని, యితని కావ్యమేదియు కనరాదు. సువృత్త తిలకములో క్షేమేంద్రుఁ డుదాహరించిన యీ క్రిందిది వీరాఙ్కితమున విడిపోయినజవరాలికొప్పు వర్ణనము.

" లీలాచామరడంబరో రతిపతే ర్బాలాంబుదశ్రేణయో,
రాగోద్దండశిఖండినో ముఖనిధూద్ధూతా స్తమోవిభ్రమాః,
సౌగంధ్యోద్ధత ధావదాకులవలన్మత్తాళిమాలాకులో,
ధమ్మిల్లో హరిణీదృశో విజయతే ప్రస్తో రతివ్యత్యయే "

ఈ క్రిందిది పథికుఁ డనేకితరుఖండమునఁ బ్రవేశించినమన్మథాగ్నివర్ణనము — ఈవర్ణనలనుబట్టి యితఁడు రచియించినది శృంగార కావ్య మని తోఁచుచున్నది.

" యథా రంధ్రం వ్యోమ్న శ్చలజలదధూమః స్థగయతి,
స్ఫులింగానాం రూపం దధతి చ యథా కీటమణయః
యథా విద్యుజ్జ్వాలోల్లసనపరిపింగాశ్చ కకుభః
తథా మన్యే లగ్నః పథికతరుఖండే స్మరదవః "

# శివస్వామి

ఇతఁ డవంతివర్మ రాస్థానములోనికవులలో నొకఁ డని చదివి యున్నాము — శివస్వామియను కవి గావించుకొన్నయాత్మస్తుతి శ్లోక మొకటి చాటువుగా కనవచ్చుచున్నది. ఆశివస్వామి యితఁడో లేక మఱియొకఁడో నిర్ణయింప నాధార మగపడదు గాని, శ్లోకముమాత్ర మతిశయోక్తిని తలదన్ని యత్యద్భుతముగా నిట్లున్నది.

" వాక్యంచ ద్విపదీశతా న్యథ మహాకావ్యాని సప్త క్రమాత్,
త్ర్యక్షు ప్రత్యహ నిర్మితస్తుతికథాలక్షాణి చైకాదశ,
కృత్వా నాటకనాటికాప్రకరణప్రాయాన్ ప్రబంధాన్ బహూన్,
విశ్రామ్య త్యధునాపి నాతిశయితా వాణీ శివస్వామినః "

ఇన్నివందలు వేలు లక్షలు కృతులు మనశివస్వామియే రచియించినమాట నిజ మైతే, అవంతివర్మ యితని కార్ధాసన మీయఁడా!

పండితసభాపతిని చేయఁడా? ఆనందవర్ధనాదు లింకస మంట నితని పొగడరా? లెక్క లేనన్నియిన్నికృతులలో నొక్క కావ్య మైనవీథి కెక్కకుండునా? కాశ్మీరమహారాజులసభలలో నెంద అెందఱో కవు లున్నట్లు కనుచున్నాము గదా! వారిలో నొక్కఁడైనా యీయత్యు క్తిలో సహస్రాంశ మైనను తనయెడ ప్రకటించుకొన్నట్లు కన్నామా? కావున మీఁదిశ్లోకము మనశివస్వామిని కాదనియే భావింపవలసి యున్నది. ఇది యిట్లుండఁ:—

శివస్వామి బౌద్ధమతప్రియుఁడు బౌద్ధుఁడు నై దక్షిణాపథమందలి యొకరాజైనకప్ఫణుని బౌద్ధుని గావించె నని యు నతనిపేర కప్ఫణా భ్యుదయ మనెడి యిరువదిసర్గల మహాకావ్యము నిర్మించె ననియు నింకొకమతము కనవచ్చుచున్నది. ఆకావ్యములోనివిగా రాయముకుట సర్వానందాదుల పద్యసంకలనగ్రంథములలో శ్లోకములును కనవచ్చు చున్నవి[1]. ఆకావ్యము ముద్రణకు లభింపకపోయినా, పేరు తెలిసినది కొన్నిపద్యాలు గోచరించినవి. అదే చాలును. ఆకావ్యము నిర్మించిన బౌద్ధశివస్వామియే, అవంతివర్మ యాస్థానములోనిశివస్వామి యని కొంద ఱు భావించినారు. కాని, ఈకప్ఫణుఁ డవంతివర్మకు సమకాలికుఁ డనుటకు గాని, ఆకాశ్మీరవిభునిసభలోని శివస్వామి యారాజును విడిచి యీదక్షి ణాపథమందలికప్ఫణు నాశ్రయింప వచ్చె ననుటకుఁ గాని యెట్టిప్రమాణ ములు నెవ్వరు చూపలేదు, పోనిండు, బిల్హణుఁడు కాశ్మీరము విడిచి వచ్చినట్లే శివస్వామి యాసంస్థానము విడిచి వచ్చె నని యంగీకరిం

1. "వేణీషు మూర్ఛామివ సంప్రయాతాః, కపోలయో గ్లీన మి వాదధానాః,
స్మితే ష్వివో చ్ఛ్వాస మివోద్వహన్తో, వి లాసినీ శ్శిశ్లిషు రిందుపాదాః"
"ధృతసింధు రసౌ విచిత్రవృత్తి, ర్విదధానః స్ఫుటశుద్ధపాత్రయోగం,
మధువారవిధి స్స నాయకాం శో, వవృధే నాటకవ న్నితంబినీనామ్"
"వినయం వినయ న్ స్మితాని పుష్ణన్, నయనాని భ్రమయన్ వచాంసి ఘూర్ణన్,
ముఖరాణి విభూషితాని కుర్వన్, వరవేషో వవృధే మదో వధూనామ్"

తము, ఆయాస్తికప్రభువు సభలో భోజునిసభలో జైనధనపాలకవి యున్నట్లే బౌద్ధశివస్వామి తొలుత నుండె ననియు నొప్పుకొందము. అయితే పూర్వోక్తుఁడైనశతసహస్రగ్రంథకర్త శివస్వామిమాట యేమి? "త్ర్యక్షప్రత్యూహనిర్మి" తేత్యాదివాక్యమునుబట్టి యతఁడీశ్వరభక్తుఁ డని స్పష్టమగుచున్నది గదా! ఆశ్లోకము చెప్పినశివస్వామి కప్ఫణాభ్యుదయ కర్తయైన బౌద్ధశివస్వామికాఁ డందురా, లేక అప్పటికి శివభక్తుఁడే కాని, తరువాతబుద్ధభక్తుఁ డైనాఁ డందురా? దీని నంతను చూచి శివస్వామి జీవితచరిత్ర మయోమయముగా నున్న దని పాఠకులు భావింపకపోరు. నిజమే, తోఁక చూచి పులి యన్నట్లున్న దీశివస్వామినిరూపణము. ఇందుకు, ఇదంతాపరామర్శించిననాకు తోఁచినయభిప్రాయమిది:—

ఆబడాయికోరు శివస్వామి గాని, ఈ బౌద్ధశివస్వామి కాని, మనశివస్వామి కాఁడు, రాజాస్థానకవి యైనమనస్వామి యేవో కృతులు నిర్మించి యుండకపోఁడు. కాని, అవి యితనిసహవాసి యైనముక్తాకణుని కావ్యములతో నెందో యణఁగిపోయినవి. ప్రాచీనకవుల చాటువులుగా సంకలనగ్రంథములు సంపాదించినశ్లోకములలో శివస్వామిపేర నున్న వితని వని విశ్వసించినచో నవి రెండు:—

ఇది కాంతాధర బింబరస వర్ణనము:—

"ఫల మలఘు కిం లీలావల్ల్యా గృహాంను గుణశ్రియా,
మమృత మథ వైకక్ష్యం పిండీకృతం ను రసాయనమ్,
నిధి రుత రతే స్సర్వస్వా వా విలాసవిధేః ప్రియై,
రితి న లలనాబింబోష్ఠానాం రసః పరిచిచ్ఛిదే"

ఈక్రింది సూర్యోదయవర్ణన మితనికల్పనాచాతురికి నిదర్శనము.

"తేజోరాశౌ భువనజలధేః ప్లావితాశాతటాన్తం,
భానౌ కుంభోద్భవ ఇవ పిబ త్యంధకారోత్కరాంభః,

సద్యో మాద్యన్మకరకమఠస్థూలమత్స్యా ఇవైతే,
యాన్త్యస్తస్థాః కులశిఖరిణో దృష్టివర్త్మ క్రమేణ ”

## ఆనందవర్ధనుఁడు

కాశ్మీర మాలంకారికులనిలయ మనిపించిన యుత్తమలాక్షణికులలో నొకఁడైన యీమహాపండితుఁ డవన్తివర్మభూపాలునిసభలోని విద్వత్కవి. నోణపండితునితనూజుఁడు షడ్భాషావేత్త. అలంకారశాస్త్రమున కలంకార మైన ధ్వన్యాలోకము నిర్మించినసాహిత్యనిధి. నాలుగుద్ద్యోతముల యీగ్రంథమునఁ ౧౨౯ కారికలును తదర్థవివరణ మైనవృత్తియు చక్కనిభాషతో విలసిల్లుచున్నవి. ఇందు కారికారూప మైనగ్రంథము ధ్వనియనియు వృత్తిరూపగ్రంథ మాలోక మనియు, పెద్దలవాడుక. అది సముచిత మైనను, “ధ్వనికారిక లానందవర్ధనుఁడు నిర్మించినవి కావు, వృత్తిమాత్రమే యితఁడు రచియించె”నన్నవాద ముదయించినది. ఆచర్చ లన్నియు ముద్రితములై దేశమున వ్యాపించియే యున్నవి గావున వాని నిందు పరామర్శించుట యనావశ్యకము-అస లీచర్చలకు మూలము దీనికి లోచన మనెడియుత్తమవ్యాఖ్య నిర్మించినయభినవగుప్తాచార్యుఁడు రెండుచోట్ల లిఖించిన యీక్రిందిమాటలు[1] ఇందలికారి

---

1. “ అతఏవ మూలకారికా సాక్షాత్తన్నిరాకరణార్థా న శ్రూయతే.
వృత్తికృత్తు నిరాకృత మపి ప్రమేయసంఖ్యాపూరణాయ కంఠేన తత్పక్ష
మనూద్య నిరాకరోతి”-తే నాత్ర ప్రథమోద్ద్యోతే ధ్వనే స్స్వామా
న్యలక్షణ మేవ కారికాకారేణ కృతమ్ ద్వితీయోద్ద్యోతే.....మూల
విభాగం ద్వివిధం సూచితవాన్ తదాశయానుసారేణ వృత్తికృ
దత్రై వోద్ద్యోతే మూలవిభాగ మవోచత్”- న చైత న్మయోక్తమ్,
అపితు కారికాకారాభిప్రాయే ణేత్యాహ”-ఏత త్తావత్త్రిభేదత్వం న కారి
కాకారేణ కృతమ్. వృత్తికారేణతు దర్శితమ్.
ధ్వన్యా-పుట-౫౯, ౬౩, ౧౨౩,

కారికాకారుఁడు వృత్తికారుఁడు నన్నమాటలు కర్తృభేదము సూచించుచు న్నట్లు కనవచ్చుటచే కారికాకర్త వేఱన్నభావ మేర్పడినది. ఆమాటలే విశ్వసనీయము లయినచో, ఆనందవర్ధనుఁడు కృతఘ్నుఁడు లోకవంచకుఁడు గ్రంథచోరుఁడు నని చెప్పవలసివచ్చును. సహృదయచక్రవర్తి యైన యితనియం దిట్టిదోషము లారోపింపఁ గలమా? ఆరోపింప నగునా? కావున నీవిషయము నించుక పరామర్శింతము.

నిజముగా ధ్వనికారికలు తనవి గానిచో, వానిని నిర్మించినకవి- పూర్వుఁడు కానీ, లేకసహృదయుఁ డనునతఁడే కానీ, కాక గురువే కానీ, అతనిపే రెత్తక స్మరింపక కృతజ్ఞత చూపక దుర్వృత్తితో నీతఁ డవి తనవిగా వృత్తి నిర్మించుఁగాక. అవంతివర్మయాస్థానమున నితనితో నున్నవిద్వాంసు లది సహించి యూరకుందురు గాక. నాఁటియితరపం డితు లోర్తురా? ఆవార్త గజ్జెలు కట్టుకొని దేశమునలుగడల నెగఁ బ్రాఁకకుండునా? ఇతనికి నూఱేండ్లతరువాత నున్నయభినవగుప్తుఁ డా కింవదంతి వినకుండునా? పోనీ! ఇతనికి పూర్వు లైనవామనరుద్ర టాదులు ధ్వనికారికావాసన యైన నాఘ్రాణించిరా? పరు లైనప్రతీహా రేందురాజాదు లితనికంటె నన్యుఁడు ధ్వనికర్త యన్నవార్త యైన విన్నారా? ఇఁకఁ గారికాపూర్వత్వముగాని తదన్యకర్తృకత్వముగాని యెట్లూహింప నగునో తెలియకున్నది-కావ్యాత్మ ధ్వని యనెడి భావము పూర్వము విద్వల్లోకమున నుండుఁ గాక, కారికారూప మైన తల్లక్షణము మాత్ర మిదేయని "కావ్య స్యాత్మాధ్వని రితిబుధై ర్యస్సమామ్నాతపూర్వ" ఇత్యాదిప్రథమకారికయే స్పష్టము చేయుచు న్నది. ధ్వనికర్త కూడ నానందవర్ధనుఁడే యని కవిలోకప్రతీతి యిట్లు వ్యక్తముచేయుచున్నది — కావ్యమీమాంసాకర్త యైనరాజశేఖరుని స్తుతివచన మిది. ఇందలి "ధ్వని" పదము కారికాపర మనుట విది తము:—

" ధ్వని నాతిగభీరేణ కావ్యతత్త్వనివేశినా,
ఆనందవర్ధనః కస్య నాసీ దానందవర్ధనః "

మఱియు 3౮ వ, కామకోటిపీఠాధిపతి యగుసచ్చిదానందస్వామిని కొంతకాలము సేవించినవారిలో ధ్వనికారు నెట్లు గుణరత్నమాలిక వర్ణించినదో కనుఁగొనుఁడు:—

"అనుపద్మపురం చిరాయ తిష్ఠన్ ధ్వనికారాదిబుధాశ్రితోఽప్రతిష్ఠః"

ఇట్లే ధ్వనికారికాకర్త యానందవర్ధనుఁ డని కుంతకుఁ డితని మాటలను వక్రోక్తిజీవితమున నెత్తియున్నాఁడు, వ్యక్తివివేకకర్త యగు మహిమభట్టును క్షేమేంద్రుఁడును గూడ ధ్వనికారికలు వృత్తియు నానందవర్ధనునివనియే తమకృతులఁ దెలిపియున్నారు[1]. హేమచంద్రుఁ డానందవర్ధనునివిగా రెండుకారికలు గ్రహించియున్నాఁడు[2] ఉద్భటాలంకారవృత్తిలో ప్రతీహారేందురా జానందవర్ధనునిమాట లెత్తి వ్రాయుచు సహృదయుఁ డతఁడే యైనట్లు తెలిపినాఁడు[3]. ఇది సహృదయుఁ డనువే ఱొకఁడు కారికాకర్త యనెడివాదమునకు భంజకము. ఇంక నిట్టిప్రమాణవచనములు కలవు గాని, కారికాకర్త కూడ నితఁడే యనుట కివి చాలును.

ఇతఁడు ముందు కారికలు నిర్మించి తరువాత వృత్తి రచియించి యున్నాఁడు. అందందు, కారికాభావము గూఢముగా నున్నయెడ దానిని వివరించుపట్టునఁ దాను వ్యాఖ్యాతగా నే "ఇదం కృత మిదం క్రియతే" ఇత్యాదివాక్యముల రచన సాగించియున్నాఁడు. అది ప్రౌఢవ్యాఖ్యాతల శైలి. దాని ననుసరించియే వ్యాఖ్యేయగ్రంథము కారికా

1. ఔచిత్యవి-శ్లో. ౧౮. వ్యాఖ్యలో, తదుక్తమానందవర్ధనేన "విరోధీవావిరోధీవారసోఽజ్గినిరసాన్తరే" ఇది ధ్వన్యా. 3-౨౪. అవిరోధీ విరోధీ వేత్యాది.
2. ధ్వన్యా-3-30, 3౯ కావ్యాను. ౧౧3, ౨3౫ పుటలు.
3. ఉద్భటవృత్తి-పుట. ౭౯-౮౫ తైః సహృదయై ర్వ్యంజకత్వ ముక్తం.

వృత్తిభేదమున ద్వివిధ మగుటచే నభినవగుప్తుఁడును, కారికాకార వృత్తికారపదము లుపయోగించియున్నాఁడు. అంతే కాని, ధ్వనికర్త ఆలోకకం జొ వే అనెడియభిప్రాయముతోఁగాదు. కావునఁ గారికాకర్త యన్యుఁడనుటకుఁ దగినప్రత్యక్షప్రమాణము లభించునంతదనుక రెంటికర్త మన యానందవర్ధనుఁడే యని విశ్వసింతము. అద్వైతుఁడు దేవీభక్తుఁడు రాజానకకులతిలకుఁడు నైనయీకవి కృత్యాదిని గావించినయీ విష్ణుస్వరూప మంగళాచరణశ్లోకమున వస్త్వలంకారరసధ్వనులు మూఁడు నిమిడియున్నవి గావున ధ్వనితోనే యిది యారంభ మైనట్లు విదిత మగుచున్నది—మధుసూదనునినఖములు మిమ్ము రక్షించుఁగాక యని యాశీర్వాదము.

స్వేచ్ఛా కేసరిణః స్వచ్ఛ స్వచ్ఛాయాయాసితేన్దవః,
త్రాయన్తాం వో మధురిపోః ప్రపన్నార్తిచ్ఛిదో నఖాః"

ఇందు పూర్వమహాకవులు కొందఱు పేర్కొనఁబడిరి. వారి వారి శ్లోకములును మాటలు నుదాహరింపఁబడినవి.

ఈకవీంద్రుఁ డిది గాక కావ్యతత్త్వము విషమబాణలీల అర్జున చరితము దేవీశతకము మొద లగుమఱికొన్నికృతులు నిర్మించినట్లు తెలియవచ్చునుగాని, వాటిలో దేవీశతకము మాత్రమే దృగ్గోచర మగుచున్నది. ఇది చిత్రయమకబంధశ్లేషబంధుర మైనయతిక్లిష్టకావ్యము. సంస్కృతముతో మాహారాష్ట్రీ పైశాచీ మాగధీ శౌర్యసేన్యపభ్రంశ భాషల కన్నిటికి లేక కొన్నిటికి శ్లేష కల్పించి రచియించినదీనిక్లిష్టత యెట్టిదో యూహింపవలసినదే. తన కీయాఱుభాషలలో వైదుష్యము కల దనిప్రకటించుకొనుట కీగ్రంథ మితఁడు నిర్మించియున్నాఁ డనవచ్చును గాని, ఆకాలమందు షడ్భాషలు నేర్చినవా రెక్కువగా నున్నారనియు భావించవలసినదే. ఎట్లయినా యిట్టికావ్యములప్రయోజనము తక్కువే. ఈశతకపాషాణమును కయ్యటుఁడు తనవ్యాఖ్యతో పగులఁ గొట్టకున్న నిది యెపుడో మూలమూలల దాఁగియుండును. ఈకయ్య

టుఁ డితనికి నూఱేండ్లతరువాతివాఁడు. కలియుగము ౪౦౭౮లో ననఁగా శా. ౮౯౯లో దీనికి వ్యాఖ్య నిర్మించినవాఁ డని యీక్రిందివ్యాఖ్యాంత శ్లోకము చెప్పుచున్నది - భీమగుప్తరాజు శా. ౮౯౭ - ౯౦౧ నడుమ కాశ్మీర మేలినవాఁడు.

" వల్లభదేవాయనిత శ్చంద్రాదిత్యా దవాప్య జన్మేమాం,
కయ్యటనామా ఽరచయ, ద్వివృతిం దేవీశతస్తోత్రే,
వసు ముని గగ నోదధి సమ, కాలే యాతే కలే స్తథా లోకే,
ద్వాపంచాశే వర్షే రచి తేయం భీమగుప్తనృపే "

ఇందు భాషాంతరశ్లిష్టములు కానిశ్లోకములే యెక్కువగా నున్నవి గాని, యం దనేకములు చిత్రయమకబంధమయములు తక్కిన వర్ణశ్లేషశ్లోకివి. అందుండి యొకటి:—

" వంద్యా ప్రభాతసంధ్యేవ, సూర్యాలోకప్రవర్తినీ,
నివర్తయసి దేవి త్వం, మహామోహమయీం నిశామ్ "

భాషాపట్క సమావేశమున నొకటి:—

" ఆలోలకమలే చిత్త లలామ కమలాలయే,
పాహి చండి మహామోహ భంగభీమబలాబలయే "

వ్యాఖ్యాత యిట్టిశ్లోకములకు భాషాంతరములం దర్థములు వ్రాయలేదు. ఇంక, ఇతనివిగా కొన్నిశ్లోకములు సంకలనగ్రంథములందు కనవచ్చుచున్నవి. అవి చాటువులో, ఇతనియితరకృతులలోనివో తెలియదు. వాటిలోని దీసూర్యవర్ణనము:—

" కిం నైవ సన్తి సుబహూని మహామహాంసి,
చంద్రో ఽప్యలం భువనమండలమండనాయ,
సూర్యాదృతే న త ముదేతి న చాస్త మేతి,
ఘే నోదితేన దిన మస్త మితేన రాత్రిః.

# రత్నాకరుఁడు

ఇతఁడును కాశ్మీరీయుఁడానందవర్ధనాదులమిత్రుఁడవంతివర్మ సంస్థానకవి—ఇతనితండ్రి అమృతభానుఁడు, గురువు రాజానకదుర్ఘటుఁడు ఇతఁడు జయాదిత్యునినాఁడే కవియై, అవంతివర్మనాఁడు ప్రధానకవులలో చేరినాఁడు. ఇతనిని స్తుతించినరాజశేఖరునిశ్లోక మొకటి సుభాషితహారావళిలో నున్నది— రత్నాకరములు నాలు గుండఁగ మే మని యైదవ రత్నాకరుని బ్రహ్మ సృజించినాఁడఁట—

"మాస్మ సంతు హి చత్వారః ప్రాయో రత్నాకరా ఇమే,
ఇతీవ స కృతో ధాత్రా, కవిరత్నాకరో ఽ పరః"

ఇతనివక్రోక్తిపంచాశికకు టీక నిర్మించిన వల్లభదేవపండితుఁడును కాశ్మీరీయుఁడే. అతఁడు ఆనందవర్ధనుని దేవీశతకమునకు వ్యాఖ్య నిర్మించిన కయ్యటునిపితామహుఁడు. రఘువంశాదులకు వ్యాఖ్యలు నిర్మించినఘనుఁడు. రత్నాకరుని కేఁబదియేండ్లతరువాతివాఁడు. అతఁడితనికి బాలబృహస్పత్యనుజీవి- వాగీశ్వర- విద్యాధిపతి- బిరుదములున్నట్లు వ్యాఖ్యాంతగద్యమున తెలిపియున్నాఁడు.

పార్వతీపరమేశ్వరులపరిహాససంభాషణ మిందలివస్తువు. వక్రోక్తికి మమ్మటుఁ డిట్లు లక్షణము వ్రాసియున్నాఁడు

"యదుక్త మన్యథా వాక్య మన్యథాన్యేన యోజ్యతే,
శ్లేషేణ కాక్వా వా జ్ఞేయా సా వక్రోక్తి స్తథా ద్విధా"

శ్లేషతోడివక్రోక్తి కితనికృతిలోని దొకటి;—

"త్వం హాలాహభృ త్కరోషి మనసో మూర్ఛాం మ మాలింగితః,
హాలాం నైవ బిభర్మి నైవ చ హలం ముగ్ధే కథం హాలికః!
సత్యం హాలిక తైవ తే సముచితా సక్తస్య గోవాహనే,
వక్రోక్త్యేతి జితో హి మాద్రిసుతయా స్మేరో హరః పాతు వః"

ఇతని రెండవకృతి హరవిజయము. అది యేఁబదిసర్గలమహాకావ్యము కాని యితని రచన, అందలి ౪౬వ, సర్గలోఁ గొంతవఱకు నున్నది తరువాతి సుమారునాలుగుసర్గలగ్రంథమును గణపతి యనుకవి పూరించిన ట్లున్నది. రాజానకజయానకుని కుమారుఁ డలకపండితుఁడు ౪౬వ, సర్గలోఁ గొంతవఱకు మాత్రమే యీకృతికి వ్యాఖ్య వ్రాయుట పైవిషయమును ధ్రువపఱుచున్నది. మఱియు, నితఁడు శా. ౭౮౫ ప్రాంతమున దివంగతుఁ డయ్యె ననెడి విమర్శకులయభిప్రాయమును బలపఱుచున్నది, దీనినిబట్టి యితఁ డానందవర్ధనాచార్యులకంటె వయసున బాగా పెద్దవాఁ డనియు, అవంతివర్మపరిపాలనకాలములో నైదాఱేండ్లు మాత్రమే జీవించియుండె ననియు తెలియుచున్నది. మఱియు నీరెండు కృతులనుబట్టి యీకవి శివభక్తుఁ డని విదిత మగుచున్నది.

ఇతనికవిత్వము ప్రౌఢ మయ్యు హృద్యమై రసవంతముగా నుండును. ఇందుకు హరవిజయములోనివి రెండు:—

" వీచీసమీరధుతకాంచనపుండరీక,
పర్యస్తకేసరపరాగపిశంగితాంభః,
అచ్ఛోద మైక్షత సదేవపురంధ్రిపాద
లాక్షారుణీకృతశిలాతలతీరలేఖమ్"

" సలీలనిర్ధూతకరారవింద, సీత్కారసంధుక్షితమన్మథాయాః,
జగ్రాహ బింబాధరమూఢరాగం, రాగం రమణ్యా హృదయంచ కాంతః"

" కంఠశ్రియం కువలయస్తబకాభిరామ,
దామానుకారి వికటచ్ఛవి కాలకూటమ్.
బిభ్ర త్ముఖాని దిశతా దుపహారకౢత
ధూపోత్థధూమమలినా మివ ధూర్జటి ర్వః"

ఈకావ్యమందలిప్రధానవిషయము హరుఁడు దేవతలకోర్కెపై వారి కానందము కలిగింప నంధకాసురుని సంహరించుట.

# భట్టకల్లటుఁడు

ఇతఁడును కాశ్మీరమం దవంతివర్మసంస్థానమున నున్నకవులలోని వాఁడు. లోకానుగ్రహార్థము భూమి నవతరించినసిద్ధులే కల్లటాదు లని రాజతరంగిణి కావించినప్రశంస చూచియున్నాము. ఈసందర్భమునం దవంతివర్మనుగూర్చి యించుక.

అవంతివర్మ ఆబాల్యముగా భగవద్భక్తుఁడు. అతఁడు వైష్ణవుఁ డయ్యు బాల్యమునందే శివభక్తుఁడై శైవమఠములు కట్టించుచు, సింహాసన మధిష్ఠింపకమున్నే మృతులకు ముక్తి నిచ్చువిశ్వైకసార మను క్షేత్రమునందు తనపేర నొకపురము కట్టించి, అందు గొప్పశివాలయము స్థాపించి, అం దవంతీశ్వరస్వామిని ప్రతిష్ఠించెను. ఇతనిమంత్రులలో నత్యంతప్రాణమిత్రుఁడు నితని కన్నివిధములసహాయుఁడు నగువాఁడు శూరుఁ డనుమంత్రి. ఆతఁడును రాజానుమతితో శైవమునకు ప్రోత్సాహము కలిగించెను. ఆసమయమున సహజముగా శివభక్తులైనయందలి పండితు లందఱును శైవమతసారస్వతము నభివృద్ధికి తెచ్చుటకు యత్నించుచు వచ్చిరి. అట్టివారిలో మనయీకల్లటుఁ డొకఁడు. ఇతఁ డానందవర్ధనాదులకంటె వయసున పెద్దవాఁడు.

ఇతఁడు తనగురు వైనవసుగుప్తుఁడు స్పందసూత్రము లనుపేర నిర్మించినశైవసూత్రములయర్థమును కారికలుగా రచియించెను. కల్హణుఁ డెక్కువగా పొగడిన యితఁ డింకే దేనికావ్యము రచియించియుండును గాని యట్టి దేది యు నింతవఱకు లభించ లేదు.

ఇతనితనయుఁడుభట్టముకులుఁడు, అభిధావృత్తిమాతృకయను చిన్నలక్షణము నిర్మించినవాఁడు. పదియేను శ్లోకములయాకృతి కతఁడే వృత్తి రచియించెను. శబ్దముల ముఖ్యలాక్షణికార్థములను విశదీకరించిన యాకృతి నాఁడు ప్రామాణికమై వెలసినదే. ఆముకులుని కొడుకు హార

టుఁడు. తండ్రితాతలవలె సాహిత్యపరిపూర్ణుఁడు. అతఁడు జయదేవచ్ఛందస్సను కృతి నిర్మించెనని రాజతరంగిణి చెప్పుచున్నది. అందలి వాక్యములు కొన్ని యభినవగుప్తుఁడు నాట్యశాస్త్రవ్యాఖ్యలో నుదాహరించి యున్నాఁడు. ఆముకుళుని శిష్యుఁడు—

## ప్రతీహారేందురాజు

భట్టముకులుని శిష్యుఁడైన యితఁడు కోంకణదేశవాసి. విద్యాభ్యాసమునకై కాశ్మీరము వచ్చియుండువాఁడు. అలంకారశాస్త్రనిధియైన యీపండితుఁడు, ఉద్భటుని కావ్యాలంకారసారసంగ్రహమునకు లఘువృత్తి నిర్మించెను. ఇది పేరుకు లఘువృత్తి గాని పరిమాణమున గురువృత్తియే. పైకి వ్యాఖ్య గాని స్వతంత్రగ్రంథముగానే కొనసాగినది. ఇతనివృత్తిచేతనే ఉద్భటాలంకారగ్రంథమున కెక్కువఖ్యాతి వచ్చినది. ఇందు పూర్వాలంకారికులమతము లెత్తియున్నాఁడు. ఆనందవర్ధనునిమాట లెత్తి వివరించుచు, సహృదయుఁ డానందవర్ధనుఁడైనట్లు తెలిపియున్నాఁడు. ఇతఁడు గురువంతటివాఁడై శా. ౮౬౦ ప్రాంతమున గ్రంథరచన మారంభించి యుండును—కల్లటునికుటుంబములోనివారీ ముగ్గురు.

## భట్టభల్లటుఁడు

ఇతఁడును కాశ్మీరియుఁడు, శా. ౮౦౫-౮౨౪ నడుమ కాశ్మీరమేలినశంకరవర్మయాస్థానమున విద్వత్కవి, అని రాజతరంగిణి (౫. ౧౨౪) శ్లోకమున తెలియుచున్నది. కాని, శా. ౭౭౭-౮౦౫ నడుమ రాజైనఅవంతివర్మయాస్థానములోని ఆనందవర్ధనుఁ డితనిశతకములోనిశ్లోకములను ధ్వన్యాలోకమున నుదాహరించి యున్నాఁడు కావున, నతనికి సమకాలికుఁడును, అతనికంటె వయసున చిన్నవాఁడునై

యుతని ధ్వన్యాలోకరచనమునాఁటికే నీతిశతక మితఁడు రచియించె నని విశ్వసింపవలెను—తరువాతిలాక్షణికు లందఱును మెచ్చుకొన్నయీ శతక మొక్కటియే కాక, యితఁ డింకే వేని కృతులు నిర్మించియుండును గాని, యందేదియు గోచరింపదు.

భల్లటశతకము లోకోక్తిపూరితము నీతిదాయకము ప్రపంచజ్ఞానబోధకము మృదుమధురము- ఆనందవర్ధనాచార్యుఁడు తనధ్వన్యాలోకమున ౧; 3, ఉద్ద్యోతములలో రెండుసార్లుదాహరించినయితనిశ్లోక మిది:—

"పరార్థే యః పీడా మనుభవతి భంగేఽపి మధురో,
యదీయ స్సర్వేషా మిహ ఖలు వికారో ఽప్యభిమతః,
న సంప్రాప్తో వృద్ధిం యది స భృశ మక్షేత్రపతితః,
కి మిక్షో ర్దోషోఽసౌ న పున రగుణాయా మరుభువః"

ఇందు సుజనుఁడు ప్రస్తుతము, చెఱకుకఱ్ఱ అప్రస్తుతముగా నిందుత్తమపురుషలక్షణము సూచింపఁబడినది- ఇట్టియనుభవముధ్వనికి విషయము కానేర దనుచు నానందవర్ధనుఁ, డింకొకచోట అప్రస్తుతప్రశంసలో వాచ్యము వివక్షిత మగుట కీశ్లోకమునే యుదాహరించినాఁడు—మఱియు, అవివక్షితత్వమున కీ క్రిందిశ్లోక మితనిదే యుదాహరించినాఁడు.

"క స్త్వం? భోః, కథయామి దైవహతకం మాం విద్ధి శాఖోటకం,
వైరాగ్యా దివ వక్షి సాధు విదితం కస్మా దిదం కథ్యతే?,
వామే నాత్ర వట స్త మధ్వగజనః సర్వాత్మనా సేవతే
న చ్ఛాయాపి పరోపకారకరిణీ మార్గస్థిత స్యాపి మే"

దీనినే ధనికుఁడు దశరూపకవ్యాఖ్యలో, రసమున కంగముగాక స్వతంత్ర మగునిర్వేదమున కుదాహరించినాఁడు—చెట్టును పలుకరించడము అదిబదులు చెప్పడము సంభవించదు గావున నిందలివాచ్యా

ర్థము వినక్షితము కాదు. సంపన్నుఁ డైనయొకలుబ్ధునిచెంత పడి యున్న నిర్ధనుఁడు మనస్వియు నైన యొకదీనునిపరిదేవన మిందలితాత్పర్యముగా వాక్యార్థీకృత మైనది-మఱియొకయన్యాపదేశము:—

" ఆబద్ధకృత్రిమసటాజటిలాంసభి_త్తి,
రారోపితో మృగపతేః పదవీం యది శ్వా,
మ_త్తేభ కుంభతట పాటన లంపటస్య,
నాదం కరిష్యతి కథం హరిణాధిపస్య "

జూలు కట్టినంతమాత్రమున, కుక్కకు సింహగుణము లబ్బునా? శృంగారవైరాగ్యవర్ణనమున నిది భర్తృహరిశతకములను బోలి యున్నది-ఈక్రిందిశ్లోకములో నొకవిరహిణి విద్యుల్లతను దూషించు చున్నది.

" వాతా వాన్తు కదంబరేణుబహులా నృత్యన్తు సర్పద్విషః,
సోత్సాహా నవతోయదా న గురవో ముంచంతు నాదంఘనాః,
మగ్నాం కాంతవియోగదుఃఖదహనే మాం వీక్ష్య దీనాననాం,
విద్యుత్ప్రిస్ఫురసి త్వ మ ప్యకరుణే స్త్రీత్వేఽపి తుల్యే సతి "

ఈక్రిందిది సత్కవితారీతి నుపదేశించుచున్నది.

" బద్ధా యదర్పణరసేన విమర్దపూర్వ,
మర్థా కథం ఝుటితి తాన్ప్రకృతా న్న దద్యుః,
చోరా ఇవాతిమృదవో మహతాం కవీనా
మర్థాంతరా ణ్యపి హఠా ద్వితర_న్తి శబ్దాః "

# గౌడాభినందుఁడు

ఇతనిపూర్వులు గాడదేశనివాసు లగుటచే నితఁడు కాశ్మీరమున నున్నను గౌడవిశేషణము తప్పినదికాదు. శక్తిపండితుఁడు గౌడదేశము నుండి కాశ్మీరమునకు వలసవచ్చినవాఁడు, అతనిపౌత్త్రుఁ డైనశక్తిస్వామి

లలితాదిత్యనృపాలునిమంత్రులలో నొకఁడు. ఆరాజుశా. ౬౧౭_౬౫౪ లోనివాఁడు. ఆమంత్రిసంతతిలో నైదవతరమువాఁడు మనకవి. ఇతఁడు రాజశేఖరునకు సమకాలికుఁడు భట్టజయంతునికొడుకు. బిల్హణుఁ డితనిని దనసూక్తిముక్తావళిలోఁ బేర్కొనియున్నాఁడు కావున నితఁడు శా. ౮౦౦ ప్రాంతమువాఁ డగును.

ఇతఁడు బాణునికాదంబరీకథను గైకొని కాదంబరీకథాసార మను పేర నెనిమిదిసర్గలపద్యకావ్యము నిర్మించెను. అభినవగుప్తపాదుఁడు కథాతాత్పర్యమును సర్గబంధముగాఁ జేయుట కుదాహరణముగా దీనిపే రెత్తి యిది భట్టజయంతుని దనెను. అభినందుఁ డనుటకు బదులుగా నితనితండ్రిపేరు పొరపాటుగాఁ బేర్కొన్నాఁ డనుట నిజము. ఏ మనఁగా క్షేమేంద్రుఁడు తనసువృత్తతిలకములలో_కథాప్రసంగే యథా భినందస్య - అని యీకథాసారమునే స్మరించెను.

ఈకవి సరిగా బాణునిగద్యము ననుసరించి యీకృతి నిర్మించె ననుట కుదాహరణము___

"తస్యాం నిజభుజోద్యోగవిజితారాతిమండలః,
ఆఖండలఇవ శ్రీమాన్ రాజా శూద్రక ఇత్యభూత్"

## పద్మగుప్తుఁడు

ఇతఁడు మృగాంకదత్తునిపుత్రుఁడు. ఉజ్జయినీనివాసి, పరిమళకాళిదాసబిరుదాంచితుఁడు, నవసాహసాంకచరితకావ్యకర్త. ఉజ్జయిని రాజధానిగా అవంతీదేశము నేలినవాక్పతిరాజదేవునియాస్థానమున విద్వత్కవిగానుండి, అతనియనంతరము, అతనితమ్ముఁ డయినవిక్రమార్క నృపాలునియాదరము గాంచి యందే యుండి యానృపునిచరితమునే నవసాహసాంకచరితమను పేర ౧౮ సర్గలమహాకావ్యముగా నిర్మించెను. ఈకృతినాయకుఁ డైనవిక్రమార్కునికి నవసాహసాంకుఁడు కుమారనారాయ

ణుఁడు నను రెండుబిరుదము లున్నవి. ఇతఁ డద్భుతసాహసకృత్యము లాచరించి శతృరాజుల నోర్చి జయలక్ష్మిని వరించినమహాశూరుఁడు, కృతికర్త గ్రంథాది నీవిషయ మిట్లు వర్ణించియున్నాఁడు.

"దివం యియాసుర్మమ వాచి ముద్రామదత్త యాంవాక్పతిరాజ దేవః,
తస్యానుజన్మా కవిబాంధవస్య భినత్తి తాం సంప్రతివిక్రమార్కః,
నిర్వ్యాఘనానాద్భుతసాహసం చరణే వృతంచ స్వయమేవ లక్ష్మ్యా,
నామ్నా య మేకే నవసాహసాంకం,కుమారనారాయణ మాహు రన్యే"

వాక్పతిరాజదేవుఁడు స్వర్గమునకు పోవుచు నితనివాక్కునకు ముద్ర వేసినాఁడఁట—తరువాత విక్రమార్కుఁ డాముద్ర విడఁగొట్టినాఁ డఁట.

ఉజ్జయినీపాలకక్రమమునుబట్టి యీకవి కవిపోషకులు శా. ౧౦౦౦ ప్రాంతమువా రని తెలియుచున్నది. మఱియు, వాక్పతిరాజు స్వర్గస్థుఁడైనపుడు పరితపించుచు నీపరిమళకవి చెప్పినశ్లోకము క్షేమేంద్రుని యౌచిత్యవిచారచర్చలో నిట్లున్నది.

" హా శృంగారతరంగిణీకులగిరే! హా రాజచూడామణే!
హా సౌజన్యసుధానిధే బత హాహా! వైదగ్ధ్యదుగ్ధోదధే!
హా దేవోజ్జయినీభుజంగ! యువతిప్రత్యక్షకందర్ప! హా!
హా సద్బాంధవ! హా కలామృతకర! క్వాసి ప్రతీక్షస్వ నః"

వీటినిబట్టి యితఁ డుజ్జయినీరాజయినవాక్పతిరాజదేవకాలమందును, అతనితమ్ముఁడు విక్రమార్కునికాలమందు నున్నట్లు స్పష్టపడుచుండఁగా—ఈపరిమళకాళిదాసనుపద్మగుప్తుఁడు ధారానగరాధీశుఁడు ముంజాపరనామధేయుఁడు నైనవాక్పతిరాజదేవునిసభలోనివాఁడనుట యాశ్చర్యము కాదా! అది వాక్పతిరాజదేవుఁ డనునామసామ్యమున కలిగినభ్రాంతి[1]. ఆధారాధీశునిసభలోని దశరూపకవ్యాఖ్యాత

1. చూ. కృష్ణమాచార్యుల (ఆంగ్ల) సం. సా. చరిత్ర పుట 168-

ధనికుఁ డీపద్మగుప్తునిశ్లోక ముదాహరించుచు, తనమిత్రుఁ డనలేదు. తనపోషకునిశ్లోక ముదాహరించుచు ముంజవాక్పతిరాజదేవనామములు రెండును వాడినాఁడు, పద్మగుప్తుఁ డెక్కడను ముంజనామమే స్మరింపలేదు. అట్టియెడ ఉజ్జయినీరాజయిన వాక్పతిరాజునాస్థానములోనియీ కవిని నూతేళ్లు క్రిందికిఁదించి ధారానగరీశుఁడైనవాక్పతిరాజునాస్థానములోనికి లాగుట యుక్తమా?—మనపద్మగుప్తుఁ డుజ్జయినిలోనివాఁడే. ఆలంకారికలోకమున నితఁడు పరిమళనాముఁడే.

ఇతఁడు కృత్యాదిని పూర్వకవుల నిట్లు ప్రశంసించియున్నాఁడు

"తత్త్వస్పృశస్తే కవయః పురాణాః, శ్రీభర్తృమేంఠప్రముఖా జయన్తి
నిస్త్రింశధారాసదృశేన యేషాం వైదర్భమార్గేణ గిరః ప్రవృత్తాః"

దీనినిబట్టి భర్తృమేంఠాదుల ననుసరించి యితఁడు వైదర్భీరీతిని కవిత్వము చెప్పినట్లు తెలియును. సరసమై శ్రావ్యమైనయితనికవితయు నట్లే యున్నది. ఇందుకు రెండు:—

"మగ్నాని ద్విషతాం కులాని సమరే త్వత్ఖడ్గధారాకులే,
నాథాస్మిన్నితి వందివాచి బహుశో దేవ! శ్రుతాయాం పురా,
ముగ్ధా గూర్జరభూమిపాలమహిషీ ప్రత్యాశయా పాథసః,
కాంతారే చకితా విముంచతి ముహుః పత్యుః కృపాణే దృశౌ"

దీనినిబట్టి యీనవసాహసాంకుఁడు గూర్జరేశ్వరుఁ నోడించెనని విదితము. ఈక్రిందిది మోట్టాయితమునకు ధనికుఁ డుదాహరించిన శ్లోకము.

"చిత్రవర్తిన్యపి నృపే, తత్త్వావేశేన చేతసి,
వ్రీడార్ధవలితం చక్రే, ముఖేందు మవశైవ సా"

ఇతనియీక్రిందిశ్లోకమును సదుక్తికర్ణామృతము స్వీకరించినది,

"అథాక్షీ న్నోష్ఠే లంకామయ ముయ ముదస్వాంత మతర,
ద్విశల్యాం సౌమిత్రే పయ ముపనినా యాషధివరామ్,

ఇతి స్మారంస్మారం త్వదరినగరీసౌధలిఖితం,
హనూమంతం దంత్రై ర్దశతి కుపితో రాక్షసభటః ”

మనలంక తగులఁ బెట్టినవాఁడు వీఁడే, వీఁడే! అని తలఁచి నీశత్రురాజనగరిలోనిమేడమీఁది యాంజనేయునిబొమ్మను రాక్షసభటుఁడు కొఱికివేయుచున్నాఁడు—ఇంక నీకవి అవంతిరాజును నుతించినపద్య మొకటి—
(వాక్పతిరాజో లేక విక్రమార్కుఁడో)

“ అచ్ఛాసు హంస ఇవ బాలమృణాలికాసు,
భృంగో నవా స్వివ మధుద్రుమమంజరీషు,
కో ఽ వని భర్తు రపరో రసనిర్భరాసు,
పృథ్వీపతి స్సుకవిసూక్తిషు బద్ధభావః ”

## ధనంజయుఁడు. ౧

ఇతఁడు దశరూపకకర్త యైనధనంజయునికి పూర్వుఁడై నమఱియొకధనంజయుఁడు, ద్విసంధాన మనునామాంతరము గలరాఘవపాండవీయమును నిర్మించినవాఁడు, శ్రీదేవీవాసుదేవుల కుమారుఁడు. సాహిత్యనిధి, చక్రనికవి. ఇతఁడు జైనుఁ డనికొందఱు అందురు, రాజశేఖరుని కవివిమర్శలోనిదిగా సూక్తిముక్తావళిలో నున్నయీక్రిందిశ్లోక మితని కృతిని నైపుణిని ప్రశంసించుచున్నది.

“ ద్విసంధానే నిపుణతాం సతాం చక్రే ధనంజయః,
యయా జాతం ఫలం తస్య స తాం చక్రే ధనంజయః ”

ఇతఁ డానందవర్ధనరత్నాకరులను తనకావ్యమున స్తుతించియున్నాఁడు. కావున రాజశేఖరునికి పూర్వుఁడై వీరికి పరుఁడై శా ౮౦౦. ప్రాంతమునందుండె నని విశ్వసింపవచ్చును—దండి ద్విసంధానకావ్యము నిర్మించె నన్న ప్రతీతి యెపుడు పుట్టినదో కాని, అది మనస్సులో పెట్టుకొనిభోజరాజు శృంగారప్రకాశము సప్తమప్రకరణములో “దండినో ధనం

జయస్య వా ద్విసంధానే" అని సంశయము చూపుచు కొన్నిశ్లోకము లుదాహరించియున్నాఁడు. కాని, రామాయణభారతకథలను జోడించి కూర్చిన ద్విసంధానకావ్యము ధనంజయుని దన్నవిశ్వాసము రాజశేఖరుని పై మాటలవల్ల విదిత మైనది. అది గాక, వాల్మీకివ్యాసుల నట్లు దండి నితఁడే స్తుతించియున్నాఁడుగదా! ఈకావ్య మిపుడు బొంబాయిలో ముద్రిత మైనది. శ్లేష మిక్కిలి సులభముగాను హృద్యముగాను, వెలయుచున్న దనుటకు నాయకధ్వనినిరూపణ మగునీశ్లోకముకన నగును.

"ఉదారమహిమా రామః ప్రజానాం హర్షవర్ధనః,
ధర్మప్రభవ ఇత్యాసీత్, ఖ్యాతో భరతపూర్వజః"

ఉదారమహిముఁడు లోకానందదాయి ధర్మమునకు హేతుభూతుఁడు భరతునికి ముందు పుట్టినవాఁడు విఖ్యాతుఁడు నైనశ్రీరాముఁడనురా జుండె నని రామాయణార్థము. ఉదారమహిమకారామమువంటివాఁడు ప్రజారంజకుఁడు భరతకులమునజన్మించినయైదుగురులో మొదటివాఁడు ప్రసిద్ధుఁడు నైన ధర్మజుఁ డనురా జుండెను, అని భారతార్థము.

## రాజశేఖరుఁడు

ఇతని కృతులలోని మాటలను, ఇతరు లితనిని ప్రశంసించిన మాటలను పురస్కరించుకొనియే నేఁటిపరిశోధకు లితనివిషయ మెఱింగించుచు కొన్నియంశములు సంధిగ్ధములుగా సూచించిరి. అయినా శక్య మైనంతవఱ కీమహాకవి జీవితతత్త్వము తెలియ యత్నింతము.

### వంశనివాసకాలములు

ఇతఁడు యాయావరకులమున జన్మించినవాఁడు. అందలిపూర్వపురుషు లందఱును పండితులు, కవులు. వారిలో తరళుఁడు కవిరాజు ననె

డివారి నితఁడు తనకృతులలో స్మరించియున్నాఁడు. ఆనాఁడీవంశము వారినివాసము చేదిమండలములో నొకగ్రామమై యుండు నని, స్వవంశ పూర్వపురుషుఁడును మహాకవియు నైనసురానందుఁడు చేదిమండలము నకు మండనముగా నుండె నన్నయితనివర్ణనమువల్ల నే తెలియుచున్నది. పిదప నితనివంశమువారి నివాసము మహారాష్ట్రదేశమందలి యొకగ్రామమై యుండు నని, తనపితామహునిపితామహుఁడును మహాకవియు నైన అకాలజలదకవిని మహారాష్ట్ర చూడామణినిగా నితఁడు వర్ణించుటవల్ల నే విదిత మగుచున్నది[1]. తరువాత నితనితండ్రితాతలనాఁడు వీరి నివాసము. కాన్యకుబ్జము. ఇతనితల్లి శీలవతి, తండ్రి దుర్దుకపండితుఁడు. లేక దుహికుఁడు. అతఁడు రాజమంత్రి.

గంగాతీరమం దున్నమహోదయ మనునగరమే కాన్యకుబ్జము. తత్పాలకుఁడైనమహేంద్రపాలుని కితఁడు గురువు. ఆరాజునకు నిర్భయరాజని నామాంతరము. అతనికొడుకు నైనమహీపాలదేవునికి మనకవియే గురువు. ఇతఁడాబాల్యముగా కవిత చెప్పుచున్నవాఁ డగుటచే బాలకవి యన్నియు, కవిత్వప్రౌఢిమచే కవిరాజనియు, రాజులగురు వగుటచే నుపాధ్యాయుఁ డనియు పిలువఁబడుచుండెడివాఁడు. ఈవిషయ

---

1. "స మూర్తో యత్రాసీ ద్గుణగణ ఇవాకాలజలదః,
సురానంద స్సోఽపి శ్రవణపుటపేయేన వచసా,
న చాన్యే గణ్యన్తే తరళకవిరాజప్రభృతయో,
మహాభాగ స్తస్మి న్నయ మజని యాయావరకులే."
"అకాలజలదస్య ప్రణప్తుః-" "తదాముష్యాయణస్య మహారాష్ట్ర
చూడామణే రకాలజలదస్య చతుర్థో దౌర్దుకిః (దౌహికిః)
శీలవతీసూను రుపాధ్యాయ శ్రీరాజశేఖరః" విద్ధసాలభంజికా-బాలరామాయణప్రస్తావనలు-

ముల కితని కృతులలోనిమాటలే ప్రమాణము [1]. ఇతనికాలమునుగూర్చి తొలుత భేదాభిప్రాయము లేర్పడినవిగాని, యిపు డవి సమసిపోయినవి. క్రీ. ౯౦౩, ౯౧౩ లో, క్రమముగా మహేంద్రపాలుఁడును, మహీపాల దేవుఁడును వ్రాయించిన దానశాసనములనుబట్టి వారు శా. ౮౨౫ ప్రాంతమున నున్నవా రనుట విదితము,[2] ఇది యిట్లుండ—

శా. ౭౮౦ ప్రాంతమం దున్నయానందవర్ధన రత్నాకరుల నితఁడు స్తుతించియున్నాఁడు. శా. ౮౮౦ లోనియశస్తిలకచంపువు నిర్మించిన జైనసోమదేవుఁ డితనిని స్తుతించియున్నాఁడు. కావున నితఁడు శా. ౭౯౦-౮౫౦ నడుమ నున్నవాఁ డనుట సముచితము.

ఈకవిచంద్రుఁడు చాహువాణ[3] కులసంజాత యైనఅవంతిసుందరి యనురాజపుత్రకన్యను పెండ్లాడినట్లును, ఆమె కర్పూరమంజరీప్రదర్శనము కోరినట్లు నీక్రిందిశ్లోకము తెల్పుచున్నది.

" చాహువానకులమౌళిమాలికా, రాజశేఖరకవీంద్రగేహినీ,
భర్తృసత్కృతి మవంతిసుందరీ, సా ప్రయోజయితు మేత దిచ్ఛతి"[4]

దీనినిబట్టి యితఁడు క్షత్రియుఁ డేమో యని కొందఱు సంశయించిరి గాని, యితఁడు బ్రాహ్మణుఁడే యని వంశనామమే చాటుచున్నది.

---

1. "మందాకినీపరిక్షిప్తం మహోదయం నామనగరం"
ఇదం ద్వయం సర్వమహాపవిత్రం పరస్పరాలంకరణైకహేతుః
పురం చ హేజానకి! కాన్యకుబ్జం సరిచ్చ గౌరీపతిమౌళిమాలికా"
" బాలరా. అం. ౧౦-
"రఘుకులచూడామణే ర్మహేంద్రపాలస్య......" విద్ధ-బా. రా- ప్రస్తావన
రఘువంశముక్తామణే ర్నిర్భయనరేంద్రపుత్రస్య—బా. భా. ప్రస్తా.
"బాలకవిః కవిరాజో నిర్భయరాజస్య తథోపాధ్యాయః కర్పూర-
2. చూ. ఇండియన్ ఏంటిక్వరీ, సం 16, 34—ఏపిగ్రాఫికాఇండికా, సం. 1-171 శాసనములు.
3. చాహువాణ, చాహమాన, చౌహాణ-రూపాంతరములు
4. ప్రస్తావనలోని ప్రాకృతపద్యమునకు ఛాయ.

ఇతనివంశములోని ప్రాచీనపురుషుఁడైన తరళపండితునినాఁటికే వీరిది యాయావరకులముగా ప్రసిద్ధి కెక్కినది. అతనికిని పూర్వుఁడైనయొక పండితుఁడు యాయావరవృత్తిచే జీవించినవాఁడగుటచే నీవృత్తినామ మావంశమువారికి సిద్ధమైనదనుట స్పష్టము. ఈవృత్తినామముతోడి క్షత్రియు లెందును కనరారు. ఇతనిపూర్వులలో కవితాశక్తిచే లభించినపౌరుషనామమే పేరుగ వెలసినకవిరాజొకఁడున్నాఁడు గాని, క్షత్రియోచితనామముతోడిపురుషుఁడొక్కఁడును కనరాఁడు. మఱియు, ఆకాలమందనులోమవివాహము లున్న వనుటకు బాణభట్టుతండ్రి చిత్రభానుఁడు మొదలగుసాక్షు లున్నారు. ఆనాఁడు రాజగురువులు బ్రాహ్మణులే యగుటయు ప్రసిద్ధము. కావున ననులోమవివాహముచేసికొన్న యీరసికశేఖరుఁడు వైదికుఁడద్వైతమతావలంబి రాజకుల గురువునైనయుత్తమబ్రాహ్మణుఁడని విశ్వసింపవచ్చును.

ఇతనిభార్య అవంతిసుందరి. సంస్కృతప్రాకృతములు రెంటను విదుషియయ్యు ప్రాకృతము నెక్కువగా ప్రేమించుటచేతనే యితఁడు కర్పూరమంజరీసట్టకము నిర్మించి, యామెయభిప్రాయమే తనయభిప్రాయముగా నందలిప్రస్తావనలో "ప్రాకృతవాక్కులు సుకుమారములు. యువతీయువకులకు వలెనే ప్రాకృతసంస్కృతభాషలకు విశేషాంతరము కలదు" అని తెలిపియున్నాఁడు. ఇందు వర్ణింపఁబడినస్త్రీపాత్రలకవిత్వరసజ్ఞతనుబట్టి యానాఁటి స్త్రీవిద్యావ్యాప్తియు సంఘమందలివారిగౌరవమును సూచితము లగుచున్నవి. మఱియు నంతకు మున్ను ప్రాకృతములో రూపకరచన మున్నట్లు కనఁబడదు. అందుచే సంస్కృతవ్యాప్తి తగ్గి ప్రాకృతప్రచారము హెచ్చుచున్న యాకాలమున రూపకప్రదర్శనము సర్వజనరంజకము కావలెనన్నయూహతోనీప్రాకృతసట్టకమును ముందితఁడు నిర్మించెననియు తోఁచుచున్నది.

ఆయాకవులప్రశంసలనుబట్టి యీకవిరాజు పెక్కుకావ్యములు రచియించినట్లు తెలియును గాని, బాలరామాయణప్రస్తావనలోని

మాటనుబట్టి యితఁడు దానితో నాఱుకృతులు మాత్రమే యప్పటికి నిర్మించినట్లు గోచరించుచున్నది. విద్ధసాలభంజిక కర్పూరమంజరి బాలరామాయణము బాలభారతము ననునీనాలుగురూపకములును వాటిలో వ్యాప్తికి వచ్చినవి. ఇవిగాక తక్కినరెం డేవి యనువిషయమున నేవేవో యితనివిగా పరిశోధకులు భావించియున్నారు. వాటిలో రత్నమంజరీ నాటిక హారవిలాసము భువనకోశము అష్టదళకమలము కవివిమర్శము కావ్యమీమాంస అనెడియాఱు గణనకు వచ్చినవి. ఇందులో మొదటి నాటికలోనిమాట యొకటియు నెవ్వరు నెత్తినట్లు కనరాదు, తరువాతి మూటిలోని శ్లోకము లందందు కనిపించును. కవివిమర్శమే కవిరహస్యమని కొందఱు భావించిరి గాని యిది వే ఱయినకృతియే యని యిందలి శ్లోకములుగా కొన్నిటిని చూపినసంకలనగ్రంథములనుబట్టి యనుకొనవలసియున్నది. ఇంక, కావ్యమీమాంస. ఇదే సాహిత్య విమర్శనమైన కవిరహస్యమనెడి మహాగ్రంథ మనుకొనవచ్చునుగాని, పదునెనిమిది యధికరణముల యీమహాకృతిలో మన కిపుడు మిగిలినది ప్రథమాధికరణముమాత్రమే. తక్కినయధికరణము లితఁడు నిర్మించినట్లు మొదటి దానిలోనిమాటలవల్లనే కాక, అలంకారశేఖర మనుగ్రంథములో నుపమాలంకారప్రశంస సందర్భమున రాజశేఖరునిదిగా నుదాహరింపఁబడిన యీక్రిందిశ్లోకమువల్లకూడా తెలియుచున్నది.

" అలంకారశిరోరత్నం, సర్వస్వం కావ్యసమ్పదామ్
ఉపమా కవివంశస్య మా త్రైవేతి మతి ర్మమ"

మఱియు సంకలనగ్రంథములు రాజశేఖరునికవివిమర్శములోనివని సేకరించినశ్లోకము లందలి కవివిశేష-కవిచర్యాది ప్రకరణములలోనివేమో యనియు, అందలి భువనకోశ మనెడిపదియేనవయధికరణమే యితనిగ్రంథాంతరముగా చెప్పఁబడుచున్నదనియు, తోఁచుచున్నది. ఏమయిన నేమి! ఆమహాగ్రంథములోని ౧౭ అధికరణములు లోపించుట భాషకు లోపమే.

జల్హణుఁడు భువనకోశములోని దని చూపినపద్యమువంటి దేశ వర్ణనపద్యములు మఱికొన్ని యితనివిగా సదుక్తికర్ణామృతాదులలో కనవచ్చుచున్నవి. అవి, గ్రంథము పేరు తెల్పకపోయినా, ఇతనిభువనకోశములోనివే యనఁదగియున్నవి.

౧. నర్మదానది, అందలిరణవిగ్రహుఁ డనురాజు, తనవంశములోని ప్రాచీనపురుషుఁడైన సురానందకవియు, చేదిమండలమున కలంకారములుగా నున్నా రఁట.

" నదీనాం మేఖలసుతా, నృపాణాం రణవిగ్రహః
కవీనాం చ సురానందః, చేదిమండలమండనమ్.

౨. ఈక్రిందిది కేరళ దేశవర్ణనము. కేరల దేశము మన్మథుని కేళీమందిరమువలె నున్నదఁట.

" పర్ణం నాగరఖండ మార్ద్రసుభగం పూగీఫలం పాలయః,
కర్పూరస్యచ యత్ర కోఽపి చతుర స్తాంబూలయోగక్రమః,
దేశః కేరళ ఏష కేళిసదనం దేవస్య శృంగారిణ
స్తం దృష్ట్వా కురు కోమలాంగి! సఫలే ద్రాఘీయసీ లోచనే"

3. ఈక్రింది దాంధ్రదేశవర్ణనము.

" వాక్సత్త్వాంగసముద్భవై రభినవై ర్నిత్యం రసోల్లాసతో,
వామాంగ్యః ప్రణయన్తి యత్ర మదనక్రీడామహానాటకమ్,
అ త్రాన్ధ్రా స్తవ దక్షిణేన త ఇమే గోదావరీస్రోతసాం,
సప్తానా మపి వా ర్నిధి ప్రణయినాం ద్వీపాన్త రాళశ్రితాః"

ఈవర్ణనారీతిని చూడఁగా నీరాజశేఖరుఁడు, గోదావరి యేడుపాయలకు నడుమ నున్నట్టియు వాటి కంటియున్నట్టియు కోనసీమ,లంకసీమ మొదలగుసీమలన్నియు చక్కఁగా తిరిగి, అందందలిస్త్రీలను చూచి వారి యాచారము లెఱిఁగి వర్ణించినట్లు విదిత మగుచున్నది. ఇంతకు మున్ను భర్తృమేంఠుఁ డాంధ్రస్త్రీలను వర్ణించుట కనియున్నాము కాని, ఇది

యావర్ణనమును మించినది. శృంగారప్రియుఁడైనయితనిధోరణి మన శ్రీనాథునిధోరణివలె నున్నది. దేశగుణవర్ణనమం దితనిభువనకోశమే వేంకటాధ్వరివిశ్వగుణాదర్శమునకు మార్గదర్శకమైనదేమో యనియు తోఁచుచున్నది. ఇతఁడు దక్షిణాపథ మంతయు సంచరించినవాఁడనుటకుఁ బై వర్ణనములు చాలును.

౪. సరస్వతీదేవి జన్మభూమివలె నున్న దని విదర్భదేశము నిట్లు వర్ణించినాఁడు. ఇందు కితనికి భవభూతిపై నున్నమహాగౌరవముకూడా కారణమై యుండును.

"యత్ క్షేమం త్రిదివాయ వర్త్మ నిగమ స్యాంగంచ య త్సప్తమం
స్వా ద్విష్టంచ యదైక్షవా దపి రసా చ్చక్షుశ్చ య ద్వాఙ్మయమ్,
త ద్యస్మి న్మధురం ప్రసాది రసవత్కాన్తం చ కావ్యామృతం,
సో ఽయం సుభ్రు! పురో విదర్భవిషయ స్సారస్వతీ జన్మభూః"

౫. కామినీకాముకుల విలాసముల నందలిసంపద్విశేషములను తెలుపుచు మాలవదేశము నిట్లు వర్ణించినాఁడు.

"ఏత న్మాలవమండలం విజయతే సౌజన్యరత్నాంకురైః,
సంపద్విభ్రమధామభిః కి మపరం శృంగారసారై ర్జనైః,
య త్రారుహ్య విచిత్రచిత్రవలభీ ర్లీలాశిలాసద్మనాం,
నీయంతే జలదోదయేషు దివసాః కాంతాసఖైః కామిభిః,

ఇతనిస్థలపురదేశాదివర్ణన లింక నిట్టివి కలవు. విమానయానము గావించుచు నాయకుఁడు నాయికకాప్రదేశములు చూపి వాటివిషయము వివరించి చెప్పుచున్నట్లున్న వీటినిబట్టి భువనకోశ మనుపేర తఁడు వర్ణించిన దొకవిధమైనదేశచరిత్ర మన వచ్చును.

ఈసాహిత్యనిధి తనపూర్వమహాకవుల నందఱిని స్తుతించినగుణపక్షపాతి పరులచే నుతింపఁబడినసుజనుఁడు. అయినను, కొందఱివలె నాత్మస్తుతి గావించుకొన్నాఁడు కాని, పరనిందమాత్రము చేసియెఱుఁగఁడు.

భాసాదుల నితఁడు నుతించుట మున్ను చదివియున్నాము. తిలకమంజరిలో ధనపాలుఁడును, ఉదయసుందరీకథలో సోఢలుఁడు నితని నిట్లు పొగడియున్నారు.

"సమాధిగుణశాలిన్యః ప్రసన్నపరిపక్త్రిమాః,
యాయావరకవే ర్వాచో మునీనా మివ వృత్తయః,"
"యాయావరః ప్రాజ్ఞవరో గుణజ్ఞై, రాశంసిత స్సూరిసమాజవర్యైః,
నృత్య త్యుదారం ఫణితే రసస్థా, నటీవ య స్యోఢరసా పదశ్రీః"

ఇట్లే సోమదేవుఁడు యశస్తిలకచంపువులోను, ధనికుఁడు దశరూపకవ్యాఖ్యలోను, ఇతనిని పేర్కొనియున్నారు. ఇతనిబాలరామాయణాదులకు వ్యాఖ్యలు నిర్మించిన విద్యాసాగర లక్ష్మణసూరి నారాయణ ఘనశ్యామ-కామరాజ-ధర్మదాసాదు లందఱు నితనిఘనత నావిష్కరిం యున్నారు. ఇంక తాను రాజశేఖరుని (శివుని) నాల్గవయవతారమైనట్లు నాటకప్రస్తావనలలో నిట్లు నుతించుకొనెను.

"బభూవ వల్మీకభవః కవిః పురా, తతః ప్రపేదే భువి భర్తృమేంఠతామ్
స్థితః పున ర్యో భవభూతిరేఖయా, స వర్తతే సంప్రతి రాజశేఖరః"

ఇది విద్ధసాలభంజికలోనిది—

"శ్రోతుం శ్రోత్రరసాయనం రచయితుం వాచ స్సతాం సమ్మతాః,
వ్యుత్పత్తిం పరమా మవాప్తు మవధిం లబ్ధుం రసస్రోతసః,
భోక్తుం స్వాదుఫలంచ జీవితతరో ర్య ద్యస్తి తే కౌతుకం,
తద్భ్రాతః శృణు రాజశేఖరకవే స్సూక్తీ స్సుధాస్యందినీః"

ఇంక నీమహాకవి కవిత్వము రుచిచూచుటకు విద్ధసాలభంజికలోనివిరహార్తుఁ డగునాయకునిమాటలు—ఇందలికథ కేవలకల్పితము. రసము శృంగారము, మృగాంకలేఖా విద్యాధరమల్ల దేవులు నాయికానాయకులు.

"శ్యామాం శ్యామలిమాన మానయత భో స్సాంద్రై ర్మషీకూర్చకైః
మంత్రం తంత్ర మథ ప్రయుజ్య హరత శ్వేతోత్పలానాం శ్రియమ్,
చంద్రం చూర్ణయత క్షణాచ్చ కణశః కృత్వా శిలాపట్టకే,
యేన ద్రష్టు మహం క్షమే దశదిశ స్తద్వక్త్రముద్రాంకితాః"

ఇతఁడు శృంగారప్రియుఁ డనుట కితనిమన్మథవర్ణనలే సాక్షులు- ఇందు కితనిరూపకములనుండి:—

"కర్పూర ఇవ దగ్ధో ఽపి శక్తిమాన్ యోజనే జనే,
నమో ఽ స్త్వవార్యవీర్యాయ తస్మై మకరకేతవే" బాల.

"దృశా దగ్ధం మనసిజం జీవయన్తి దృశైవ యాః,
విరూపాక్షస్య జయినీ స్తాః స్తువే వామలోచనాః" విద్ధ.

"కులగురు రబలానాం కేళిదీక్షాప్రదానే
పరమసుహృ దనంగో రోహిణీవల్లభస్య,
అపి కుసుమపృషత్కై- ర్దేవదేవస్య జేతా
జయతి సురతలీలానాటికాసూత్రధారః"

గ్రంథవిస్తరభీతిచే నితనికృతులలోని విషయములు విమర్శించి విశదీకరింపఁజాలకున్నాను. ఇంక, నితనియితరకృతుల ప్రశంసావాక్యములును, ఇతనివంశములోని పూర్వకవులప్రశంసలు కొన్నిచూతము.

హేమచంద్రుఁ డితనిహారవిలాసమునుండి గ్రహించినయాశీర్వచనము.

" ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ శ్రుతీనాం ముఖ మక్షరమ్,
ప్రసీదతు స తాం స్వాంతే ష్వేకం త్రిపురుషీమయమ్"

ఇతఁడు శివభక్తుఁడైనా షడ్ద్వైతుఁ డనుట కిది చాలును, ఉజ్జ్వలదత్తుఁడు హారవిలాసమునుండి యితని యీక్రిందివాక్యము గ్రహించెను:

" దశావవశేష్వస్తఖురప్రఖండితః, క్వ చిద్గతార్ధో హారదీధితి ర్యథా"

భోజరా జుదాహరించిన యితనిఅష్టదళకమలబంధము.

" రాతావద్యాధి రాజ్యావిసర రరసవిద్యాఙ్ఞవాక్ క్షా వశాతా,
రాశాపత్నామ్రభ శేషాసయన ననయన స్వాస్వయాన్త్ర వ్యమారా,
రామావ్యస్త స్థిరత్వాత్తుహినసహితుః శ్రీః కరతారదారా,
రాధా రతాస్తు మహ్యాం శివ మమ మవశివ్యాళవిద్యావతారా "

" నిర్దిష్టాష్టదళ న్యాస మిదం పాదార్థ భక్తిభిః,
అస్పృష్టకర్ణికం కోణైః కవినామాంక మంబుజమ్ "(లక్షణం)

ఈలక్షణమునుబట్టి పై బంధమునందు కవినామము గోచరింపకున్నది. శ్లోకపాఠము సందిగ్ధము.

ఈక్రిందివారు యాయావరవంశప్రాచీనపురుషులు.

అకాలజలదుఁడు:— ఇతఁడు గొప్పకవియేకాని యితనివచనచంద్రికయైన లేదు. కాదంబరీరాముఁ డనుకవి యితనిశ్లోకములు స్వీకరించిన ట్లొకశ్లోకము కనఁబడుచున్నది.

" అకాలజలదశ్లోకై శ్చిత్ర మాత్మకృతై రివ,
జాతః కాదంబరీరామో నాటకేప్రవరఃకవిః "

మహారాష్ట్రచూడామణిబిరుదాంకితునిగా నితనిప్రశంసించినరాజశేఖరుఁ డితనికవిత నిట్లు వర్ణించెను.

" అకాలజలదేందో స్సా హృద్యా వచనచంద్రికా,
నిత్యం కవిచకోరై ర్యా పీయతే నతు హీయతే "

ఇతఁడు శా. ౭౭౦ప్రాంతము వాఁడగును.

సురానందుఁడు:— ఈ మహాకవి చేదిమండనుఁ డని యింతకు మున్న చదివినాము. ఇతఁడు శా. ౭౩౦ప్రాంతమువాఁడై యుండును, ఇతని కృతు లేవియు కనరావు.

తరళుఁడు:— ఇతఁడు యాయావరకులమండనుఁ డని చదివియున్నాము. శా. ౭౦౦ లకు వెనుకటివాఁడు. రాజశేఖరుని భువనకోశములోనిది.

" యాయావరకుల శ్రేణే ర్హ్మారాయ ష్టేశ్చ మండనమ్,
సువర్ణబంధురుచిర స్తరళ స్తరళోయథా "

కవిరాజు:— యాయావరవంశమూల పురుషుఁడైనయితఁడును మహా కవి. క్రీ. ౬౫౦ ప్రాంతమువాఁడై యుండును. ఇతని రచనలు లోపించినవి గాని, అందందు చెదురుగా నితనిశ్లోకము లున్నవి సదుక్తి కర్ణామృతములోని వీక్రిందిశ్లోకములు:— అశోకముపేరు పెట్టి కావించినయీనింద, అన్యాపదేశకవితకు మార్గదర్శక మైన దనవచ్చును.

"కిం తే నమ్రతయా కి మున్నతతయా కిం తే ఘనచ్ఛాయయా,
కిం తే పల్లవలీలయా కి మనయా చా శోక ! పుష్పశ్రియా,
య త్త్వన్మూలనిషణ్ణఖిన్నపథికస్తోమః స్తువ న్నన్వయం,
న స్వాదూని మృదూని ఖాదతి ఫలా న్యాకంఠ ముత్కంఠితః "

ఇదియును, శవ మెట్లియ్య లేదో, జీవముతో నున్నను లోభి యట్లివ్వఁజాలఁడు. కాని, చక్కఁగా మాంసము పెంచుచున్నవీఁడు కాకుల కుపకారముచేసినవాఁ డగుసన్నభావముతోడి యీక్రింది పద్య మును దాతలు దొరకక ప్రాణము విసిగి చివర కితఁడు యాయావర వృత్తికి దిగినట్లు సూచించుచున్నవి. ఇతనినాఁడే యీ వంశము యాయావరవంశ మైనదేమో !

" జీవతా పి శవే నేవ కృపణేన న దీయతే,
మాంసం వర్ధయ తా నేన కాక స్యోపకృతిః కృతా. "

రాజశేఖరుఁడు కావించినచంద్రవర్ణన లెన్నో అతనికృతులలో నివో చాటువులో కాని, సంకలనగ్రంథములం దున్నవి. వానిలో నిది యొకటి— ఉదయించుచున్న చంద్రుని రూపభేదము లిందు సొగసుగా నిరూపింపఁబడినవి:—

" ప్రథమ మరుణచ్ఛాయ స్తావ త్తతః కనకప్రభః,
తదను విరహోత్తామ్య త్తన్వీకపోలతలద్యుతిః,

ప్రభవతి తతో ధ్వాంతధ్వంసక్షమః క్షణదాముఖే,
సరసబిసినీకందచ్ఛేదచ్ఛవి ర్మృగలాంఛనః ”

ఇంక నీమహాకవి, కవివిమర్శములో ప్రశంసించిన పూర్వకవులు కొందఱిపేళ్లు తెలియుచున్నవి గాని వారికృతులు మనకు లభించలేదు. అయినా, యాపూర్వుల నీసందర్భమందు స్మరించుట యుచితము. రాజశేఖరునివిగా జల్హణుడు చూపినశ్లోకము లివి:—

౧ “ కర్తుం త్రిలోచనా దన్యో, న పార్థవిజయం క్షమః,
తదర్థ శ్శక్యతే ద్రష్టుం లోచనద్వయిభిః కథమ్ ? ”
౨ “ అథో గణపతిం వందే మహామోదవిధాయినమ్,
విద్యాధరగణై ర్యస్య పూజ్యతే కంఠగర్జితమ్ ”
౩ “ ప్రద్యుమ్నా న్న పర స్యేహ, నాటకే పటవో గిరః,
ప్రద్యుమ్నా న్న పర స్యేహ, పౌష్పా అపి శరాః ఖరాః ”
౪ “ కాలంజరపతి శ్చక్రే, భీమటః పంచనాటకీమ్,
ప్రాప ప్రబంధరాజత్వం, తేషు స్వప్నదశాననమ్ ”
౫ “ మాయురాజసమో జజ్ఞే నాన్యః కాలచురిః కవిః ,
ఉదన్వత స్సము త్తస్థుః కతివా తుహినాంశవః ? ”

వీరిలో కడపటిమాయురాజునుగూర్చి చదివియున్నాము. అతనివలె పైనలుగురును శా. ౬౨౦—౭౫౦ నడుమ నున్నవా రని భావింతము. ఇంక, త్రిలోచనుడు:—

ఇతఁడు పార్థవిజయ మనుకావ్యము నిర్మించెనట. రెండుకళ్ల వాళ్లకు దానియర్థము గోచరింపదట— ఈకవి శ్లోకములుగా శార్ఙ్గధర పద్ధతిలో నీక్రింది వున్నవి. ఇందు బాణభట్ట మయూరకవుల కవితామధురధ్వని వర్ణింపఁబడినది.

“ హృది లగ్నేన బాణేన యన్మందోఽపి పదక్రమః
భవే త్కవికురంగాణాం చాపలం తత్రకారణమ్ ”

" తావ త్కవివిహంగానాం ధ్వని ర్లోకేషు శస్యతే,
యావ న్నో విశతి శ్రోత్రే మయూరమధురధ్వనిః

శృంగార ప్రకాశమందును, నాట్యదర్పణమందును నీపార్థవిజయ నాటకములోనిమాట లుదాహరింపఁబడినట్లు తెలియుచున్నది. ఇంక, గణపతి మహామోద మనుకృతిని ప్రద్యుమ్నుఁ డేదోనాటకమును నిర్మించి రనిమాత్రమే మన కిపుడు తెలిసినది. ఇంక-భీమటుఁడు:—

ఇతఁడు క్షత్త్రియుఁడు అల్హాబా దనఁబడుప్రయాగకు వాయవ్య ముగా పదామడదూరమం దున్నకాలంజరదేశ మేలినవాఁడు. ఇత డైదునాటకములు రచించెను. వాటిలో స్వప్నదశానన మనునది ప్రబంధరాజ మని పేరు గాంచినది. అభినవగుప్తాచార్యుఁడు తనయభినవభారతిలో పేర్కొన్న ప్రతిభాచాణక్య మనురూపక మితని దని కొందఱు, మీమకవి దని కొందఱు భావించినారు. ఎట్లయిన నేమి? ఇతని యైదు రూపకములు మృగ్యములే:—

దీనివల్ల మనకు తేలినయంశము మనరాజశేఖరకవి కవివిమర్శము వ్రాసినాఁ డనుటయే. అదికూడా లేదుకదా! ఇఁక నొక్క శ్లోకము. ఇది యనౌచిత్యమునకు క్షేమేంద్రుఁ డుదాహరించినది.

" కర్ణాటీదశనాఙ్కితం శితమహారాష్ట్రీకటాక్షాహతః,
ప్రౌఢాన్ధ్రీస్తనపీడితః ప్రణయినీభ్రూభంగవిత్రాసితః
లాటీబాహువిశేష్టితశ్చ మలయస్త్రీతర్జనీతర్జితః,
సోఽయం సంప్రతి రాజశేఖరకవి ర్వారాణసీం వాంఛతి"

ఇట్లు వివిధదేశస్త్రీలతోడి విహారము దెల్పుచున్నయిది యాత్మకథనమో లేక యన్యకథనమో! ఏమైనను, నటరాజశేఖరుని చతుర్థావతారమైనరాజశేఖరుఁడు పూర్వవయస్సున విషయానందమే బ్రహ్మానందముగా విశృంఖలవృత్తిని విహరించినవిటరాజశేఖరుఁడై యుత్తరవయస్సున వీతరాగుఁ డయ్యె నని భావింపవచ్చును. ఇతఁడు దక్షిణాపథ మం

తఱుఁ సంచరించినట్లు పూర్వోదాహృతము లైనతద్దేశవర్ణనలే చాటుచున్నవి. ఇతని స్త్రీలోలత్వమును శృంగారిత్వమును "చంద్రుఁడపుడు తోమూఁగొన్న దాక్షిణాత్యకాంతల దంతములవలె మెఱయుచున్నాఁ"డన్న యీక్రింది వచనము బలపఱచుచున్నది.

" సద్యోమార్జితదాక్షిణాత్యతరుణీదంతావదాతద్యుతిః"

కాళిదాసాదులు తత్తత్కాంతావర్ణనలు చేయకపోలేదు గాని యవి యిట్టివి కావు. కానిండు, ఆవ్యభిచారదోష ముండుఁగాక, ఇతఁడు సర్వస్వాతంత్ర్యుఁడైనసత్కవితామూర్తి యని చెప్పక తప్పదు. ఇఁక నితని కవితామార్దవమునకు సకరుణమైనయొకవర్ణనము:—

" మసృణచరణపాతం గమ్యతాం భూ స్సదర్భా
విరచయ సిచయాన్తం మూర్ధ్ని ఘర్మః కఠోరః,
తదితి జనకపుత్రీ లోచనై రశ్రుపూర్ణైః
పథి పథికవధూభి ర్వీక్షితా శిక్షితా చ"

## శక్తిభద్రుఁడు

ప్రాచీన మయ్యు నవీనముగా మనకుఁ గనవచ్చిన యాశ్చర్యచూడామణి రచియించినకవి యితఁడు. పూర్వరామకథాశ్రయమైనయీ రూపకము చెన్నపురియందు ముద్రిత మైనది. తత్ప్రకాశకులు దీనియందంతము చర్చించుచు విపుల మైనపీఠిక నిర్మించియున్నారు. మఱికొందఱు నీకవికావ్యములనుగూర్చి సవిమర్శ మైనయభిప్రాయములు ప్రకటించియున్నారు. కావున దీనినిగూర్చి విశేషచర్చ యనావశ్యకము.

ఈకవి జగద్గురు శంకరాచార్యులశిష్యుఁ డని మలబారుదేశకింవదంతి యొకటి కలదు. వామనాచార్యుఁడు గాని యతనితరువాతి లాక్షణికులుగాని యీరూపమును స్మరింపలే దన్నవాద మొకటి

యున్నది. శా. ౮౬౦ ప్రాంతమందలి కులశేఖరవర్మకాలమునఁ గూర్పఁబడినయాట్టప్రకరణ మనెడిగ్రంథనామ పట్టికలో నీనాటకమువే రున్నది. దీనిప్రస్తావనలోని నటీవాక్యమునుబట్టి [1] యిది దాక్షిణాత్యనాటకములలో మొట్టమొదటిదిగాఁ గనవచ్చుచున్నది. ఇట్టిహేతువు లన్నియుఁ బరిశీలింపఁగా నీనాటకము కొంచె మెచ్చుతక్కువగా శా. ౮౦౦ప్రాంతమునఁ బట్టియుండు నని తోఁచినది. ఎవరినిర్ణయములైనను నూహాలమీఁదనే యాధారపడియున్నవి.

ఈకవి, ఉన్మాదవాసవదత్త ప్రభృతికావ్యములకర్త యని ప్రస్తావన దెల్పునుగాని, అవి యింకను బయటికి రాలేదు. దీనివ్యాఖ్యాత (పేరు తెలియదు) కుమారిలభట్టమతానుయాయి యైనయొకపండితుఁడు. "వీరాద్భుతరసభూయిష్ఠమై యాశ్చర్యముల కిది చూడామణి యగుటచే నాశ్చర్యచూడామణి యనఁబరగుచున్న" దని దీనిమహత్త్వమును గొనియాడినాఁడు. ఈకవి భాసునివలెనే ప్రస్తావనకు బదులుగా స్థాపన యనుపద ముపయోగించినాఁడు. కథా సంవిధాన మపూర్వముగానున్న ట్లీక్రిందివిషయక్రమమే తెలుపుచున్నది.

" పర్ణశాలా శూర్పణఖా మాయాసీతా తతః పరమ్,
జటాయుషో వధో ఽశోకవనికా ప్యఙ్గుళీయకమ్,
సప్తమో ఽఙ్కస్తత శ్చైత్థం చూడామణ్యఙ్కకీర్తనమ్ "

దీనినిబట్టి యిం దరణ్యసుందరకాండముల వృత్తాంతము ప్రదర్శనోచితముగాఁ గూర్పఁబడిన దని విదిత మగును.

సీతారాములు సపరివారముగా లంకనుండి విమానముమీఁద వచ్చుచు ద్రవిడాంధ్రాది దేశములను గంగాగోదావర్యాదినదులను మహాకాలభీమేశ్వరాదిపుణ్యక్షేత్రములను చూచుచు పోవుటసరసముగా

1. ఆర్యా ! అత్యాహితంఖ శ్వేతత్ ...యది దక్షిణస్యా దిశ ఆగతం నాటకనిబన్ధనమ్...

వర్ణింపఁబడినది. అందు కాంచీనగరవర్ణనసందర్భమున సీత వినకుండ రాముఁ డన్నమాట—

" అభిముఖపతయాభిర్ల్లలాట, శ్రమసలిలై రవధూతపత్రలేఖః,
కథయతి పురుషాయితం వధూనాం మృదితహిమద్యుతి నిర్మలం కపోలః "

ఈవర్ణన శృంగారముగా నున్నది గాని, ఆసమయమునకు సముచితమా? సప్తగోదావరహారకలాపైకనాయకుఁ డగుభీమేశ్వరుని రాముఁ డిట్లు స్తుతించును.

" నృత్యారంభ పరిత్రస ద్గిరిసుతా రిక్తార్ధసంపూర్తయే,
నిర్వ్యాఘభ్రమవిభ్రమాయ జగతా మీశాయ తుభ్యం నమః,
య శ్చూడాభుజగేశ్వరప్రభృతిభి స్త్వాదృగ్భిరస్తి ద్గిశః,
పశ్యద్భి ర్భ్రమఘూర్ణమాననయనై శ్శాంతోఽపి న శ్రద్దధే "

కవిత్వము రసవంతము కల్పన లపూర్వములు భాష మృదువు ననుట కింకొకటి:—

" అరుణే పరిశీర్ణ మజ్జులా నిపతన్తో నయనోదబిన్దవః,
శకలీకృతమౌక్తికత్విషో హిమ లేశా ఇవ పఙ్కజోదరే "

ఉత్తమనాటకములలో గణనీయమైనయిది పాఠకహృదయరంజక మనుట పునరుక్తము.

# ఆర్య క్షేమీశ్వరుఁడు

ఇతఁడు విజయప్రకోష్ఠుఁ డనెడిపరమశివభక్తుని మునిమనుమఁడు, కాన్యకుబ్జనివాసి ద్వితీయభోజుఁ డనఁబడిన మహేంద్రపాలుని కుమారుఁ డగు మహీపాలదేవుని యాస్థానమున విద్వత్కవి. ఈమహీపాలదేవుఁడు రాజశేఖరకవీంద్రునిశిష్యుఁ డని చదివియున్నాము. ఈకవి యతనిని పేర్కొనలేదు, అతఁ డితని నెందును స్మరింపలేదు. అయినా, అతని

కంటె నితఁడు చిన్నవాఁడై యీతేని సంస్థానకవులలో తరువాత చేరిన వాఁ డనుట విశ్వసనీయమే.

శా. ౭౬౫లో గూర్జరరాజై పిదప కాన్యకుబ్జము గెలిచి యది రాజధానిగా రాజ్య మేలిన పరమభగవతీభక్తుఁడగు భోజదేవునికి చంద్ర భట్టారికయందు జన్మించినయతఁడే రాజశేఖరునిశిష్యుఁ డైనమహేంద్ర పాలుఁడు. ద్వితీయభోజదేవుఁ డనఁబడిన యతనికుమారుఁడే యీమహీ పాలదేవుఁడు. ఇతఁడు శా. ౮౩౯లో రాష్ట్రకూటవంశము వాఁడును కర్ణాటరాజ్యపాలకుఁడు నైన ధ్రువరాజుతో పోరాడి గూర్జరరాజ్యము నందు కొంతభాగము కోల్పోయి తరువాత నతనితో మరల యుద్ధము చేసి, పోయినభాగము సంపాదించుకాలమందీకవి చండకౌశిక మను నాటకము రచియించిన ట్లందలి ప్రస్తావనలోని క్రిందిశ్లోకమువల్ల తెలియుచున్నది.

"య స్సంశ్రిత్య ప్రకృతిగహనా మార్యచాణక్యనీతిం,
జిత్వా నందాన్ కుసుమనగరం చంద్రగుప్తో జిగాయ,
కర్ణాటత్వం ధ్రువ ముపగతా నద్య తా నేవ హంతుం,
దోర్దండాఢ్య స్స పున రభవ చ్ఛ్రీమహీపాలదేవః"

పూర్వము నందరాజులను చాణక్యనీతి నాశ్రయించి గెలిచిన చంద్రగుప్తుఁ డిపుడు, కర్ణాటరాజుగా ధ్రువుఁడై పుట్టినయానందులను గెలుచుటకు మహీపాలదేవుఁడై యవతరించెనఁట. ఈవిజయము శా. ౮౪౫ ప్రాంతమందై యుండును. కావున మనకవి శా.౮౩౦-౮౮౦నడుమ నున్నవాఁ డగును.

ఇతఁడు నైషధానంద మను మఱియొకనాటకము సిర్మించినట్లు తెలియవచ్చెను గాని, అది యిపు డగోచరము. చండకౌశిక మైదంక ములరూపకము. సత్యపరీక్షా సత్యపరిపాలనములు ప్రధానముగా విశ్వా మిత్రహరిశ్చంద్రులకు సంబంధించిన పౌరాణికకథయే యిందలివస్తువు

రసము వీరము, విశ్వామిత్రుఁడు చండకోపుఁ డగుట కారణముగా నిది చండకౌశిక మైనది. గుణదోషవిషయకమై ప్రసిద్ధి కెక్కినయీ క్రింది శ్లోక మిందలిదే—

"దృష్టం కిమపి లోకేఽస్మి న్న నిర్దోషం న నిర్గుణమ్,
ఆవృణుధ్వ మతో దోషాన్ వివృణుధ్వం గుణాన్ బుధాః"

ప్రాజ్ఞులారా! లోకములోని యేపదార్థ మైనా, దోషములేనిది కాదు, గుణము లేనిది కాదు, అందుచే చెడ్డను కప్పిపుచ్చి మంచినే గ్రహింపుఁడు, అనిభావము. ఇతనికవిత్వము కుసుమకోమలమై తేనె లొలుకుచు న్నట్లుండును, వర్ణనలును మనోహరములు, జంతువులజీవన హేతువులలో నిద్ర మొదటి దన్నహరిశ్చంద్రునిమాట లివి:—

"చిత్తం ప్రసాదయతి లాఘవ మాదధాతి,
ప్రత్యంగ ముజ్జ్వలయతి ప్రతిభావిశేషమ్,
దోషా నుదస్యతి కరోతి చ ధాతుసామ్యం,
మానంద మర్పయతి యోగవిశేషగమ్యమ్"

శ్మశానవాటికలోని శైబ్యను చూచి తనభార్య యనుకొనుచున్న హరిశ్చంద్రుని మాటలివి: —

"సా వాణీ కరుణార్ద్రనాదవికలా ప్యామంద్రతంత్రీస్వనా,
తే చామీ భ్రమరౌఘనీలకుటిలాః పర్యాకులా మూర్ధజాః,
తా న్యంగాని కృశా న్యమూని సహసా దుష్ప్రత్యభిజ్ఞాని మే
కాంతి స్సైవ పురాణచిత్రమలినా లేఖాభి రున్నీయతే"

వీణానాదమువలె నున్నయీవాణియదే, చెదరిపోయిన యీశిరోజము లవే. అవే యవయవములు. ఇంత యేల? ప్రాతచిత్తరువులో మాసిపోయిన ట్లున్నయీశరీరకాంతి యదే, ఇంక, హరిశ్చంద్రుని సత్యధైర్యముల కానందించు ధర్మదేవతమాట యొకటి విందము.

"సుఖం వా దుఃఖం వా కి మివహి జగ త్యస్తి నియతం!
వివేకప్రధ్వంసా ద్భవతి సుఖదుఃఖవ్యతికరః,

మనోవృత్తిః పుంసాం జగతి జయినీ కాపి మహతాం,
యయా దుఃఖం దుఃఖం సుఖ మపి సుఖంవా న భవతి"

సుఖమనీ దుఃఖమనీ లోకములో నియతముగా నున్నదా? ఏది యుండెనేని, సుఖము సుఖముగాను దుఃఖము దుఃఖముగాను కనఁబడదో, యట్టిమనోధైర్య మొకటియే శ్లాఘ్య మైనది.

ఈనాటకము ప్రదర్శింపఁబడె ననియు, సువర్ణాలంకారవస్త్రాదు లిచ్చి రాజు కవిని సత్కరించె ననియు, కావ్యాంతవాక్యములు తెల్పుచున్నవి. ఇందు వీరము ప్రధానమైనను కరుణము సామాజికులహృదయము ద్రవింపఁజేయునట్లు వర్ణింపఁబడిన దనుట నిజము.

## భట్టనాయకుఁడు

ఇతనికాలనివాసములు తెలియరావు. ఇతనిహృదయదర్పణ మనుకృతి కనరాదు, అయినా, అలంకారగ్రంథములం దితనిపేరు మాఱుమ్రోఁగుచున్నది. ఆకృతి స్వతంత్ర మైన దనియు, భరతనాట్యశాస్త్ర వ్యాఖ్యాన మనియు నూహాలు గలవు. భామహాలంకారమున కితఁడు టీక రచియించె నందురు, అదియు మృగ్యమే.

ఆనందవర్ధనునిధ్వనిమతము నణగింప మహిమభట్టు నిర్మించిన వ్యక్తి వివేకములోని యీక్రిందిశ్లోకము మూలముగా నితఁడు హృదయదర్పణ మనుకృతి నిర్మించినట్లు గోచరించుచున్నది.

"సహసా యశోఽభిసర్తుం సముద్యతా దృష్టదర్పణా మమధీః
స్వాలఙ్కారవికల్పప్రకల్పనే వేత్తి కథ మి వావద్యమ్"

ఇందలిదర్పణశబ్దమునకు రుయ్యకుఁడు "హృదయదర్పణాఖ్యో ధ్వనిధ్వంసగ్రన్థోఽపి" అని రెండవయర్థము వ్రాసియున్నాఁడు. ఈకృతికి ధ్వనిధ్వంస"మనువాడుక యున్నట్లు-యత్తు భట్టనాయకే నోక్త" మని

యారంభించి "కించ వస్తుధ్వనిం దూషయతా రసధ్వని స్తదనుగ్రాహక స్సమర్థ్యత ఇతి సుష్ఠుతరాం ధ్వని ధ్వంసోఽయమ్"

అనెడియభినవగుప్తునిలోచనములోని మాటలవల్ల స్పష్ట మగుచున్నది. దీనిబట్టి యీనాయకు డానందవర్ధనునకి పరుఁడు నభినవగుప్తునికి పూర్వుఁడు నై శా. ౮౭౦-౯౧౦ నడుమ నున్నవాఁ డనవచ్చును. ధ్వన్యాలోకలోచన మందును హేమచంద్రునికావ్యానుశాసనమందు నితనిపేరు కనవచ్చును, ఇతనియీక్రిందిశ్లోకములు నున్నవి,

"శబ్దప్రాధాన్య మాశ్రిత్య తత్ర శాస్త్రం పృథగ్విదుః,
అర్థతత్త్వేన యుక్తంతు వద న్త్యాఖ్యాన మేతయోః,
ద్వయో ర్గుణత్వే వ్యాపారప్రాధాన్యే కావ్యధీ ర్భవేత్"

కావ్యాత్మ రస మనెడియితనిరసనిర్వచన మిది. దీనినే భుక్తివాద మందురు.

"కావ్యపాఠకులకును నాట్యద్రష్టలకును భావనావ్యాపారమున, దమ్ముఁ దాము మఱచునట్లు విభావాదులను ప్రత్యక్షము గావించుచు, భోగాఖ్యవ్యాపారమున నిశ్చలసమాధియం దనుభవింపఁబడెడిబ్రహ్మానందమువాడ్కి వారిచే ననుభవింపఁబడెడిరత్యాదిస్థాయి రస మగును"

దీని ననుసరించినవారు భుక్తివాదులు. అభినవగుప్తుఁ డుత్పత్త్యనుమితిభుక్తిమతములను త్రోసిరాజని అభివ్యక్తివాదము" లేవనెత్తెను.

ఇతనిభుక్తివాదమునకు మూల మైనయీక్రిందిశ్లోకములను జయద్రథుఁ డలంకారసర్వస్వవ్యాఖ్యలో నుదాహరించియున్నాఁడు.

"అభిధా భావనా చాన్యా తద్భోగీకృతి రేవచ,
అభిధా ధామతాం యాతే శబ్దార్థాలంకృతీ తతః,
భావనాభావ్య ఏషోఽపి శృంగారాదిగణో మతః,
తద్భోగీకృతిరూపేణ వ్యాప్యతే సిద్ధిమా న్నరః"

ఈశ్లోకములభావమునే మమ్మటభట్టు "నతాటస్థ్యేనే"తివచనమునఁ జూపియున్నాఁడు. మాణిక్యచంద్రుఁ డీనాయకు నిట్లు పొగడియున్నాఁడు.

" న వేత్తి యస్య గాంభీర్యం గిరితుంగో ఽపి లోల్లటః,
తత్తస్య రసపాథోధేః కథం జానాతు శంకుకః ?
భోగే రత్యాదిభావానాం భోగం స్వ స్యోచితం బ్రువన్,
సర్వథా రససర్వస్వ మభాంక్షీ ద్భట్టనాయకః "

ఈ క్రిందిశ్లోకము భట్టగోపాలునికావ్యప్రకాశవ్యాఖ్యాలోని దని యొకరు, కా దని యొకరు నన్నారుగాని, యిందలినాయకపదము మన నాయకుని దెల్పుచు నితఁడు భామహాలంకారమునకు వ్యాఖ్య నిర్మించె నన్నభావము తెలుపుచున్నది.

" ఉద్భటేనాపి నమేత్రిణ నాయకే నోపలాలితః,
హృద్యో భామ ఇవ స్త్రీణా మల్పారంభో ఽపి భామహః"

ఇట్లు లాక్షణికులసన్నుతి నంది స్వకాలముననే ఖ్యాతి కెక్కిన భట్టనాయకునిసాహిత్యలక్షణ మైనహృదయదర్పణముకూడా కాలమహిమలో నణఁగిపోయినది గదా !

## త్రివిక్రమభట్టు

ఇతఁడు శాండిల్యగోత్రుఁడు, శ్రీధరపండితుని మనుమఁడు, నేమాదిత్యునికొడుకు, రాష్ట్రకూటరా జైనయింద్రునిసభలోని విద్వత్కవి, ఈకవి తననలచంపువునవతారికలో బాణభట్టును స్మరించియున్నాఁడు. ఇతనిని భోజుఁడు సరస్వతీకంఠాభరణములో స్మరించియున్నాఁడు. కావున వారిద్దఱి మధ్యకాలములోనివాఁ డైనమనకవి యింద్రరాజుసభలో శా. ౮౩౬ ప్రాంతమం దున్నవాఁ డనుట స్థిరపడినది.

ఇతనినలచంపు వేడుచ్ఛ్వాసములకావ్యము. దీనికి దమయన్తీకథ యని నామాంతరము. అవతారికలో సారస్వత కవి వాక్ప్రశంస యిట్లున్నది.

" అగాధాన్తః పరిస్పన్దం, విబుధానన్ద మన్దిరమ్.
వన్దే రసాన్తర ప్రౌఢం, స్రోత స్సారస్వతం మహత్ "

"ప్రసన్నాః కాన్తిహారిణ్యో, నానాశ్లేషవిచక్షణాః
భవన్తి కస్య చిత్పుణ్యై ర్ముఖే వాచో గృహే స్త్రియః"

ఇంటిలోనిగృహిణికిని నోటిలోనికవితకును సమన్వయముగా నిందలిశ్లేష హృదయంగమముగా నున్నది.

మన కిప్పటికి లభించినంతలో నితనికృతియే చంపువులలో మొదటిది. కొందఱు మదాలసాచంపు వితని దందురుగాని, యది యితని దనుటకుఁ దగినప్రమాణము లేదు.

ఇతనికవిత్వము రసవంతము, శైలి సులభము మిక్కిలి మృదువు భావములు సమంజసములు. సాధారణకవులనుగూర్చి యితఁ డిచ్చినయభిప్రాయ మిది:—

"కిం కవే స్తస్య కావ్యేన, కిం కాండేన ధనుష్మతః?
పరస్య హృదయే లగ్నం, న ఘూర్ణయతి యచ్ఛిరః,
"అప్రగల్భాః పదన్యాసం జననీరాగహేతవః,
సన్త్యేకే బహులాలాపాః కవయో బాలకా ఇవ"

ఈక్రిందియరుణోదయకాల వ్యోమ తేజోవర్ణనముంబట్టి యితనిని యమునా త్రివిక్రముఁ డని పిలిచెడివా రఁట.

"ఉదయగిరిగతాయాం ప్రాక్ప్రభాపాండుతాయా,
మనుసరతి నిశీథే శృంగ మస్తాచలస్య,
జయతి కిమపి తేజ స్సాంప్రతం వ్యోమమధ్యే,
సలిలమివ విభిన్నం జాహ్నవం యామునంచ"

ఇతని నలచంపువునకు చండపాలుఁడు వినయగణి దామోదరభట్టు నాగదేవుఁడు మొదలగువారు టీకలు నిర్మించిరి. దేశమంతట వ్యాపించిన యుత్తమకావ్యములలో నిది యొకటి.

ప్రత్యుచ్ఛ్వాసము తుదను "హరచరణసరోజ" పదము నీకవి వాడి యుండుటచే దీనికి "హరచరణసరోజాంక మనుపేరు కూడ వచ్చినది. ఇందు కాఱవయుచ్ఛ్వాసము తుదిపద్యము—

" అపి భవత కృతార్థాః పౌరనార్య శ్చిరేణ,
వ్రజతు నిషధనాథ శ్చక్షుషాం గోచరం వః,
ధ్రువ మయ మవతీర్ణ స్స్వర్గలోకా దనంగో,
హరచరణ సరోజ ద్వంద్వలబ్ధప్రసాదః

ఈ క్రింది పూర్ణచంద్ర కాంతివర్ణన మెంతయు మనోహరమయి యితనికల్పనాచాతురి నావిష్కరించుచున్నది.

" ముగ్ధా దుగ్ధధియా గవాం విదధతే కుంభా నధో వల్లవాః,
కర్ణే కైరవశంకయా కువలయం కుర్వన్తి కాంతా అపి,
కర్కంధూఫల ముచ్చినోతి శబరీ ముక్తా ఫలాశంకయా,
సాంద్రా చంద్రమసో న కస్య కురుతే చిత్తభ్రమం చంద్రికా "

పాలుకారుచున్న వనుకొని గొల్లపిల్ల లావులపొదుగుల క్రింద ముంతలు పెట్టుచున్నారు. తెల్లకలువ పు వ్వనుకొని స్త్రీలు నల్లకలువ పువ్వు చెవిలో పెట్టుకొనుచున్నారు. శబరస్త్రీ ముత్య మనుకొని రేగు పండు తీసి కొనుచున్నది. నిండుపండువెన్నెల యెవరికి భ్రాంతి కలిగింపదు ?

# కులశేఖరవర్మ

కేరళదేశపాలకులలో ఈపేరు గలవారు ముగ్గురు నలుగురు కనఁబడుచున్నారు. వారిలో ముకుందమాలాకర్త యైనకులశేఖరుఁడు ప్రాచీనుఁ డనుచున్నారు. ఆళ్వారుచరిత్ర మతఁడు కలియుగాదినిజన్మించిన ఆళ్వా రనుచున్నది శ్రీవిష్ణునికౌస్తుభ మాకులశేఖరుఁడై యవతరించిన దనుచున్నది. కావున ముకుందమాలలో నతనిపే రటుంచి తపతీసంవరణాదికర్త యైనకులశేఖరు నిందు గ్రహింతము.

మహోదయపురము రాజధానిగా కేరళదేశము నేలినయితఁడు క్రీ. ౮౫౭౭-౮౮౦ నడుమ రాజుగా నున్నట్లు తెలియుచున్నది. కవిపో

వకుఁడు విద్వాంసుఁడు కవియునై ఖ్యాతి గాంచినయితఁడు తపతీసంవర ణము సుభద్రాధనంజయము ననునాటకములను, ఆశ్చర్యకథామంజరియు నిర్మించెను. క్రమదీపిక అష్టప్రకరణము ననుషూదిక లితనికాలమునఁ గూర్చఁబడిన వంగుకు. కవిపోషకు లైన దక్షిణాత్యరాజులలో నితఁడు గణనీయుఁడు.

# సి ద్ధ నా థుఁ డు

ఇతఁ డొక పూర్వశైవాచార్యుఁడు. వీరశైవాచార్యులలో నగ్రిముఁడైన రేణుకాచార్యునిచరితము నితఁడు రేణుకవిజయ మనెడి చంపూకావ్యముగా నిర్మించెను. దానిమీద నున్న యీ క్రిందిశ్లోకమునుబట్టి యీకవి శా. శ. ౧౧౨౨ లో నీకృతి పూర్తిగావించినట్లు తెలియుచున్నది.

"ఋషు బ్రహ్మా వియ ద్బ్రహ్మ మితే విక్రమవత్సరే,
మార్గశీర్షేచ పౌర్ణమ్యాం ప్రబన్ధః ప్రాప పూర్ణతామ్"

ఇతనికృతి మంజరీనామకము లైనయైదుప్రకరణములగ్రంథము. ఈశైవుఁడు శివభక్తుఁ డైనపుష్పదంతునిమహిమ్నస్తవము చక్కఁగా పఠించినవాఁ డని రెండవమంజరిలోనియీక్రిందిశ్లోకము తెలుపుచున్నది మొదటిది పుష్పదంతునియొకశ్లోకపాదము.

"త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి"
"యోగ స్సాంఖ్యం పశుపతిమతం పాంచరాత్రం త్రయీతి,
శాస్త్రా ణ్యస్మిన్ భువనవలయే మానభూతాని యోగిన్,
తత్రోత్కృష్టా శ్రుతి రభిహితా తన్మయం శైవతంత్రం
తస్మా దేత న్నిగమగణవ త్సర్వ దైవ ప్రమాణమ్"

గ్రంథాంతగద్య మితనిబిరుదము నిట్లు తెలుపుచున్నది.

"ఇతి శ్రీమదనాదివీరశైవగురుకులకేతనాయమాన కవికులతిలకాయమాన శ్రీసిద్ధనాథశివాచార్యవిరచితే శ్రీరేణుకవిజయే"

ఇతనికవిత్వము మృదువుగా శ్రావ్యముగా నుండు ననుట కింకొకశ్లోకము,

"సామోదం సభయం సభక్త్యతిశయం సానందబాష్పం ముహుః
సాష్టాంగం చరణాంబుజప్రణమనై రప్రాకృతై శ్చ స్తవైః,
ఆత్మానం పరితోషయ న్నవనిపే కారుణ్యపూర్ణాం దృశం.
నిక్షిప్యైన మనందయ త్కరుణినా మగ్రేసరో రేణుకః,

# వాసుదేవుఁడు

తిరువాన్కూరు జిల్లాలోని బాపనత్తూరనఁబడు విప్రసత్తమ గ్రామ మితని నివాసము. ఇతనితండ్రి రవిపండితుఁడు. ఇతనికి మిక్కిలి బాల్యమందే భగవదనుగ్రహమువల్ల విద్వత్త్వకవిత్వము లబ్బిన వని చెప్పుకథ యొకటి మలబారులో వాడుకలో నున్నదఁట.

ఈకవి యింతకు మున్ను పేర్కొన్న కేరళరాజైనకులశేఖర వర్మనాఁటివాఁడు. ఇతఁడు భారతకథను గైకొని యుధిష్ఠిరవిజయ మను నెనిమిదియాశ్వాసముల ప్రబంధమును కులశేఖరవర్మకాలమున నిర్మించి నట్లు దానితుదిమాట లిట్లు చెప్పుచున్నవి.

"తస్య వసుధా మవతః కాలే కులశేఖరస్య వసుధామవతః"

మఱియు నితఁడు హరివంశములోని శ్రీకృష్ణకథను సంగ్రహించి శౌరికథోదయకావ్యమును, శివపురాణములలోనికథను దీసుకొని త్రిపుర దహనకావ్యమును రామవర్మకాలమున రచియించెను- మహాభారత భట్టాత్రి యనఁబడు భారతగురుని శిష్యుఁడైనయితఁడు సాహిత్యమునం దును శబ్దశాస్త్రమునందును మంచిపై దుష్య మార్జించినవాఁడని యితని రచనలు తెలుపుచున్నవి- ఇతనియుధిష్ఠిరవిజయములోనిశ్లోకములు

నేను జూచినవ్రాఁతప్రతిలో పదవిభాగపద్ధతిని వ్రాయఁబడి యున్నవి. ఒకచిన్నయుదాహరణము:—

" తరవః భూరిచ్ఛాయాః సమానఫలదాయినీ చ భూః ఇచ్ఛాయాః "

దీనికి, అచ్చియాం బాసుదర్శనభట్టులపుత్త్రుఁడైనసాక్కనాథుఁడు వ్యాఖ్య నిర్మించెను. అతఁడు శ్రీరంగక్షేత్రమునకు దగ్గఱ నున్నసాత్తనూరుగ్రామవాసి- ఇతనిరెండవకృతికి ముక్తిస్థలనివాసియు ఈశానపండితునితనయుఁడు నైననీలకంఠుఁడు టీక నిర్మించెను. మూఁడవదానికి నిత్యప్రియునిసుతుఁడు వ్యాఖ్యానము చేసెను. ఈముగ్గురును దాక్షిణాత్యులే. ఈటీకలనుబట్టి యీకృతులు చేరచోళపాండ్యమండలములందు బాగా వ్యాపించిన వన వచ్చును. ఈకవి యమకప్రియుఁ డని యితని కృతులు మూఁడును చాటుచున్నవి. ఇందుకు రెండు:—

" కీర్తిమదభ్రాం తేన స్మరతా భారతసుధామదభ్రాం తేన,
జగదుపహాసాయ మితా పార్థకథా కల్మపాపహాసాయ మితా "

" బబంధు రేవ బంధురే స్వవర్త్మని స్థితిం జనాః
పినాకినాపి నాకినా మమోది మోదకారిణా "

# జైనసోమ దేవుఁడు

చోళరాజ్యమందలి గంగాధార యనుగ్రామ మితని నివాసస్థానము. నేమిదేవునిశిష్యుఁడైనయీకవి శా. రా౮౧లో యశస్తికచంపువు నిర్మించెను. ఆకాలమందరికేసరి యనఁబడుచాళుక్య రాజుజ్యేష్ఠపుత్త్రుఁడు దేశపాలకుఁడు గా నున్నాఁడు- అతనిపేరు విస్పష్టముగా తెలియరాకున్నది-పై విషయ మితనిగ్రంథాంత గద్యవల్లనే తెలియుచున్నది:—

"శకనృప కాలాతీత సంవత్సరశతే ష్వష్ట స్వేకాశీత్యధికేషు సిద్ధార్థిసంవత్సరచైత్రమాస మదనత్రయోదశ్యాం ... పాండ్య సింహల చోళ చేరప్రభృతీన్ మహీపతీన్ ప్రసాధ్య ... ప్రవర్ధమాన రాజ్యప్రభావే శ్రీకృష్ణ

రాజదేవే సతి తత్పాదపద్మోపజీవినః సమధిగత పంచమహాశబ్దమహా సామంతాధిపతే శ్చాళుక్యకులజన్మనః సామన్తచూడామణేః శ్రీమదరికేసరిణః ప్రథమపుత్రస్య శ్రీమద్వాగరాజ (వాద్యరాజ) ప్రవర్ధమాన వసుధారాయాం గంగాధారాయాం వినిర్మిత మిదం కావ్యమ్”

ఇది యెనిమిదాశ్వాసముల గ్రంథము. ఇందు మొదటి యైదింటిలో ఉజ్జయిని రాజధానిగా నవంతీదేశ మేలిన యశోధరునిచరితమును తక్కినమూఁడింటిలో జినోపాసకాధ్యయనక్రమమును వర్ణింపఁబడినవి. కథాసందర్భానుసరణము లైనచిన్నచిన్న యుపాఖ్యానము లిం దెన్నేని కలవు. కవిత్వము సులభము రసవంతము నైనను దీని కెక్కువవ్యాప్తి కలుగలేదు. ఇతఁడు నాల్గవయాశ్వాసముతుదను వ్రాసికొన్నసాహంకార వచనము “బాణోచ్ఛిష్టంజగత్సర్వ” మ్మనులోకోక్తిని మించి యున్నది.

“మయా వాగర్థసంభారే భుక్తే సారస్వతే రసే,
కవయో ఽన్యే భవిష్యన్తి నూన ముచ్ఛిష్ట భోజనాః”

ఇతఁడు కృత్యాదిని భాసాదిరాజశేఖరాంత మహాకవులను పేర్కొని యున్నాఁడు. ఈకావ్యములోని కొన్నిమాట లితఁడు శ్రుతిస్మృతులయందారిము కలవాఁ డనిపించుగాని, యితనిక్రతునిందమాత్రము స్వమతమున కర్హముగానే యున్నది.

“లోలేంద్రియై ర్లోకమనోఽనుకూలైః,
స్వాజీవనా యాగమ ఏష సృష్టః,
స్వర్గో యది స్యా త్పశుహింసకానాం,
సూనాకృతాం తర్హి భవే త్సకామమ్”

“స్వర్గో యది స్యా న్మఖహింసితానాం
స్వబాంధవై ర్యజ్ఞవిధి ర్న కింతు”

ఇతఁడు గావించినయోగ, సత్య, త్రయీ, బ్రాహ్మణ, నిర్వచనము లిట్లున్నవి.

" వైరాగ్యం జ్ఞానసంపత్తి రసంగః స్థిరచిత్తతా,
ఊర్మిస్మయసహత్వంచ పంచ యోగస్య హేతవః"
" పరే బ్రహ్మ ణ్యనూచానో ధృతిమ్మైత్రీదయాన్వితః,
అన్యత్ర సూనృతా ద్వాక్యా న్నిత్యం వాచం యమీ భవేత్"
" జాతి ర్జరా మృతిః పుంసాం త్రయీ సంసృతికారణమ్,
ఏషా త్రయీ యత స్త్రయ్యాః క్షీయతే సా త్రయీ మతా"
" అహింస స్సద్వ్రతో జ్ఞానీ నిరీహో నిష్పరిగ్రహః
య స్స్యా త్స బ్రాహ్మణ స్సత్యం నతు జాతిమదాంధకః"

# అభినవగుప్తాచార్యుఁడు

కాశ్మీరనివాసి యైనయీమహావిద్వాంసునివృత్తాంత మొకింత యితని మాటలవల్లనే యిట్లు తెలియుచున్నది. ఇది, కాశ్మీరశైవదర్శన మైనత్రింశిక కితఁడు రచించినతత్త్వవివరణ మనెడివ్యాఖ్యలోనియవతారికాశ్లోకములయనువాదము:—

" కాశ్మీరపాలకుఁ డైనయశస్కరనృపతి మంత్రియు బ్రాహ్మణోత్తముఁడు నైనవల్లభునికి శౌరి యనుపుత్త్రుఁ డుదయించెను. శివభక్తిపరతంత్రుఁ డైనయతనికి శంకరధ్యానైకరతుఁ డగుకర్ణుఁ డనుకొడుకు పుట్టెను. అతఁ డాబాల్యముగా సుఖవిముఖుఁడై సర్వదా శివతత్త్వజిజ్ఞాసానిరతుఁడై సంసారనిర్మూలవిమర్శనపదవి నాశ్రయించి భక్తులకు శైవరహస్యము బోధించుచుండెను. అతనియుపదేశములఁ బవిత్ర మైనకాశ్మీరమునకు వివిధప్రాంతములనుండి బ్రాహ్మణు లనేకులు వచ్చిరి. వారిలో నంతర్వేదినుండివచ్చినమాతృగుప్తుఁడొకఁడు. అతనివంశమున జన్మించిన వరాహగుప్తునికుమారుఁడు చుఖలపండితుఁడు. సంసారవిముఖుఁ డైన యీ మహనీయుని శిష్యుఁడ నే నభినగుప్తుఁడను.నాయన్న మనోరథగుప్తుఁడును

శివభక్తుఁడు పదవాక్యప్రమాణజ్ఞుఁడు నైన రామదేవపండితుఁడును సంతోషింప నీత్రింశికాతత్త్వవివరణము రచియింపఁ బూనితిని"

మఱియు, నితని ప్రత్యభిజ్ఞావిమర్శిని యనుబృహద్వృత్తి చివర నీగద్య మున్నది:—

"ఇహ విశ్వానుజిఘృక్షాపరః పరమశివ ఏవ సకలభూమండలోత్తరే శ్రీమచ్ఛారదాదివ్యక్రీడాసదనే శ్రీకశ్మీరదేశే శ్రీనరసింహగుప్తసహధర్మచారిణ్యాం శ్రీమత్యాం విమలాయాం లీలయావతీర్య శ్రీమదభినవగుప్తనాథ ఇతి ప్రఖ్యాతాభిధానః"

ఈగద్య యితఁడు వ్రాసినదో, శిష్యుఁడు వ్రాసినదో! దీనినిబట్టి యితనితల్లిదండ్రులు విమలాంబానరసింహగుప్తు లనియు, పూర్వోక్తచుఖలపండితుని నిజనామము నరసింహగుప్తుఁ డనియు తండ్రియే యితని విద్యాగురు వనియు విదిత మైనది. ఈబృహద్వృత్తికాలము దీనితుదిమాటల వల్లనే యిట్లు తెలియుచున్నది.

"ఇతి నవతితమేఽస్మిన్ వత్సరేఽన్త్యే యుగాంశే,
తిథి శశి జలధి స్థే ౪౧౧౫ మార్గశీర్షావసానే,

ఇది, శా. ౯౩౬ అగుచున్నది. ఇట్లే లౌకికాబ్దములతో సరిచూడఁగా శా. ౯౧౩లో, క్రమస్తోత్రమును, శా. ౯౧౧ లో భైరవస్తోత్రమును నిర్మించినయితఁడు శా. ౮౮౦-౯౪౦ నడుమనున్నవాఁ డనుట విదితము. ఇతనిపినతండ్రి వామనగుప్తుఁ డనుపండితుఁ డొకయలంకారగ్రంథము నిర్మించిన ట్లభినవభారతిలోనియితని యీ క్రిందిమాటలవల్ల విదితమగుచున్నది.

"తత్ర హాస్యాభాసో యథా, అస్మత్పితృవ్యస్య వామనగుప్తస్య:-
"లోకోత్తరాణి చరితాని న లోక ఏష, సంమన్యతే యది కిమఙ్గ వదామ నాము,
యత్త్వత్ర హాసముఖతత్త్వ మముష్య తేన, పార్శ్వోపపీడ మిహ కో న విజాహసీతి"

ఇతనికృతులలో సుమారు పదివ్యాఖ్యలే. అం దితనికి పేరుతెచ్చి నవి ధ్వన్యాలోకలోచనము, నాట్యశాస్త్రవ్యాఖ్యయైన **యభినవభార తియు.** ఇంక పరమార్థద్వాదశిక బోధపంచదశిక భైరవస్తోత్రము మహోప దేశవింశతి మొదలగుచిన్నకావ్యములు కొన్ని సజీవములు. రసవిషయ మం దభివ్యక్తివాదము ప్రతిపాదించిన యితనిశాస్త్రజ్ఞానము విద్వద్విది తము.

అంతకు మున్నుదయించినధ్వనివ్యాఖ్య యగుచంద్రికను మించి తనలోచనవ్యాఖ్య విద్వాంసుల కుపకరించు నన్నయాత్మవిశ్వాసము నితఁ డీ ట్లావిష్కరించినాఁడు.

“ కిం లోచనం వినా లోకో, భాతి చంద్రికయా పి హి,
తే నాభినవగుప్తో ఽత్ర, లోచనోన్మీలనం వ్యధాత్ ”

శైవదర్శనతత్త్వవేత్త యైనయితఁడు విశేషించి యీశ్వరీభక్తుఁడు ఇందుకు ప్రకరణాంతములం దున్నశ్లోకములే నిదర్శనము.

“ స్మరామి స్మరసంహార లీలాపాటవశాలినః,
ప్రసహ్య శంభో ర్దేహార్ధం హరన్తీం పరమేశ్వరీమ్ ”
“ అసుత్రితానాం భేదానాం, స్ఫుటతాపత్తిదాయినీమ్,
త్రిలోచనప్రియాం వందే, మధ్యమాం పరమేశ్వరీమ్ ”

ఈయాచార్యునిగురువులుగా ముగ్గురు మహాపండితులు కన వచ్చుచున్నారు. వారి నీసందర్భమున స్మరించుట సముచితము:—

భట్టేందురాజు:— కాశ్యపగోత్రుఁడు శ్రీభూతిరాజు తనయుఁడు నైన యితనిని మనకవి లోచనారంభమం దిట్లు స్మరించెను.

“ భట్టేందురాజచరణాబ్జకృతాధివాస
హృద్యశ్రుతో ఽభినవగుప్తపదాభిధో ఽహమ్,
యత్కించి దప్యనురణన్ స్ఫుటయామి కావ్యా
లోకం సులోచననియోజనయా జనస్య ”

క్షేమేంద్రుఁ డౌచిత్య విచారచర్చాసువృత్తతిలకములో నీగురుని యీక్రిందిశ్లోకము లుదాహరించియున్నాఁడు.

" ఆశ్చర్యం బడబానల స్స భగవా నాశ్చర్య మంభోనిధి
ర్యత్కర్మాతిశయం విచిన్త్య మనసః కంప స్సముత్పద్యతే
ఏక స్యాశయఘస్మరస్య పిబత స్తృప్తి ర్న జాతా జలై
రన్యస్యాపి మహాత్మనో న వపుషి స్వల్పోఽపి జాతః శ్రమః "
" రహసి హృతదుకూలా శీలితా తైలదీపే
త్వదుపగతసమృద్ధేః ప్రేయసీ శ్రోత్రియస్య,
వికిరతి పటవాసై ర్వాన్తి కర్ణావతంసైః,
శమయతి మణిదీపం పాణిపూత్కారనిలేన "

భట్టతౌతుఁడు:—ఈగురువు నితఁడిట్లు స్తుతించెను.

" నాయకస్య కవేః శ్రోతు స్సమానో ఽనుభవ స్తతః, సచాయ మస్మదుపాధ్యాయభట్టతౌతేన కావ్యకౌతుకే" ఇత్యాది. దీనిని బట్టి తౌతుఁడు కావ్యకౌతుకము నిర్మించినట్లు తెలియుచున్నది. రామచంద్రపండితుఁ డాకౌతుకమును స్మరించి యున్నాఁడు. మాణిక్యచంద్రుఁ డందలి కవికావ్యలక్షణములను తనకృతిలో నిట్లు చూపియున్నాఁడు.

" యదుక్తం కావ్యకౌతుకే—
" ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా,
తదనుప్రాణనాజీవద్వర్ణనానిపుణః కవిః,
తస్య కర్మ స్మృతం కావ్యమ్—

హేమచంద్రుఁడు తనకావ్యానుశాసనములో భట్టతౌతుని వని యీక్రిందిశ్లోకములు చూపినాఁడు. ఇది చక్కని కవిలక్షణము:—

" నానృషిః కవి రిత్యుక్త మృషిశ్చ కిల దర్శనాత్,
విచిత్రభావధర్మాంశతత్త్వప్రఖ్యా చ దర్శనమ్,
దర్శనా ద్వర్ణనా చ్చాథ రూఢా లోకే కవిశ్రుతిః,

తథాహి దర్శనే స్వచ్ఛే నిత్యే ఉప్యాదికవే ర్మనేః,
నోదితా కవితా లోకే యావ జ్జాతా న వర్ణనా ”

లక్ష్మణగుప్తుఁడు:—ఇతఁడు మనకవిగురు వని యొకటిరెండు ప్రాఁతప్రతులు తెల్పినవి. ఇతనిగురువైన ఉత్పలదేవు నభినవగుప్తుఁడు తన పరమగురు వని స్తుతించినాఁడు గనుక నది విశ్వాసమే-కాశ్మీరములో ప్రత్యభిజ్ఞాదర్శనము లేవనెత్తిన సోమానందుని శిష్యుఁడీయుత్పలదేవుఁడు. ఈశ్వరప్రత్యభిజ్ఞ యనెడి యీ పరమగురునిమతగ్రంథమునకు మన యాచార్యుఁడు వ్యాఖ్య రచియించెను. అందలిమాట యిది.

“తస్మా దుక్తధర్మోపజీవన మేవ పరమగురునిరూపితం యుక్తం. యథోక్తం శ్రీమదుత్పలపాదైః:—

“ స్థితస్థాయిత్వసంపన్నాత్ ప్రస్తుత్య మయోజనమ్,
ధ్రువాసు య ద్య దన్యేభ్య స్తద్వ త్త్వ క్లోపకల్పయేత్ ”

ఈయుత్పలదేవుని శ్లోకములను క్షేమేంద్రాదు లుదాహరించి యున్నారు. వాటినిబట్టి యితఁడే దేనికావ్యము నిర్మించియుండు నని తోఁచుచున్నది:—

“ అహౌ వా హారే వా బలవతి రిపౌ వా సుహృది వా,
మణౌ వా లోష్టే వా కుసుమశయనే వా దృషది వా,
తృణే వా స్త్రైణే వా మమ సమదృశో యాన్తి దివసాః
క్వచి త్పుణ్యారణ్యే శివ శివ శివేతి ప్రలపతః”

“ వ్యాతాంజనశ్యామరుచ స్తవై తే
స్థూలాః కి మిత్యశ్రుకణాః పతన్తి?
భృంగా ఇవ వ్యాయతపంక్తయో యే
తనీయసీం రోమలతాం శ్రయన్తి”

పూర్వోక్తులైనయభినవగుప్తపాదునిగురువు లందఱు కొంచె మెచ్చుతక్కువగా సమకాలమువారే యగుదురు గావున వారు శా. శ. ౯-౧౦ నడుమ నుండియున్నవా రనఁదగుదురు.

42

ఇతనిపరశివాస్తుతిలో నీమహనీయులచరిత్రకు స్వస్తిచెప్పుదము.

"యా స్మర్యమాణా శ్రేయాంసి సూతే ధ్వంసయతే రుజః,
తా మభీష్టఫలోదారకల్పవల్లీం స్తువే శివామ్"

## ధీరనాగుఁడు

కుందమాల యనునాటకము నిర్మించినకవి యితఁడు. లాహోరులో ప్రకటింపఁబడిన దీనిప్రస్తావనలో "అరారాలపురవా స్తవ్యస్య కవేర్దిజ్నాగస్య కృతిః కున్దమాలా" అని యున్నది. నేను చూచిన తంజావూరు లిఖితపుస్తకములు రెంటిలో ప్రస్తావన లేదు గాని, తుదిగద్యలలో "అనూపురాధస్య కవే ర్ధీరనాగస్య కృతిః కున్దమాలానామ నాటకం సమాప్తమ్" అని యున్నది. అందుచే దీనికర్త దిజ్నాగుఁడా, ధీరనాగుఁడా, యని సంశయము కలుగుట సైజము. ఈవిషయమును నావాఙ్మయచరిత్రలో విమర్శించి నిర్ణయించియున్నాను—కావ్య మొక్కటే, కాని కవిపేరు ద్వివిధముగా నున్నది. వెనుక, కాళిదాసునకు ప్రతిపక్షుఁడని కొందఱు భావించినదిజ్నాగుఁడే యిక్కడ నాటకకర్త ననిపించుకొనుటకు మరల సిద్ధమైనాఁడు. కవిపే రేదయినా మన కొకటే కాని, యాదిజ్నాగుఁడే దీనికర్త యైనచో, భోజదేవుని పూర్వలాక్షణికులలో నొకఁడైనా దీనిని స్మరించియుండఁడా యన్నసంశయము కలుగకపోదు— దిజ్నాగుఁడు కాంచీమండలములోని సింహవక్త్రపురమున జన్మించి మంచిపండితుఁడై బౌద్ధమతావలంబియై నలాందాది విద్యాపీఠములందు బహువిద్వాంసుల నోడించె నని తత్త్వసంగ్రహపీఠిక నిర్దేశించినసింహవక్త్రపురము ముద్రితనాటకప్రస్తావనలో నున్న అరారాలగ్రామ మనుటకు ప్రమాణ మున్నదా?— సింహళద్వీపములోని అనూరాధపురము లేఖకప్రమాదమున అరారాలపుర మైన దని భావించినవారు 'ధీరనాగ' దిజ్నాగ మైన దని యెందుకు భావింపరాదు?

ఊహల కంత యెక్కడ? కావున, ఆకాంచీనగరమువైపున నున్నతంజావూరులోని పుస్తకములలో విస్పష్టముగాఁ గనఁబడుచున్న ధీరనాగుఁడే దీనికర్త యందము. ఈవిఘ్నేశ్వరస్తవరూపమంగళాచరణము వైదికుని దనఁదగునుగాని బౌద్ధునిదనుట యంతసముచితము కాదు గదా!

" జమ్భారిమౌళిమన్దారమాలికామధుచుమ్బినః,
పిబేయు రన్తరాయాబ్ధిం హేరమ్బపదపాంసవః "

దీనికాలము నిశ్చయింప నాధారములు లేవుగాని భోజమహారాజున కించుకపూర్వము జనించిన దని భావింపవచ్చును. అతఁ డిందలి యీక్రిందిశ్లోకమును దన శృంగారప్రకాశములో నుదాహరించి యున్నాఁడు— ఇది నాల్గవయంకములోనిది:—

" ద్యూతే పణః ప్రణయకేళిషు కణ్ఠపాశః,
క్రీడాపరిశ్రమహరం వ్యజనం రతాన్తే,
శయ్యా నిశీథకలహే హరిణేక్షణాయాః,
ప్రాప్తం మయా విధివశా దిద ముత్తరీయమ్ "

ఇందలిసూత్రధారవచనమును సాహిత్యదర్పణమున నుదాహరించుకొన్న విశ్వనాథకవిరాజు రెండవలాక్షణికుఁడు:—

" లంకేశ్వరస్య భవనే సుచిరం స్థి తేతి
రామేణ లోకపరివాదభయాకులేన
నిర్వాసితాం జనపదా దపి గర్భగుర్వీం
సీతాం వనాయ పరికర్షతి లక్ష్మణో ఽయమ్ "

దీనిపేరు చెప్పినమూఁడవవాఁడు శారదా తనయుఁడు—

" కుందమాలాత్ర సుశ్లిష్టా సన్ధిపంచకసంయుతా "

ఈనాటక ముత్తరరామచరిత్రకంటె నెక్కువగా నుత్తరకాండ కథ ననుసరించినది. కవిత్వము రసవంతము, పాత్రపోషణమును సముచితము—

# రవిదేవుఁడా? వాసుదేవుఁడా?

వీరిలో నలోదయకర్త యెవ రన్నవిషయము తేల్చవలసియున్నది. నాకు తెలిసినంతలో సుమారుముప్పదికృతులు కాళిదాసకృతులు గా కనవచ్చినవి. అవి యన్నియు రఘువంశశాకుంతలాదికర్త వని విశ్వసించు వారులేరు గాని, విమర్శకలోకమున సందిగ్ధములుగా నున్నకోలఁది గ్రంథములలో నలోదయ మొకటిగా నున్నది. అందుచే దీనికర్త ప్రసిద్ధ కాళిదాసు కాఁ డనుటలో పైయిద్దఱిలో నెవఁ డని యిందు విచారణ చేయుదము.

నలోదయము నాలుగుల్లాసములయమకకావ్యము, నలదమయంతులచరిత మిందు వర్ణిత మని పేరే చెప్పుచున్నది. మల్లినాథాదులు రమారమి యిరువదిమంది దీనికి వ్యాఖ్యలు నిర్మించియున్నారు. వారం దఱికి నిది ప్రసిద్ధకాళిదాసకృతమే యన్నవిశ్వాస మున్న దన వచ్చును. కాని, రామర్షి యనునొకవ్యాఖ్యాత గ్రంథాంతమందు వ్రాసినయీక్రిందిగద్యనుబట్టి దీనికర్త రవిదేవుఁ డని తెలియవచ్చినది.

" ఇతి శ్రీనారాయణసుత శ్రీరవిదేవరచితే నలోదయకావ్యే చతుర్థోల్లాసః"

ఈతనిటీకతోడియీమూల మొకటి తంజావూరుపుస్తకాగారమం దున్నది. ఇం దితఁడు తన్నుఁగూర్చి వ్రాసికొన్నమాట లివి.

" ఇతివృద్ధవ్యాసాత్మజ మిశ్రరామర్షిదాధీచ్య విరచితాయాం రవిదేవవిరచితమహాకావ్యనలోదయటీకాయాం యమకబోధిన్యాం నలరాజ్యప్రాప్తిర్నామ చతుర్థఉల్లాసః"

ఇతఁడు పాట్నానగరసమీపగ్రామమువాఁడు. శా. ౧౫౩౦ లో నీటీక నిర్మించినవాఁడు. ఇతనిమాటనుబట్టి నలోదయకర్త రవిదేవుఁ డని తెలిసిన దని సంతోషింత మనుకొనుచుండ-విష్ణు వనుమఱియొక

వ్యాఖ్యాత "రవిపుత్త్రుఁడైనవాసుదేవుఁడు నలోదయకర్త" యని గ్రంథాంతగద్యపద్యముల నిట్లు తెలుపుచున్నాఁడఁట. ఆవ్రాఁతప్రతి నేను చూడలేదు. అది మలబారువ్రాఁతప్రతి యఁట.

"ఇతి నలోదయే వాసుదేవకృతే చతుర్థః పరిచ్ఛేదః"

"రవి తను భూయమితాయాః
కృతే ర్గతి శ్శబ్దచిత్రభూయమితాయాః,
జనహాసాయమితాయాః
ధియశ్చ వివృతా మయాఘునా యమితాయాః"

ఈమాట లాధారముగా దాక్షిణాత్యపరిశోధకులు యుధిష్ఠిరవిజయాదికర్త వాసుదేవుఁడు దీనికర్త యన్నారు. అతఁడు యమకప్రియుఁడైనంతమాత్రమున నిట్టినిర్ణయము తగదు. ఏమనఁగా! రామర్షిపేర్కొన్న నలోదయకర్త నారాయణసుతుఁడైనరవిదేవుఁడు. ఈవిష్ణువు పేర్కొన్న నలోదయకర్త రవిపుత్త్రుఁడైన వాసుదేవుఁడు. ఇట్లు భేదము విస్పష్టముగా నుండఁగా రవిశబ్దమునుబట్టి యిట్టినిర్ణయము గావించుట యుక్తముగాదు. అది గాక, వాసుదేవుఁడు తనయితరకృతులలో నలోదయముమాట యెత్తలేదు. పోనీ! అతఁడే దీనికర్త యైనచో తనపేరు మఱుఁగుపుచ్చి యీకావ్యము కాళిదాసనిర్మిత మన్నట్లు ప్రకటించుకొనునా? ఆత్మవంచకుఁడు లోకవంచకుఁడు నగునా? ఇది మలబారువ్యాఖ్యాత యైనయావిష్ణుపండితుఁడు మలబారుకవికి దీని నంటఁగట్టె నని తోఁచుచున్నది. ఇంక రవిదేవునిమాట యందుమా? అతఁడు వంగీయుఁడు లేక ఔత్కలుఁడు. అతనికవితకు మెచ్చుకొన్నసమకాలమువా రతనిని కాళిదాసని గౌరవించుచుండ నదియే పేరై వెలయుటంజేసి గ్రంథలేఖకు లట్లు గద్యలలో వ్రాసియుందు రని తోఁచుచున్నది. పాఠకు లిందలిసత్యాసత్యములు పరిశీలింతురుగాక. ఇది శా. ౯౦౦ ప్రాంతమునం దుత్కలదేశమున జన్మించినదని నాయభిప్రాయము.

# వాక్పతిరాజు - ౨

ఇతని నామాంతరములు ముంజుఁడు, వాక్పతిరాజదేవుఁడు. ఇతఁడు సీయకరాజుకొడుకు భోజమహారాజుపెత్తండ్రి ధారానగరము రాజధానిగా శా. ౯౭౩_౯౯౫ నడుమ విదర్భదేశ మేలినవాఁడు. ధనంజయాది కవుల నాదరించినవిద్యాప్రియుఁడు, విద్వాంసుఁడు, కవి. ఇతఁడు వ్రాసిన కృతులు లేవు గాని, యితనిశ్లోకములను దశరూపకవ్యాఖ్యలో ధనికుఁడే కాక యితరలాక్షణికులు నుదాహరించియున్నారు. సుభాషితావళిలో నెన్నో యితనిపద్యము లున్నవి. ధనికుఁ డుదాహరించినశ్లోక మిది:-ఇది చిత్రమైన శివస్తుతి:-

" ప్రణయకుపితాం దేవీం దృష్ట్వా ససంభ్రమవిస్మితః,
త్రిభువనగురు ర్భీత్యా సద్యః ప్రణామపరో ఽభవత్,
నమితశిరసో గంగాలోకే తయా చరణాహతా
వవతు భవత స్త్ర్యక్ష స్యైత ద్విలక్ష మవస్థితమ్''

ఇతని పద్యములలో నధికముగా కనవచ్చు శివస్తుతినిబట్టి యీరాజు శివభక్తుఁ డని తెలియునుకాని, యితఁడు మతమం దద్వైతుఁడే.

"పునః ప్రాదుర్భావా దనుమిత మిదం జన్మని పురా,
పురారే! న ప్రాయః క్వచిదపి భవన్తం ప్రణతవాన్,
నమన్, జన్మ న్యస్మి న్నహ మతను రగ్రే ప్యనతిభాక్,
మహేశ! క్షంతవ్యం త దిద మపరాధద్వయ మపి,

ఈశ్లోకమును మమ్మటాచార్యుఁడు తనకావ్య ప్రకాశములో నుదాహరించియున్నాఁడు- ఈక్రిందిశ్లోక మింతకంటెను మనోహరమై వెలయుచున్నది.

" న జ్యోత్స్నా నచ మాలతీ న దయితా నోపల్లకీపంచమః,
తాంబూలం న విలేపనం నచ రహః కేళి ర్న ముక్తాలతా,

నోవా సత్కవిసూక్తయో మమ తథా హార్దం క్షమనే మనః,
పుష్ణ్యా రున్మిషితా చరాచరగురో ర్భక్తి ర్యథా శూలినః"

మహేశ్వరునియందలిభక్తి నామనస్సు నాకర్షించినట్లు ప్రసక్చందన వనితాదివిషయములుగాని, భోగములుగాని, యాకర్షింపఁజాల కున్న వనిభావము—

ఒకసుందరి మణికుట్టిమముపై కందుక కేళితో గోజంతయు వెళ్లఁ బుచ్చిన దని యిట్లు వర్ణించియున్నాఁడు.

"చ్యుతకర్ణశిరోరుహావతంసై ర్నిబిడస్వేదజలార్ద్రగండలేఖైః,
అపకృ న్మణికుట్టిమోదరే సా, దివసంకందుకకేళిభి ర్నినాయ"

ఈక్రిందివర్ణనమువంటివర్ణనలీముంజరాజు పార్వతీపరమేశ్వరలీల నొకకృతిగా నిర్మించినాఁ డనుటకు సూచకము లగుచున్నవి.

"లలితకంఠనివేశితదోర్లతః కరతలాకలితైకపయోధరః,
మృగదృశో దశనచ్ఛదవాసితం మధు పపౌ మదనోత్సవ మీశ్వరః"

సూర్యోదయమును శృంగారమయము గావించిన యీక్రిందిశ్లోక మితనిరసికత్వమున కుదాహరణము.

"రతిశ్రమపరిస్ఖల త్సమద సిద్ధసీమంతినీ
స్తనచ్యుత మి వాంశుకం విశదపద్మరాగద్యుతి,
అయం దిశి శతక్రతోః కువలయాక్షి! బింబారుణ
త్వదీయదశనచ్ఛదచ్ఛవి రుదేతి బాలాతపః

# ధనంజయుఁడు. ౨

ఇతఁడు ముంజమహీశుఁ డనెడివాక్పతిరాజదేవునిసభలో నున్న పండితకవి. ఇతనితండ్రి విష్ణువు. ఇందుకు—

"విష్ణో స్సుతేనాపి ధనంజయేన విద్వానోరాగనిబంధహేతుః,
ఆవిష్కృతం ముంజమహీశగోష్ఠీవైదగ్ధ్యభాజా దశరూప మేతత్"

ఇతనిదశరూపకము నాలుగుప్రకాశములగ్రంథము. అవి వస్తు-నాయక-రూపక-రసములకు సంబంధించినవి. ఈగ్రంథము భరతనాట్య శాస్త్రమాధారముగా జనించి దయ్యు రూపకలక్షణాదివిషయములందు కొంతస్వాతంత్ర్యము వహించి విద్వల్లోకమున మొదటనుండియు ప్రామాణ్యము నార్జించుకొన్నది. ఇందలిద్వితీయచతుర్థప్రకాశము లలంకారశాస్త్రమున గణనీయము లగును. ఇతనిరసనిర్వచననిరూపణ ములు సులభములు సుజ్ఞేయములు.

ఇతఁడు భరతాచార్యుని శ్రీవిష్ణువుతోఁ గలిపి యిట్లు స్తుతించియు న్నాఁడు.

" దశరూపానుకారేణ యస్య మాద్యన్తి భావకాః,
నమ స్సర్వవిదే తస్మై విష్ణవే భరతాయ చ "

ఈకృతికి బహురూపమిశ్రుఁడు నృసింహభట్టు దేవపాణి మొదల గువారు టీకలు నిర్మించిరి గాని ధనికునియవలోకమే దీని కెక్కువపేరు తెచ్చినది. ఈధనికుఁడును విష్ణుపుత్రుఁడే యని వ్యాఖ్యాంతగద్య యిట్లు చెప్పుచున్నది— " ఇతి విష్ణుసూనో ర్ధనికస్య కృతౌ దశారూపావలోకే రసవిచారః "

ఈధనంజయుని యితరకృతు లేవియు కనరావుగాని, యితనిశ్లోక ములు సంకలనగ్రంథములలో కొన్ని గలవు. అందొకటి:-

" ఘ్రాతం తాళఫలాశయా స్తనయుగం, బింబభ్రమే ణాధరో,
దష్టః, పాకవిదీర్ణదాడిమధియా లీఢా స్స్ఫురంతో రదాః,
భ్రామ్య న్తి శ్రమనిస్సహానువిపినం యద్వైరిసీమంతినీ,
ర్నిద్రాణా ముహు రానతా ముహు రధిక్షిప్తాచ శాఖామృగైః"

అడవిపాలయినయొక శత్రురాజుభార్యను కోఁతు లల్లరిపెట్టినట్లు వర్ణింపఁబడినది.

# ధనికుఁడు

ధనంజయునిదశరూపకమునకు వ్యాఖ్య నిర్మించినయితఁడును విష్ణుపుత్త్రుఁడే యని యిపుడే చదివియున్నాము. దానినిబట్టి, వీ రిద్దఱు నన్నదమ్ములన్నభావము పాఠకులకుఁ గలుగునను నైజము. ఇందుకు ప్రతికూలముగాఁ గాని, యనుకూలముగాఁగాని ప్రమాణ మేదియును గనరాదు. అందుచే నతని కితఁడు తమ్ముఁ డన్నను తప్పుగాదుగదా:

ఇతఁడు రచియించినకృతి యేదియు గోచరింపదు. దశరూపకచతుర్థప్రకాశమున నొకచోట, "అభిధాశక్తివశముననే సమస్తవాక్యార్థావగతి యగుచుండ శక్త్యంతర పరికల్పనము ప్రయోజనము" అని తన కావ్యనిర్ణయము పేరు చెప్పినాఁడు, ఆసందర్భమున దానిలి వేఁడుశ్లోకములు చూపినాఁడు. అందలినొకటి.

" తాత్పర్యానతిరేకా చ్చ వ్యంజకత్వస్య న ధ్వనిః,
 కి ముక్తం స్యా దశ్రుతార్థతాత్పర్యే ఽన్యోక్తిరూపిణి "

ఈధనికుఁడు దశరూపకవ్యాఖ్యలో నితరుల శ్లోకము లుదాహరించునపుడు ముంజునిపే రెత్తి యొకశ్లోక ముదాహరించినవాఁడు నిజముగా నతనికృతి యున్నచో దానిపే రెత్తఁడా యనియు, ధనంజయుని కావ్య మేదేని యున్నచో దానినుండి శ్లోకము గ్రహింపఁడా యనియు సందేహము కలుగుచున్నది. కాని ధనంజయశ్లోకములు సంకలనగ్రంథములలో నున్నవి. పోనీ! యథా మమైవ యనుచుఁ దనశ్లోకములెన్నో యుదాహరించినయితఁడు తనకావ్యము పేరు నెఁదెల్పెనా ? లేదు. అట్టివానిలో నిది యొకటి—

" సుభ్రు ! త్వం నవనీతకల్పహృదయా కేనాపి దుర్మన్త్రిణా
 మిథ్యైవ ప్రియకారిణా మధుముఖే నాస్మాసు చణ్డీకృతా,
 కిం త్వేత ద్విమృశ క్షణం ప్రణయినా మేణాక్షి! క స్తే హితః?
 కింధాత్రీ తనయా వయం కిము సఖీ కింవా కి మస్మత్సుహృత్ "

పెక్కండ్రు పూర్వవ్యాఖ్యాతలకు చరిత్రదృష్టి లేదనుట కితని పద్ధతి యొకనిదర్శన మనుటకంటె వేఱేమి చెప్పఁదగును ?

# భో జ మ హా రా జు

ధారానగరాధీశుఁడు సుకవితాసామ్రాజ్యపాలకుఁడునైన యీ రాజాధిరాజు చరితము జగద్విదితముకావున నిందు విస్తరింపఁబని లేదు— పారమారవంశకర్త యగుసీయకరాజదేవుఁ డనుశ్రీహర్షరాజున కితఁడు పౌత్రుఁడు. ముంజుఁ డనిఖ్యాతి గాంచినవాక్పతిరాజదేవునితమ్మునికొడుకు. సింధురాజదేవునితనూజుఁడు. పెత్తండ్రియగుముంజుఁ డితనిని స్వయముగా సింహాసనాసీనుని గావించినట్లు ధనపాలునితిలకమంజరియవతారికలోనిశ్లోకము చెప్పుచున్నది.

" ఆకీర్ణాంఘ్రితల స్సరోజకలశచ్ఛత్రాదిభి ర్లాంఛనై
త స్యాజాయతమాంసలాయతభుజః శ్రీభోజ ఇత్యాత్మజః,
ప్రీత్యా యోగ్య ఇతి ప్రతాపవసతిః ఖ్యాతేన ముంజాఖ్యయా
య స్స్వే వాక్పతిరాజభూమిపతినా రాజ్యే ఽభిషిక్త స్స్వయమ్ "

ఆరాజ్యాభిషేకకాలముశా. 918 సంవత్సర మని శాసనాదుల నిశ్చితము. ధనపతిభట్టునకు భోజరాజు గ్రామముదాన మిచ్చినకాలము సంవతు 1078, అనఁగా శా. 944. కాశ్మీరరా జగునవంతభూపతియు భోజరాజు నొక్కసమయమం దు న్నా రని రాజతరంగిణి తెల్పినకాలము శా. 970.

" సచ భోజనరేంద్రశ్చ దానోత్కర్షేణ విశ్రుతౌ
సూరీ తస్మిన్ క్షణే తుల్యం ద్వా వాస్తాం కవిబాన్ధవౌ "

ఇట్టిప్రమాణములనుబట్టి యీరాజకవీంద్రుఁడు శా. 918–983 మధ్యకాలమున విదర్భరాజ్యమును కవితాసామ్రాజ్యము నేలె నని తెలి

యుచున్నది[1]. ఈవిషయమున నించుక మతభేదము లున్నవి, చాల కాల మితఁడు రాజ్యము చేసినవాఁ డని యందఱు నంగీకరింతురు. శా. ౧౦౦౨ లో నితఁడు దివంగతుఁ డయ్యె నన్నయభిప్రాయ మొకటి యున్నది. అది యెంతవఱకు నిజమో తెలియఁబోదు. ఎట్లయినా, రాజమహేంద్రవరమున భారతము తెలిఁగింపఁబడుచున్నకాలమున ధారానగరములో సరస్వతీకంఠాభరణము సిద్ధమగుచున్న దనుట నిజము. ౫౫సం. ౭మా. ౩దినములితఁడు సగౌడదక్షిణాపథము నేలెనన్నమాట యొకటి యున్నది.

“ పంచాశ త్పంచవర్షాణి స ప్తమాసా దినత్రయమ్,
భోజరాజేన భోక్తవ్య స్సగౌడో దక్షిణాపథః ”

“భోజరాజు మొగముచూచినంతనే కవిత్వ మబ్బు” నన్న లోకోక్తి యూరక పుట్టినది కా దని గురుపాదాంభోజమును భోజుని గలిపి వర్ణించినపూర్వుఁ డగు లక్ష్మణసూరిమాటవల్ల ధ్రువపడు చున్నది:—

“ దృష్టే యత్ర యదృచ్ఛయాపి వచసాం దేవీ పురో వర్తతే,
సారస్యం మహ దభ్యుపైతి సదసి ప్రాగల్భ్య ముజ్జృంభతే,
జాయంతే సకలాః కలా అపి నృణాం జాగర్తి కీర్త్యర్ణవా,
చేత స్స్నిహ్యతి తత్ర దైశికపదాంభోజేచ భోజే మమ ”

ఇతఁడు సకలసామంతమూర్ధన్యుఁ డయ్యు రాజ్యమత్తుఁడు గాఁడు విషయలంపటుఁడు గాఁ డని యితనిదానశాసన పద్యములే చాటు చున్నవి.

“ వాతాభ్రవిభ్రమ మిదం వసుధాధిపత్య,
మాపాతమాత్ర మధురో విషయోపభోగః

1. కొందఱిమతముల, శా. ౯౩౨-౯౭౭, ౯౭౮-౯౮౫. ఇత్యాదిగారాజ్యారంభరాజ్యావసానకాలములు కనవచ్చును.

పాత్రేణా స్తృణాగ్రజలబిందుసమా నరాణాం
ధర్మ స్సఖా పర మహో పరలోకయానే"
"భ్రమత్యంసారచక్రాంగధారాధారా మిమాం శ్రియం,
ప్రాప్య యే న దదు స్తేషాం పశ్చాత్తాపః పరం ఫలమ్"

మఱియు నీరాజు వైదికమతాచారసంపత్తి శివభక్తి కలిగినయ ద్వైతుఁడయ్యు, పరమతసహిష్ణువు, ఇందుకు వేదములను దూషించు జైనబౌద్ధవిద్వాంసులను సత్కరించుటయే నిదర్శనము.

ఇతఁడు శృంగారప్రకాశము, సరస్వతీకంఠాభరణము నను రెండు సాహిత్యలక్షణగ్రంథములు నిర్మించెను. ఇందు మొదటిది ముప్పదియా ఱుప్రకాశములపెద్దకృతి హేమచంద్ర శారదాతనయ విద్యాధర మల్లినాథాదులసన్నుతికి పాత్ర మైనయీకృతిలో మొదటిపన్నెండు ప్రకరణములలో వ్యాకరణవిశేష వృత్తి భేద కావ్యభేద రూపకాది లక్షణములు ప్రసంగింపఁబడినవి. తక్కినవానిలో రసవిచారమే ముఖ్యము ఇది చాలాకాలము మఱుఁగుపడియున్నది. ఇపు డిందలికొంతగ్రంథము మేల్కోటలో ముద్రిత మైనది—శృంగార మొక్కటే రసము తక్కినవి రసములు కా వన్నభావము నిట్లు వెల్లడించెను.

"వీరాద్భుతాదిషు రసేషు రసప్రసిద్ధిః,
స్సిద్ధా కుతోఽపి వటయక్షవ దావిభాతి,
లోకే గతానుగతికత్వవశా దుపేతా
మేతాం నివర్తయితు మేష పరిశ్రమో నః"
"శృంగార వీర కరుణాద్భుత హాస్య రౌద్ర
బీభత్స వత్సల భయానక శాంతనామ్నః,
ఆమ్నాసిషు ర్దశరసా నపరే, వయంతు
శృంగార మేవ రసనా ద్రస మామనామ"

"ఏకోరసఃకరుణఏవ" అని భవభూతియనఁగా, "శృఙ్గారఏకఏవ రసః" అన్ననిరంకుశవిద్వత్ప్రభు వీతఁడు ఇంక-

ఇతని సరస్వతీకంఠాభరణ మయిదుపరిచ్ఛేదముల గ్రంథము. ఇందు పద వాక్య వాక్యార్థ దోషరస భావా దివిషయము లనేకములు సవిమర్శముగా వివరింపఁబడినవి. ఇందు దండికారిక లెక్కువగా ను వామనాదులలక్షణములు కొలఁదిగాను స్వీకరింపఁబడినవి. కాళిదాసభవ భూత్యాదిమహాకవుల శ్లోకము లెన్నో యిం దుదుహరింపఁబడినవి. హేమచంద్ర జయరథాదు లర్వాచీనలాక్షణికు లితనిమతమును తమకృతుల స్వీకరించిరి. ఇది స్వకాలమున విద్వన్నుతి గన్నమాట నిజమే కాని, తరువాత దీనివ్యాప్తి తగ్గినది. అయినా, వామనునిరీతుల కదనముగా అవన్తీ లాటీయా మాగధీ రీతులను చేర్చి వాటిని శబ్దాలంకారములలోను, జైమినిమునీంద్రుని ప్రత్యక్షాదిషట్ప్రమాణముల నర్థాలంకారములలోను జేర్చుట మొదలుగాఁ గొన్ని విశేషవిషయము లిందున్నవి వాటిని మాణిక్యచంద్రాదులు ప్రశంసించియున్నారు. కావున సరస్వతీకంఠాభరణ మన్వర్థనామ మని భావింపవచ్చును. ఇందు కితనిమంగళాచరణపద్యమే ప్రమాణము.

"ధ్వని ర్వర్ణాః పదం వాక్య మిత్యాస్పదచతుష్టయమ్,
యస్యా స్సూక్ష్మాదిభేదేన వాగ్దేవీం తా ముపాస్మహే"

పైరెండులక్షణగ్రంథములతుదలను "ఈకృతి శాశ్వతముగా విద్వన్మనోరంజక మగుచు వెలయుఁగాక" అని వ్రాసికొన్నపద్య మిది:—

"యావ న్మూర్ధ్ని హిమాంశుకందలభృతి స్వర్వాహినీ ధూర్జటే,
ర్యావ ద్వక్షసి కౌస్తుభ స్తబకితే లక్ష్మీ ర్మురద్వేషిణః,
యావ చ్చిత్తభువ స్త్రిలోకవిజయప్రౌఢం ధనుః కౌసుమం,
భూయా త్తావ దియం కృతిః కృతధియాం కర్ణావతంసోత్పలమ్".

ఇతనిరామాయణచంపువునకు భోజచంపు వనియే ప్రతీతి. ఏ.బి. కీతుపండితుఁడు దీనిపుట్టుపూర్వోత్తరము లెఱుఁగక "ఇది యరుచిగా నున్న దనియు నిది భోజునిది గా దనియు, తరువాత నెవరో నిర్మించి

యతనిపేరు పెట్టి రనియు" వ్రాయుట యెంతయు నసంగత మనక తప్పదు. భరతఖండమంతట నిది పుట్టిన దాదిగా నేఁటిదనుకఁ బఠనపాఠ వ్యవహారమున నున్నమాటయు, నెల్లచంపువులలో విద్వత్తల్లజులహృదయ మాకర్షించిననీసిరుచియు నాఖండాంతరీయుఁడె యెఱుఁగును!

వాల్మీకిరామాయణ సంగ్రహరూప మైనయీప్రబంధమునందు భోజుని కవిత సుందరకాండాంతమే. కవిత్వ ముదాత్తమై రాచఠీవిని జూపుచున్నది. ఇందుకు వైదికధర్మపరాయణత నావిష్కరించు నమస్క్రియారూప మైన మంగళాచరణమే నిదర్శనము.

" ఉచ్చై ర్గతి ర్జగతి సిధ్యతి ధర్మత శ్చేత్,
తస్య ప్రమాచ వచనైః కృతకేతరై శ్చేత్,
తేషాం ప్రకాశనదశాపి మహీసురై శ్చేత్,
తా నంతరేణ నిపతే త్క్వను మత్ప్రణామః ?"

ఈమాటలు, బ్రాహ్మణులు వేదాధ్యయనసంపన్నులు ధర్మాచరణపరాయణులు, కావలె నని శాసించుచున్నట్లున్నది.

శ్రీరాముఁ డడవికిఁ బోవునపుడు కైకేయి నుద్దేశించియన్న యీమాట లెంతయు భావగంభీరములు.

" వనభువి తనుమాత్రత్రాణ మాజ్ఞాపితం మే,
సకలభువనభార స్థాపితో వత్సమూర్ధ్ని,
త దిహ సుకరతాయా మావయో స్తర్కితాయాం
మయి పతతి గరీయా నంబ! తే పక్షపాతః "

భోజుఁడు యుద్ధకాండ నిర్మించలేదో లేక యది పోయినదో తెలియదు. దానిని లక్ష్మణసూరి పూరించెను. అతనిమాట లివి:—

" భోజేన తేన రచితా మపి పూరయిష్య
న్నల్పీయసాపి వచసా కృతి మభ్యుదారామ్,
న ప్రీడితో౽హ మధునా నవరత్నహార
సంగేన కింతు హృది ధార్యత ఏవ తన్తుః "

ఈసూరి మహారాష్ట్రుఁడు నాగాంబికాగంగాధరులపుత్త్రుఁడు. భాగానగరమనఁబడేయంశనగరమునకుఁ జేరినయగ్రహారమున నివసించినవాఁడు-శా. ౧౬౩౦ ప్రాంతములోనితంజావూరుపండితుఁ డగుఘనశ్యాముని కిఁ బూర్వుఁడు. ఈఘనశ్యాముఁడు భోజచంపువున కనుబంధముగా మఱియొక యుద్ధకాండమునిర్మించియు లక్ష్మణసూరియుద్ధకాండముతోడి భోజచంపువునకు వ్యాఖ్య నిర్మించెను. కాని, అది ముద్రితము కాలేదు.

భోజచంపువునకు వ్యాఖ్య రచియించినవారిలో నాంధ్రు లిద్దఱు. మల్లినాథునికాఱవ పురుషుఁడు నారాయణపండితుఁడు పదయోజన, పంచాన్వయం కొండుభట్టుకొడుకు రామచంద్రుఁడు సాహిత్యమంజూష రచియించిరి — భోజరాజ లక్ష్మణసూరులను ధ్యానించుచుఁ దరువాత నుత్తరరామాయణకథ నుత్తరచంపువుగాఁ బెక్కండ్రు రచియించిరి-తంజాపూరు పాలకుఁ డైనయేకోజీరాజుమంత్రి యగుగంగాధరామాత్యునికొడుకు భగవంతరాయుఁడు, విశ్వగుణాదర్శము నిర్మించిన వెంకటాధ్వరి, రాఘవుఁడు, వేంకటకృష్ణకవి మొదలగువారియాకృతులు చెక్కుచెదరకయముద్రితగ్రంథాలయములలో నిద్రించుచున్నవి. పైప్రసంగముసుబట్టి భోజుని రామాయణచంపువు సర్వజనాదరణపాత్రమై కీర్తి గాంచినది గాని, కీతుపండితుఁ డన్నట్లు పేరు లేక పడియుండ లేదని తెలియనగును.

ఇతఁడు రచియించినట్లు రాజమార్తాండము కరణమృగాంకము పాతంజలయోగసూత్రవృత్తి యనుకృతులు వినవచ్చినవి కాని కనరాలేదు —

మఱియు, శృంగారమంజరి యనెడియాఖ్యాయిక, విద్యావినోదమనుపద్యకావ్యము శివతత్త్వరత్నకళిక యనుస్తుతికావ్యము సుభాషితము సంగీతప్రకాశము మొద లగుమఱికొన్నికృతు లితఁడు నిర్మించినట్లముద్రితగ్రంథపట్టికలనుబట్టి తెలియవచ్చును. అంతే, ఇతనిపేర సుభా

షితావళి సదుక్తికర్ణామృతాదులలో ననేకశ్లోకములు మాత్రము కన వచ్చుచున్నవి. వాటిలోని యొకటిరెండు స్తుతిశ్లోకములు.

"వృషఘన ధనదప్రియ ప్రియార్ధగ్రథనవిదగ్ధ విదగ్ధ చిత్తయోనే,
పురహగ హరిణాంకచూడ చూడాభుజగభయంకర ధూర్జటే నమస్తే"

ఈక్రిందిది శివుల ప్రశ్నోత్తరమాల.

"కస్మాత్త్వం పార్వతి! నిష్ఠురాసి? సహజం శైలోద్భవానా మిదం,
నిస్స్నేహాసి కుతో? న భస్మపురుషః స్నేహం క్వచి ద్విందతి,
కోప స్తే మయి నిష్ఫలః ప్రియతమే! స్థాణౌ ఫలం కిం భవేత్?
ఇత్థం నిర్వచనీకృతో దయితయా శంభు శ్శివా యాస్తు వః

ఇదిముంజస్తుతి. ఇతనిదా?

"సౌజన్యాంబునిధే! బుధప్రియగుణప్రాకార! ధర్మద్రుమ
ప్రారోహ! ప్రతిపన్నవత్సల! మహాత్యాగి! వివేకాశ్రయ!
లక్ష్మ్యావాస! మనస్వినీమనసిజవ్యాపారదీక్షాగురో!
స్వామిన్ముంజ! కి మిత్యముం జన ముపస్ప్రష్టుం దృశా నార్హసి?

ఈక్రిందిది రత్నకవి ప్రశంస. ఈరత్నకవి యెవరో? కాళిదాస భారవి బాణులు లేనిలోప మితనిచే తీరిన దని దీనిభావము. రత్నాకరుడా?

"అస్తంగతభారవిరవి, కాలవశా త్కాళిదాసవిధువిధురమ్,
నిర్వాణబాణదీపం, జగ దిద మద్యోతి రత్నేన"

దక్షిణాపథ మేలినసార్వభౌములలో భోజునివలె సర్వలక్షణసం పన్నుడు నుత్తమఖ్యాతి గాంచినయతఁ డింకొకఁడు లేఁ డన వచ్చును భోజుఁ డంటే యవతారపురుషుఁ డన్నభావ మాకాలమున దేశమంతట వ్యాపించినది. అందుచేతనే యద్భుతకథలతో చిత్రవిచిత్రకల్పనలతో నతిశయోక్తిభూయిష్ఠము లైనభోజప్రబంధభోజచరిత్రాదు లుదయించి నవి. కవికల్పద్రుమ మైనయితనిసభలో నెందఱో కవు లుండియుందురు గాని, తెలియవచ్చినవారిసంఖ్య మిక్కిలి తక్కువయే. వారిలో—

# ధనపాలకవి

ఇతఁడు భోజునిసభలోని విద్వత్కవి. మధ్యహిందూదేశమందలి విశాలానగర మితని మొదటినివాసము. ఈకవి తొలుత వైదికమతప్రియుఁడయ్యు సోదరుఁ డగుశోభనపండితునియుపదేశమున జైనమత మవలంబించె నని ప్రబంధచింతామణి తెలుపుచున్నది. తిలకమంజరీమంగళాచరణము జినస్తవ మగుటగూడ దానికిఁ దోడ్పడుచున్నది.

"స వః పాతు జినః కృత్స్న మీక్షతే యః ప్రతిక్షణం,
రూపైరనంతై రేకైకజంతో ర్వ్యాప్తం జగత్త్రియమ్"

ఇతఁడు తనతండ్రి యైనసర్వదేవపండితునొద్దనే విద్య నభ్యసించి విద్వత్కవియై ధారానగరము చేరి భోజమహారాజు నాస్థానమున నుత్తమకవిస్థాన మార్జించినవాఁడు. భోజుఁడు పరమతములను ద్వేషింపని గుణపక్షపాతి కావుననే యితని కగ్రహారమిచ్చి గౌరవించెను. ఇతనిచే తిలకమంజరీ నామకగద్యకావ్యము రచియింపఁజేసెను. అందలి జినాగమకథలు విని యానందించెను. ఇతనివలెనే యితని పెత్తండ్రి వాక్పతిరాజుకూడా సభలో నీకవిని "సరస్వతి" యని పిలుచుచు గౌరవించెనఁట. ఈయంశములు తిలకమంజరి యవతారికవల్లఁ దెలియవచ్చును[1]. పాఠకప్రతిపత్తికై పరమారరాజవంశ వర్ణనముతోడి యందలి కొన్నిశ్లోకముల నిందు చూపుచున్నాను.

తస్మి న్నభూ ద్రిపుకళత్ర కపోలపత్ర, వల్లీవితానపరశుః పరమారవంశే,
"శ్రీవైరిసింహ ఇతి దుర్ధరసైన్యదంతి, దంతాగ్రభిన్నచతురర్ణవ
కూలభిత్తిః"

---

1. త స్యాత్మజన్మా సమభూ న్మహాత్మా,
దేవ స్స్వయంభూ రివ సర్వదేవః,
తజ్జన్మా జనకాంఘ్రిపంకజరజ, స్సేవాప్తవిద్యాలవో,
విప్రః శ్రీధనపాల...... ।
శ్రీముంజేన సరస్వతీతి సదసి క్షోణీభృతా వ్యాహృతః.

" తత్రాభూ ద్వసతి శ్శ్రియా పరమయా శ్రీహర్ష ఇత్యాఖ్యయా.
విఖ్యాత శ్చతురంబురాశిరశనాదామ్నః ప్రశాస్తా భువః,
భూపః ఖర్వితవైరిగర్వగరిమా శ్రీసీయక స్నాయకాః
పంచేషో రివ యస్య పౌరుషగుణాః కేషాం న లగ్నా హృది ? "
" త స్యోదగ్రయశా స్సమ స్తసుభటగ్రామాగ్రగామీ సుతః
సింహో దుర్ధరశత్రుసింధురతతే శ్శ్రీసింధురాజో ఽ భవత్,
ఏకాధిజ్యధనుర్జితాబ్ధివలయావచ్ఛిన్నభూ ర్యస్యసః.
శ్రీమద్వాక్పతిరాజదేవనృపతి ర్వీరాగ్రణీ రగ్రజః
ఆకీర్ణాంఘ్రీతి శ్లోక ఉల్లిఖితః పూర్వమ్ "
" నిశ్శేషవాఙ్మయవిదో ఽపి జినాగమోక్తాః
శ్రోతుం కథా స్సముపజాతకుతూహలస్య,
త స్యావదాతచరితస్య వినోదహేతో
రాజ్ఞ స్స్ఫుటాద్భుతరసా రచితా కథేయమ్ "

తమ్మునికొడుకును సుగుణమూర్తియు నన్నప్రేమతో ముంజుఁడు భోజుని స్వయముగాఁ దనరాజ్యమునం దభిషిక్తుని గావించె నని యాయుత్సవము కన్నులారఁ గాంచినయాస్థానకవి యిట్లు చెప్పుచుండఁగా, ముంజుఁడు భోజుని జంపింప నడవికి పంపినట్లును భోజుఁ డీక్రింది శ్లోకము వ్రాసి ముంజునికి పంపినట్లు నేమేమో కల్పించినకట్టుకథ లోకమున నెట్లు పుట్టెనో! బల్లాలదేవాదులభోజ చరిత్ర లిట్టివే కదా! ఆశ్లోక మిది:—

" మాంధాతా స మహీపతిః కృతయుగాలంకారభూతో గతః,
సేతు ర్యేన మహోదధౌ విరచితః క్వాసౌ దశాస్యాన్తకః,
అన్యే చాపి యుధిష్ఠిరప్రభృతయో యాతా దివం భూపతే!
నైకేనాపి సమంగతా వసుమతీ ముంజ! త్వయా యాస్యతి "

తిలకమంజరి చాలావిధములఁ గాదంబరిని బోలియున్నది. భాష మృదువు. అయోధ్యాపుర రాజగు మేఘవాహనుని కుమారుఁ డగుహరి

వాహనుఁడు విద్యాధరకన్య యైన తిలకమంజరిని పెండ్లాడుట యనుకథా భాగ మతిచిత్రముగా శృంగారప్రధానముగా వర్ణింపఁబడినది. ఈకవి ప్రాకృతభాషలో ఋషభపఞ్చాశిక, నామమాల యనుచిన్నకృతులు నిర్మించెను. రెండవది సంవత్సరము ౧౦౨౯లో పూర్తి యైనది. అది శా. ౮౯౨ అగును. దానినిబట్టి యితఁడు భోజునిసభకు వచ్చునప్పటి కేఁబదియేండ్లవాఁ డయి యుండునని తెలియుచున్నది. ఇతని సోదరుడు-

## శో భ న క వి

ఇతఁడును భోజునిసభలో నుండెను. ఇతని సంస్కృతకృతులు కనరావు. కాని తీర్థంకరులను జినదేవుని వర్ణించిన చతుర్వింశతిక యొకటి కల దని తెలియవచ్చును. ధనపాలుఁడు దానికి టీక వ్రాసెనఁట. ఇక నొకశైవకవి:—

## ఉ ద్భ టా రా ధ్యుఁ డు

"హరలీలాస్తవ" మనుకృతి నిర్మించినయీకవి శైవుఁ డని పేరే చెప్పుచున్నది. ఈకృతి యిపుడు కనరాదుగాని, మల్లికార్జునపండితారాధ్యుఁడు తనశివతత్త్వసారములో నితని నిట్లు పేర్కొనియున్నాఁడు.

" హరలీలాస్తవరచనా, స్థిరనిరుపమభక్తిఁ దనదు దేహముతోడన్,
సురుచిరవిమానమున నీ, పురమున కుద్భటుఁడు ప్రీతిఁ బోవఁడె
రుద్రా!"

పాల్కురికిసోమనాథుఁ డీయుద్భటునిచరితమును పండితారాధ్య చరిత్రలో వర్ణించియున్నాఁడు. బ్రహ్మశివుఁ డనునొకజైనకవి "సమయ పరీక్ష" యనెడితనకృతిలో నితనిహరలీలాస్తవమును స్మరించియున్నాఁడు. ఆజైనుఁడు శా. ౯౯౦ ప్రాంతమువాఁడు- అట్టియీయుద్భటుఁడు భోజ మహారాజుసభలో నుండె ననియు నాతనికి శివదీక్ష నిచ్చె ననియు, తరువాతనే భోజుఁడు యోగసూత్రవృత్తి నిర్మించె ననియు శైవసంప్ర దాయము వా రనుచున్నారు. అద్వైతు లందఱు శివభక్తులై శివస్తుతి

గావించినవారే, అట్లే భోజమహారాజును వృత్త్యారంభమందు—

" దేహార్ధయోగ శ్శివయోః స శ్రేయాంసి తనోతు నః,
దుష్ప్రాప మపి య త్స్మృత్వా జనః కైవల్య మశ్నుతే "

అని శివస్తుతి గావించి యుండును. ఇంతమాత్రము నితఁ డుద్భటునిశిష్యుఁడై వీరశైవుఁ డయ్యెనని నిర్ణయింపరాదుగాని, ఆమహారాజు సభలో జైను లున్నట్లే వీరశైవులు నున్నా రని నమ్మవచ్చును. భోజునివీరశైవదీక్షావిషయ మింకను విచారణీయము.

## నన్నయభట్టారకుడు

శా. ౯౭౦ ప్రాంతమున ధారానగరమందు భోజమహారాజుసంస్కృతసరస్వతికి కంఠాభరణ మర్పించుసమయమున రాజమహేంద్రవరమున రాజరాజనరేంద్రునిసన్నిధిని నన్నయార్యుఁ డాంధ్రవాగ్దేవిచే పుస్తకము పట్టించెను. సంస్కృతసారస్వతనిష్ణాతుఁడు నాంధ్రభాషాసంప్రదాయవేత్తయు నైనయీవిపులశబ్దశాసనుఁడు సంస్కృతకవి యనుటకు భారతారంభమందలిమంగళాచరణశ్లోకమును, తనసహాధ్యాయుఁ డైన నారాయణభట్టునకు రాజనరేంద్రుఁడు నందంపూడిగ్రామముదానమిచ్చిన సందర్భమున రచియించిననందంపూడిశాసనశ్లోకములునుతప్ప వేఱేమియు కనరావు, ఇతఁడు నితనిమిత్రుఁడును సంస్కృతప్రాకృతములు రెంటను కవిత్వము చెప్పినవారును, అందు కృతులు నిర్మించినవారు నగుదురుగాని, తక్కనకొందఱుమహాకవులకృతులవలెనే యవియు నడుగంటియుండును. ఎవరో యొకరిద్దఱు మనయీకవిసంస్కృతమున నార్యావృత్తములతో నాంధ్రశబ్దచింతామణియనువ్యాకరణము నిర్మించె నని భ్రాంతిపడుచున్నారుగాని, ఇతనిభారతప్రయోగముల కత్యంతవిరుద్ధము లైనసూత్రములతోడియాకృతి యితనిది కాదనుట ముమ్మాటికి నిజము. తననాఁటికి గాసటబీసటగా నున్నశబ్దజాలమును శాస్త్రీయ మగురీతిని ఛందోబద్ధము గావించుటంజేసి యితఁడు విపులశబ్దశాసనుఁ డైనాఁడు. దాని

నితనివాగనుశాసనబిరుదముగా నర్వాచీనులు మార్చినారు. అంతేకాని, యితఁడాచింతామణియు రచియించవలేదు, దానివల్ల నితనికి వాగనుశాసనబిరుదమును రాలేదు. ఇది పరమార్థము. ఇంక నితనికవిత.

“శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే,
లోకానాం స్థితి మావహం త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్,
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వ స్సురై,
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవశ్రీకంధరా శ్శ్రేయసే”

“హారీతగోత్రే హరిమూర్తి రాపస్తంబద్విజశ్రేష్ఠవిభు ర్వినీతః,
సదా పురోడాశపవిత్రవక్త్రోవిద్వా నభూ త్కొంచెనసోమయాజీ,

“అభవదనుష్ఠితజగదుపకరణో నారాయణ స్తనయః,
య స్సంస్కృతకర్ణాటప్రాకృతపైశాచికాంధ్రభాషాసు,
కవిరాజశేఖర ఇతి ప్రథిత స్సుకవిత్వవిభవేన
కవీ న్మనీషాలవదుర్విదగ్ధాన్ మనోహరాభి ర్నిజసూక్తిభి ర్యః,
కుర్వ న్నగర్వా న్పటుభి ర్బిభర్తి కవీంద్రవజ్రాంకుశనామ సార్థమ్”

ఈనన్నయార్యునియనంతరము విరాటాదిపర్వము లాంధ్రీకరించినమహాకవి(తిక్కనసోమయాజి)-యితఁడు నుభయకవిమిత్రుఁడే. కాని యితనిసంస్కృతకృతులు నంతరించినవి. హరిహరస్తవమైనయితనిశ్లోక మొకటి యాంధ్రభారతమం దున్నది.

“కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా.
పరిష్క్రియాయాం బహు మన్యసే త్వమ్,
కిం కాలకూటః కిమువా యశోదా
స్తన్యంత వస్వాదు వద ప్రభో మే”

## మహానాటకకవులు

రామకథాశ్రయము లైనయీనాటకములు రెం డున్నవి. ఒకటి చతుర్దశాంకము. రెండవది దశాంకము. రెంటికర్త హనుమంతుఁడే

యని ప్రస్తావనలు చెప్పుచున్నవి. రెండును ముద్రితము లైనవి. రెంటి లోను పరకవులశ్లోకము లున్నవి. తక్కినగ్రంథము రెంటను వేఱుగానే కనవచ్చును. ఒకఁడే యీరెంటిని రచియించెనా? ఈహనుమంతుఁ డెవరు? ఎప్పటివాఁడు? శ్రీరామభక్తుఁ డైనయంజనానందనుఁ డని యెవరును నమ్మరుగదా! మ ఱెవరో కొంచె మాలోచింతము. అంతకు మున్ను మహానాటక మొకటి యున్నదో, లేక యీరెంటిలో నొక దానిని చూచెనో, కాని శారదాతనయుఁడు భావప్రకాశములో దాని లక్షణము నిట్లు నిర్వచించెను.

" సర్వవృత్తివినిష్పన్నం సర్వలక్షణసంయుతమ్,
సమగ్రం తత్ప్రతినిధి ర్మహానాటక ముచ్యతే"

ఇదిపదునాలు గంకములనాటకము చూచి చెప్పినమాట యని భావించవచ్చును. దాని మొదట నున్నశ్లోక మిది.

" రచిత మనిలపుత్త్రే ణాథ వాల్మీకి నాబ్ధౌ,
నిహిత మమృతబుద్ధ్యా ప్రా ఙ్మహానాటకం తత్,
సుమతినృపతిభోజే నోద్ధృతం తత్క్రమేణ,
గ్రథిత మవతు విశ్వం మిశ్రదామోదరేణ "

" హనుమంతుఁ డీమహానాటకము నిర్మించె నఁట. వాల్మీకిమ హర్షి యిది యమృత మనుకొని సముద్రములోనుంచె నఁట. తరువాత భోజమహారాజు దీని నుద్ధరించె నఁట. దామోదరమిశ్రుఁడు దీని నం తను క్రమముగా సమకూర్చె నఁట" ఇది యద్భుతకథనమే యైనను, దామోదరమిశ్రుఁడు దీనికర్త యనియు, అతఁడు భోజరాజుసమకాలము వాఁ డనియు నిజము తెలిసినది. ఇందు కనుగుణముగా సరస్వతీకంఠాభ రణములో నిందలిశ్లోకములును గనవచ్చుచున్నవి. దీనినాందీశ్లోక మిది. ఇది లీలాశుకునిసుమంగళస్తోత్రముచివర నుండుటయు చిత్రమే—

"యం శైవా స్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాన్తినో,
బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః,
అర్హ న్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః,
సో௨యం వో విదధాతు వాంఛితఫలం త్రైలోక్య నాథో హరిః"

ఇంక, పదంకములమహానాటకము నుత్పత్తినందలి యీక్రింది మాటలీవిధముగాఁ దెలుపుచున్నవి.

"ఏష శ్రీలహనూమతా విరచితే శ్రీమన్మహానాటకే,
మిశ్రశ్రీమధుసూదనేన కవినా సందర్భసజ్జీకృతే"

దీనిని హనుమంతుఁడు రచియించినాఁడట. మధుసూదనమిశ్రుఁడు సందర్భోచితముగా సవరించె నఁట. ఈమాటలనుబట్టి మధుసూదనమిశ్రుఁడు దీనిని నిర్మించి దామోదరమిశ్రునివలెనే హనుమంతుని పేరు పెట్టె ననుట విదితము, ఇది శా. ౧౦౦౦ ప్రాంతముననే పుట్టిన దన వచ్చును. ఇందలిసూత్రధారోక్తి యిది:—

"వాల్మీకే రుపదేశతః స్వయ మహో వక్తా హనూమాన్ కవిః,
శ్రీరామస్య రఘూద్వహస్య చరితం సౌమ్యా వయం నర్తకాః,
గోష్ఠీ తా వదియం సమస్తసుమనస్సంఘేన సంవేష్టితా,
తద్ధీరాః కురుత ప్రమోద మధునా వక్ష్యామి రామాయణమ్"

ఇప్పటికి తేలినసారాంశ మిది;— హనుమన్నాటక మనెడిమహానాటకమును తొలుత దామోదరమిశ్రుఁడు రచియించెను. అది భోజ మహారాజున కించుక పూర్వ మనఁదగును. ఆపేరనే రెండవనాటకమును మధుసూదనమిశ్రుఁడు నిర్మించెను. ఇది యామహారాజునకు పర మన వచ్చును. ఇద్దఱు నుత్తరదేశీయులే. ఖండప్రశస్తి యనుకృతినిర్మించిన హనుమంతుఁ డొకఁ డున్నాఁడు గాని, యతఁడు కావ్యకర్త కాఁడు.

## సోడ్ఢలుఁడు

ఇతఁడు కోంకణదేశీయుఁడు కాయస్థక్షత్రియకులమువాఁడు. శిలాదిత్యునిసోదరుఁ డైన కలాదిత్యుఁ డాకులమునకు మూలపురుషుఁడు,

శివసన్నిధి నుండు కాయస్థుఁ డనుపేరు గలగణపురుషుఁడే కలాదిత్యుఁడై జన్మించె నఁట. ఈ కాయస్థవంశము కోంకణ దేశమున నభివృద్ధిగాంచినది.

సోడ్ఢలునితండ్రి శూరుఁడు, తాత సోల్లపేయుఁడు, ముత్తాత చందాదిత్యుఁడు—చిన్నతనములో తండ్రి పోవుటచే గంగాధరుఁ డనుమేనమామయింట నితఁడు పెరిగి, చంద్రపండితునివద్ద విద్య నభ్యసించి విద్వత్కవియై కోంకణరాజ్యమునకు రాజధాని యైనస్థానకపురము చేరి అందలి ఛిత్తరాజు నాగార్జునుఁడు ముమ్మణిరాజు అనురాజసోదరుల యాదరము గాంచెను. ఆరాజులు ముగ్గురు నొకరితరువాత నొకరు రాజ్యము చేసినవారు, వారిలో మొదటియుద్దటి శాసనములు శా. ౯౪౮-౯౬౨ లోనివి కనఁబడుచున్నవి. ఆ కాలమున వారిసంస్థానకవి యైన యితఁడు లాటదేశాధిపతియు చాళుక్యరాజు నైనవత్సరాజు సత్కారము కూడ నందియున్నాఁడు. ఈవత్సరాజుకొడుకు త్రిలోచనపాలుఁడు చెక్కించిన శా. ౯౭౨ లోని శాసనమునుబట్టి యాసత్కారముకూడ ౯౪౮ ప్రాంతమందే జరిగె ననవచ్చును. అందుచే నీకవి శా. ౯౨౨-౯౬౨ నడుమ నున్నవాఁ డనుట విదితము.

కాయస్థులనుగూర్చి యేనాఁడో యొకకవి చెప్పినశ్లోక మొకటి చాటువుగా దేశమున వ్యాపించి యున్నది.

" కాయస్థే నోదరస్థేన, మాతృమాంసం న భక్షితమ్.
దయా తత్ర న మన్తవ్యా, తత్ర హేతు రదంతతా"

ఆకాలమునం దీకులమువారు కోంకణదేశమందును వంగాదిదేశములందును గ్రామకరణములుగా నుండెడివారు. వారు ప్రజలను పీడించి డబ్బు లాగుట చూచి, ఒళ్లు మండి యెవఁడో పైశ్లోకము చెప్పె నఁట.

ఉదయసుందరీకథ యనెడియెనిమిదుచ్ఛ్వాసములచంపు వితఁడు నిర్మించెను. ఇందు గద్యభాగమే యెక్కువ. బాణభట్టు నెక్కువగా పొగడిన యితనిరచన యతనిహర్షచరిత్రరచనను పోలియున్నది. ప్రతిష్ఠా

న నగరరా జైనమలయవాహనుఁడు నాగలోకప్రభు వైనశిఖండితిలకుని కూఁతు రగుశశివయసుందరిని, పెండ్లాడుట యిందలి ప్రధానవిషయము. ఇందు మొదటియుచ్ఛ్వాసము, కవివంశవర్ణన కాయస్థకులవర్ణనలలో సరి పడినది. రెండవదానిలో కథ యారంభ మైనది. వచనరచన సరళము గానే యున్నది. ఇతనిపద్యకవిత్వమును రసవంతమే.

ఈసోడ్ఢలుఁడు వత్సరాజుసభలో నున్నరోజులలో నిత్య మేవో శ్లోకములు నిర్మించి చదువుచుండఁగా, ముక్తాహారమువలె, ఒక్కొక్క ముత్యము హారము కలిగింప దని యొకనాఁ డారా జన్నట్లును, ఆమాట లోనిభావముగ్రహించి యుప్పుడుదయసుందరీకథ నిర్మింపఁబూని యితఁడు కొద్దిరోజులలోనే పూర్తి గావించి యది వినిపించినట్లు లోకజనశ్రుతి కలదు. వత్సరాజుమాటలుగా నున్నశ్లోక మిది:—

"ఏకైకశః ప్రకీర్ణై ర్ముక్తామణిభిః కిమేభి, రేభి స్తు,
యస్సృజతి హన్త హారం త స్యాన్యః కో ఽపి పరిభోగః"

# కుంతకుఁడు

ఇతనినివాస మేదో తెలియదు కాని, యితఁడు పూర్వాలంకారికులలో గణన కెక్కి యర్వాచీనలాక్షణికులపొగడ్త నందినమాట నిజము. ఇతఁడు నిర్మించినకృతి వక్రోక్తిజీవితము. ఇది కారికావృత్తి రూపమున నున్ననాలుగున్మేషములగ్రంథము. ఇందు మొదటియున్మేష మారంభించుచు కావ్యలక్షణము చెప్పి శబ్దార్థరూప మైనకావ్యమునకు కవీశ్వరునివైదగ్ధ్యభంగీభణితిరూప మైనవక్రోక్తియే యలంకృతి యని యిట్లు చెప్పినాఁడు.

"శబ్దో వివక్షితార్థైకవాచకో ఽన్యేషు సత్స్వపి,
అర్థ స్సహృదయాహ్లాదకారీ స్వస్పందసుందరః,

ఉభా వేతా వలంకార్యౌ, తయోః పున రలంకృతిః
వక్రోక్తి రేవ వైదగ్ధ్యభంగీ భణితి రుచ్యతే ”

వక్రోక్తివైచిత్ర్యమే కావ్యజీవిత మని యితనిమతము. సహృదయుల కాహ్లాదము కలిగించునది చమత్కారకారి యైనవక్రోక్తియే యని యితనిసిద్ధాంతము. ఇందుకు, వైచిత్ర్యము సుకుమారము మధ్యమము, అని మూఁడుమార్గములు చూపఁబడెను. ఇందు మధ్యమమార్గము తక్కినరెండుమార్గములతోఁ గూడి మనోహర మగు నని యిట్లు చెప్పెను.

“ మార్గో ఽసౌ మధ్యమో నామ నానారుచిమనోహరః,
స్పర్ధయా యత్ర వర్తన్తే మార్గద్వితయసంపదః ”

ఇతఁడు స్వభావోక్తి నలంకారముగా నిరూపించుట యనర్హ మన్నాఁడు.

“ అలంకారకృతాం యేషాం స్వభావోక్తి రలంకృతిః,
అలంకారతయా తేషాం కి మన్య దవతిష్ఠతే ”

ఇతఁ డీగ్రంథమున గావించినచర్చలు విమర్శనములు నిర్వచనములు నితని ప్రతిభావిశేషమును చాటుచున్నవి.

ఇట్టియుద్గ్రంథ మెంతోకాల మడఁగియుండి మొన్నమొన్ననే కలకత్తాలో ముద్రితమైనది.

ఇతఁ డభినవగుప్తునికంటె చిన్నవాఁడై యతనినాఁ డున్నాఁడో అతని కించుకపరుఁడో యగును. మహిమభట్టున కించుకపూర్వుఁ డగును కావున నితఁడు శా. ౯౫౦ప్రాంతమం దున్నవాఁ డని విశ్వసింతము.

## మహిమభట్టు

ఇతఁడు కాశ్మీరమువాఁడు రాజానకవంశస్థుఁడు. అలంకారశాస్త్రమున విశేషపరిశ్రమ సలిపినవిద్వాంసుఁడు. అభినవగుప్తాచార్యు నితఁడు

స్మరించినాఁడు. ఇతనిని మమ్మటభట్టు స్మరించినాఁడు. కావున వారిరువురికి మధ్యస్థుఁడైనయితఁడు శా. ౯౭౩-౧౦౨౦ నడుమ వ్యక్తివివేక మను పేర సాహిత్యగ్రంథము నిర్మించియున్నాఁడని తలంతము.

ఈతఁడు ముఖ్యముగా నానందవర్ధనాచార్యునిధ్వనిని ఖండించుటకు మూఁడు విమర్శము లను ప్రకరణములతోడి యీగ్రంథము నిర్మించినట్లు మొదటిశ్లోకమే తెలుపుచున్నది.

"అనుమానాంతర్భావం సర్వస్యైవ ధ్వనేః ప్రకాశయితుం,
వ్యక్తివివేకం కురుతే ప్రణమ్య మహిమా పరాం వాచమ్"

ఇందలి మొదటివిమర్శము ధ్వనికారుఁడు కావ్యలక్షణమును సామాన్యముగాఁ జెప్పకయే ధ్వని యని గుణీభూతవ్యంగ్య మని ప్రకారద్వయము చెప్పుట యప్రయోజక మని యాక్షేపించినది. ద్వితీయ విమర్శము విశేషించి శబ్దశక్తిమూలధ్వనిని నిరాకరించినది. తృతీయ విమర్శము ధ్వన్యాలోకము చూపినయనేకోదాహరణములు విమర్శించి వాని ననుమానపక్షమున సమన్వయించి, విభావానుభావవ్యభిచారప్రతీతి రసప్రతీతికి సాధన మని చెప్పి యది యనుమానమున నంతర్భూత మగుచున్న దని నిరూపించి స్వమతము నావిష్కరించినది. కాని, దీనికి వ్యక్తివివేకవిచార మనుపేర వ్యాఖ్య నిర్మించిన రాజానకరుయ్యకుఁ డితనిమతమునం దెడనెడ ననాదరము చూపుచు ధ్వనిమతమునే యాదరించెను. ఏమయినా, అనుమానమతము లేవనెత్తిన వ్యక్తివివేక మానాఁడు పండితాదరము గాంచినమాట నిజము.

ఈవ్యక్తివివేకమునకు కావ్యాలంకార మనునామాంతరము నితఁడే "వ్యక్తివివేకాఖ్యే కావ్యాలంకారే" అని తెలిపియున్నాఁడు. తనకు ముందు భట్టనాయకుఁడు ధ్వనిమతఖండనము కావించినట్లు వినుటయే కాని, అతనిదర్పణము చూడ లేదనియు "అదృష్టదర్పణా మమధీః" తెలిపియున్నాఁడు. మఱియు, తనకృతిలోనివిషయ మితరు లెవ్వరు నిం

తకు ముందు లిఖించినది కా దనుచు, "ఇది చూచి విద్వాంసులు పరిహసింపనీ! ఇందలికొ్రొత్త విషయము నవలోకించి సంతోషింపనీ! అనుచుం నీక్రిందివిధముగా పలికియున్నాఁడు.

" అన్యై రనుల్లిఖితపూర్వ మిదం బ్రువాణో,
నూనం స్మృతే ర్విషయతాం విదుషా ముపేయామ్,
హాస్యైక కారణగవేషణయా నవార్థ
తత్త్వావమర్శ పరితోష సమీహయావా"

# క్షేమేంద్రుఁడు

ఇతఁడు పెద్దపేరు తెచ్చుకొన్నయొకకవీంద్రుఁడు. వ్యాసదాసబిరుదాంచితుఁడు అద్వైతుఁడు శివభక్తుఁడు. త్యాగభోగపరాయణుఁడును బ్రహ్మవేత్తయు నైనపరికాశేంద్రపండితునిపుత్త్రుఁడు, సర్వమనీషి యనం బడినగంగకోపాధ్యాయుని ప్రియశిష్యుఁడు కాశ్మీరరాజైనయనంతభూపాలునియాస్థాన మలంకరించినమహాకవి. పైవిషయ మంతయు నితనిగ్రంథాంతగద్యపద్యముల విదిత మగును.

" తస్య శ్రీమదనంతరాజనృప తేః కాలే కిలాయం కృతః"

ఈయనంతరాజు శా. ౯౭౨-౧౦౦౨ నడుమ కాశ్మీర మేలినట్లు రాజతరంగిణి చెప్పుచున్నది[1] ఈరాజు భోజమహారాజునకు సమకాలికుడని మున్ను చదివినాము. కాలవిషయము కలశభూపతిజీవితమున పరిశీలింతము.

ఔచిత్యము కావ్యజీవిత మనెడి నూతనమతము లేవనెత్తి "యౌచిత్యవిచారచర్చ నిర్మించిన యితఁడు సుమారు నలువదికృతులు నిర్మించెను. అవి యన్నియు దేశమున వ్యాపించినవి కావు కాని, కావ్యమాలలో ప్రకటింపఁబడినకొన్నిటికి మాత్ర మిటీవల వ్యాప్తి వచ్చినది.

1. ఇతనిరాజ్యకాలము సా. ౯౪౧-౯౭౬ అనుపాఠ మున్నది.

మహాభారతము నితఁడు సంగ్రహించి భారతమంజరి వ్రాయుటచేతనే యితఁడు వ్యాసదాసుఁ డయ్యెను గాని, దాని కైనా వ్యాప్తిలేదు. కాశ్మీర రాజులచరితమును రాజావళి యనుపేర మొదట వర్ణించినవాఁ డితఁడే కాని, యది సరిగా లేదని నిరసించి తరువాత కల్హణపండితుఁడు రాజతరంగిణి నిర్మించెను.

ఇతని రామాయణ భారత బృహత్కథా మంజరులు తొలుతఁ గొంతకాలము పాఠకుల నాకర్షించిన వన వచ్చునుగాని తరువాత నణఁగినవి. బృహత్కథామంజరి అమృతతరంగము కనకజానకి దశావతార చరిత దేశోపదేశము నీతికల్పతరువు పద్యకాదంబరి శశివంశమహాకావ్యము చిత్రభారతనాటకము మొదలైనవానిలో కొన్ని యుత్తరహిందూ దేశమునఁ గొంతకాలము వాడుకలో నున్నట్లు తరువాతివా రందందు గావించిన ప్రశంసావాక్యముల వల్లఁ తెలియనయ్యెడి, ఇతఁడు కవికర్ణిక యనఁబడు కావ్యాలంకారగ్రంథమును కవికంఠాభరణ మనుమతియొక లక్షణమును నిర్మించెను గాని యవియుఁ దదర్వాచీనలాక్షణికుల నాకర్షించలేదు. రెండవదానిలోని శ్లోకము లివి:—

" అత్రాకవేః కవిత్వాప్తిః శిక్షాప్రాప్త గిరః కవేః,
చమత్కృతిశ్చ శిక్షాప్తౌ గుణదోషోద్గతి స్తతః,
పశ్చా త్పరిచయప్రాప్తి రి త్యేతే పంచసంధయః "

ఇతనికృతులలో ననేకములు నూఱుశ్లోకములకు మించినవి కావు కలావిలాస మనునది పదిసర్గలకావ్యము. అది సాంఘికవర్తన విమర్శము. ఇందు మోహ దంభ కామాదుల దుర్లక్షణములు వాటిఫలములు విశదీకరింపఁబడినవి. ఇందలినాల్గవసర్గలో వేశ్యావృత్తము వర్ణింపఁబడినది. వెలవెలఁది హృదయమున నఱువదినాలుగు కల లున్న వని వేశకల నృత్యకల గీతకల వక్రవీక్షణకల మొదలగువానిని జేర్కొనెను, దాని కుపక్రమ మిది:—

"హారిణ్య శ్చటులతరా బహులతరంగాశ్చ నిమ్నగామిన్యః,
నద్య ఇవ జలధిమధ్యే వేశ్యా హృదయే కలా శ్చతుష్షష్టిః"

నీతిలత లావణ్యవతి మునిమతమీమాంస లలితరత్నమాల వినయవల్లి మొదలగున వితనియితరగ్రంథములలోఁ జేర్కొనఁబడియున్నవి. నూఱుశ్లోకములకావ్యమైన చారుచర్య చక్కఁగా నున్నది. ఇందు మానవుని యుత్తమవర్తనమునకు రామాయణాదులలోని మహాపురుషుల వృత్తములు దృష్టాంతీకరింపఁబడినవి.

"న త్యజే ద్ధర్మమర్యాదా మపి క్లేశదశాం శ్రితః
హరిశ్చంద్రో హి ధర్మార్థీ సేహే చండాలదాసతామ్"

ఇతని సేవ్యసేవకోపదేశము కూడా నీతిబోధకమే. ధర్మార్థకామమోక్షములను విశదీకరించిన యితని చతుర్వర్గసంగ్రహము విజ్ఞానదాయకము. సారస్వతము నలుగడలు ప్రోక్కినయితని కృతులలో నౌచిత్యవిచారచర్చయే బాగా వ్యాప్తికి వచ్చినది. అందలి విమర్శనములైనను గొన్నిపునర్విమర్శనార్హములే యైనవి. కుమారసంభవములోని ఊరుమూలనఖక్షతవర్ణన మితఁడుచితమంటే తరువాతి వారనుచితమన్నారు. శ్రీరాముఁడు తనతండ్రియని తెలియని లవుఁడు, ఖరాదులను సంహరించిన రామునిశౌర్యము నాక్షేపించుట యనుచితమని యితఁడన్నాఁడు. అది సముచితమే యని యితరు లన్నారు.

ఇతని సువృత్తతిలకము మూఁడువిన్యాసముల చిన్నకృతి. ఇది వృత్తౌచిత్యచర్చారూప మగునొక విమర్శగ్రంథము. ఇందును పైకృతిలోను పూర్వ మహాకవులకావ్యములనుండి కైకొన్న శ్లోకములవల్ల వారివారి సత్కృతులను మనకు తెలిపి మహోపకారముగావించెను. దీనిప్రయోజన మిట్లు వర్ణింపఁబడినది.

"సువర్ణార్హప్రబంధేషు యథాస్థాననివేశినామ్,
రత్నానా మివ వృత్తానాం భవ త్యభ్యధికా రుచిః"

తస్మా ద్యథాయం వినియోగమార్గః ప్రదర్శితో వృత్తనివేశనేషు'

ఇతని లావణ్యవతి శృంగారప్రధానకృతి. ఇందు, పరపురుషదష్టాధర యైనయొకరమణి ఊరిలోనుండి తనమగఁడు ద్వారదేశమునకు వచ్చుట కనిపెట్టి చూడనట్టుగా, తనవికృతి మఱుఁగుపఱుచుటకై పెంపుడుచిలుకతో నిట్లనుచున్నది—

"అదయ! దశసి కిం త్వం బింబబుద్ధ్యాధరం మే?
భవ చపల నిరాశః పక్వజంపూఫలానాం,
ఇతి దయిత మవేత్య ద్వారదేశాప్త మన్యా,
నిగదతి శుక ముచ్చైః కాంతదంతక్షతోష్ఠీ"

ఇతని చతుర్వర్గసంగ్రహము పురుషార్థప్రశంసాపరము. అందలి వైరాగ్యవర్ణన మిది.

"భోగే రోగభయం సుఖే క్షయభయం విత్తే ఽగ్నిభూభృద్భయం,
దాస్యే స్వామిభయం గుణే ఖలభయం వంశే కుయోషిద్భయమ్,
మానే మ్లానిభయం జయే రిపుభయం కాయే కృతాంతా ద్భయం,
సర్వం నామ భవే భవే ద్భయ మహో వైరాగ్య మే వాభయమ్"

ఇఁక, నిలస మునిమతమీమాంసలోని దొకటి:—

"వివిధగహనగర్భ గ్రంథసంభారభారై
ర్మునిభి రభినివిష్టై స్తత్త్వ ముక్తం న కించిత్,
కృతరుచి రవిచారం సార మేత న్మహార్థే
రహ మితి భవభూమి ర్నాహ మి త్యేవ మోక్షః"

## గంగకోపాధ్యాయుఁడు

ఈయనకృతిపే రెందును వినరాదు కాని, పై క్షేమేంద్రుఁడే, ఔచిత్యవిచారచర్చలో తనగురు వైన యితనియీ క్రిందిశ్లోకమును, అశీఃప దౌచిత్యమున కుదాహరించినాఁడు.

"స కోఽపి ప్రేమార్ద్రః ప్రణయపరిపాకప్రచలితో,
విలాసో ఽక్ష్ణాం దేయా త్స్వఖ మనుపమం వో మృగదృశామ్,
య దాకూతం దృష్ట్వా పిదధతి ముఖం తూణవివరే,
నిరస్తవ్యాపారా భువనజయినః పంచవిశిఖాః"

ఈసర్వమనీషి క్షేమేంద్రునికి కాదు, కామశాస్త్రమునకే యుపాధ్యాయుఁ డనుట కీపద్య మొక్కటియే చాలును—మృగాక్షులచూపులు మన్మథబాణముల నణఁచిపైచినవఁట.

# సోమదేవభట్టు

కాశ్మీరీయుఁ డైనయితఁడును క్షేమేంద్రునితో అనంతభూపాలునాస్థానమున నున్నవాఁడు. ఇతఁడు రామభట్టుకుమారుఁడు కథాసరిత్సాగర మనుగొప్ప చరిత్రగ్రంథము నిర్మించిన కవీంద్రుఁడు. ఇది గుణాఢ్యునిబృహత్కథకు సంస్కృతానువాదము. గ్రంథాంతమం దున్నగ్రంథకర్తృప్రశస్తినిబట్టి యీకృతి తనపోషకుఁ డైనయనంత భూపాలునిపట్టమహిషియగు సూర్యవతీదేవికోరికచే నితఁడు నిర్మించినట్లు తెలియుచున్నది. తనతో నాయాస్థానమందే యున్నక్షేమేంద్రుఁడు బృహత్కథామంజరి సంస్కృతమున రచించి యుండఁగా నితఁ డాపనియే మరల నేందుకు చేసెనన్నయనుమాన మీరెంటిని పరిశీలించి చదివినవారికి కలుగఁబోదు. ఇది పుట్టినంతనే దేశమునలుఁగడల వ్యాపింపఁజొచ్చె నన్నమాట యొకటియే దీనిసుగుణములకు నిదర్శనము క్రీ. ౧౮ ౩౯లో నీకృతి బ్రోకాసు పండితుని యుత్సాహమున జర్మనీదేశమునందు కూడా సంచరింపఁజొచ్చినది. పాఠకులహృదయముల నాకర్షించునట్టి యిట్టికథ లపూర్వములని పాశ్చాత్యపండితు లెందఱో దీనిని నుతించియున్నారు.

ఇందు ౧౮ లంబకము లనుపెద్దప్రకరణములు కలవు. అం దున్నతరంగములు ౧౨౪. శ్లోకములు ౨౪ వేలు. ఇందలి కథాపీఠలంబకములోని

యీక్రిందిమాటలను బట్టి, సందర్భోచితముగా నొదవిన గ్రంథ మిం చుక పెంచుట కుదించుట భాష వే ఱగుట తప్ప గుణాఢ్యునిమూలకథ నిది యెంతమాత్ర మతిక్రమింపలే దని తెలియుచున్నది.

“ యథామూలం తథై వైత న్నమనా గ ప్యతిక్రమః,
గ్రంథవిస్తరసంక్షేపమాత్ర భాషా చ భిద్యతే,
ఔచిత్యాన్వయరక్షాచ యథాశ క్తి విధీయతే.
కథారసావిఘాతేన కావ్యాంశస్య చ యోజనా,
వైదగ్ధ్యఖ్యాతిలోభాయ మమ నైవాయ ముద్యమః,
కిన్తు నానాకథాజాలస్మృతిసౌకర్య సిద్ధయే.

ఇందు కౌశాంబీనాథుఁడును వత్సరాజు నయినయుదయన మహా రాజు వృత్తాంతము సంపూర్ణముగా వర్ణింపఁబడినది. ఆచంద్రార్క ముండెడికావ్యములలో నిది యొకటి.

బృహత్కథ ననువదించినవారిలో మొదటివాఁడు దుర్వినీతు డనుపేరుగల రాజనియు, అతఁడు శా. 6వశతాబ్ది ప్రాంతమువాఁడనియు, తెలియుచున్నది[1]. కాని దానిమాట నుతెందును కనఁబడదు. రెండవవాఁడు బుధస్వామి. ఇతఁడు నేపాలదేశీయుఁడు. ఇతఁడు శా. 8-9 శతాబ్దులలో నివాఁ డనియు, ఇరువదియెనిమిది లంబకములయుతని గ్రంథమున 4539 శ్లోకము లున్నవనియు, ఏ. బి. కీతుపండితుఁడు వ్రాసియున్నాఁడు. దీనిపేరు బృహత్కథాశ్లోకసంగ్రహమఁట-మూఁడవయతఁడు బృహత్కథామంజరి యనుపేర ననువదించినక్షేమేంద్రుఁడు. నాల్గవది మనసోమదేవభట్టుకథాసరిత్సాగరము-ఇందలికథలు సంగ్రహించుకొని జగన్నాథ మిశ్రుఁడు కథాప్రకాశము నిర్మించినాఁడు.

---

1. కోలారుజిల్లాలో గుమ్మారెడ్డిపురమందు లభించినతామ్రశాసనమందలియొకశ్లోకములో- శబ్దావతారకారేణ దేవభారతీనిబద్ధబృహత్కథేన కిరాతార్జునీయే పంచదశసర్గటీకాకారేణ దుర్వినీతనామధేయేన-చూ. కృ. ఆ. సం. సా. 418

# కలశభూపతి

ఈరాజకవి కాశ్మీరరాజ్యపాలకులలో నొకఁడు. ఇంతకు మున్ను పేర్కొన్నఅనంతభూపాలునికి సూర్యవతియందు జన్మించినాఁడు. అనంత రాజు శా. ౯౫౧-౯౮౬ నడుమ రాజ్యము చేసెనని కొందఱు భావించి నారు. ఈకలశభూపతి శా. ౯౮౬-౧౦౧౦నడుమరాజ్యముచేసె ననియు, శా. ౧౦౦౩ లో అనంతరాజు స్వర్గస్థుఁ డైనపిదప, ఆసంవత్సరమే సింహాసన మధిష్ఠించెననియు మఱికొందఱు భావించిరి. ఇపుడు చూపిన మూఁడువిధములైనకాలములను సమన్వయించుకొనవలసియున్నది.

కలశభూపతి రాజ్యము చేయుచుండఁగా కాశ్మీరమునుండి వెడలి పోయినబిల్హణకవిని పార్మాడిరాజు శా. ౯౯౦ప్రాంతమునందు తనయా స్థానమున విద్యాపతిని కావించె నన్నయీక్రిందిరాజతరంగిణిమాటను బట్టి . యప్పటికే కలశభూపతి రాజ్య మేలుచున్నట్లు విశ్వసింపవలసినదే కదా! పైనిర్ణయములు రాజతరంగిణి యాధారముగా వచ్చినవే కావున నందేదియు ప్రామాదిక మనరాదుకదా! ఇంక సమన్వయమే కావలెను.

అనంతరాజభోజమహారాజులు విద్వాంసులు కవిబాంధవులు సమకాలమువారని రాజతరంగణి చెప్పుచున్నది[2] అది తెలుపుచువచ్చి నరాజులకాలమునుబట్టి యది యీపద్వైషమ్యముగా శా. ౯౫౦అగును గావున నపు డనంతరాజు కాశ్మీర మేలుచుండెననియు, వాక్పతిరాజు స్వయముగా భోజునికి రాజ్య మిచ్చినట్లే, అనంతరాజును తనకుమారు నికి రాజ్య మిచ్చి యుండు ననియు విశ్వసింపవచ్చును.

---

1. కాశ్మీరేభ్యో వినిర్యాంతం, రాజ్యే కలశభూపతేః,
   విద్యాపతిం యః కర్ణాట శ్చక్రే పార్మాడిభూపతిః. రాజ

2. స చ భోజనరేంద్రశ్చ దానోత్కర్షేణ విశ్రుతౌ,
   సూరీ తస్మిన్ క్షణే తుల్యం ద్వా వాస్తాం కవిబాంధవౌ. రా. 2-259

కలశభూపతి విద్వాంసుఁడు కవి శూరుఁడు శృంగారప్రియుఁడు. నగుటయే కాక పరస్త్రీలోలుఁడై నీతి విడిచి వర్తించుట కనిపెట్టి యనంతరాజితనిబుద్ధి మరలించుటకై శా. ౯౮౬లో యౌవరాజ్యమున నిలిపిపరిపాలనము కొంత యితని కప్పగించెను. కాని యితఁడు జనకునియౌదార్యమును వాత్సల్యమును స్మరింపక తానే ప్రధానపరిపాలకుఁడుగా నెంచి పితృద్వేషియై యతనికి బాధ కలిగించి తాను బాధపడి కొంతకాలము రాజ్యమునకు దూర మయ్యెను. రాజతరంగిణి సప్తమతరంగములో నితనిదుర్వర్తనమును కల్హణుఁడు విశదీకరించియున్నాఁడు. తుద కనంతభూపాలుఁడు శా. ౧౦౦౨ లో దివంగతుఁడైనపిదప తిరిగి వచ్చిసింహాసన మధిష్ఠించి శా. ౧౦౧౦వఱకు రాజ్యముచేసె నని సమన్వయించుకొన్నచో నంతయు సముచిత మగును. బిల్హణుఁడు కాశ్మీరము విడుచునాఁటికి (శా.౯౯౦) కలశుఁడు రాజ్యము చేయుచున్నట్లున్నరాజతరంగిణీవచనము సన్వర్థ మగును. కావున నీరాజకవి శా. ౯౮౬-౧౦౧౦ నడుమ నున్నవాఁ డనుట విశ్వసనీయము.

స్వకాలప్రభు వగుటచే బిల్హణుఁ డితనిదుర్నీతి నిసుమంతయుఁ దెలుపక యితనివైభవమును మాత్రమే విక్రమాంకదేవచరితములో (౧౮సర్గ) వర్ణించియున్నాఁడు. అందలికొన్నిమాటలు:—

"యస్యోదారాం పరికలయతః శస్త్రశాస్త్రప్రతిష్ఠాం,
ద్వే ప్రేయస్యౌ జగతి విదితే శ్రీశ్చ వాగ్దేవతా చ,
ఏకా శేతే భుజ మభినవాంభోజలీలాతపత్రా
శ్వేతచ్ఛత్రాయితసితయశశ్చన్ద్రి కాన్యా ముఖేందుమ్"

గానకలాలోలుఁడైనయీరాజు సంగీతవిద్యావిశారద లయినవారయువతులను దేశదేశములనుండి రావించి వాండ్రతో క్రీడించుచుండియు, వేదవేదాంగవేత్తలగుపండితులను విద్వత్కవులనుకూడ నాదరించిగౌరవింపకపోలేదు. ప్రజోపయోగము లయినకృత్యము లాచరింపకపోలేదు. అయిన

నేమి ? ప్రిజలభక్తివిశ్వాసముల కితఁడు పాత్రుఁడు కాకపోయెను. తుద కితఁడు తనతనయునిగూడఁ బీడించి క్రూరుఁ డన్నయపఖ్యాతి గాంచెను.

ఇతఁడు తనతండ్రిసభలోనిక్షేమేంద్రుఁడు సువృత్తతిలకము రచియించునాఁటికే సరసమైన కవిత్వముచెప్పనేర్చినవాఁ డనుట కందు రథోద్ధతావృత్తమున కుదాహరింపఁబడిన యితని యీక్రిందిశ్లోకమే నిదర్శనము,

" అజ్ఞాతౌ జల మధీరలోచనా లోచనప్రతిశరీరశారితమ్,
అత్తమాత్ర మపి కాన్త ముజ్ఝితుం కాతరా శఫరశఙ్కినీ జహౌ "

సుభాషితావళిలోనితనిశ్లోకము లిట్టివెన్నో కనఁబడుచున్నవి. వాటినిబట్టి యితఁ డొకకావ్యము రచియించియుండు నని తోఁచకపోదు గాని, యదిమాత్రము మృగ్యమే. అందలివే మఱిరెండు మూఁడు:—

" నిద్రానిమీలితదృశో మదమన్థరాయా
నాప్యర్థవన్తి నచ యాని నిరర్థకాని,
అద్యాపి మే మృగదృశో మధురాణి తస్యాః
తా న్యక్షరాణి హృదయే కిమపి ధ్వనన్తి "

" దయితా బాహుపాశస్య కుతో உయ మపరో విధిః,
జీవయ త్యర్పితః కంఠే మారయ త్యపవర్జితః "

ఈక్రింది శ్లోకములు నరసింహరూపమున నున్న శ్రీవిష్ణువునఖములు మిమ్ము రక్షించుఁగాక యన్నయాశీర్వాదము తెలుపుచు నొక కృతిలోనివిగా నగపడుచున్నవి.

"దైత్యారి పంజరవిదారణ లబ్ధరంధ్ర, రక్తాంబునిర్ఝరసరిద్ఘనజాతపంకాః,
కాలేందుకోటికుటిలా స్సకచంచుభాసో, రక్షన్తు సింహవపుషో నఖరా
హరే ర్వః"

" ఆదిత్యాః కిం దశైతే ప్రలయభయకృతః స్వీకృతాకాశదేశాః,
కిం వోల్కామండలాని త్రిభువనదహనాయోద్యతా నీతి భీత్యై,
పాయాసు ర్నారసింహం వపు రమరగణై ర్విభ్రభత శ్శార్ఙ్గపాణేః,
దృష్ట్వా దృప్తాసురోరస్థలదరణగళద్రక్తరక్తా నఖా వః "

# హర్షదేవుఁడు

అనంతరాజుపౌత్రుఁడు భువనమతీ కలశభూపతిపుత్రుఁడు నైన యీరాజకవి శా. ౧౦౧౦ లో కాశ్మీరరాజ్యసింహాసన మధిష్ఠించెను. ఇతఁడును తండ్రితాతలవలెనే త్యాగి, కవిబాంధవుఁడు. కాశ్మీరమునుండి వెడలిపోయిన బిల్హణకవి యితనిఘనతను, ఔదార్యమును విని యీక్రిందివిధముగా విచారించె నని రాజతరంగిణి చెప్పుచున్నది.

" త్యాగినం హర్షదేవం స శ్రుత్వా సుకవిబాంధవమ్,
బిల్హణో వంచనాం మేనే విభూతిం తావతీ మపి "

ఇతఁడును దుర్వ్యసనలోలుఁడై రాజధర్మములకు విరుద్ధముగా ప్రవర్తించినవాఁ డని రాజతరంగిణి చెప్పుచున్నది. సుగళా వసన్తలేఖా దిల్హాదేవ్యాదిభార్య లున్నను పరస్త్రీలను చెఱుచుటలో నితఁడు తండ్రిని మించినవాఁడు. దేవతావిగ్రహముల నూడఁబెఱికించి దేవాలయములను పాడుచేసిన మతద్వేషి. దానశీలుఁ డైననేమి? యితరులద్రవ్యము నపహరించుటలో నితఁడు మేటి. విద్యావంతుఁ డైననేమి? వివేకహీనుఁ డన్నపేరొందినవాఁడు. భృత్యపోషకుఁ డైననేమి ప్రజాహింసకుఁడు. ప్రజానురంజకులు భాషాపోషకులు శ్రుతిస్మృతివిహితవర్తనులు నైన రాజులతో వెలసినకాశ్మీరము క్రమక్రమముగా దుర్నీతు లైనకౄర ప్రభువులపాల్పడిన దనుటకు నిట్టి కొందఱిచర్యలు నిదర్శన మగుచున్నవి. అట్లని యితనియందు కొన్నిసుగుణములు లేకపోలేదు. సంగీతమునఁ దండ్రిని మెప్పించినగానకలాకోవిదుఁడు. సాహిత్యమున బిల్హణునిస్తుతికి పాత్రమైన విద్వాంసుఁడు. విక్రమాంకదేవచరితమున, కలశభూపతి జ్యేష్ఠతనయుఁ డగుసీహర్షుఁ డిట్లు వర్ణింపఁబడెను.

" యస్య ప్రేయాన్ ప్రథమతనయః కం న చక్రే సహర్షం,
శ్రీహర్షా దప్యధికకవితోత్కర్షవాన్ హర్షదేవః,

తీక్ష్ణః స్వస్మిన్ కనకవలయే యేన చక్రే రణేషు
క్ష్మాభృచ్చూడామణికషణతః కుంఠధారః కుఠారః ”

పెక్కుభాషలలో నైపుణ్య మార్జించినయితని విజ్ఞానమును బిల్హణుఁడు వర్ణించినట్లే యితనికొన్ని సుగుణములను కల్హణుఁడును వర్ణించియున్నాఁడు. కవిగాయకు లెందఱో యితనివితరణమున సంపన్నులై సుఖించి రనియు నితనియొద్ద నెందఱో నృత్యకల నభ్యసించి రనియు నితనిసభ యింద్రసభవలె నుండెడి దనియు నతఁడు కావించిన వర్ణనలు తెలుపుచున్నవి. ఇతఁడు రచియించినగీతము లాకాలమున గాయకులు పాడుచుండెడివారఁట. అవి యేమయినవో! బహుభాషలలో కవిత చెప్పఁ యితనికావ్య మొకటికూడఁ గనరాదు. ఇతని విద్యావివేకశౌర్యధైర్యాదులను వర్ణించుచు నితనియాస్థానములో శంభుకవి రచియించిన రాజేంద్రకర్ణపూర మొకటియే యితనిప్రాభవము తెలుపను కాధార మైనది. ఉత్కర్షుఁడు విజయమల్లుఁడు నను వారితని సవతి తమ్ములు. వీరిలో రెండవవాఁడు గొప్పవిద్యావంతుఁ డని రాజతరంగిణి చెప్పుచున్నది. అతని కృతియుఁ గనరాదు.

## శంభుకవి

ఇతఁడు కాశ్మీరీయుఁడు శివభక్తుఁడు గొప్పవిద్వత్కవి. క్రీ. ౧౦౧౦-౧౧౦౨వరకుఁ గాశ్మీర మేలినహర్షదేవునిసభలోని వాఁడు. అతని చరితమును వర్ణించుచు రాజేంద్రకర్ణపూర మనుచిన్నకావ్యము రచియించెను,

“ సద్వీపాం చ భువం బిభర్తి హి భుజః శ్రీహర్షపృథ్వీభుజః ”
“ జీయా దేకస్త్వవనవయశశ్శస్వర్ణశాణః కృపాణః ”
“ కాన్తౌ కావ్యరతౌ మతౌ రిపుహతౌ కీర్తౌ చ య స్తే సమః ”
“ య త్రాగచ్ఛతి గోచరం నయనయోః కాశ్మీరమీనధ్వజః ”

ఇత్యాదిగా నీకలశభూపతిపుత్రుఁడైన హర్షదేవుని ధైర్యశౌర్యసౌందర్యాదు లిందత్యుక్తిగా వర్ణింపఁబడినవి. ధారానగరాధీశుఁడు ముంజుఁడు గతించినాఁడని విచారించకు. అతనిసుగుణములమూర్తియైన హర్షదేవుఁడు నీయెదుటనే యున్నాఁడనుచు నీకవి సరస్వతిని ట్లూఱడించెను

"కిం త్వాన్తాః కిమనిర్వృతిః కిమధృతి ర్వాగ్దేవి! ముంజే గతే,
కిం శూన్యాసి కిమాకులాసి కిమితి క్లాన్తాసి కోఽయం క్రమః?
ఏతం విద్ధి తమేవ సాస్య హి మతి స్సా విక్రమతి స్సా ద్యుతిః,
స త్యాగ స్స నయస్ససూక్తిషు రస స్తా స్సమ్మతా స్సంపదః"

ఇందలివిషయము రాజస్తవమే కాని కల్పనలు వర్ణనలు మాత్రము ప్రబంధోచితములై మనోహరముగా నున్నవి. ఈ ౭౪ శ్లోకములకావ్యము రాజులందఱికిని కర్ణపూర మఁట.

"హేరాజానః ప్రకృతిసరళై శ్శాంభవై రేవ సూక్తై,
ర్వ్యక్తః కర్తుం భవతి భవతాం కేవలం కర్ణపూరః"

ఇతని రెండవకృతి అన్యోక్తిముక్తాలత యను ౧౦౮ శ్లోకముల కావ్యము. [illegible]భావగర్భనిర్భర మైనయిది లోకజ్ఞానదాయకముగా నున్నది. కవితాశైలి యింకను శ్రుతిరమ్య మైనది. దీనిలో నెందును తనపోషకుని స్మరింపలేదు. కారణమేమో! రుచి కిందలి దొకటి:—

"సత్యం సన్తి కియన్తి సన్తి న సఖే రత్నాని రత్నాకరే?
సంజాత స్తు స వస్తుతః స్తుతికథాపాత్రం పరం కౌస్తుభః,
యో జాత స్స్మర కేళిలోలకమలాసోల్లాసదోః కందళీ
లీలాలింగనభాజనం భగవతో వక్షస్స్థలే శార్ఙ్గిణః"

## ఆనందుఁడు

పూర్వోక్తశంభుకవిపుత్రుఁడైనయితఁడు విద్వత్కవియై గొప్ప యాలంకారికుఁడై దేశదేశముల సంచరించి ఖ్యాతి గాంచినట్లు సూచన

లగపడుచున్నవి గాని యితనికృతి యేదియు గోచరించలేదు. మంఖకకవి తన శ్రీకంఠచరితములో నితని నిట్లు ప్రశంసించియున్నాఁడు. దీనినిబట్టి యీశంభుతనయుఁడు వైద్యులలో శ్రేష్ఠుఁడనియు శాస్త్రపద్ధతికి నిలయుఁడనియు తెలియుచున్నది.

“ అశేషభిషగగ్రణ్యాం శరణ్యాం శాస్త్రపద్ధతేః,
వవన్దే ధీర మానందం సుతం శంభుమహాకవేః ”

ఇతనిశ్లోకములు సుభాషితావళ్యాదులలో కొన్ని కలవు, ఇతఁడు తనతండ్రికి కూడా సమన్వయించునట్లు కవివాక్కులను ప్రశంసించుట యిట్లు కనవచ్చును.

“ పుంసా మేక మఖండనం పున రిదం శంభో ర్మతే మండనం,
య న్నిష్పీడితపార్వణేందుశకలస్యందోపమా స్సూక్తయః ”

## బిల్హణకవి

ఇతని యుదంతము నితనివిక్రమాంకదేవ చరితము కడపటి శ్లోకము లిట్లు తెల్పుచున్నవి.

“కాశ్మీర దేశమునందు ప్రవర మనునగరము కలదు. దానికి మూఁడుక్రోసులదూరమున జయవనగ్రామమునకు దగ్గఱగా ఖోనముఖ మనెడియూ రున్నది. అందు గోపాదిత్యమహీపాలుఁడు మధ్యదేశము నుండి రావించి నిలిపిన బ్రాహ్మణోత్తములు కలరు. వారు కౌశిక గోత్రులు శ్రౌతస్మార్తకర్మాచరణపరాయణులు. వారిలో వేదవేదాంగ వేత్తయగుముక్తికలశుఁ డనుపండితునికి రాజకలశుఁ డుదయించెను. అతనికి మహాభాష్యవ్యాఖ్యాత యగుజ్యేష్ఠకలశుఁడు పుట్టెను. అతనికి నాగాదేవియందు బహురాజసమ్మానితుఁ డైనయిష్టరామకవి కవితానిలయుఁడైనయానందకవి సర్వవిద్యాపారంగతుఁ డైనబిల్హణకవి-అనుముగ్గురు జనించిరి, వారిలో బిల్హణుఁడు బాల్యముననే సంస్కృతవాఙ్మయ

పారంగతుఁడై యౌవనమునం దనఁగా, అనంతరాజుతనయుఁడు కలశదేవుఁడు కాశ్మీర మేలుచున్నసమయమున దేశసంచరణకుతూహలమున గాశ్మీరదేశము విడిచి, మథురాబృందావన కాన్యకుబ్జ కాశీ ప్రయాగాయోధ్యా దాహల గూర్జర సోమనాథపురాదులు సంచరించి యందలి రాజులసత్కారము లంది తుదకు దక్షిణదేశమందలి చాళుక్యులరాజధాని యగుకల్యాణపురముఁ జేరి, చాళుక్యవంశభూషణుఁడు కర్ణాటదేశపాలకుఁడు కుంతలేంద్రుఁడు పార్మాడిభూపతియు త్రిభువనమల్లుఁడను బిరుదనామము కలవాఁడు నైన ఆహవమల్లునాస్థానము చేరి, అతనివల్ల విద్యాపతిబిరుదమును ధనకనకాదిసత్కారములు నంది, యతనినందనుఁడైన విక్రమాంకదేవుఁడు రాజ్యమునకు వచ్చువఱకు నందే యుండి, యాదేవుచరితమును మహాకావ్యముగా నిర్మించెను.

మఱియు, నీకృతివల్లను మఱికొన్నికృతులవల్లను మఱికొన్నివిశేషములు మన కిట్లు తెలియుచున్నవి—ఇతఁడు శా. ౯౪౦ ప్రాంతమున జన్మించినవాఁడు. అనంతరాజు కాశ్మీర మేలుట యెఱుఁగును. ఆయాస్థానకవులను తన బాల్యమున చూచినవాఁడే. శా. ౯౮౬లో తండ్రివలన రాజ్యము గ్రహించినకలశభూపతి సభలో నుండఁదగినవయస్సును విద్యాసామర్థ్యమును గలిగినను, ఏకారణముననో యం దుండుట సంభవించ లేదు. అందుచే నితఁ డితరదేశరాజులసత్కారము లందునభిలాషతో దేశదేశములు సంచరించి, శా. ౯౯౨ ప్రాంతమున అణహిలపురము రాజధానిగా దాహలదేశ మేలినభీమదేవసూనుఁ డగుకర్ణరాజు నాదరసత్కారము లందెను. అతఁడు నాయకుఁడుగా కర్ణసుందరీనాటిక నిర్మించెను. విఖ్యాతమహారాజకవి యగుభోజరాజును తాను చూడ లే దని చెప్పినదానినిబట్టి యాభోజునిరాజ్యసమాప్తినాఁటికి సుమా రిరువదియేండ్లవాఁ డైనయితఁడు కాశ్మీర మింకా విడిచి రాలే దని తోఁచుచున్నది. ఇది యిట్లుండ నితఁడు శా. ౧౦౦౨లో అనంతరాజు విజయక్షేత్రమున

మృతి నొందినవార్త విన్నాడు. శా. ౧౦౧౦లో అతనిమనుమఁడు కల
శభూపతిపుత్త్రుఁడు హర్షదేవుఁడు రాజయినవార్త విన్నాఁడు. ఆహర్షుఁడు
కవిబాంధవుఁ డన్నమాట బిల్హణుఁడు విన్నాఁడని రాజతరంగిణి చెప్పు
చున్నది[1]. అందుచే నీకవి చిరకాలజీవియై శా. ౧౦౩౦ ప్రాంతమున
దివంగతుఁడై యుండును.

## కింవదంతి

కొందఱు మహాకవులను పట్టుకొన్నకథలవంటికథ యొకటి యిత
నిని చుట్టుకొన్నది. అది గ్రంథరూపమునఁ దాల్చినది. గూర్జరదేశరా
జైనవైరిసింహునికూఁతు రగుశశికల లేక చంద్రలేఖ యనుసుందరాంగి
నితఁడు కామించినట్లును. రాజావిషయ మెఱిఁగి యితనికి శూలారోపణ
శిక్ష విధించినట్లును, అప్పుడుకూడ నితఁడు "అద్యాపి తాం కనకచంపకదా
మగౌరీ" మిత్యాదిగా నారాచకన్నెనే స్మరించుచు నేఁబదిశ్లోకములు
చెప్పినట్లును, తుదకు రాజు నిజ మెఱిఁగి యాశిక్ష తప్పించి తనకూఁతుర
నితని కిచ్చి పెండ్లి గావించినట్లు నుత్తరదేశమందు వ్యాపించినబిల్హణ
చరిత్ర చెప్పుచున్నది. ప్రధానవిషయము సమానమే కాని, యామినీ
పూర్ణతిలక యనురాచకన్నె కితఁడు చదువు చెప్పుచుండ దైవికముగా
నిరువురి కనురాగ మంకురించినట్లు దక్షిణదేశములోని బిల్హణీయము
చెప్పుచున్నది. కాని, యీకథయు నితని కారోపింపఁబడినయాపంచా
శికయుఁ గూడ నమ్మరానివే. పెక్కండ్రుకవుల నిట్టికట్టుకథలు చుట్టుకొ
నుట మన మెఱిఁగినదే. అది గాక, ఇతని నాదరించినయణహిలపురరా
జైనకర్ణభూపతి శా. ౯౮౦ ప్రాంతమువాఁడు. అతనిపూర్వపురుషుఁ

1. కాశ్మీరేభ్యో వినిర్యాంతం రాజ్యే కలశభూపతేః,
విద్యాపతిం యః కర్ణాటశ్చక్రే పర్మాడిభూపతిః,
త్యాగినం హర్షదేవం స శ్రుత్వా సుకవిబాన్ధవమ్,
బిల్హణో వంచనాం మేనే విభూతిం తావతీ మపి,, రాజత-౭

డైనవైరిసింహుఁడు శా. ౯౭౦ ప్రాంతమువాఁడు. తనకు నూఱేండ్ల పూర్వమున్నయీ రాజుకూఁతురి నితఁడు కామించుట యసంభవముగదా! అతనిపౌత్త్రుఁ డీనైరిసింహుఁ డన్నవాద మొకటి లేకపోలేదు గాని, రాజ వంశక్రమమునుబట్టి యదియును పొసఁగకున్నది. కాని, యిది నిజము గాగ పోయినా, చోరపంచాశిక యితనిది గాకపోయినా అందలి యీక్రిం దిశ్లోకము వధ్యస్థానమున నున్నయీబిల్హణుఁడు చెప్పినదిగా వాడుక మాత్రము మిగిలినది.

"పంచత్వం తను రేతు భూతనివహాః స్వాంశా మిలన్తు ధ్రువం,
ధాత స్త్వాం ప్రణిపత్య సాదర మిదం యాచే నిబద్ధాంజలిః,
తద్వాక్షు పయ స్త్వదీయముకురే జ్యోతి స్త్వదీయాంగణే,
వ్యోమ స్వాచ్ఛ తదీయవర్త్మని ధరా తత్తాళవృంతే ఽనిలః"

ఇతఁడు విక్రమాంకదేవునిదయవలనఁ జాలాకాలము సకల సుఖము లనుభవించియుఁ దుద కతనికోపము వలనఁ గష్టములపా లయి నట్లు పైచరిత్రలోని తుదిశ్లోక మొకటి చెప్పుచున్నది. కాని, యిదియు నిట్టివి కొన్నియుఁ బ్రక్షిప్తములేమో యని తోఁచుచున్నది.

" సర్వస్వం గృహవర్తి కుంతలపతి ర్గృహ్ణాతు తన్మే పునః
భాండాగార మఖండ మేవ హృదయే జాగర్తి సారస్వతం,
రేక్షుద్రా స్త్యజత ప్రమోద మచిరా దేష్యన్తి మన్మందిరం
హేలాందోళితకర్ణతాలకరటిస్కంధాధిరూఢశ్రియః "

దీనినిబట్టి అసహనశీలు రైనరాజసన్నిధానవర్తు లితనిపై నేవో కొండెములు చెప్పి రాజునకు ద్వేషము పుట్టింపఁగా నతఁ డితని సొత్తం తయు స్వాధీనము చేసికొన్నాఁడేమో యనియు, తోఁచుచున్నది. ఏమని నిర్ణయింపఁగలము?

మార్గమధ్యమున గూర్జరదేశీయులపరిచయము తనకు సంతాపము గలిగించినట్లును, అది సోమనాధపురముఁ జేరఁగానే యంతరించినట్లు నీక్రిందివిధముగా విక్రమాంకదేవచరితములోఁ దెల్పియున్నాఁడు.

" కర్ణాబంధం విదధతి న యే సర్వ దై వావిశుద్ధాః
తద్భాషన్తే కిమపి భజతే యజ్జుగుప్సాస్పదత్వం
తేషాం మార్గే పరిచయవశా దార్జితం గూర్జరాణాం
య స్సంతాపం శిథిల మకరోత్సోమనాథం విలోక్య "
" సాంద్రై ర్వేదధ్వనిభి రనభివ్యక్తమంజీరనాదా,
మౌంజీబంధా త్ప్రభృతి వదనే యస్య వాగ్దేవ తాసీత్ "

ఇత్యాదిగానాత్మప్రశంస కావించుకొని యున్నాఁడు. కాని, తక్కినకృతు లేవో తెలియని వటులుండ మొన్నమొన్నబయటికి వచ్చిన యితని కర్ణసుందరీనాటికకూడా పాఠకుల నాకర్షించి యుండలేదు. ఒకవిక్రమాంక దేవ చరితమే యితనియుత్తమ కవిత్వ ప్రశస్తికి మూల మనవచ్చును.

కువలయానందమునం దాక్షేపాలంకారమున కుదాహరింపఁబడిన యీక్రిందిశ్లోకము లితని వైదుష్యకవిత్వవిశ్వాసము తెలుపుచు సరస ముగా నున్నవి:—

" సాహిత్యపాథోనిధిమంథనోత్థం, కర్ణామృతం రక్షత హేకవీంద్రాః,
య త్తస్య దైత్యా ఇవ లుంఠనాయ, కావ్యార్థచోరాః ప్రగుణీభవన్తి"
" గృహ్ణన్తు సర్వే యదివా యథేచ్ఛం, నాస్తి క్షతిః క్వాపి కవీశ్వరాణాం,
రత్నేషు లుప్తేషు బహుష్వమర్త్యై, రద్యాపి రత్నాకర ఏవ సింధుః "

కర్ణసుందరీనాటికచివర, గ్రంథకర్తప్రశస్తిలో నీక్రిందిశ్లోకము లున్నవి- ఇందు మొదటిది భరతవాక్యము:—

" హేలాభ్యస్తసమస్తశాస్త్రగహన స్సాహిత్యపాథోనిధి
క్రీడాలోడితపండితః ప్రియతమ శ్శృంగారిణీనాం గిరామ్,
ఏకైకేన దినేన నిర్మితమహాకావ్యాది రవ్యాహత
ప్రాగల్భ్యస్థితివిశ్రుతః స్థిరమతిః పార్శ్వే విదగ్ధః కవిః "

ఇందలివైదుష్య మంగీకార్యమే కాని, ఆదివస్సైకనిర్మిత గ్రంథము లేమైనవో!— వాల్మీకివ్యాసకాళిదాసాదులు పెంచినబిల్హణుఁడనుకల్పద్రుమము పుష్పించి ఫలించిన దని యిట్లు వర్ణించుకొన్నాఁడు.

"యన్మూలం కరుణానిధి స్స భగవాన్ వల్మీకజన్మా మునిః,
యస్స్యైకే కవయః పరాశరసుతప్రాయాః ప్రతిష్ఠాం దధుః,
సద్యో యః పథి కాళిదాసవచసాం శ్రీబిల్హణ స్సో ఒధునా,
నిర్వ్యాజం ఫలిత స్సహైవ కుసుమోత్తంసేన కల్పద్రుమః"

కుంకుమకేసరములకు సహోదరము లైనకవితావిలాసములు కాశ్మీరదేశమువారికి తప్ప నితరులకు సంభవింప వని జన్మస్థలాభిమాన మిట్లు వెల్లడించినాఁడు. ఈశ్లోకము విక్రమాంకదేవచరితములో కూడా ఉన్నది.

"సహోదరాః కుంకుమకేసరాణాం,
భవన్తి నూనం కవితావిలాసాః,
న శారదా దేశ ...నాప్య దృష్ట,
స్తేషాం య దన్యత్ర మయా ప్రరోహః"

అవి యన్నియు నితని వగునో కావో నిరూపింపలేము గాని, యితనిపేర నెన్నో శ్లోకములు సంకలనగ్రంథములలో నున్నవి. అందలి వొకటిరెండు. ఈక్రిందిది శివస్తుతియేకాని, ముద్రితబిల్హణస్తవములో నిది లేదు.

"క్వా ప్యగ్నిః క్వ చిదద్రిభూ ర్నరశిరఃకీర్ణా క్వచి న్నిమ్నగా?
రూక్షా క్వాపి జటా క్వచి ద్విషధరా రౌద్రం విషం కుత్రచిత్?
ఈదృగ్భూతగణై ర్వృతో మమ చితాభస్మార్చికిమ్మారితః
సంసారం పరిముచ్య యాతు రపునర్యోగాయ పంథా శ్శివః"

ఇది కర్ణాటరాజుసభకు వెళ్లినపుడు చెప్పినప్రాస్తావికశ్లోకము.

" మాగాః ప్రత్యుపకారకాతరతయా వైవర్ణ్య మాకర్ణయ,
శ్రీకర్ణాటవసుంధరాధిప! సుధాసిక్తాని సూక్తాని నః,
వర్ణ్యన్తే కతి నామ నార్ణవనదీభూగోళవింధ్యాటవీ
ఝుంఝూమారుతచంద్రమఃప్రభృతయ స్తేభ్యః కి మాప్తం మయా!

ఇది సత్కారసంతుష్టుఁడై చెప్పినట్లున్నది.

" కతిషు న కృతా సేవా? కేవా న వాగ్విభవై స్తుతాః?
తృణమపి గుణగ్రాహీ ప్రాదా న్నకోఽపి విపశ్చితామ్,
అయ మిహ పరం దుఃఖజ్వాలాకలాప మఖండయత్,
కనకపయసాం ధారా దండై రకాండఘనాఘనః

ఈతనిశివభక్తిని దెలుప బిల్హణస్తవములోని దొకటి—

" సర్వేషాం హృది విద్యసే శివ తత స్త్వద్ధ్యానయోగేన కిం,
విశ్వ స్యోపరి వర్తసే యది తదా త్వత్పాదమూలేన కిం,
త్రైలోక్యం త్వయి లీయతే యది తదా త్వత్ప్రాప్త్యుపాయై రలం
సత్య ప్యాయతనే తనో కి మపరం దైవం న రోచిష్యతే "

ఈక్రిందిది విక్రమాంకదేవచరితలోనిది.

" మృగీసంబన్ధినీ దృష్టి రసౌ యది న సుభ్రువః,
ధావతి శ్రవణో త్తంసలీలాదూర్వాఙ్కురే కుతః?

పైకథ లూరకే పుట్ట వనుకొంటే, యితఁడు యౌవనమున సవిలాసవిహారి యనియు, వార్ధకమున వేదాంతజ్ఞాని యనియు నమ్మదము. ఇతఁడు శివభక్తుఁ డగుట సత్యము:—

## మల్హణుఁడు

ఇతఁడు కాశ్మీరీయుఁ డని పేరు చెప్పుచున్నది. ఏనాఁటినుండిచేసూఁ దేశ మెల్లెడ వ్యాపించియున్న యీక్రింది చాటుశ్లోక మితఁడు బిల్హణునిసమకాలమువాఁ డని యూహింప నవకాశ మిచ్చినది.

" బిల్హణో మల్హణ శ్చేతి ద్వౌ వేతౌ సరసౌ కవీ,
తయో స్తు బిల్హణో నామ కవిరా ఖ్యాయతే బుధైః "

ఇతఁడు పుష్పగంధి యను వేశ్యకుఁ జిక్కి నిర్ధనుఁడై తుదకు దాని యుపదేశమువల్లనే విరక్తుఁడై శివభక్తుఁ డయ్యె నని శైవసంప్రదాయమున నొకకథ కలదు. ఇతఁడు నిర్మించిన దొకమల్హణస్తవమే కనవచ్చుచున్నది. అందలి మొదటి శ్లోకమున దానిపేరు వచ్చునట్లుగా నీక్రింది విధముగా శివస్తుతి చేసె నఁట—

" కాంతాకచప్రచయపుష్పసుగన్ధిగంధ
లుబ్ధభ్రమద్భ్రమర కర్బుర కంధరాయ,
గంధర్వయక్షసురసిద్ధకిరీటకోటి
సంఘట్టఘృష్టచరణాయ నమ శ్శివాయ "

కాశ్మీరదేశ సరస్వతీపీఠము నుపాసించు సువర్ణభట్టారకుఁ డను శివార్చకునికుమారుఁ డీమల్హణుఁ డని చెప్పుదురు. ఆకాలమునకు మున్నే కాశ్మీరమున శైవమతము వ్యాపించియున్నది. పాశుపతశైవసూత్రములకు వ్యాఖ్య యచ్చటనే పుట్టినది. అట్టిశైవదర్శనమును నిరాకరించుచు కొందఱు మాహేశ్వరులు ప్రత్యభిజ్ఞాదర్శనము నచ్చోటనే లేవనెత్తి యున్నారు. అందుచే శైవుఁడైనమల్హణుఁ డాకాశ్మీరమందే నివసించినవాఁడనుట కిది కూడ నొకహేతువు కావచ్చును.

ఇతఁడు సంస్కృతసాహిత్యమున విశేషపరిశ్రమచేసినవాఁ డని యితనికవితయే చాటుచున్నది. పైచాటుశ్లోకమునుబట్టి బిల్హణునినాఁటి వాఁ డని నమ్మినచో నితఁడు శా. ౧౦౦౦ ప్రాంతమువాఁ డని విశ్వసింపవచ్చును. శైలి తెలియుట కింకొకశ్లోకము:—

" మాయాప్రపంచరచనా చతురా సమస్త
వస్తుప్రభేదభిదురా శివ సర్వకర్త్రీ
సంసారపాశవిషమచ్ఛిదురా నరాణాం
మోహాంధకారభిదురా చ తవైవ శక్తిః,

ఈకవి వీరశైవుఁ డనుటకు పాల్కురికిసోమనాథుఁ డితనిని స్తుతించుట యొకకారణము. మఱియు నతనినాఁటి కవి యగు విశ్వారాధ్యుఁ డీమల్హణాస్తవమునకు వ్యాఖ్య వ్రాయుట మఱియొక కారణము. వీరిద్దఱును శా. ౧౧౦౦ ప్రాంతమువారు. అందుచే వారికి పూజ్యు లయిన పూర్వశైవాచార్యులలో నొకఁ డగుమనకవి పూర్వోక్త కాలమున నున్నవాఁడనుట యసంగతము కానేరదు. పుష్పదంతుని మహిమ్నస్తోత్రమువలెనే యిదియు భక్తలోకమున నెక్కువగా వ్యాపించినది. అందును కర్ణాటదేశమున దీనివ్యాప్తి హెచ్చు.

## మాయిదేవుఁడు

ఇతఁ డొకవీరశైవకవి. శా. ౯౭౦-౧౦౨౦ నడుమ నున్నవాఁడు. కర్ణాటకుఁడు, ఐపురమందలి సోమేశ్వరలింగమును స్తుతించిన యితఁ డాపురమువాఁ డని తోఁచుచున్నది. అది మైసూరురాష్ట్రములోనిది. శా. ౧౦౫౦ ప్రాంతమున ద్వారసముద్రము పరిపాలించిన నరసింహబల్లాళుని యాస్థానమంత్రి కెరెయపద్మరసు. అతనివంశములోని పద్మణాంకకవి శా. ౧౩౦౦ ప్రాంతమున పద్మరాజపురాణ మను పేర నాపద్మరసుచరితము వర్ణించుచు నతఁడు మాయిదేవునికొడు కని వర్ణించియున్నాఁడు, కావున పైకాలము సముచిత మగును.

ఈకవి శివానుభవసూత్రము విశేషార్థప్రకాశిక యను రెండుకృతులు నిర్మించెను. ఇవి ముద్రితము లైనవి. శివయోగిశివాచార్యునివలె నితఁడును మొదటిదానిలో షట్స్థలములను విశదీకరించుచు లింగమాహాత్మ్యమును వెల్లడించెను.

"ఇష్టలింగతు బాహ్యాంగే ప్రాణలింగం తథాంతరే,
భావలింగం తథై వాస్మి న్నాత్మాంగే సుప్రిష్ఠితమ్"

"సాక్షాల్లింగే శివాఖ్యే సవినయ మవధానాత్మికా భక్తియుక్తో
దశిష్టవ్యాంశం సమ ర్ప్యార్పణవినిహితరూపం ప్రసాదం భజేత"
విశేషార్థప్రకాశికలో భక్తి యిట్లు వివదీకరింపఁబడినది.
"భక్తి ర్విశిష్టా వివిధా క్రియాపరా, విద్యాత్మికా విశ్వవిమోహహారిణీ
విశ్వాసినీ విశ్రుతవీరశాంభవీ, విశ్రామభూమి ర్విమలా విరాజతే"
ఇట్టిశైవకవుల మతగ్రంథములకు విశేషవ్యాప్తి కలుగ లేదు.

## కృష్ణమిశ్రుఁడు

ప్రబోధచంద్రోదయ మనునాఱంకముల యుత్తమనాటకము రచియించి భాషాభిజ్ఞులకు ప్రబోధచంద్రోదయము కలిగించిన యీ మహావిద్వాంసుని నాటకప్రస్తావనలోని మాటలనుబట్టి — ఈకవి గోపాలమంత్రి కానందసంధాయకముగా దీనిని రచించి నట్లును, అతఁడు తనమిత్రుఁడును చంద్రవంశరాజు నగుకీర్తివర్మమూర్ధాభిషేకసమయమున దీనిని బ్రయోగింపఁజేసినట్లును తెలియును — దీనికి వ్యాఖ్య వాసిఁగినఘనశ్యాముఁడు చేదిపతి యైనకర్ణరాజు నోడించి మరల నతనికి రాజ్య మిచ్చినగోపాలమంత్రి పరశురామునివంటి బ్రాహ్మణవీరుఁ డని తెలిపియున్నాఁడు. కీర్తివర్మ శా. ౧౦౨౦లోనున్న వాఁ డని దేశచరిత్ర చెప్పుచున్నది.

జయదేవుని గీతగోవిందమునకు రసమంజరి యనుటీక నిర్మించిన శంకరమిశ్రుఁడు త న్నాదరించినశాలినాథు నెక్కువగా నభివృద్ధికి తెచ్చినహరిశంకరుని వర్ణించుసందర్భమున నతనివంశమునకు మూలపురుషుఁ డైనప్రబోధచంద్రోదయకర్త కృష్ణమిశ్రుఁడు "గౌతమగోత్రుఁడు బ్రహ్మవేత్త కళివారదేశమున విఖ్యాతి గన్నవాఁ" డనియు, నాఁటి దుష్టుల నణఁచి ఢిల్లీపతిని సంతోషపెట్టి కళివారమునకు ప్రభు వైనస

తేజుఁ డనువీరబ్రాహ్మణోత్తముఁ డతనివంశమునఁ బుట్టినవాఁ డనియుఁ జరిత్రాంశము లెఱిఁగించెను. కశివారము నిట్లు వర్ణించెను.

" జాగర్తి స్మరవైరిపత్తన మధిక్షోణీశిరోభూషణం,
దేశ శ్శ్రీకశివార ఇత్యభిహితః స్ఫీతో గుణై రుజ్జ్వలః "

న్యాయసూచీనిబంధన మనుమీమాంసాగ్రంథము రచియించిన వాచస్పతిమిశ్రుఁడు తాను శా. శ. ౮౯౮లో నున్నట్లుగా నిట్లు వ్రాసి కొన్నాఁడు.

" న్యాయసూచీనిబంధో ఽసా వకారి సుధియాం ముదే
శ్రీవాచస్పతిమిశ్రేణ వస్వఙ్క_వసువత్సరే "

ఈవాచస్పతిమిశ్రుని మనకవి ప్రబోధచంద్రోదయములో నిట్లు పేర్కొనియున్నాఁడు.

" నైవాశ్రావి గురో ర్మతం న విదితం తౌతాతితం దర్శనం,
తత్త్వం జ్ఞాత మహో నశాలికగిరాం వాచస్పతేః కా కథా "

దీని నంతనుబట్టి వాచస్పతిమిశ్రునికిఁ బరుఁడును, కీర్తివర్మ విభునికాలము నాఁటివాఁడు నైనకృష్ణమిశ్రుఁడు శా. ౯౭౦-౧౦౪౦ నడుమ నున్నవాఁ డని విదిత మగును.

ఇతనికృతి యాఱంకములనాటకము. ఇందు మతివివేకులు నాయికా నాయకులు. ఇందలి కామక్రోధాదినిరసనము శమదమాది ప్రశంసనము బౌద్ధకాపాలికాదిమత ఖండనము మనోహరములు. కవిత్వ ధార నిరర్గళము రసోదంచితము. ఇందుకు ప్రబోధోదయవచనము:—

"కిం వ్యాప్తం కి ముపోహితం కి ముదితం కిం వా సముత్పాదితం,
స్యూతం కిం ను విలాయితం ను కి మిదం కిం చి న్న వా కించన,
యస్మి న్నభ్యుదితే వితర్క_పదవీం నైవం సమారోహతి
త్రైలోక్యం సహజప్రకాశదళితం సో ఽహం ప్రబోధోదయః "

ఈక్రిందికామవచనము శుష్క_వేదాంతుల వివేకము నిట్లు పరి హసించుచున్నది.

"ప్రిభవతి మనసి వివేకో విదుషా మపి శాస్త్రసంభవ స్తావత్,
నిపతంతి దృష్టివిశిఖా యావ న్నేందీవరాక్షీణామ్"

వేదవేదాంగ వేత్తయు లోకజ్ఞుఁడును విరక్తుఁడు నైనయీమహనీయుఁడు సన్యసించి బ్రహ్మానంద మనుభవించుచు శిష్యుల కధ్యాత్మవిద్య యుపదేశించుచుండ వారిలో నొకఁడు విషయలోలుఁడై శృంగార కావ్యములు చదువుచుండె నఁట. అది కనిపెట్టిన యీగురువరుఁ డతనికి బ్రహ్మవిద్యయం దభిరుచి కలిగింప నెంచి రసభరిత మైనయీనాటకము రచియించి వానిచేఁ జదివింపఁజేసి విరక్తిమార్గమునకుఁ ద్రిప్పెనఁట.

ఈక్రిందిది సర్వమత సారమైన శ్రీద్ధావచనము—

"జ్యోతి శ్శాంత మనంత మద్వయ మజం తత్తద్గుణోన్మీలనాత్,
బ్రహ్మే త్యచ్యుత ఇ త్యుమాపతి రితి ప్రస్తూయతే ఽనేకధా,
తై స్తై రేవ సదాగమై శ్ర్శుతిముఖై ర్నానాపథప్రస్థితైః,
గమ్యో ఽసౌ జగదీశ్వరో జలనిధి ర్వారాం ప్రవాహై రివ"

## జ ల్హ ణ క వి. ౧

ఇతఁడు కాశ్మీరీయుఁడు. సోమపాలవిలాసము ముగ్ధోపదేశము ననురెండుకృతులు నిర్మించినవాఁడు. ఇందు మొదటిదానిలోనినాయకుఁడైన సోమపాలుఁడు సంగ్రామపాలునికొడుకు, రాజపురి నేలినవాఁడు. అతనియాస్థానమున మంత్రిగాను కవిగాను జల్హణుఁడు గౌరవ మందినవాఁడని మంఖుకకవి శ్రీకంఠచరితమునఁ దెల్పియున్నాఁడు.

"శ్రీమద్రాజపురీసంధివిగ్రహస్య నియోగినమ్,
అ థానర్చ వచో భి స్తం జల్హణం వినయాంచితైః"

సుస్సలుఁడు కాశ్మీరరాజుగా నెన్నుకోఁబడిన కాలమందు శా. ౧౦౨౨ ప్రాంతమున సోమపాలుఁడు రాజపురి కేగెను. కావున నతనిమంత్రి యగుమనకవి శా. ౧౦౨౨–౧౦౭౦ నడుమ నతనితో

నున్నవాఁ డగును. ఈవిషయము నీకవియే తనకృతిలో నిట్లు విశదీక రించి యున్నాఁడు.

"సంగ్రామపాలే నృపతౌ తస్మి న్నవసరే మృతే,
తత్సూను స్సోమపాలాఖ్యః పితృరాజ్యం సమాదధే"
"రాజ్యార్ధ మగ్రజం బుద్ధ్వా సో౽భిషిచ్యత చాక్రికైః,
ఇతి కోపా న్నరేంద్రో౽గా త్కృత్య నాగ్రజపురీం ప్రతి"

ఈవిషయమును రాజతరంగిణిలో కల్హణుఁడు విశదపఱచలేదు—

ఈకవి తనప్రభు వైనసోమపాలుని వృత్తాంతమునే సోమపాల విలాసముగా నిర్మించియున్నాఁడు. ఈకృతి యలభ్యమే కాని యిందలి యొకశ్లోకము కావ్యప్రకాశసారసముచ్చయములో నుదాహరింపఁబడి నట్లు తెలియవచ్చుచున్నది.

"మార్గం నిసర్గా దవలంబ్య వక్రం సుధారసౌఘం మధురం వమన్తీ,
చాంద్రీ చమూర్తిః కవితు శ్చ సూక్తి ర్న ధార్యతే మూర్ధని నేశ్వరేణ"

ఇతనిముగ్ధోపదేశము ముద్రితము. ఇది వారాంగన దుశ్చరిత్రము విశదీకరించుచుఁ గాముకుల దుర్వర్తనము మాన్ప నుద్దేశించినది గానున్నది. ఇందలి దొకటి:—

"ఆజీవః కపటానురాగకలయా దోషో న దుశ్శీలతా,
వైధవ్యంచ న బాధతే సదసతో స్సంభావనావ్యత్యయాత్,
య త్కించి త్కరణే పరస్వహరణే వ్రీడా న పీడా కరీ,
నో వా రాజభయం చ హీ బత సుఖం జీవన్తి వారస్త్రియః"

## రామానుజాచార్యులు

ఈమహనీయుఁడు విశిష్టాద్వైతమతోద్ధారకుఁడు మహావిద్వాంసుఁడు దేశప్రసిద్ధుఁడు. మతగ్రంథములే కాక, కొన్ని కావ్యములు నిర్మిం

చినకవీంద్రుఁడు. ఈయనచరితము నెందఱో యెన్నివిధములనో రచియించియున్నారు. అర్వాచీనమతసంస్కర్తలలో నగ్రగణ్యుఁ డైనయీ మహాపురుషునిజీవితసంగ్రహ మిది.

ఇతఁడు చెన్నపురికి దగ్గఱగా నున్నపరమత్తూరు (శ్రీపెరుంబూరు) గ్రామమున శా. ౯౩౯ లో జన్మించె నని బహుమతము. అది కలి ౪౧౧౯— ఈయనతండ్రి ఆసూరి కేశవభట్టరు. తల్లి కాంతిమతి. వీరు హారీతగోత్రులు. శిష్టకులసంజాతులు. ఇతనిమొదటిపేరు లక్ష్మణుఁడు. ఇదే తరువాత లక్ష్మణముని యైనది. లక్ష్మణుఁడు రామునియనుజుఁడు గనుక నితఁడును రామానుజుఁ డని పిలువఁబడెను. అదే స్థిర మైనది. అరవములో నితనిని ఎంబెరుమానా రందురు. ఈయన ప్రసిద్ధవిష్ణుభక్తు డైనఆలవందారుకుమారునిదౌహిత్రుఁడు. ఈయన ఆదిశేషునియవతారమని తరువాతిభక్తలోకప్రతీతి.

ఇతఁ డుపనీతుఁడై కంచిలో యాదవప్రకాశపండితులవద్ద వేదాదివిద్య లభ్యసించి, మతగ్రంథములు పరిశీలించి, శాంకరమతము నిరాకరించుచు స్వమతమును ప్రజలకు బోధింపఁజొచ్చెను. అందున్నచోళరాజు దాని కంగీకరింపక యితని నూరినుండి వెడలఁగొట్టించెను. అంత నితఁడు మైసూరు వెళ్ళి జైనరా జైనవెల్లాలరాయనికూఁతురిరోగము మంత్రశక్తిని కుదిర్చి యతనిని వశ్యుని గావించుకొని వైష్ణవుని చేసి యతనిసాయమున శ్రీవైష్ణవమతము వ్యాపింప సంచార మొనర్చుచు తిరుపతి సింహాచలము మొద లగుక్షేత్రములం దున్నశైవాలయములను వైష్ణవాలయములఁ గావించి తూర్పున జగన్నాథమువఱకు వెడలి తన యుపన్యాసములమహిమచే నందలిపెక్కుమందిప్రజలను స్వమతము నవలంబింపఁజేసి మరలివచ్చి శ్రీరంగక్షేత్రమున స్థిరపడి సన్యసించి జ్ఞాననిష్ఠనుండి భక్తులకు విశిష్టాద్వైతమతతత్త్వము బోధించుచు దేహము చాలించెను. ఆసమయము శా. ౧౦౫౯ అని యందురు. ఎట్టయిన

నీతఁడు నూటేండ్లు పైని జీవించినవాఁ డనుటయు, శా. ౧౦౧౨ లో యాదవాచలముపై విష్ణుప్రతిష్ఠ గావించిన యితఁడు విష్ణుభక్తశూరులలో నగ్రగణ్యుఁ డగుటయు సత్యము.

ఈమతాచార్యుఁడు శ్రీభాష్యగీతాభాష్యవేదాన్తభాష్యములే కాక, నిత్యగ్రంథవేదాంతదీప వేదాంతసార స్తోత్రాదు లనేకములు నిర్మించెను. వానిమాట యటుండ, సారస్వతసేవగా నీయన, వైకుంఠగద్య శ్రీరంగగద్య శరణాగతిగద్యత్రయము నుత్తమశైలిని నిర్మించెను. ఈయనకృతులు చదివి యానందించిన భక్తులు గావించినస్తుతులకు లెక్కలేదు. వేదాంతదేశికులు తమయతిరాజస్తవములో నీయాచార్యు నిట్లు నుతించిరి.

“ ప్రణామం లక్ష్మణమునిః ప్రతిగృహ్ణాతు మామకమ్,
ప్రసాధయతి యత్సూక్తి స్స్వాధీనపతికాం శ్రుతిమ్ ”

ఇంక వేంకటాధ్వరి మొదలగు కవులుగావించిన రామానుజస్తవములెన్నో !— మనయాచార్యుల కవితాశైలి కొకటి:—

“ అఖిలభువనజన్మస్థేమభంగాదిలీలే,
వివిధవినతభూతవ్రాతరక్షైకదీక్షే,
శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే,
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా ”

## మమ్మటభట్టు

కావ్యప్రకాశము నిర్మించినయీపండితాగ్రణి లాక్షణికశిరోమణి యన్నకీర్తి గాంచినవాఁడు. ఇతని కృతికి సుధాసాగరవ్యాఖ్య రచియించిన భీమసేనపండితునిమాటలవల్ల నితనియుదంత మిట్లు కొంత గోచరించినది.

అయం మమ్మటః కాశ్మీరదేశీయో జైయటపుత్త్రః.
వారణాసీ మాగత్య, అధీతశాస్త్రః, అస్య చ మమ్మ
టస్య పతంజలిప్రణీతవ్యాకరణమహాభాష్యటీకా
కర్తా కైయటః-(వేదచతుష్టయ) భాష్యకర్తా ఉవ
టాపరనామాఔవట శ్చేతి ద్వా కనిష్ఠభ్రాతరా "

భోజుఁడు రాజ్యము చేయుచున్నకాలమం దవంతీపురమున నుండి వాజసనేయిమంత్రభాష్యము రచియించినయువటుఁ డానందపుర వాస్తవ్యుఁ డైన వజ్రటునికొడుకు. కావున నామసామ్యమున భ్రాంతి పడరాదు.

ఈమమ్మటుఁడు కావ్యప్రకాశము దశమోల్లాసములో నుదాత్తాలంకారమునకు:—

" ముక్తాః కేళివిహారసూత్రగళితా స్సమ్మార్జనీభి ర్హృతాః,
ప్రాతః ప్రాంగణసీమ్ని మంథరచల ద్బాలాంఘ్రిలాక్షారుణాః,
దూరా ద్దాడిమబీజశంకితధియః కర్షన్తి కేళీశుకాః
య ద్విద్వద్భవనే. భోజనృపతే స్త త్త్యాగలీలాయితమ్ "

అనుభోజవర్ణనము నుదాహరించుటచే నమ్మహారాజునకుఁ దరువాతివాఁడై శా. ౧౦౮౨ లోఁ దనకావ్యప్రకాశమునకు సంకేతాఖ్య వ్యాఖ్య నిర్మించిన మాణిక్యచంద్రునికి పూర్వుఁడై సర్వపరిశోధక సమ్మతముగా శా. ౧౦౦౦-౧౦౫౦ నడుమ నున్నవాఁ డని స్పష్టమగుచున్నది.

ఈవిద్వన్మణి పరికరాలంకారమువఱకే గ్రంథము రచియించె ననియు, తక్కిన చిన్నభాగమును అల్లటసూరి పూరించె ననియు దీనికి నిదర్శన వ్యాఖ్య వ్రాసినయానందకవి తెలిపియున్నాఁడు.

1. రసవక్త్రగ్రహాధీశ-(౧౨౧౬ సంవతు) వత్సరే మాసి మాధవే
కావ్యే కావ్యప్రకాశస్య సంకేతో ఽయం సమర్థితః.

"కృతః శ్రీమమ్మటాచార్యవర్యైః పరికరావధిః
ప్రబంధః పూరిత శ్శేషో విధా యాల్లటసూరిణా"

ఇతనిసాహిత్యజ్ఞాన మనన్యసామాన్యము. సకలశాస్త్రనిష్ణాతుం డగునితని విమర్శనము సహృదయహృదయంగమము. ఇది పుట్టినది మొదలుగా నేఁటిదనుక నొక్కరీతిగా సాహిత్యపిపాసువుల హృదయ మాకర్షించుచునే యున్నది. ఈతనియీకృతి కెందఱో వ్యాఖ్యలు నిర్మించుటయే దీనిఘనతకు నిదర్శనము. వారిలో మహేశ్వరభట్టు చెప్పిన మాట లివి.

" కావ్యప్రకాశస్య కృతా గృహే గృహే
టీకా, తథా ప్యేష తథైవ దుర్గమః
సుఖేన విజ్ఞాతు మిమం య ఈహతే
ధీర స్స ఏతాం విపులం విలోకతామ్"

మమ్మటుఁ డుదాహరించిన పూర్వమహాకవి శ్లోకములసంఖ్య ఆఱువందలు. పూర్వాలంకారికులమతములను నిష్పక్షపాతబుద్ధితోఁ జూచినసమదర్శి యితఁడు. పూర్వకవుల కావ్యములలోని మంచిచెడ్డలను నిష్పక్షపాతముగా నేర్పఱచిన విమర్శకరాజహంస యితఁడు. ఈమహనీయుని మంగళాచరణ కావ్యప్రయోజనబోధకపద్యము లివి.

" నియతికృతనియమరహితాం హ్లాదైకమయీ మనన్యపరతన్త్రాం,
నవరసరుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవే ర్జయతి"
" కావ్యం యశసే ఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే"

దీనికి వ్యాఖ్యలు నిర్మించినవారిలో భాస్కరుఁడు కమలాకరుఁడు తమనాఁటికే టీకలు వందలు వేలు నున్నట్లు క్రమముగా నిట్లనిరి.

" టీకాః కావ్యప్రకాశస్య కామం సంతు పరశ్శతాః,
కావ్యప్రకాశే టిప్పణ్య స్సహస్రం సన్తు యద్యపి"

ఇంతకంటె నీమహాకృతిఘనత తెలియుట కేమి కావలెను.

# శారదాతనయుఁడు

ఆర్యావర్తమునకు దక్షిణభాగమున మేరూత్తర మనేజనపదమం దలిమాఠరపూజ్య మనుపేరు గలగ్రామ మితనినివాసము. ఇతఁడు కాశ్య పగోత్రుఁడు. బహుక్రతువు లాచరించినవాఁడును వేదభూషణ మనుపేర వేదభాష్యము రచియించినవాఁడు నగు లక్ష్మణపండితుఁ డితని ప్రపితా మహుఁడు. ఇతనిపితామహుఁడు కృష్ణయజ్వ తండ్రివలెనే వేదశాస్త్ర పారంగతుఁడు కర్మఠుఁడు మహాదేవభక్తుఁడు. అతఁడు సంతానార్థియై కాశీవిశ్వేశ్వరు నిష్ఠతో నారాధింప నొకకుమారుఁ డుదయించెను. అతనిపేరు భట్టగోపాలుఁడు, మనశారదాతనయునితండ్రి. ఇతఁడు తనభా వప్రకాశావతారికలో స్వవిషయ మొకింత వ్రాసియున్నాఁడు. దానిని బట్టి యీక్రిందివిషయము కూడ తెలియుచున్నది.

భట్టగోపాలుఁడు సంతానము లేక శారదాదేవిని నిరంతర భక్తితో భజింపఁగా నామెయనుగ్రహమున మనకవి యుదయించెను. ఆకారణమున నితఁ శారదాతనయుఁ డన్నపేరు గాంచెను, ఇతఁడు పితృపితామహులమాడ్కి వేదశాస్త్రము లభ్యసించి వైదికధర్మనిర తుఁడై యుండి, యొకచైత్రమాసోత్సవమునాఁ డాతల్లియాలయమున కేగి యచ్చట భావాభినయకోవిదు లగునటు లభినయించుముప్పదివిధ ములరూపకములు చూచి పిదప గర్భాలయముఁ జొచ్చి "అమ్మా! నాకు నాట్యవేద మనుగ్రహింపు మని వేఁడుకొనెను. అపు డాదేవి యానతిని నాట్యశాలాధికారి యగుదివాకరుఁ డనువిప్రుఁడు గౌరీ శంక ర నారద భరతాదులనాట్యమతము లన్నియు నితని కుపదేశించెను. ఆయుపదేశమున దేవి యనుగ్రహమున నితఁడు-భావ భావభేద నాయి కా నాయకభేద శబ్దార్థసంబంధభేద నాట్యభేద నాట్యప్రయోగభేదాది రూపమున దశాధికారములుగా భావప్రకాశన మనుమహాగ్రంథము

నిర్మించెను. ద్వాదశసహస్రి షట్సహస్రి యున్నట్లితఁడు దశరూపాధికారములో చెప్పియున్నాఁడు.

" నాట్యవేదాచ్చ భారతాః సార ముద్ధృత్య సర్వతః,
సంగ్రహం సంప్రయోగార్థం మనునా ప్రార్థితా వ్యధుః,
ఏకం ద్వాదశసాహస్రైః శ్లోకై రేకం తదర్ధతః,
షడ్భిః శ్లోకసహస్రై ర్యో నాట్యవేదస్య సంభవః "

ఇతఁడు తనకృతి రెండవయధ్యాయములో రసమునుగూర్చి చర్చించుచు వాసుకి భరతవృద్ధాదిమతము లెత్తి, విభావాదిభావములచే నభినయములచే చక్కఁగాఁ బోషింపఁబడినస్థాయిభావములే సామాజికులహృదయమున రసాత్మకములై పరిణమించు ననుచు రసస్వరూపము విశదీకరించియున్నాఁడు. ఈ సందర్భమున నితఁ డభినవగుప్త మతమును సవిశేషముగాఁ బరిశీలించి స్వమతము నిరూపించుచు వచ్చినాఁడు. భోజుని శృంగారప్రకాశములోనిమాట లెత్తి యందందు పరామర్శించి యున్నాఁడు. మమ్మటాచార్యుని కావ్యప్రకాశమునకు టీక నిర్మించినాఁ డనియు ప్రతీతి. శా. పన్నెండవ శతాబ్దిలోని కృతికర్తలు కొందఱితనిని స్మరించి యున్నారు. కావున మమ్మటునికించుక పరుఁడైనయితఁడు శా. ౧౦౬౦ పైవాఁ డనవచ్చును. గ్రంథాంతమందున్నయితనిమాట లివి:—

" తేషాం మతై రభిన్నో౽పి భిన్నవస్త్వవిభాసితః,
న స్వాస్థ్యా న్నాపి మాధ్యా చ్చ కో౽ ప్యర్థో నిహితః క్వచిత్;
భట్టాభినవగుప్తార్యపాదప్రోక్తేన వర్త్మనా,
అయం ప్రబంధః కథితః శారదాయాః ప్రసాదతః "

## మలయరాజు

ఈకవి నిర్మించినమలయరాజస్తవము శివపంచస్తవిలో గణన కెక్కియున్నది గావున నీకవి పూర్వుఁ డనవచ్చును. అదిగాక శా. శ.

౧౧౮౮లో నుదయించిన పండితారాధ్యచరిత్రములో నిది యుదాహృత మయ్యెను గావునఁ దత్కర్త యైనసోమనాథకవికి పూర్వుఁ డగునితఁడు శా. ౧౦౫౦ ప్రాంతమువాఁ డగుట నిరాక్షేపము. ఇతని నివాసాదికము సరిగా గోచరింపదు గాని, యితఁడు కర్ణాటకుఁ డని శైవు లందురు. మార్కండేయకథవలెనే శివు నారాధించి దీర్ఘాయు వైన ట్లీకవికథయు శైవలోకమున వ్యాపించి యున్నది. ఇతనిశివ స్తవము ౭౨ ఆర్యావృత్తములలో మనోహరశైలితో విరాజిల్లుచున్నది. స్తుతియు మనసు కరగించును.

"యే నైక మేవ సర్వం ద్వైతేన త్వాం మహేశ! పశ్యామి,
సద్దృష్టిప్రతిబంధం ఛింది మమాజ్ఞానతిమిరం తత్"
"ఉభయ మసంభావ్య మిదం సుఖ మిహ దుఃఖం త్వదాశ్రితే ఽన్యత్ర,
కః శ్రద్ధధాతి తుహినం దహనే దహనం చ శీతాంశౌ!"
"అద్య శ్వోవా మరణం త్రాణం త్వత్తో న మే ఽస్తి గతి రన్యా
భ్రామ్యతి తామ్యతి తృట్యతి ముహ్యతి శుష్యతి చ మమ చేతః"

## శ్రీవత్సాంకుఁడు

ఇతఁడు విద్వత్కుటుంబములోనికవి. వీరి మొదటి నివాసము కంచికి దగ్గఱగా నున్నకూర మనేపల్లెటూరు. కురుత్తాళ్వా రనఁబడే శ్రీవత్సాంకమిశ్రుఁ డితనిపితామహుఁడు. ఆయాళ్వారు కలియుగము ౪౧౪౧లో ననఁగా[1] శా. ౯౬౨లో జన్మించి విష్ణుభక్తుఁడై రామానుజాచార్యులశిష్యుఁడై శ్రీరంగక్షేత్రము చేరి అతిమానుష స్తవము సుందరబాహు స్తవము వరదరాజ స్తవము శ్రీ స్తవము మొద లగుస్తుతికృతులు నిర్మించి గురువున కత్యంతప్రియుఁడై సత్కాలక్షేపము చేసిన

1. కలి ౪౧౧౧, ౪౨౧౩ అని పాఠభేదములు కలవు.

ధన్యాత్ముఁడు. ఆయాశ్వారుద్వితీయపుత్త్రుఁడును వేదవ్యాసుఁ డన్నపేరు గాంచినవాఁడు నగురామపండితునిపుత్త్రుఁడు మనకవి యగుశ్రీవత్సాంకుఁడు. అందుచే నితఁడు శా. ౧౦౨౦-౧౦౮౦ నడుమ నున్నవాఁడనుట విదితము.

అపరపరాశరబిరుదాంకితుఁడైనయీకవి యమకరత్నాకర మనఁబడు పదునాఱాశ్వాసముల పద్యకావ్యము నిర్మించెను. ఇది ముద్రితమైనది. శ్రీకృష్ణుఁడు కంసుని సంహరించుట యిందలికథ. ఆర్యాఛందోబద్ధమైనయీకావ్యము మిక్కిలి గూఢార్థమైనను చదువ నింపుగా నుండును. దీనిక్లిష్టార్థత తెలిసి కవియే దీనికి వ్యాఖ్య రచియించెను. పూర్వార్ధమే యుత్తరార్ధ మగుట యిందలివిశేషము. రుచిచూచుటకు రెండుశ్లోకములు:—

"పరమో ఽక్షరో మహీయా న్నాగాధ్యాసీ సమేతు నరకాన్తః,
పరమో ఽక్షరో మహీయా న్నాగాధ్యాసీ సమేతు నరకాన్తః"
"పద్మాక్షమాసమేతం, ప్రసన్నతో యదగతిస్స్వభావస్థమ్,
పద్మాక్షమాసమేతం, ప్రసన్నతో యదగతిస్స్వభావస్థమ్"

## లక్ష్మణసేనరాజు

గోవర్ధనాదికవుల నాదరించినయీకవి వంగదేశపాలకుఁ డగు బల్లాలదేవునిసూనుఁడు. ఈతండికొడుకులకాలమునుగూర్చి మతభేదములు కలవు. వాని నెల్ల చర్చింపక సముచిత మగునయందలిసారము గ్రహింతము.

"బల్లాలసేనుఁడు, తా నారంభించిన అద్భుతసాగర మనెడికృతిని పూర్తిగావింపక, శా. ౧౦౮౦ లో దానిని పూరింపు మని కొడుకు నాజ్ఞాపించి, యతనికి రాజ్య మిచ్చి సపత్నీకుఁడై తీర్థయాత్ర వెడలెను"

అనెడి విషయమును దెలుపు నొకశాసనములోనిశ్లోకములుసదుక్తికర్ణామృతపీఠికలో నున్నవి లక్ష్మణసేనునిరాజ్యారంభశకము ౨౧వసంవత్సరమునందు, శా. ౧౧౨౭లో శ్రీధరదాసు సదుక్తికర్ణామృతము సమాప్తమైనట్లు గ్రంథాంతశ్లోకము చెప్పుచున్నది [2] ఇవి యిట్లుండ, లక్ష్మణసేనుఁడులక్ష్మావతీపురము రాజధానిగా వంగదేశమేలినట్లుసంవతు౧౧౭౩. లోనిగయాశాసన మొకటి తెలుపుచున్నది. ఆకాలము, శా. ౧౦౩౯ మఱియు, ౧౦౪౨ లో లక్ష్మణసేనశకారంభ మని మఱియొకశాసనపరిశోధకు లన్నారు: ఇది శ్రీధరదాసు చూపినకాలమునకు విరుద్ధము. ఇపుడేది విశ్వాస్యము?—అద్భుతసాగరోత్పత్తిని దెలుపుశాసనశ్లోకము లతఁడు రచియించినవి కావు. లక్ష్మణసేన శ్రీధరదాసాదులు నిర్మించినట్లు కనఁబడదు. పరిశీలింత మన్న, ఆగ్రంథము లేదు. సదుక్తికర్ణామృతము తుదిశ్లోక మెవరో తరువాతఁజేర్చినది గాని యదిశ్రీధరదాసు వ్రాసినదిగా కనరాదు. కావున నేఁటిసదుక్తికర్ణామృతపీఠికాకారులు చూపినయాశ్లోకములను నమ్ముటకంటె గయాశాసనము నమ్ముటయే యుక్తము. ఇప్పటిపరిశోధకులు కొందఱు దానినే విశ్వసించుచున్నారు; కావున నీరాజకవి, శా. ౧౦౩౯—౧౦౬౪ నడుమ వంగరాజ్యకవితారాజ్యము లేలె నందము. ఇతనికావ్య మేదియు కనఁబడదు. సదుక్తికర్ణామృత

1. శాకే ఖనవఖేంద్వబ్దే, ఆరేభేఽద్భుతసాగరం,
గౌడేంద్రకుంజరాలానస్తంభబాహు ర్మహీపతిః...
గ్రంథే ఽస్మిన్న సమాప్త ఏవ తనయం సామ్రాజ్యరక్షామహా
దీక్షాపర్వణి దీక్షణా న్నిజకృతే ర్నిష్పత్తి మభ్యర్థ్య సః,
...భార్యానుయాతో యయౌ
శ్రీమల్లక్ష్మణసేన భూపతి రతిశ్లాఘ్యో యదుద్యోగతో,
నిష్పన్నో ఽద్భుతసాగరః కృతి రసౌ బల్లాలభూమీభుజః.

2. శాకేఽత్రసప్తవింశత్యధికశతోపేతదశశతే శరదామ్,
శ్రీమల్లక్ష్మణసేనక్షితిపస్య రసైకవింశే ఽబ్దే...

ములో నితనివిగా కొన్నిశ్లోకము లున్నవి. రాధామాధవులపరస్పరావలోకన మిట్లు వర్ణింపఁబడినది.

"కృష్ణ! త్వద్వనమాలయా సహకృతం కేనాపి కుంజాంతరే,
గోపీకుంతలబర్హదామ తదిదం ప్రాప్తం మయా గృహ్యతాం,
ఇత్థం దుగ్ధముఖేన గోపశిశునా ఽఖ్యాతే త్రపానమ్రయో
రాధామాధవయో ర్జయన్తి వలితస్మేరాలసా దృష్టయః"

పిల్లనగ్రోవి వాయించుచు రాధను చూచు కృష్ణునివర్ణన.

"తిర్యక్కంధర మంసదేశమిళితశ్రోత్రావతంసం స్ఫుర,
ద్బర్హోత్తంసిత కేశపాశ మనృజుభ్రూవల్లరీవిభ్రమం,
గుంజద్వేణునివేశితాధరపుటం సాకూతరాధానన,
న్యస్తా మీలితదృష్టిగోపవపుషో విష్ణో ర్ముఖం పాతు వః"

ఈక్రిందిది రసోదంచిత మైనచంద్రవర్ణన—

"నేపథ్యం భూతభర్తు స్త్రిదశపరిషదాం జీవనం యామినీనా
ముత్తంసః పాంసులానాం కులరిపు రమృతస్రోతసా మాద్రి శైలః
ఆతంకః పంకజానాం జయతి రతికలాకేతనం మీనకేతోః
సింధూనా మేకబంధుః కుసుమసముదయానందకందో ఽయ మిందుః"

## గోవర్ధనాచార్యుఁడు

మన మిపుడు ప్రశంసించినవంగదేశరాజునలక్ష్మణసేనుని కవిపండితసభలో నున్నవారిలో నితఁ డొకఁడు. అతనిసభలో నున్నకవీంద్రులను తెలుపుచున్నశ్లోక మిది. ఇది యారాజుసభామందిరద్వారము మీఁద నున్న శిలాఫలకములోని దనిపరిశోధకులు ప్రకటించియున్నారు.

"గోవర్ధనశ్చ శరణో జయదేవ ఉమాపతిః,
కవిరాజశ్చ రత్నాని సమితౌ లక్ష్మణస్య చ"

కావున, ఈగోవర్ధనాదు లైదుగురును శా. ౧౦౩౯–౧౦౬౮ నడుమ నున్నవా రనుట విదితము.

ఇతఁ డార్యావృత్తములుగా రచియించిన యేడువందలశ్లోకములకు "ఆర్యాసప్తశతి" యని పేరు. ఇందు వివిధనాయికానాయకులయు వారి సఖులయు లక్షణములును వారిసంభాషణములును విన నింపుగా వర్ణింపఁబడినవి, ఇం దొకవిషయము నియతము కాదు. ఇది యొకకథాకావ్యము కాదు. ఇం దకారాదిక్షకారాంతవర్ణములు క్రమముగా నాదియందు గల కొన్నికొన్నిశ్లోకములు వ్రజ్య లనుపేరఁ బరగియున్నవి. కవిత్వము సరసము మృదులము, సముచిత దృష్టాంతోపమాద్యలంకృతము– విద్వద్వినోదార్థము తా నీకృతి రచియించినట్లును, దీనిని తన శిష్యుఁడును సోదరుఁడును చక్కఁజేసి ప్రకాశింపఁజేసి నట్లు నితఁడే యిట్లు తెలిపియున్నాఁడు.

" కవిసమరసింహనాదస్స్వరానువాదః సుధైకసంవాదః,
విద్వద్వినోదకంద స్సందర్భోఽయం మయా సృష్టః"
" ఉదయనబలభద్రాభ్యాం సప్తశతీ శిష్యసోదరాభ్యాం మే,
ద్యౌ రివ రవిచంద్రాభ్యాం ప్రకాశితా నిర్మలీకృత్య"
" అకృ తార్యాసప్తశతీ మేతాం గోవర్ధనాచార్యః"

తనపోషకుఁడైనలక్ష్మణసేనుని కవిత్వకలాకల్పన చాతుర్యమును పూర్ణిమనాఁటి ప్రదోషముతోఁ బోల్చి యిట్లు చక్కఁగా వర్ణించి యున్నాఁడు.

" సకలకలాః కల్పయితుం ప్రభుః ప్రబన్ధస్య కుముదబంధోశ్చ,
సేనకులతిలకభూపతి రేకో రాకాప్రదోషశ్చ"

జైనసిద్ధాంతస్థితితోఁ బోల్చినయీక్రింది నాయికాదృష్టివర్ణన మెంతయు మనోహరము.

" అతిపూజితతా రేయం దృష్టిః శ్రుతిలంఘనక్షమా సుతను!
జినసిద్ధానస్థితి రివ సవాసనా కం న మోహయతి!"

ఇది పరస్త్రీలోలుని వర్ణన:—

" అన్యా స్వపి గృహిణీతి ధ్యాయ న్నభిలషిత మాప్నోతి,
పశ్యన్ పాషాణమయీః ప్రతిమా ఇవ దేవతాత్వేన "

ఈకృతి దేశదేశముల వ్యాపించి సహృదయహృదయంగమ మైన దనుటకు దీని కుదహరించిన గోకులచంద్ర గంగారామాదుల టీకలే ప్రమాణము. మఱియు, జయదేవుఁడు తనమిత్రకవుల నందఱిని స్మరించుచు శృంగారవర్ణనమున గోవర్ధనునికి సాటి యగువాఁడు లేఁ డని యిట్లు వర్ణించెను. ఇదే యితనియుత్తమకవిత్వశక్తికి ముఖ్య మైన సాక్ష్యము.

" వాచః పల్లవయ త్యుమాపతిధర, స్సందర్భశుద్ధిం గిరాం
జానీతే జయదేవ ఏవ శరణః శ్లాఘ్యో దురూహద్రుతేః,
శృంగారోత్తరసత్ప్రమేయవచనై రాచార్యగోవర్ధన
స్పర్ధీ కోఽపి న విశ్రుతః, శ్రుతధరో ధోయీ కవిక్ష్మాపతిః "

ఇతఁడు నిర్మించినమఱియొకకృతి పేరు తెలియరాదు గాని, యితనివిగా కొన్నిశ్లోకములు సంకలనగ్రంథముల నున్నవి. వానిరీతి యితనిది గానే కనఁబడుచున్నది. అందలివి:—ఇది నాయికానునయము:—

" నిర్యంత్రణం విహార మాచిరయ ప్రసీద,
కిం వేపసే పవనవేల్లితవల్లరీవ !
క్షీరోదచంచలదృగంచలపాతమాత్ర
క్రీతే జనేక ఇవ విభ్రమసంనిరోధః "

" వపు స్తిమ్యచ్ఛిన్నాంశుకనిబిడపీనోరుజఘన
స్తనానాం సిక్తోచ్చైర్గళితచికురపయసాం పక్ష్మలదృశామ్,
నిమగ్నోత్తీర్ణానాం ప్రమదవనవాపీతటజుషాం
దిదృక్షాభి ర్దేవో రవిరథ రథం మంథరయతి "

ఇది శృంగారము వెదచల్లుమధ్యాహ్నవర్ణనము. అపూర్వము.

# జయదేవుఁడు. ౧.

వంగదేశమండలి బిర్భుంజిల్లాలోని అజయానదియొడ్డున నున్న కిందుబిల్వా మితనిజన్మస్థాన మని యొకరు, ఇతఁడు గుజరాతులోనివాఁడని యొకరు, మైథిలుఁ డని యొకరు, పూరీజగన్నాథమునకు దగ్గఱగా నున్నతిందుబిల్వగ్రామమున జన్మించినవాఁ డని భక్తమాలాకర్తయగు చంద్రదత్తుఁడు—ఇతనితల్లి రాధాదేవి, (వామాదేవి) తండ్రి భోజదేవుఁడు, భార్య పద్మావతి, మిత్రుఁడు పరాశరపండితుఁడు, గోవర్ధనాదులు రాజాస్థానసహవాసులు. ఇతని జీవితచరిత్రము భక్తమాల ౩౮-౪౧ సర్గలలో విపులముగా వర్ణింపఁబడినది. దానినిబట్టి రాధాకృష్ణభక్తాగ్రేసరుఁడై నయితఁడు స్వకాలమున సకలజనస్తోత్రపాత్రుఁడై మధురా గోకుల బృందావన ద్వారకాది పుణ్యక్షేత్రములు సేవించి కృష్ణభక్తిరసమును భక్తులకుఁ బ్రసాదించిన యవ్యాజకరుణామూర్తి యని విదితమగును. ఇతనిమహిమ లెన్నో యిందు వర్ణింపఁబడినవి.

ఇతఁడు జగన్నాథస్వామిని సేవించుచున్న కాలముననే స్వామి యనుగ్రహమున రూపవతియు శీలవతియు నైనపద్మావతి యను బ్రాహ్మణకన్యను పరిణయమై యామెయెడ మిక్కిలి ప్రేమతో వర్తించుచుండెను. ఆమెయు నన్నివిధముల భర్తకనువర్తినియై యితనిగీతములు నృత్యముచేయుచుఁ బాడుచు నుత్తమభక్తురాలన్నఖ్యాతి వహించెను. ఈ కవిచంద్రుఁ డావిషయమును గీతగోవిందమున నిట్లు తెలిపియున్నాఁడు.

" వాగ్దేవతాచరితచిత్రితచిత్తసద్మా,
పద్మావతీచరణచారణచక్రవర్తీ
శ్రీవాసుదేవరతికేళికథాసమేత
మేతం కరోతి జయదేవకవిః ప్రబన్ధమ్ "

ఇతనిగీతగోవిందము పన్నెండుసర్గలకావ్యము. విన నింపై చదువఁ జవు లొలికించునితనిగీతములు రాగలయతాళములకు సరిపడు

చుఁ బాఠకలోకము నాజన్మముగా వళిపలుచుకొన్నవి. ఈసర్గలు భాగవతస్కంధములకును, ఇందలియష్టపదులు గాయత్రీమంత్రమిరువదినాలుగువర్ణములకును సరిపడుచు శ్రీకృష్ణతత్త్వమునకు జ్ఞాపకము లగుచున్నవి. రాధాకృష్ణులను జగజ్జన్మాదికారణభూతు లగుపరికృతిపురుషుల నుగా భావించి భక్తులు తన్మయచిత్తులై గానముచేసి తరించుట యీయష్టపదులయుద్దేశము. వాగమృత మైనదీనినుండి యొకటి:—

రామకరీరాగ యతి తాళములు:—

" చందనచర్చిత నీలకళేబర పీతవసనవనమాలీ,
కేళిచలన్మణికుండల మండిత గండయుగస్మితశాలీ,
హరి రిహ ముగ్ధవధూనికరే విలాసిని విలసతి కేళిపరే (ధ్రువం-ప)
పీనపయోధరభారభరేణ హరిం పరిరభ్య సరాగమ్,
గోపవధూ రనుగాయతి కాచి దుదంచితపంచమరాగమ్,
కాపి విలాసవిలోలవిలోచన ఖేలనజనితమనోజమ్,
ధ్యాయతి ముగ్ధవధూ రధికం మధుసూదనవదనసరోజమ్,
కాపి కపోలతలే మిలితా లపితుం కిమపి శ్రుతిమూలే,
కాపి చుచుంబ నితంబవతీ దయితం పులకై రనుకూలే.
కేళికలాకుతుకేన చ కాచి దముం యమునాజలకూలే,
మంజులవంజులకుంజగతం విచికర్ష కరేణ దుకూలే.
శ్లిష్యతి కామపి చుంబతి కామపి కామపి రమయతి రామామ్,
పశ్యతి సస్మితచారుతరా మపరా మనుగచ్ఛతి వామామ్.
శ్రీజయదేవభణిత మిద మద్భుతకేశవకేళిరహస్యమ్,
బృందావనవిపినే లలితం వితనోతు శుభాని యశస్యమ్. "

ఈమహాకావ్యమును సుమారు పదియేనుమంది వ్యాఖ్యాతలు స్తుతించి రనుట యాశ్చర్యము కాదు. దీని ననుకరించి కృష్ణగీత—గీతరాఘవము—సంగీతమాధవము — గీతగౌరీశము—గీతగంగాధరము— మొద

టుగా బహుకృతు లుదయించుటయు నాశ్చర్యముకాదు. కాని, దీనికి సాటి యగుభక్తికావ్యము మరలఁ బుట్టలే దనుటయే యాశ్చర్యము.—శ్రీకృష్ణునవ్యాజప్రేమ కేకైకస్థానముగా రాధాపాత్ర ముత్తరదేశ కవుల వాక్కులనే తొలుత వెలువడినది. ప్రకృతిరూప మైనయాదేవి శ్రీహరిలో నైక్య మైనవిధమును ప్రదర్శించిన దీగీతగోవిందము.

ఇతనివిగా సదుక్తికర్ణామృతాదులందు కొన్నిశ్లోకములు లున్నవి గాని, యవి యన్నియు నితనివిగా తోఁచలేదు. ఇతని దని నేను నమ్మిన వొకటిరెండు:—

"ముగ్ధే! నాథ! కిమాత్థ తన్వి? శిఖరిప్రాగ్భారభుగ్నో భుజః,
సాహాయ్యం ప్రియ! కింభజామి? సుభగే! దోర్వల్లి మాయాసయ!
ఇత్యుల్లాసితబాహుమూలవిచలచ్చేలాంచలవ్యక్తయో
రాధాయాః కుచయో ర్జయ న్తి చలితాః కంసద్విషో దృష్టయః"

"అంగే ష్వాభరణం తనోతి, బహుశః, పత్రేఽపి సంచారిణి,
ప్రాప్తం త్వాం పరిశంకతే, వితనుతే శయ్యాం, చిరం ధ్యాయతి,
ఇ త్యాకల్పవికల్పతల్పరచనాసంకల్పలీలాశత,
వ్యాస క్తాపి వినా త్వయా వరతను ర్నైషా నిశాం నేష్యతి"

## ధో యీ క వి రా జు

ఇతఁడు లక్ష్మణసేనునియాస్థానమున జయదేవునితో నున్నవిద్వత్కవి. ధోయీ మొదటిపేరు, కవిరాజు బిరుదుపేరు. ఇదే పేరై శాసనముల కెక్కినది. ఇతఁడు వంగీయుఁడు. ఏకసంథాగ్రాహి యగుటచే నితనికి శ్రుతిధరుఁ డనుబిరుదుకూడా లభించినది. గట్టివిద్వాంసుఁ డను అర్థ మిచ్చు "గవాయి" యనెడిహిందూస్తానీబిరుదు కూడా యితనికిఁ గలదు. కాని, యితఁడు కవిరాజబిరుదమునే వాడుకొన్నాఁడు.

ఇతఁడు సత్యభామాకృష్ణసంవాద మనునొకకావ్యము నిర్మించిన ట్లిందొకనవచ్చె నఁట గాని యది మాత్రము కనఁబడలేదు. ఇతని కృతిగా ముద్రిత మైనది పవనదూత మొకటియే. కాళిదాసుమేఘసందేశ ముపజీవ్యముగా వెలసినబహువిధదూతకావ్యములలో నిది యాద్యమన్నను, ప్రశస్త మైన దన్నను సాహసము కానేర దని తలంతును. ఇం దితనిపోషకుఁ డైనలక్ష్మణసేనుఁడే నాయకుఁడు, కువలయవతి యను గంధర్వకన్య నాయిక.

"నాయకుఁడు భువనవిజయము కావించినతఱిని మలయాద్రిమీఁదికనకనగరిలో నివసించునాయిక యితనిఁ జూచి మోహించి తదేకమానసయై కొన్నిదినములు గడపి విరహవేదన సహింప లేక మలయపవను నతనియొద్దకు దూతగాఁ బంపుట యిందలివస్తువు.

పవనదూతములోని యీ క్రిందిశ్లోకములనుబట్టి యితనిఘనతయు స్వభావమును గోచరించుచున్నవి.

"దంతివ్యూహం కనకకలితం చామరే హైమదండే,
యో గౌడేంద్రా దలభత కవిక్ష్మాభృతాం చక్రవర్తీ,
ఖ్యాతో యశ్చ శ్రుతిధరతయా విక్రమాదిత్యగోష్ఠీ
విద్యాభర్తుః ఖలు వరరుచే రాససాద ప్రతిష్ఠామ్"
"శ్రీధోయీక స్సకలరసికప్రీతిహేతో ర్మనస్వీ,
కావ్యం సారస్వత మివ మహామంత్ర మేత చ్చకార"

దీనినిబట్టియీకవిరాజు గౌడభూపతివల్ల రాజోచితసత్కారము లందినవాఁడనియు వరరుచివలె నుత్తమకీర్తి గన్నవాఁ డనియు తెలియుచున్నది.

"కీర్తి ర్లబ్ధా సదసి విదుషాం శీలితాః క్షోణిపాలాః,
వాక్సందర్భాః కతిచి దమృతస్యందినో నిర్మితాశ్చ,
తీరే సంప్ర త్యమరసరితః క్వాపి శైలోపకంఠే,
బ్రహ్మాభ్యాసప్రవణమనసా నేతు మీహే దినాని"

పరిణతవయస్సునఁబో నితఁడు విరక్తుఁడై గంగాతీరమందలియొక పర్వతప్రాంతప్రదేశమున సుఖముగా నుండి పరబ్రహ్మధ్యానమున నానందించుచు నీకడపటిరోజులు గడపెద ననెను.

దీనినిబట్టి యితనిజన్మము ధన్యమైన దని తెలియును. ఇంక నితని కవిత్వమురుచి చూచుట కొకటి; ఇది నూగారువర్ణన.

"రోమావళీ సత్రివళీతరంగసాభీహ్రద స్యోపరి రాజతే ఽస్యాః
ముఖేందుభీతస్తనచక్రవాకవక్త్రచ్యుతా శైవలమంజ రీవ"

## శరణుఁడు

గోవర్ధనాదులసహవాసి యైనయితనిజీవిత విశేషము లేమియు తెలియకున్నవి. ఇతనికవితరుచి చూచుటకు మాత్రము కొన్నిచాటువు లందందు కలవు. సదుక్తికర్ణామృతములో నితనివిగా నీక్రింది శ్లోకము లగపడుచున్నవి.

జయదేవుఁడు తనకవితారీతితో తనమిత్రులైనగోవర్ధన శరణోమాపతిధర కవిరాజు (ధోయీ) ల కవిత్వరీతులను వర్ణించినాఁడు. ఆశ్లోకము గోవర్ధన జీవితమున నున్నది. అందు శరణుని కవితారీతి ఊహ కందరానంతయాశుధారగా నుండు నన్నాఁడు. శ్లాఘ్యమైన యట్టిఆశుధారలో నెన్నివేలశ్లోకములు పడుగత్తెనో! ఇపుడు మిగిలినవి పది పదియేను:—

ఈమైదుగురుకవులును కృష్ణభక్తులే. అందు జయదేవునివలె నీశరణుఁడు గావించినరాధా మాధవవర్ణన మిది:—

"కాళిందీ మనుకూలకోమలరయా మిందీవరశ్యామలాః,
శైలోపాంతభువః కదంబకుసుమై రామోదినః కందరాః,
రాధాం చ ప్రథమాభిసారమధురాం జాతానుతాప స్స్మర
న్నస్తు ద్వారవతీపతి స్త్రిభువనామోదాయ దామోదరః"

యౌవనము నధిగమించినయొక సుందరికి చెలికత్తె చేయుచున్న యుపదేశము:—

" ఉన్మీలద్యౌవనాసి ప్రియసఖి ! విషమా శ్శ్రేణయో నాగరాణాం,
తస్మాత్త్వోఽపి త్వయా ద్యప్రభృతి న సహసా సంముఖం వీక్షణీయః,
యావ చ్ఛందానురక్తో మేకః పతి రతిశయిత శ్రద్ధయా సేవితవ్యః,
కర్తవ్యా రూపరక్షా వచసి చ హృదయం దేయ మస్మద్విధానామ్"
" ఆరాధ్యః పతి రేవ తస్యచ పదద్వంద్వానువృత్తి ర్వ్రతం,
కే నైతా స్సఖి! శిక్షితాసి ! విపథ ప్రస్థానదుర్వాసనాః?
కింరూపేణ న యత్ర మజ్జతి మనో యూనాం కి మాచార్యకైః ?
యాధానంగరహస్యయుక్తిషు ఫలం యేషాం న దీర్ఘం యశః"

గోపవధూవిరహపరవశుఁడైనకృష్ణునిజాగరావస్థ యిట్లు వర్ణింపఁబడినది.

" కామం కామయతే న కేళినలినీం నామోదతే కౌముదీ
నిష్యందై ర్న సమీహతే మృగదృశా మాలాపలీలా మపి,
సీద న్నేష నిశాసు దుస్సహతను ర్భోగాభిలాషాలసై,
రంగై స్తామ్యతి చేతసి వ్రజవధూ మాధాయ ముగ్ధో హరిః"

# ఉమాపతిధరుఁడు

ఈకవి లక్ష్మణసేనుని పండితసభలోని మైదవవాఁడు. ఇతఁడతని మంత్రి యనెడిప్రవాదమును కలదు.

లక్ష్మణసేనుఁడు మాతంగయువతితో క్రీడించుట తెలిసి యీకవి యన్యాపదేశముగా నొకశ్లోకము నిర్మించి చదివె ననియు, ఆభావ మెఱిఁగి రా జతనిని సంస్థానమునుండి తొలగించె ననియు, అంత నీకవి వెఱ్ఱివానివలె వీథులలో తిరుగుచుండ నొకనాఁడు రా జతనిని చూచి

నీ వెవఁడ వని యడుగఁగా నొకశ్లోకముతో బదులు చెప్పె ననియు, అంత రాజు పశ్చాత్తాపపడి మరల నితనిని మంత్రిని గావించె ననియు నొకకథ వినవచ్చును.

ఈకవి కృష్ణచరితము, పారిజాతాపహరణము, మొదలగు కొన్ని కావ్యములు నిర్మించినట్లు తెలియును గాని, అవి యెందో యణఁగిపోయి నవి. కొన్నిశ్లోకములు మాత్రము సదుక్తికర్ణామృతాదులలో నిలచి యున్నవి. అందలి నొకటిరెండు:—

" రత్నచ్ఛాయాచ్ఛురితజలధౌ మందిరే ద్వారకాయాం,
రుక్మిణ్యాపి ప్రతతపులకోద్భేద మాలింగితస్య,
విశ్వం పాయా న్మసృణయమునాతీరవానీరకుంజే,
ప్వాభీరస్త్రీనిభృతచరితధ్యానమూర్ఛా మురారేః,

ఇందు కృష్ణునిమోహావస్థవర్ణితము— ఈక్రింది పద్యములో ముగ్ధనాయికాలీల వర్ణింపఁబడినది:—

" క్షిపతి దయితే దృష్టిం వక్రా మపాంగతరంగిణీం,
హసిత మనభివ్యక్తం మధ్యే దధాతి కపోలయోః,
మృదుమదకలం కించి ద్వాక్యం కథంచన ముంచతీ,
హరతి హృదయం ప్రౌఢే వేయం నవాపి నితంబినీ "

సాధ్వీహృదయము పతియందే లగ్నమై యుండును.

" న నయతి బహుమాన స్యాస్పదం స్నిగ్ధబంధూ,
న్నచి గుణిని సమృద్ధే ఽప్యాదరం యాతి తాతే,
న భజతి ధృతి మంత ర్నందనే ఽప్యంతరాత్మా,
భవతి హి పతినిష్ఠం ప్రేమ సాధ్వీజనస్య "

## శంఖధరుఁడు

ఇతఁడు కాన్యకుబ్జరాజ్యము పాలించినమహామాండలికాధిరాజగుగోవిందచంద్రమహీపాలునిసభ నలంకరించినవిద్వత్కవి. ఆరాజు

విక్రమశకము ౧౧౬౧, ౧౧౮౮ సంవత్సరములలో వ్రాయించిన దానశాసనములనుబట్టి యతనితో నీకవియు శా. ౧౦౦౦-౧౦౬౦ నడుమ నున్నవాఁ డనుట విదితము.

నాటకప్రదర్శన మభిలషించిన తనపోషక ప్రభునివినోదము కొఱకు తా నీలటకమేలకము నిర్మించిన ట్లీకవి ప్రస్తావనలో తెలిపియు న్నాఁడు. లటక = దుర్జనుఁ, మేలకః = సంఘటన, మెందుగలదో, అది లటకమేలక మనఁబడు ననియర్థము. ఇందలిపాత్రములు బహువిధస్వభావములు. రసము హాస్యము. అంకములు రెండు. ఇది ప్రదర్శనరమ్య మగు ననుట వాస్తవము. ఇందు సంఘములోనిదురాచారములు చక్కఁగా నుద్ఘాటింపఁబడినవి.

దంతుర యను ముదసలికుట్టనియింటిలో మహామహోపాధ్యాయదాంభికచక్రవర్తి వామాచారవిద్యాద్వారిష్ఠపరాపకారవ్యాసనైకనిష్ఠ నిందితవనమాలీత్యాదివిశేషణవిశిష్టుఁడై నసభాసలి యనుబ్రాహ్మణుఁడు ప్రవేశించుటతో నిది యారంభ మగును. అతఁ డాకుట్టనిం జూచి యనుకొన్నమాటలు:—

"అంత ర్నిమగ్నం నయనద్వయేన క్వాది త్ప్రియాతం నవయౌవనేన
భగ్నౌ కపోలౌ పతితం కుచాభ్యాంమన్యే భయా న్మన్మథసాయకానామ్"

సభాసలి మదనమంజరిని, దిగంబరుఁడు దంతురను బరిగ్రహించుట యిందలికథ. దంతుర మాయలాఁడి తార్పుకత్తె. దాని నాశ్రయించి సభాసలి మదనమంజరీలాభము గాంచును, మదనమంజరికై ప్రయత్నించి లాభము లేక దిగంబరుఁడు వృద్ధాంగన యగుదంతురను వరించును. ప్రదర్శించునపు డిది హాస్యము పుట్టించి సభ్యుల రంజింపఁజేయు నని తోఁచెడి. గోవిందచంద్రభూపాలుఁడు దీని నభినయింపఁజేసి యానందించె నన్నకవివాక్యము విశ్వసనీయ మగును. సభాసలి మదనమంజరిని చూచి యనుకొనుమాటలు:—

" అయే రోషోఽపి లీలావతీనాం చిత్త మున్మాదయతి-
" ఆనందకారి మదనజ్వరదర్పహారి
పీయూషపంకపరిహాసరసానుకారి
ప్రేమప్రసారి పరమాభ్యుదయానుకారి
వామభ్రువా మహహా! కిం న మనోవికారి?"

ఈ చిన్నప్రహసనములో ४६ శ్లోకము లున్నవి. అందు కొన్ని మనోహరములు, ప్రసాదగుణవిశిష్టములు. కవిరాజబిరుదాంచితుఁడై నయీశంఖధరుఁడు నిర్మించినయితరకృతు లేవియు గోచరింప కున్నవి కాని, యితనికృతిగా కవికర్పటిక యొకటి వినవచ్చుచున్నది. వాదీంద్ర కవినిర్మిత మైనకవికర్పటిక వేఱు.

సంస్కృతవాఙ్మయమున ప్రహసనములు సుమారు వంద కన వచ్చు చున్నవి. వానిలో నిదియే మొదటి దేమో!

# హేమచంద్రుఁడు

సుప్రసిద్ధపండితకవులలో నొకఁడై నయితఁడు జైనబ్రాహ్మణుఁడు. ఇతఁడు ధంధుక యనేగ్రామమున శా. ౧౧౧౦ లో జన్మించినాఁడు మిక్కిలి చిన్నవయస్సులోనే జైనాచార్యులయనుగ్రహమునకు పాత్రుఁడై దేవచంద్రసూరి యనుప్రఖ్యాతపండితునివద్ద విద్యాభ్యాసము గావించి నాఁడు. గుజరాతురాష్ట్రపాలకుఁ డగుజయసింహరాజు సభలోను, కుమారపాలరాజుసభలోను చాలకాల మాస్థానకవిగాను మంత్రిగాను ప్రభుసత్కారపాత్రుఁడై యుండి గుజరాతు దేశమున జైన మత మెక్కువగా వ్యాపింపఁజేసి దేశమంతట వందల కొలఁది విహారములు కట్టించి నాఁడు.

సంస్కృతప్రాకృతభాషలు రెంటిలోను బహుగ్రంథములు రచియించినయితఁడు కావ్యానుశాసన మనెడిలక్షణగ్రంథమున నెక్కువ

విఖ్యాతికి వచ్చెను. ఇది యెనిమిదధ్యాయములసూత్రాత్మకగ్రంథము. దీని కితఁడే అలంకారచూడామణివివేక మనుపేర వ్యాఖ్య రచియించెను. ఇందు పెక్కుచోట్ల నానందవర్ధనరాజశేఖరమమ్మటాదులకృతులనుండి కొన్నివిషయములు గ్రహించి చేర్చినాఁడు. దండి శంకుక భోజరాజాదులమతములను పరిశీలించినాఁడు. ఇపు డదృశ్య మైనభట్టతౌతునికావ్యకౌతుకములోనికవిలక్షణప్రతిపాదకము లైనయీమూఁడుశ్లోకముల నుదాహరించియున్నాఁడు.

"నానృషిః కవి రిత్యుక్త మృషిశ్చ కిలదర్శనాత్,
విచిత్రభావధర్మాంశతత్త్వప్రఖ్యాచ దర్శనమ్,
స తత్త్వదర్శనా దేవ శాస్త్రేషు పఠితః కవిః
దర్శనా ద్వర్ణనా చ్చాథ రూఢా లోకే కవిశ్రుతిః,
తథాహి దర్శనే స్వచ్ఛే నిత్యే ప్యాదికవే ర్మునేః,
నోదితా కవితా లోకే యావజ్జాతా న వర్ణనా"

సంసారులకు నియతముగా ననుభవగోచర మగుచు హృద్యమైన శృంగారము సర్వరసప్రధాన మయినమాట సత్యమే కాని దానికి విరోధము కలిగింపనిరసాంతరముతోడిసంసర్గము దూష్యము కానేర దన్నయానందవర్ధనునికారికను స్వీకరించి తదర్థమును విస్తరింపఁజేసినాఁడు.

ఇతనికుమారపాలచరిత మిరువదియెనిమిదిసర్గల పెద్దకావ్యము, మొదటియిరువది సంస్కృతములోను తరువాతియెనిమిది ప్రాకృతములోను రచియింపఁబడినవి. ఇందు గుజరాతులోనిఅన్హిల్వాడుచరిత్రము వర్ణింపఁబడినది. పోషకప్రభువులచరిత్రములు విశదీకరింపబడినవి. మఱియు నితఁడు జైనసన్యాసులచరితము ఛందోనుశాసనము ప్రాకృతవ్యాకరణము అభిధానచింతామణి అనేకార్థసంగ్రహము నిఘంటుశేషము హేమచంద్రీయము దేశీనామమాల అనుకోశములను నిర్మించి గొప్ప భాషాసేవచేసి వన్నె కెక్కెను. ఈకోశము లర్వాచీననిఘంటుకర్తల మెప్పు

గాంచినవి. ఇతనిస్యాద్వాదమంజరి-జినేంద్రస్తోత్రము, యోగశాస్త్రము జైనమతమువారికి బ్రమాణగ్రంథము లైనవి. మొత్తముమీఁద నితఁడు సంస్కృతవాఙ్మయమునఁ దొక్కనిత్రోవలే దన్నట్లు బహువిధకృతులు నిర్మించి స్వకాలమువారిసన్నుతి గాంచినవాఁడని పైగ్రంథములవల్ల తెలియకపోదు.

నాట్యదర్పణము రచియించినరామచంద్రగుణచంద్రు లితని శిష్యులు. మతమునకుం దగినసుగుణసంపద గలవాఁడై రాజులమెప్పు గాంచి ప్రజలగౌరవము నొందినయితనిజీవిత ముత్తమ మైనది, సద్గుణుఁడై సమాసప్రమాసములు జీవించి శా. ౧౧౯౫ లో సిద్ధి గాంచిన యితనిచరిత్రము స్మరణీయము.

# రా మ చం ద్ర క వి. ౧

ఈపండితకవి హేమచంద్రునిశిష్యుఁడు. దానంజేసి యితఁడు గుజరాతుదేశమువాఁ డని విశ్వసింపవచ్చును. ఇతనిసహాధ్యాయుఁడు గుణచంద్రుఁడు. వీ రిరువురు కలసి నాట్యదర్పణ మనునుత్తమకృతి రచియించినా రని యింతకు మున్ను తెలుసుకొనియున్నాము. ఇతఁడు శా. ౧౦౫౦ ప్రాంతమువాఁడు. జైనమతావలంబి.

సంస్కృతసాహిత్యమున మిక్కిలి చతురుఁ డైనయీకవి శతాధికగ్రంథకర్త యనుపేరు గాంచెను. కాని, ఆకృతులలో ననేకములు నష్టములు. రఘువిలాస నల విలాసాది రూపకములు నామమాత్రావశిష్టములు రమారమి పదికావ్యము లముద్రిత గ్రంథాలయములలో నున్నట్లు వినికిడి. కౌముదీమిత్రానందము సత్యహరిశ్చంద్రము నను రెండు నాటకములు ముద్రితములై యిపుడు వ్యాప్తికి వచ్చినవి కడపటినాటకము ప్రస్తావనలోనిమాటలు కొన్ని:—

"ప్రబంధా ఇక్షువ త్ప్రాయో హీయమానరసాః క్రమాత్,
కృతిస్తు రామ చంద్రస్య సర్వా స్వాదుః పురఃపురః"
"సూక్తయో రామ చంద్రస్య వసంతః కలగీతయః,
స్వాతంత్ర్య మిష్టయోగశ్చ పంచైతే హర్షవృష్టయః"

"శ్రీసిద్ధహేమాభి ధాన శబ్దానుశాసనవేధసః శ్రీమదాచార్య హేమచంద్రస్య శిష్యేణ రామచంద్రేణ విరచితం సత్యహరిశ్చంద్రాభిధాన మాదిరూపక మభినీయ సభాజన మనురంజయిష్యామః"

దీనినిబట్టి యీకవి కవితామహత్త్వముతో నిది యితని మొదటి రూపక మనియు, ఇతనిగురునిశబ్దాను శాసన మానాఁడే సుప్రసిద్ధ మైన దనియుఁ దెలియుచున్నది.

ఇతనినాట్య దర్పణమం దిపుడు లభింపనిపూర్వకవులకృతు లనేకము లుదాహరింపఁ బడినవి—విశాఖదేవుని దేవీచంద్రగుప్తము అమాత్యశంకుకునిచిత్రోత్పలావలంబితక ప్రకరణము పుష్పదూషితకము నూక్తివాసకుమారుని అనంగసేనహరినందినీ ప్రకరణము- కృత్యారావణము ఛలితరామము బాలికావంచితకము పాండవానందము అనంగవతీనాటిక భీమపరాక్రమము ధర్మపాలనము మాయాపుష్పకము ఇందులేఖానాటిక రాధావిప్రలంభము తరంగదత్తము విలక్షదుర్యోధనము రోహిణీమృగాంకము ప్రతిమానిరుద్ధము స్వప్నదశాననము ఇత్యాదులు. దీనిని బట్టి పూర్వము రూపకసారస్వత మెంత యభివృద్ధి కెక్కెనో తెలియుచున్నది. ఇఁక నితనికవిత్వము రుచి కొకటి. ఇది హరిశ్చంద్రునిమాట—

"న జాతౌ న జనిష్యేతే ద్వా విమౌ పురుషౌ భువి,
అర్థితో యః కరోత్యేవ యశ్చ నార్థయతే పరమ్"

ఇతరులకోరికలు తీర్చువాఁడును, ఇతరులను కోరనివాఁడును పుట్టినవారిలో లేరు. ఇఁక ముందు పుట్టరు.

ఈకృతిలోని ప్రధానవస్తువు పౌరాణికమేకాని, యితఁడు సంవిధానమున నెక్కువమార్పులు గావించెను.

# వాగ్భటుఁడు ౧

తనపేర వాగ్భటాలంకార మనుకావ్యలక్షణము నిర్మించిన యితఁడు జైనపండితుఁడు, సోమసూరిపుత్త్రుఁడు కొంతకాలము చాళుక్యరా జైనజయసింహసిద్ధరాజు సభలో మంత్రిగా నున్నవాఁడు. ఆరాజుకాలము శా. ౧౦౧౫-౧౦౬౬. ఇతఁ డీకృతి ౧౦౪౫-౧౦౭౦ నడుమ రచియించి యుండుననుట కాక్షేపము లేదు. ఇతఁడు హేమచంద్రునికి సమకాలికుఁడు.

ఇతని యలంకార మైదుపరిచ్ఛేదముల గ్రంథము. ఇందు ప్రతిభ కవితారీతి కావ్యశరీరము గుణములు అలంకారములు రసములు మొదలగునవి లక్ష్యలక్షణసమన్వయపూర్వకముగా నిర్వచింపఁబడినవి. ఇతఁడు తనపూర్వులయలంకారలక్షణములు చూడనివాఁడు కాఁడు గాని, యితనిమార్గము స్వతంత్రముగానే కనవచ్చును. లక్ష్యలక్షణ శ్లోకములు ప్రసన్నార్థకలితములు. శైలి యతిమృదువు. ఈక్రింది ప్రతిభాలక్షణమే యితని కవితారీతిని తెలుపఁగలదు.

" ప్రసన్నపదనవ్యార్థయుక్త్యుద్బోధవిధాయినీ,
స్ఫురన్తీ సత్కవే ర్బుద్ధిః ప్రతిభా సర్వతోముఖీ "

ప్రసాదగుణవిశిష్ట మైనశబ్దములయందలి యపూర్వార్థము నెఱింగించునట్టి సర్వతోముఖ మైనకవీంద్రునిబుద్ధియే ప్రతిభ యనఁబడును.

రసహీనమైనకావ్య ముప్పులేని భోజ్యవస్తువువలె చప్పగా నుండు నని యిట్లురసావశ్యకత నిరూపించియున్నాఁడు.

" సాధుపాకే ఽప్యనాస్వాద్యం, భోజ్యం నిర్లవణం యథా,
తథైవ నీరసం కావ్య మితి బ్రూమో రసా నిహ "

సమాసోక్తి కుదాహరణముగా నితఁడు రచియించిన శ్లోకము, మధుపవ్యాజమున నొకానొకనాయికను కామించి తదలాభమునఁ జింతించు నొకనాయకుని దెలుపుచున్నది.

" చింతయతి న చూతలతాం, యాతి న జాతిం న కేతకీం క్రమతే,
కమలలతాభగ్నమనా, మధుపయువా కేవలం క్వణతి "

ఇతనికృతికి ఆదినాథుఁడు జినవర్ధనసూరి మొదలగు పదిమంది వ్యాఖ్యానములు నిర్మించుటయే దీనిప్రశస్తిని వ్యాప్తిని చెప్పుచున్నది— వీబరుపండితుఁడు సంపాదించినవాగ్భటాలంకార లిఖితపుస్తకమందు యమకలక్షణరూప మైనయాఱవపరిచ్ఛేద మున్న దని తెలియుచున్నది. కాని, వ్యాఖ్యాతలు దానిని స్మరించినట్లు కనఁబడదు.

## కవిరాజు

ఈబిరుదుపేరే యితనిపేరయిన దని " కవిరాజకవిరాజకృతౌ " అనెడి యితనిగద్యయేచెప్పుచున్నది. ఇతఁడు కదంబరాజులలోనివీరకామదేవరాజు ప్రోత్సాహమున రాఘవపాండవీయ మనుద్వ్యర్థికావ్యము నిర్మించెను. పదుమూఁడుసర్గలయాకావ్యము ముద్రిత మైనది. ఇవి యితనిమాటలు:—

" సుబంధు ర్బాణభట్టశ్చ కవిరాజ ఇతి త్రయః,
వక్రోక్తిమార్గనిపుణా శ్చతుర్థో విద్యతే నవా "

శ్లేషకవిత్వరూప మైనవక్రోక్తిమార్గములో తాను మూఁడవవాఁడఁట. నాలుగోవాఁ డున్నాఁడో లేఁడో యఁట:—గోజాదత్తసూరిపుత్రుఁడయినలక్ష్మణపండితునివ్యాఖ్య గాక, సారమంజరి స్థూలతాత్పర్యము మొదలుగా మఱియెనిమిది వ్యాఖ్యలు దీని కుదయించినవి.

ఇతడు గౌతమగోత్రుడు చంద్రముఖకీర్తి నారాయణుల తనూజుఁడు. ఇతని నాదరించినకామదేవరాజు మహామండలేశ్వరబిరుదాంచితుఁడై హాంగాల్ వనవాసి పులిగర్ రాష్ట్రములతోడికదంబరాజ్యము పరిపాలించినవాఁడు పలాసిక రాజధానిగా నీరాజు శా. ౧౧౦౪ ప్రాంతమున రాజ్యముచేసినట్లు కొంద ఱనిరి. కాని, ౧౦౫౦ ప్రాంతమందలి

పార్వతీ రుక్మిణీయకర్త యగు విద్యామాధవునిచే స్తుతింపఁబడిన యీకవి యతని కర్వాచీను డగుట యసంగతము. పులిగర్ పాలించిన కామదేవ రాజు ముందా, కల్యాణపుర మేలిన చతుర్థచాళుక్యుడు సోమేశ్వరుఁడు ముందా, యన్నసంశయ మొకటి సిద్ధము. ఎట్లయిన నీకవి శా. ౧౦౨౦ ప్రాంతమువాఁ డనవలెను.

జయంతీపురము రాజధానిగా రాజ్యమేలిన మయూరవర్మచరితము గ్రంథాత్మకమై లండన్ లైబ్రిరీలోనున్నది. కదంబరాజ్యస్థాపకుఁ డైన త్రినేత్రుఁ డనురాజు శివారాధననిరతుఁడు, అతఁ డహిచ్ఛత్రపురమునుండి ముప్పదిరెండుగోత్రములవారిని పన్నెండువేలమంది బ్రాహ్మణులను జయంతీపురమునకు రావించి వారి కొకయగ్రహారము కట్టించె ననియు దాని పేరు స్థాణుగూఢపుర మనియుఁ దెలియుచున్నది. ఈవిషయము నీకవి తనకృతిలో నిట్లు సూచించియున్నాఁడు.

" అనేశా మధ్యదేశా త్ప్రవచనవిదుషాం సోమప బ్రాహ్మణానామ్"

ఈకృతికి కామదేవాంక మనునామాంతరము కలదు. గ్రంథాంతగద్య మిట్లున్నది.

" ఇతి శ్రీహరధరణీ ప్రసూతకాదంబకులతిలక చక్రవర్తివీరకామదేవప్రోత్సాహిత కవిరాజపండితవిరచితే రాఘవపాండవీయే మహాకావ్యే కామదేవాంకే రావణదుర్యోధనవధోల్లాసిత ధర్మాభిషేకో నామ త్రయోదశ స్సర్గః"

ఇతనియీకావ్యరచన ప్రతిజ్ఞ యి ట్లున్నది:—

" ప్రాయః ప్రకరణై క్యేన, విశేషణవిశేష్యయోః,
పరివృత్త్యా క్వచి త్తద్వదుపమానోపమేయయోః,
క్వచి త్పదై శ్చ నానార్థైః క్వచి ద్వక్రోక్తిభంగిభిః
విధాస్యతే మయా కావ్యం శ్రీరామాయణభారతమ్",

ఈకథలు రెండు కలసి యర్ధనారీశ్వరమయిరై శోభిల్లు ననుచు నిట్లనెను.

"రమ్యా రామాయణీ యైషా భారతీ సైవ భారతీ,
అర్ధనారీశ్వరమయీ మూర్తి రేకత్ర శోభతామ్"

కవిత్వరుచి కొకయుదాహరణము:—

"రమ్యా కల్పవిలాసినీ క్షితిపతి ర్లావణ్య తేజస్వినీ,
నిత్యా విమ్కృతమండనా స్థితిమతీ యా భీష్మలోకాన్తరా,
లక్ష్మీరాశ్రయతే స్మ సా మతిమతా మాద్యం సుసేవ్యం ముదా,
దాతారం రమ తానుజేన చ శతానీకే న రామం తదా"

ఈశ్లేషకావ్యము నిర్మించుటలో తనఘనత నిట్లు తెలిపినాఁడు.

"పద మేక మపి శ్లిష్టం వక్తుం భూయాన్ పరిశ్రమః,
కథాద్వయైక్యం నిర్వోఢు కిం ధరాపతితో ఽధికః?

ఈకావ్యమునే యనుసరించి తెలుఁగులో పింగళిసూరనార్యుఁడు రాఘవపాండవీయము రచియించెను.

ఈకవిరాజు తనతండ్రి యగుకీర్తినారాయణుని ప్రీతికై పారిజాతాపహరణము నిర్మించెను. ఆపేరుగలకావ్యములు మఱిమూఁ డున్నవి రాఘవపాండవీయమును రచించిన యింకొకకవి శ్రుతకీర్తి యున్నాఁడు.

# విద్యామాధవుఁడు

ద్వ్యర్థికావ్యకర్తలలో నొకఁ డైనయితఁడు చాళుక్యరా జైన సోమదేవునియాస్థానములోనివాఁడు. ఇతఁడు పూర్వోక్తకవిరాజుతరువాతివాఁ డనియు, అతనివలె నితఁడును వక్రోక్తికవిత్వ గర్వితుఁ డనియు నితనిపార్వతీరుక్మిణీయములోని యవతారికాశ్లోకమే చెప్పుచున్నది. వక్రోక్తిదక్షులు తనతో నలుగురఁట. అయిదవవాఁడు లేఁ డఁట:—

" బాణస్సుబంధుః కవిరాజసంజ్ఞః విద్యామహామాధవపండితశ్చ,
వక్రోక్తిదక్షాః కవయఃపృథివ్యాం చత్వార ఏతే నహి పంచమోఽస్తి
ఇతనియీకృతి యెన్నిసర్గలగ్రంథమో తెలియదుగాని, ఒకయు
ముద్రితపుస్తకమునఁ దొమ్మిదిసర్గలు కనవచ్చుచున్నవి. ప్రతిజ్ఞావాక్య
మిది:—

" హిమాద్రికన్యాసహితం మహేశం, లక్ష్మీసమేతం మధుసూదనం చ,
స్తోతుం తదుద్వాహకథైక్యచిత్రప్రబంధలక్ష్యో దహ ముత్సహిష్యే "

పార్వతీపరమేశ్వరులపెండ్లిని రుక్మిణీకృష్ణులపెండ్లిని జోడించి
వర్ణించిన యీకావ్యము రసవంతముగానే కనవచ్చును గాని, దీని
కెందుచేతనో వ్యాప్తి కలుగలేదు.

కల్యాణపురపాలకుఁడైనపాశ్చాత్యచాళుక్యరాజు సోమేశ్వరుఁ డీకవి
నాదరించినవాఁడు గావున, శా. ౧౦౪౯–౧౦౬౦ నడుమ రాజ్యము
చేసినయతని కీకవి సమకాలికుఁ డగుట స్పష్టము.

ఇతనికవిత్వము సరళముగానే యుండునుగాని శ్లేషవలన దాని
మాధుర్యము మఱుఁగుపడినది–ఒకశ్లోకము–

"నామ్నాకృతో మేశ సమానధామ్నా సా రుక్మిణీ రత్నకృతీర్ద్విజేభ్యః,
ప్రయచ్ఛతా నామ గుణస్య వేత్రా పిత్రాస్వమిత్రాభివృతేన తేన "

ఈ రాజయినసోమదేవుఁడు సర్వజ్ఞత్రిభువనమల్లబిరుదాంకి
తుఁడు. ఇతఁడు మానసోల్లాస మనెడినూఱుసర్గలగ్రంథము నిర్మించెను.
ఇందు సకలకలాశాస్త్రములు ప్రశంసింపఁబడినవి. ఇది యముద్రితము.
తంజావూరుపుస్తకభాండాగారమున నున్నది.

# కల్హణుఁడు

చరిత్రకారులకు భిక్ష పెట్టినయీవిద్వత్కవి కాశ్మీరీయుఁడు శ్రీన
గరనివాసి. మహామాత్యుఁడైన చంపకప్రభునిపుత్త్రుఁడు. సుసలభూనా

యకునికొడు కైన జయసింహునియాస్థానములోని కవిరత్నము. ఆరాజు శా. ౧౦౪౯-౧౦౭౧ నడుమ రాజ్యము చేసెను[1]. —కల్హణునితండ్రి, శా. ౧౦౧౧_౧౦౨౩ నడుమ కాశ్మీర మేలినహర్షరాజుమంత్రిగా నుండెను. కావున నీకవి శా. ౧౦౨౨_౧౦౭౨ నడుమ నున్నవాఁ డని తెలియ నగును. ఇతఁడు కాశ్మీరలౌకికాబ్దము ౨౪ అనఁగా, శా. ౧౦౭౦ లో రాజతరంగిణి నిర్మింప నారంభించెను[2]. ఈమహనీయుఁడు—

" శ్లో ఽన్యః కాల మతిక్రాన్తం, నేతుం ప్రత్యక్షతాం క్షమః ?,
కవిప్రజాపతీం స్త్యక్త్వా, రమ్యనిర్మాణశాలినః "

ఇత్యాదిగా కవిప్రశంసతో రాజతరంగిణి రచియింప నారంభించి ప్రతిజ్ఞ చేసినట్టుగా, తనదాఁకా, కాశ్మీర మేలినరాజులకాలమును వారినాఁటియితరదేశరాజుల కాలమును వారివారియాస్థాన పండితకవుల కాలమును మనకు గోచరింపఁజేసిన కవిబ్రహ్మయే. ఇతఁడు తనకు మున్ను, సువ్రతుఁడు హేలరాజు పద్మమిహిరుఁడు నీలముని క్షేమేంద్రుఁడు మొద లగుకొందఱు కాశ్మీరరాజచరిత్రలు వ్రాసినా రనియు, అందు కొన్ని జీర్ణములు కొన్నిలోపభూయిష్ఠములు కొన్నిదోషదూషితములు గా నున్న వనియు, అందును క్షేమేంద్రునిరాజావళిలో తప్పు లేనియంశమే లే దనియు,

" అంశోఽపి నాస్తి నిర్దోషో క్షేమేంద్రస్య నృపావళౌ "

స్పష్టముగా వక్కాణించి, అందుచే నే నీకృతి నిర్దోషముగా రచియింపఁ బూనితి నని తెల్పుచు, పూర్వరాజశాసనాదులు చూచి

---

1. సుత స్సుసలభూభర్తు స్సంప్ర త్యప్రతిమక్షమః
నందయ న్మేదినీ మాస్తే జయసింహో మహీపతిః,

2. లౌకికే ఽబ్దే చతుర్వింశే శకకాలస్య సాంప్రతం,
సప్త త్యాభ్యధికం యాతం, సహస్రం పరివత్సరాః,
సమా ప్తేయం రాజతరంగిణీకృతిః. శ్రీమహామాత్య
చంపకప్రభుసూనో ర్మహాకవేః కల్హణస్య-రాజత.

రాజతరంగిణి రచియించి నట్లితఁ డవతారికలోఁ జెప్పియున్నాఁడు. కాల నిర్ణయమున నితనిచరిత్రము ప్రమాణ మని చరిత్రకారు లందఱును విశ్వసించుచున్నారు.

ఇతనితరువాత జయసింహాదిజైనోల్లాబదీనరాజపర్యంతము గల కాశ్మీరపాలకులయుదంతము‌ను జోనరాజపండితుఁడును ఫతిహాశాహారాజు వఱకుఁ గలరాజులచరిత్రను శ్రీవరపండితుఁడును, ఫాతిశాహి అక్బరు బల్లాలదీనువఱకుఁ గలవారివృత్తాంతమును ప్రాజ్యభట్టును క్రమముగా రచియించిరి. వారిరచనలు ద్వితీయతృతీయచతుర్థరాజతరంగిణు లన వేఱుగానున్నవి.

కల్హణునిరాజతరంగిణి యెనిమిదితరంగముల మహాకృతి. ఇందు మొదటితరంగము కాశ్మీరరాజ్యమూల పురుషుఁ డైనప్రథమగోనందు నితో నారంభ మైనది, మూఁడవ తరంగము కడపటివఱకు గోనంద వంశములోని పురుషుల మార్పులతో నడచినది నాల్గవతరంగములో, ఆవంశమే మాఱినది కర్కోటకవంశ మారంభ మైనది. అది మరల అవంతివర్మచే ప్రతిహత మైనది. అయిదవదానిలో ఉత్పలదేవుని వంశ పురుషులచరిత్ర వర్ణిత మైనది. ఆఱవదానిలో లోహారవంశరాజచరిత్ర అందలివిశేషములు చూపఁబడినవి. ఏడవతరంగము కలశభూపతిసుతుఁ డగు హర్షరాజుపరిపాలనముతో ముగిసినది. ఎనిమిదవ తరంగము సుసల భూపతిని, అతనిసుతుఁ డైనజయసింహుని వర్ణించినది. అందుచే, ఇందలి యేడుతరంగములే పూర్వకాశ్మీరపాలకులచరిత్రకు సంబంధించిన వగుచున్నవి. ఈయభిప్రాయముతోనే కల్హణుఁడు తనరాజతరంగిణిని సప్తశాఖలతోడి గోదావరీతరంగిణితో పోల్చి శ్లేషగా నిట్లు వర్ణించి యున్నాఁడు.

"గోదావరీసరి దివోత్తములై స్తరంగై, ర్యాతై స్స్ఫుటం సపది సప్తభి రాపతన్తీ

శ్రీకాన్తరాజవిపులాభిజనాబ్ధిమధ్యం, విశ్రాన్తయే విశతి రాజతరంగిణీయమ్,

ఇతఁ డిది గాక జయసింహాభ్యుదయ మనుమహాకావ్యము నిర్మిం చినట్లుగా సుభాషితావళ్యాదులలోఁ గనవచ్చుశ్లోకములనుబట్టి చెప్ప దురు గాని యాకావ్యము మృగ్యము. చరిత్రరచనమున నసదృశసా మర్థ్యము ప్రకటించిన యితనికవిత్వశక్తి రుచిచూచుట కీకవికృత్యవర్ణ నమే చాలును. (రాజతరంగిణ్యవతారికలోనివి)

" భుజవనతరుచ్ఛాయాం యేషాం నిషేవ్య మహౌజసాం,
జలధిరశనా మేదిన్యాసీ దసా వకుతోభయా,
స్మృతి మపి న తే యాన్తి క్ష్మాపా వినా యదనుగ్రహం
ప్రకృతిమహతే కుర్మ స్తస్మై నమః కవికర్మణే "

" యేఽ ప్యాస న్నిభకుంభశాయితపదా యేఽపి శ్రియం లేభిరే,
యేషా మప్యవస న్పురా యువతయో గేహే ష్వహశ్చంద్రికాః,
తాన్ లోకో ఽయ మవైతి లోకతిలకాన్ స్వప్నే ఽప్యజాతా నివ,
భ్రాత స్సత్కవికృత్య ! కిం స్తుతిశతై రంధం జగ త్త్వాం వినా "

సార్వభౌము లైనను దేనియనుగ్రహము లేక స్మృతికి రాఁజా లరో, అట్టి కవికృత్యమునకు నమస్కారము — ఎందఱుమహారాజులు పుట్టి గిట్టినారో ? వారి నెవరు స్మరించుచున్నారు ? ఓయన్నా సత్కవి కృత్యమా ! నీవు లేనిచో లోక మంతయు గ్రుడ్డిదే కదా !

ఆబాల్యముగా శివభక్తుఁ డైనయితఁడు నిర్మించినయర్ధనారీశ్వర శతకము సజీవమై యున్నది. ఇతనిశాంతరసప్రియత్వ మిం దిట్లు గోచ రించుచున్నది.

" క్షణభంగిని జన్తూనాం స్ఫురితే పరిచిన్తితే,
మూర్ధాభిషేక శ్శాన్తస్య రస స్యాత్ర విచార్యతామ్ "

ఎవనివాణి రాగద్వేషరహిత మగునో, అతఁడే శ్లాఘ్యుఁ డనుచు నిట్లు తెలిపెను.

"శ్లాఘ్య స్స ఏవ గుణవాన్ రాగద్వేష బహిష్కృతా,
భూతార్థకథనే యస్య స్థేయ స్యేవ సరస్వతీ"
జయతు- కల్హణవాణీ

# రాజానకరయ్యకుఁడు

కల్హణపండితునికి సమకాలికుఁడైన యీరుయ్యకుఁడు మహాపండితుఁడు కాశ్మీరదేశీయుఁడు, సాహిత్యసారస్వతమున నితఁడు చేసినకృషి యపారము. ఇతఁడు శా. ౧౦౭౨-౧౦౭౭ నడుమ నలంకారశాస్త్రమునఁ బెక్కుకృతులు నిర్మించెను. ఇతఁడు కావ్యప్రకాశ వ్యక్తివివేకాదులకు టీకలు రచియించి అలంకారానుసారిణి సాహిత్యమీమాంస నాటకమీమాంస బృహతి అలంకారమంజరి అలంకారవార్తికము సహృదయలీల మొదలగునెన్నో రచియించెను. ఇతనిరచన లన్నిటిలో నితనికిఁ బేరు తెచ్చినది యాలంకారికుల యాదరముగాంచినది అలంకారసర్వస్వము. ఈపేరఁ గేశవమిశ్రాదులు మఱిముగ్గురు కృతులు నిర్మించిరిగాని, అలంకారసర్వస్వము పేరెత్తఁగా నే రుయ్యకుఁడే స్మృతికి వచ్చుననుట సత్యము. దీనికి జయరథాదులు వ్యాఖ్యలు రచియించి దీనిమహిమ నింకను బ్రసరింపఁజేసిరి.

ఇది సూత్రము వృత్తి ఉదాహరణము నని త్రివిధముగానున్నది. ఇతఁ డలంకారసూత్రములు మాత్రమే నిర్మించె ననియు, నుదాహరణములతోఁడివృత్తి యితనిశిష్యుఁడు మంఖుకపండితుఁడు రచియించి యలంకారసర్వస్వ మనుపేరుపెట్టె నని యు, అనంతశయన ముద్రితగ్రంథాద్యంత శ్లోకములు చెప్పుచున్నవి.

"నమస్కృత్య పరాం వాచం దేవీం త్రివిధవిగ్రహామ్,
గుర్వలంకారసూత్రాణాం వృత్త్యా తాత్పర్య ముచ్యతే"
"ఇతి మంఖుకో వితేనే కాశ్మీరక్షితిపసాంధివిగ్రహికః,
సుకవిముఖాలంకారం త దిద మలంకారసర్వస్వమ్"

పెక్కువ్రాతప్రతులందున్నట్లే కావ్యమాలాముద్రిత పుస్తకమందును "నిజాలంకారసూత్రాణాం" అను పాఠమే యున్నది. వ్యాఖ్యాతలు సూత్రవృత్తులు రెండును రుయ్యకనిర్మితము లనెడిభావమే తెల్పియున్నారు. అయితే మంఖుకుని శ్రీకంఠచరితములోని కొన్నిశ్లోకము లిందు దాహరింపఁబడినమాట నిజము. అది చూచి భ్రాంతిపడి కాఁబోలు మంఖుని యలంకారసర్వస్వమునకు నేను నిబంధవ్యాఖ్య నిర్మించుచున్నాను" అనిప్రతిజ్ఞ చేసిన సముద్రబంధుఁడు నిజాలంకారపాఠమును గుర్వలంకార పాఠముగా మార్చి యుండు ననియు, కడపటి శ్లోకము నతఁడో మఱియొకఁడో చేర్చియుండు ననియుఁ బరిశీలించిన వారికిఁ దోఁచకపోదు. శిష్యునిశ్లోకములను గురు వుదాహరించుట యను చితము కాదు గదా! ఇఁక నేమి? అలంకారసర్వస్వము సర్వము రుయ్యకునిదే, వామనాచార్యునివలెనే యితఁడును తనసూత్రములకుఁ దానే వృత్తి నిర్మించుకొనెను. లేకున్న నతిగూఢార్థము లైనవానిభావ మితరులకు గోచరించునా! కావున, అలంకారసర్వస్వము మంఖుకోపజ్ఞమన్న మాట విశ్వసనీయము కాదు[1].

ఇది భామహరుద్రటాదులమతము లుద్ఘాటించినది, ధ్వనిమతమును సమర్థించినది. కావ్యప్రకాశాదులందు లేని విచిత్రవికల్పాలంకారములను క్రొత్తగాఁ జేర్చినది, ఆలంకారికలోకమున కానందము గూర్చినది. రత్నాపణకారాదు లీమహనీయుని "రుచక" నామమున వ్యవహరించిరి—ఇతనిసహృదయలీల, రెండుశ్లోకములు. ఇందుయువతుల యుత్కర్షకు గుణములను అలంకారములును జీవితమును పరికరములును, హేతువులు— అనువిషయము విశదీకరింపఁబడినది. శోభను గలిగించు ధర్మములు గుణములు:—

1. కదాచిన్మంఖుకోపజ్ఞం కావ్యాలంకారలక్షణం,
గంభీరం నస్తి తీర్ణానాం మంఖుకగ్రంథసాగరం,
బుధపరిషదలంకారో వ్యాఖ్యా దలంకారసర్వస్వమ్" సముద్రబంధుః—

“రూపం వర్ణః ప్రభా రాగ ఆభిజాత్యం విలాసితా,
లావణ్యం లక్షణం ఛాయా సౌభాగ్యం చేత్యమీ గుణాః”

ఈక్రిందియలంకారములు యువతులకు విహితము లని యిట్లు పలికెను.

“రత్నం హేమాంశుకే మాల్యం మండనద్రవ్యయోజనే
ప్రకీర్ణం చేత్యలంకారా స్సప్తై వై తే మయా మతాః”

జీవితపరికరనిరూపణ మిందు కనఁబడదు. ఆశ్లోకములు రెండును పోయిన వేమో! వాటివివరణముమాత్రము వచనాత్మకము గా నున్నది.

## మంఖకుఁడు

ఇతఁడును కాశ్మీరీయుఁడు-ఇతనితండ్రి విశ్వావర్తుఁడు. అలంకారుఁడు శృంగారుఁడు ననువారితనిసోదరులు. వారిలో మొదటియతఁడు సుస్సలరాజ జయసింహరాజులవద్ద మంత్రిగానున్నవాఁడు. రెండవయతఁడందే బృహత్తంత్రాధిపతిగా నున్నవాఁడు.

మంఖుకుఁడు కల్హణునికంటె చిన్నవాఁడు, రుయ్యకునిశిష్యుఁడు. అందుచే నితఁడు శా. ౧౧౩౫-౧౦౭౫ మధ్యవాఁడనవచ్చును. “మంఖుకుఁడు కాశ్మీరక్షితిపతివద్ద సాంధివిగ్రహికమంత్రి” యని సముద్రబంధుఁడన్నట్లింతకు మున్నే చదివియున్నాము, కాని, ఆమాట యితఁడెందును తెలుపుకొనలేదు. మంత్రియైతే యై యుండవచ్చును. ఆసంస్థానములో నితనితండ్రియు సోదరులును మంత్రులే కదా!

రుయ్యకునిప్రియశిష్యుఁడై సాహిత్యనిధి యనిపించుకొన్నయితని యుత్తమకావ్యము శ్రీకంఠచరితము. ఇది యిరువదియైదుసర్గలగొప్ప గ్రంథము. మహేశ్వరుఁడు గావించినత్రిపురసంహార మిందలిప్రధానవిషయము. ఇది యిటీవలనే ముద్రిత మైనది. దీనికి భట్టనోనరాజుకొడుకు జోనరాజు మంచిటీక నిర్మించెను. ఇతనిమఱియొకకృతి అనేకార్థకోశము

కకారాంతాదివిభాగములతో విశదముగా నున్నదీనిలో శబ్దములబహ్వార్థములు తెలుపఁబడినవి. ఇందు తాను జూచినపూర్వనిఘంటువుల నిట్లు చూపినాఁడు.

"భాగురి కాత్య హలాయుధ, హుగ్గామరసింహ శాశ్వతాదికృతాన్,
కోశా న్నిరీక్ష్య నిపుణం, ధన్వంతరి నిర్మితం నిఘంటుంచ"

ఇతఁడు శ్రీకంఠచరితాంతిమసర్గలో తనపూర్వులు సమకాలికులు నైనకృతికర్తలను కొందఱిని స్మరించెను. వారిలో-మురారి రాజశేఖరుఁడు కల్హణుఁడు బిల్హణుఁడు అలకదత్తుఁడు శంభుపుత్రానందుఁడు పద్మరాజు సోమపాలవిలాసకర్త జల్హణుఁడు మొదలగువా రున్నారు.

## మల్లికార్జునపండితారాధ్యుఁడు

దేశములోని పండితారాధ్యకుటుంబముల కితఁడు మూలగురువు పాల్కురికిసోమనాథుని పండితారాధ్యచరిత్రములో నితఁడు నాయకుఁడు శా. ౧౦౧౨-౧౦౯౨ నడుమ నున్నవాఁడు. శైవమతమును శైవసారస్వతమును వృద్ధికి తెచ్చినయీఘనుఁడు రుద్రమహిమ ఉరులింగోద్భవగద్య శ్రీముఖగద్య అమరేశ్వరాష్టకము దీపకళికమహానాటకము మొదలగుకృతులు నిర్మించెను. కాని యివి మృగ్యము లైనవి. శ్రీముఖదర్శనగద్యము మదరాసుప్రాచ్యపుస్తకాగారమున నున్నదఁట.

ఆంధ్రదేశమందలి వీరశైవాచార్యులలో నితఁ డెక్కువఖ్యాతి చెందినవాఁ డనుట కితనిచరితమును తరువాతియాంధ్రులు కర్ణాటకులు సంస్కృతమందును దేశభాషలందును వర్ణించుటయే నిదర్శనము. ఇతని సంస్కృతకృతులలో శ్రీముఖదర్శనగద్య మర్వాచీనశైవులు నిత్యపారాయణగ్రంథముగా నుపయోగించినట్లు కనవచ్చును. ఆగద్యమునాద్యంతముల నున్నమాట లివి:—

" త్రైలోక్యస్య భవా నేవ నిగ్రహానుగ్రహక్షమః,
శ్రీవిశ్వేశ్వర మాం పాహి మహేశ్వర నిరీశ్వర! "

పూర్వవీరశైవుల నిట్లు గ్రంథాంతమందు స్మరించెను. మల్లాణ ప్రియ! భల్లాణప్రియ! కుమ్మరగుండయ్యప్రియ! అఖలభువనభక్తజన ప్రియ!... పరమేశ్వర దేవ! నమస్తే.

" శ్రీమాన్ మాహేశ్వర శ్శిష్టో మల్లికార్జునపణ్డితః,
శ్రీముఖదర్శనగద్యం హృద్య మేత ద్గ్రథితవాన్ "

# పాలకురికి సోమనాథుఁడు

ఇతఁ డొకప్రసిద్ధశైవకవి. ఆంధ్రుఁడు, నైజాము రాజ్యములోని యోరుగల్లుపురమునకు మూఁడామడదూరమున జనగాముతాలూకాలో నున్న పాలకురికిగ్రామ మితనిజన్మస్థలము. ఇది బమ్మెరపోతనామాత్యుని జన్మభూమి యైనబమ్మెరగ్రామమున కొకక్రోసులో నున్నది. పాలకురికి పడమరవైపున నున్నయొకకొండమీఁదిగుహలో సోమేశ్వరలింగము వెలసియున్నది. అందుచే నిది సోమేశ్వరపుణ్యక్షేత్రమై ప్రఖ్యాతి కెక్కినది. ఈసోమేశ్వరు నర్చించుకుటుంబమున జన్మించుటచే నీకవికి సోమనాథుఁ డనుపేరువచ్చినది. ఇతఁడు శా. శ. ౧౦౮౨-౧౧౬౨ నడుమ నున్నవాఁడు. ఇతనితండ్రి విష్ణురామిదేవుఁడు తల్లి శ్రియాదేవి యనియు, వీరు పెంచినజననీజనకు లనియు రెండుపాఠము లున్నవి. ఇం దేదయినను గ్రాహ్యమే.

ఈకవి తెలుఁగునం దనేకకృతులు నిర్మించియున్నాఁడు. సంస్కృతమున దితఁడు రచియించినది సోమనాథభాష్యము. ఇది వీరమాహేశ్వరాచారము నుద్ధరింప నుదయించినది. ఇందు వృషభేంద్రమాహాత్మ్యము మొదలుగా మహాదేవశబ్దనిర్వచనమువఱకు నిరువదియైదు ప్రకరణములు కలవు. ఇతఁడు పంచప్రకార మనెడి గద్య మొదల బసవే

శ్వరుని స్తుతించియున్నాఁడు, ఇతనికి బసవేశ్వరునియందు భక్తి మెండు తఱుచుగా నితఁడు గ్రంథాదియందు బసవస్తుతి చేయుటయే కాక, బసవాష్టకము బసవోదాహరణము మొద లగుకృతులును నిర్మించి యున్నాఁడు. ఇతని తెలుఁగు కవితకన్నను సంస్కృత కవిత్వమే యెక్కువ హృద్యముగా నుండు ననుటకు బసవోదాహరణాదులలోని శ్లోకములు రెండుమూఁడు:—

" య స్సంగీతనిధి ర్య మాహు రభవం యే నార్చితం సూనృతం,
యస్మై స్వస్తి యత స్త్వదీయ మదభూ ద్యద్వీరశైవవ్రతమ్,
య స్యాపాఙ్గసహోదరీ చ కరుణా యస్మి న్మహత్త్వాదికం,
స త్వం త్రీణి జగన్తి పాహి బసవామాత్యేశ చూడామణే ! "

" స్వస్తి శ్రీప్రమథాన్వయోత్తమశిలాదశ్రీమునీంద్రాత్మజః,
శ్రీకంఠప్రతిబింబమూర్తి రనఘః శ్రీనందినాథో విభుః,
త స్యాంశోద్భవ దండనాథ బసవశ్రీనామధేయప్రభో,
త్వత్కారుణ్యతరంగితం మయి సదా నిక్షిప్యతాం వీక్షణమ్ "

" సరసనమస్కృతిగద్యం, వరపదమణిఖచితవాక్సువర్ణాభమ్,
అష్టోత్తరశతకుసుమం, రచితం పాల్కురికిసోమనాథేన "

## సోమప్రభాచార్యుఁడు

ఇతఁడు వైరాగ్యము మూర్తీభవించిన శ్వేతాంబరజైనుఁడు, శా. ౧౧౯౯ ప్రాంతమున, నూ ఱర్థములు వచ్చుశ్లోక మొకటి నిర్మించి శతార్థికబిరుదు మందినవాఁడు. దాని కితఁడే టీక వ్రాయుచు ఒక్కొక్కతీర్థంకరుని కైదుచొప్పున ౨౪ తీర్థంకరులకు ౧౦౦ అర్థములను వివరించె నఁట. ఆశ్లోకము గాని, ఆవ్యాఖ్యగాని యిప్పుడు మనకు లభించవుగాని, కుమారపాలప్రతిబోధకావ్యటీకలో నీమాట లున్న

గర్భములకంకణబంధశ్లోకమువంటిదే యదియు నై యుండును—పైని పేర్కొన్నకుమారపాలప్రతిబోధము నితఁడే ప్రాకృతములో నిర్మించెను.

ఇందు, కుమారపాలునిచరిత్రము వర్ణింపఁబడినది. ఇది ముద్రితము.

జైనమతాభివృద్ధికై దేశము తిరిగినయీతఁడు మతము తప్ప మఱేమియు చూడనివాఁడు. ఆతఁడింకేవేని కృతులు నిర్మించె నేమో కాని యిపుడు లభించినది శృంగారవైరాగ్యతరంగిణి యొకటే. ఇదైనా ౪౬ శ్లోకముల చిన్న కావ్యము—ఇందలి శ్లోకము లివి:—

"సాకార మాలోక్య ముఖం తరుణ్యాః,
కిం ముగ్ధబుద్ధే! ముద మాదధాసి,
ఇదం హి చిత్తభ్రమనాటకస్య
విచక్షణై రాముఖ మాచచక్షే.

"సోమప్రభా చార్యమభా చ య న్నపుంసాం తమః పంకమపాకరోతి,
త దప్యముష్మి న్నుపదేశలేశే, నిశమ్యమానే ఽనిశ మేతి నాశమ్"

సూర్యచంద్రులణఁచలేనితమస్సును నాయుపదేశ మణఁచు నని భావము. మఱియు, వైషయికసుఖము దుఃఖదాయక మని యిట్లు వర్ణించెను.

"సఖే! సుఖం వైషయికం యదేత, దాభాసతే త న్నర కాంతమంతః
సత్యం తదుత్సర్పదఘప్రబంధ, నిబంధనత్వా న్నరకాంత మేవ"

పైకావ్యమునకు ఆగ్రాగ్రామవాసి యైననందలాలు శా. ౧౬౪౧ లో వృత్తి నిర్మించియున్నాఁడు. అది జినభక్తిసూరీంద్రుఁడు గచ్ఛసామ్రాజ్యము పాలించుచున్న సమయము.

"శ్రీజినభక్తిసూరీంద్రే, గచ్ఛసామ్రాజ్యం బిభ్రతి,
అశేషమనుజబృంద, నతపాతాంబుజద్వయే"

ఆకాలమున జైనమత మాదేశమున మంచియభివృద్ధిలో నున్న దని దీనివల్ల తెలియవచ్చును.

# శ్రీ హ ర్ష క వి

చింతామణిమంత్రోపాసకుఁడైనయీకవిచంద్రుఁడు మామల్లదేవీశ్రీహీరులపుత్త్రుఁడు[1] కాన్యకుబ్జరాజగు జయచంద్రునివల్ల సత్కారము లందినవాఁడు. ఈసమ్మానాదివిషయములు రాజశేఖరసూరిప్రబంధకోశాదులవల్ల నిట్లు తెలియవచ్చినది.

"కాన్యకుబ్జపాలకుఁడై వారణాసిలోఁ గాపురమున్నగోవిందచంద్రునికుమారుఁడైనవిజయచంద్రుఁడు తనపుత్త్రుఁడైనజయ (జయంత) చంద్రునికి రాజ్య మిచ్చి పరమపదించెను. ఈజయచంద్రుఁ డేడువందల యోజనములపరిమితి గలభూభాగ మేలెను. ఇతనికి మేఘచంద్రుఁ డను కొడుకు పుట్టెను. ఈజయచంద్రునిసభలో మహాపండితు లనేకు లుండిరి వారిలో శ్రీహీరుఁ డొకఁడు. ఇతఁ డొకనాఁడు శాస్త్రవాదమున నుదయనుఁ డనుపండితునివల్ల నపజయ మంది యితనిపై వైర మూని యుండి యవసానకాలమునఁ దనపుత్త్రుఁ డగు శ్రీహర్షుని బిలిచి "నీవు సుపుత్త్రుఁడ వగుదువేని యుదయనపండితుని రాజసభలో జయింపఁ గల" వనిచెప్పి దేహము విడిచెను. తండ్రిమాట యందలిగౌరవముచే నితఁడు పరదేశముల కేగి సకలశాస్త్రములు పఠించి యుత్తమకవిత నలవఱుచుకొని సద్గురూపదిష్టమైన చింతామణిమంత్రమును గంగాతీరమున నొకయేఁడు దీక్షతో జపించి మంత్రసిద్ధి గాంచి వచ్చి జయచంద్రుని సభలో నుదయపండితు నోడించి పితాజ్ఞ నెఱపి రాజసత్కారము లందెను. ఆతనియానతిని నైషధకావ్యము నిర్మించెను. దానిని గొనిపోయి కాశ్మీరపండితులకు వినిపించి సరస్వతీపీఠమున నుంచి సత్కావ్య మని

---

1. శ్రీహర్షకవిరాజరాజిమకుటాలంకార హీర స్సుతం
శ్రీహీర స్సుషువే జితేంద్రియచయం మామల్లదేవీ చ యమ్,
తచ్చింతామణిమంత్రచింతనఫలే శృంగారభంగ్యా మహా
కావ్యే చారుణి నైషధీయచరితే సర్గోఽయ మాదిర్గతః.

పించుకొని నాఁటికాశ్మీరరా జగుమాధవదేవునిసత్కార మందుకొని కాశికి వచ్చెను."

ఈజయచంద్రుఁడు సంవతు ౧౨౨౫ యారాజ్యాభిషిక్తుఁ డైన ట్లును, సంవతు ౧౨౪౩లో డోదరాఉత్శ్రీఅణంగనామక బ్రాహ్మణునికి గ్రామము దాన మిచ్చినట్లును శాసనములు తెల్పుచున్నవి. శా. ౧౧౧౭లో యవను లితనిని రాజ్యభ్రష్టుని చేసినట్లు దేశచరిత్ర చెప్పు చున్నది. కావున మనకవి శా. ౧౧౫౧–౧౧౧౭ నడుమ నీరాజసభలో విద్వత్కవిగా నున్నవాఁ డని నిశ్చయింపవచ్చును.

ఈకవీంద్రుఁడు తనప్రభునితండ్రిపేర విజయప్రశస్తి రచించి నట్లు నైషధసంచమసర్గాంతశ్లోకము తెలుపుచున్నది[1]. ఈకవి గౌడదేశీ యబ్రాహ్మణుఁడు కావుననే గౌడకులప్రశస్తి నిర్మించె నని కొంద ఱనిరి. అనర్గళకవితాధార గలయితఁడు స్థైర్యవిచార ప్రకరణము ఛందః ప్రశస్తి అర్ణవవర్ణనము శివభక్తిసిద్ధి నవసాహసాంకచరితచంపువు మొద లగుకృతులు నిర్మించిన ట్లితనినైషధీయచరితసర్గాంతశ్లోకములే తెలుపు చున్నవి. కాని, యివి యన్నియు నంతగాఁ బ్రశస్తి గాంచలేదు–విద్వ దౌషధ మనఁబరునితనినైషధ మిరువదిరెండు సర్గలమహాకావ్యము, శైలికఠినమే కాని కావ్యము రసవంతము. లోకప్రసిద్ధము. ఇందలిపది యేడవసర్గలోఁ దనసకలశాస్త్రవిజ్ఞానము వెదచల్లెను. శృంగారరస వర్ణనము రసమర్యాద నతిక్రమించిన దన్నంత దూరము పోయినది. కథాసందర్భోచితముగాఁ దక్కినరసములు కూడా యిందు వర్ణింపఁబడి నవి గాని శృంగారమే యెక్కువ. దశమసర్గాంతశ్లోకమునుబట్టి యితఁడు తర్కశాస్త్రమున నధికపరిశ్రమ చేసినవాఁ డని తోఁచును. నలదమయం తులచరిత మైనయీకావ్యము కలినాశన మనుట నిజము. దీనినుండి రెండుశ్లోకములు.

1. తస్య, శ్రీవిజయప్రశస్తిరచనాతాతస్య భవ్యే మహాకావ్యే.

" అధరం కిల బింబనామకం ఫల మస్మా దితి భవ్య మన్వయం,
లభ తే ఽధర బింబ మిత్యదఃపద మస్యారదనచ్ఛదం దధత్ "
" శిరీషకోశా దపి కోమలా యా, వేధా నిధా యాజ్ఞ మశేష మస్యాః,
పాప్తప్రకర్ష స్సుకుమారసర్గే, సమాపయ ద్వాచి మృదుత్వ ముద్రాం "

ఇతఁడు మమ్మటభట్టునాఁటివాఁ డనియెవరో కల్పించిన కథ నమ్మరానిది. ఇట్టికథల కేమిగాని, రఘువంశాదిమహాకావ్యములలో గణన కెక్కి, ఆసేతుహిమాచలము నేఁటికిని పఠనపాఠవ్యవహారములో నున్నదీనిఘనత వర్ణనాతీత మని మల్లినాథాదివ్యాఖ్యాతలమాటలే చెప్పుచున్నవి.

శ్రీమల్లినాథవిదుషా విదుషాం మతేన,
తే నైష నైషధకథామృతకావ్యబంధః,
వ్యాఖ్యాస్యతే ఽస్తు రసభావగుణార్థదోష
సధ్వన్యలంకృతిరహస్యవిదాం ముదే తత్ "

దీని కింకను, ఆనందరాజానకుఁడు ఈశానదేవుఁడు ఉదయనాచార్యుఁడు మొద లగువారు సుమారు ముప్పదిమంది టీకలు నిర్మించిరి. వా రందఱు కూడా దీనిమహత్త్వమును పలువిధముల ప్రశంసించియున్నారు.

శ్రీహర్షునితక్కిన కృతులలో ప్రశస్తి గాంచి విద్వల్లోకమున వ్యాపించినది ఖండనఖండఖాద్యము. ఇది తనతండ్రిప్రతిపక్షి యైనఉదయనపండితుని యభిప్రాయములను ఖండించిన శాస్త్రవిమర్శన గ్రంథము. ఇది పండితలోకమున పఠింపఁబడుచున్నయుత్తమకృతి. ఇతని శివభక్తిసిద్ధి శివపూజాఫలమును తెల్పునది. స్థైర్యవిచార ప్రకరణము వేదాంతవిషయకము. శాశ్వతయశఃకాయు లయిన మహాకవులలో నితఁడొకఁడు- తండ్రిపేరు నిలిపినకొడుకు:—

## అమాత్య వత్సరాజు

ఇతఁడు కాలంజరాధిపతి యగుపరమర్ది దేవునికాలమందును, అతనికొడుకు త్రైలోక్యవర్మ దేవునిరాజ్యసమయమందును గూడ నున్నట్లితని రూపకములప్రస్తావనలే చెప్పుచున్నవి కావున, శా. ౧౦౮౭-౧౧౨౭ నడుమ నీకవి యుండె నని తెలియ నగును. ఈకవి, కిరాతార్జునీయవ్యాయోగము కర్పూరచరితభాణము రుక్మిణీహరణేహామృగము త్రిపురదాహడిమము హాస్యచూడామణి ప్రహసనము సముద్రమథనసమవాకారము అనెడియాఱురూపకములు నిర్మించెను. వీనిని బరోడాసంస్థానాధీశు లచ్చొత్తించి ప్రకటించియున్నారు.

ఇవి యుదయించి సుమా రేడువందలసంవత్సరము లైనను, వీటికి దేశమున వ్యాప్తి లే దనుట తథ్యము.

కిరాతార్జునీయములో నీశ్వరుఁడు కిరాతవేషముతోనే కాక, దుర్యోధనవేషముతో కూడా పోరాడుట కల్పింపఁబడినది. కర్పూరచరితము లోకములోని కొన్నిభాణములవలె శృంగారమర్యాద నతిక్రమింపక చదువ నింపుగా నున్నది.

## అర్జునవర్మ

భోజమహారాజవంశసంభూతుఁ డైనయీరాజకవి ధారానగరము రాజధానిగా మాలవరాజ్య మేలినశూరుఁడు. ఇతనితాత వింధ్యవర్మ, తండ్రి సుభటవర్మ. గురువు మదనపండితుఁడు.

ఇతఁ డమరుకశతకమునకు వ్యాఖ్య నిర్మించెను. దానియవతారికలోను సుభాషితావళ్యాదులలోను గనవచ్చుమాటలను బట్టియు నితరప్రమాణములనుబట్టియు నితనికాల మిట్లు తెలియవచ్చుచున్నది—ఇతఁడు

శా. ౧౦౬౨-౧౦౭౨ నడుమ చాళుక్యరాజ్య మేలినజయసింహు నితఁడు బాల్యమందే యోడించెను.

"బాలలీలాహవే యస్య జయసింహే పలాయితే,
దిక్పాలహాసవ్యాజేన యశో దిక్షు విజృమ్భితమ్"

ఈరాజు నాయకుఁడుగా నితనిగురువు రచియించినపారిజాతమఞ్జరీనాటిక (సంవత్ ౧౨౧౩) శా.౧౦౭౮ లో శిలాలేఖ చేయబడినది. ఈరా జొనరించినదానములను దెలుపు (సంవతు౧౨౬౭,౧౨౭౦,౧౨౭౨ శా. ౧౧౩౩,౧౧౩౬, ౧౧౩౮ శాసనము లున్నవి. ఈప్రమాణములను బట్టి యీరాజకవి, శా. ౧౦౯౨-౧౧४౦ నడుమ జీవించియున్నవాఁడని విదిత మగును. ఇఁక నితనిమాటలు:—

"క్షిప్తా, శుభ స్సుభటవర్మనరేంద్రసూనుః,
వీరవ్రతీ జగతి భోజకులప్రదీపః"

"దేవభూయం గతే తస్మి న్నందనో ఽర్జునభూపతిః
దోష్ణా ధత్తే ఽధునా ధాత్రీవలయం వలయం యథా"

"అమదకకవిత్వడమరుకనాదేన వినిహ్నుతా న సంచరతి
శృంగారఫణితి రన్యా ధన్యానాం శ్రవణవివరేషు"

ఈక్రిందిశ్లోక మితనిదిగా సుభాషితావళిలో నున్నది. ఇది యితఁడు రచియించినకావ్యములోనిదిగా కనఁబచ్చుచున్నది.

"సీతో ఽస్మి యేన మహతీం సలిలేన వృద్ధిం,
సంయోజితశ్చ సతతం గురుణా ఫలేన,
త చ్ఛోష్యతే దినకృ తేత్యతిచిన్తయేవ
శోకానతం కమలశాలివనం విపాండు"

కేదారములో నీరింకిపోవుట చూచి పండినవరిచేను విచారించుచుతల వంచుకొన్న దఁట.

# మదనపండితుఁడు

ఇతని నాటికలోని నాయిక పారిజాతమంజరి. ఆమె చాళుక్యరాజు కూఁతురు. ఆరాజు మనయర్జునవర్మతో పోరాడి యోడిపోయినపుడు చిక్కుపడిన యాకన్య శరీరము పరిత్యజించి పారిజాతమంజరియై జన్మించినది. ఆమె నితఁడు పెండ్లాడుట యందలివస్తువు. ఈనాటిక యాకాలమున శిలలపై చెక్కింపఁబడినది. ఇపు డాశిలలు పరిశోధకులకు కనిపించిన వఁట:—

# జయద్రథుఁడు

ఇతఁడు కాశ్మీరవాసి. ఇతనితండ్రి శృంగారరథుఁడు, సోదరుఁడు, జయరథుఁడు, గురువులు సుభటదత్తశంఖదత్తులు. శా. ౧౦౨౨ ప్రాంతమునఁ గాశ్మీర మేలినఉచ్ఛలరాజునాస్థానమున నితనిముత్తాత రాజానకశివరథుఁడు మంత్రిగా నుండెను. చండకవి రచియించినపృథ్వీరాజవిజయము నితఁడు తనకృతుల స్మరించియున్నాఁడు. ఆకవి, శా. ౧౧౧౨ ప్రాంతమునందు చాహాణప్రభువుగా నున్నపృథ్వీరాజు నాస్థానములోనివాఁడు. కావున నీజయద్రథుఁడు శా. ౧౧౬౦ ప్రాంతమువాఁ డనుటసుసంగతము.

ఈమహామాహేశ్వరుఁడు రాజానకరుయ్యకునియలంకారసర్వస్వమునకు అలంకారవిమర్శిని యను పేర వ్యాఖ్య రచియించెను. తంత్రాలోకవివేక మనుమఱియొకకృతి నిర్మించెను. వీటికి గణన యేమియు లేదు గాని యితనిహరచరితచింతామణిమాత్రము దేశమున బాగా వ్యాపించినది. ఇది ముప్పదిరెండుసర్గలకావ్యము. దీనినిగూర్చి నావాఙ్మయచరిత్రలోఁ బ్రసంగించియున్నాను. ఇది యెక్కువగా శివమహత్త్వమును, శివునియవతారవిశేషములను వర్ణింపఁబూనిన దైనా, యిం దనేక

చరిత్రాంశములు గోచరించును. అందు కొన్ని యతిశయోక్తు లైనను విశ్వసనీయ లైనకొన్ని విషయములు లేకపోలేదు. పెక్కుసందర్భములం దిది కాశ్మీరరాజతరంగిణిలోనిచరిత్రాంశములను స్థిరపఱుచునట్లుండి యందు లేనివాని నెన్నిటినో బయటఁబెట్టినది. పూర్వమహాతీర్థముల నెన్నిటినో చూపించినది. ఉత్తమపురుషుల నెందఱినో స్మరించినది ఇందలియిరువదియేడవసర్గ యంతయు శబ్దశాస్త్రసంప్రదాయమును పాణిన్యాదిమహామునులవృత్తాంతమును బృహత్కథాకర్త యైనగుణాఢ్యుని వృత్తాంతము నెక్కువగా వర్ణించినది. ఇందు మహిమబోధక మైన యద్భుతవిషయ మున్నను చరిత్రకారుఁడు గ్రహింపఁదగినయంశములు కూడా కలవు. ఒకశ్లోకము;—

"తత్తన్మోహతమోఽపహం పశుపతే ర్య ల్లక్షణం తావకం,
సర్వం పాణినిబద్ధ మిత్యధిగతం యే నాద్వితీయో ఽసి చ,
య న్మాహాత్మ్యవశా దుదేతి చ పరా వాగ్వాచ్య వైచిత్ర్యసూ
స్త స్మై సంవిది సామరస్య మధునా పుష్ణాతు లోకోత్తరమ్"

# మధ్వాచార్యులు

ద్వైతమత ముద్ధరించి ఖ్యాతి గన్నయీమహనీయుని గూడా కవిగా నిందు స్మరింతము— ద్వైతమత మితనిపేరనే మాధ్వ మైనది. ఇతనికి పూర్ణప్రజ్ఞుఁడు ఆనందతీర్థుఁడు ననునామాంతరములు కలవు. పుట్టుపేరు వాసుదేవాచార్యులు—

ఇతఁడు కర్ణాటదేశమందలి ఉడిపిగ్రామమున వేదవేదీమధ్యగేహభట్టులకు జన్మించి అచ్యుతప్రేక్షుఁ డనుగురువు వొద్ద వేదాదివిద్య లభ్యసించి న్యాయవైశేషికములందు త్తీర్ణుఁడై జీవేశ్వరభేదము పాటించుచు ద్వైతమతమును స్థాపించిన ఘనవిద్వాంసుఁడు. పట్టుదలతో తనమతము

నిలువఁబెట్టెనదిట్టి. నేఁటికి నితనిజన్మభూమి యైనఉడిపి ద్వైతులకు పుణ్యక్షేత్రముగా నున్నది.

ఈయన ద్వైతమతవ్యాప్తి నుద్దేశించి రచియించినగ్రంథములనేకములు. మాయావాదమును ఖండింప నిర్మించినవియు నధికములు. వాటిమాట యటుండ సారస్వతసేవగా రచియించినవియుఁ గొన్ని కలవు. అందు గణింపఁదగినది యమకభారతము. ఇందు కురుపాండవకథయే యమకాలంకారప్రధానముగా వర్ణింపఁబడినది. దీని కితఁడే టీక రచియించెను. ఇందలి దొక వాక్యము:—

"యస్య కరాలోలం చక్రం కాలః పరస్యహి కరాలోలం చక్రం,

ఇతనిభారతతాత్పర్యనిర్ణయాదులం దెన్నో విశేషవిషయములు కన్పట్టును. ఇతనిగురుస్తోత్రాద్యాస్తోత్రాదులు తద్భక్తులకు పఠనీయములుగా నున్నవి- ఈమహనీయుఁడు శా. ౧౧౨౧ లో, జన్మించి, శా. ౧౨౦౦ లలో పరమపదించెను. కొందఱు శా. ౧౧౯౦ లో సిద్ధిగాంచె నందురు— ఈపూజ్యుఁడు చాలాకాలము మతవ్యాప్తికి దేశసంచారము గావించి, పిదప, దక్షిణ కర్ణాటదేశములోని సరిదంతరము (నేత్రావతీకుమారధారామధ్యభూమి) చేరి యావజ్జీవ ముందుండెను.

## జయదేవుఁడు ౨.

ఈకవి కౌండిన్యగోత్రుఁడు, సుమిత్రామహాదేవులతనయుఁడు. ఇతనిదేశకాలము లిప్పటికిని సునిశ్చితములు కాలేదు. వంగీయుఁ డని కొందఱివిశ్వాసము. ఉత్తరవిదర్భవాఁ డనియు, కవితామాధుర్యమును బట్టి యితనికి వచ్చినపీయూషజయదేవుఁ డనువాడుక యచ్చట కల దనియు కొంద అందురు. ప్రసన్నరాఘవనాటకమునుబట్టి యితని కాంధ్రదేశమునందు పిల్లమురారి యనుపేరు కలదు. కాని, ఇతఁ డాంధ్రుఁ డనెడిప్రతీతిమాత్రము లేదు. అందుచే ప్రతీతులను గణింప కున్నచో నీకవి వంగదేశము వాఁ డనియే చెప్పవచ్చును.

వామనాచార్యుఁడు మొదలుగా విశ్వనాథకవిరాజువఱకును గలయాలంకారికులలో నొకఁడు నితనిపే రెత్తలేదు గావున సాహిత్యదర్పణమునకు తరువాతనే యితనికృతు లుదయించి యుండు నని కొందఱు. కాలనిర్ణయమునెడ నదియే ప్రధానహేతువు కాఁజాల దని యొకరు. జల్హణుఁడు తనసూక్తిముక్తావళిలో నితనినాటకములోనిశ్లోకములు కూర్చినాఁడు కావున నతని కితఁడు పూర్వుఁ డని కొందఱు ననుచున్నారు. అతనిసూక్తిముక్తావళి తొలుత నుదయించినట్లుగానే లేదు, అర్వాచీనులు తరువాత కొన్నిశ్లోకములు చేర్చిన ట్లున్నది గావున నది ప్రమాణ మనరా దని కొందఱు తలఁచుచున్నారు. అయినా, వట్టి యూహలను గణింపక తత్త్వము తెలువఱకు నదియే ప్రమాణ మను కొని యితఁడు శా. ౧౧౩౦–౧౧౫౦ నడుమ కృతులు నిర్మించి యున్నాఁ డని భావింతము.

ఇతఁడు ప్రసన్నరాఘవనాటకము చంద్రాలోకము రతిమంజరి యనుమూఁడుకృతులు నిర్మించెను. మూఁడవది "నామ్నాపి న శ్రూయతే" యన్న ట్లణఁగి పోయినది. శ్రీమద్రామాయణకథ ప్రధానముగా, మురారియనర్ఘరాఘవమునకు ప్రతిగా నుదయించినయితనినాటకము చక్కఁగా దేశమున వ్యాపించినది. ఇతనికవితకు కీర్తి తెచ్చిన దిదే. ఈక్రిందిశ్లోక మితనికవిత్వప్రియత్వమును చాటుచున్నది.

"న బ్రహ్మవిద్యా న చ రాజ్యలక్ష్మీ, స్తథా యథేయం కవితా కవీనామ్,
లోకోత్తరే పుంసి నివేశ్యమానా, పుత్త్రీవ హర్షం హృదయే కరోతి"

శ్రావ్య మగురీతిని పాత్రసంభాషణము కూర్చుటలో నితఁడు సిద్ధహస్తుఁడు. ఇందలి శతానందరామలక్ష్మణజామదగ్న్యుల సంభాషణ ముదాహరణము. వక్రోక్తివిలసిత మైనయీక్రిందిది రామవిరహావస్థా వర్ణనము.

"సౌమిత్రే! నను సేవ్యతాం తరుతలం చండాంశు రుజ్జృంభతే,
చండాంశో ర్నిశి కా కథా రఘుపతే! చంద్రో౽య మున్మీలతి,
వత్సై త ద్విదితం కథంను భవతా ధత్తే కురంగం యతః,
క్వాసి ప్రేయసి హా కురంగనయనే చంద్రాననే జానకి!

"తమ్ముఁడూ! సూర్యుఁడు మండిపడుచున్నాఁడు, చెట్టునీడకు పోవుదము"
"రాత్రి సూర్యుఁ డేమి టన్నా! చంద్రుఁ డుదయించుచున్నాఁడు"
"నీకెట్లు తెలిసినది?—"అదిగో కురంగము (లేడి) కనఁబడుచున్నది.
"హా కురంగాక్షీ! ప్రేయసీ జానకీ? ఎక్క డున్నావు?

ఇతనిచంద్రాలోకమునుగూర్చి యేవో కింవదంతులు వినవచ్చును గాని, అది యితనిది కా దనువా రుండఁబోరు. విద్యార్థుల కలంకారస్వరూపస్వభావములను సోదాహరణముగా సులభముగా బోధించు నుత్తమగురు వీచంద్రాలోకము. ఇది, అలంకారసారస్వతమున కలంకార మనుట సాహసము కానేరదు. లక్ష్యలక్షణాత్మకము లైనయిందలి శ్లోకములు విద్యార్థివాగ్భూషణములు. ౧౨౦ అలంకారములను చక్కనియుదాహరణములతో ప్రదర్శించినయీకృతి రూపమున చిన్నదయ్యు గుణమున పెద్దది. దీనిలోనిశ్లోకములనే గ్రహించి ఆలంకారికశేఖరుఁడైనఅప్పయదీక్షితులు కువలయానందము నిర్మించె ననుటయే దీనిసమర్థతను సమర్థతను ప్రకటించుచున్నది అతనిమాట యిది:—

"యేషాం చంద్రాలోకే దృశ్యన్తే లక్ష్యలక్షణశ్లోకాః,
ప్రాయ స్త ఏవ తేషా, మితరేషాం త్వభినవా విరచ్యన్తే"

ఈకృతిలోని, ఉపమాలక్షణలక్ష్యరూప మైన ప్రథమశ్లోక మిది:—

"ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీ రుల్లసతి ద్వయోః
హంసీవ కృష్ణ! తే కీర్తిః, స్వర్గం గా మవగాహతే"

అప్పయదీక్షితులయీగ్రంథాంతశ్లోకము, చంద్రాలోకమువల్ల కువలయానందము సంభవించిన దని విశదపఱుచుచున్నది.

"చంద్రాలోకో విజయతాం, శరదాగమసంభవః,
హృద్యః కువలయానందో యత్ప్రసాదా దభూ దయమ్"

జయదేవుని యీ రెండుకృతులును విద్వన్మనోహరములై వివిధ వ్యాఖ్యానములతో విలసిల్లుచున్నవి.

## త్రివిక్రమపండితుఁడు

ఇతఁడు కర్ణాటదేశీయుఁడు. జన్మచే నద్వైతుఁడయ్యు మధ్వాచార్యులశిష్యుఁడై ద్వైతమతావలంబి యైనవాఁడు. శా. శ. ౧౧౬౦ ప్రాంతమువాఁడు. ఇతఁడు, ఉషాహరణ మనెడి మహాకావ్యమును వాయుస్తుతిని నిర్మించెను. ఇవి రెండును ముద్రితములు.

కథ పౌరాణిక మయ్యు నూత్నకల్పనలచే వర్ణనలచే నితనికావ్యము నవ్యతను జూపుచున్నది. కవి యిందు తొలుత, "పాతు వో భగవాన్ హరిః" అని శ్రీహరిని "స్కన్దాభిధానగదితం గురు మద్య మూర్ధ్నా" అనుచు సుబ్రహ్మణ్యగురుని ధ్యానించెను. రీతులను గూర్చి యిట్లనెను.

"వైదర్భమార్గానురతాః కవీన్ద్రాః, కేచిత్పరే గౌడపథప్రవీణాః,
ప్రాయేణ తేషా మనువృత్త్యభావా, ద్ద్వయానభిజ్ఞ స్స్వపథేనయామి"

గ్రన్థాన్తమం దీకవి రాజనింద యిట్లొనరించెను.

"సమరేషు మహీయస్సు త్రిదివే యే పరాజితాః,
తే దైత్యసత్తమా భూమా బభూవు ర్భూభుజాం సుతాః,
అభిషిక్తా శ్చ రాజేషు సప్రభావా స్తరస్వినః,
సువేషా ఇవ తే ఘోషాః సర్వతో గృహ్ణతే శ్రియమ్"

దీనినిబట్టి యితఁడు రాజులను విద్వాంసులను గణింపనినిరంకుశుఁడని తోఁచుచున్నది. ఈకావ్యమునకు సూరీంద్రతీర్థవెంకటనారాయణాచార్యుల శిష్యుఁడైనసుమతీంద్రభిక్షువు రసికరంజని యను వ్యాఖ్య నిర్మించెను. అతఁడును మాధ్వుఁడు.

"త్రివిక్రమసరస్వతీం పఠ ప శేతి సంఘోషిణీ,
ముషాహరణదీపికాం హరిముదే ఒహ మాత స్వయమ్"

అనుచు నీకావ్యమును గౌరవించినయితఁడు తంజావూరుపాలకుఁడైన శహాజీమహారాజు సాస్థానములోని వాఁడు. శా. శ. 1606 ప్రాంతమున నందున్నవాఁడు.

# సుభటుఁడు

ఇతఁడు అన్హిల్వాడసంస్థానపాలకుఁడైన త్రిభువన పాలదేవునినాఁటికవి. శా. శ. 1164 ప్రాంతము వాఁడు. ఇతఁడు దూతాంగదమనురూపకము రచించెను. రామాయణమందలియంగదదౌత్య మిందలి వస్తువు. ఈక్రిందిశ్లోకమును బట్టి యితనికవిత్వశక్తి తెలియనగును.

"భోభో రావణ! రావణాః కతి? బహూ నేతాన్ వయం శుశ్రుమః,
ప్రాగేకం కిల కార్తవీర్యనృపతేర్దోర్దణ్డపిణ్డీకృతమ్,
ఏకం నర్తనదాపితాన్నకబళం దైత్యేంద్రదాసీజనైః,
ఏకం వక్తు మపి త్రపామహే ఇతి త్వం తేషు కో ఒన్యో ఒధునా?"

# అమరచంద్రుఁడు

జైనమతగురువులలో నితఁడొకఁడు. అన్హిల్వాడదగ్గఱ నున్నవగతపుర మితని నివాసము. జినదత్తసూరిశిష్యుఁడైనయీకవి యద్భుతకవితాశక్తివలన సిద్ధసరస్వతీబిరుద మందినవాఁడని జైనకథ కలదు. ఇతని కవితాశక్తి కానందించినవిశాలదేవుఁ డితని నెక్కువగా సత్కరించెను. ఆరాజు శా. 1165-1184 నడుమ గుజరాతుదేశము నేలెను. ఈకవి శా. 1163లో పద్మానంద మనుపేర జినేంద్రసూరిచరితము వర్ణించెను. కావున నితఁడు శా. 1140-1190 నడుమ నున్నవాఁడగును.

ఇతఁడు మహాభారతకథను సంగ్రహించి యథాపర్వముగా బాలభారతము నిర్మించెను. ఇది ముద్రిత మైనది. మఱియు నితనిపేర కావ్యకల్పలత ఛందోరత్నావళి ముక్తావళి కలాకల్పము ననుకృతులు వినవచ్చునుగాని యవి వ్యాప్తికి రాలేదు. ఇతనికవితకు బాలభారతములోని దాకశ్లోకము. ఇందలికల్పన యితనికి వేణీకృపాణబిరుద మిప్పించినదఁట.

“ దధిమథనవిలోలల్లోలదృగ్వేణిదంభా
దయ మదయ మనంగో విశ్వవిశ్వైకజేతా,
భవపరిభవకోపత్యక్తబాణః కృపాణ
శ్రిమమివ దివసాదా వ్యక్తశక్తి ర్వ్యనక్తి ”

# అరిసింహుఁడు

ఇతఁడు లవణసింహునికొడుకు. ధోల్కారాజ్యపాలకుఁ డైనవీరధవళరాజు మంత్రి యగువస్తుపాలునిసత్కార మందినకవి. అమరచంద్రుని కావ్యకల్పలతారచనమునం దితఁడును భాగస్వామి యనియే ప్రతీతి. కావున నితఁడును, శా. శ. ౧౧౬౦ ప్రాంతమువాఁ డనుట స్పష్టము.

ఈకవి వస్తుపాలునిజీవితచరిత్రను సుకృతసంకీర్తన మనుపేర పద్యకావ్యముగా నిర్మించెను. కవితారహస్య మనుమఱియొకకృతి రచియించెను. కాని యివి యచ్చుపడినట్లు కనఁబడదు. జల్హణుఁడు తనసూక్తిముక్తావళిలో అరసిఠాకూరుపద్యములు కొన్ని కూర్చియున్నాఁడు. ఆయరసి యీయరిసింహుఁడే యని కొందఱు భావించిరి. అందలి వీరెండు శ్లోకములు.

“ అతివిపులం కుచయుగళం రహసి కరై రామృశన్ముహు ర్లక్ష్మ్యాః,
త దపహృతం నిజహృదయం జయతి హరి ర్మృగయమాణ ఇవ”

“ మధ్యే న తస్యా విజితః కృశాంగ్యాః,
పంచాననః కాననబద్ధవా సః,

తస్యా స్తన స్తంభతటీధియైన
కుంభౌ గజానాం కుపితో భినత్తి”

# సోమశర్మ

పూర్వోక్తుఁడైనవస్తుపాలునియాదరము గాంచినకవు లింక నెందఱో యున్నారు. వస్తుపాలుఁడు సంవతు ౧౨౯౬ లో గతించినట్లు తెలియుచున్నది గనుక అతని నాశ్రయించినకవులందఱును శా. శ ౧౧౬౨ లోపుననే యతనిసత్కార మందినవా రని భావింపవలెను. అట్టివారిలో వస్తుపాలునిచరితమును వసన్తవిలాస మనుపేర కావ్యముగా నిర్మించినబాలచంద్రసూరియు నీకవియుఁ బ్రధానులు. ఇతనికి సోమేశ్వర దేవుఁ డనియు పేరుగలదు. ఇతఁడు లక్ష్మీకుమార దేవులతనయుఁడు. ఇతని వృద్ధప్రపితామహునిముత్తాత అన్హిల్వాడురాజ్యము స్థాపించినచాళుక్య వంశమూలపురుషుఁ డగుమూలరాజునాస్థానమునందు పురోహితమంత్రిగా ప్రవేశించినాఁడు. నాఁటినుండియు నీకవివంశమువారికి నారాజమంత్రులవంశమువారికి నాశ్రయాశ్రయిసంబంధ మేర్పడియున్నది. వీరధవళ రాజు శా.శ. ౧౧౪౧-౧౧౬౧ వఱకు రాజ్యము చేసెను, విశాలదేవుఁడు ౧౧౬౫ మొదలుగా ౨౮ సంవత్సరములు ప్రభుత్వ మొనరించెను. అందుచే నీసోమశర్మయు నితనిముఖ్యశిష్యు లగుహరిహరుఁడు సుభటుడు ననువారును శా. శ. ౧౧౨౦-౧౧౮౧ వఱకు నున్నవా రగుదురు.

ఈసోమశర్మ కీర్తికౌముది సురథోత్సవము ఉల్లాఘరాఘవము పార్థపరాక్రమము రామశతకము మొద లగుకృతులు నిర్మించి యాకాలమున మిక్కిలి వన్నె గాంచెను. ఇందు మొదటిరెండు నిపుడు ముద్రితములై బొంబాయిరాష్ట్రమున వెలయుచున్నవి. ఇతనికవిత్వ మిట్లు నుతి గాంచినది.

“ వాగ్దేవతా వసన్తస్య కవేః శ్రీసోమశర్మణః,
ధినోతి విబుధాన్ సూక్తిః సాహిత్యామ్భోనిధేః సుధా ”

## జయసింహసూరి

ఇతఁడును జైనుఁడు వీరసూరిశిష్యుఁడు శ్వేతాంబరజైనుల కాచార్యుఁడు వస్తుపాలునిసమకాలుఁడు శా. శ. ౧౧౫౦ ప్రాంతము వాఁడు. వస్తుపాలునితమ్ముఁడు తేజఃపాలుఁడు జైనశ్రేణిని దర్శింపవచ్చి నపు డితఁడు విహారనిర్మాణమునకు ధనము కోరఁగా నతఁడు విశేషధన మిచ్చెను. ఈకవి రచియించినవస్తుపాలప్రశస్తిలో నతఁడును సోదరులును గావించినసత్కృత్యములు వర్ణింపఁబడినవి.

ఇతఁడు హమ్మీరమదమర్దన మనెడిమైదంకములనాటక మొకటి రచియించెను. అందు వీరధవళరాజు ధైర్యశౌర్యాదులును వస్తుపాలాదులశక్తిసామర్థ్యములును వర్ణింపఁబడినవి. శా. శ. ౧౧౫౭ లోని యీ కృతివ్రాతప్రతినిబట్టి యింతకుఁ గొంచెము ముందే యిది నిర్మింపఁబడిన దని తెలియుచున్నది. వస్తుపాలుఁడు శా. శ. ౧౧౮౭ లో వీరధవళునిమంత్రి యయ్యెను గావున ౧౧౫౦ ప్రాంతమం దిది యుదయించియుండును.

ఇతనివస్తుపాలప్రశస్తి చాలుక్యరాజవంశము వారివృత్తాంతము సక్రమముగాఁ దెలుపుచుండుట యొకచారిత్రికవిశేషాంశము. ఇతనికవిత్వము మృదుమధురముగానే యుండును.

"హసతీవాగ్రత స్సాధరుచిసంచయలీలయా,
నృత్యతీవ ధ్వజభుజైః పురీయం త్వయి వీక్షితే"
"దేవ త్వయేవ సూర్యేణ మూర్ధ్ని ప్రతప తాభితః,
వ్యాలీవ భూభృతా ఛాయా దూరభూషితభూ రివ.

## జల్హణుఁడు ౨.

ఇతనిపూర్తిపేరు ఆరోహకభగదత్త జల్హణదేవుఁడు. ఇతనిపితామహుఁడైన జనార్దనుఁడు యాదవరాజమంత్రి. ఇతనితండ్రి లక్ష్మీదే

వుఁడు యాదవరాజకృష్ణభూపతిమంత్రియై మహాశూరుఁడై యతని రాజ్యమును రక్షించినవాఁడు. ఈకవి సూక్తిముక్తావళి యనునీతి కావ్యమును నిర్మించెను. సాహిత్యవిద్యలోఁతు తెలియఁదలఁచినా, సుఖము నొందఁగోరినా, జల్హణునిసూక్తిముక్తావళి చూడు మని యందలి యీశ్లోకము చెప్పుచున్నది.

“ సాహిత్యవిద్యాహృదయం, జ్ఞాతు మిచ్ఛసి చే త్సుఖమ్,
త త్పశ్య జల్హణకృతాం, సూక్తిముక్తావళీ మిమామ్ ”

కాని, గ్రంథాంతమం దున్న యీక్రిందిశ్లోకము వైద్యుఁడయిన భానుపండితుఁ డీకృతి నిర్మించి-(శా. ౧౧౭౯) జల్హణునిపేరు పెట్టినట్లు చెప్పుచున్నది.

“ శాకే ఉజ్జ్వాదిత్రిశ్వరపరిమితే వత్సరే పింగలాఖ్యే,
చైత్రే మాసే ప్రతిపది తిథౌ వాసరే స ప్తసప్తేః,
పృథ్వీం శాస త్యతులమహసా యాదవే కృష్ణరాజే,
జల్హ స్యార్థే వ్యరచి భిషజా భానునా సేయ మిష్టా ”

ఇందలితత్త్వము తెలియ నితరాధారము లేవియు లేవు. గ్రంథమంతా భానుఁడే, రచియించెనో! లేక యవతారికా గ్రంథాంత శ్లోకము లతనిపేర నిర్మించెనో !

తనతండ్రి యాదవరాజ్యమును, నిష్కంటకము గావించి కృష్ణభూపతి కిచ్చినట్లును. తాను గూడా గుణదోషవిచారణయందు చాతుర్యము చూపి రాజ్యతంత్రము నడపినట్లు నిం దిట్లు తెలిపి యున్నాఁడు.

“ మత్పిత్రా దత్త మస్మై ప్రతిహతబలవద్ద్వేషివర్గోపసర్గం,
రాజ్యం ప్రాజ్యప్రభావప్రథితగుణభృతా కృష్ణరాజాయ భక్త్యా ”
“ సారాసారవిచారణాసు చతురః శ్రీజల్హణాఖ్య స్సుధీః ”

ఇందు ౮౬ నీతిపద్ధతు లున్నవి. అన్నియు లోకజ్ఞానదాయకములు. శైలియు సులభము.

# అమృతానందయోగి

అలంకారసంగ్రహ మనెడిపదిపరిచ్ఛేదముల లక్షణగ్రంథము నిర్మించినయీకవి గ్రంథావతారికలో, భక్తిభూపతితనయుఁ డగుమన్మ భూపతికోర్కి నతని కంకితము నీకృతి నిర్మించితి నని మాత్రము తెల్పెనుగాని, యీరాజునివాసాదిక మేమియుఁ దెలుపలేదు. ఆమాట లివి:—

" జగద్వైచిత్ర్యజననజాగరూకపదద్వయమ్,
అనియోగరసాభిజ్ఞ మాద్యం మిథున మాశ్రయే "
" సముల్లాసరసాకారాం తత్త్వకైరవకౌముదీమ్,
నమామి శారదాం దేవీం నామరూపాధిదేవతామ్ "
" ఉద్దామఫలదాం గుర్వీ ముర్వీ ముదధిమేఖలామ్,
భక్తిభూమిపతి శ్శాస్తి శివపాదాబ్జషట్పదః "
" తస్య పుత్ర శ్చాగమవిత్ సముద్రబిరుదాఙ్కితః,
సోమసూర్యకులోత్తంసో మహితో మన్మభూపతిః,
అపృచ్ఛ దమృతానంద మాదరేణ కవీశ్వరమ్
వర్ణరూపం కావ్యకృత్త్వం రసాన్ భావా ననంతరాన్
చాటుప్రబన్ధభేదాంశ్చ విశీర్ణాం స్తత్ర తత్ర తు
సంచి త్యైకత్ర కథయ సౌకర్యాయ సతా మితి
మయా తత్ప్రార్థితే నేత్థ మమృతానందయోగినా "
" నానావిధాలంకృతి మచ్ఛవర్ణాం కన్యా మివైనాం కవితాం వృణీష్వ
అస్యాం యశస్సంతతివృద్ధి రస్తు వివేకవిద్యాధర మన్మభూప! "

ఈకృతిలోని వర్ణగణవిచారశబ్దార్థనిర్ణయాది పంచప్రకరణములు మాత్రము కలకత్తాలో ముద్రితము లైనవి. చెన్నపురి లిఖితపుస్తకాల యములోనిప్రతిలోఁ గూడ నీమైదే కనఁబడుచున్నవి. కాని, అవతారి

కలో వేర్కొనబడినగుణదోషవిచార నాట్యధర్మనిర్ణయాది పంచప్రకరణములు కూడ నితఁడు రచియించె ననియే నమ్మవలసియున్నది.

ఇతఁడు శివభక్తుఁడు. ఈకృతికారకృతిపతు లిరువురు శా. ౧౧-౮౦ ప్రాంతమువా రగుదురు.

## ధర్మదాసు

ఇతఁ డొకజైనపండితుఁడు. చిత్రవిచిత్రవిషయములలోని పెక్కు శ్లోకములను సంగ్రహించి విదగ్ధముఖమండన మనుపేరు నాలుగుప్రకరణములగ్రంథము సమకూర్చినవాఁడు. ఇతనియీకృతి కెందఱో టీకలు నిర్మించిరి. వారిలో జినప్రభసూరి యొకఁడు. అతఁడు శా. ౧౨౫౦ ప్రాంతమువాఁడు. కావున నీకవి శా. ౧౨౦౦ ప్రాంతమువాఁ డనఁదగును. ఈకృతిలోని యొకపద్యము.

“ అనేకసుషిరం వాద్యం కాన్తం స్త్రీముఖపంకజమ్,
విద్ధి తత్ త్ర్యక్షరం రాజన్ చక్షుఃశ్రోత్రసుఖావహమ్ ”

అది “ వల్మీకం ” ఇట్టిపొడుపుకథల కాకర మైన యీకృతి వినోదమూలము——

## దివాకరకవి

ఇతఁడు విశ్వేశ్వరపండితుని కుమారుఁడు. నివాసము తెలియదు. కాని, ఇతఁడు రచియించిన అమోఘరాఘవము తుద నున్నమాటలను బట్టి యితఁ డాకావ్యము శా. ౧౨౨౧ లో రచియించినట్లు తెలియుచున్నది. ఇది ముద్రితము కాదు. మద్రాసుప్రాచ్యపుస్తకాలయములో నున్నది. గ్రంథారంభమందలి వాల్మీకి కాళిదాసాదులస్తుతి శ్రావ్యముగా నున్నది. ఆశ్లోకము లిం దుదాహరించుచున్నాను.

“ వాణీ వాస మవాప యస్య వదనద్వారి ప్రతీత్యేవ హృ
త్పద్మస్థామ్బుజనాభనాభి నివసల్లోకేశ సేవాక్షణమ్,

వల్మీకప్రభవాయ కల్మషభిదే తస్మై పరస్మై నమో,
రామోదాత్తచరిత్రవర్ణనవచః ప్రోద్యోగినే యోగినే ”
“ రమ్యా శ్లేషవతీ ప్రసాద మధురా శృంగారసంగోజ్జ్వలా,
చాటూక్తై రఖిలప్రియై రహరహ స్సంమోహయన్తీ మనః,
లీలా న్యస్తపదప్రచారరచనా సద్వర్ణసంశోభితా,
భాతి శ్రీమతి కాళిదాసకవితా కాన్తేవ తాన్తే రతా ”

# మ ల య క వి

ఇతఁడు దక్షిణదేశమందలిమధురలో నివసించినవాఁడు భారద్వాజ గోత్రుఁడు రామనాథపండితునిసుతుఁడు మీనాక్షీసుందరేశ్వరులసేవకుఁడై నయీకవి మీనాక్షీపరిణయ మను పదునెనిమిదిసర్గలకావ్యము రచియించెను. ఈవిషయ మాకావ్యాంతశ్లోకములే చెప్పుచున్నవి.

“ భారద్వాజకులధ్వజా దుదభవ ద్యో రామనాథా ద్బుధాత్,
పుత్త్రః శ్రీమలయో విచిత్రకవితాపుష్పద్రుమోద్యానభూః,
తస్య శ్రీచరణాబ్జషట్పదపదే సర్గో உభవ త్ప్రాక్తనః
కావ్యే మీనవిలోచనా పరిణయే నామ్న్యే రసాఢ్యై ర్నవైః”
“ తస్య శ్రీపదపద్మసద్మమనస సర్గో உయ మష్టాదశః”

ప్రథమసర్గలోనివర్ణనమునుబట్టి కేరళదేశపాలకుఁడైనకులశేఖర వర్మ తనయుఁ డగుమలయధ్వజరాజు నాదరము గాంచి యితఁ డీకృతి నిర్మించిన ట్లగపడుచున్నది అందలిమాట లివి.

“ కులాద్రిధైర్యః, కులశేఖరాత్మభూ,
ర్మహీశ్వరో உభూ న్మలయధ్వజాహ్వయః”
“ మహీభృతా చన్దనమాత్రదాయినా, ది శేయ మాషాద మునైరి
దక్షిణా.
మయాతు వేశ్యేవ వశీకృ తేతి తాం, తుకస్సితా భ్రైరమలిమ్మతిస్త్రయ

“కరప్రద స్స్యా న్మలయధ్వజః కథం, లయప్రదో౽సౌ మకరధ్వజో నృపః”

కేరళదేశపాలకవంశములో కులశేఖరనామము గలరాజు లెందఱో యున్నారు. ముకుందమాలాకర్త యగునొకకులశేఖరుఁడు శా. శ. తొమ్మిదివశతాబ్దియుత్తరభాగములోనివాఁ డగు ననియింతకు మున్ను చదివియున్నాము. కులశేఖరకర్తృకములుగా తపతీసంవరణను సుభద్రాధనంజయము. ఆశ్చర్యమంజరీకథ మొదలుగా నెన్నోకలవు. అతని పోషణ మందినవారు నిర్మించినయుధిష్ఠిరవిజయాదులుకొన్ని కలవు. ఇందేది యేకులశేఖరునినాఁడు పుట్టినదో తెలియకున్నది. ఈకృతిపోషకుఁడైనమలయధ్వజుఁడు కవియై పెక్కండ్రుకవుల నాదరించినవాఁ డని యీ కృతిలోనిమాటలవల్లనే తెలియుచున్నది.

“య ఏష దివ్యే ఫలకే మహాకవీ, న్నవీనశబ్దార్థరవీ నవీవృగత్”

కావున నీకవి శా. ౧౨౮౦ ప్రాంతమువాఁడనియూహింతము. ఇతనికావ్య మముద్రితము. గ్రంథాదిని వాల్మీకివ్యాసులను స్మరించి ఇఁకతక్కినకవుల నందఱిని స్తుతింపఁ బూనితి నేని గ్రంథము దీనితోనే సమాప్త మయిపోవును. అయినా, ఒక్కనిమాత్రము స్మరింతు నని, కాళిదాసు నిట్లు స్మరించెను.

“పరా నశేషా నపి వర్ణయాని చేత్, ప్రబన్ధపర్యాప్తి రనేన భావినీ,
తథాపి కాళీముఖగర్భపేటికారసజ్ఞ మేకం రసనా దధాతు మే”

“ఉదాత్తకాలాఞ్జనభద్రకాళికా, కటాక్షభాస్వత్కవితాలిప్రియః,
స్మరామి కస్యాపి కవే స్సరస్వతీ, సమాజరాజీవ మహాటవీ రవేః”

తనకవితాశక్తి నిట్లు భంగ్యంతరముగా తెలిపికొనియున్నాఁడు.

“పటుః ప్రబన్ధం ప్రతిపాద్య శుద్ధిమాన్, పురాణవి ద్భ్యామయితుం సతాం ముఖమ్,
స చే ద్రసాలంకృతిభావభాసురః, ప్రవేష్టు మేషాం హృదయాఞ్చ పారయేత్”

# మేదినీకరుఁడు

ఇతఁ డుత్కలదేశీయుఁడు. ఇతనితండ్రి ప్రాణకరుఁడు. ఒరిస్సా ప్రభువు లయినగాంగరాజులలో నొకరి కీమేదినీకరుఁడు సంరక్షకుఁడుగా నున్నవాఁ డని బరోడాలో ప్రకటింపఁబడిన శబ్దరత్నసమన్వయకోశ పీఠికలో నున్నది. మల్లినాథాదు లితని మేదినీనిఘంటువును స్మరించిన మాట స్పష్టము, అంతకు ముందు శా. ౧౨౯౭ లో పృషోదరాదివృత్తి నిర్మించినపద్మనాభదత్తుఁడు తనభూరిప్రయోగమం దితనిని స్మరించియున్నాఁడు[1] కావున నితఁడు శా. ౧౨౪౦ ప్రాంతమున నున్నవాఁ డని తోఁచుచున్నది.

గ్రంథాంతమం దున్నయీక్రిందిశ్లోకమునుబట్టి షట్సతగాథాకోశ మొకటి నిర్మించినట్లు తెలియుచున్నది గాని దానిజాడ యెందును కనరాదు.

"షట్సతగాథాకోశప్రణయనవిఖ్యాతకౌశలే నాయం,
మేదినికరేణ కోశః ప్రాణకరసూనునా విరచితః"

# విద్యానాథకవి

అర్వాచీనలాక్షణికులలో నుత్తమఖ్యాతి గన్నయీవిద్వత్కవి, ఏకశిలానగరము (ఓరుగల్లు) రాజధానిగాఁ ద్రిలింగదేశము పరిపాలించినప్రతాపరుద్రుని యాస్థానములోనివాఁడు. కాకతిప్రభు వైనయీరాజన్యుఁడు శా. ౧౨౧౭-౧౨౪౫ నడుమ రాజ్యముచేసినవాఁడు కావున[1]. మనకవి యీసమయమున నున్నాఁ డనుట విదితము.

విద్యానాథుఁ డన్నది తొలుత బిరుదనామమై పిదప నదే పేరుగా మాఱినదనియు, ఇతని మొదటిపే రగస్త్యుఁ డనియు నాసంస్కృత

1. శాకే శైలనవాదిత్యే చైత్రే మాసి రవేః స్థితా,
ద్వితేన పద్మనాభేన భాషావృత్తి మిదం కృతమ్,

వాఙ్మయద్వితీయసంపుటమున సూచించినవిషయము నిందు కొంత విశ దీకరించుచున్నాను. అగస్త్యుఁ డనుగొప్పవిద్వత్కవి యాకాలమున విద్వల్లోకమునుతి గాంచె ననుటకుఁ గొన్నిప్రమాణములు కలవు-రాజ చూడామణిదీక్షితుఁడు తనరుక్మిణీకల్యాణము నవతారికలో నగస్త్యకవి నిట్లు స్తుతించియున్నాఁడు.

" జడాశయానాం హృదయం జగత్యాం,
యస్యోదయా ద్యాతితమాం ప్రసాదమ్,
స ఏష సారస్వతమర్మవేదీ,
విభాతి మాళౌ విదుషా మగస్త్యః "

మధురావిజయము రచియించినగంగాదేవి యిట్లు నుతించినది.

" చతుస్సప్తతికావ్యోక్తి వ్యక్త వైదుష్యసంపదే,
అగస్త్యాయ జగత్యస్మిన్ స్పృహయే త్కో న కోవిదః ?

సరసకవితాధురంధరుఁ డైనయగస్త్యుఁడు తనమేనమామ యైనట్లు సౌగంధికాహరణము రచియించినవిశ్వనాధకవి యిట్లు పలికినాఁడు.

" వాచ స్తస్య కవే రుదారమధురా ఇత్యత్ర చిత్రం కిము?
ప్రఖ్యాత స్సకలాసు దిక్షు గుణిషు శ్రేయా నగస్త్య స్సుధీః,
వేధ శ్చన్ద్రముఖీ కరాంగుళిదళాసఙ్గక్వణద్వల్లకీ,
వాచోయుక్తిసహోక్తిదర్శితసుధాజన్మా స యన్మాతులః "

ఆగంగాదేవి మెచ్చుకొనినయితనిడెబ్బదినాలుగుకృతు లేమయినవో! చెప్పఁజాలము గాని యితనివిగా నీక్రింది కావ్యములు కొన్ని కనవచ్చు చున్నవి. కొన్నివినవచ్చుచున్నవి. బాలభారతము కృష్ణచరిత గద్యకా వ్యము నలకీర్తికౌముది, లక్ష్మీస్తోత్రము లలితాసహస్రనామావళి మణి పరీక్ష శివస్తవము సకలాధికారము.[1] వీనిలో, ఇరువదిసర్గలమహాకావ్య

1. వాస్తు, శిల్ప, వ్యాకరణశాస్త్రములకు సంబంధించి యితనిపేర మరికొన్నికృతు లున్నట్లు తెలియుచున్నది. గణపతి, సరస్వతీ దశావతార స్తోత్రాదిస్తుతికావ్యము లెక్కు వగా నుండియుండును,

మైనబాలభారతమునకు శ్రీకృష్ణదేవరాయలయాస్థానములోనిదండ నాథుఁ డగుసాలువతిమ్మయ్య మనోహర యనుపేర మనోహర మైన వ్యాఖ్య నిర్మించెను. అతఁడు శా. ౧౪౪౦ ప్రాంతమువాఁడు. దీనిని బట్టియు, విజయనగరసామ్రాజ్య పాలకులలోని వీరకంపరాయనిభార్య యైనగంగాదేవి గొప్పగా నుతించుటచేబట్టియు నీ యగస్త్యుఁ డొకకాల మున మొదటిబుక్కరాయనిసత్కార మందుకొని యాస్థానములో నున్నపుడే యీకావ్యము నిర్మించినాఁ డేమోయని తోఁచుచున్నది.

కృష్ణచరితము వ్రాఁతప్రతిచివర నీక్రిందిశ్లోకము లున్నవి. సర సము ప్రౌఢమునై నయీగద్యకావ్యము నేఁటికిని నముద్రితము.

"శ్రవశ్శ్లాఘస్థూలం కరణభణితిగ్రంథినిపుణైః
కవింమన్యై రన్యైః కిమిహ బహుశోమన్థహారిణైః,
విమర్శాదర్శాన్తఃప్రతిఫలదలంకారరచనై
రగస్త్యః పౌరస్త్యా ననుసరతి సూక్తై స్సుమనసః"

"అనాదృత్య శ్లాఘ్యాన్ భువి కవినిబన్ధా నభిరతిం
కృతౌ వైయాసిక్యాం రచయితు రగస్త్యస్య విదుషః
వసన్తీ వాగ్దేవీ కృతిని రసనాగ్రే వితనుతే
న పర్యఙ్కే పఙ్కేరుహి మహతి శఙ్కే విహరణమ్"

రసవంత మైనయీపద్యరచనము ప్రతాపరుద్రీయపద్యరచన కన్నివిధముల సరివచ్చుచున్న దనియు, మొదటిపద్యములో సూచిత మైనయలంకారప్రియత్వమే యితనిచే నలంకారశాస్త్రగ్రంథము రచి యింపఁజేసిన దనియు మన మిపుడు భావింపనచ్చును. అట్టి విద్వాన్నా థుఁడైన యీయగస్త్యుఁడు ప్రతాపరుద్రయశోభూషణము నిర్మించు నాఁటికి విద్యానాథుఁ డన్నప్రసిద్ధిని గాంచినవాఁ డయ్యుఁ దనమొదటిపే రందు చమత్కారముగా సాభిప్రాయముగాఁ దెలుపక పోలేదు. ప్రతా పరుద్రీయము రెండవప్రకరణములోని ౫౭ వ, పద్య మిది:—

" ఔన్నత్యం యది వర్ణ్యతే శిఖరిణః క్రుధ్యన్తి నీచైః కృతాః,
గాంభీర్యం యది కీర్త్యతే జలధయః క్షుభ్యన్తి గాధీకృతాః,
తత్ త్వాం వర్ణయితుం బిభేమి యదివా జాతో ఽస్మ్యగస్త్య స్తతః,
తత్పార్శ్వే గుణరత్నరోహణగిరే శ్రీవీరరుద్రప్రభో ! "

ఇఁకెందుకు ? అగస్త్యుఁడే విద్యానాథుఁడు, ప్రతాపరుద్రయశోభూషణకర్త.

ఇతనిప్రతాపరుద్రీయము తొమ్మిదిప్రకరణముల యుత్తమగ్రంథము. ఇది కావ్యప్రకాశము ననుకరించిన దైనా, నాటకప్రకరణమున నవ్యత చూపిన యివి కవులకు భాషాభిలాషులకు నెక్కువ సాహాయ్యకారియై వినుతి కెక్కినది. ఇందు కావ్యనాటకాలంకార నాయకాది లక్షణములు సోదాహరణముగా విశదీకరింపఁబడినవి. ఇందలిలక్ష్యము లన్నియు నితఁడు రచియించినవే. ఇందు దండిభామహోద్భటాది పూర్వలాక్షణికమతము లుద్ఘాటింపఁబడినవి. ఈగ్రంథ మాంధ్రదేశమందే కాదు భరతఖండమంతట వ్యాపించినది. దీనికి మల్లినాథసూరితనయుఁడు కుమారస్వామి యజ్వ రత్నాపణ మనువ్యాఖ్య నిర్మించి దీనిఘనత నినుమడింపఁజేసెను. అతఁడు కావించినవిద్యానాథస్తుతి యిది:—

" పుణ్యశ్లోకగుణోక్తి శాణ కషణా దుత్తేజనాం లంభితం
సంజగ్రాహ రసాదిరత్ననిచయం విద్యాధినాథః పురా,

ఆధునికుఁడు గోదావరీతీరకోటిఫలిసమీపరామతీర్థనివాసియునగు చిలకమర్తితిరుమలాచార్యుఁడు రత్నశాణ మనుమఱియొకటీక నిర్మించెను. అదియు వ్యాప్తికి వచ్చినది. అతనిమాట లివి:—

" విద్యానాథః కథ మపి బహో రాకరా చ్ఛాస్త్రజాలాత్
సంజగ్రాహ ప్రకృతికఠినే రత్నజాలం కరణ్డే,
విద్వద్గోష్ఠీహృదయరమణే రత్నశాణే ఽధునాస్మి
న్నస్తర్గాఢద్యుతివిలసితం తత్సముత్తేజయామి "

కృతికర్తవలె నీవ్యాఖ్యాత లిద్దఱు నాంధ్రులు—ఇంక, కృతికర్త యవతారికాశ్లోకములు:—

" రసప్రధానా శ్శబ్దార్థా గుణాలంకారవృత్తయః,
రీతయ శ్చేయతీ శాస్త్రప్రమేయం కావ్యపద్ధతిః,
య ద్యప్యసౌ ప్రబంధేషు ప్రాచాం సాధు నిరూపితా,
తథా ప్యస్యా స్సమం నేతు ర్నోదాహరణ మాదృతమ్ "

ఇతనినలక్ష్మీకౌముదిలోని రెండుసర్గలు మాత్రమే మిగిలి యున్ననే ముద్రణమున కందినవి. కవిత్వము మృదుమధురముగా నున్నది. ఇది భారవికవీంద్రుని కిరాతార్జునీయమువలెనే లక్ష్మీపద లాంఛనము. ఇందు కితనిపద్యము:—

" సా మందస్మితతర్జితాతివిశదజ్యోత్స్నాస్ఫురచ్ఛారదా,
భైమీం శారదపుండరీకవదనాం విప్రౌఘ వాక్సారదాం,
తా మూంచే శిర సాభివాదనపదాం మందస్మితాం శారదా
బాలే త్వా మభియాతు సర్వజగతీసామ్రాజ్యలక్ష్మీ స్స్వయమ్ "

## విశ్వనాధకవి

ఇతఁ డగస్త్యవిద్యానాథునిమేనల్లుఁడు, శా. ౧౨౫౫—౧౩౮౦ నడుమ సారస్వతసేవ చేసినవాఁడు. ఇతనిని మధురావిజయావతారికలో గంగాదేవి యిట్లు నుతించినది.

" చిరం స విజయీ భూయాత్, విశ్వనాథః కవీశ్వరః,
యస్య ప్రసాదాత్, సార్వజ్ఞ్యం సమిం ధే మాదృశే ష్వపి "

దీనినిబట్టి యీకవయిత్రి కితఁడు విద్యాగురువై యుండె నని తెలియుచున్నది—ఇతఁడు సౌగంధికాహరణ మనెడివ్యాయోగము నిర్మించెను. అందలిప్రస్తావనలో—

" ...రాజ్ఞా ప్రతాపరుద్రేణ సంభావితైః...సభాసద్భిః "

ఇత్యాదిగా నున్నసూత్రధారోక్తులనుబట్టి యితఁడు ప్రతాప రుద్రునిసత్కారము లందినవాఁ డని తెలియవచ్చును. ఇతనిపితామహుఁడు సిద్ధనాథుఁడు, తండ్రి గంగాధరకవి. భ్రాత నరసింహకవి. అగస్త్యవిద్యానాథునిసహోదరి వీరిద్దఱితల్లి—ఈకవి తనకవిత నిట్లు పొగడుకొన్నాఁడు.

"విశ్వనాథ ఇతి ఖ్యాతః, కవి రస్తి యదుక్తయః,
అకాంచన మరత్నంచ విదుషాం కర్ణభూషణమ్"

భారతకథయే యిందు సంగ్రహింపఁబడినది. ఇందు భీమాంజనేయులసంవాదము పెంచుటయే విశేషము—ఇది బొంబాయిలో ముద్రితమైనది—ఇతనితండ్రి—

# గంగాధరకవి

భారతకథలో నొకనాటకమువ్రాసినట్లు గంగాదేవి మథురావిజయములోని యీ క్రిందిశ్లోకమువల్ల తెలియుచున్నది. కాని యది మృగ్యము.

"స్తుమ స్త మపరం వ్యాసం గంగాధరమహాకవిమ్,
నాటకచ్ఛద్మనా దృష్టాం య శ్చక్రే భారతీం కథామ్"

ఇతఁడు చంద్రవిలాసము రాఘవాభ్యుదయమునను రూపకములనుగూడా నిర్మించె నందురు. అవియును గనరావు.

# నరసింహకవి

ఇతఁడు గంగాధరకవికుమారుఁడు విశ్వనాథకవికి భ్రాత, కాదంబరీకల్యాణ మనురూపకము నిర్మించెను. ఇది బాణునికాదంబరి ననుసరించినది. వేమభూపాలునిసంగీతచింతామణిలో నీనాటకము ప్రశంసింపఁబడినది. ఇది సజీవము.

# వాగ్భటుఁడు - ౨

వసుంధరా నేమి కుమారులతనయుఁ డగునితఁడు కావ్యానుశాసన మనులక్షణగ్రంథము నిర్మించెను. అయిదధ్యాయములయీకృతి సూత్రవృత్త్యాత్మకము. ఇతఁడు తనకృతిలోఁ బేర్కొన్నచాళుక్యమూల రాజు శా. ౧౨౨౦ ప్రాంతమువాఁ డగుటచే నితనికాలము నదే యని తెలియ నయ్యెడి. మఱియు నితఁ డలంకారకర్త యైనవాగ్భటుని స్మరించుటంబట్టియు, హేమచంద్రునికావ్యానుశాసనము నెక్కువగా ననుకరించుటంబట్టియుఁ బూర్వోక్తకాలము సరి యగుచున్నది. ఇతఁడు జైనుఁడు.

ఇతనికృతిలో స్వతంత్రత చూపట్టనిమాట నిజమే కాని, పూర్వకావ్యములనుండి కైకొని యుదాహరించిన యుందలిపెక్కుశ్లోకములు మాత్రము రంజకముగా నున్నవి. అట్లని కేవలము పరాధీనుఁడు కాఁడు కొన్నిచోట్ల మతభేదము చూపుచు వచ్చినాఁడు. ఇందు కుదాహరణము

" దండివామనవాగ్భటాదిప్రణీతా దశగుణాః, వయంతు
మాధుర్యౌజఃప్రసాదలక్షణాన్ త్రీనేవ గుణాన్ మన్యామహే "

# దేవేశ్వరుఁడు

కవికల్పలత యనులక్షణగ్రంథము నిర్మించినయీకవి మాలవ రాజుమంత్రి యైనవాగ్భటునికొడుకు, ఈవాగ్భటుఁడు మన మింతకు మున్నెఱింగినయాలంకారికవాగ్భటులలోనివాఁడు కాఁడు. ఇతనిమాట లివి.

" మాలవేంద్రమహామాత్య శ్రీమద్వాగ్భటనందనః,
దేవేశ్వరః ప్రతనుతే కవికల్పలతా మిమాం "

ఆమాలవేంద్రునిపేరు తెలుపలేదు. తనకృతిలోనర్థస్తబకమందు హమ్మీరమహీపతిని సంబోధించుచు, ప్రశంసించియున్నాఁడు, కాని,

యతఁ డేదేశము నేలినవాఁడో తెలుపలేము. హమ్మీరనామము గల రాజు లిద్దఱుముగ్గు రున్నారు. వారికాలములు వారివంశములు వేఱువేఱుగా నున్నవి. అందుచే మనకవి నుతించినహమ్మీరుఁ డితఁడే యని నొక్కి వక్కాణింప వీలు గాకున్నది. అయినా యొకింతచూతము.

శార్ఙ్గధరపద్ధతిలో నీతనికృతిలోనిశ్లోక మున్నది గావున నతని కితఁడు పూర్వుఁ డనవచ్చును. అతఁడు శా. ౧౨౦౫ లో శాకంభరీ పాలకుఁడును చౌహాణరాజు నైనహమ్మీరరాజు నాస్థానకవి యగు రాఘవపండితునిపౌత్రుఁ డట. దానినిబట్టి యీకవి యాహమ్మీరునికి సమకాలమువాఁడై శా. ౧౨౦౦ ప్రాంతమువాఁ డగువని తోఁచుచున్నది.

కవికల్పలత, అమరచంద్రసూర్యాదుల కావ్యకల్పలతాదుల ననుకరించిన దనుట కితనిమాటయే చాలును.

"కవిశిక్షాశతం వీక్ష్య కవీంద్రా నుపజీవ్యచ,
నిబ ద్ధేయం మయా ధీరాః త్వరితశ్లోకసిద్ధయే"

దీనికి కవిశిక్ష యని నామాంతరము. ఇందు శబ్దశ్లేషకథార్థ సంజ్ఞలతోఁడి స్తబకములు ప్రధానభాగములు. వానిలో క్రమముగా నాలు గైదా ఱేడు చొప్పున కుసుమము లనువిభాగము లున్నవి. ఆశుకవిత్వాభ్యాసమున కిది సహకారియఁట. శ్రీఃలక్ష్మీః కమలా ఇత్యాది పర్యాయపదములు నేర్చి యేఛందస్సున శ్లోకము నిర్మింపఁ దలఁచెనో దానికి తగినపదము ముందు చేర్చి తరువాత విశేషణము లుపయోగింప వలె నని యొకశిక్ష. ఇట్టిశిక్షలలో సమస్యాపూరణశిక్ష క్రింది దుదాహరణము.

"గంగావ ద్గజగండ వ ద్గగనవ ద్గాంగేయవ ద్దేయవత్-
కీర్తి స్తే విమలా సదైవ కమలా భృంగై రియం సేవ్యతే
శూన్యం శత్రుకులం తవ క్షితిభృతో భేత్తా భవాం శ్ఛక్తితః
చారిత్ర్యం భరతానుయాయి భవతో హమ్మీరపృథ్వీపతే!"

ఇతనికృతికి రామగోపాలకవిరత్నాదులు నలుగు రైదుగురు టీకలు నిర్మించియున్నారు. చంద్రికలాప మనుమణియొకకృతి యితఁడు నిర్మించె నఁట.

# విద్యాధరుఁడు

ఈపండితుఁ డుత్కలదేశీయుఁడు. ఎనిమిదియున్మేషము లనుప్రకరణములతోడి ఏకావళి యనుకావ్యలక్షణము నిర్మించినవాఁడు. కేసరి నరసింహుఁడు లేక వీరనృసింహుఁడితని పోషకుఁడు. అతనిచాటుశ్లోకము లిం దుదాహరించినట్లు నీక్రిందిశ్లోకము చెప్పుచున్నది.

"ఏష విద్యాధర స్తేషు కాంతాసమ్మితలక్షణం,
కరోమి నరసింహస్య చాటుశ్లోకా నుదాహరణ్"

ఈక్రిందిశ్లోకమున వీరనృసింహుఁడు వర్ణింపఁబడెను.

"ప్రతిభటటంకాభుజతటమకరీలుంటాకచాపటంకారః,
వీరనృసింహ ఇ వాజౌ వీరనృసింహ శ్చిరం జయతి"

ఈరా జుత్కలదేశమును క్రీ. ౧౨౮౨–౧౩౦౭ నడుమ పాలించినవాఁ డని పరిశోధకులు. ఇతఁడే కేసరినృసింహుఁ డనియు, ౧౩౦౭ ౧౩౨౭ నడుమ, ఉత్కలకళింగదేశమును పాలించినవాఁడు ప్రతాపనృసింహుఁడనియు కొందఱు. ప్రతాపసింహుఁడే పైశ్లోకములోని వీరనృసింహుఁడని భావించవచ్చును గావున, మనకవి, శా. ౧౨౦౦–౧౨౬౦ నడుమ నున్నవాఁ డని యిప్పటి కనుకొందము.

మల్లినాథాదిమహాపండితుల నుతి గాంచినయితనియేకావళి, మమ్మటునికావ్యప్రకాశపద్ధతి ననుకరించినది. ఇందుభామహామహిమ భట్టానందవర్ధనాదులు పేర్కొనఁబడిరి. దీనిని పండితరాజు అప్పయదీక్షితులు మొద లగువారును సగౌరవముగా స్మరించియున్నారు. తొలుత నే దీనికి విద్వల్లోకమం దొకింత పే రున్నమాట నిజమే కాని, మల్లి

నాథునివ్యాఖ్య (తరళ) ఉదయించినపిదప దీనిఖ్యాతి హెచ్చినది. ఇతని యితరకృతి యేదియు కనరాదు. కవిత్వరుచి కీక్రిందిగ్రంథారంభశ్లోకము

"ప్రాలేయాచలకన్యకాకుచతటీపత్రావళీశిల్పినః,
ప్రేంఖత్ఫాలవిలోచనానలశిఖానిష్ప్లుష్టచేతోభువః
దేవస్యేందువిభూషణస్య రుచిరం పాదారవిందద్వయం,
యుష్మాన్ పాతు సురాసురేశ్వరశిరోరత్నాంశుకింజల్కితమ్"

# భానుదత్తుఁడు

విద్వత్కవికుటుంబములోనివాఁడితఁడు విదేహదేశీయుఁడు, మైథిలబ్రాహ్మణుఁడు, శ్రీహర్షునిఖండనఖాద్యమునకు వ్యాఖ్యవ్రాసినవారిలో నొకఁడగుశంకరమిశ్రుఁ డితనిప్రపితామహుఁడు[1] రసరత్నదీపిక యను నొకకృతి నిర్మించినగణేశ్వరమిశ్రుఁ డితనితండ్రి. ఇతనికి భానుకరమిశ్రుఁ డనునామాంతరమును కవిచక్రవర్తి యనుబిరుదమును కలవు. ఇతఁడు రసమంజరి రసతరంగిణి గీతగౌరీశము అలంకారతిలకము శృంగారదీపిక యనుకృతులు నిర్మించెనుగాని, కడపటిరెండు నిపుడులేవు. ఇతనితండ్రి రసరత్నదీపికయు మృగ్యమే.

ఇతనిరసమంజరికి శా. ౧౩౫౦ లో గోపాలపండితుఁడు వ్యాఖ్య నిర్మించియున్నాఁడు—శా. ౧౧౦౦ ప్రాంతమున జన్మించినఖండనఖాద్యమునకు తరువాత నేఁబదియేండ్లకితనిప్రపితామహుఁడు వ్యాఖ్య వ్రాసియుండు నని భావించినను, దానితరువాత నిఁకెనుబదేండ్లకు విద్వాంసుఁడై కృతికర్త యయ్యె ననుకొనుట యసంభావ్యము కాదుగావున నితఁడు శా. ౧౨౦౦-౧౨౫౦ నడుమ నున్నవాఁ డనిభావింతము. అయినా, యితనికాలమునుగూర్చి మతభేదములు కల వని స్మరింపనగును.

---

1. శంకరమిశ్రుఁడు, శాస్త్రదీపికావ్యాఖ్య, వైశేషికసూత్రోపస్కారము నిర్మించినవాఁడు. చూ. లండన్ లైబ్రరీ కేటలాగు, IV

ఇతనిరసమంజరి స్వకాలమందే ఖ్యాతి కెక్కినది. ఇందు నాయికా నాయకభేదములు తదవస్థాభేదములును లక్ష్యలక్షణసమన్వయముగా విశదీకరింపఁబడినవి. ఒకకానప్రదేశమున నాయకునిరాక కెదురు చూచుచున్ననాయికమాట లివి.

స్నాతం వారిదవారిభి ర్విరచితో వాసో ఘనే కాననే,
శీతై శ్చందనశీకరై ర్మనసిజో దేవ స్సమారాధితః,
నీతా జాగరణవ్రతేన రజనీ వ్రీడా కృతా దక్షిణా,
తప్తం కిం న తప స్తథాపి స కథం నాద్యాపి నేత్రాతిథిః"

ఈకృతికి సుమారుపదివ్యాఖ్యలు వెలసినవి. అందు రంగశాయి విశ్వేశ్వరుఁడనునాంధ్రపండితులు నిర్మించినవి రెండు.

ఇతనిరసతరంగిణి ప్రత్యేకము రసవిచారము కావించిన యెనిమిది తరంగముల లక్షణగ్రంథము. ఇందు తన రసమంజరీ శృంగారదీపికాదు లలోని లక్షణము లుదాహరించుటయే కాక యితరకవుల లక్షణ లక్ష్యములను గూడ గ్రహించి పరామర్శించియున్నాఁడు. వివిధరసవిషయములను కరతలామలకము గావించునీయుత్తమకృతి కెనిమిది వ్యాఖ్యలు వెలసినవి — జీవరాజ నెడిదీనివ్యాఖ్యాత యొకఁడు, తనకు ముందు పుట్టినగంగారామపండితునినౌక యనెడిటీకను నిరసించుచు, సేతు వనెడి తనటీకను స్తుతించుకొనుచు నిట్లు పలికియున్నాఁడు.

" సేతుం పరిత్యజ్య విమూఢబుద్ధయో,
నౌకాదిభిః క్షుద్రవిసారసాధనైః,
తర్తుం సమిచ్ఛన్తి యతన్తి చాపి యే,
చక్షుష్మదంధా ఇతి తేఽపి మే మతిః"

" ఇమాం రసతరంగిణీం రసమయీం గభీరాన్తరాం,
దురన్తవిషయాభిధై రథ తిమింగిలై స్సంకులాం,
వృతాం వివిధసంశయై ర్విమధరై ర్వినా సేతునా,
కథం బుధమతంగజాః ప్రతితరన్తు నౌకాశతైః,

ఇతనిగీతగౌరీశము జయదేవునిగీతగోవిందము ననుకరించిన పది సర్గలకావ్యము. వృత్తములతోను గీతములతోను వెలయుచు శివభక్తి నుద్బోధించుచున్నది. దీనితుదనున్న వాక్య మిది:—

"భవానీ వర్తతే యావ దంగలగ్నా పురద్విషః,
విద్వత్కంఠస్థితా తావ ద్భారతీ ర్వాణీ విరాజతామ్,

# జ్యోతిరీశ్వరుఁడు

విద్యాపతి యనువిద్వాంసునికి మునిమనుమఁడును ధీరేశ్వరునికి కుమారుఁడు నైనయీకవి పల్లిజన్మ మనుగ్రామమున కధిపతి కవిశేఖ రాచార్యబిరుదాంచితుఁడు హరిసింహరాజుమిత్రుఁడు. ఆరాజు శా. ౧౨౨౬లో సీమోౖనుమండలమును పాలించినవాఁడు. ఆగ్రామము గాని యీమండలముగాని యెక్కడివో తెలియరాదు.

హరిసింహుఁ డొకయుద్ధములో మహమ్మదుసుల్తాను నోడించిన పిదప నావృత్తాంతము నీకవి ధూర్తసమాగమ మనుపేరఁ బ్రహసన ముగా నిర్మించెను. ఇది యారాజువిజయోత్సవమునాఁడు ప్రదర్శింపబడి నది. ఈకావ్యమును దీనియనువాదములును జేన, ఫ్రాన్సు-ఇటలీ-దేశ ములలో ప్రకటింపఁబడినవి. అనువిషయములు తెలియవచ్చినవి[1].

మఱియు నీకవి పంచసాయక మనుకృతి నిర్మించెను. కామశాస్త్రము ననుసరించిన యిది లాహోరులో ముద్రిత మైనది. ఇందు స్త్రీ కామసుఖము మంత్రము తంత్రము ఇత్యాదిభాగములు గలవు. ఇందలిశ్లోక మిది.

"దృష్ట్వా మన్మథతంత్ర మీశ్వరకృతం వాత్స్యాయనీయం మతం,
గోణీపుత్రకమూలదేవభణితం బాభ్రవ్యకావ్యామృతమ్,
శ్రీనందీశ్వరచిత్ర దేవఫణితం క్షేమం చ విద్యాగమం
చైతే కామిషు పఞ్చసాయక మితి ప్రీతిప్రదం ప్రాణినామ్"

---

1. డాక్టరుకృష్ణమాచార్యులుగారిసంస్కృత సారస్వతము. పేజి, 650

# శార్ఙ్గధరుఁడు

ఇతనితండ్రి దామోదరపండితుఁడు తాత రాఘవపండితుఁడు. ఈపితామహుఁడు సన్యసించి రాఘవచైతన్యుఁ డనఁబడినవాఁడు మహా గణపతిస్తోత్రము నిర్మించినవాఁడు హమ్మీరభూపతియాస్థానమున విద్వత్కవిగా నుండెడివాఁడు. ఆరాజు శా. ౧౨౧౭లో మృతి నందినట్లు తెలియుచున్నది. కావున నతనిసభలోని రాఘవపండితునిమనుమఁ డగు మనకవి శా. ౧౨౬౦ ప్రాంతమువాఁ డగును. రాఘవపండితుఁడు హమ్మీరభూపతికుమారుఁ డని కొందఱనిరి గాని, యది విశ్వసింపఁదగి నప్రమాణ మేదియుఁ గనరాదు. అందుచే నతఁ డారాజునాస్థానకవి యనుటయే సముచితము[1].

ఈకవి తనపేర రచియించిననీతిగ్రంథము శార్ఙ్గధరపద్ధతి యని ప్రసిద్ధి కెక్కినది. ఇది ౭౫ పరిచ్ఛేదములగ్రంథము. ఇందు కూర్చఁబడిన శ్లోకములు ౪౭౦౦ ఇందితనివి కొన్ని యితరకవులవి కొన్ని. దీని కాలము శా. ౧౨౮౫.

" ఆనందాయ సతాం భూయా త్సుభాషిత మిదం మమ,
ఆద్యై ర్యదుదితైః పద్యైః కియద్భి రపరై రపి "
" న శార్ఙ్గధరపద్ధతిః ఖలజనస్య యోగ్యా భవేత్,
సుభాషితమహోర్మయ స్సుకృతలోకపేయా యతః "

ఈకృతి ముద్రితమై దేశదేశములవ్యాప్తి చెందియున్నది. ప్రాచీనకవులచాటువు లెన్నో యిందు గోచరించి వారిని స్మరింపఁ జేయుచున్నవి.

1. హమ్మీరభూపతి శాకంభరిదేశరా జనుట విచారణీయము.

# విశ్వనాథకవిరాజు

ఇతఁ డుత్కలదేశీయుఁడు. కాళింగు లయినమహాపాత్రబ్రాహ్మణుల శాఖలోనివాఁడు. చంద్రశేఖరకవిపుత్త్రుఁడు. వీ రిద్దఱుకూడ కళింగరాజులయాస్థానమునందు సాంధివిగ్రహికమంత్రులుగా నున్నవారు. ఆకళింగరాజులలో నరసింహనామము కలవా రిద్దఱు ముగ్గురు కనవత్తురు గాని వారిలో నితనినరసింహవిజయ కావ్యమున నాయకుఁ డైన నరసింహరాజు మూఁడనవాఁ డని పరిశోధకు లభిప్రాయపడుచున్నారు. అతనివద్దనే యీకవి మంత్రిగా నున్నచో, అది శా. ౧౨౩౮-౧౨౬౨ మధ్యకాల మగును- శా. ౧౨౩౦ ప్రాంతమందు నిహతుఁ డైనఅలాయుద్దీనుగుణము నితనిపెత్తండ్రియు, మమ్మటునికావ్యప్రకాశమునకు వ్యాఖ్య నిర్మించినయతఁడు నగుచండీదాసపండితుఁ డిట్లు వర్ణించియున్నాఁడు—దీనినిబట్టి పైసమయము సముచితమే యగును.—

"సంధౌ సర్వస్వహరణం, విగ్రహే ప్రాణనిగ్రహః,
అలాయుద్దీననృపతౌ న సంధి ర్నచ విగ్రహః"

ఈకవిరాజు పదిపరిచ్ఛేదములతో సాహిత్యదర్పణ మనుమంచి లక్షణగ్రంథము నిర్మించెను. కావ్యాలంకారాదిలక్షణము లన్నియు నిందు విశదీకరింపఁబడినవి. మమ్మటుని కావ్యప్రకాశమువలెనే యిది దేశమున చక్కఁగా వ్యాపించినది. దీనికి మథురానాథాదులు పెక్కండ్రు వ్యాఖ్యలు రచియించిరి.

ఇతఁడు తనయీకృతిలో నుదాహరించినశ్లోకములనుబట్టి రాఘవవిలాస మనుమహాకావ్యము చంద్రకలానాటిక నరసింహవిజయము ప్రభావతీపరిణయము కువలయాశ్వచరిత్ర యనుకృతులు నిర్మించెనని తెలియుచున్నది. ఇందుకడపటిది ప్రాకృతము. మఱియు నితఁడు ప్రశస్తిరత్నావళి యనుపేర పదునాఱుభాషలలో నర్థ మగునట్లు షోడశార్థ

మగుకరంభకము రచియించెనఁట. కాని యీకృతుల కెందును వ్యాప్తి లేదు. లిఖితపుస్తకపట్టికలనుబట్టి యిందు కొన్ని జీవించియున్న వనవచ్చును. ఇతనికవిత్వమురుచి చూచుటకు రాఘవవిలాస చంద్రికళా నాటికలనుండి యొక్కొకటి:—

"విపినే క్వజటానిబంధనం తవ చేదం క్వ మనోహారం వపుః,
అనయో ర్ఘటనావిధే స్స్ఫుటం నను ఖడ్గేన శిరీషక ర్తనమ్"
"తారుణ్యస్య విలాసః సమధికలావణ్యసంపదో హాసః,
ధరణితల స్యాభరణం యువజనమనసో వశీకరణమ్"

ఇతఁడు సాహిత్యదర్పణములో తనపూర్వకవులను శ్రీహర్షజయదేవాదులను పేర్కొనుటయే కాక, లటకమేలకము హయగ్రీవవధ ఉదాత్తరాఘవము కుందమాల రామాభినందము రామాభ్యుదయము యయాతివిజయము సముద్రమథనము మొద లగుసుమారేఁబది కావ్యములను పేర్కొనియున్నాఁడు. ఇందలిహయగ్రీవవధ ఉదాత్తరాఘవాదులు కొన్ని యితనినాఁటికి సజీవములై తరువాత నడుగంటిపోవుట సారస్వతము దురదృష్టమే:—

## వేంకటనాథకవి

ఇతఁడు శ్రీవైష్ణవుఁడు. కాంచీపురమునకు దగ్గఱగా నున్న తూప్పుల్ అనేగ్రామమున కలియుగము ౪౩౭౧ లో ననఁగా శా. ౧౧౯౧ లో జన్మించెను. ఇతనితండ్రి అనంతసూరి, తల్లితోతారమ్మ గురువు, మేనమామ యైనఆత్రేయరామానుజుఁడు. కవితాచాతుర్యమును తర్కశాస్త్రవాదనైపుణ్యము నితనికి కవితార్కికసింహబిరుదము నిచ్చినవి. విశిష్టాద్వైతమతవ్యాప్తికి బహుగ్రంథములు రచియించి యెక్కువ ప్రబోధము గావించుటచే నితనికి వేదాంతదేశిక, లేక వేదాంతాచార్య బిరుదము వచ్చినది, అష్టాదశవిద్యలయందు విజ్ఞానముకలవాఁ డగుటచేసర్వ

తం(త్రస్వతం(త్రఖ్యాతి వచ్చినది. అసాధారణ(ప్రజ్ఞాశాలి యైనయితనిగొప్ప తనము వెల్లడించుకథ లెన్నో వైష్ణవసం(ప్రదాయమున నెలకొని యున్నవి. అం దనేకములు గ్రంథము లైనవి. ఆచార్యవిజయచంపువు, నిగమాంతాచార్యచరిత్ర, వేదాంత దేశికగద్య, వేదాంత దేశికచరిత, మొదలగునకృతు లితనిమహత్త్వ ముద్ఘోషించుచు వెలసినవి. ఈకవి శా. ౧౨౯౧ లో పరమపదము నొందినట్లు తజ్జీవతచరిత్రలు తెలుపు చున్నవి. అనఁగా నితఁడు ౯౯ సంవత్సరములుజీవించినపుణ్యాత్ముఁ డనుట. వైష్ణవమున "వడగల" శాఖను గల్పించిన యితఁడు కొంతకాల మందందు సంచారము చేసినను, చిరకాలము శ్రీరంగక్షేత్రమున నున్న స్వామిభక్తుఁడు. ఈయన వైరాగ్యపంచకములోనియీ(క్రిందిపద్య మితని విరక్తిని దైవభక్తి నిట్లు తెల్పుచున్నది.

"నాస్తి పి(త్రార్జితం కించి న్న మయా కించి దార్జితమ్.
అస్తి మే హస్తిశైలాగ్రే వస్తు పైతామహం ధనమ్.

ఈమహాకవి సుమారు ౧౨౦ గ్రంథములు రచియించెను. వానిలో సుమారు ముప్పదిహయగ్రీవ(శ్రీభూనీలాది దేవతాస్తుతిరూపము లైనచిన్నకావ్యములు. తక్కినవానిలో నుత్తమమై శ్రీరామపాదసేవా పరమై ప్రఖ్యాతి కెక్కినది పాదుకాసహస్రము—అధికారసంగ్రహ-తత్త్వ ముక్తాకలాప- న్యాయసిద్ధాంజన-రహస్య(త్రయసారాదులు శాస్త్రవిష యకగ్రంథములు. శాస్త్రచర్చలసందర్భమం దీదేశికులఘనతనుగూర్చి వైష్ణవసంప్రదాయ మిట్లున్నది—"అక్షోభ్యతీర్థులకును మాధవవిద్యా రణ్యులకును ద్వైతాద్వైతవివాదము వచ్చినపుడు వేదాంతదేశికులు మధ్యవర్తిత్వము వహించి యీ(క్రిందివిధముగా తీర్పిచ్చినారఁట.

"అసినా తత్త్వమసినా పరజీవప్రభేదినా,
విద్యారణ్యమహారణ్య మక్షోభ్యముని రచ్ఛినత్ "

మఱఁతనియముపాఁకు స్వమతప్రఖ్యాతికొఱకు కల్పించుకొన్న చిట్టికథలు శ్లోకములు నెన్నో యున్నవి. ఇట్టి వన్నియు విశ్వసనీయములు కావు— వేదాంతదేశికుఁ డిట్టినిష్ఠురోక్తు లాడియుండఁ డనియు, అస లావివాదమే కల్పిత మనియు నాయాశయము. చిన్న దైనను, అన్యాపదేశ మైనయీ దేశికుని సుభాషితనీవి హృద్య మయినదే. ఇది సర్వజ్ఞసింగభూపాలునియనుమతి నితఁడు రచియించె నందురు. శా. శ. ౧౨౮౦ ప్రాంతమున రసార్ణవసుధాకరము నిర్మించినయాభూపతి యితని నట్లు కోరినను కోరవచ్చును. రుచిచూచుట కందలివి రెండు:—

" దష్టసారంగయూథోఽపి దంష్ట్రానఖరవా నపి,
భూభృత్కటకసంస్థోఽపి సారమేయో న సింహతి "
" అపి సంతాపశమనాః, శుద్ధా స్సురభిశీతలాః,
భుజంగసంగా జ్జాయంతే భీషణా శ్చందనద్రుమాః "

ఇవి తనకుఁ బ్రతిపక్షులై రాజుల నాశ్రయించియున్నవిద్వాంసులను మనస్సున నుంచికొని చెప్పినవిగా నున్నవి. శ్రీకృష్ణచరిత మభివర్ణించిన యితనియాదవాభ్యుదయ మిరువదినాలుగు సర్గల మహాకావ్యము. ఇది కాళిదాసురఘువంశకావ్యమును బోలి మనోహరముగా నున్నది. ఇతనిహంససందేశ మతని మేఘసందేశమును చక్కఁగా ననుకరించినది. ఇందు కొకచిన్నయుదాహరణము:—

" కాంతోదన్త స్సుహృదుపనత స్సంగమా త్కించిదూనః " కాళి—
" కిం న స్త్రీణాం జనయతి ముదం కాన్తవార్తాగమోఽపి " వేదాన్త—

మఱియు నతనికుమారసంభవము ననుసరించి మారసంభవము నితఁడు రచియించె నందురు. అది కనరాదు గాని, ప్రబోధచంద్రోదయము ననుకరించి యున్నయితని సంకల్పసూర్యోదయము లోకమున వ్యాపించియున్నది. ఇది విశిష్టాద్వైతమతబోధకము. ఈకవికావ్యము లనేకము లిపుడు ముద్రితము లైనవి. ఇతనిపుత్త్రుఁడు—

# వరదాచార్యుఁడు

నయనారాచార్యుఁ డనఁబడునితఁడు కలియుగము ౪౪౧౮లో ననఁగా శా. ౧౨౩౮లో జన్మించినవాఁడు. సంస్కృతసారస్వతమునఁ జక్కనిపరిశ్రమ గావించినవాఁడు కవి. ఇతనికృతు లంతగా దేశమున వ్యాప్తికి రాలేదు. దేశికస్తోత్ర మనుపేర జనకపాదులను నుతించి యున్నాఁడు, తండ్రి హంససందేశమును చూచి యితఁడు హరిణసందేశ శుకసందేశ కోకిలసందేశము లను రచియించియున్నాఁడు ఇతఁడును చిరకాలజీవి:—

# శాకల్యమల్లకవి

కవిమల్లుఁడు మల్లయార్యుఁడు నని యితని నామాంతరములు. ఇతఁ డాంధ్రుఁడు. ఇతనితండ్రి మాధవపండితుఁడు.

ఈకవి సాహిత్యనిష్ణాతుఁ డద్వైతశాస్త్రమం దెక్కువ కృషిచేసి నవాఁడు. వేదాంతదేశికునితనయుఁడైన నయనారాచార్యునితో నితఁడు శాస్త్రవాద మొనరించె ననియు, రాచకొండ నేలుచున్న సింగభూపాలుని సభలో సత్కృతుఁ డయ్యె ననియుఁ జెప్పుదురు.

ఈకవి, ఉదారరాఘవము నిరోష్ఠ్యరామాయణము మొదలగు కృతులు నిర్మించెను. ఇందు మొదటిది యసమగ్రముగా లభించినది ముద్రిత మైనది. ఇతఁడు శా. ౧౩౦౦ ప్రాంతమువాఁ డనఁదగును.

# మాధవార్యసాయణార్యులు

వేదభాష్యాదికర్తలుగా నాసంస్కృతవాఙ్మయచరిత్ర ప్రథమ సంపుటమునఁ బ్రశంసింపఁబడినయీసోదర పండితోత్తము లిందు కావ్య

కర్తలుగాఁ బ్రవేశించిరి. వీరు కర్ణాటకబ్రాహ్మణులు. వీరితల్లిదండ్రులు శ్రీమతీమాయణార్యులు. వీ రిద్దఱును వేదవేదాంగవిద్వర్యులు వీర బుక్కమహీపాల సామ్రాజ్య ధురంధరులు. హరిహరరాజుగురువులు శా. ౧౨౮౦- ౧౩౦౦ నడుమ రాజధానియగు విజయనగరమందుం డిరి. వైదికమతము నుద్ధరింప వైదికవాఙ్మయసేవ చేసినపుంభావ సరస్వతులు:—

వీరిలో చిన్నవాఁ డైనసాయణాచార్యుఁడు బుక్కమహీపతియాన తిచే వేదార్థప్రకాశ మనుపేర ఋగాదివేదములకు భాష్యములు నిర్మించి యన్నగా రయినమాధవార్యునిపేరు పెట్టెను. ఈవిషయము మండలాంతకాండాంతగద్యలవల్లనే విదితమగును. ముద్రితభాష్యావతారికలోఁగనబడని రెండుశ్లోకములు లిఖితపుస్తకములలోఁ గొన్నిటఁ గనవచ్చినవి. అవియుఁ బైసత్యవిషయమునే యిట్లు చెప్పుచున్నవి.

"స ప్రాహ నృపతిం రాజన్ సాయణార్యో మమానుజః
సర్వం వే త్త్యేష వేదానాం వ్యాఖ్యాతృత్వేన యుజ్యతామ్,
ఇత్యుక్తో మాధవార్యేణ వీరబుక్కమహీపతిః
అన్వశాత్సాయణాచార్యం వేదార్థస్య ప్రకాశనే"

వీరిలో మాధవార్యుఁడు విద్యారణ్యుఁ డన్నఖ్యాతినిగన్నవాఁడు. ఇతఁడు శంకరవిజయ మనుపేర జగద్గురుశంకరాచార్యులచరిత్ర రచియించెను. ఇది వ్యాసాచలమహాపండితుఁడు నిర్మించినశంకరవిజయమునకు సంక్షేపరూపము. దానినిబట్టి యిందును చారిత్రాంశములు కొన్ని యతిశయోక్తిభూయిష్ఠము లైనా, కవిత్వము పటువై మృదువై హృదయంగమముగా నుండును. ఇందు జగద్గురుజనన విద్యాభ్యాస మతప్రచార మతాంతరవిజయాదిబహువిషయములు సరసముగా వర్ణింపఁబడినవి. ఆచార్యులవారు మండనమిశ్రుని జయింపఁ బోయినసందర్భములోని శ్లోకములు రెండు.

"అయంచ పంథా యది తే ప్రకాశ్యః సుధీశ్వరో మండనమిశ్రనామా
దిగన్తవిశ్రాన్తయశా విజేయో యస్మిన్ జితే సర్వమిదంజితంస్యాత్"
సదా వదన్ యోగపథం చ సాంప్రతంసవిశ్వరూపః ప్రథితో మహీతలే,
మహాగృహీ వైదికకర్మతత్పరః ప్రవృత్తిశాస్త్రే నిరత స్సుకర్మతః"

వ్యాసాచలుఁడు చిద్విలాసుఁడు సదానందుఁడు మొదలగువారు రచియించినశంకరవిజయ శంకరచరితములు విద్యారణ్యునికృతివలె వ్యాప్తిగాంచలేదు. సాయణాచార్యులు, అలంకారసుధానిధి సుభాషితసుధానిధియనుకృతులు నిర్మించెను. రెండవది రాజపద్ధతుల పెద్దగ్రంథము. ఉపోద్ఘాతపద్ధతిలో కంపభూపతిసభలోఁ దానీగ్రంథము వినిపించినట్లు తెలిపియున్నాఁడు. ఈకంపరాయఁడు విజయనగరసామ్రాజ్యపాలకుఁడైన మొదటిబుక్కభూపతి రెండవకుమారుఁడు.

"భారద్వాజాన్వయభువా తేన సాయణమంత్రిణా
వ్యరచ్యత విశిష్టార్థః సుభాషితసుధానిధిః
స కదాచిత్సమాజే ఽథ కంపభూపం కలానిధిః
అశ్రావయ దనూనశ్రీః నిశ్శ్రేయసకరం పరమ్"

సాయణాచార్యులు యజ్ఞతంత్రసుధానిధి యనుశ్రౌతప్రయోగ గ్రంథము నిర్మించుచు నందలియవతారికలో బుక్కరాజవంశమును నిజవంశము నించుక వర్ణించియున్నాఁడు. ఇతనికవితారీతియు కొన్నిచరిత్రాంశములు తెలియును గావున నందలికొన్నిశ్లోకము లిందుచూపెదను.

"సూర్యాచన్ద్రమసౌ ప్రకాశనవపుషౌ వాస్తాం జగచ్చక్షుషీ,
తాభ్యా మన్వయయో ర్ద్వయం సముదభూ త్తత్రావిరా భూద్యదుః
వంశే చాంద్రమసే తదన్వయనిధిః శ్రీసఙ్గమో ఽభూ న్నృపః,
తస్మాత్ ప్రాదు రభూ దభీష్టసురభిః శ్రీబుక్కపృథ్వీపతిః"
"హరిహరనిభభూమా కామదో ఽభూ జ్జగత్యాం
హరిహరనరపాల స్తస్య భ్రాతా స్తనూజః,

పరిణయతి ధరిత్రీ యస్య కీర్తిప్రతాప
ప్రణిహితపరిణాహై ర్వ్యక్తన క్తం దిగ్రశ్రీః"
"మణ్డలేచ కృపాణస్య మణ్డలాగ్రేచ తీక్ష్ణతామ్,
విమషాం కమ్పయ న్భాతి విద్విషాఞ్చ శిరాంసి యః"
"త స్యాభూ దన్వయగురు స్తత్త్వసిద్ధాన్తదర్శినః,
సర్వజ్ఞః సాయణార్యో యో మాయణార్యతనూద్భవః"
"ఉపేన్ద్ర స్యేవ య స్యాసీ దిన్ద్రః స్సుమనసాం ప్రియః,
మహాకర్మితూనా మాహర్తా మాధవార్య స్సహోదరః"
ఈయాచార్యుఁడు బోధాయను నిట్లు ధ్యానించెను.
"సత్పూత్రాన్వితశాశ్వతాగమమహారత్నం విధానం గిరాం,
ప్రత్యక్షీ్త్త ముపాస్మహే వయ మమీ బోధాయ బౌధాయనమ్,
యద్వ్యాఖ్యానవ మబద్ధ్యబద్ధమహతీం ప్రా ప్యాధ్వరామ్భోనిధేః
పారం యాన్తి మనీషిణో బహువిధై స్తన్త్రస్య త స్యోర్మిభిః"

## లోలంబరాజు

ఇతఁడు హరివిలాస మనెడి యైదుసర్గలమహాకావ్యము నిర్మించెను. సర్గాంతగద్యలలోనియీక్రింది మాటలనుబట్టి యితఁడు హరిహరమహారాజునాస్థానములోనివాఁ డని తెలియవచ్చును.

"ఇతిశ్రీమత్సూర్యవంశితకులాలంకార శ్రీహరిహరమహారాజాధిరాజోద్ద్యోతితలోలంబరాజవిరచితే—" ఈమహారాజు బుక్కరాజు కుమారుఁ డగుటంబట్టి యీకవిరాజు శా. శ. ౧౩౦౦ ప్రాంతమున విజయనగరమున నున్నవాఁ డగును.

ఈకావ్యము బొంబాయిలో ముద్రిత మైనది. కవిత్వము సరసముగానే యుండును. ఇందు కృష్ణుని బాల్యక్రీడలు మొదలుగా కంసవధ

వటువుకు గలకథ వర్ణింపఁబడినది. ఈకవియే లోలంబరాజీయ మను వైద్య గ్రంథము నిర్మించినవాఁడు. హరివిలాసము వ్రాఁతప్రతులలో సర్వత్ర "లోలంబరాజవిరచితే" అనుమాటయే కనవచ్చినది. కవిత్వమురుచి కొకశ్లోకము:—

" య స్త్రాతుం వ్రజ ముజ్జహార సహసా గోవర్ధనక్ష్మాధరం,
యస్త్రైలోక్య మదర్శయ న్నిజముఖాంభోజే యశోదాకృతే,
యః పుత్రం స్వగురో ర్యమాలయగతం శక్త్యా నినాయ క్షణాత్,
యో భూభార మపాచకార సకలం తస్మై నమః శార్ఙ్గిణే "

# జ గ ద్ధ ర భ ట్టు

ఇతఁడు కాశ్మీరీయుఁడు గాడధరభట్టుసంతతివాఁడు పరమశివ భక్తుఁడు. స్తుతికుసుమాంజలి యనునుత్తమకృతి రచియించెను. ఇందు ౩౮విభాగములశివస్తోత్రములు కలవు. సుమారు ౧౪౦౦ శ్లోకముల మహాగ్రంథము. కొంతకాలముక్రిందట కాశీలో శివభక్తమాలాసంపాదకులు దీనిని ప్రకటించియున్నారు. ఈకవి శా. ౧౩౦౦ ప్రాంతమువాఁ డగు నని శివపంచస్తవీప్రకాశకు లూహించినారు. ఉత్పలదేవుని శివస్తోత్రావళి ననుకరించినట్లందందు కొన్నిశ్లోకములు కనవచ్చినను, ఇది యద్భుతవర్ణనలతో మనోహరముగా నున్న దనఁదగును. భక్తులగువారు శివదర్శనామృత సుఖానుభవమున నర్ధనిమీలితనేత్రులై యానందింతు రని యీక్రిందిశ్లోకమున వర్ణించెను.

" యద్దర్శనామృతసుఖానుభవేన ధన్యా,
నేత్రోత్పలాని చిర మర్ధనిమీలితాని,
దృక్ష్మార్గగోచర రవీందుకర ప్రసంగ
భఙ్గ్యేవ బిభ్రతి శివ శ్శివద స్స వోఽస్తు "

# లీలాశుకుఁడు

ఇది శ్రీకృష్ణలీలాగానపారవశ్యమున వచ్చినపేరు. మొదటిపేరు బిల్వమంగళుఁడు. ఈపేరుగలవారు వంగ్రొత్కల మలయ ద్రవి డాంధ్ర దేశములం దున్నట్లు పరిశోధనమతములు కలవు. అందు నీలీదామోద రులపుత్త్రుఁడు నీశానదేవునిశిష్యుఁడు నైనకృష్ణలీలాశుకుఁడు మలబా రులో భారతీనదియొడ్డున ముక్తిస్థలమున నుండెడివాఁ డనియు నతఁడు పన్నెండుతరంగములకృష్ణామృతము రచియించె ననియు నందురు.

"ఈశానదేవచరణాభరణేన నీలీదామోదరస్థిరయశ స్స్తబకోద్గమేన,
లీలాశుకేన రచితంతవ దేవకృష్ణకర్ణామృతంవహతు కల్పశతా న్తరేఽపి"

ఇది యిట్లుండ లీలాశుకుఁడు నిర్మించినది కృష్ణకర్ణామృతత్రిశతి యని ప్రతీతి కలదు. కాని, యొకముద్రితపుస్తకములో ౧౧౨ శ్లోక ములుమాత్రమే యున్నవి. బిల్వమంగళస్తోత్ర మనుపేర ముద్రిత మైన మఱియొకపుస్తకములో ౧౦౯ శ్లోకము లున్నవి. కర్తలు వే ఱనకుండ నందు నిందును పెక్కుశ్లోకములు సమానముగాఁ గనఁబడుచున్నవి. దీని పేరును కృష్ణకర్ణామృతమే యని యీక్రిందివ్యాఖ్యాతృవచనము తెలుపుచున్నది.

"కృష్ణకర్ణామృత స్యైషా టీకా శ్రీభక్తవల్లభా,
భూనిర్జరేణ భట్టేన క్రియతే వనమాలినా"

ఇది గాక త్రిశతికూడా జీవించియున్న దని ముందు తెలియును. దీని నంతనుబట్టి చూడఁగా లీలాశుకనామమునఁ బ్రసిద్ధి కెక్కినబిల్వమం గళు లిద్దఱుముగ్గురు కల రనియు, తన్నామాంకితము లైనకృష్ణకర్ణా మృతములలో పద్యకావ్యము కృష్ణకర్ణామృత సుమంగళస్తోత్ర బిల్వ మంగళస్తోత్ర నామముల నందందు వ్యాపించిన దనియు, వానిలోఁ గొన్నిశ్లోకములు ప్రక్షిప్తము లగుటయుఁ గొన్నిలోపించుటయు సంభవిం

చుటచే శ్లోకసంఖ్య భేదించినదనియుఁ దెలియవచ్చుచున్నది. ఇట్లు దేశభేద గ్రంథభేదములనుబట్టియు నామైక్యమునుబట్టియు లీలాశుకునినిజోదంతము దుర్గమముగాఁ గనవచ్చుచున్నది.

అయినను, దెలిసినంతలో మన మిపు డుద్దేశించిన పద్యరూప కృష్ణకర్ణామృతకర్త యగులీలాశుకునిజీవితము తెలియ యత్నింతము. ఇతనినిగూర్చి కొన్ని కథలు దేశము నలుగడల వ్యాపించినమాట నిజమే కాని, దక్షిణోత్తర దేశములందలి యిద్దఱు వ్యాఖ్యాత లొక్క రీతిగాఁ దెల్పినముఖ్యాంశములకు మూల మైనత్రిలింగ దేశములోనికథ ముందు సంగ్రహముగా తెలిసికొందము—

"కృష్ణవేణ్ణా (కృష్ణానది) తీరమున శ్రీకాకుళ మనుగ్రామమున నొకవిద్వత్కుటుంబమున జన్మించినబిల్వమంగళుఁ డాబాల్యముగా కావ్యనాటకాలంకారపాణినీయము లభ్యసించుచు యౌవనము గాంచు నప్పటికి విద్వాంసుఁడై కవియై వెలయుచుండెను. ఆసమయముననే నది కావలియొడ్డున నున్నయొకయూరిలో విద్యావతి ధనవతి యునగునొక వారవధూటి విలసిల్లుచుండెను. ఒకరిగుణము లొకరు వినుచున్నవీరిరువు రికిని కర్మవశమున సంబంధ మేర్పడినది—ఒకనాఁటి రేయి మాటలసం దర్భమున " రేపు మాతండ్రిగారియాబ్దిక " మని యితఁ డనఁగా " అట్ల యిన రేపురాత్రి మీరు మాయింటికి రాఁగూడ " దని యావేశ్య చెప్పి యట్లే రానని యితనిచే నొట్టుపెట్టించుకొనెను.

అది వర్షాకాలము. మఱునాఁడు జామురాత్రియైనది గాఢాంధ కారము వేఱు పొంగుచున్నది. రేవునావ యావలియొడ్డున నున్నది. ఇదంతా తెలిసియు బిల్వమంగళుడు మన సాపలేక యిల్లు వెడలి తెప్ప వేసికొని నది యీఁదివచ్చి యర్ధరాత్రిమున వేశ్యయిల్లు చేరి తలుపు తట్టెను. గట్టిగా పిలిచెను "నియమ భంగము శపథ భంగము గావించి తివి. తలుపు తీయు" నని బదులు వచ్చినది. సరే కా నిమ్మని ప్రాకార

పొక్కి యితఁడు దొడ్డిలోని కుటికేఁగెను. అపుడు దైవికముగా నచ్చట ప్రాకుచున్న కృష్ణసర్పము నెత్తిమీఁద కాళ్లు పడుటచే తల చిదికి యది చచ్చినది. పాము కాళ్లకు తగినభయముచే వెఱ్ఱికేక వేసి ముందు కెగిరి బాడిసేల మీఁద కాళ్లు జాఱి తలక్రిందుగా నితఁడు పడెను. ఆధ్వని విని యితనికామత్వరకు ప్రతీకారముగా నది వస్త్రవిసర్జనము చేసి దీపము చేతఁ బట్టుకొని, యొకరాత్రి మనస్సు నిలుపలేని నీచదు వెందు కనుచు తిన్నగా నెదుటికి వచ్చెను. ఆవెలుతురులో రోఁత పుట్టించు దానిరూపము చచ్చినకృష్ణసర్పమును చూచుటచే నొక్కమాఱుగా విరక్తియు కృష్ణభక్తియు మనస్సున నంకురించినవి. అంతే. హాకృష్ణా యని వీథి తలుపు తీసుకొని బయటఁబడి యక్కడికి రెండామడదూరములో కృష్ణ యొడ్డున నున్న కృష్ణాపురమనుగ్రామమునకు పోయి యందున్నగోపాలస్వామియాలయములో ప్రవేశించి యావజ్జీవబ్రహ్మచారియై భక్తియోగనిష్ఠతో కాలము గడపెను. ఆసమయమున నితఁడు గానముచేయుచు వచ్చినశ్లోకములే కృష్ణకర్ణామృత మనుపేర శిష్యముఖమున దేశదేశముల వ్యాపించినవి. జీవన్ముక్తుఁడైన యీబిల్వమంగళుఁడే భక్తలోకమున లీలాశుకుఁ డయ్యెను"

ఈకావ్యమునకు దేశమునలుదెసల వ్యాఖ్య లుదయించినవిగాని, వానిలో మొదటిది పిసుపాటియల్లయసూరి నిర్మించినది. అతఁడు కొండమాంబాతిరుమలభట్టులతనయుఁ డాంధ్రుఁడు[1]. అతఁడే యీలీలాశుకునిజన్మభూమి కృష్ణాతీరమందలి శ్రీకాకుళ మని తొలుతఁ దెలియఁ

1. ఉత్తమపండితుఁడును విష్ణుభక్తుఁడు నైనయీవ్యాఖ్యాతపేరే తరువాత నితనివంశము వారి కింటిపేరై క్రమముగా వాడుకలో యరనూరిగా మాఱినట్లుతోఁచుచున్నది. యరనూరివారు, పిసుపాటివారు, నేఁటికిని శ్రీకాకుళములో నివసించుటయే యిందుకు నిదర్శనము. అందుచే నీవ్యాఖ్యాత యాంధ్రవిష్ణుస్థానమైనశ్రీకాకుళమువాఁడే యనియు, తనవంశవృద్ధపరంపరనుండి వినవచ్చుచున్నలీలాశుకునియాదంత మెఱిఁగియే యీకథ [illegible]పియుండు నని భావింపవచ్చును.

జేసినవాఁడు, ప్రథమశ్లోకవ్యాఖ్యలో పూర్వోక్తకథలోని యీక్రింది ముఖ్యాంశము నెతిఁగించినవాఁడు నతఁడే.

"చిన్తామణి ర్జయతి సోమగిరి ర్గురు ర్మే,
శిక్షాగురుశ్చ భగవాన్ శిఖిపిఞ్ఛమౌళిః,
యత్పాదకల్పతరుపల్లవశేఖరేషు
లీలాస్వయంవరరసం లభతే జయశ్రీః"

చిన్తామణి–ఇది లీలాశుకుఁడు జపించినమంత్రము, లేదా, ఇతని కామంత్ర ముపదేశించినయోగి, లేదా, చింతామణివంటిసోమగిరి యనుయోగీంద్రుఁడు, లేదా, చింతామణివలె దానగుణశీలురాలైన సోమగిరి యనువేశ్య–ఈవికల్పములనుబట్టి చింతామణిసోమగిరిశబ్దముల యర్థ మతనినాఁటికే యుఱ్ఱూఁగుపడిన దని తెలియుచున్నది గాని, కవికి వేశ్యతోఁగలసంబంధముమాత్ర మావ్యాఖ్యాతకు విద్వత్పరంపరాయాతమై వినవచ్చె ననుట స్పష్టమే. ఈకృతి కుత్తరదేశమందలి రూపగోస్వామిశిష్యుఁడై నకృష్ణదాసు కర్ణానందప్రకాశిని యనుటీక వ్రాయుచు, పూర్వోక్తకథ సంగ్రహించి తెల్పునెడ "కవి, దక్షిణాపథములోని వాఁడు. కృష్ణవేణ్ణాతీరవాసి బిల్వమంగళుఁడు పూర్వకర్మవాసనచే చింతామణి యనువేశ్యయం దాసక్తుఁ డయ్యెను" ఇత్యాదిగా నితనివిరక్తికథను దెలియఁజేసెను. ఇంక, పాలంకిబ్రహ్మభట్టు అనంచరామచంద్రుఁడు మొదలగునాంధ్రదేశవ్యాఖ్యాతలు పూర్వోక్తకథను సమర్థించుచు నవతారికలు వ్రాసి రని వేఱుగఁ జెప్పనేల? కావున, పద్యరూపకర్ణామృతకర్తయైనయీబిల్వమంగళుఁ డనులీలాశుకుఁ డాంధ్రదేశములోనికృష్ణాతీరమందలిశ్రీకాకుళమున జన్మించినవాఁ డని విశ్వసింతము. ఇఁక నితనికాలమందుమా, తన్నిర్ణయమున కాధారము లేవియు లభింపకున్నవి గావున శా. ౧౨౫౦–౧౩౫౦ నడుమ నున్నవాఁ డగు నని భావింతము.

లండన్ లైబ్రరీ, అముద్రితసంస్కృతగ్రంథపట్టిక సప్తమ సంపుట ములో "లీలాశుకుఁ డనుబిల్వమంగళుఁడు రచియించినదిగా సుమంగళ స్తోత్ర మొకటి కలదు. అందు ३८३ శ్లోకము లున్నవి. వానిలో ముద్రిత మైనకృష్ణకర్ణామృతములోని శ్లోకములు నున్నవి" అని తద్వివరణకర్త తెలిపియున్నాఁడు. దానినిబట్టి ८३ ప్రక్షిప్తశ్లోకములతోడి యాసుమంగళస్తోత్ర మీలీలాశుకుఁడు నిర్మించినకృష్ణకర్ణామృతత్రిశతియై యుండు ననియు, ముద్రితకృష్ణకర్ణామృతములో రమారమి రెండువందల శ్లోకములు చేరలే దనియు భావింపవలసి వచ్చినది. ఆపుస్తక మాలండన్ లైబ్రరీలో నింకను సజీవమై యున్నదేమో తెలిసికొని దానిప్రతి వ్రాయించి తెప్పించుట యాంధ్రులకర్తవ్యము. దానికడపటిశ్లోకములలో నిది యొకటి:—

"యం శైవా స్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాన్తినో,
బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః,
అర్హ న్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః
సోఽయం నో విదధాతు వాంఛితఫలం శ్రీదేవకీనన్దనః"

ఈశ్లోకము లీలాశుకునిదో ప్రక్షిప్తమో! లండన్ పుస్తకము చూచుదనుక నిర్ణయింపలేము.

ఇతనికవిత్వము నవనీతమువలె మృదువై తేనెవలె మధురముగా నుండు ననుట విదితము:—

"రాధా పునాతు జగదచ్యుతదత్తచిత్తా,
మంథాన మాకలయతీ దధి రిక్తపాత్రే
తస్యా స్తనస్తబకచఞ్చలలోలదృష్టి
ర్దేవోఽపి దోహనధియా వృషభం నిరున్ధన్"

"విక్రేతుకామా కిల గోపకన్యా
మురారిపాదార్పితచిత్తవృత్తిః,

దధ్యాదికం మోహవశా దవోచ
ద్గోవింద దామోదర మాధవేతి"

# నా రా య ణ క వి

పేటర్సనువ్రాసిన హితోపదేశపీఠికనుబట్టి యీకవి నేపాలదేశ పాలకుఁడైన జయార్జునదేవునినాఁటివాఁ డనియు, ఆరాజు నేపాలశకము ४८३. అనఁగా, శా. ౧౨౭౫ లోనివాఁ డనియు తెలియుచున్నది. ఈప్రతిచివర నున్నమాటలనుబట్టి నీతికథాసంగ్రహమైన యీహితోప దేశమును ధవళచంద్రరాజు ప్రయత్నించి వ్రాయించి లోకమున ప్రచు రింపఁజేసె ననుమాటలు కనఁబడుచున్నవి. ఆధవళచంద్రరాజు నేపాల భూపాలునిసామంతుఁడు కావచ్చును. కావున నీకవి నేపాలీయుఁ డని యూహింతము.

"తావ న్నారాయణేన ప్రచరతు రచిత స్సంగ్రహో ఽయం కథానామ్
శ్రీమాన్ ధవళచంద్రో ఽసౌ జీయా న్మాండలికో రిపూన్,
యే నాయం సంగ్రహో యత్నా ల్లేఖయిత్వా ప్రచారితః"

దేశప్రసిద్ధము పద్యాత్మకమునైనయీను మిత్రలాభము సుహృ ద్భేదము విగ్రహము సంధి, అనునాలుగుప్రకరణములే యున్నవి. ముఖ్యముగా పంచతంత్రమునుండియు, కొన్నియితరగ్రంథములనుం డియు గ్రహింపఁబడిన నీతికథలు బాలురకు సుఖబోధకముగా నిర్మింపఁ బడినవి. ఆమాట లిం దిట్లు కలవు.

"కథాచ్ఛలేన బాలానాం నీతి స్తదిహ కథ్యతే,
మిత్రలాభ స్సుహృద్భేదో విగ్రహ స్సంధి రేవచ,
పంచతంత్రా త్తథాన్యస్మా ద్గ్రంథా దాకృష్య లిఖ్యతే"

పంచతంత్రమువలెనే సంస్కృతాక్షరములు నేర్చినవారి కెల్లరకు సుపరిచితమైనదీనినిగూర్చి యెక్కువగా వ్రాయవలసినది లేదు. గ్రంథాది నున్నమాట లివి. ఇవి యితనివో! ఇతరునివో!

" అజరామరవ త్ప్రాజ్ఞో విద్యా మర్థంచ సాధయేత్,
గృహీత ఇవ కేశేషు మృత్యునా ధర్మ మాచరేత్,
" విద్యా దదాతి వినయం వినయా ద్యాతి పాత్రతామ్,
పాత్రత్వా ద్ధన మాప్నోతి ధనా ద్ధర్మం తత స్సుఖమ్ "

విషయభేదము లేకున్నను రచనభేదముతోడి హితోపదేశములు మఱిరెం డున్నవి. విష్ణుశర్మ రాజపుత్త్రులకు చెప్పిన ట్లున్నయవతారికతోడి యొకగ్రంథము నిర్మించినకవిపేరు దెలియదు. దానిప్రయోజన మీక్రిందివిధముగా చెప్పఁబడినది:—

" శ్రుతో హితోపదేశో உయం పాటవం సంస్కృతోక్తిషు,
వాచాం సర్వత్ర వైచిత్ర్యం నీతివిద్యాం దదాతిచ "

౩౧ అధ్యాయములతోడి హితోపదేశము మఱియొకటి యున్నది. అందలియవతారికలో:—

" ఇస్రాయేల్ రాజదాయూదతనయేన సులేమనా,
అయం హితోపదేశానా మభిప్రాయః ప్రదర్శ్యతే "

ఇస్రాయేల్ రాజగు దాయూదునికొడు కైనసులేమనుచే హితోపదేశములయభిప్రాయము ప్రదర్శింపఁబడినదఁట—ఇది సులేమను వ్రాసినదో వ్రాయించినదో! ఇందు పంచతంత్రమునుండియే కాదు, బైబిలు ఖురానులనుండి కూడా నీతులు సంగ్రహింపఁ బడిన వఁట.

## మహారుద్రసింహుఁడు

ఇతఁ డొకరాజకవి. దవేలసింహానృపతితనయుఁడు. ఇతనినివాసాదిక మజ్ఞేయము. ఇతఁడు శా. శ. ౧౩౩౩ లో విజ్ఞానతరఙ్గిణి యనుపేర పదునాఱుసర్గలమహాకావ్యము నిర్మించెను. ఇందు శంకరదాసనెడినిజవంశపూర్వపురుషుఁ డైన భగవద్భక్తునిచరితమును వర్ణించెను. "భగవద్గుణవర్ణనము గావింపక భగవద్భక్తునిగుణములు వర్ణించుట నిష్ఫలము

కాదా!'' యని యితఁడే శంకించుకొని, "ప్రాణేభ్యో మత్ప్రియాభక్తా అనుభగవద్వచనమునుబట్టి తనకథ వర్ణించుటకంటె తనభక్తునికథను వర్ణించుటయే భగవంతుని కెక్కువప్రియ మనుతలంపుతో శంకరదాస రాజుగుణములు వర్ణించితి" నని సమాధానము వ్రాసికొన్నాఁడు. ఈ గ్రంథమం దున్నయితనిమాట లివి.

"భక్తిజ్ఞానవివర్ధనీం శ్రుతవతాం కర్ణే సుధాస్పర్ధినీం,
సాధూనాం సుధియాం విమూఢమనసా మప్యాశయోల్లాసినీమ్,
శ్రీమచ్ఛంకరదాసవర్ణనమయీం రమ్యాం జగత్పావనీం,
సీతారామగిరీంద్రజాహరగుణగ్రామాధివాసోజ్జ్వలామ్"

"దోరుద్దామభుజఙ్గ విక్రమ విషజ్వాలావలీఢాఖిల,
ద్విడ్వర్గస్య "దవేలసింహ" నృపతేః ప్రఖ్యాతకీర్తే స్సుతః,
రాధాకృష్ణపదారవిందమధుపః శ్రీరుద్రసింహ స్సతా,
మక్రీతానుచరో ముదా ప్రకురుతే పూర్వాం శుభాఖ్యాయికామ్.

[ ఈమహాపరాక్రమశాలియైనదవేలసింహుఁడు మిథిలాదేశపాలకులలోనివాఁ డని తోఁచుచున్నది. మైథిలేశచరిత మనుపేర దర్భాంగరాజవంశవర్ణనము గావించినరత్నసింహుఁ డీవంశములోనివాఁ డనియు తోఁచుచున్నది. ఆమైథిలేశచరితము నాకు లభింపలేదు.]

"శ్రీవిజ్ఞానతరఙ్గిణీ మురరిపో ర్నామావళీ భఙ్గినీ,
శ్రేయస్సాగరసఙ్గినీ బుధఝుషాపాపద్రుమోన్మూలినీ,
ఆనన్దభ్రమరా కుతూహలకథాప్రాగల్భ్యపూర్ణామృతా,
స్నానార్థం పరభూతిహృష్టమనసాం భూయా త్సదా ధీమతామ్''

"పితు రాజ్ఞాం సమాసాద్య గురు ణానుమత శ్శిశుః.
ప్రవృత్తో ఽస్మి తరీతుం తా మగాధోగ్రరయాం నదీమ్"

ఈవిధముగా గ్రంథావతారిక వ్రాసి గ్రంథాన్తమం దీక్రిందివిధముగా గద్యము రచియించెను.

"ఇతి శ్రీమచ్ఛంకరదాసచరణనఖచంద్రికా సాదరపానమాత్రైకావలంబ
నాత్మచకోరశ్రీమహారుద్రసింహవిరచితాయాం రామగుణభూధర
ప్రసూతాయాం కృష్ణనవనీరదస్నేహాసారసలిలపూరితాయాం విజ్ఞా
నతరంగిణ్యాం శ్రీశంకరదాసగోలోకనివాసవర్ణనం నామ షోడశః
కల్లోల స్సమాప్తః"

ఇది ఇతనిసూర్యస్తుతి:—

"స్ఫురత్సహస్రాంశుసమూహశోభితో, యవారుణాగ్రోద్ధృతపద్మహస్తకః
హృది స్థితశ్రీహరిణా ఽతిసున్దరః, కరోతు శర్మ ప్రకరం విభాకరః

ఇది పరమాత్మస్తవము.

"యోగినాం హృదయాకాశే, యో జాగర్తి మహేశ్వరః
స సర్వదేవసంపూజ్యః, కుర్యా త్కల్యాణ ముత్తమమ్"

## సింగభూపాలుఁడు

నేఁటివేంకటగిరిరాజవంశములోని పూర్వపురుషులలో నుత్తమ ఖ్యాతి గాంచినయీరాజకవి రాచకొండ రాజధానిగా వింధ్యాద్రికిని శ్రీశైలమునకును నడుమ నున్నభూభాగము పాలించినశూరుఁడు. రేచర్ల గోత్రసంభూతుఁడు. ఇతనితండ్రి అనపోతభూపతి, తల్లి అన్నమాంబ. రసార్ణవసుధాకర మనునాలంకారికగ్రంథము నిర్మించి సర్వజ్ఞబిరుదము గాంచిన యితనికాలమునుగూర్చి మతభేదములు కలవు. అవి శాసన లేఖకులు చూపినశకకాలమందలిపొరపాటును, సింగభూపాలసంజ్ఞ గల రాజు లావంశమం దిద్దఱు ముగ్గురు కనవచ్చుటయుఁ గారణములుగా వచ్చినవి. వెలుగోటివంశ సురభివంశచరిత్ర లీవిషయము చర్చించి, అన్నమాంబాగర్భసంజాతుఁ డైనపెదసింగమనాయఁడే రసార్ణవసుధా కర్త యైనసింగభూపాలుఁ డనియు, ఇతఁడు శా. ౧౩౩౦ ప్రాంతమున రాజుగా నున్నవాఁ డనియూ నిర్ణయించినవి. శ్రీనాథ బమ్మెరపోతరాజుల

నాదరించినసింగభూపాలుఁడు పోచమాంబాకుమారాన్నపోతనాయల పుత్త్రుఁ డనియు, నితనిమనుమఁ డనియు స్పష్టపఱిచినవి. ఆనిర్ణయము సముచిత మనవచ్చును. వివరములు మల్లినాథసూరిజీవితమునఁ గన నగును.

ఇతఁడు రసార్ణవసుధాకరము నవతారికలో స్వవంశవర్ణనము గావించియున్నాఁడు. అందు మొదటిరాజు యాచమనాయకుఁడు. ఖడ్గ నారాయణబిరుదాంకితుఁ డైనయతనికి పోచమాంబయం దుదయించిన ముగ్గురుకొడుకులలో పెద్దవాఁడు సింగప్రభువు-అతనికి సింహమహీపాల, శివభూపతి—యనునామాంతరము లిందే కనఁబడుచున్నవి. అదే వాడు కలో సింగభూపాలసంజ్ఞగా మాఱినది—అతనిపెద్దకొడుకు అనన్తభూపా లుఁడు. అతఁడే అనపోతనాయకుఁ డనఁబడిన ట్లీయవతారికయే చెప్పు చున్నది. అతని కన్నమాంబయందు పుట్టినయిద్దఱిలో నీకవి రెండవ వాఁడు. పెద్దవాఁ డైనవేదగిరిరాజు పరిపాలకుఁ డయినట్లు వర్ణింపక—

"తయో రభూతాం పుత్త్రౌ ద్వౌ వాద్యో వేదగిరీశ్వరః,
ద్వితీయ స్త్వద్వితీయో ఽసౌ యశసా శివభూపతిః,
అథ శ్రీసింగభూపాలో దీర్ఘాయు ర్వసుధా మిమామ్,
నిజాంసపీఠే నిర్వ్యాజం కురుతే సుప్రతిష్ఠితామ్"

అని చెప్పుకొన్నాఁడు. దీనినిబట్టి వేదగిరి బాల్యమందే స్వర్గ స్థుఁడు కాఁగా నీరాజకవి రాజ్యభారము వహించె నని విదిత మగుచు న్నది. ఇతనికి అనపోతదాచమనాయకాదు లాఱుగురు సుతులు పుట్టిరి. వారిశౌర్యాదిగుణములుగూడ నిందలియవతారికలో వర్ణింపఁబడినవి— రాచకొండ యప్పటికి రాజధానియైనట్లును వింధ్యశ్రీశైలమధ్యదేశము తా నేలిన ట్లిందు తెలిపియున్నాఁడు.

"రాజా స రాజాచలనామధేయాం
మధ్యాస్త పత్తక్రమరాజధానీమ్"

" వింధ్యః శ్రీశైలమధ్యస్థో మండలం పాలయన్ సుతైః
వంశప్రవర్తకై రర్థాన్ భుంక్తే భోగపురందరః "

రా జైనతనయందు చంద్రధర్మమేకాదు సూర్యధర్మము కూడ నున్నట్లు శ్లేషించి చమత్కారముగా నిట్లువర్ణించుకొనెను.

" సతాం ప్రీతిం కుర్వన్ కువలయవికాసం విరచయన్,
కలాః కాన్తాః పుష్ణన్ దధ దపిచ జైవాతృకకథామ్,
నితాన్తం యో రాజా ప్రకటయతి మిత్రోదయ మహో
తథా చక్రాసన్దా నపిచ కమలోల్లాససుషమామ్ "

తాను పుడమి నేలుచున్నపుడు కాఠిన్యాదిదోషము లన్నియు స్త్రీలయవయవముల నాశ్రయించి యున్న వని యిట్లువర్ణించెను.

" యస్మిన్ శాసతి శింగభూమిరమణే క్ష్మా మన్నపోతాత్మజే,
కాఠిన్యం కుచమండలే చపలతా నేత్రాంచలే సుభ్రువామ్,
వైషమ్యం త్రివళీషు మందపదతా లీలాలసయాం గతౌ,
కౌటిల్యం చికురేషు కించ కృశతా మధ్యే పరం బధ్యతే "

ఈకృతి మూఁడుల్లాసములగ్రంథము. ఇది యెక్కువగా నాట్యపద్ధతిని బోధించునది. భరతాచార్యకోహలదత్తిలాదులనాట్యశాస్త్రము లతిగంభీరము లగుటచేతను, నాఁటినాట్యసంప్రదాయము విచ్ఛిన్న మగుటచేతను, అపరిస్ఫుటముగా నున్ననాట్యరీతిని చక్కఁబఱుచుట కీగ్రంథ ముదయించినది. ఇది యెక్కువగా దశరూపకము ననుసరించి యనుకరించి విస్తరిల్లిన దని యీరెంటిని బోల్చిచదివినచో విశద మగును. ఆయనుసరణము సార్థకమై సహృదయరంజకముగా నుండుటయే యిందలి విశేషము. ఈగ్రంథములో పూర్వకృతు లనేకములు పేర్కొనఁబడినవి. ఆకాలమునఁ బ్రచారములోనున్న వేమో! వాటిలో కొన్నియివి—అభిరామరాఘవము, అమోఘరాఘవము, ఆనందకోశప్రహసనము, కలికేళిప్రహసనము, కరుణాకందలము, పయోధిమథనము, వీరభద్రవిజృంభణము,

మాయాకురంగిక-మాధవి. మఱియు నిందు రూపకరసములవిచారణము సముచితమై యుక్తియుక్తము సోదాహరణమునై గ్రంథనామమును సార్థకముగావించుచున్నది. రఘువంశ శాకుంతల బాలరామాయణాదివ్యాఖ్యలయందు మల్లినాథాదు లిందలిమాటలను ప్రమాణముగా గ్రహించుటనుబట్టి యీనాఁడు దీనికిఁ గలవ్యాప్తి విదిత మగుచున్నది. రసరత్నదీపిక రససర్వస్వము మొదలుగా సుమారేఁబదిగ్రంథము లానాఁడు రసవిషయమున నుద్భవించినవి, అన్నియుఁ గాఱిపోయినవి. కాని, యిది మాత్రము విద్వల్లోకము నాదరము గాంచుచునే వచ్చినది.

కవియు, కవిపోషకుఁడు నైనయితనిసభలో నెందఱో విద్వాంసులుండి యుందురు. వారిలో విశ్వేశ్వరపండితుఁడు చమత్కారచంద్రిక యనుకృతి రచియించెను. అప్పయాచార్యుఁ డనునతఁ డమరకోశమునకు వ్యాఖ్య నిర్మించెను. ప్రసిద్ధవేదాంతదేశికునికుమారుఁ డైననయనారాచార్యుఁడు సుభాషితనీవికి టీక రచియించెను. ఇట్టివా రింక నుందురు. వీరిలో విశ్వేశ్వరకవియే రసార్ణవసుధాకరము రచియించి సింగభూపతి పేరు పెట్టె నని యొకమతము తలయెత్తియున్నది. ఇట్టిమతములు సంస్కృతాంధ్రములందు సంస్థానపాలకులపేరఁ గనవచ్చుకృతు లన్నిటియెడ నుదయించినవే. అందుచే దీనింగూర్చి చర్చించుట యనావశ్యకము. ఇంతకును, విశ్వేశ్వరకవియే తనలక్షణగ్రంథ మగుచమత్కారచంద్రికలో లేనిలక్షణాదులను రసార్ణవసుధాకరమునఁ జూడఁ దగునని చెప్పియుండఁగా నింకఁ బ్రమాణాంతర మెందుకు?

"అనుక్తానా మి హాన్యేషాం లక్ష్యలక్షణవిస్తరః
సింగభూపాలరచితే రసార్ణవసుధాకరే"

ఈరాజు రసప్రధాన మగుగ్రంథము రచియింప నారంభించుటచే తను రసికుఁ డగుటచేతను గ్రంథారంభమందలి యీక్రిందిమంగళాచరణశ్లోకమునఁగూడా శృంగారమూర్తిగాఁ బరవస్తువును వర్ణించి యున్నాఁడు.

" అస్తి కించి త్పరం వస్తు పరమానందకందళమ్,
కమలాకుచకాఠిన్యకుతూహలిభుజాన్తరమ్ "

పెక్కండ్రు కవులను బోషించియు స్వయముగాఁ గవియయ్యును భాషాసేవ యొనర్చినయట్టిరాజన్యులు చిరస్మరణీయులు. ఈసింగ భూపాలుని వంశములోని విద్వత్ప్రభువగు శ్రీ రాజగోపాలకృష్ణయాచేంద్రమహారాజే తొలుత నాసంస్కృతకవిజీవిత దశరూపకాదులను పోషించెను. ఆనాఁడు నేను వారియాస్థాన విద్వత్కవిని:—

## మల్లినాధసూరి

ఆంధ్రదేశప్రసిద్ధులైనపూర్వమహావిద్వాంసులలోని యీ మహాపురుషుఁడు జగమెఱిఁగినబ్రాహ్మణుఁడు. శ్రీపదవాక్యప్రమాణపారావారపారీణుఁడు మహోపాధ్యాయుఁడు - వేదములు వేదాంగములు తక్కినయెల్లశాస్త్రములు సాంతముగా చదివి సంపాదించుకొన్న బిరుదమిది_ఏకశిలానగరప్రాంతవాసి కోలచలవంశవర్ధనుఁడు కౌశికగోత్రుఁడాపస్తంబసూత్రుఁడు_కోలచలకుటుంబపురుషక్రమము ద్వివిధముగా కనవచ్చుచున్నది. అందు మొదటిది:—

(మూలపురుషుఁడు) మల్లినాథుఁడు, అతనికొడుకుకపర్ది, అతనికొడుకీమల్లినాధుఁడు. ఇతనికొడుకులు పెద్దనార్యుఁడు కుమారస్వామి సోమపీథి. ఇది కుమారస్వామి ప్రతాపరుద్రీయవ్యాఖ్యాన మైనరత్నాపణములో చూపినక్రమము_ఇంక రెండవది:—

"కోలచలమల్లినాథుఁడు" శతావధాని వీరరుద్రపూజితుఁడు. అతనికుమారుఁడు "కపర్ది" శ్రౌతకల్పకారికావృత్తికర్త. అతనిపెద్దకొడుకు "మల్లినాధుఁడు" రెండవకొడుకు "పెద్దిభట్టు" మహోపాధ్యాయుఁడు మాతులేయునికత్రుపునందు సర్వజ్ఞునిచే సత్కరింపఁబడినవాఁడు నైషధాదివ్యాఖ్యాత. అతనిపుత్త్రుఁడు "కుమారస్వామి" ప్రతాపరుద్రీయ

వ్యాఖ్యాత. అతనిపుత్త్రులు మహాదేవాదులు నలుగురు. ఆమహాదేవుని తనయుఁడు శంభువు విశ్వజిద్యాగకర్త. అతనిసుతుఁడు భాస్కరుఁడు. అతనితనూజుఁడు నాగేశ్వరయజ్వ సర్వతోముఖయాజి. అతని రెండవ కుమారుఁడు వేదవేత్త కవి యగు కొండుభట్టు. అతనికొడుకు నాగేశ్వర యజ్వ. అతనికి నరసక్కయనుసాధ్వియందు జన్మించినవాఁడు నారాయణుఁడు. ఈనారాయణుఁడే చంపూరామాయణమునకు పదయోజన యనుపేర వ్యాఖ్యవ్రాయుచు నందలియవతారికలో చూపినక్రమ మిది. దీనినిబట్టి మల్లినాథునితమ్ముఁ డైన పెద్దిభట్టు నైషధాదికావ్యములకు వ్యాఖ్యలు తనయన్నపేర నిర్మించె ననియు, కుమారస్వామియజ్వ పెద్దిభట్టుకొడుకు గాని, ప్రసిద్ధమల్లినాథునియొూరసుఁడు కాఁ డనియు తెలియ వచ్చినది. కాని, మనమల్లినాథునితరువాత నేడవపురుషుఁ డైన యీ నారాయణునిమాటకంటె, మల్లినాథుని తరువాతిపురుషుఁ డైన కుమారస్వామిమాట యెక్కువ ప్రమాణ మనుట స్పష్టమే. అయినా, ఆవంశములోనివాఁడే యింత తేడాగా నెందుకు చెప్పెనో తెలియకున్నది. కుమారస్వామి కంఠోక్తిగాఁ జెప్పినయీక్రిందిమాట నమ్మక తప్పకున్నది. "ఇతి శ్రీపద ... కోలచలమల్లినాథ సూరిసూనునా విశ్వజనీనవిద్యస్య విద్వన్మణేః పెద్దనార్యస్యానుజేన కుమారస్వామిసోమపీథినా విరచితే ప్రతాపరుద్రీయవ్యాఖ్యానే రత్నాపణాఖ్యానే ..." అయినా యిక్కడ నాంధ్రవిద్వల్లోకప్రతీతి యొకింత పరిశీలింతము:—

మల్లినాథపెద్దిభట్టు లన్నదమ్ములు. ఇద్దఱును మహావిద్వాంసులు వ్యాఖ్యాతలు. అన్నగారియందు పెద్దిభట్టుకు భక్తివిశ్వాసములు హెచ్చు. తాను రచియించినకావ్యవ్యాఖ్యలకు కూడా తనయన్నగారిపేరే పెట్టుచుండెడివాఁడు" ఇత్యాదిగా విద్వత్పరంపరలో కర్ణాకర్ణికగా వ్యాపించుచువచ్చినకథ లెన్నో కలవు. నాబాల్యమున మాకులవృద్ధు లాకథలు చెప్పుకొనుచుండ నే నెన్నిసార్లో వినియున్నాను. అం దొకటిరెండు:—

పెద్దిభట్టుగారు "ఇత్యర్థః, ఇతి భావః" అనుచు వ్యాఖ్యానములు రచియించుచుండుటయే కాని, యింటిలో నేమున్నదో యేమి లేదో చూచుటయే లేదఁట. ఒకనాఁడు మడికట్టుకొని వంటయింటిలోనికి వెళ్లి—"ఏమి వండినావు? అని భార్య నడిగినారఁట. అపుడామె చిఱునవ్వుతో ఏ మున్నది? ఇత్యర్థాలు కూర, ఇతిభావాలు పులుసు" వండినా నని బదులుచెప్పిన దఁట. అయితే నేఁటిభోజనము రసవంతమే యని నవ్వినా రఁట. మఱియొకప్పు డాదంపతులు సరసాలాపము లాడుకొనుచుండ నామె, "ఏమండీ! ఎందఱు చేసినస్త్రీవర్ణనలకో వ్యాఖ్యానాలు వ్రాస్తారు, ఎన్నో వర్ణనలు చేస్తారు. నన్నెపుడూ వర్ణించరేమి?" అన్న దఁట. అపు డాయన నవ్వుచు నిదిగో వర్ణించెద వినుమని యీ క్రిందిశ్లోకము చెప్పి యామెను కడుపుబ్బ నవ్వించె నఁట.

"తింత్రిణీదళవిశాలలోచనా, మేరుమందరసమానమధ్యమా,
అర్కశుష్కఫలకోమలస్తనీ పెద్దిభట్టగృహిణీ విరాజతే"

ఇట్టి వింకను గలవు. వీటికి తోడు నేను చూచినకొన్ని నైషధ శిశుపాలవధాదికావ్యముల వ్రాఁతప్రతులలో వ్యాఖ్యాంతములందు "పెద్దిభట్టవిరచితే"[1]. అనుమాటకూడఁ గనవచ్చినది. ఇది యంతయు పరిశీలింపఁగా నా కిట్లు తోఁచినది. ఇది నారాయణపండితునిమాటలకును పూర్వులు నమ్ముచు వచ్చినకథలకును సామరస్యము కలిగించునది. పాఠకులిది చూచి యెట్లు నిర్ణయించినా సంతోషమే:—

మల్లినాథుఁడు పెద్దిభట్టు సహోదరులే. పెద్దిభట్టు తనయులు పెద్దనార్యుఁడు కుమారస్వామియజ్వ. ఈయజ్వ మల్లినాథునికి స్వీకృతపుత్త్రుఁ డయియుండును. ఈమాట తలపెట్టక, తమవంశమునకు మూలపురుషుఁ డైనకుమారస్వామి పెద్దిభట్టుకొడు కయినట్లే నారాయణపండితుఁడు పురుషకార మిచ్చియున్నాఁడు. కుమారస్వామి మల్లినాథుని

---

1. తంజావూరుపుస్తకభాండాగార లిఖితపుస్తకము— 3608 నంబరుపైని పెద్దిభట్టీయ వ్యాఖ్యానమ్.

కుమారుఁడ నని చెప్పికొనుచు జన్మచే సోదరుఁ డైనపెద్దనార్యునికి తాను తమ్ముఁ డయినట్లు వ్రాసికొన్నాఁడు. ఇం దేమీ యనౌచిత్యము లేదు గనుక మన మిట్లు భావించినచో సర్వము చక్కఁబడు నని నాయా శయము.

## ఈ సూ రి కా ల ము

ఇతనికుమారుఁడు ప్రతాపరుద్రీయమునకు రత్నాపణవ్యాఖ్య వ్రాయుచుఁ దదవతారికలో "పురా కిల కాకతికులసంభూతే గణపతి నామ్ని మహారాజే ... తన్మహిషీరుద్రదేవీ ... దాహిత్రే ప్రతాపరుద్రే రాజ్యధురం నిదధే" అని కృతినాయకుని నిరూపించుటలో "పురా"యను టంబట్టి, ఆకృతిపతి కృతికర్తల కీతండ్రికొడుకు లర్వాచీను లనఁదగి యున్నారు-రాచకొండ రాజధానిగా వింధ్యశ్రీశైలమధ్యదేశ మేలిన పెదసింగనాయఁ డనుసర్వజ్ఞసింగభూపతి నిర్మించినరసార్ణవసుధాకర మందలిలక్షణములను "అత్ర శృంగారలక్షణం రసార్ణవసుధాకరే" ఇత్యా దిగా (రఘు-౬-౧౨) తనవ్యాఖ్యయం దుపయోగించినయీసూరి యాతేనికి సమకాలమువాఁ డని కొందఱు, కొంచెము పరుఁ డనికొందఱు భావించుచున్నారు. ద్వితీయప్రతాపరుద్రునికాలమును రసార్ణవసుధా కర కర్త యగుసర్వజ్ఞసింగభూపాలునికాలమును శాసనపరిశోధకులమత భేదములనుబట్టి సుస్థిరములుగా లేవు. అయినా, మూఁడునాలుగేండ్లు హెచ్చుతగ్గుగా ద్వితీయప్రతాపరుద్రునిరాజ్యకాలము శా.శ. ౧౨౧౭-౧౨౪౫ అగుట బహుసమ్మతమే కావున దీనినిబట్టి యాలోచింతము- ఇతనిసామంతులలోనియొక రేచర్లగోత్రశూరుఁడు దాచయసింగమనా యుఁడు. అతఁ డీప్రతాపరుద్రునివల్ల నశీతివరము లొందినవాఁ డని చరిత్ర చెప్పుచున్నది. అతనికొడు కనపోతానాయఁ డీరుద్రునిరాజ్యావ సానకాలమున రాచకొండకు రాజయ్యెను. అతఁడు శా. శ. ౧౨౮౭, ౧౨౯౧, ౧౩౦౦, ౧౩౦౩ సంవత్సరములలో చెక్కించినదానశాసనము

లగపడుచున్నవి. అతనితమ్ముఁడు మాదానాయఁ డనెడిమాధవభూపతి శా. శ. ౧౨౯౮ లో చెక్కించినధర్మశాసన మొకటి యున్నది. అందుచే పైయనపోతానాయనికుమారుఁ డయిన పెదసింగమనాయఁడు శా. శ. ౧౩౩౦ ప్రాంతమున రాచకొండ రాజధానిగా భువనగిరి ఓరుగల్లు నల్లగొండ, ఆమనగల్లు రేచెర్ల మొదలైనప్రదేశము లేలినవాఁ డగునని యాయాశాసనములు నిరీక్షించినవా రనుచున్నారు. మఱియు నితఁడే సర్వజ్ఞబిరుదాంచితుఁ డనియు రసార్ణవసుధాకరకర్త యనియు నిర్ణయించియున్నారు.[1]

దీనినిబట్టి తండ్రివలెనే సహస్రమాసాధికజీవియైన సర్వజ్ఞసింగభూపతి శా. ౧౨౯౦ ప్రాంతమున రసార్ణవసుధాకరము నిర్మించియుండు ననియు నతనిలక్షణములను వ్యాఖ్యానమందుపయోగించిన మనసూరి యతనివార్ధకదశలో నున్నవాఁ డనియు విశ్వసింపవచ్చును. ఇంక—

ప్రతాపరుద్రీయకర్త యైనవిద్యానాథుఁడు మనమల్లినాథుఁడే యని యొక రూహించిరి గాని యది సరికాదు. అందుకు, కుమారస్వామి

---

1. చూ. సురభివారి వంశచరిత్ర-అనుబంధము-పుటలు-22-30, 35, అయ్యనవోలు, ఉమామహేశ్వరగ్రామదేవాలయశిలాశాసనములనుండి-వెల్లాల సదాశివశాస్త్రిగారు సంపాదించినపద్యములు:—

౧. "శాకాబ్దే శశినందభాస్కరమితే సౌమ్యాఖ్యసంవత్సరే
శ్రావణ్యామ్ గురుయోగభాసి విజయశ్రీసింగభూపాత్మజః,
నిత్యశ్రీ రనపోతభూపతి రయం దేవాయ మైలారయే,
మోదా దయ్యనవోలు సంజ్ఞ మదిత గ్రామం సభోగాష్టకమ్"

౨. "దంత్యంకార్కశకాబ్దశాలిని శివే వర్షే నవే ఫాల్గునే,
మాసే దాచయసింగభూపతిసుతః శ్రీమాధవో భూధవః,
శ్రీశైలోత్తరతోరణే భువి మహేశ స్యాలయం నూతనం
పాషాణై స్సుదృఢం సురాసురనుతం రమ్యం ము దాచీకరత్.

ఈశిలాశాసనము, అమరవాదితాలూకా ఉమామహేశ్వరగ్రామములోని దేవాలయమున నున్నది.

వ్యాఖ్యావతారికావచనమే చాలును. మఱియు, ద్వితీయప్రతాపరుద్రునిచే సత్కరింపఁబడినమల్లినాథుఁ డితఁడే యని నారాయణపండితునిరామాయణచంపూవ్యాఖ్యలోనిశ్లోకమునుబట్టి కొందఱు ఊహించిరి గాని, యది యసంగతము. ఆరుద్రునిరాజ్యావసానకాలమునఁగూడ మనసూరి పుట్టియుండలేదు. ఆశ్లోక మిది—

" కోలచల్మాన్వయాబ్ధీందు ర్మల్లినాథో మహాయశాః,
శతావధానవిఖ్యాతో వీరరుద్రాభిపూజితః "

సర్వజ్ఞసింగభూపాలునివలన మన మల్లినాథుఁడు కనకాభిషేకగౌరవమందె నని కొందఱందురుగాని యందలితత్త్వ మింకను విచారణీయము[1] కాని యాభూపతివార్ధకదశలో కావ్యవ్యాఖ్య లొనర్ప నారంభించినయీ మహామహుఁ డతనిచే సత్కరింపఁబడినపండితులలో నున్నవాఁ డని విశ్వసింపవచ్చును.

దీనినంతనుబట్టి పరిశీలింపఁగా స్వల్పమత భేదము లున్నను, మల్లినాథుఁడు శా, శ. ౧౨౮౦–౧౩౫౦ నడుమ నున్నవాఁ డనుట సముచితము కాకపోదు.

## ఇ త ని వై దు ష్య ము

దీనినిగూర్చి యేమిచెప్పినా పునరుక్తమే. పితామహుఁడు శతావధాని వేదశాస్త్రవేత్త. తండ్రి వేదవేదాంగతత్త్వవేత్త. సుదర్శనాచార్యుఁ డాపస్తంబగృహ్యసూత్రములకు తాత్పర్యదర్శనము రచియించుచు వాటికి భాష్యము నిర్మించినకపర్ది నిట్లు స్తుతించెను.

" యత్కృతం వేద వద్భాష్య మాద్రియన్తే విపశ్చితః,
స కపర్దీ చిరం జీయా ద్వేదవేదాఙ్గతత్త్వవిత్ "

1. దేశవిఖ్యాతుఁడు నప్పటి కుత్తరవయస్సున నున్నవాఁడు నైనశతావధానిమల్లినాథునికి (ఇతనిపితామహునికి) యువకుఁడై కవితాభిమాని యైనసర్వజ్ఞుఁడు కనకాభిషేకము కావించెనేమో !

ఇతఁడాతండ్రితాతలయశస్సు నినుమడింపఁజేసినవిద్వన్మణి. గద్య లలో శ్రీపదవాక్యప్రమాణజ్ఞుఁడ నని సంగ్రహముగాఁ దెల్పుకొన్నను ఇతఁడు తనవివిధశాస్త్రజ్ఞానమును వ్యాఖ్యావతారికలలో నిట్లు తెలుపు కొనెను.

" వాణీం కాణభుజీ మజీగణ దవాసాసీ చ్చ వైయాసికీ,
మన్తస్తన్త్ర మరంస్త పన్నగగవీ గుమ్ఫేషు చా జాగరీత్,
వాచా మాచకల దృహస్య మఖిలం య చ్చాక్షపాదస్ఫురాం,
లోకే ఒభూ ద్యదుపజ్ఞ మేవ విదుషాం సౌజన్యజన్యం యశః "

మఱియుఁదాను కవియైన ట్లీవిధముగా వ్రాసికొనియున్నాఁడు—

" మల్లినాథకవి స్సోఽయం, మందాత్మానుజిఘృక్షయా,
వ్యాచష్టే కాళిదాసీయం కావ్యత్రయ మనాకులమ్ "

మూర్తీభవించినతనసాహిత్యసారజ్ఞత నిం దిట్లు వెల్లడించెను.

" యే శబ్దార్థపరీక్షణప్రణయినో యేవా గుణాలంక్రియా,
శిక్షాకౌతుకినో విహర్తుమనసో యేచ ధ్వనే రధ్వని,
క్షుభ్యద్భావతరంగితే రససుధాసింధౌ నిమంక్షన్తి యే,
తేషా మేవ కృతే కరోతి వికృతిం మాఘస్య సర్వంకషామ్"

ఇతనివ్యాఖ్యానప్రతిజ్ఞ యందుమా, అది చెప్పుట కెంతసులభ మైనదో, ఆచరించుట కంత కష్టమైనది. చెప్పినట్లు చేసి తీర్ణప్రతిజ్ఞుఁ డైన ధీరుఁ డితఁడు—

" ఇహాన్వయముఖే నైవ, సర్వం వ్యాఖ్యాయతే మయా,
నామూలం లిఖ్యతే కించి న్నానపేక్షిత ముచ్యతే "

రఘువంశాదినైషధాంతకావ్యము లాఱింటి కితనికి మున్నెందఱో వ్యాఖ్యలు నిర్మించియున్నారు. అయితే నేమి? ఇతని సంజీవినీఘంటాపథ సర్వంకషావ్యాఖ్యలతో నాకావ్యములు నాఁటినుండి నేఁటిదనుక నాసేతు హిమాచలమే కాక ఖండాంతరములఁగూడా కీర్తింపఁబడుచున్న వనుట

కంఠా నితనిమహాత్త్వమును వేఱుగా వర్ణింపనేల? ఆకావ్యముల నాకవులను శాశ్వతజీవనులఁగావించి తాను శాశ్వతజీవనుఁడై నవాఁ డీపుణ్య పురుషుఁడు. ఇట్టిపుత్త్రరత్నమును గన్న యాంధ్రమాత ధన్యురాలు. ఇట్టిలోకోత్తరుఁ డేదో కావ్యము నిర్మించినట్లు వినవచ్చునుగాని, యది కనరాదు. ఇఁక రఘువంశాదిపఞ్చకావ్యములవ్యాఖ్యలలోని శివవిష్ణు గణేశసరస్వతీధ్యానశ్లోకములు ప్రసిద్ధములు. అందలి వొకటిరెండు.

" మాతాపితామహామహాశైలం మహస్తదపితామహమ్,
కారణం జగతాం వన్దే కణ్ఠా దుపరివారణమ్ "

" బృన్దారకా యత్ర భవన్తి భృఙ్గా, మన్దాకినీ యత్ర మరన్దబిన్దుః,
త వారవిన్దాక్ష పదారవిన్దం, వన్దే చతుర్వర్గచతుష్పథం తత్ "

కిరాతార్జునీయములోనియీదివ్యధ్యానశ్లోకముతో మల్లినాథుని స్మరింతము.

" తద్దివ్య మవ్యయం ధామ సారస్వత ముపాస్మహే,
యత్ప్రసా త్ప్రలీయన్తే మోహాన్ధతమస శ్ఛటాః "

ఇట్టిలోకోత్తరుఁ డైనపండితోత్తమునికి తగినకొడుకు.

## కు మా ర స్వా మి య జ్వ

తనతండ్రి విద్యాధరునియేకావళికి వ్యాఖ్య వ్రాయుట చూచి తాను విద్యానాథుని ప్రతాపరుద్రీయమునకు వాఖ్య నిర్మించెను. కావ్యవ్యాఖ్యలలో మల్లినాథునివ్యాఖ్యవలెనే లక్షణగ్రంథవ్యాఖ్యల లోనితనిరత్నాపణము కీర్తి గన్నది; ఇతఁడును గొప్పపండితుఁడై నయితని యన్నపెద్దయార్యుఁడు నేవేనికావ్యములు నిర్మించిరేమో తెలియదు.

## వే మ భూ పా లుఁ డు

విద్వాంసుఁడై విద్వాంసుల నాదరించినదేశనాయకులలో నితఁడొకఁడు. అద్దంకి రాజధానిగా తెలుఁగుదేశము పాలించినప్రోలయ

వేమభూపతియన్న యగుమాచరాజున కితఁడు పౌత్రుఁడు. పెదకోమ టీంద్రునిపుత్త్రుఁడు. పెదకోమటి వేమారెడ్డి యనఁబడునితఁడు రా జగు నప్పటికి కొండవీడు రాజధాని యయ్యెను. ఈరాజకవి తనరచియించిన యమరుకశతకవ్యాఖ్యావతారికలోఁ దనవంశమును వర్ణించుకొన్నాఁడు. అందలిప్రోలయవేమునివర్ణన మిది:—

" ఆసీ చ్చతుర్థాన్వయచక్రవర్తీ, వేమక్షితీశో జగదేకవీరః,
ఏకాదశేతి ప్రథయన్తి శఙ్కాం, యే నావతారాః ప్రథమస్య పుంసః"

ఇతనికాలమునుగూర్చి యించుక మతభేదము కలదుగాని శ్రీనాధమహాకవి రచియించినశాసనములనుబట్టియు నితరప్రమాణములను బట్టియు నితఁడు శా. ౧౩౨౫–౧౩౪౨ నకును రాజ్యము చేసినట్లు తెలియుచున్నది. ఈరాజుభార్య సూరమాంబ శా. ౧౩౩౧ లో సంతానసాగర మనెడితటాకమునకు ప్రతిష్ఠోత్సవము జరిగించినది, ఇతనికుమారుఁడగురాచవేమభూపతి తల్లి త్రవ్వించినచెఱువునకు శా. ౧౩౩౭ లో జగనొబ్బగండకాలువ త్రవ్వించెను. కావున పూర్వోక్తకాలము సరియగును. శాసనవాక్యము లివి:—

" శాకాబ్దములు సహస్రమును మున్నూటముప్పదియొకండును నైనభవ్య
సంఖ్య....
వీరనారాయణుండు వేమభూవిభునిదేవి సూరమాంబ...సంతానసా
గరాఖ్య
వరతటాకప్రతిష్ఠోత్సవంబు— శాకాబ్దములు సహస్రంబును మున్నూట
ముప్పదియేడును.. వేమయరాచవేమనమ్మోవరుండు తల్లి సూరాంబచే
సముత్పన్న మగుచుఁబరగు...సంతానవార్ధికి జగనొబ్బకాలువఘటించె"

ఇతఁడు గానప్రియుఁడు కృతికర్త కృతిభర్త కృతినాయకుఁడు సమదారిరాయవేశ్యాభుజంగ వీరనారాయణ సర్వజ్ఞచక్రవర్తీత్యాది బిరుదాంకితుఁడు— ఇతనిసభలో విద్యాధికారిగా నున్నశ్రీనాధుఁడు

రచియించినధర్మశాసనము లన్నిట నితని శక్తి సామర్థ్యములు వర్ణింపఁబడియున్నవి. అందలి దొకటి:—

"చూడామణి ర్నృపాణాం, దుర్మదపరిపంథిశిఖరిదంభోళిః,
సర్వజ్ఞచక్రవర్తీ పెదకోమటివేమభూపతి ర్జయతి"

ఇతనియాస్థానములోని విద్వత్కవులలో వామనభట్టబాణుఁ డొకఁడు. అతఁ డితనిచరితమును గద్యముగా రచియించెను. అంతకుమున్ను కొన్నివ్యాఖ్య లున్నను, అమరుకశతకమున కీతఁడు నిర్మించిన శృంగారదీపిక వంటిది లేదు. కవులతోఁ గలసి మెలసి కావ్యామృతమాస్వాదించుతన కమరుకశతక మత్యంత సుభిరుచి కలిగించినదని యందు తెలిపి యున్నాఁడు—సాతవాహనుఁ డనఁబడుహాలుఁడు నిర్మించినవిగానున్నగాథాసప్తశతిలోని నూఱుగాథలను సప్తశతీసార మనుపేర విడఁదీసి దానికివ్యాఖ్య రచియించిన ట్లీక్రిందివిధముగాఁ జెప్పియున్నాఁడు.

"హాలః ప్రాక్ సప్తశతీం గాథాకోటే ర్వ్యధత్త సంప్రతి తు,
సో ఽయం వేమనృపాల స్తస్యా అపి సార మాహర త్సారమ్"

"యథా మమైవ భాణే, యథా మమైవ కావ్యే వీరనారాయణచరితే" అనుచుఁ దనవియు, తనకాలమువారివియు, పూర్వులు రచించినవియు, పెక్కుశ్లోకము లాయాసందర్భముల నుదాహరించుచు నితఁడు నిర్మించినసాహిత్యచింతామణి యనుకావ్యాలంకారలక్షణ గ్రంథము ప్రశంసనీయము. ఇందు మమ్మటాదుల మతములు పరామర్శింపఁబడినవి. కుమారస్వామి మొద లగువ్యాఖ్యాతలు ప్రతాపరుద్రీయాదులందిందలిమాట లుదాహరించియున్నారు. సంగీతచింతామణి మొదలుగా నితనికృతు లనేకము లముద్రితగ్రంథాలయముల నున్నవి. కొన్నినామమాత్రావశిష్టము లైనవి. ఇతరరాజులకృతులకుం బోలె నితనిరచనలకును శ్రీనాథాదులు నిర్మించి యితనిపేరుపెట్టియుందు రన్నవాదుక వచ్చినది. దానితత్త్వ మెట్టిదైనా, యితఁడు గ్రంథరచనకుఁ దగినవైదుష్య మార్జించినవాఁడు కాఁ డని యెవరును జెప్పఁజాలరు.

వీరనారాయణచరిత మితరులు రచియించినది లేకపోలేదు. ఇతఁడు కూడా తనపేర నొకభాణముగానో పద్యకావ్యముగానో నిర్మించి యుండవచ్చును. ఆగ్రంథములు పరిశీలింప కుండఁగా మన మూహించి చెప్పుట తగదు గదా! అయినా వీరనారాయణచరితములోని రెండు శ్లోకములు చవిచూతము.

"భువనాయ వితీర్ణజీవనానాం క్షితిభృద్భి శ్శిర సోపలాలితానామ్
అధికం విమలశ్రియాం ఘనానాం, లఘుతాపి ప్రబభూవ గౌరవాయ.
"క్షణం కపోలే స్తనమణ్డలే క్షణా క్షణంహృదీమంఘలకంఠణంద్భశోః,
నితంబినీ న్యస్య నిమీలితేక్షణా దధ్యౌ విదగ్ధేవ న వేద చాన్తరమ్"

## వామనభట్టబాణుఁడు

ఆంధ్రదేశీయ లైనసంస్కృతమహాకవులలో నితఁ డొకఁడు. ఇతఁడు పెదకోమటివేమభూపాలునాస్థానములోనివాఁ డని యింతకు మున్ను చదివియున్నాము. ఇతనియనేకకృతులలో ముద్రితమై లభించు చున్నశృంగారభూషణ మనేభాణములో సూత్రధారోక్తిగా నితనివర్ణన మిట్లున్నది.

"సౌభాగ్యస్య నిధిః శ్రుతస్య వసతి ర్విద్యావధూనాం వరః,
లక్ష్మ్యాః కేళిగృహం ప్రసూతిభవనం శీలస్య కీర్తేః పదమ్,
నిస్సామాన్యవికాసయా కవితయా జాగర్తి వత్సాన్వయః
శ్రీమాన్ వామనభట్టబాణసుకవి స్సాహిత్యచూడామణిః"

ఈభాణము విరూపాక్షస్వామిచైత్రయాత్రామహోత్సవమునఁ బ్రదర్శింపఁబడినట్లు ప్రస్తావన చెప్పెడిమాటనుబట్టి యితఁడు విద్యానగర మునఁ గొంతకాల ముండి విద్యారణ్యులయొద్ద విద్యనభ్యసించినమాట ధ్రువపడుచున్నది. ఇందు కితనిశబ్దచంద్రికానిఘంటువు నవతారికలోని యీక్రిందిశ్లోకము ప్రమాణము.

"విద్యారణ్యగురూన్ సార్వభౌమాద్యఖిలసత్కవీన్
నమస్కృత్యాథ బాణేన క్రియతే శబ్దచంద్రికా"

దీనినిబట్టి బాణభట్ట కవిసార్వభౌముని యందలి గౌరవముతో నితనివిద్యారణ్యశిష్యత్వముగూడ ప్రకటితమైనది కావున శా. ౧౩౦౦ ప్రాంతమందే యితఁడు శ్రీమాధవాచార్యులవద్ద చదువుకొన్నవాఁ డనఁదగును. నాఁటి విరూపాక్షస్వామిభక్తియే యీభాణరచనకుమూల మన వచ్చును. వత్సవంశసంజాతుఁ డయిన యితనితండ్రి కోమటియజ్వ, పితామహుఁడు వరదాగ్నిష్టోమయాజి.

"వరదాగ్నిచితః పౌత్రః పుత్త్రః కోమటియజ్వనః,
జాగర్తి వామనో బాణో వత్సవంశశిఖామణిః"

కృతిభర్తతండ్రిపేరు కోమటింద్రుఁడు. కృతికర్తతండ్రిపేరు కోమటియజ్వ. దీనినిబట్టి ఈకొండవీటిరెడ్డిరాజులలో కోమటిపేరు వెలయుటకు హేతు వైనపరుసవేదికథతో నీవత్సవంశములోనివారికి సంబంధము లేకున్నను తదాస్థానమున నున్నవాఁ డగుటచే నితనిపితామహుఁడు వరదయజ్వ యాపోషకుఁడు కొడుకునకుఁ బెట్టినపేరే యతని మెప్పునకై తనకొడుకునకుఁ బెట్టె నవచ్చును. మఱియు నీకవిపూర్వపురుషు లద్దంకికొండవీడుగ్రామముల నివసించినవా రనియుఁ జెప్పవచ్చును

ఈకవి, భట్టబాణునికృతులయం దెక్కువప్రీతి గలిగి యతని కృతుల ననుకరించి గద్యకావ్యము రచియింపఁ బూనిన ట్లితని వేమభూపాలచరితమే తెలుపఁగలదు. అందు భట్టబాణునివలె సరసగద్యము వ్రాసినవాఁడు లేఁ డన్నయపయశస్సును తాను పోఁగొట్టినట్టు చెప్పికొన్నభట్టబాణమ్మన్యుఁ డితఁడు. ఇందుకు వత్సవంశసంభవత్వముకూడ సరిపడినది.

"బాణకవీంద్రా దన్యే కాణాః ఖలు సరసగద్యసరణీషు,
ఇతి జగతి రూఢ మయశో వామనబాణో ఉపమార్ష్టి వత్సకులః

ఈగ్రంథము నిర్మించినపిదప మెచ్చుకొని రాజే యీబిరు దిచ్చెనో లేక ముందే యితఁడు తగిల్చికొనెనో కాని, దీనివల్లనే తొలుత వామనుఁ డైనయితఁడు వామనభట్టబాణుఁ డైనమాటమాత్రము నిజము. మఱియు నితఁడు కాళిదాసునెడఁ దనకుఁ గలభక్తిని దెలుప నతని ననుక రించి ముప్పదిసర్గలరఘునాధచరితమును,ఎనిమిదిసర్గలనలాభ్యుదయమును నిర్మించెను. రెండవది ముద్రిత మైనది. దేశములోఁ దరువాత వ్యాప్తికి వచ్చినపార్వతీపరిణయ మనెడిదియైదంకములనాటకము ప్రసిద్ధభట్టబాణుని దని కొందఱు భ్రమపడిరి గాని యిది యితనిదే యని యిపుడు పెక్కండ్రు విశ్వసించుచున్నారు. మఱియు నితఁ డైదుసర్గలశబ్దచంద్రికాకోశమే కాక, శబ్దరత్నాకర మనుమూఁడుకాండలనిఘంటువుకూడా రచియించినట్లుగా నందలికాండాంతములఁగనవచ్చు "ఇతివత్సకులవామనభట్టబాణవిరచితే" యన్నగద్యము చెప్పుచున్నది. విషయము సమానమే. ఆగ్రన్థములు పరి శోధించి విషయము నిర్ణయింపనగును.

## శ్రీనాధుఁడు

ఆంధ్రభాషాభిజ్ఞులహృదయముల నిల్లు కట్టుకొని యున్నయీకవి సార్వభౌమునిసంస్కృతకవిత్వము నొకింత యిందు రుచిచూతము. సం స్కృతకవిత్వనిపుణుఁ డైనవేమభూపాలునిసభలో విద్యాధికారిపదవి నలంకరించినయితఁడు సంస్కృతకృతులుకూడా రచియించియుండు నని వేఱుగాఁ జెప్పనక్కఱ లేదుగాని, నన్నయభట్టారకుని సంస్కృతకవిత కుఁబోలె నితనిగీర్వాణభాషాకవితకును దానశాసనకావ్యములుమాత్రమే మిగిలియున్నవి. ఈక్రిందిశ్లోకము గుంటూరుజిల్లా ఫిరంగిపురములోనివీర భద్రస్వామిగుడి కెదురుగా నున్నశిలాస్తంభశాసనములోనిది. ఇందు వేమభూపాలునిసభామందిరమహిమయు నతనిదానమహత్త్వమును వర్ణింపఁబడినవి.

" ఆశాన్తం గృహరాజసౌధనివసల్లక్ష్మీకరాభ్యంతర
క్రీడాంభోరుహతాళవృన్తపవనప్రస్తావవిస్తారితః,
వాయుః కేసరవాసనాసురభితో యస్యార్థిచింతామణే
ర్ద్రాగాచామతి దానకేళిజనితం స్వేదాంభసాం జాలకం "

మఱియొకటి కుఱునూతులశిలాశాసనములోనిది:—

" మహారాజ స్సోఽయం రసకరహుతాశేందుగణితే
శకాబ్దే శ్రీవత్స్యాం శశభృదుపరాగే ప్రకటితే,
పరం ప్రీతః ప్రాదా దెఱవరపురీదాశరథయే
వరం గ్రామం కుఱ్ఱూంతులురితి సమాఖ్యా ముపగతః "

ఇదిపినపాడుతామ్రశాసనములోనిది:—

" దాతా కోమటివేమభూపనృపతిః పాత్రం గురు శ్శంకరః,
స్థానంచే త్రిపపాడు రత్రతు కవి శ్శ్రీనాథభట్టారకః,
కాల శ్చేచ్ఛివరాత్రిపుణ్యసమయ స్సాక్షీమహా శ్రీగిరిః
శ్రేయః కిం నతు వర్ణ్యతే సుకవిభి శ్శ్రీన్యాంగుశచ్ఛాసనం "

కల్వాలపాములశాసనములోని యాశీర్వచనపద్య మిది —

" శ్రీనాథస్య వరాహదివ్యవపుషో వః పాతు దంష్ట్రా చిరం
స్యూతో న్నీతమహీతలోపరితటీనిర్యాతశృంగాంకురా,
యా మాత్మీయజలోదితాం శశికలా మాశంక్య జాతః క్షణం
సాహార్ద్రేన విజృంభమాణసలిలారంభో మహాంభోనిధిః "

ఈమహాకవికాలమునుగూర్చి యించించుకమతభేదములు కలవు గాని, ప్రౌఢవయస్సున నితఁడు వేమభూపాలునియాస్థానమున విద్యాధికారిపదవి నధిష్ఠించి యుండు ననుట. సమంజసముకావున, నితఁడు శా. శ. ౧౩౦౦_౧౩౯౦ నడుమ జీవించియున్నదీర్ఘాయుష్మంతుఁ డని విశ్వసింపవచ్చును. హర్షనైషధభీమఖండ కాశీఖండాదులయాంధ్రీకర్తయగునితఁడు శివభక్తుఁడు, విద్వత్కవిశూరుఁడు,

# గౌరనార్యుఁడు

ఇతఁడాంధ్రుఁడు, ఉభయభాషాకవి. రేచర్లసింగయమాధవేంద్రుని మహామంత్రి యగుపోతనామాత్యునితమ్ముఁడైన అయ్యలుమంత్రి పుత్రుఁడు శా. ౧౩౫౦ ప్రాంతమువాఁడు. ఆఱుప్రకాశముల లక్షణదీపిక యనుకృతి నిర్మించినవాఁడు. అందలియవతారికలోని కొన్ని మాటలు:—

" రేచర్లవంశార్ణవపూర్ణచంద్రో మహాబల స్సింగయమాధవేంద్రః,
" ఆసీత్తస్య మహామాత్యః స్వామికార్యధురంధరః
మితరాజ ఇతి ఖ్యాతః రాజనీతిధురంధరః,
మన్త్రిచూడామణే స్తస్య సోదర స్యాయమప్రభోః
గౌరనార్య ఇతి ఖ్యాత స్తనయో నయకోవిదః
...ఉదాహరణరత్నాని లక్షణగ్రన్థిసన్ధిషు
సమాకృష్య సతాం భూత్యై వక్ష్యేణలక్షదీపికామ్ "

ప్రకాశాన్తగద్యలో పెత్తండ్రిపేరు "పోతనామాత్యుఁ" డని యున్నది. ఈకృతికి పదార్థదీపిక యని నామాంతరము. గద్యపద్యప్రబంధములఛందోలక్షణములను నియమించెడియీకృతి కావ్యకర్తలకు కావ్యరచనవిధానమును దెలుపుచున్నది. ఇందు వర్ణోత్పత్తి వ్యక్తిసంఖ్య భూతబీజవిచారము మాతృకాపూజ మొదలగునవి విశదీకరింపఁబడినవి. ఈకృతిలో సాహిత్యచూడామణి చమత్కారచంద్రిక అలంకారసంగ్రహము కవికంఠపాశము సాహిత్యచంద్రోదయము సాహిత్యరత్నాకరము మొదలగుకృతులనుండి యాయాసందర్భముల నుచితము లైన లక్షణములు గ్రహింపఁబడినవి. ఈకడపటి దగుసాహిత్యరత్నాకరము వారణాసిధర్మసూరినిర్మిత మనియు నీగౌరనకంటె నతఁడు పూర్వుఁ డనియు నొకరు భావించిరి. అది ప్రమాదికము, భ్రాంతిమూలకము. ధర్మసూరి యీకవికి పరుఁడు. అది గాక యీలక్షణదీపికలో నుదాహ

రింపఁబడినసాహిత్యరత్నాకరశ్లోకము ధర్మసూరిసాహిత్యరత్నాకరములో లేదు.

అట్టిలక్షణములు ధర్మసూరి రచింపలేదు. ఆశ్లోక మిది:—

“పుమా నుద్దిశ్య పద్యం వా ప్రబంధం వా కదాచన ।
న వక్తవ్యం నవక్తవ్యం మాతృకాపూజనం వినా ”

ఇతనికృత్యారంభశ్లోక మిది:—

“ప్రణమ్య విద్వజ్జనకల్పపాదపం, కవిం కవీన్ద్రాశ్రితపాదపంకజమ్,
విభుం ప్రభుం విశ్వసృజం మహేశ్వరం ప్రవక్ష్యతే లక్షణదీపికేయమ్”

ప్రకాశాన్తశ్లోకములలోని దొకటి:—

“ఏషా లక్షణదీపికా విజయతే విద్వజ్జనానన్దినీ
ఛన్దోవ్యాకరణాద్యనేకవివిధగ్రన్థప్రయోగాన్వితా ”

## ఉద్దండకవి

ఇతఁడు వాధూలగోత్రుఁడు. రంగాంబా రంగనాథులకుమారుఁడు తంజావూరుజిల్లాలోనికందరమాణిక్క మనుగ్రామమున జన్మించి యం దందు విద్యాభ్యాస మొనరించి కాంచిదగ్గఱ నున్నలాటపురములో స్థిర వసతి యేర్పఱచుకొన్నవాఁడు. వినుతి కెక్కినవిద్వత్కవి.

ఇతఁడు మలబారు వెళ్లి మానవిక్రమరాజుసభలో నాస్థానకవియై వసుమతీవిక్రమ మనునొకనాటకమును మలయాళభాషలోను, ఇందుమతీరాఘవ మనురూపకమును సంస్కృతములోను నిర్మించెనఁట. ఆసమయముననే కుక్కుటక్రోడ (కాలికట్టు) ప్రభువు లైనరవివర్మ గోదవర్మల యాశ్రితుఁడై పేరొందినవాసుదేవకవి భృంగసందేశ మనుకావ్యము నిర్మించి తనకుఁ బంపఁగా దానిని జూచి యితఁడు కోకిలసందేశము నిర్మించి యతనికిఁ బంపెనని కింవదంతి కలదు. ఇం దొకకాముకుఁడు కేరళదేశములో నున్న, తనప్రేయసికిఁ గోకిలచే సందేశ మంపువిషయము

భక్కఁగా వర్ణింపఁబడినది. ఇదియన్నివిధములఁ గాళిదాసుమేఘసందే శము ననుకరించినది.

మల్లికామారుత మనెడిపదియంకముల ప్రకరణ మొకటి దేశ మున వ్యాపించి యున్నది. అది బహువిధముల భవభూతిమాలతీమాధ వమును బోలి యున్నది. కవిత్వము రసవంతము. కల్పనమును చమ త్కారముగా నున్నది. అది యుద్దండకవినిర్మితమే. ఆయుద్దండుఁ డితఁడే యని పరిశోధకులనిర్ణయము. దానినిబట్టి యీకవి శా. ౧౩౨౦– ౧౩౭౦ నడుమ నున్నవాఁ డని యూహింపఁబడుచున్నది. కొంద అితఁడు పదునాఱవశతాబ్ది మొట్టమొదటివాఁ డన్నారు కాని, యందుకుఁ దగినయాధారములు కనఁబడవు.

# వాసుదేవకవి

ఉద్దండకవికి సమకాలికుఁ డైనయితఁడు మలబారుదేశీయుఁడు. గోపాలీమహర్షులపుత్త్రుఁడు. వాసుదేవనామకకవులు నలుగు రైదుగురు కనవచ్చుచున్నారు. తల్లిదండ్రులనామములనుబట్టి గుర్తింపఁగా నితఁడు మానవిక్రమరాజుసభలోని యుద్దండునకు సమకాలమువాఁ డని భృంగ సందేశము నిర్మించినవాఁ డని తేలినది. ఇతఁడు కాలికట్టుప్రభువు లైన రవివర్మగోదవర్మలయాస్థానమున నున్నవాఁడు శా. శ. ౧౩౫౦ ప్రాంత మువాఁడు.

ఇతఁడు వాసుదేవవిజయ మనెడియొకకావ్యము నిర్మించెను. అది పాణినీయమున సిద్ధించిన నామధాతురూపములను విశదీకరించునది. పూర్తి గావింపక యితఁడు విడిచినదాని నితనిమేనల్లుఁడు నారాయణకవి పూరించెను. వాసుదేవవిజయమును కావ్యమాలాపత్రికాళికులు ప్రకటిం చియున్నారు. మఱియు నితఁడు దేవీచరిత మనెడియాఱాశ్వాసముల యమకకావ్యమును శివోదయము అచ్యుతలీల గజేంద్రమోక్షము నను కృతులు నిర్మించెను. కాని, యివి యముద్రితములు.

పాండవచరిత మనెడియొకకావ్యములో వాసుదేవకవి పార్థకథ నిర్మించె నన్నమాట కలదు.

"తస్మై నమో ఽస్తు కవయే వాసుదేవాయ ధీమతే,
యేన పార్థకథా రమ్యా యమితా లోకపావనీ"

ఆపాండవచరిత మెవరిదో! ఈపార్థకథాకర్త యితఁడో మఱియొక వాసుదేవుఁడో! అవేద్యము:—

పూర్వోక్తు లైనగోపాలీమహర్షులతో మ్మండుగురు కొడుకులు వివిధవిద్య లభ్యసించినవిద్వాంసు లని యితనిశివోదయకావ్యపీఠిక విశదీకరించుచున్నది. ఆకాలమున పాండ్యచోళచేరమండలములలో పెక్కుమంది కవులు వెలసి బహుకృతులు నిర్మించినా రనుటకు లిఖితపుస్తకపట్టికలు ప్రమాణ మగుచున్నవి.

## మాధవార్యుఁడు

మాధవసంజ్ఞ గలకవు లెందఱో కలరు. వారిలో నితఁడు నరకాసురవిజయ మనుకావ్యము నిర్మించినవాఁడు. బర్నెలు సంపాదించిన యీకావ్యముప్రతి యొకటి ౩౮౦౧ సంఖ్యగలది తంజావూరుసరస్వతీభాండాగారమం దున్నది. కొంచెము తక్కువగా నాలుసర్గలగ్రంథము మాత్రమే యం దున్నది. సర్గాన్తగద్యలలో—మాధవేంద్ర మాధవప్రభు మాధవామాత్య—యనుపేళ్లు కూడఁ గనఁబడుచున్నవి. అవతారికలో వేదశాస్త్రపారీణుఁడు ప్రాకృతభాషాప్రవీణుఁడు గద్యపద్యాత్మకబహుగ్రంథకర్త యు నైన విరూపాక్షకవి ప్రోత్సాహమున నితఁ డీకావ్యము నిర్మించిన ట్లున్నది. దీనినిబట్టి వీ రిద్దఱు నొకరాజునొద్ద మంత్రులుగా నున్నవా రని యూహింపనయ్యెడి. ఆరా జెవరు?—

విజయనగరసామ్రాజ్యపాలకుఁ డైనద్వితీయహరిహరరాయలకు ముక్తాదేవియందు జన్మించిన ఉదయగిరి విరూపణ్ణయనఁబడు విరూపా

క్షరాజు శా. ౧౩౦౯ ప్రాంతమునందు మరకతపురమున రాజప్రతిని ధిగా నుండె ననియు నతనియాస్థానమున మాధవాదివిద్వత్కవు లుండి రనియు, ఆరాజు స్వయముగా నారాయణవిలాసము ఉన్మత్తరాఘవము ననుసంస్కృతకృతు లొనరించె ననియు నొకమత మున్నది. అది విశ్వస నీయ మైనచో నీయిద్దఱుకవులు శా. ౧౩౦౦ ప్రాంతమువా రనవలెను. రెండవదేవరాయలపౌత్రుఁడును మల్లికార్జునరాజుపుత్రుఁడు నైన విరూపాక్షరాజు శా. ౧౪౦౦ ప్రాంతమునందు పరిపాలకుఁడుగా నున్నట్లు చరిత్ర చెప్పుచున్నది. అతనియాస్థానమందు వీ రిరువురు నుండి యుందు రన్నచో వీరు శా. ౧౪౧౦ ప్రాంతము వా రనవలెను. ఎట్లయినను మాధవవిరూపాక్షకవులు సాయణమాధవాచార్యులకు మిక్కిలి తరువాతివా రనుటయే సముచితము గావునఁ బ్రబలప్రమాణము లభించునంతదనుక మనకవియు తత్కాలమువాఁ డనియే భావింతము.

ఈకవి కర్ణాటకుఁడు కావచ్చును. ఇతనికవిత్వము మృదువు సరసము నని యితనినరకాసురవిజయములోని యీక్రిందిశ్లోకములే చెప్పుచున్నవి. (ధర్మసూరినరకాసురవిజయము దీనికంటె వేఱు)

" అమృతం పాతు మభ్యగ్రం ద్రష్టు మిన్దుకలా మివ,
శ్రోతుమిచ్ఛా సరసం కావ్యం కస్య నోత్కణ్ఠతే మనః ? "

" మానయన్తు కవీన్ భూపా స్తే ఽపి తన్వన్తు తద్యశః,
ఏవ మన్యోన్యసారస్యా దేధన్తా ముభయే ఽపి తే "

" ప్రశాస్మహే నమోవాకం ప్రాచేతసమహర్షయే,
ప్రథమం ప్రప్రథే యత్ర తీర్థే సారస్వతామృతమ్ "

" ఆప్తగీతామృతస్ఫూర్తి రనుకృద్భారతాన్వయా,
దీవ్యతి వ్యాసవా గ్గంగా దేవవ్రతగుణోన్ముఖీ "

" జగదానన్దజననీ జగత్యవ్యాజకోమలా,
కవితా కాళిదాసస్య కలేవాద్యకలానిధేః "

" ఆస్తి ద్వారవతీనామ ప్రశస్తవిభవాపురీ,
మధ్యే మహాంబురాశే ర్యా నిర్మితా నరకారిణా "

# శ్రీ కృష్ణ దేవ రాయలు.

శా. ౧౪౩౧—౧౪౫౧ నడుమ నవకీర్తిక్రమమున సకలకర్ణాటాంధ్రభూమండల మేలిన మహాశూరుఁడు మహావిద్వాంసుఁడు సంస్కృతాంధ్రకర్ణాటభాషాకవిపోషకుఁ డష్టభాషాకవియు నైనయీ రాజాధిరాజు తుళువవంశభూషణుఁడు. నాగాంబానరసరాజుల పుత్త్రుఁడు. వీరనరసింహరాజుసోదరుఁడు, తుంగభద్రాతీరమందలి విజయనగరము రాజధానిగా దక్షిణహిందూదేశ సామ్రాజ్యమును సంస్కృతాంధ్రకవితాసామ్రాజ్యమును పాలించినధీరుఁడు. ఇతఁ డాంధ్రమునందు తనయాస్థానకవులగు పెద్దనతిమ్మనాదులు రచియించినకృతు లందుకొనుటయేకాక, ఆముక్తమాల్యద యనుప్రౌఢకృతి నిర్మించి తెలుఁగునాట తనశాశ్వతయశఃకాయము నిలుపుకొన్న సుశ్లోకుఁడు.

ఈమహారాజకవి సంస్కృతమున మదాలసాచరిత్రి సత్యావధూసాంత్వనము సకలకథాసారసంగ్రహము రసమంజరి జ్ఞానచింతామణి యనుకృతులు నిర్మించినట్లుగా నితని యాముక్తమాల్యదావతారిక తెలుపుచున్నది. ఇవి గాక ఉషాపరిణయము జాంబవతీకల్యాణము నను నాటకములు నిర్మించినట్లు లిఖితగ్రంథపట్టిక చెప్పుచున్నది. ఇందు కడపటిది హంపీవిరూపాక్షస్వామి కల్యాణోత్సవ సమయమున ప్రదర్శింపఁబడిన దఁట, రసమంజరిలోనియుదాహరణశ్లోకములు శ్రీకృష్ణదేవరాయ స్తుతిపరములుగా నున్నవి గావున నిది యితనియాస్థానములోని యొక సంస్కృతకవి నిర్మించి యితనిపేరు పెట్టియుండు నని భావింపఁబడుచున్నది. ఎట్లయిన నితఁడు ముక్కుతిమ్మన యాంధ్రకావ్య మగు పారిజాతాపహరణములోనికథనే సత్యావధూసాంత్వన మనుపేర

సంస్కృతమున నిర్మించె ననుట కేయాక్షేపమును లేదు, అయిన నేమి? ఈచక్రవర్తి సంస్కృతకృతులు విద్వల్లోకమున వ్యాపింపక నామ మాత్రస్మరణీయములైనవిగదా! అట్లే యితనియాస్థానమందలి సంస్కృతకవులకృతులును ప్రచారము లేక యణఁగిపోయినవి.

# దివాకరుఁడు

శ్రీకృష్ణదేవరాయల యాస్థానమందలి సంస్కృతకవులలో నొకఁడగునితఁడు ముక్తాంబావైద్యేశ్వరుల పుత్త్రుఁడు. భారద్వాజ గోత్రుఁ డాపస్తంబసూత్రుఁడు, కవిచంద్రరాయబిరు దాంచితుఁడు. ఇత నిపేర పారిజాతాపహరణము రసమంజరి దేవీస్తుతి భారతామృతము నను కృతులు లిఖితగ్రంథపట్టికలలో కనవచ్చుచున్నవి. ఇందు మొదటిది తనపోషకునికృతి ననుసరించి రచియించిననాటక మని తోఁచుచున్నది. ఈతని రసమంజరియే కృష్ణరాయలదిగా గణన కెక్కి యుండును. పీఠికి రాక యణఁగిపోయినయీకృతులు శిథిలమై యున్నవి. భారతామృతము లోనియొకశ్లోక మిది, ఇందు, అశ్వత్థామ ఉపపాండవులను శిబిరములో హింసించుట వర్ణింపఁబడినది.

" చక్రే చ తథాపృథాసుతానాం. సద్రాణి శ్శిబిరం శవైకశేషమ్,
పారావతపంజరాన్తరాళే సంవిష్టా మథితం యథా బిడాలః"

# రామచంద్రకవి - ౨

ఇతఁడయోధ్యాపురవాసి, లక్ష్మణభట్టుకొడుకు. శృంగారవైరాగ్యములను జోడించి ౧౦౨శ్లోకములకృతి నిర్మించినయీకవి, విక్రమ శకము ౧౫౭౦లోనివాఁడు. ఈవిషయము స్వయముగా నితఁడే యిట్లు తెలిపెను.

" ఏకశ్లోకకృతౌ పురస్సుఫరితయా స త్త్వగోష్ఠ్యా సమం,
సాధూనాం సదసి స్ఫుటాం విటకథాం కో వాచ్యవృత్త్యా నయేత్"
ఇత్యాకర్ణ్య జనశ్రుతిం వితనుతే శ్రీరామచంద్రః కవిః
శ్లోకానాం సహపంచవింశతిశతం శృంగారవైరాగ్యయోః
" శృంగారవైరాగ్యశతం సపంచవింశ త్యయోధ్యానగరే వ్యధత్త
అబ్దే వియద్వారణబాణచంద్రే శ్రీరామచంద్రో నుచతస్య టీకామ్"

వీటినిబట్టి యితఁడు శా. ౧౫౮౦లో నీకృతి సమాప్తిగావించి నట్లును తానే టీకవ్రాసినట్లును విదిత మైనది. ఇది శ్లేషకావ్యము. పరస్పరవిరుద్ధవిషయముల కిందు జోడింపు. అయినా, కావ్యము మృదువై సులభముగా నున్నది. ఇందు కొక యుదాహరణము.

" విద్యా ధనాభిజన కామ మదేషు పుంసా
దుర్వార ఏష చరమ స్తదహం బ్రవీమి,
రామాత్మకం జగ దిదం హృది భావయ న్తః
కందర్ప మేక మవలంబితు ముత్సహేరన్,

# దైవజ్ఞసూర్యపండితుఁడు

ఇతఁడు విదర్భజుఁడు భారద్వాజగోత్రుఁడు పార్థపుర మితనిజన్మభూమి. అది విదర్భ కంటెయున్నగోదావరి కుత్తరముగా నొకక్రోసుదూరమున నున్నది. ఇతనితాత నాగనాథదైవజ్ఞుఁడు, తండ్రి జ్ఞానరాజదైవజ్ఞుఁడు. సంగీతసాహిత్యజ్యోతిశ్శాస్త్రసమర్థుఁ డైనయీకవి తననృసింహచంపువులోఁ దెల్పినయీక్రిందిమాటలవల్లనే పైవిషయము తెలియవచ్చినది.

" ఆస్తే త్రస్తసమస్తదోషనివహా గోదా విదర్భాయుతా,
క్రోశే నోత్తరత స్తదుత్తరతటే పార్థాభిధానం పురమ్,

త త్రాసీ ద్గణికాగ్రణీః పృథుయశాః శ్రీనాగనాథద్విజో
భారద్వాజకులే ఒథ తస్య తనయః శ్రీజ్ఞానరాజాభిధః ”
“ య ద్గ్రన్థాన్ సమధీత్య శిష్యనివహో ఒప్యాచార్యచర్యా మగాత్,
తత్సూను ర్గణితాగమప్రతరణే యత్కర్ణధార స్సుధీః,
సంగీతాగమకావ్యనాటకపటు స్సూర్యాభిధానః కవిః,
చంపూకావ్య మిదం చకార చతురం లక్ష్మీపతిప్రీతయే ”

మొదటిశ్లోకములోని “గోదా” శబ్దము గోదావరికి సంగ్రహరూప మగును. విదర్భజుఁడైనభవభూతి గోదాశబ్ద మెందును వాడలేదు. కాని, యీకవినాఁడు పార్థపురప్రాంతమునం దీసంగ్రహరూపము వాడుకకు వచ్చియుండును. గోదావరికంటె వేఱయినగోదావరి విదర్భదేశమున ప్రవహించినదా ?

భాస్కరాచార్యునిబీజగణితమునకు వ్యాఖ్యలు రచియించిన వారిలో నొకఁడైనయీసూర్యకవి గణకానందాదిబహుకృతులు నిర్మించి, సాహిత్యమున నలంకారముగా నాలుగుల్లాసములనృసింహచంపువును రామకృష్ణవిలోమకావ్యమును రచియించెను. ఇందు మొదటిది ప్రహ్లాదచరితము. రెండవది యితనివిచిత్రశ్లిష్టకవిత్వచాతుర్యము ప్రకటించు చిన్నకావ్యము. ఇందు రమారమి నలువదిపద్యము లున్నవి. ఇది ముద్రితము.

ఈకృతిలో శ్రీరామశ్రీకృష్ణకథలు జోడింపఁబడినవి. పూర్వార్ధమునే చివరినుండి మొదటికి చదివినచో నుత్తరార్ధ మగుట యిందలి శ్లోకరచనలోని గొప్పవిశేషము. ఇందు కొకయుదాహరణము:—

“ తం భూసుతా ముక్తిముదారహాసం
వన్దే యతో లవ్యభవం దయాశ్రీః,
శ్రీయాదవం భవ్యలతోయదేవం
సంహారదా ముక్తిముతా సుభూతమ్ ”

మొదటినుండి నాలుగుపాదములు చదివి తుదినుండి మరల మొదటికి నాలుగుపాదములు చదివిన నిదే శ్లోక మగుట మఱియొక విశేషము. పూర్వార్ధమందు రామకథయు నుత్తరార్ధమందు కృష్ణ కథయు వర్ణిత మగుట యింకొకవిశేషము. ఇట్టికావ్యము నిర్మించుట కీదైవజ్ఞుఁ డెంతక్లేశపడెనో యాదైవమే యెఱుఁగును.

మూఁడువిద్యలలో మొనగాఁడై యుత్సాహియు సుఖజీవియునై పద్యములు వ్రాసికొనుచు పాడుకొనుచు నిశ్చింతగాఁ గాలము గడపిన యీతఁడు లీలావతికి శా. ౧౪౬౪ లోను, సూర్యప్రకాశమునకు ౧౪౬౧ లోను టీకలు నిర్మించెను. ఈసందర్భమునందు కృతికర్త పేరు తెలియని యొకశ్లేషకావ్యము:—

## నలహరిశ్చంద్రీయము

కవి దాక్షిణాత్యుఁడేమో ఈకృతి తిన్నవ్వేలిపుస్తకాగారమున నున్నది. ఇందలి శ్లోకములు మొదటినుండి చదివినపుడు నలార్థము, తుదినుండి మొదటికిఁ జదివినపుడు హరిశ్చంద్రార్థము నిచ్చును. ఉదాహరణము:—

"నిజమో ఉతిప్రజానారీ నలో ఉచ్చ స్సదమో ఉజని,
యఃశ్రియ శ్చన్ద్ర ఇన్ద్రశ్చ గోప్తా గో స్సర్వపూ రిహ"

ఈక్రిందిశ్లోక మన్నిపాదములు ననులోమవిలోమపద్ధతిని జదువ ననువై రెండర్థములు తెలుపుచున్నవి.

"లీలాకలోమధ్యమలోకలాలీ త్యాగీ సుఖీ ముగ్ధముఖ సుగీత్యా
సభా ప్రియా నజ్ఞ నయా ప్రభాస సహాసయా తత్రతయా సహాస"

మఱియు నీపద్యమంతయు ననులోమవిలోమపద్ధతిని జదువవచ్చును. అర్థములు రెండు నట్లే సిద్ధ మగును. ఇట్లు శబ్దార్థములతో మల్లయుద్ధముచేసి యిట్టికావ్యములు నిర్మించినవా రాకాలమున నింకా కొంద ఱున్నారు.

# కేశవపండితుఁడు

ఈకవి మాధ్యందినశాఖీయుఁడు శుక్లయజుర్వేదపాఠకుఁడు పూర్వోత్తరమీమాంసలు చక్కఁగాఁ బఠించినవాఁడు సాహిత్యనిధి తార్కికుఁడు. ఇతనితాత కేశవపండితుఁడు, తండ్రి అనంతపండితుఁడు. గోదావరీతీరమందలి పుణ్యస్తంభగ్రామ మితనినివాసము. లౌగాక్షికులమున జన్మించినయీవిద్వాంసుఁడు తననృసింహచంపువులోఁ జెప్పినమాట వల్లఁ బైవిషయము తెలియవచ్చినది. (లౌగాక్షియనునతఁడు శుక్లయజుశ్శాఖీయశ్రౌతసూత్రకర్త)

" శ్రీలౌగాక్షికులారవిందతరణి ర్మాధ్యందినామ్నాయవిత్,
మీమాంసాయుగతర్కతంత్రచతురః సాహిత్యరత్నాకరః,
కావ్యం శ్రీనృహరేః కరోతి సుకృతీ గోదాతరప్రోల్లస
త్పుణ్యస్తమ్భనివాసి కేశవసుతానంతాత్మజః కేశవః"

గోదాశబ్ద ప్రయోగమునుబట్టియు నృసింహచంపూరచనమును బట్టియు నితఁడు పూర్వోక్తసూర్యపండితునికి సమకాలమువాఁడైన విదర్భజుఁ డని యూహింపనగును. అతనిపార్థపురమువలె నితనిపుణ్యస్తంభపురము నందే గోదావరియుత్తరతటమున నుండియుండును.

" దిక్పదేభ్య స్తీరస్య తారభావోవా" అనుకాత్యాయన కార్తికమునుబట్టి దక్షిణతారాదులుసాధ్యములు కావలసియుండఁ గంగాతార ప్రయోగము కనవచ్చినదిగాని, యితనిగోదాతరమువలె హ్రస్వము వచ్చినప్రయోగ మొందును గనరాలేదు. ఇది యీపండితుఁడు తెలిసి ప్రయోగించినది గావున విచారణీయ మగును.

అతనికృతివలెనే యితనికృతియు ముద్రితముగాక పడియున్నది. పూర్వోక్తవిషయములనుబట్టి యీసూర్యకేశవపండితు లిరువురు నొక నాటివారనియు, ఒకరినిచూచి యొకరు పోటీగా నృసింహచంపువులు రచియించియుందు రనియు భావించుచున్నారు:—

# రాజనాథకవి

ఇతఁడు డిండిమకవివంశములోనివాఁడు[1]. గౌతమగోత్రుఁడు. ఇతనితండ్రి అరుణగిరినాథుఁడు కవిరాజరాజ డిండిమకవిసార్వభౌమబిరుదాంకితుఁడు విజయనగరసామ్రాజ్యపాలకుఁడైనవీరనరసింహరాయలయాదరము నందినవాఁడు వీరభద్రవిజయమనుడిమరూపకమునిర్మించినవాఁడు పరేంద్రాగ్రహారవాసి. శా. ౧౪౩౫ ప్రాంతమువాఁడు-ఈకవిపితామహుఁడు రాజనాథుఁడనుడిండిమకవి-సరసకవితాసార్వభౌమ చేరచోళపాండ్యప్రథమారాధ్యాది బిరుదాంచితుఁడు, సాలువనరసింహరాజుసత్కారమునందినవిద్వత్కవి. శా. ౧౩౮౦ ప్రాంతమున నున్నవాఁడు.

శ్రీకృష్ణదేవరాయలయనంతరము శా. ౧౪౫౧-౧౪౬౪ నడుమ విజయనగరసామ్రాజ్య మేలినఅచ్యుతదేవరాయలయాదరము గాంచిన యీరాజనాథకవి యాతేనిచరితము నచ్యుతరాయాభ్యుదయ మనుపేర పన్నెండుసర్గలకావ్యముగా వర్ణించెను. ఇందు కృష్ణదేవరాయలపూర్వరాజులచరితము ముందుకొంత వర్ణింపఁబడినది. తరువాత అచ్యుతదేవరాయలదక్షిణదిగ్విజయయాత్ర సవిస్తరముగా వర్ణింపఁబడినది. ఇట్టిచరిత్రగ్రంథ మచ్చుపడక చెన్నపురిలిఖితపుస్తకాలయమున నణఁగిపోయినది.

# రత్నఖేటశ్రీనివాసదీక్షితులు.

ఇతఁడు చోళదేశీయుఁడు విశ్వామిత్రగోత్రుఁడు, భవస్వామిభట్టతనయుఁడు, కృష్ణభట్టసోమయాజిపౌత్రుఁడు. ఇతనిపూర్వ పురుషులలో నొకవ్యాఖ్యాతయైనభవస్వామి కలఁడు గాని, అతఁడు భట్టభాస్కరులు ప్రశంసించిన పూర్వమీమాంసాభాష్యకర్తయైనభవస్వామి యని భావింపరాదు. అట్లయినచో నీకవి పండ్రెండవశతాబ్దిలోనివాఁ డనవలసి

1. విభాగరత్నమాల యనుపేర నీడిండిమకవివంశచరిత్ర ప్రకటితమైనది.

వచ్చును. అట్లనుట పొసఁగదు. మఱియు భైష్మీపరిణయము వ్రాఁతప్రతిలో నున్నలక్ష్మీభవశబ్దమును లక్ష్మీధర యని పఠించుట ప్రమాదము ఇతనితండ్రికి లక్ష్మీభవస్వామి యనియు వాడుకకలదు.

ఈకవి శా. ౧౩౭౦ ప్రాంతమువాఁ డని కొందఱు. ౧౪౭౦ ప్రాంతమువాఁ డని మఱికొందఱు. ఈదీక్షితుని తన సంస్థానమున నిలిపి యితని కగ్రహార మిచ్చినసూరపరాజు దక్షిణార్కాటుజిల్లాలోని జింజిపరగణా యేలినవాఁ డనియు నారాజు, శా. ౧౪౭౦-ప్రాంతమున నున్నవాఁ డనియు నొకచారిత్రకమత మున్నది. అప్పయదీక్షితుల కీకవి వృద్ధుఁడైనసమకాలమువాఁ డనుప్రతీతియుఁ గలదు. కావున రెండవమతమునుబట్టి యీతఁడు, శా. ౧౪౫౦-౧౫౩౦ నడుమ నున్నవాఁడందము. ఇతఁడు సుమారు నూఱుకృతులు రచియించెను. అవియన్నియు నణఁగియున్నవిగ్రంథస్థితి యిట్టి దైనను స్వకాలమున దేశప్రసిద్ధి గన్న మహాకవులలోనితఁ డొకఁ డనుట నిజము.

అద్వైతమతబోధకముగా నితఁడు ప్రబోధ చంద్రోదయము మాడ్కి భావనాపురుషోత్తమ మనెడియైదంకముల నాటకము నిర్మించెను. అందలి యీక్రిందిశ్లోకములోని పూర్వాపరాద్రిచన్ద్రసూర్యవర్ణనమే యితనికి రత్నఖేటబిరుదము వచ్చుటకు మూల మయ్యెనఁట.

" అన్యోన్య సమరలీలా, లాలసపూర్వాపరాద్రిశూరాభ్యామ్,
ధృతరత్నఖేట శంకాం, తన్వాతే సుముఖి పుష్పవద్భింబౌ"

ఈవిషయమునే బాలయజ్ఞేశ్వరుఁ డనుకవి విశదీకరించి వర్ణించి "క్షితిపతివచసారత్నఖేటాధ్వరీతి" అని పలికియున్నాఁడు.

దీనిప్రస్తావనలో తరువాత నితరులు చేర్చినశ్లోకములు లిఖితపుస్తకములం దున్నవి. అం దితనిప్రశంస యిట్లున్నది.

"త్వత్తాస్తి కశ్చి త్తరుణాగ్నిహోత్రీ
మద్దర్శినీసాగరపారదృశ్వా,

శతావధానీ త్యపరాభిధానః
శ్రీ శ్రీనివాసాధ్వరిసార్వభౌమః"

ఈదీక్షితకవి సూరపనాయకుని యాస్థానమున నున్నవాఁ డని దీనిప్రస్తావనాశ్లోకమే యిట్లు చెప్పుచున్నది.

"సుధారసకిరో గిర స్సురభయంతి విశ్వం కవేః,
సభాపతి రసౌ నృప స్సహృదయాగ్రణీ స్సూరపః"

ఇతనికి కవివాదిగజకేసరి అభినవభవభూతి మొదలగు బిరుదములు కలవు. దినైకపరిబంధనిర్మాణదక్షుఁడ నని వ్రాసికొన్న యితనికి షడ్భాషా సార్వభౌమబిరుద మున్నట్లు వేదాంతవాదావళి తుదిశ్లోకము చెప్పుచున్నది.

"షడ్భాషాసార్వభౌమస్య శ్రీనివాసస్య యజ్వనః
వాదావళి రియం విద్వత్కర్ణభూషాయతాం చిరమ్"

ఇతఁడు బౌద్ధమాధ్వమతములను నిరసించుచు నిర్మించినకృతుల పేళ్లు యినఁ దెలియకున్నవి. భైష్మీపరిణయము శితికంఠవిజయము సాహిత్యసంజీవిని యనుచుఁ గృతుల నామములుమాత్రము వినవచ్చును—ఇతని వైదుష్యమును నుతించు నీచాటుశ్లోకము దేశమున నెక్కువగా వాడుకలో నున్నది.

"విపశ్చితా మపశ్చిమే వివాదకేళినిశ్చలే,
సపత్నజి త్యయత్న మేక రత్నఖేటదీక్షితే,
బృహస్పతిః క్వ జల్పతి ప్రసర్పతి క్వ సర్పరా
ట్షణ్ముఖ శ్చ షణ్ముఖ శ్చతుర్ముఖశ్చ దుర్ముఖః"

ఇతనిభైష్మీపరిణయము ప్రౌఢకావ్యము. అందితఁడు కృతిస్వరూపము నిట్లు నిరూపించెను.

"శ్లిష్టా సభంగా సద్వర్ణా నిర్దోషా సద్గుణా మృదుః
నానాభంగీ విలాసా చే త్కృతిః, ర్వికృతి రన్యథా"

అందవతారికలో స్వవృత్తాంతము నిట్లు వెల్లడించెను.

" దన్తిద్యోతిదివాప్రదీపబిరుదో యో ఉద్వైతవిద్యాగురుః,
విశ్వామిత్రకులాంబుధే శ్శీమకరో లక్ష్మీభవ స్యాత్మజః,
స్వాయత్తీకృతవేదతంత్రనిచయో య స్యాగ్నిచి ద్విశ్వజి
ద్యాజీ తేనహి రత్నఖేటముఖినా సేయం కృతి స్తన్యతే"

" ధ్వన్యధ్వ న్యధికం చమత్కృతి యుతా య స్యాద్భుతాః సూక్తయః
సారస్యేన సుధాం సుధాం విదధతే తాం శర్కరాం శర్కరామ్
సావిత్ర్యాః ప్రథమం య మద్భుతగుణం వ్రవే స్వయం భారతీ
షడ్భాషాచతుర శ్చకా స్తి భువనే విఖ్యాతకీర్తిః కృతీ"

ఈక్రిందికవితావర్ణన మితని కవితోద్దేశములను దెలుపఁగలదు.

" భ్రమరహితా సా కచవత్, స్త్రీణాం కుచవచ్చ సరసహితా,
లసదక్షరసేయూషా ఉధరవ త్కవితా మహాత్మనాం జీయాత్"

" సర్వాలంకారయుక్తాపి నశ్లిష్టా వనితేవ సా,
వాణీ మనోజాతసుఖం ప్రౌఢానాం న తనోతి హి"

ఇతనికి ప్రథమభార్యయందు కేశవుఁడు, అర్ధనారీశ్వరుఁడును జన్మించిరి. ఇద్దఱును పండితులు కవులు, ద్వితీయభార్యయందు రాజచూడామణి యుదయించెను.

## రాజచూడామణిదీక్షితులు

శ్రీనివాసదీక్షితునియపరవయస్సునఁ బుట్టినయితఁడు శా. ౧౫౨౦ ప్రాంతమున జన్మించి ౧౫౫౦ ప్రాంతమున రఘునాయకునిసభలోను పిదప నతనికుమారుఁ డగువిజయరాఘవనాయకునిసభలోను విద్వత్కవియై తంజావూరునగరమున నున్నవాఁడు.

ఇతఁడు తొలుతఁ దనయన్నయైనయర్ధనారీశ్వరునివద్దను, పిదప రఘునాథనాయకుని సభలోనివాఁడును చతుర్దండిప్రకాశికాదికృతికర్తయు నైనవేంకటముఖివద్దను విద్య లభ్యసించెను.

ఇతఁడు కమలినీకలహంసనాటిక రఘునాధనాయకునిరాజ్యావసానకాలమున రచియించెను. అది ముద్రితమైనది. ఈపేరుగలవి మఱిరెం డున్నవిగాని యవి వ్యాప్తికి రాలేదు. ఇతఁడు తననాటికాప్రస్తావనలో వ్రాసికొన్నయీక్రిందిమాట యతిశయోక్తిగాఁ గనిపించును.

"పారిపార్శ్వికః- తేనహి గర్భసప్తమఏవ హాయనే విరచయ్య సబహుమాన మస్మాకం హస్తే దత్తా కిల కమలినీకలహంసనామధేయా శృంగారరసపేటికా నాటికా" 1

తండ్రి కొడుకులవయోఽన్తరము గుర్తింపనియర్వాచీనగ్రంథలేఖకుఁ డెవఁడో యీమాట చెప్పియుండును. ఏడవయేఁడు ప్రవేశించినంతనే యితఁ డీనాటిక రచియించినమాట నిజమైతే ముందు రత్నఖేటశ్రీనివాసదీక్షితులు శా. ౧౫౪౫ వరకు జీవించియున్నాఁ డని నిర్ధారణ చేయవలెను, తరువాత నితఁ డాఱేళ్లవయస్సునాఁటికే సంస్కృతసాహిత్యమున నిధి యయ్యె నని నిశ్చయింపవలెను. రెండును అసంభవములే.

ఇతఁడు రఘునాధనాయకునిసభలోనున్నవాఁ డని యీక్రింది భరతవాక్యమునఁ దెలియును. ఈనాటిక రఘునాధరాజు చిదంబరయాత్ర సలిపినపుడు ప్రదర్శింపఁబడిన దఁట.

"సాహిత్యం రమతాం మన స్సుమనసాం సంతో భజన్తాం సుఖం
సోమాలంకృతశేఖరే భవతు మే వామాంగజానౌ మతిః
ధీరశ్రీచినచెవ్వయాచ్యుతధరాధౌరేయభాగ్యోన్నతౌ,
రాజ్యం శ్రీరఘునాధనాయకవిభౌ రజ్యే త్సహస్రం సమాః"

ఇతఁడు వీరరాఘవనాయకునిసభలో నున్నకాలమునందానందరాఘవ మనునాటకము నిర్మించెను. దీనిప్రస్తావనలో "యజ్ఞనారాయ

1. ఇతనితండ్రియు ఉపనయనము కాకమునుపే తన్ను భారతి వరించిన దని వ్రాసికొన్నాఁడు. దానినిబట్టి యీమాట పుట్టి యుండును.

నాధ్వరిణా రఘునాథభూపవిజయనామ్ని మహాకావ్యే తావదేవ మభిహితో" మ్మనుచు నారాజగుణములు వర్ణించియున్నాఁడు. విజయరాఘవరాజు ప్రేరణమునఁ దనగురుపుత్ర వేంకటమఖి చతుర్దండిప్రకాశిక నిర్మించినట్లు ప్రశంసించియున్నాఁడు. ఆగురువు రచియించినవార్త్తికాభరణమునకు కృతికితఁడు తంత్రశిఖామణి యనుపేర నుత్తమవ్యాఖ్య నిర్మించియున్నాఁడు. దీనికాలము శా. ౧౫౪౮—"ధీమ న్మాన్యే శక స్యాబ్దే హాయనే చేశ్వరాభిధే, చూడామణి ర్వితను తే యజ్వా తంత్రశిఖామణిమ్"

మఱియు రుక్మిణీకల్యాణము శంకరాభ్యుదయము భారతచంపువు చిత్రమంజరి రత్నఖేటవిజయము రాఘవయాదవపాండవీయము, రామాయణచంపూయుద్ధకాండము కావ్యదర్పణము మొదలగుకృతులితనిసర్వతోముఖవైదుష్యము తెలుపుచున్నది.

## రఘునాథనాయకుఁడు

తంజావూరుపాలకులును, ఆంధ్రులును, సంస్కృతాంధ్రభాషాపోషకులునై ఖ్యాతి కెక్కిననాయకవంశరాజులలోని యీవిద్వత్ప్రభువు శా. ౧౫౨౨—౧౫౫౬ నడుమ రాజ్యముచేసినశూరుఁడు ధీరుఁడు. తనవంశమున నమాత్యుఁడైనమహావిద్వాంసుఁడును కర్ణాటబ్రాహ్మణశ్రేష్ఠుఁడు నైనగోవిందదీక్షితునివద్ద నెల్లవిద్య లభ్యసించిన ప్రతిభాశాలి. సంస్కృతాంధ్రములందు సరసకవిత్వము చెప్పి సభలోని విద్వత్కవులను మెప్పించిన పండితకవిశిరోరత్నము. చినచెవ్వనాయకుని పౌత్రుఁడు మూర్త్యంబాచ్యుతేంద్రుల పుత్రరత్నము. సంగీతసుధారామాయణసార భారతసారాదిసంస్కృతకృతులు నిర్మించినకవిరాజు. తనగురువైనగోవిందదీక్షితుని పుత్త్రులకు గురువైనపండితవిభుఁడు. వారిలో యజ్ఞనారాయణయజ్వ రఘునాథవిలాస మనునాటకము రచియించి దానిప్రస్తావనలో నిట్లు చెప్పెను—సూత్రధారోక్తి:—

"తత్ర భవతా రఘునాథభూభృతా శిక్షిత ఇత్యనేనైవతావదస్యాపి కవయితా యజ్ఞనారాయణాఖ్యాయ జాక ఇతి జానామి, యో వా రఘునాథభూప విజయసాహిత్యరత్నాకరయోః కర్తా"

ఆనాఁడిందిరామందిర మనుపేరు గలయితనిసభలో నెందఱు విద్వాంసులు కవిశేఖరులు నుండెడివారో! చేమకూర వెంకటకవి మొదలగునాంధ్రకవుల కాశ్రయమై విజయవిలాసాది సరసకావ్యములు కృతినందినయీమహారాజు నాఁడు రెండవ శ్రీకృష్ణదేవరాయలునా విల్లసిల్లెననుట సత్యము. ఇతఁడు ఏకరాత్రిలో పారిజాతాపహరణ మను ప్రబంధము నిర్మించిన ట్లానాఁటికవి యొకఁ డిట్లు తెలిపియున్నాఁడు.

"శ్రీపారిజాతాహరణాభిధానో యేనైకరాత్రేణ కృతః ప్రబంధః"
"నానావిధాశానరపాలవర్గసందేశకృద్భి స్సముపాస్యమానః"

అని సకలసామంతరాజులవార్తాహరులచే సేవింపఁబడుచున్న తన యైశ్వర్యమును దెలుపుచుఁ దనసభ నిట్లు "సంగీతసుధలో" వర్ణించు కొనియున్నాఁడు.

"సంభావనీయాదృతశాతకుంభ స్తంభావళీసంభృతనూత్నరత్నైః
రమ్యా విశేషేణ సభా విభాతి తత్రేన్దిరామందిరనామధేయా"

ఇవిగాక, యితఁడు భారతసుధ వాల్మీకిచరితము అచ్యుతేన్ద్రాభ్యుదయము నలాభ్యుదయము రుక్మిణీకృష్ణవివాహము రామాయణసారసంగ్రహము మొదలగు పెక్కుకృతులు నిర్మించినట్లు తెలియవచ్చును. ఇతనిసంపూర్ణచరిత్ర మితనిభార్య రామభద్రాంబయు, నితని యుంపుడు కత్తె మధురవాణియుఁ దమకృతుల వర్ణించియున్నారు.

## గోవిందదీక్షితులు

పూర్వోక్తరఘునాధనాయకుని ప్రధానమంత్రియు గురువు నైన యితఁడు వాసిష్ఠగోత్రుఁడు ఘనవిద్వాంసుఁడు గొప్పకవి రాజనీతివేత్త,

చెవ్వప్పనాయకునినాఁటినుండియు నాయకాస్థానమునం దమాత్యుఁడుగా నున్నవాఁడు. చిరకాలజీవి. శా. ౧౪౭౦-౧౫౫౦ నడుమనున్న వాఁడు. తిరుమంగేశ్వరమందును పట్టీశ్వరమందు నెక్కువగా నివసించిన వాఁడు. ఇతనికి నాగాంబికయను ధర్మపత్నియం దేనమండుగురు కొడు కులు నొకకూఁతురు జన్మించిరి. ఇతనిసామర్థ్యమును సౌజన్యమును తాత్త్వికజ్ఞానమునుగూర్చి యెన్నియో కథలు ద్రవిడదేశమున వ్యాపించి యున్నవి. అచ్యుతనాయకునొద్ద నితఁడు మంత్రిగానున్న కాలమందు వీ రిరువురిశక్తిసంపదను వర్ణించుచు నొకకవి చెప్పినశ్లోక మొకటి యున్నది.

“ త్రినామాద్యన్తనామానౌ మహీక్షిద్దీక్షితా వుభౌ,
శస్త్రే శాస్త్రే చ నిపుణా వావహేషు హవేషుచ ”

అచ్యుతానంతగోవిందనామములు త్రినామములు. ఇందచ్యుతేం ద్రుఁడు గోవిందదీక్షితులు నాద్యన్తనామధారులని యర్థము_కుంభ కోణమందును తిరువాదిలోను గోవిందదీక్షితుని లింగరూపవిగ్రహమును నేఁటికి నారాధించుచున్నారఁట. అద్వైతాచార్యుఁ డనియితనికి బిరుదు కలదు. ఇతఁడు సాహిత్యసుధ యనుకావ్యమునం దచ్యుతరఘు నాయకులచరితమును వర్ణించెను. సంగీతసుధానిధియను నొకకృతి నిర్మించిన ట్లితనికుమారుఁడు వేంకటమఖి చతుర్దండిప్రకాశికావతా రికలోఁ దెలిపియున్నాఁడు. అది సజీవమై యున్నది.

## యజ్ఞనారాయణయజ్వ

గోవిందదీక్షితులకు నాగమాంబయందు జన్మించినసుతులలోఁ బెద్దవాఁడు, తనతండ్రిశిష్యుఁ డైనరఘునాథనాయకునివద్ద విద్య లభ్య సించి తనబుద్ధివైశద్యమునకు మెచ్చుకొన్న యారాజుచే పాదహస్త కర్ణాలంకారములు కానుకగా నందినవాఁడు. శా. ౧౫౧౨-౧౫౭౨ నడుమ నున్నవాఁడు.

ఇతఁడు రఘునాథనాయకుఁడు కృతినాయకుఁడుగా రఘునాథవిలాసము రఘునాథభూపవిజయము సాహిత్యరత్నాకరము అలంకారరత్నాకరము మొదలగు పెక్కుకృతులు నిర్మించెను. తన పాండిత్యము నిట్లు సాహిత్యరత్నాకరమున వర్ణించుకొనెను.

" పాతంజలం భాట్టమతంచ తర్క మద్వైతరాద్ధాంత మహైమి కీర్త్యై,
పరిబంధసందర్భభరైః కవిత్వవిద్యా మిదానీం ప్రకటీకరోమి "

కాని, యితనికృతు లన్నియు పుస్తకభాండాగారముల నాశ్రయించియున్నవి. ఇతని తమ్ముఁడు వేంకటమఖి యనేకగ్రంథములు నిర్మించె నని యతనిశిష్యుఁడును రత్నఖేట దీక్షితునిసుతుఁడు నగురాజచూడామణి దీక్షితుఁడు తనతంత్రశిఖామణ్యాదుల యవతారికలలో వ్రాసియున్నాఁడు.

తనవద్ద గురుదక్షిణ పుచ్చుకొనుటకు బదులుగా రఘునాథరాజు తనకే శిష్యదక్షిణగా స్వర్ణాభరణము లిచ్చినాఁడని యీయజ్వ తన యలంకారరత్నాకరమునఁ దెలిపియున్నాఁడు. రసికులు విద్వాంసులు వదాన్యులు గుణగ్రహణపారీణులు నగునట్టిప్రభువు లేరీ ?

" కావ్యాలంకృతినాటకాదికలనాపాండిత్య మత్యద్భుతం
సర్వజ్ఞో రఘునాథభూశతమఖో య స్యోపదిశ్య స్వయమ్,
ఆదాతుం గురుదక్షిణా మభిమతా మర్థ్యో௨ప్యహో దత్తవాన్
కర్ణాలంకరణం నిజంచ పతకం పాదాంగదం కంకణమ్ "

సెబాసు యజ్ఞనారాయణా! ధన్యుఁడవు.

## అయా దీక్షితులు

ఇతఁడు రఘునాథనాయకునియాస్థానమందున్నకవులలో నొకఁడు. శా. ౧౫౫౦ ప్రాంతమువాఁడు. ఇతఁడు నిషధేంద్రనికథను

పారిజాతహరణకథనుజోడించి నైషధపారిజాత మనుద్వ్యర్థికావ్యమును రఘునాథభూపాలీయ మనునలంకారకృతిని నిర్మించెను. ఇతనికృతు లముద్రితము లగుటచే నితనిఖ్యాతి యిపుడు తెలియకున్నది. ఇతని కుమారునికృతినిబట్టి కొన్నివిషయములు తెలియుచున్నవి. అతడు:—

## మృత్యుంజయకవి

ఇతఁడు తనప్రద్యుమ్నోత్తరచరితమునవతారికలోఁ గావించిన కవిప్రశంసలోనిమాటలు కొన్ని:—

" దన్తిస్ఫురద్వ్యాసరదీపికాఙ్కః స రత్నఖేటాధ్వరిసార్వభౌమః, [మూకః"
పీయూష నుగృహ్ణాతు పరం పరంమాం వ్యాఖ్యాద్గిరం యద్దయ యైడ
" స రాజచూడామణియాయజూకః ప్రవాగధీశః ప్రథతే గురుర్నః,
స్వచ్ఛందత స్సర్వపథీనయాపి న యస్య వాచా విజహే విశుద్ధిః "
" అయ్యాధ్వరీన్ద్రో రనుకమ్పనీయే సూనౌ మయి స్నిహ్యతి దృష్టిపాతః,
తిష్ఠేత యస్మిన్ సురదేశికోఽపి ప్రాయేణ కావ్యాధ్వని సంశయం నః "
" ఆచార్యతిప్పాధ్వరిణో జయన్తి సరస్వతీ యద్వదనైకభూమిః,
చిరాయ పత్యు ర్వదనేషు జాతం జహాతి పర్యాయ నివాసఖేదమ్ "

పై శ్లోకములలో మొదటిదానిలోనిరత్నఖేట శ్రీనివాసదీక్షితు లీకవికి మాతామహుఁ డనియు, రెండవదానిలోనిరాజచూడామణిదీక్షితు లితనికి మేనమామ యనియు, చెప్పుదురు. ఇతనితండ్రి యైనయయ్యాదీక్షితుల నిజనామము కృష్ణదీక్షితు లందురు. ఇతనిగురు వొకఁడు మాతులుఁడు. రెండవగురువు. తిప్పయదీక్షితులు. గ్రన్థాన్తగద్యమందు—

" ఇతి దన్తిద్యోతిదివాప్రదీపాఙ్కసత్యమఙ్గళశ్రీనివాసదీక్షితవంశ్యేన ఘటికాశతకవే రయ్యాదీక్షితస్య పుత్త్రేణ మృత్యుంజయేన విరచితే ప్రద్యుమ్నోత్తరచరితే "

అని వ్రాసినమాటలనుబట్టి యితనిమాతామహుని కేకాక, యితని పూర్వపురుషునికిని దంతిద్యోతీత్యాదిచిహ్నములున్నట్లును, ఈకవిజనకుఁడు ఘటికాశతగ్రన్థకర్త యైనట్లును, తెలియుచున్నది. ఇతఁ డీకృతి శా. ౧౫౮౦ ప్రాంతమున రచియించియుండును. ఈకావ్య మముద్రితము. దీనిప్రతియొకటి మాత్రమే తంజావూరుభాండాగారమం దున్నది ఇది పదునొకండుసర్గలకావ్యము. తుదిభాగము శిథిల మైనది. ఇందు రతీప్రద్యుమ్నులు కలసినతరువాత జరిగినకథ వర్ణింపఁబడినది.

ఈకవి గ్రన్థావతారికలో రసమునుగూర్చి యెక్కువగా ప్రశంసించియున్నాఁడు. కావ్యరచనమున వచ్చెడియశస్సే లోకములో నిల్చునది. అది పూర్వజన్మపుణ్యముచే రావలసినదే. కవిత రసాత్మకమై యాహ్లాదము కలిగించునది కావలెను. అనుచు కొంత ప్రసంగించి రసము నిట్లు నిరూపించెను.

" వాగేవ పుంసో రస ఇత్యముష్మి న్నర్థే తదర్థశ్రుతి రేవ మానమ్,
ముఖం కవే రేవ సతు ప్రవిష్టో రసాన్ ప్రసూతే నవ, నాపరస్య "

" భావై ర్గుణై ర్వ్యఞ్జనయా రసై రిత్యర్థాధికై రుత్కచితాపి రత్నైః,
కాన్తేవ సూక్తిః కుసుమప్రవాళైః శబ్దార్థచిత్రై రపి యాతి శోభామ్"

## అనంతనారాయణకవి

ఇతఁడుమృత్యుంజయకవితనూజుఁడు. సంగీతసాహిత్యములు రెంటను ప్రజ్ఞాశాలి యైనయితఁడును కవివంశోచితముగా 'గీతశాంకర' కృతి నిర్మించెను. అది జయదేవునిగీతగోవిందమును పోలినది.

# శ్రీకృష్ణభక్తకవులు కొందఱు

## గౌరాంగుఁడు

లోకప్రసిద్ధి గాంచిన యీమహాపురుషుఁడు శచీజగన్నాథులతనయుఁడు. భాగీరథీతీరమున జన్మించినపావనమూర్తి. సనాతనమిత్రుని

కూఁతు రగువిష్ణుప్రియ యితనిధర్మపత్ని. ఆబాల్యముగా శ్రీకృష్ణభక్తి పరవశుఁ డైనయీమహాసీయుఁడు మనోనిగ్రహమున సంసారసుఖవిరక్తుఁడై భక్తియోగపరమావధి గాంచి జీవన్ముక్తుఁడయ్యెను. ఇతఁడు శా. ౧౪౦౭ లోజన్మించి శా. ౧౪౪౫లో శరీరము పరిత్యజించినయోగీంద్రుఁడు. ఇతనిజీవితచరితమును ఘోషు దినేశచంద్రసేను మొదలగు సుధీమణులు రచియించి ప్రకటించియున్నారు. అది యన్నిభాషలలోను వ్యాపించినది.

శ్రీకృష్ణచైతన్యనామమున జగద్విఖ్యాతి కెక్కిన యీపూజ్యపాదుఁడు భక్తియోగనిష్ఠుఁడై పూరీజగన్నాథక్షేత్రమునఁ జిరకాలమునివసించెను. జయదేవునికృష్ణభక్తిమతమును వంగాదిదేశములం దంతట వ్యాపింపఁజేసినభక్తాగ్రేసరులలో నగ్రిముఁడు. ఇతని శ్లోకములుకొన్ని వంగదేశమందలి భక్తులుకొందఱు నేఁటికిని గానముచేయుచున్నారఁట.

ఈభక్తిమూర్తి గోపాలచరితము ప్రేమామృతము సంక్షేపభాగవతామృతము హరినామకవచము దానకేళీచింతామణిమొదలగు కృతులు నిర్మించినట్లు కలకత్తా ప్రాచ్యపుస్తకాగారగ్రంథపట్టికవలనఁ దెలియుచున్నది.

## వల్లభాచార్యుఁడు

జయదేవుని శ్రీకృష్ణభక్తిమతమును వ్యాప్తికిఁ దెచ్చిన సారాంగాదులనాఁటిభక్తుఁ డితఁడు. ఇతనితండ్రి లక్ష్మణభట్టు, గురువు పురుషోత్తమభట్టు, శా. ౧౪౦౦ లో జన్మించి ౧౪౫౨ లో పరమపదించిన యీభక్తాగ్రేసరుఁడు యమునాతీరమున మధురాపురప్రాంతమున నున్నవాఁడు.

ఇతఁడు బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యయు మధురామాహాత్మ్య మధురాష్టకయమునాస్తవాదులును నిర్మించె నందురు. ఇతనిచరిత్రము

గోపాలదాసుబాబూ సీతారామశాస్త్రి మొద లగుకొందఱు రచియించి ప్రకటించియున్నారు. ఇతఁడు కృష్ణభక్తిపరవశుఁడై ప్రజలను వశపఱచుకొన్నమహిమశాలి. ఇతఁ డపూర్వము నవర్గము నైనయొక యాచారమును భక్తలోకమున వ్యాపింపఁజేసె నందురు. దానికి వల్లభాచార్యమత మనుపేరు కలదఁట. ఇతనికొడుకులలో,

## విఠలుఁడు

తండ్రివలెనే విద్వాంసుఁడై కృష్ణభక్తుఁడై కృష్ణప్రేమామృతము యమునాష్టపది రససర్వస్వము ననుకృతులు నిర్మించి గీతగోవిందమునకు టీక రచియించి ఖ్యాతి గన్నవాఁడు. ఇతఁడు శా. ౧౪౩౭ లో జన్మించెను. ఇతనిపుత్త్రులు గిరిధరుఁడు రఘునాథుఁడు ననువారును కవులై శ్రీకృష్ణ స్తవరూపము లైన చిన్నకృతులు రచియించినవారే. ఇంక వల్లభాచార్యునితమ్ముఁడైన,

## రామచంద్రుఁడు

శా. ౧౪౦౬ లో జన్మించి, అన్నగారిమతము ననుసరించి దాని నెక్కువవ్యాప్తికిఁ దెచ్చెను. ఈకవి, కృష్ణకుతూహలము గోపాలలీల రసికరంజనము మొదలగుకృతులు నిర్మించెను. ఈకవు లందఱికృతులును వ్యాప్తిగాంచక యందందు దాఁగి యున్నవి.

# రూపగోస్వామి

ఇతనికి శ్రీరూపుఁడు రూపదేవుఁడు ననియు వాడుక కలదు. గోస్వామివంశములో నితనిపూర్వపురుషులలో నాఱవయతఁడు అనిరుద్ధుఁడు. అతఁడు శా. ౧౩౩౮ లో కర్ణాటరాజై వెలసెనఁట. ఇతని తండ్రి కుమారనామకుఁడు. ఇతనియన్న సనాతనుఁడు, తమ్ముఁడు నల్లభుఁడు.

శ్రీమంతమైనకుటుంబమున జన్మించినయితఁడు సంస్కృతసాహి-
త్య మార్జించి కవియై వ్యాఖ్యాతయై శ్రీకృష్ణభక్తుఁడై గోకులమున నివ
సించి భక్తిమతము నెక్కువగా వ్యాపింపఁజేసినపుణ్యావర్తనుఁడు. జయ
దేవునిగీతగోవిందమును, గౌరాంగునికృతులును విస్తరించునా కాల
మున, ప్రజలమానసంబుల శ్రీకృష్ణభక్తి యాకర్షించుట కనువైన
కృతులు నిర్మించి భక్తలోకమునఁ బ్రదర్శించిన కవితాచతురుఁడు. ఇతని
కృతులలో నెక్కువ పేరు గాంచినది;—

విదగ్ధమాధవము:— ఇది యేడంకముల నాటకము. రాధామా
ధవు లిందు నాయికానాయకులు. భక్తి ప్రధానాంగముగా నిందలి
ముఖ్యరసము శృంగారము. కవి కావాస మైనగోకులమే ప్రధానకథా
రంగము. ఇందలియంకములు క్రమముగా వేణునాదవిలాసము మన్మథ
లేఖ రాధాసంగమము వేణుహరణము రాధాప్రసాదనము శరద్విహా
రము గౌరీవివాహము ననునవి. దీనినిబట్టి కథాసంవిధానము గోచరిం
చును. గ్రంథసమాప్తి యన్నశీర్షక క్రింద మూఁడుశ్లోకము లున్నవి. అవి
యీకవినిర్మితములో వ్యాఖ్యాతృకల్పితములో నిర్ణయింప వీలు గాకు
న్నది. వ్యాఖ్యాతపేరు తెలియరాదు. అందుచే నీకవియే టీక రచియిం
చియుండు నని సవ్యాఖ్య మైనదీని వ్రాఁతప్రతినిబట్టి కొందఱూహిం
చిరి. టీకాకర్త వేఱనియే దీనిని ముద్రించినవారూహించిరి. అందలి
రెండుశ్లోకము లివి:—

"రాధావిలాసం వీతాంగం చతుష్షష్టికలాధరమ్,
విదగ్ధమాధవం సాధు శీలయన్తు విచక్షణాః"

"నందసింధురబాణేందు–గణితే–సంఖ్యే సంవత్సరే గతే,
విదగ్ధమాధవం నామ నాటకం గోకులే కృతమ్"

ఈశ్లోకము లెవరివన్నను ఇతరప్రమాణములనుబట్టి లభించిన
యీకవికాలమునకును ఇందలికాలమునకును సుమారు మాత్రము

తేడా కనవచ్చుచున్నది గావున నిది విక్రమశకకాల మనక తప్పదు. దీనిని శాలివాహనశకమునకు మార్చంగా ౧౪౩౩ నాటకరచన కాల మని తెలుచున్నది. రూపగోస్వామి శా. ౧౪౧౧లో జన్మించి ౧౪౮౫లో శ్రీకృష్ణసాయుజ్య మందినవాఁ డని పరిశోధకులు నిర్ణయించి యున్నారు. ఈకవి యిది గాక లలితమాధవము ఉద్ధవసందేశము హంసదూత భ్రమరదూత దానకేళీకౌముది పద్యావళి ఉజ్జ్వలచంద్రిక యమునాస్తోత్రము గంధర్వప్రార్థన ఆనందమహోదధి గౌరాంగస్తవకల్పతరువు కుసుమస్తబకము ముకుందముక్తావళి మధురామహిమ మొదలగుబహు కృతులు నిర్మించెను. అందు కొన్నిసందేశకావ్యాదులు ముద్రితములు. వానిలో, ఉజ్జ్వలనీలమణి శ్రీకృష్ణనాయక మైనసాహిత్యాలంకారము ఇందు నాయికా నాయకాదిలక్షణములు విశదీకృతములు. దీని కైదు టీకలు పుట్టినవి. భరతనాట్యశాస్త్రము ననుసరించినయితనినాటక చంద్రిక యీనాఁడు బాగా వ్యాపించినది. ఇతనికవిత్వము హృదయంగమముగా నుండు ననుట కొకటి—కృష్ణుఁడింకా రా లేదేమనిపరితపించుచున్నరాధికమాటలివి:—

" రుద్ధః క్వాపి సఖీహితార్థపరయా శంకే హరిః పద్మయా,
ప్రాప్తః కుంజగృహం య దేష న తమీ యామే ఽప్యతిక్రామతి
పౌలోమీరతిబంధుదిఙ్ముఖ మసౌ హా హంత సంతర్పయ
న్నున్మీల త్యభిసారలుబ్ధరమణీగోత్రస్య శత్రు శ్శశీ "

ఇతఁడు చైతన్యమతము లేక గోస్వామిమత మవలంబించినవారితరుల కృతులు చదువ నక్కఱలేకుండ సర్వవిధ సాహిత్యజ్ఞాన మార్జించుకొనఁదగిన గ్రంథము లన్నియు నిర్మించిన వాఁడని ప్రతీతి కలదు ఇక:—

ఇతని జ్యేష్ఠసోదరుఁడైన సనాతనుఁడును, ఇతని తమ్ముఁడైన వల్లభుని కుమారుఁ డగుజీవగోస్వామియు, ఇతని శిష్యుఁ డైన రఘునాథ

దాసు మొదలగు వారు శా. ౧౪౪౦-౧౫౪౦ నడుమ నెన్నోని భక్తి రసకావ్యములు నిర్మించియున్నారు. కృష్ణభక్తి కావాసమైన రూపగోస్వామి వంశమువా రందఱును సంస్కృత కవిత్వముచెప్ప నేర్చిన వారు. నరహరి చక్రవర్తి రచియించిన భక్తిరత్నాకరమను కృతిలో సీరూపగోస్వామ్యాదుల జీవితచరితములు వర్ణింపఁబడినవి:—

## కవి కర్ణపూర కవి

ఇతఁడు వంగదేశీయుఁడు శివానందసేనునికొడుకు. నదియాకు దగ్గఱగా నున్నకాంచనపల్లి యనుగ్రామమున జన్మించినవాఁడు. కలకత్తాకు త్తరమున హైలసా రనఁబడు కుమారహట్టగ్రామమున విద్య నభ్యసించిన వాఁడు. చైతన్యస్వామి భక్తుఁడు.

శా. ౧౪౦౭ లో జన్మించినగౌరాంగుఁడే శ్రీకృష్ణునియవతారమైనచైతన్యస్వామి. ఆస్వామి చిరకాలము పూరీజగన్నాథక్షేత్రమున జ్ఞానయోగనిష్ఠ నుండి వేలకొలఁది భక్తులను తరింపఁజేసెను. ఆమహాత్మునిచరితము నితఁడు చైతన్యచంద్రోదయ మను పేర రూపకముగా నిర్మించెను. ఈప్రకరణము నితఁడు కపిలేశ్వరదేవుని మనుమఁడును పురుషోత్తమదేవునికొడుకు నైనగజపతిప్రతాపరుద్రదేవుని కోరికచే నిర్మించి నట్లు తెలియుచున్నది. ఇందు గౌరాంగుని ధర్మాచరణము నతనిసదుపదేశములును భక్తులహృదయము కరగించునట్లు వర్ణింపఁబడినవి.

ఇది గాక యీకవి అలంకారకౌస్తుభము చమత్కారచంద్రిక ఆనందబృందావనచంపువు ననుకృతులు కూడా రచియించెనఁట. ఇతని రూపకము సర్వవిధములఁ బ్రబోధచంద్రోదయమును బోలియున్నది. అందుండి రెండు:— ఇది వైరాగ్యపరితాపము.

"న శౌచం నో సత్యం నచ శమదమౌ నాపి నియమో,
న శాంతి ర్న క్షాంతి శ్శివశివ న మైత్రీ నచ దయా,

అహో! మే నిర్వ్యాజప్రణయిసుహృదో ఽమీ కలిజనైః
కి మున్మూలీభూతా విదధతి కి మజ్ఞాతవసతిమ్ ”
“ షట్కే కర్మణి కేవలం కృతధియ స్సూత్రైకచిహ్నా ద్విజాః,
సంజ్ఞామాత్రవిశేషితా భుజభువో వైశ్యా స్తు బౌద్ధా ఇవ,
శూద్రాః పండితమానినో గురుతయా ధర్మోపదేశోత్సుకాః
వర్ణానాం గతి రీదృగేవ కలినా హా హంత సంపాదితా ”

నా ప్రియస్నేహితు లైనదయాసత్య శౌచశమదమాదు లేరీ ? ఈ కలిలోనిమానవులు వారిని నిర్మూలము చేసినారా ? లేకుంటే వా రెక్కడ నైనా అజ్ఞాతవాసము చేయుచున్నారా ? ఆహా ! కలి మహాత్మ్యము !

# వ ల్ల భ దే వుఁ డు

ఈపేరు గలవారు ముగ్గురు నలుగు రున్నారు. సుభాషితావళి సమకూర్చినయితఁడు తక్కినవారికంటె వేఱు. ఇతఁడు కాశ్మీరదేశము వాఁడు. ద్వితీయరాజతరంగిణి రచియించినజోనరాజకవి నితఁడు స్మరించు టంబట్టి యతని కితఁడు పరుఁ డగుచున్నాఁడు. ఆకవి శా. ౧౩౩౯–౧౩౮౯ నడుమఁ గాశ్మీర మేలినజైనోల్లాబదీనుసుల్తాను నాఁటివాఁ డని యీక్రిందిమాట తెల్పుచున్నది.

“ శ్రీజైనోల్లాబదీనే క్ష్మాం సంప్ర త్యక్షతి రక్షతి ”

అందుచే మనవల్లభదేవుఁడు శా. ౧౪౨౦ ప్రాంతమున నున్నఁ వాఁ డనవచ్చును.

ఇతనిసుభాషితావళి మిక్కిలి ప్రశంసనీయ మైనగ్రంథము. ఇందు సుమారు ౩౫౦౦ శ్లోకము లున్నవి. ప్రాచీనమహాకవికృతము లైనకావ్యములలోని వెన్నివందలో యిం దున్నవి. పూర్వులచాటువులు

కొన్నివంద లున్నవి. ఇతనియీకృతిమూలముగా పూర్వమహాకవు లెం దఱో పాఠకులస్మృతికి వచ్చుచున్నారు.

# శేషవంశకవులు

పూర్వకాలమున విద్వత్త్వకవిత్వముల వన్నెకెక్కినయాంధ్రదేశీయపండితవంశములలో శేషమువారివంశ మొకటి. వారిలో నొకకుటుంబమువారు దక్షిణదేశమునకు నింకొకరు మహారాష్ట్రదేశమునకు మఱియొకరు కాశీపురమునకు వలసవెళ్ళినట్లు కనఁబడుచున్నది. వారివారితరములు నిర్ణయింప వీలు కనిపించదు గాని, వారిలోఁ గొందఱు గావించిన రచనలు మాత్రము గోచరించుచున్నవి.

శేషము కమలాకరరత్నాకరపండితులు గీతగోవిందమునకును, శేషముగోవిందపండితుఁడు అమరుకశతకమునకును నిర్మించినవ్యాఖ్యలున్నవి. కడపటివిద్వాంసుఁడు వినతానందవ్యాయోగము గోపాలలీలార్ణవభాణము ననురూపకములు కూడా నిర్మించియున్నాఁడు. శేషము రామచంద్రబుధుఁడు రచియించినహర్షనైషధవ్యాఖ్య యొకటి కలదు. మధురానాయకుఁ డైనవిజయరంగచొక్కభూపాలుని యాస్థానములోనివాఁడును తారాశశాంకవిజయకర్తయు నైనవేంకటపతి శేషముకుటుంబములోనివాఁడే. ఇట్లు సారస్వతసేవ యొనరించినయీ శేషమువంశములోనినరసింహకవి శా. ౧౫౫౦ ప్రాంతమందు కాశీపురమున కేగి యందు స్థిరపడెను.

ఆకాలమందలి కాశీనగరములోనిశబ్దశాస్త్రపండితులలో నీనరసింహకవి గొప్పకీర్తి గన్నవాఁడు. తరువాత సుప్రసిద్ధు లైనభట్టోజీదీక్షితులు నాగేశభట్టు మొదలగువారు పాణినీయమున నితనిమతము నెక్కువగా నాశ్రయించినవా రనుటయే యితనివైదుష్యమునకు గొప్ప

గురు. వ్యాకరణశాస్త్రనిష్ణాతుఁ డయ్యు నితఁడు చక్కనికవిత్వము చెప్ప నేర్చినవాఁడు. తాండవపురరాజైనగోవిందచంద్రనృపతిపోషణము నందినయితఁడు పోషకునిపేర గోవిందార్ణవ మనుధర్మశాస్త్రగ్రంథము నిర్మించెను. ఆనాఁటికాశీపండితులలో శబ్దశాస్త్రపాఠమునకుఁ బరమగురు వైన యీయాచార్యునికి చింతామణి కృష్ణుఁడు నని యిద్దఱుకొడుకులు గలరు

చింతామణి మహావైయాకరణుఁడు కవియునై రుక్మిణీపరిణయ మనునాటకమును రసమంజరీపరిమళ మనునాలంకారికకృతియు నిర్మించెను

కృష్ణకవి తండ్రివలెనే శబ్దశాస్త్రనిధి. ఇతఁడు మురారివిజయము ముక్తాచరితము సత్యభామాపరిణయము ఉషాపరిణయము సత్యభామావిలాసము క్రియాగోపనరామాయణము పారిజాతహరణము కంసవధ, అనుకావ్యములు నిర్మించినట్లు కనఁబడుచున్నది. వీనిలో కడపటిరెంటను ముద్రితములు. వీటిలో కంసవధ యేడంకములనాటకము. ఇది అక్బరుపాదుషామంత్రి యైనరాజాతోడరమల్లునికుమారుఁ డగుగోవర్ధనధారి యనఁబడినగిరిధారినృపతిప్రోత్సాహమున రచియింపఁబడిన దని ప్రస్తావనయే చెప్పుచున్నది.

"తస్యాస్తి తండనకులామలమండనస్య
శ్రీతోడరక్షితిపతే స్తనయో నయజ్ఞః
నానాకలాకులగృహం సవిదగ్ధగోష్ఠీ
మేకో ఽధితిష్ఠతి గురు ర్గిరిధారినామా"

దీనినిబట్టి యితఁడు శా. ౧౫౧౦ ప్రాంతమం దీకృతి నిర్మించెనని తెలియనయ్యెడి. ఇతఁడు నటీసూత్రధారసంభాషణమునఁ దనవైదుష్య కవిత్వ చాతుర్యములను వెల్లడించుచు, వ్యాకరణజ్ఞానము లేని కవివాణి రసికులను రంజింపఁజేయఁ జాల దని యిట్లు వచించెను.

"రసాలంకారసారాపి వాణీ వ్యాకరణోజ్ఝితా,
శ్విత్రోపహతగాత్రీవ న రంజయతి సజ్జనాన్"

ఇందు, కృష్ణుఁడు కంసుని సంహరించుట యనుభాగవతకథ వర్ణింపఁబడినది. కవిత్వము రసవంతముగానే యుండును. రాధను తలఁచుకొని శ్రీకృష్ణుఁ డన్నమాట లివి:—

"ఏకే నాలోకయన్తి సభయ ముభయతో జ్యేష్ఠదృష్టిప్రచారం
శూన్యే నానువ్రజన్తి ప్రియ మతియుజనా లోచనే నాపరేణ,
బాలా కాలాతిపాతాకలనవిరచితానల్పసంకల్పదుస్థా
చిత్రిన్యస్తేవ తత్తే మయి నిహితమనా లోచనాగోచరేఽపి"

ఇతఁడు తనతండ్రివల్ల కృతినందిన తాండవపుర (కాశీసమీపనగరము) రాజగు గోవిందచంద్రునితమ్ముఁడైన నరోత్తమనృపతి కంకితముగా పారిజాతహరణచంపువు రచియించినట్లు దానియవతారిక చెప్పుచున్నది.

ఆంధ్రుఁడైనయీమహావిద్వత్కవి భట్టోజీదీక్షితాదుల శబ్దశాస్త్రగురువు. ఇతని పెద్దకొడుకు వీరేశ్వరపండితుఁడు పండితరాజుతండ్రియైన పేరుభట్టుగురువులలో నొకఁడు.

ఇతనితమ్ముఁడగు నారాయణబుధుఁడును వ్యాకరణశాస్త్రమున ఘనుఁడు. ఇతఁడు మహాభాష్యమునకు లఘుటిప్పణము నిర్మించెననియు సూక్తిరత్నాకరము రచియించె ననియుఁ దెలియవచ్చును. ఈవిధముగా నీ శేషమువారిలో నిపుడు తెలియకున్నకవు లెందఱున్నారో! ఇంతకును, ఆన్ధ్రదేశీయ మైన శేషంవంశము దేశాంతరములందు విద్యావంశములను నెలకొల్పిన దన్న విశేషవిషయము తెలియుటయే ఫలము.

## చెరుకూరివంశ కవులు

సుమారు నాలుగువందలసంవత్సరములకిందట విదర్భదేశము నుండి త్రిలింగదేశమునకు వలసవచ్చిన వెలనాటికుటుంబములలో

శ్రీవత్సగోత్రీ మైనయొకకుటుంబము కృష్ణాతీరమందలిచెరుకూ రనెడి గ్రామమున స్థిరపడినది. అందుచే నీకుటుంబమునారు చెరుకూరివా రనఁబడిరి. వేదశాస్త్రపండితు లయిన యీవంశమువారిలో నిపుడు ముందు ప్రశంసకు వచ్చిన విద్వత్కవి:—

## లక్ష్మీధర శాస్త్రి

ఇతఁడు శ్రుతిరంజని యనుపేర గీతగోవిందమునకు రచియించిన వ్యాఖ్యలోను తక్కినకృతులయాద్యంతములందును, ఇతనివంశమువారు తమతమకృతులయవతారికాదులందును వ్రాసినస్వవిషయములనుబట్టి యీవంశమువారివృత్తాంతము కొంత తెలియవచ్చినది. దానిని క్రమముగా నిందు కనుఁగొందము.

ఈవిద్వత్కవిపితామహుఁడు తిమ్మయసోమయాజి. తల్లిదండ్రులు సర్వాంబాయజ్ఞేశ్వరులు, ఇతనియన్న కొండుభట్టోపాధ్యాయుఁడు.

తిమ్మాంబా శ్రీరంగరాజులకుమారుఁడును శ్రీకృష్ణదేవరాయల యల్లుఁడు నైనయళియరామరాజు తల్లికోటయుద్ధమున గతించినపిదప నతనిసోదరుఁ డైనతిరుమలదేవరాయలు పెనుగొండ కేగి యది రాజధానిగా శా. ౧౪౮౯ ప్రాంతమున రాజ్యముచేయుచున్నసమయమున మనలక్ష్మీధరశాస్త్రి యీరాజు నాస్థానమున విద్వత్కవిగా నుండి గీతగోవిందవ్యాఖ్యాదులు నిర్మించియున్నాఁడు. శ్రుతిరంజని యవతారికలో నితఁడుకావించిన పోషకరాజవర్ణనమును గ్రంథాంతగద్యయు, అది యితఁడు నిర్మించినట్లే పెక్కుప్రతులు తెలుపుచుండ, ఒకటిరెండు వ్రాఁతప్రతులు తిరుమలదేవరాయలే యావ్యాఖ్య నిర్మించినట్టు తెలుపుచున్నవి. అది తరువాతిలేఖకులు గావించినయారోపణ మనుట స్పష్టము. దీనినిబట్టి మనకవి శా. ౧౪౫౭_౧౫౨౨ నడుమ జీవించియున్నవాఁ డన్నచరిత్రాంశము గోచరించినది.

ఈవిద్వాంసుఁడు శ్రుతిరంజనియే కాక జయదేవునిప్రసన్నరాఘవమునకు టీక నిర్మించియున్నాఁడు. మఱియు స్వతంత్రముగా స్వరమంజరి రసమంజరి అలంకారముక్తావళి భరతశాస్త్రము ఋతుక్రీడావివేకము మొదలగుకృతులు నిర్మించెను. ప్రాకృతభాషావివేకమునకుఁ బ్రామాణికగ్రంథమై దేశమంతట వ్యాపించినషడ్భాషాచంద్రిక యితనిదే. ఇతనినామాంతరమైనలక్ష్మణసూరి యనుపేర వ్యాపించినయనర్ఘరాఘవవ్యాఖ్య యితనిదే.

వేదాంతశాస్త్రనిష్ణాతుఁడైనయీవిద్వాంసుఁడు వార్ధకములో కృష్ణాశ్రమి యనుగురువువల్ల తురీయాశ్రమము స్వీకరించి రామానందస్వామి యనుపేరఁ బరఁగి శిష్యుల కద్వైతవిజ్ఞాన ముపదేశించుచు బ్రహ్మైక్యము నొందెను. ఇతని పుత్త్రుఁడు:—

## దామోదరశాస్త్రి

ఇతఁడు సంగీతసాహిత్యములు రెంటను సమధికపరిశ్రమ చేసి మృదుకవిత నేర్చి సమకాలము వారిమెప్పు గాంచినబుద్ధిశాలి విద్వాంసుఁడు. సంగీతవిద్యలో చతురుఁడై చతురదామోదరుఁ డన్నఖ్యాతి గడించెను. తండ్రి రచియించిన భరతశాస్త్ర గ్రంథమందలి నాట్యపద్ధతిని రాగలక్షణములను విశదీకరించుచు సంగీతదర్పణ మనునొక కృతి నిర్మించెను. ఇది ముద్రితమై దేశమున వ్యాపించియున్నది.

లక్ష్మీధరశాస్త్రి యన్నయైన కొండుభట్టోపాధ్యాయుఁడు వేదశాస్త్రప్రవచనమున నుపాధ్యాయఖ్యాతి నార్జించి పండితపట్టభద్రబిరుదమందినవాఁడు. కాని, కృతులు నిర్మించినవాఁడు కాఁడు. ఇతనిసంతతివారు కవులైరి. వారిచరిత మిఁకఁ దెలిసికొందము.

# చెరుకూరి యజ్ఞేశ్వరశాస్త్రి

యజ్ఞనారాయణనామమున వ్యవహరింపఁబడిన యితఁడు కొండు భట్టోపాధ్యాయునికుమారుఁడు. అతఁడు, అలంకారరాఘవము అలంకార సూర్యోదయము స్తోత్రరత్నాకరము మొదలగుకృతులు రచియించెను. ఆలంకారికలక్షణము లప్పటికే యధిక మగుటచేఁ గాఁబోలు నితనివి గాని, యితనిపెత్తండ్రి లక్ష్మీధరపండితునికృతులుగాని వ్యాప్తికి వచ్చి నట్లు కనఁబడదు. కాని గ్రంథాలయములందు వీటివ్రాఁతప్రతు లెక్కు వగా నున్నవి.

# చెరుకూరి వెంకటేశ్వరశాస్త్రి

ఇతఁడు పూర్వోక్తుఁడైనయజ్ఞనారాయణపండితుని పుత్త్రుఁడు కొండుభట్టుపౌత్త్రుఁడు. సాహిత్యచతురుఁడైనయితఁడు తండ్రి తాతలవలె నెక్కువగా నలంకారశాస్త్రమునఁ గృషిచేసియు బంధకవిత్వప్రియుఁడై చిత్రబంధరామాయణ మనునాఱుసర్గలకావ్యము రచియించెను. ఈకా వ్యము పెద్దదికాదు గాని, ఒక్కొక్కసర్గలో నొక్కొకకాండకథ యిమిడి యున్నది. ఇందలినాగబంధము.

" అయ కాయ చయధ్యేయ భయ హేయ వరశ్చ్రయ
వ్యయ క్షయ నయ శ్రీయ జయ మాయ దమ న్నయ"

కావ్య మంతయు నిట్లే యాందోళికా పద్మహారబంధాదులతో నున్నది. దీని కితనితండ్రి యజ్ఞనారాయణపండితుఁడే వ్యాఖ్య నిర్మిం చెను. అతని మాట యిది.

"స్వపుత్త్రరచితం చిత్రబంధరామాయణాహ్వయమ్,
వ్యాకరోతి మహాకావ్యం యజ్ఞనారాయణ స్సుధీః''

ఈకృతి నీకవి శా. ౧౫౫౭ లో నిర్మించినట్లు కృత్యంతమందలి మాటలు తెలుపుచున్నవి. దీని కీకవిసమకాలికుఁడును నాగాంబాగోవింద దీక్షితుల పెద్దకుమారుఁడును తంజావూరురఘునాథరాయలసభలోని వాఁడు నైన యజ్ఞనారాయణయజ్వకూడా వ్యాఖ్య నిర్మించినట్లు తంజావూరుగ్రంథాలయములోని యొకవ్రాతప్రతివల్ల దెలియుచున్నది.

# కస్తూరి రంగనాథుఁడు

ఇతఁడు వాధూలసగోత్రుఁడు వీరరాఘవపండితునితనూజుఁడు. బాలకింగృహపుర మనుసిరువల్లూరుగ్రామ మితనినివాసము. ఇది దక్షిణార్కాటుజిల్లాలోనిది. ఇతఁడు శా. ౧౫౦౦ ప్రాంతమువాఁ డగును. ఇతఁడు నితనికుమారుఁడు రచియించినకృతులు తంజావూరులిఖితపుస్తక భాండాగారమున నున్నవి.

ఈకవి రఘువీరవిజయ మనునుమ వ్యాకారము నిర్మించెను. ఇందు సీతారామకల్యాణము చక్కఁగా వర్ణింపఁబడినది. కడపటిశ్లోకములో శ్రీరామజననాదులకాలములు తెలుపఁబడినవి. ఆశ్లోక మిది.

"జాతో వర్షే విలంబి న్యజజుషి మిహిరే జాగ్రతీందౌ నవమ్యాం,
సౌమ్యేఽబ్దే మాసి మీనే జనకనృపసుతాంపూర్ణిమాయాముదూహ్య
దుందుభ్యబ్దేచ చైత్రే విపిన మథగతో, మాసి మీనే యువాబ్దే,
హత్వా శత్రూన్ స ధాతౌ, ఖలు మనుసమయేరాఘవో రాజ్యమాప"

అనఁగా, రామునికి పన్నెండేండ్లు నిండుచుండఁగా, పెండ్లి, ఇరువైనాలుగేళ్ళు నిండినంత వనగమనము ముప్పదియెనిమిది నిండుచుండగా శత్రుసంహారము ముప్పదియెనిమిది నిండినంతరాజ్యము సిద్ధించె నని యితనిభావము.

# సుందరవీరరాఘవుఁడు

వెనుకటికస్తూరి రంగనాథునికొడుకు. సిరువల్లూరుగ్రామనివాసి. ఇతఁడు, భోజప్రబంధాదులలోనికథలనుబట్టి ముంజునికిని భోజరాజున కును సంభవించినరాజ్యవివాదకథను భోజరాజాంక మనుపేర నొకరూప కముగా నిర్మించెను, మఱియు రంభారామణీయ మనునొకనాటకము రచి యించెను. "ఏస్త్రీ నైనను బలాత్కరించినయెడల నీతల వెయ్యిముక్క లగును" అన్నశాపము రావణునికి సిద్ధించుట దీనిప్రయోజనము. అభి నవరాఘవ మనుమఱియొకరూపకమును కేవలము రామాయణకథతో రచియించెను. ఇవి యన్నియు తంజాపూరుపుస్తకభాండాగారమం దున్నవి.

# విలినాథకవి

ఇతఁడు కౌశికగోత్రుఁడు. కనకసభాపతికొడుకు, యజ్ఞనారాయణ బుధునిమనుమఁడు. తంజాపూరుమండలములోనివిష్ణుపుర మితనినివాసము. శా. ౧౪౯౯–౧౫౩౬ నడుమ రాజ్యము చేసినఅచ్యుతరాజునాస్థానకవి. ఇతఁడు మదనమంజరీమహోత్సవ మనునాటకము రచియించెను. తంజా పూరుగ్రంథాలయమం దిది సజీవమై యున్నది. కవిత్వము సరసముగా నుండును. సూర్యుఁడు కూడా వేదోక్తధర్మాచరణపరాయణుఁడై ద్విజుల కాచార ముపదేశించుచున్నట్లుండె నని వర్ణించినయందలిశ్లోక మిది. సూర్యాదులచర్యలు పరమేశ్వరాధీనము లని దీనిభావము.

"(ప్రాచీ మాలోక్య) అః కథ ముదయన్నేవ భగవా నఖిలా నామపి
ద్విజానా మాచార ముపదిశ తీవకర్మ ణైవ కర్మసాక్షీతథాహి.

"స్నాతః ప్రాతః పయోధౌ ద్రుతవిధుతతమాస్స్వీకృతాచ్ఛాచ్ఛయం.
ధూళీపాళీతుషాధిష్ఠితదలసమిధో దీప్తిధారా ధమన్యా,
ఉత్క్షిప్య క్షిప్రమబ్జాకరమచిసదనే కర్ణికాహవ్యవాహం,

కుర్వన్ సర్వంకషాభం కుసుమరసఘృతై ర్దీప్యతే యేష దేవః”
ఈదృశానా మపి తేజసాం విలసిత మీశ్వరానుగ్రహానియన్త్రిత మితి
విచిన్త్య మ మానన్దమన్థర మిద మన్తఃకరణమ్”

# ఉత్ప్రేక్షావల్లభకవి

ఆయలంకార మితఁ డెక్కుడగా వాడియుండుటచే నితని కిది బిరుదనామమై స్థిరపడినది గాని, అసలు పేరు గోకులుఁ డని యితని మాటలే చెప్పుచున్నవి.

“ భారత్త్యైవ క్రియతే స్తోత్రైస్సంతుష్టయా ద్విజద్వారా,
శ్రీగోకులస్య సుకవే రుత్ప్రేక్షావల్లభే త్యభిధా ”

ఇతఁ డేదేశమువాఁడో కాని, భిక్షాటనకావ్యములో శివుఁడు చోళరాజును పరీక్షించిన ట్లున్నవర్ణనమునుబట్టి యితఁడు మలబారువాఁడని యొక రూహించిరి. ఇతనిసుందరీశతకము వ్రాతప్రతిచివర లేఖకుఁడు చింతామణిభట్టీక్రింది శ్లోకము వ్రాసెను.

“ అనల శర రస ధరాంకే వర్షే మాఘస్య శుక్లశుభషష్ఠ్యామ్,
గురువారే రేవత్యాం సంపూర్ణం సుందరీశతకమ్ ”

దీనినిబట్టి యీప్రతి సంవత్తు ౧౬౫౩ లోఁ బుట్టిన దని భావించి, యింత కించుక పూర్వుఁడో లేక యీనాఁటివాఁడో యై యుండును గోకులుఁ డని సుందరీశతకప్రకాశకు లూహించిరి. అది సముచితము గావున నితఁడు శా. ౧౫౧౦ ప్రాంతమున నున్నవాఁ డనవచ్చును.

కవిత్వము సరసము, భాష మృదువు, భావములు రంజకములు. ఇందు మొదటికృతిలో నలువదిపద్ధతు లున్నవి. ఇవి యన్నియు శివుని చిత్రవిచిత్ర మైనభిక్షాటనము తెల్పునవే. దీనిప్రారంభ మి ట్లున్నది.

" వృత్తం వసంతతిలకం, విషయ శ్శివస్య
భిక్షాటనం, కవి రహో శివభ క్తదాసః,
శృంగార ఏవహి రస స్తదిహ ప్రబంధే,
శ్రద్ధా న కస్య యది సూక్తివినోదశీలః ? "
" వాణైశ్శివార్చనవిధౌ మమ వాణవాచం,
కాదంబరీకృతిచమత్కృతి మప్యుదారామ్,
ఉత్ప్రేక్షయా జగతివల్లభకీర్తి మస్మిన్
భిక్షాటనే తిలకయన్తు కవీంద్రచంద్రాః "
వాణము = బాణము. వణశ్వాణశబ్దే, వబయోరభేదః,
" భిక్షాటనేన పురుహూతపురాంగనానా
మాకస్మికోత్సవవిధాయిని చంద్రమౌళౌ,
తాసా మనంగశరజర్జరమానసానాం
నానావిధాని చరితాని వయం వదామః "

దీనినిబట్టి యీకావ్యమందలి ముఖ్యవిషయము విదితము.

ఆమదనుఁ డెక్కడిరాజో తెలియదు. కాని, మదనమహీపాలుని శాసనమున సుందరీశతకము నిర్మించినట్లితఁ డీక్రిందిశ్లోకమునఁ దెలిపి యున్నాఁడు.

" సహృదయహృదయగ్రాహ్యం మదనమహీపాలశాసనా దేవ,
విరచయతి సుందరీశత ముత్ప్రేక్షావల్లభ స్సుకవిః "

ఇందలివర్ణనలు రసోచితములు సహజములునై యొకసుందరికి సంబంధించినయన్ని విషయములు స్పృశించినవి. రీతికి రెండు:—

" సుందరి ! కాంచనకదళీకర్పూరోత్పత్తిశాలి నీ త్యనయా,
చంద్రోద్వర్తనసురభి స్త వోరు రుపమీయతే కవిభిః "
" విపరీతరతసముద్యమపులకప్రథమానమాంసలాభోగమ్,
సురతసుఖైకనిధానం సుందరి ! జఘనస్థలం జయతి "

ఈకవి శివదాసుఁడైనా. యెక్కువగా శృంగారదాసుఁడు. శివునిభిక్షాటనము పేరుచెప్పి నాకలోకస్త్రీలమన్మథావస్థలు వర్ణించిన వాఁడు. భూలోకసుందరిపేరు చెప్పి తద్విరహపరవశుఁడై యెన్నెన్ని రీతుల వర్ణనలు చేసెనో చెప్పలేదేమి? ఇది ముద్రిత మైనది.

## రుద్రకవి. ౧

ఇతనితండ్రి అనంతభట్టు, తాత కేశవభట్టు, దక్షిణదేశీయుఁడైన యీకవి యుత్తరదేశయాత్ర గావించి నారాయణషా మయూరగిరి నేలుచున్నకాలమున నతనిసత్కార మంది యతనియాస్థానమున విద్వత్కవియై యందు స్థిరపడి, ఆప్రభువుకుమారుఁడైనప్రతాపషా కాలమున నతనిసభ నలంకరించి వన్నెకెక్కినవాఁడు. మొదటికాన్యకుబ్జాధినరాష్ట్రౌఢరాజుతో నారంభించి రాష్ట్రౌఢవంశరాజులచరితము నిరువదిసర్గలకావ్యముగా నిర్మించెను. ఈకావ్యము శా. ౧౫౧౮లో సమాప్తికాంచిన దగుట నితఁడు శా. ౧౪౮౦-౧౫౩౦ నడుమ నున్నవాఁ డనుట విదితము.

ఈకృతిలో కాన్యకుబ్జరాజులు శివునివల్ల వరము లొందినవారని వర్ణించియున్నాఁడు. ఇందు రాష్ట్రౌఢరాజ్యము, ఆరాజవంశము ప్రధానముగా వర్ణింపఁబడినవి. కవిత్వము సరసముగానే యుండును. ఈకృతి ముద్రిత మైనది.

"ఆరామశోభా మవలోకయంత్యా వసన్తలక్ష్మ్యా శ్చరణాంబుజోత్థాన్
లాక్షానురాగా నివ నీరజాక్ష్యో, బాలప్రవాళా న్దదృశు ర్లతాసు"
"లసన్మాలతీమాలికాం కంఠదేశే, నవాలక్తకం పక్వబింబాధరోష్ఠే,
కుచే చందనం వీక్ష్య కాచి త్సపత్న్యాః, ప్రియే సాపరాధే ఽపి
యోషా తుతోష"

ఇతఁడు తరువాత జహాంగీరుషా చరిత్ర వచనకావ్యముగా నిర్మిం చినట్లు తెలియవచ్చును.

# గోకులనాథుఁడు

ఇతఁడు శ్రీవత్సగోత్రుఁడు ఉమాదేవీపీతాంబరులపుత్త్రుఁడు, ఘనదహ్రబ్రాహ్మణవంశమువాఁడు. మిథిల యితని జన్మస్థానము. సంస్కృత సారస్వతనిష్ణాతుఁడై కవియై వన్నెగాంచి, శ్రీనగరపాలకుఁడైనఫతే సాహాప్రభునిసభ నలంకరించినయితఁడు శా. ౧౬౬౦ ప్రాంతమువాఁడు.

ఇతఁడు మదాలసాకువలయాశ్వులు నాయికానాయకులుగా ముదితమదాలస యనునాటకమును, సంసారక్లేశానుభవమున కుదాహ రణముగా, అమృతోదయ మనుమతిమొకరూపకమును నిర్మించెను. ఇదియును శివస్తుతియును, మొన్న మొన్ననే బొంబాయినగరమున ముద్రి తము లైనవి. ఈకవి తనకూఁతురు కాదంబరి యనుపేరుగలచిన్నపిల్ల గంగాకుండములోఁ పడి మునిఁగి మృతి చెందఁగా, ఆపిల్లను స్మరించుచు కుండదాంబరి యనుపేర నొకసుతాస్మృతికావ్యము నిర్మించెను. అందలి దొకటి:—

" ఆ రాంబావప్రకృతికృపణా బాధిభి ర్బాధ్యమానైః
విక్రోశారః కరుణవచనం పుత్త్రి కాదంబరీతి,
కోఽయం లోకః క ఇవ విషయః కింపురః కో నివాసః
యస్మి న్నస్మద్విముఖహృదయా త్వం నిలీయ స్థితాసి "

ఈకవి తనప్రభువున కంకితముగా, ఏకావళి యనుపేర ఛందో గ్రంథము నిర్మించి యందతని నిట్లు సంబోధించెను.

" వృత్తసాగరరత్నానాం సార ముద్ధృత్య నిర్మితా,
ఏకావళీ ఫతేసాహ! తవ కంఠే లుఠ త్యసౌ "

ఇతఁడు వార్ధకదశలో వారణాసి కేగి విశ్వేశ్వరుఁ గొల్చుచు సహస్రమాసములు నిండినవయస్సులో శివసాయుజ్యము గాంచెను. ఆసమయము శా. ౧౫౩౦ ప్రాంతము.

## మధుసూదనసరస్వతి

వేదాంతశాస్త్రమం దసమానకృషి చేసినయీమహాపండితుఁ డద్వైతసిద్ధి యనుమహాగ్రంథరూపమున విద్వన్నుతి గాంచుచు యశః కాయుఁడై వెలయుచున్నాఁడు. ఇతఁడు కాశ్యపగోత్రుఁడు కాన్యకుబ్జగౌడ బ్రాహ్మణుఁడు-పురందరపండితుఁ డితనితండ్రియని యొకచోటను, సోదరుఁ డని యొకచోటను గనఁబడుచున్నది. పురందరవాటిక యని యతనిపేర నొకగ్రామ మిప్పటికిని తూర్పువంగదేశమునం దున్నది. అది, యతఁడు కనోజుప్రాంతమందలిజన్మభూమి విడిచిపోయి క్రొత్తగా సంపాదించిననివాస స్థాన మగుటచే మనకవి ప్రాచ్యవంగదేశమునకుఁ జెందినవాఁ డగుచున్నాఁడు.

ఇతఁ డిరువదియేండ్లవయస్సునాఁటికే మంచివైదుష్య మార్జించియు, ఉత్తరమీమాంస పఠింప వారణాసి కేగి శ్రీమత్పరమహంస విశ్వేశ్వరసరస్వతీశిష్యుఁడై నిరంతరదీక్షతో నావిద్య పఠించి యందుత్తీర్ణుఁడై యచ్చటనే యద్వైతసిద్ధి రచియించెను. అప్పు డితనిముఖ్యమిత్రులలో నెన్నఁదగినవాఁడు హిందీ రామాయణము నిర్మించినతులసీదాసు. అతని నితఁడిట్లు స్తుతించెను.

“ ఆనన్దకాననే కాశ్యాం, తులసీజంగమ స్తరుః,
కవితామంజరీ యస్వారామభ్రమరచుంబితా ”

మఱియు నీపండితుఁడు భగవద్గీతకు మహిమ్నస్తోత్రమునకు హరిలీలకు వ్యాఖ్యలు రచియించి, శ్రీశంకరభవద్పాదులవరోత్కృష్టశిష్యుఁడై

ఆయనవిష్ణుపాదాదికేశాన్తవర్ణనస్తోత్రము ననుకరించి, ఆనందమందాకిని యనుస్తుతికావ్యము రచియించెను. ఇది వేదవేదాన్తపురాణాదివిజ్ఞానము ప్రతిఫలించినదర్పణము. మహిమ్నస్తోత్రమునకు హరిహరపరముగా రెండర్థములుసమర్థించుచు వ్రాసినయతనివైదుష్యమిందు మూర్తీభవించినది. దీనిప్రశస్తిని నేను వర్ణించుటకంటె నితనిమాటలతోఁ దెలుపుట మంచిది.

"యే పాండిత్యకవిత్వసూను ధరణీధర్మార్థకామాణిమా
దీశిత్వేన్ద్రపదాప్తిమోక్ష మథవా వాంఛన్తి భక్తిం హరౌ,
సంభూతాం మధుసూదనప్రవదత స్సన్తో భజ న్త్వాదరాత్,
తే సంసారదవాగ్నితాపశమనీ మానందమందాకినీమ్"

తీఁగ సాగినట్లు సాగిపోవునితనికవిత క్రిందికరుణాదృష్టివర్ణనము

"ముక్తి ర్భవతిదుర్లభా, హిమగిరిప్రస్యన్దిమన్దాకినీ
ధారాతో ఽప్యతిశీతలాతిసుస్పృశా చాంద్రా న్మయూఖా దపి,
వాంఛాతో ఽప్యతివిస్తృతా విషయిణాం, త్వత్పాదచిన్తా పర
స్వాన్తా దప్యతినిర్మలా మయి కృపాదృష్టి స్తవాస్తాం హరే!"

ఈక్రింది శ్రీకృష్ణనేత్రవర్ణన మితనియధ్యాత్మజ్ఞానమున కుదాహరణము.

"నో కార్యం శ్రుతివర్త్మలంఘన మిదం నాలీకముగ్ధాకృతిః,
పర్యన్తాకలనం విధాయ సహజస్వచ్ఛేన భావ్యం సదా,
అన్తః కృష్ణ ముపాస్య దద్రుచిమతా సంభావనా సర్వతః,
కార్యే త్యంబుజలోచనాక్షియుగళం మానం దధౌ తే సతామ్"

ఇతఁడు పుష్పదంతుని మహిమ్నస్తుతికి వ్యాఖ్య నిర్మించి దానిని గురుపాదుల కంకితము గావించెను.

"మహిమ్నాఖ్యస్తుతే ర్వ్యాఖ్యా, ప్రతివాక్యం మనోహరా,
ఇయం శ్రీమద్గురోః పాదపద్మయో రర్పితా మయా"

తనవ్యాఖ్యనుబట్టి యితరుఁడు టీక రచియించినచో వాఁడు హరి హరాదులకు శత్రువై పోవు ననియిట్లు శపించెను.

" టీకాన్తరం కశ్చన మందధీ రితః, సారం సముద్ధృత్య కరోతిచే త్తదా,
శివస్య విష్ణో ర్ద్విజగోసుపర్వణా, మపి ద్విషద్భావ మసా ప్రపద్యతే"

ఇతనికాలము తెలియ సరి యైనయాధారము లేవియు లభించ లేదు. అక్బరుచక్రవర్తి యితని నొకమాఱు పిలిపించి సత్కరించె ననియు, ఇతనితమ్ముఁ డైనయాదవానందపండితునికుమారుఁడును అఖిలం బసరస్వతీ బిరుదాంచితుఁడు నైనమాధవపండితుఁడు ప్రతాపాదిత్యుని సత్కారమందె ననియు రెండుమాటలు వినవచ్చుచున్నవి. ఈమాటలు విశ్వసనీయములయినచో నితఁడు తన వార్ధకములో నక్బరుచక్రవర్తి నెఱిఁగియుండు ననవచ్చును. సత్యము దేలువఱకును మధుసూదన సరస్వతి శా. ౧౫౭౫–౧౬౬౫ మధ్యకాలమున నున్నవాఁ డందము.

ఇతని మొదటిపేరు కమలనయనుఁ డఁట. ఇతనికృతులలో మధు సూదనసరస్వతినామమే కనవచ్చును. ఇతఁడు సన్యసించె నన్నమాటయు పెద్దలవాడుకలో నున్నది. ఇతని కున్నసరస్వతీసంజ్ఞ వైదుష్యమును బట్టివచ్చెనో సన్యసించినపిదప వచ్చెనో నిరూపింపలేము. ఏమయినను, ఇతనికృతు లన్నియు సన్యసించినపిదప వ్రాసినవి కావనుట నిజము.

# వారణాసి ధర్మసుధి

ఈ యింటిపేరు గల బ్రాహ్మణులు తెలుఁగుదేశములో రెండు మూఁడునాడులవారున్నారు కాని, కృష్ణామండలములోని పెదపులివఱ్ఱు గ్రామములోనివారు వెలనాటివారే. అయూరే కవీంద్రుని పూర్వుల మొదటి నివాసము. మూలపురుషుఁడు వారణాసిలోనుండి యచ్చటికి వచ్చినవాఁడగుటచే నతనివంశమువారు వారాణసివారై వాడుకలో వారణాసివారైరి. వీరు హరితగోత్రులు. ఈకవి పర్వతనాథుఁ డను

విద్వాంసునికి యల్లమాంబయందు జన్మించినవాఁడు. ఇతఁడు తనపూర్వ పురుషులను దనకృతులయందు వర్ణించియున్నాఁడు. ఆవర్ణనలనుబట్టి వారిఘనత యీక్రిందివిధముగాఁ దెలియుచున్నది.

ఈవారాణసి వంశములోని మూలపురుషుఁడు త్రిపురారిసోమయాజి. అధీతవేదవేదాంగుఁడు కృతక్రతువిశేషుఁడు నైనయతనికి పార్వతి యనుధర్మపత్నియందు ధర్మసుధి యుదయించెను. వేదశాస్త్ర సంప్రదాయ మవిచ్ఛిన్నముగా శిష్యపరంపరకు నిగమాగమములు బోధించుచు వచ్చినయాధర్మసుధికి నాగాంబ యనుసాధ్వి యందు నారాయణపండితుఁడు పర్వతనాథసుధి రామావధాని యనుముగ్గురు పుత్త్రులు జన్మించిరి. మనకవికి పితామహుఁడైన యాధర్మసుధి చిరకాలము ప్రాసాదపంచాక్షరి జపించియు రుద్రానువాక పురస్సరముగాఁ గొన్నిసంవత్సరములు నిత్యము రుద్రాభిషేకము గావించియు, తనభక్తికి సంతుష్టుఁడైన విశ్వేశ్వరునివల్లఁ దనవంశములో నేనుతరములదాఁకా వేదశాస్త్రవిద్య లవిచ్ఛిన్నముగా నుండునట్లు వరముగైకొన్న యీశ్వర భక్తాగ్రేసరుఁడు! అతనిపెద్దకొడుకు నారాయణావధాని పదక్రమ జటా ఘనక్రమ పదక్ర మారోహణావరోహణాద్యవధానమందు నిరుపమాన చాతురి ప్రదర్శించి పెక్కుసభలలో విజయము గాంచినప్రతిభాశాలి. అట్టియెడ నొకమాఱు వేదపండితు లందఱు నితని బ్రహ్మరథముపట్టి యూరేగించిరి. ధర్మభూపాలుఁ డితనియవధానమహత్త్వమునకు మెచ్చి అవధానిశరభగండభేరుండ బిరుదముతో శిబికాచామరచ్ఛత్రాదు లిచ్చి సత్కరించెను. మూఁడవకుమారుఁడు వేదమందును షడ్దర్శనములందును సాటిలేనికీర్తి గాంచెను. ఆయనరెండవకుమారుఁడు పర్వతేశ్వరుఁడు మనకవితండ్రి. వైదికలౌకికవాఙ్మయములు రెంటను పరిపూర్ణుఁడు. ఒకసభలో జనార్దనాచార్యుఁ డనుశ్రీవైష్ణవు నోడించి యతనిమాయా

వాదిభయంకరబిరుద మూఁడుదీసి, వాది కేసరిబిరుద మందినపండిత శూరుఁడు. ఆతఁడ్రికి తగినకొడుకీధర్మసుధి. ఇతనికి ధర్మసూరియన్న వాడుకయే యెక్కువ. ఇతనితండ్రితాతలు తఱుచు వారణాసిలో నివ సించుచుండెడివారు గావున నితఁ డందే జన్మించెనో లేక పెదపులి వఱ్ఱులో జన్మించెనో తెలియరాదు. గాని, వారుస్వగ్రామము పూర్తిగా విడిచినవారు కా రని మాత్రము తెలుఁగుదేశములోనివారి విజయములు సమ్మానములు తెలుపుచున్నవి.

ఇతనికాలము నిర్ణయింప ప్రత్యక్షప్రమాణములేదుగాని, ప్రతాప రుద్రీయకర్త యగువిద్యానాథుని కుక్షింభరియని పరోక్షముగా స్మరిం చినవాఁ డగుట నతనికిని [1], ఏసందర్భమందును మల్లినాథుఁ డితనినిగాని యితనికృతిని గాని స్మరించినట్లు కనఁబడదు కావున నతనికిని పరుఁ డన వచ్చును. సుప్రసిద్ధాలంకారికుఁ లెందఱితో పేర్కొన్నయీసూరి, మహావిద్వాంసుఁ డగుపండితరాజునుగాని యతనిరసగంగాధరమును గాని స్మరింపకపోవుటనుబట్టి యతనికిఁ బూర్వుఁడగును. గౌరనార్యుఁడు తనలక్షణ దీపికలో సాహిత్యరత్నాకరముపే రెత్తెను గావున నతనికిఁ బూర్వుఁ డగు నన్నమత మొకటికలదు గాని, యదిప్రమాదికము. దానిపే రెత్తియు దాహరించినశ్లోకము ధర్మసూరిసాహిత్యరత్నాకరములో లేదు. ఆరత్నా కర మితనిదికాదు. అందుచే శా. ౧౪౫౦-౧౫౧౦ నడుమ నితఁ డుండె ననుట సుసంగతము. ఏమయినను నింత కించుకపూర్వుఁ డగునుగాని పరుఁడు కాఁడని నాయభిప్రాయము.

---

1. అలంక్రియాః పూర్వతరైః ప్రణీతా
నయోజితాః కాశ్చన నాయకేన
కైశ్చిత్తు కుక్షింభరిభి ర్నిబద్ధాః
క్షోదీయసా కాశ్చన నాయకేన"

ఇతఁడును తండ్రితాతలమాడ్కి వేదవేదాంగములు పఠించిన వాఁడు. సాహిత్యమందును తర్కశాస్త్రమందు నితనికి శ్రద్ధహెచ్చు. తర్కము చదివినా, తనకవితకు మార్దవము లేకపోలే దని యిట్లు నరకాసురవ్యాయోగమున తెలిపియున్నాఁడు.

"తర్కే కర్కశతాం గతాపి నితరాం, వాగ్వైఖరీ సత్కవే
ర్మాధుర్యం ప్రకటీకరోతి కవితాకాలేషు కిం వాద్భుతమ్‌!"

నరకాసురవిజయవ్యాయోగము చిన్నకావ్యము. దీని కాంధ్రదేశమున వ్యాప్తి హెచ్చుగా నుండెడిది. ఇతఁడు బాలభాగవతకావ్యమును కృష్ణస్తుతిని కంసవధ యనురూపకమును హంససందేశమును ప్రాకృతకావ్యమును నిర్మించినట్లు కనఁబడుటయేకాని వాటికి ప్రచారము కనఁబడదు.

ఈకవి శ్రీరామభక్తుఁడు. పూర్వాలంకారికకృతులకంటె నుత్తమనాయకునితోఁ గూర్పఁబడినతనయలంకృతి విలక్షణమైన దని యారంభమునఁ దెల్పుచు నిది సహృదయరంజక మగు నని తనసాహిత్యరత్నాకరము నిట్లు ప్రశంసించుకొనెను.

"కావ్యామృతాకలనయా మృదుశీతలాని,
శ్రీరామదివ్యయశసా సురభీకృతాని,
యేషాం మనాంసి ఘనసారసమాని తేషా,
మేషా కృతి ర్వితనుతాం కమపి ప్రహర్షమ్‌"

పదితరంగముల యీలక్షణగ్రంథములో, అభిధా లక్షణా వ్యంజనాదిరసాంతము లగుసాహిత్యవిషయములు చక్కఁగాఁ జర్చింపబడినవి ఇందలిలక్షణముల కెల్ల లక్ష్యశ్లోకము లితఁడు నిర్మించినవే. అవి యన్నియు శ్రీరామకథాపరము లగుట యిందలివిశేషము. ఇందుకు ధ్వనితరంగములోఁ గైశికీవృత్తి కుదాహరణముగా నున్నశ్లోక మొకటి—

"రతి రివ నవకామం రామ మాలోకయన్తీ,
నవతరుణిమలీలోన్మేషసంచార్యమాణైః
లలిత వలిత లజ్జాగోలరంగై రపాంగైః,
కలయతి కి మ యం కౌశలం పుష్పకేతోః"

ఇతని వ్యాయోగకంసవధరూపకములనుండి రెండుశ్లోకములు—

"కస్తూరీ పరిదిగ్ధ ముగ్ధ కమలావక్షోజబుద్ధ్యా ధ్రువం
నీలాద్రే శ్శిఖరేషు నిత్యకుతుకీ దైత్యారి రవ్యాత్స నః,
ప్రత్యంగాభరణేషు దీప్తవపుష స్స్వాను దేవాః స్ఫుటం
యస్యా శేషసురాత్మతాం విదధతే చంద్రార్థచూడాదయః"

ఈక్రింది దర్ధనారీశ్వరవర్ణనము. రతిక్రోధములసంధి కిది రత్నాకరమున నుదాహరింపఁబడినది.

"రోషా ద్దక్షిణ మీక్షణం విపులయన్ వామం భయా న్మీలయన్
వక్త్రార్ధే క్వచి దీరయ న్కటుగిరం చాటూక్తి మప్యన్యతః,
ఏకే నానుపదా పురః పరిసర న్నన్యేన పశ్చా ద్వ్రజన్,
కాఞ్చిజ్జాతు దశో న్ముఖే మయి దశాం లేభేఽర్ధనారీశ్వరః"

ఇతని కభినవగుప్తాచార్యుని అభివ్యక్తిపక్షమం దెక్కువ గౌరవము. రసనిరూపణమం దతనిమతమునే యితఁ డనుసరించె నని యీక్రిందిమాటలు తెల్పుచున్నవి.

"శ్రీమదాచార్యాభినవగుప్తపాదై రభివ్యక్తిపక్షఏవ సిద్ధాంతితః సఏవ పరీక్షకాణా మన్తరంగ మవగాహత ఇత్యస్మాభిరపి సత్సంప్రదాయలోభేన తమేవ పక్ష మనుసృత్య రసో నిరూప్యతే".

శృంగార మొకటియే రస మన్నభోజరాజుపక్ష మనుచితమని ఖండించుచు, కరుణాదులయందు రసత్వము సిద్ధ మని నిరూపించెను. ఇది యాదినుండియు నితనియశస్సునకు మూలమై విద్వత్ప్రదంసకమగుచు

పఠనపాఠవ్యవహారమునయున్నదనుట విదితము. దీనికి నౌకామందర వ్యాఖ్యలు నిర్మించినవారు కూడ తెలుఁగువారే. దీనికి మధుసూదన మిశ్రశర్మయు నౌక యనుటీక నిర్మించెను.

ఇమ్మహనీయుఁడు శ్రీరామభక్తుఁడైనయద్వైతుఁడు. బ్రహ్మనిష్ఠుఁడైనయీవిజ్ఞాత చరమవయస్సులో సన్యసించి గోవిందానందుఁడై (రామానంద) శంకరభగవత్పాదుల శారీరకమీమాంసాశాస్త్రమైనబ్రహ్మసూత్రభాష్యమునకు వ్యాఖ్య నిర్మించెను. అది యన్నిదేశములందును బ్రహ్మజిజ్ఞాసువులకు పఠనీయమై వెలయుచున్నది. ఇట్లు ధన్యుఁడైనయీజ్ఞాని వ్యాఖ్యారంభమున వ్రాసినశ్లోకము లివి:—

"య మిహ కారుణికం శరణం గతో ఉప్యరిసహోదర ఆప మహత్పదమ్,
తదహ మాశు హరిం పర మాశ్రయే జనకజాఙ్కమనన్తసుఖాకృతిమ్.
"శ్రీమచ్ఛారీరకం భాష్యం ప్రాప్య వాక్ శుద్ధి మాప్నుయాత్,
ఇతి శ్రమో మే సఫలో గంగాం రథ్యోదకం యథా".
"యదజ్ఞానసముద్భూత మింద్రజాల మిదం జగత్,
సత్యజ్ఞానసుఖానన్తం తదహం బ్రహ్మ నిర్భయమ్"

## అప్పయదీక్షితులు

దక్షిణాపథములోని విద్వత్కవిచంద్రులలో ద్రవిడాలంకారభూతుఁడైనయీమహనీయుఁ డొకఁడు. కలియుగములో శంకరుఁడు తొలుత శంకరాచార్యుఁడై యవతరించి పిదప నప్పయదీక్షితుఁడై పుట్టెనని యితని భక్తులవిశ్వాసము. ఇతనిచరితమును పెక్కండ్రు సంస్కృతాంధ్రాంగ్లాదిభాషల రచియించియున్నారు. కావున నిందుసంగ్రహముగాఁ దెలిసికొందము.

ఇతనిజన్మభూమి కాంచీమండలములోని "అదెఖోలము" అనియు నిప్పటిదక్షిణార్కాటుజిల్లాలోని "అడియపాలెము" అనియు రెండుమత

ములుకలవు-ఇతఁడు భారద్వాజగోత్రుఁడు. ఇతనిపితామహుఁడు సర్వతో ముఖమహావ్రతయాజియైన ఆచార్యదీక్షితుఁడు. అతఁ డొకసారి శ్రీకృష్ణ దేవరాయలచే సత్కరింపఁబడె ననియొక కథగలదు-కృష్ణదేవరాయలు సతీసమేతుఁడై కంచికి వచ్చి వరదరాజస్వామిని సందర్శించినసందర్భమం దాదీక్షితుఁడు మహారాజ్ఞిని సాక్షాల్లక్ష్మిగా భావించి యాశువుగా నీశ్లోకము చెప్పెనఁట.

"కాంచి త్కాంచనగౌరాంగీం వీక్ష్య సాక్షా దివ శ్రియమ్,
వరద స్సంశయాపన్నో వక్షః స్థల మవైక్షత"

మనోహరము నిగూఢభావము నైన యీసరసకల్పన కానందించి రాయ లతనిని వక్షఃస్థలాచార్యదీక్షితుఁ డని ప్రశంసించి సత్కరించెనఁట.

అప్పయదీక్షితునితండ్రి రంగరాజాధ్వరి, తమ్ముఁడు ఆచ్చాన్ దీక్షితుఁడు. పైవిషయమున కితనిమధ్వతంత్రముఖమర్దనములోని యీ క్రింది శ్లోకమే ప్రమాణము.

"విద్వద్గురోర్విహితవిశ్వజిదధ్వరస్య, శ్రీసర్వతోముఖమహావ్రతయాజి సూనోః
శ్రీరంగరాజమఖినః శ్రితచన్ద్రమౌళే ర స్త్యప్పదీక్షితఇతిప్రథితస్తనూజః"

ఇతఁడు కలియుగము ౪౬౫౪ లో ననఁగా, శా. ౧౪౭౫ లో జన్మించి డెబ్బదిరెండుసంవత్సరములు జీవించి శా. ౧౫౪౭ లో బ్రహ్మీభూతుఁ డయ్యెను-ఈవిద్వన్మణి శా. ౧౫౦౭-౧౫౩౬ నడుమ చంద్రగిరి రాజధాని గా నాంధ్రకర్ణాటదేశ మేలినవెంకటపతిరాయలయాస్థాన మలంకరించినవాఁ డని కువలయానందము తుదిశ్లోకము చెప్పుచున్నది.

"అముం కువలయానంద మకరో దప్పదీక్షితః
నియోగా ద్వేంకటపతే ర్నిరుపాధికృపానిధేః"

ఈకవీంద్రునితమ్ముని పౌత్రుఁ డైన, నీలకంఠదీక్షితులు తనశివలీలార్ణవములో మనకవి డెబ్బదిరెండేండ్లు జీవించి నూఱుప్రబంధములు నిర్మించె నని యిట్లు తెలిపియున్నాఁడు.

“ కాలేన శంభుః కిల తావతాపి, కలాశ్చతుష్షష్టిమితాః ప్రణిన్యే ”
ద్వాసప్తతిం ప్రాప్య సమాః ప్రబన్ధాన్, శతం వ్యధాదప్పయదీక్షితేంద్రః

ఇతనికాలమునెడ నతిస్వల్పభేద మున్నను[1] ఇతనివంశములోని శేషదీక్షితనీలకంఠదీక్షితులు చెప్పినమాటలనుబట్టి పూర్వోక్తకాలమున నితఁడు జీవించియున్నవాఁ డని విశ్వసింతము.

వేదవేదాంగవేత్తయైన యితఁడు సాహిత్యపారంగతుఁడై నిశితవైదుష్యమున నిరుపమానుఁ డని గణన కెక్కినవాఁడు. భట్టోజీదీక్షితుల వేదాన్తశాస్త్రగురువనఁబడు నీమతతత్త్వవేత్త యాకాలమున దక్షిణదేశమున వ్యాపించి యున్నవిశిష్టాద్వైతమత మణఁగింప దేశాటనము చేసి తన్మతప్రచారకులను శాస్త్రవాదమం దోడించి దేశమంతట వీరశైవమతము నెలకొల్పినపండితశూరుఁడు. ద్వైతమతఖండనము గావించి తన్మతవాదులను సభలలో నిర్జించినదర్శనసారవేత్త. ఇట్లు శాస్త్రవాదములందు ముందంజ వేయుచు మాధ్వరామానుజమతములపై కత్తి కట్టి పోరాడి పరమతసహిష్ణుతలేనివాఁ డనిపించుకొన్నయద్వైత మతాభిమాని. పెక్కుసభలలో ద్రవిడకర్ణాటాంధ్రపండితులవినుతులను తత్కాలాన్ధ్రరాజసత్కారములను చూఱగొన్నప్రజ్ఞాధురీణుఁడు. ఇందు కాంధ్ర

1. ఇతఁడు శా. ౧౪౪౨ లో జన్మించి ౧౫౧౫ లో స్వర్గస్థుఁ డయ్యెననుచు, జననమరణకాలములను 88 సంవత్సరములు వెనుకకుగొంటిన మత మొకటికలదు. ఆమత మితనియాయుర్దాయపరిమితిని సరిపుచ్చిన వచన మిది—
“ విక్రమే భూతలం ప్రాప్య విజయే స్వర్గ మాయయౌ ”

రాజు లగుచినతిమ్మరాజ చినబొమ్మరాజ వేంకటపతి రాయలయాస్థాన ములం దితఁ డుత్తమకవిపండితపదవి నలంకరించుటయే నిదర్శనము.

ఇట్లు నిరంకుశముగా విద్యావనవిహారము సల్పిన యీవిద్వద్గజేంద్రుఁడు శాస్త్రవాదమునకై పండితరాయలకు మాత్ర మవకాశ మివ్వ లేదఁట. వైదికకర్మనిరతుఁ డైనయీయజ్వ వర్ణభ్రష్టుఁ డైనయతనిఁ జూచుట కిష్టపడకపోవుటయే యందుకుఁ గారణ మనియు, అందుచేతనే బద్ధమత్సరుఁ డైనయతఁ డితనిచిత్రమీమాంసను ఖండించె ననియు, ఆకారణముననే యితఁడు తా నారంభించి సగమువఱకు వ్రాసినయా గ్రంథమును పూర్తిగావింపక విడిచిపెట్టె ననియు, వారు భావించి యున్నారు. ఇందలితత్త్వ మెట్టిదైనను, శా. ౧౫౩౫ ప్రాంతమునఁ బూర్తిగావించిన కువలయానందమునకుమున్నె కొంతవఱకు రచియించిన చిత్రమీమాంస[1] నితఁడు పూర్తిగావింపక విడిచినమాట సత్యము. జగన్నాథపండితుఁడు దొరకినంతవఱకు దానిని ఖండించినమాట సత్యము.

ఈకవిశిరోమణి నూఱుకృతులు రచియించినమాట వాస్తవము. వానిలోఁ గొన్ని మతగ్రంథములు నాలంకారికకృతులుమాత్రమే దేశమున వ్యాపించినవి. ఇతనివీరశైవము శివార్చనచంద్రిక శైవాద్వైత నిర్ణయము శివతత్త్వవివేకము మొద లగుశైవమతగ్రంథము లిప్పటికిని ప్రచారములో నున్నవి.

ఇతని శివాదిత్యమణిదీపికను శ్రీకంఠభాష్య మందురు. అది బ్రహ్మసూత్రభాష్య శ్రీభాష్యములవంటిది. లింగాయతమతమువారి కితనివీరశైవగ్రంథమే పట్టుకొమ్మగా నున్నది. భారతస్తవరామాయణసారసంగ్రహాదికృతులును, వాదనక్షత్రమాలికారత్నత్రయపరీక్షాచంద్రికలాస్తుతినామసంగ్రహమాలాదిబహుకృతు లిపుడు వ్యాప్తిలేక యున్నవి. ఇతని

1. కువలయానందరూపకప్రకరణే "చిత్రమీమాంసాయాం ద్రష్టవ్యమ్"

మధ్వతంత్రముఖమర్దనము సిద్ధాంతలేశసంగ్రహము విద్వల్లోకమున వినుతి గాంచుచున్నవి. వరదరాజస్తవ దశకుమారచరితసంగ్రహాది కృతులును దేశమున వాడుకలో నున్నవి. కువలయానందచిత్రమీమాంసా వృత్తివార్తికాదులు కొన్నిభరతఖండ మంతట వాడుకలో నున్నవి.

ఇతనిశతకములలో వైరాగ్యశతకము పరిణతదశలోనిర్మిత మగుటచే నాత్మానుభవద్యోతకమై వేదాన్తసారము వెదచల్లుచున్నది. అందలి

“ న గృహీతం శ్రుతిహృదయం, న చ న గృహీతం పరిప్లవం హృదయమ్.
ఇచ్ఛామి చ ధామ పరం, గచ్ఛామితు విశ్వనాథపురీమ్ ”

ఈశ్లోక మితనికాశీప్రయాణోద్యోగమును చాటుచున్నది. అన్నట్లితఁడు కాశికిఁ బోవుచుండ దారిలోభక్తు లితనిని బ్రతిమాలి చిదంబరములో నాపి రనియు నందే యితఁడు తన డెబ్బదిరెండవయేఁడు నిండినంత శరీరము త్యజించి శివైక్య మందె ననియు, ఆసమయమున విద్వాంసులైనయితని కొడుకులు పదకొండుగురును దగ్గఱ నుండిరనియుఁ జెప్పుదురు. ఈవిజ్ఞాని చిదంబరప్రవేశకాలమం దన్నమాట లివి.

“ చిదంబర మిదం పురం ప్రథిత మేవ పుణ్యస్థలం,
సుతాశ్చ వినయోజ్జ్వలాః సుకృతయశ్చ కాశ్చి త్కృతాః.
వయాంసి మమ సప్తతే రుపరి నైవ భోగే స్పృహా,
న కిఞ్చి దహ మర్థయే శివపదం దిదృక్షే పరమ్ ”

ఇతనికవిత్వము మృదుమధుర మనుటకు మఱిరెండు.

“ ప్రాదేశమాత్ర ముదరం, పరిపూరయితుం కియా నయం యత్నః!
చులుకే నామ్భః పాతుం, ఖనితవ్యః కిం తటాకోఽపి!
“ వేదా నధీత్య విధివ న్మీమాంసిత్వా తదర్థంచ,
దారాః కర్తవ్యా ఇతి కే నేదం ప్రహసనం కథితమ్?”

ఈమహాపండితు డనేకకృతులకు వ్యాఖ్యలునిర్మించియున్నాఁడు. వానిలోవేదాంతదేశికునియాదవాభ్యుదయమునకు నిర్మించినవ్యాఖ్యానము

ప్రసిద్ధి గాంచినది. అది విజయనగరమున నున్న నాఁటిచినతిమ్మరాజు ప్రోత్సాహమున రచించినట్లు దానియవతారికలో నిట్లు తెలిపియున్నాఁడు

" శ్రీచిన్నతిమ్మరాజః ప్రతాపనీరాజితక్షమావలయః, ...
సాహిత్యగోష్ఠీం సరసా మాతిష్ఠ న్నయ మేకదా,
యాదవాభ్యుదయం కావ్య మశ్రౌషీ ద్విదుషాం ముఖాత్ ...
విదుషాం పురత స్తస్య వివృతౌ మాం న్యవేదయత్
కవితార్కికసింహస్య కావ్య మేత ద్యథామతి
వివృణోమి మహీపాలబహుమాననియోగతః "

చిన్నబొమ్మరాజితనికి శివాదిత్యమణిదీపిక యనుశ్రీకంఠభాష్యము పూర్తి చేసినసమయమందు కనకాభిషేకము గావించినట్లు నీలకంఠదీక్షిత కృత మయిననలచరితనాటకము చెప్పుచున్నది. అమాట లివి:—

" హేమాభిషేకసమయే పరితో నిషణ్ణ
సౌవర్ణసంహతిమిషా చ్చినబొమ్మభూపః
అప్పయ్యదీక్షితమణే రనవద్యవిద్యా
కల్పద్రుమస్య కురుతే కనకాలవాలమ్ "

అతఁ డిచ్చినసొమ్ము పెట్టియే కావచ్చు నితఁ డళియపాళెములో శివాలయము కట్టించిన ట్లాయూరిలోనిశాసనము చెప్పుచున్నది.

" యేన శ్రీచిన్నబొమ్మక్షితిపబలభిదః కీర్తి రవ్యాహ త సీత్,
యేన శ్రీకంఠభాష్యం పరమశివమతస్థాపనా యోద్దధార,
తేన శ్రీరంగరాజాధ్వరివరతనయే నాప్పయజ్వాభిధే నా,
కారి ప్రోథోన్నతాగ్రం రజతగిరినిభం కాలకంఠేశధామ "

దేశాభివృద్ధికి స్వమతాభివృద్ధికి సారస్వతాభివృద్ధికిఁ బాటుపడిన యీమహావిద్వాంసుఁడు మహాకవి విద్వల్లోకమునకుఁ జిరస్మరణీయుఁడు.

# రుద్రకవి - ౨

న్యాయవాచస్పతిబిరుదాంకితుఁడైనయీవిద్వత్కవి విద్యావిలాసనుధీమణిపుత్త్రుఁడు. జయపుర (బొంబాయిరాష్ట్రము) రాజ్యపాలకుఁడైనమానసింహమహీపాలుని తనయుఁ డగుభావసింహమహీపతియాస్థానములోనివాఁడు. మానసింహుఁడును ఢిల్లీపాదుషాఅక్బరుచక్రవర్తియు సమకాలికులు. కావున మనకవియు, నితనిపోషకుఁడు భావసింహుఁడును శా. ౧౫౫౦ ప్రాంతమున నున్నవా రనుట విశ్వసనీయము.

ఈకవి బృందావినోద మను పేర శ్రీకృష్ణవిలాసము నొకకావ్యముగా నిర్మించెనుగాని, అది యముద్రితము. భావవిలాస మను పేర నితఁడు రచియించినయన్యాపదేశశతకము ముద్రితము—ఇందలి మొదటి ౧౭ శ్లోకములును కృతిపతిగుణములను, కడపటిమూఁడును కవివిషయమును, తెలుపుచున్నవి¹. తక్కిన ౧౧౬ శ్లోకములు నన్యాపదేశములు కవిత్వము సరసముగా నున్న దనుట కివి:—

“ఆస్వా ద్యాత్రి మధూని షట్పద ముదం మాగాః కషాయాంకురైః,
మాకందేన పికా న్ప్రతారితవతా మూర్ధ్నాన మధ్యాసితః,

1. యోఽభూ ద్భూసురభూరుహోఽత్ర భగవద్దాసో నివాస శ్శ్రియామ్,
శ్రీమాన్ శ్రీమానసింహక్షితిపతిజలధే రుద్గతో భావసింహః,
పూర్ణః పీయూషభాను ర్విలసతి కిరణధ్వస్త దైన్యాన్ధకారః,
త స్యాజ్ఞా మధిగత్య యః కవికులానందాయ సంపాదితః,
సందర్భ స్త మమత్సరాః కృతధియః కుర్వన్తు కర్ణాతిథిమ్,
“అన్యాపదేశవినివేశదగ్ధబుద్ధి, శ్రీభావసింహనరసింహనియోగయోగాత్,
సంపాదితో వివిధభావవికాసభాజాం ప్రీత్యై భృశం భవతు భావవిలాస ఏషః,
“సద్గుణానాం సముద్రేణ రుద్రేణ గ్రథితా గుణైః, కంఠస్థా శ్లోకమా లేయం కేషాం న కురుతే శ్రియమ్”
విద్యావిలాసపుత్త్రస్య న్యాయవాచస్పతేరియమ్,
కావ్యాలాపవిదగ్ధానాం ముదం నిర్మాతు నిర్మితిః.

పరిత్యాసన్నతమే పికేఽపి భవతే యే నార్పితా తాదృశీ
మాధ్వీ, తస్య వివేకవిచ్యుతి రియం సాద్గుణ్యా మేత న్నతే"
"న చేత శ్చాంపేయ స్తబకనికురంబే ఽభిరమతే,
సముత్కంఠా కాచి న్నచ వికచపుంనాగముకుళే,
న మల్లీవల్లీనా మపి మధుని వాంఛా మధులిహః,
సమాఘ్రాతో నూనం య దవధి లవంగీపరిమళః"

ఇది యన్యాపదేశముగా పండితరాయలలవంగిప్రియత్వమును సూచించునదిగా లేదా?

## పండితరాజజగన్నాధకవి

పండితరాయ లనిప్రసిద్ధి కెక్కినయీమహావిద్వత్కవి జగ మెఱిగినబ్రాహ్మణుడు. త్రిలింగదేశమం దుభయగోదావరీమధ్యగత మైన ముంగండ (మునిఖండము) అనెడియగ్రహార మితనిజన్మస్థానము. అందలి వేగినాటివారిలో కౌండిన్యగోత్రుడును, ఆపస్తంబసూత్రుడు నైన, ఉపద్రష్ట పేరుభట్టనెడివిద్వాంసునికి లక్ష్మీదేవి యనెడిసతీమణియందు జన్మించినపుత్రరత్న మీపండితరాయలు. ఆపేరుభట్టు వారణాసిలో జ్ఞానేంద్రభిక్షునొద్ద వేదాన్తశాస్త్రమును మహేంద్రపండితునొద్ద న్యాయవైశేషికదర్శనములను ఖండదేవునిచెంతఁ బూర్వమీమాంసను శేషవీరేశ్వరమనీషివద్ద శబ్దశాస్త్రమును చదివినగొప్పవిద్వాంసుడు. ఆయన స్వదేశమునకు తిరిగివచ్చినపిదప నీపండితరాజు ముంగండలో జన్మించెనో లేక, యతఁడుకాశీనగరమం దున్నకాలమందే యుదయించెనో విస్పష్టముగా తెలియరాదు. మనకవికి సర్వవిద్యలయందును తండ్రియే మహాగురువు. తనతండ్రికి వ్యాకరణశాస్త్రగురు వైనవీరేశ్వరపండితు

నొద్ద నితఁడును పాణినీయమర్మము లెఱిఁగినట్లు మనోరమాకుచమర్ద నారంభవాక్యమునఁ దెలియుచున్నది. పైవిషయము నెఱిఁగించు నితని మాట లివి.

“ త్రైలింగాన్వయమంగళాలయమహాలక్ష్మీదయాలాలితః
శ్రీమత్పేరమభట్టసూను రనిశం విద్వల్లలాటంతపః”

“ శ్రీమజ్జ్ఞానేంద్రభిక్షో రధిగతసకలబ్రహ్మవిద్యాప్రపఞ్చః
కాణాదీ రక్షపాదీ రపి గహనగిరో యో మహేన్ద్రా దవేదీత్,
దేవా దేవాధ్యగీష్ట స్మరహరనగరే శాసనం జైమినీయం
శేషాఙ్కప్రాప్తశేషామలభణితి రభూ త్సర్వవిద్యాధరో యః,

“ పాషాణా దపి పీయూషం స్యన్దతే యస్య లీలయా,
తం వన్దే పేరుభట్టాఖ్యం లక్ష్మీకాన్తం మహాగురుమ్ ”

“ అస్మద్గురుపణ్డితవీరేశ్వరాణాం తనయై ర్దూషితాపి స్వమతి
పరీక్షార్థం పున రస్మాభి ర్నిరీక్ష్యతే ” (మనోరమ)

## ఇ త ని కా ల ము

ఈవిద్వత్కవి ఢిల్లీపాదుషా లగుశహాజహానుదారాషకోప్రభువుల సభలలో శా. ౧౫౪౯–౧౫౮౧ నడుమ నున్నవాఁ డనుట నిజమేకాని దేశములలుఁగడల మొదటినుండియు వ్యాపించియున్నయితనిజీవితములోని కొన్నివిశేషాంశములనుబట్టి యితఁడు ఢిల్లీనగరమం దెప్పుడు ప్రవేశించె నన్నవిషయము విచారణీయ మగుచున్నది. ఇందుకు ముందు భరతఖండ మంతట విద్వత్పరంపరలో విశ్వాసపాత్రమై వేల్లు నాటుకొన్నయితని యవనకన్యాపరిణయోదంతము నొకింత పరిశీలింతము. ఇం దుత్తరదేశీయ కథన మిది.

“ జగన్నాథపండితుఁడు త్రిలింగదేశమునుండి వచ్చి జయపురములో సంస్కృతపాఠశాల స్థాపించెను. ఆసమయమున ఢిల్లీనుండి

వచ్చినకాజీ యనఁబడుయవనవిద్వాంసునిఁ దత్కాలమందు యవనమత గ్రంథములు చదివి వాద మం దోడించెను. అతనివల నీపండితునిశక్తి తెలిసికొని ఢిల్లీపాదుషా యితనిని పిలిపించి గౌరవించి తనయాస్థాన మందు నిలిపెను. అప్పు డితఁ డొకయవనకన్యను కామించి పాదుషా యనుగ్రహింప దానిని పెండ్లాడి సుఖముగా యౌవనము గడపి, వార్ధకమం దాభార్యతోఁ గలసి కాశికిఁ బోయెను. ఇతఁడు వర్ణభ్రష్టుఁడు, అప్పయదీక్షితాదిదూషితుఁడు నని యందరివారు “నీవు గంగను స్పృశింపరాదని నిషేధింప నొకఘట్టమందలిపైమెట్టుపైఁ గూర్చుండి గంగాస్తవ మారంభించెను. ఒక్కొక్కశ్లోకముచెప్పినప్పటికి గంగ యొక్కొక్కమెట్టుపైకి వచ్చుచు నేఁబదిరెండవశ్లోకముతో నామెట్టెక్కి యూఁగినది అప్పు డితఁడు.

“ యది చే దుపేక్షసే త్వం గతిహీనం సర్వతో నిరాశం మామ్,
వద కరుణావతి గంగే కతమో విషయ స్తవాస్తి కరుణాయాః ?

అని ప్రార్థింప గంగ యామెట్టెక్కి లవంగీసమేతుఁ డగునీకవిని దనలో లయము గావించుకొనెను ”— ఈకల్పితమైనగంగాప్రవేశ కథ యన్నిదేశములందును సమానముగానే యున్నది గాని, ఢిల్లీప్రవేశకథనము మాత్ర మాంధ్రదేశమున నిల్చియున్నది.

“ జగన్నాథకవి యిరువదియైదేండ్లప్రాయమునకే విద్యలయందారితేఱి ధనార్జనమనీషతో బయలువెడలి యాయారాజులసభల సత్కారము లందుచు, వానిచేఁ దనియక, అక్బరుపాదుషావదాన్యత విని—

“ ఢిల్లీశ్వరో వా జగదీశ్వరో వా, మనోరథాన్ పూరయితుం సమర్థః
అన్యైః నృపాలైః పరిదీయమానం
శాకాయ వా స్యా ల్లవణాయ వా స్యాత్”

“ నహి యాచే హిందూకం, పర్వణి దత్తైకతామ్రడబ్బూకం,
యాచే మొగల్మలూకం, తృణీకృతస్వర్ణచందూకం ”

అని నిశ్చయించుకొని తిన్నగా ఢిల్లీకిఁ బోయి యూరివెలుపల నొకచెఱువులో స్నానముచేసి నిత్యకృత్యములు తీర్చుకొను నంతలో నిద్దఱు తురుష్కు లక్కడికి వచ్చి తీవ్రముగా వాక్కలహ మొనర్చి పాదుషాచెంత కేగిరి. అది దైవిక మైననిమిత్తము కాఁగా నితఁ డక్బరు నొద్దకు సాక్షిగాఁ బోవుట సంభవించెను. అపుడు నాకు "పార్శీభాష రాదు. నేను విన్నట్లు చెప్పెదను" అని పలికి వారివాగ్వాదము తాను విన్నట్లు క్రమముగా వినిపించెను. పాదుషా యాశ్చర్యపడి యితనిధార ణాశక్తికి మెచ్చికొనియు, పార్శీ వచ్చునేమో యన్నఅనుమానముతో ఖురాణషరీఫులోని నాలుగుపత్రములగ్రంథము చదివి మఱి దీనిని జదువు మనఁగా యథాశ్రుతము నితఁడు చదివెను. అపు డపరిమితా నందపరవశుఁడై పాదుషా యితని నెక్కువగా సత్కరించి తనయాస్థా నమందు విద్వత్కవిపదవి నిచ్చి యాదరించెను. ఆసత్కారసమయ మందే నీ కేమి కావలెనో కోరుకొను మనఁగా, నపుడచ్చట బంగారు కలశము నెత్తిని బెట్టుకొని పోవుచున్నలవంగి యనుయవనకన్యనుజూచి మోహించి యీసిల్ల ననుగ్రహింపు మని యితఁడు కోరెననియు, కొన్ని రోజులు గడచినపిదప నాలవంగినే యితఁడు కామించి రాజానుగ్రహ మున దానిని పెండ్లాడెననియు, ఆలవంగి యక్బరువిభునికి వశీభూత మైనరాజపుత్రికాంతకూఁతు రనియు, అతనిబంధువుకూతు రనియు— స్వల్పపాఠభేదము లుండుఁగాక, ఏమయిన నీకవి యవనకన్యను పరిగ్రహించె ననుటమాత్రము సర్వ విదితము— మఱియు నీవిషయమున నితనినోట వచ్చినవిగా నీక్రిందిశ్లోకములు భరతఖండమంతట వ్యాపించిన మాటయు సత్యము—

"ఇయంసు స్తనీమస్తకన్యస్తకుంభా, కుసుంభారుణం చారుచేలందధానా,
సమస్తస్యలోకస్య చేతఃప్రవృత్తిం, గృహీత్వాఘటేన్యస్యయాతీవభాతి

"నయాచే గజాళిం నవా వాజిరాజిం, న విత్తేషు చిత్తం మదీయం కదాచిత్
[1] ఇయం సుస్తనీ మస్తకన్యస్తకుంభా, లవంగీ కురంగీదృగంగీకరోతు"
"యవనీ నవనీతకోమలాంగీ. శయనీయే యది నీయతే కదాచిత్,
అవనీతల మేవ సాధు మన్యే, న వనీ మాఘవనీ వినోదహేతుః"
"యవనీ రమణీ విపద శ్శమనీ, కమనీయతమా నవనీతసమా,
ఊహి ఊహి వచోఽమృతపూర్ణ ముఖీ,ససుఖీ జగతీహ యదంకగతా"

ఈశ్లోకములు మఱియొకరి వన్నవాద మొందుటవినరాదు గావున నివి యితని వని నమ్మక తప్పకున్నది. దానంజేసి యితనియవనీపరిణయో దంతము సత్య మన్నయాంగ్లదేశకథనమును నమ్మక తప్పకున్నది. ఇం దలితత్త్వము దైవ మెఱుఁగును.

ఇఁక, నితఁ డక్బరువార్ధకదశలో నతనిసంస్థానమునఁ బ్రవేశించి నట్లు తెలియవచ్చినయీవిషయమును స్థిరపఱుపఁజూతము—ఇతని భామి నీవిలాసము "మదీయపద్యరత్నానాం మంజూషైకా కృతా మయా" యన్నట్లితఁడా బాల్య మూవార్ధకము నిర్మించినపద్యరత్నముల పేటిక యనుట సత్యము. ఇందున్న యొకవాక్యమిది:—
"ఢిల్లీవల్లభపాణిపల్లవతలే నీతం నవీనం వయః"

ఇం దితఁడక్బరునాదరము గాంచిననాఁటితననవయౌవనమును దరువాత నెపుడో స్మరించుకొనె ననుట విదితము. దీనినిబట్టి యాచ క్రవర్తి గతించునాఁటికి తఁడు దాదాపు ముప్పదియేండ్లవాఁ డగునట్లు భావింపవచ్చును. అయితే, ఆఢిల్లీవల్లభుఁడు శహాజహాను కాఁగూడదా యని, యందురేమో కాని, అతఁడు సింహాసనమెక్కి ఢిల్లీవల్లభుఁ డని పించుకొనునాఁటికే మనకవి దాదా పేఁబదియేండ్లవాఁడు. పోనీ! మఱ్ఱా

1. ఈతృతీయపాదమున కీపాఠాంతరములు వినఁబడును: ఇవియెట్లువచ్చినవో!—ఇయం కుస్తనీ హస్తవిన్యస్తకుంభా—అరం భాసమానాపి రంభాసమానా—

తరమునుబట్టి గమారమి నలువదియేండ్లవాఁడే యందము. అయితే, ఆమ
ధ్యవయస్సున శహజహానుసభలోఁ బ్రవేశించి యటుపిదపఁ గడపినతనవ
యస్సును నవీనవయస్సుగా నితఁడు స్మరించుకొనె ననవచ్చునా! ఇది
హాస్యాస్పదము కాదా?—ఎందు కీవాదము? ఆఢిల్లీవల్లభుఁ డక్బరే
చూడుఁడు—

అక్బరును జయపురమహారాజగు మానసింగును సమకాలము
వారు. ఆరాజుకొడుకు భావసింహునిసభలోనిన్యాయవాచస్పతి యగు
రుద్రకవి తనభావవిలాస మనెడియన్యాపదేశశతకములో భ్రమరాపదేశ
ముగా మనకవీంద్రునిలవంగిప్రేమను వర్ణించియున్నాఁడు. ఇంతకుమున్ను
దాహరించినయాశ్లోకమునాల్గవపాద మిది:—

“ సమాఘ్రాతో నూనం యదవధి లవఙ్గీపరిమళః ”

పరిమళఖ్యాతిగన్నలత లెన్నోయుండఁగా నతఁడు లవంగి నెందుకు
గ్రహించెను? శా. ౧౫౦౦ ప్రాంతమునాఁటిపూర్వాచారపరాయణుఁడు
పెద్దవాఁడు నైనయారుద్రుఁడు శా. ౧౫౨౨ ప్రాంతమందలి మనపండి
తునిలవంగిప్రేమ నెఱిఁగియే. ఇది యన్యాపదేశము గదా! ఈభావ
మంగీకరింప సంశయ మేమి? అయితే, శహజహానునాఁ డీలవంగీపరిగ్ర
హణము జరిగిన దని యేల భావింపరాదు? సరే కాని, తనతరువాత నేఁబ
దియేండ్లకు జరుగఁబోవులవంగీప్రేమకథ ముందుగా నెఱుఁగుట కా
కవిరుద్రుఁడు భగవంతుఁడా? లేక యోగీంద్రుఁడా?—మఱియు—

శా. ౧౫౦౭-౩౬ నడుమ చంద్రగిరిరాష్ట్ర మేలినవేంకటపతి
రాయలయాస్థానవిద్వత్కవి యగునప్పయదీక్షితులతో శాస్త్రవాద
మొనరింప మనకవి వచ్చుచున్నట్లు తెలిసి, యితఁడు వర్ణభ్రష్టుఁ డన్న
నెపము పెట్టి యతఁ డెచ్చటికో వెళ్ళినట్లును, అపుడు విద్యావ్యాసం
గము చేయుచున్నయతనిపుత్రపుత్రులు శిష్యులును తమగురువుగారు

గ్రామాంతరము వెళ్ళి రింతలో రారని చెప్పినట్లును, అపుడు భగ్నాశుఁ డైనయీకవి యీక్రిందిశ్లోకము చెప్పి తిరిగిపోయి యితనిచిత్రమీమాంసను ఖండించినట్లును దృఢమైన విద్వల్లోకవిశ్వాసము దేశమున నెలకొని యున్నది. నాఁటియీక్రిందిశ్లోకము భామినీవిలాసమం దున్నది:

"దిగంతే శ్రూయంతే మదమలినగండాః కరటినః
కరిణ్యః కారుణ్యాస్పద మసమశీలాః ఖలు మృగాః,
ఇదానీం లోకే ఽస్మి న్ననుపమశిఖానాం పున రయం
నఖానాం పాండిత్యం ప్రకటయతు కస్మిన్ మృగపతిః!"

దీనినిబట్టి శా. ౧౫౩౬ నాఁటికిఁ బూర్తి గాంచినకువలయానందమునకు మున్నే యుదయించినచిత్రమీమాంసము ఖండించినయితఁడా దీక్షితుని ౧౫౩౦ ప్రాంతమున, జూడఁబోయినట్లు విశ్వసింపవచ్చును గదా! అట్టియెడ నీపండితసింహ మక్బరునాస్థానమం దేమూఁడు నాలు గేండ్లో విహరించియుండు ననుటకు సంశయ మేమి? అక్బరు సూర్యభక్తుఁ డని ప్రతీతి. అతనిసంతుష్టికే తొలుత నితఁడు సుధాలహరి నిర్మించె ననవచ్చును గదా! కావున ఢిల్లీవల్లభుఁ డైనయక్బరుచేతిలోనే యితని నవీనవయస్సు గడచిన దని విశ్వసించుట యెంతయు సమంజస మగును.

దీని నంతనుబట్టి యీపండితరాజు శా. ౧౪౯౭ లోఁ బుట్టి ౧౫౨౨ లో ఢిల్లీ చేరి యక్బరునాదరము గాంచి లవంగిని జేపట్టి, తరువాత జహంగీరునాఁడు కూడ నందే యుండియు, నితరరాజాస్థానయాత్ర గావించుచుఁ బిదప శహాజహాను చక్రవర్తి కాప్తుఁడై పండితరాజబిరుద మంది, పదపడి దారాశాహావిభునికి గురువై విద్వన్మంత్రియై ౧౫౮౧ ప్రాంతమునం దతఁడు గతించినపిదప నిరాలంబుఁడై వారాణసి కేగి ౧౫౮౩ ప్రాంతమున శ్రీకృష్ణసాయుజ్య మందె నని భావింతము. సహస్రమాసాధికజీవి యగునితనియెడ నీభావనము సముచిత మగును.

శా. ౧౫౯౫ ప్రాంతమునం దితఁడు మధురలో దేహయాత్ర చాలించె నని కొందఱందురు. తేఁటా సుమారు పదిసంవత్సరములు — అప్పుడు కొంచెము తక్కువగా నూతేండ్లు జీవించినవాఁ డగును.

## ఇ త ని కృ తు లు

ఇప్పటికిఁ దెలియవచ్చినవి పదునాఱు. ఇతనికవితాపద్ధతి యపూర్వము. భావములు రసికజనరంజనములు. ఇందు కితనిభామినీవిలాసము ప్రథమోదాహరణము. ఇది యొకమాఱు నిర్మించినది గాదు. ఒక్కవిషయము నాశ్రయించినది గాదు. ప్రాస్తావిక శృంగార కరుణా శాంతము లనుభాగములతోడి యీకృతి ముద్రితమై జగద్వినుతి గాంచుచున్నదే.

ఇతనిలహరు లన్నియుఁ జిన్నకావ్యములే కాని మృదుమధురవాగ్ధారయు భక్తిరసము నందు స్రవించుచుండును – వానిలో మొదటి సుధాలహరి సూర్యస్తుతిరూపము కరుణాలహరి విష్ణుస్తవరూపము లక్ష్మీలహరి శ్రీస్తవాత్మకము. అమృతలహరి యమునాప్రార్థనాత్మకము. పీయూషలహరి, ఇదియే గంగాలహరి సకలదేశవ్యాప్తము. ఇది యితని కడపటికృతి యని ప్రసిద్ధి- అసఫవిలాస మొకయాఖ్యాయిక. మంత్రి యగు మాధురరాయముకుందుని యానతిచే రచియించిన ట్లితఁడే యిట్లు తెలిపియున్నాఁడు. — "అసఫభావమనఃప్రసాదేన మాధురకులసముద్రేన్దునా రాయముకున్దేనాదిష్టేనసార్వభౌమశ్రీ శహాజహానుప్రసాదాధిగతపణ్డితరాజపదవీవిరాజితేన జగన్నాథే నాసఫవిలాసాఖ్యాయికేయం నిరమీయత"

శహాజహాను చరితమును కొలఁదిగాను దారాశాహాచరితము నెక్కువగాను వర్ణించినది జగదాభరణము. ఈకృతులు రెండును సజీవము లని తెలియుచున్నది — యమునావర్ణనచంపువు పేరు మాత్రమే

రసగంగాధరములోనియుదాహృతవాక్యమునఁ దెలియవచ్చెను గాని యది నిర్జీవ మేమో! ఇంకఁ బ్రాణాభరణము — పోషకాంకితము లైన కృతులలో నిదిమాత్రము ముద్రితమై వ్యాప్తికి వచ్చినది. కామరూప దేశాధిపతి యగుప్రాణనారాయణుని కిది యంకితము. ఇది యొకచిన్న యలంకారగ్రంథము. ఇందలి యేఁబదిపద్యములు నూటొక్కయలంకారమునకు లక్ష్యములు గానున్నవి. దీని కితఁడే టీక వ్రాసెను- ఇందలితుది మాట యిది—

"సంతుష్టః కమతాధిపస్య కవితా మాకర్ణ్య తద్వర్ణనం
శ్రీమత్పణ్డితరాజపణ్డితజగన్నాథో వ్యథాసీ దిదమ్"

ఇందు మొదటి రెండుశ్లోకములందు నానాఁటివిద్వాంసుల యసూయను, మహోన్మత్తు లైనరాజులయౌదాసీన్యము నిట్లు వర్ణించియున్నాఁడు.

"విద్వాంసో వసుధాతలే పరవచఃశ్లాఘాసు వాచంయమాః,
భూపాలాః కమలావిలాసమదిరోన్మీలన్మదాఘూర్ణితాః"
ఆస్యే ధాస్యతి కస్య లాస్య మధునా ధన్యస్య కామాలస
స్వర్వామాధరమాధురీ మధరయన్ వాచాం విలాసో మమ"
"నిద్రాణైవ గుణజ్ఞతా సముదితో భూయా నసూయాభరః
కాలో ఽయం కలి రాజగామ జగతీలావణ్యకుక్షింభరిః,
ఏవం భావనయా మదీయకవితే! మానం కి మాలమ్బసే!
జాగర్తు క్షితిమణ్డలే చిర మిహ శ్రీకామరూపేశ్వరః"

"విద్వాంస ఇత్యాది-ప్రాయదర్శనాభిప్రాయ మేతత్, తేన సహృదయై ర్న మనా గపి విమనాయితవ్యం" అని యించుక సమర్థించినా, యిందు నాఁటియనుభవమును ప్రదర్శించె ననక తప్పదు. మఱియు నీమాటలనుబట్టి యితఁడు ఢిల్లీసంస్థానమం దుండియు సత్కారాపేక్షతో నితరరాజులసభకుఁ బోవుచుండెడివాఁ డని తెలియనయ్యెడి. ఇఁక.

ఇతనివిమర్శనకృతులు చిత్రమీమాంసాఖండనము, మనోరమా కుచమర్దనము. ఇందు మొదటివానినిగూర్చి కొంత తెలిసికొని యున్నాము. తక్కినది తరువాతఁ దెలియఁగలదు. రెండవది సుప్రసిద్ధ మహావైయాకరణుఁడును సిద్ధాన్తకౌముది నిర్మించి విద్యార్థులయజ్ఞానాంధకారము నణఁచినవాఁడు నగుభట్టోజీదీక్షితులకౌముదీవ్యాఖ్య యగు మనోరమమీఁది విమర్శనము. ఆదీక్షితులు మనకవిగురు వగువీరేశ్వర పండితునితండ్రి యైనశేషంకృష్ణపండితునిశిష్యుఁడు గావుననితఁడు వార్ధకములోనున్నయతనిని చక్కఁగా నెఱుఁగు ననుట సత్యము. అతఁడు తన మనోరమలో గురువుగారిప్రక్రియాప్రకాశములోనికొన్నిమాట లెత్తుకొని దూషించెను. అందుకుఁ గినిసి యితనిగురుపుత్త్రుఁ డామనోరమను ఖండించెను. అయినా,అతనిపై జిగీషఁ బూని యితఁడును మనోరమాకుచమర్దన మనుపేరఁ దత్ఖండనము రచియించెను. ఇది నాటినుండియుఁ బ్రచారములో నున్నది. ముద్రిత మైనది. ఆగురుద్రోహి గర్వ మణఁచుచున్నా నన్నయితనిప్రతిజ్ఞావచన మిది.

"లక్ష్మీకాన్తపదామ్భోజ మానమ్య శ్రేయసాం పదమ్,
పణ్డితేన్ద్రో జగన్నాథః స్యతి గర్వం గురుద్రుహామ్"

ఇట్లు సాహిత్యవ్యాకరణశాస్త్రములం దిద్దఱుదీక్షితులను నిరుత్తరులను జేసినయితనిశాస్త్రస్వాతంత్ర్యప్రతిభావిశేషము లసదృశములు గదా! ఇఁకఁ బండితమండలి నంతను వశీకరించుకొన్నయితని రసగంగాధరము, రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్య మిత్యపూర్వారంభము-ముద్రిత మైన యీకృతిరాజము సుమా రయిదువందలపుటలగ్రన్థము. ఇందు మొదటి నూటతొమ్మిదిపుటలు రసనిరూపణాత్మక మైనప్రథమాననము. ద్వితీయాననములో నించుకవ్యంగ్యనిరూపణము, పిదప నలంకారనిరూపణము గనవచ్చును. కాని, యది యుత్తరాలంకారవివరణము పూర్తికాకుం

డఁగా నాఁగిపోయినది. దీనినిబట్టి పంచానన మగునీకృతిలోనితరువాతి గ్రంథము నష్ట మైన దని కొంద ఱూహించుచున్నారు. వార్ధకములో రచియింప నారంభించినయీగ్రంథము పూర్తికాకుండఁగాఁ బండితరాజు పరలోకగతుఁ డయ్యెనని కొందఱు భావించుచున్నారు. "రసగంగాధరము తరువాతనే చిత్రమీమాంసాఖండనము పుట్టినది. అప్పయ్యదీక్షితులపై ద్వేషముచే నతనిచిత్రమీమాంస ననుకరించి రచియింపఁబూనినయీగ్రంథము నతఁడు చిత్రమీమాంసను నడుమ విడిచినట్లే యితఁడును నడుమనే విడిచిపెట్టె[1] నని కొందఱు తలంచుచున్నారు. ఎవ రెట్లూహించినను, తరువాతిగ్రంథ మింక దొరకు నన్నయాశ లేదు గాని యిట్లు త్రివిధముగా నున్నయీయభిప్రాయములతత్త్వ మెట్టిదో యొకింత ముచ్చటింతము.

ఆకాలమున దక్షిణాపథమునందలి పెద్దపండితులలో గొప్ప పేరు తెచ్చుకొని యుత్తరవయస్సు నందియున్నవిద్వత్కవి అప్పయదీక్షితులు చంద్రగిరిలో వేంకటపతిరాయలయాస్థానమందున్నాఁ డని వెనుకఁ జదివియున్నాము. ఉత్తరాపథమందలి గొప్పవిద్వాంసులలో గణుతికెక్కి మంచియౌవనమున నున్నయీవిద్వత్కవి జగన్నాథపండితుఁడు ఢిల్లీలో జహంగీరునాస్థానమం దున్నాఁడని యతనివిజయములను వర్ణించినరసగంగాధరముతుద నున్నయీక్రింది శ్లోకమే చెప్పుచున్నది—
ఇందలి నూరదీనురాజు జహంగీరు—

"శ్యామం యజ్ఞోపవీతం తవ కిమితి? మషీసంగమా త్కుత్ర జాతః,
సోఽయం శీతాంశుకన్యాపయసి కథ మభూ, త్తజ్జలం కజ్జలాక్తమ్,
వ్యాకుప్యన్నూరదీనక్షితిరమణరిపుక్షోణిభృత్పక్ష్మలాక్షీ
లక్షాక్షీణాశ్రుధారాసముదితసరితాం సర్వతః సంగమేన"

1. చూ. కావ్యమాలాముద్రితరసగంగాధరపీఠిక.

ఈపండితు లిద్దఱును విజిగీషువులు, ఒకరివిద్వత్త్వమహత్త్వము లొకరు వినుచున్నారు. ఇరువురు నలంకారశాస్త్రనిష్ణాతులు. అందు సాభిమానాభినివేశ మితరికి హెచ్చు. వీరిచిత్రమీమాంసా రసగంగాధరములలో నేది ముం దారంభ మయ్యెనో నిర్ణయింపరాదు గాని, కొంచెమెచ్చుతక్కువగా రెండును సమకాలను లనియు, అక్కడ నుదయించుచున్నచిత్రరూపము నితఁ డిక్కడఁ జూచుచున్నాఁ డనియు రసగంగాధరావతారికయే సూచించుచున్నది:—

"పరిష్కుర్వ న్త్వర్థాన్ సహృదయధురీణాః కతిపయే
తథాపి క్లేశో మే కథ మపి గతార్థో న భవితా,
తిమీన్ద్రాః సంక్షోభం విదధతు పయోధేః పున రిమే
కి మేతే నాయాసో భవతి విఫలో మన్దరగిరేః ?"

ఈసవినయస్వగ్రంథప్రాశస్త్యసూచనము తననాఁ డాలంకారికమహాకృతులు నిర్మించుచున్నవారిని దలఁచుకొని చేసిన దని భావింపఁదగును. అపు డుదయించుచున్నది చిత్రమీమాంసయే. దానిని జూచి యందలికొన్నిదోషములను దనరసగంగాధరములో నుద్ఘాటించినట్లితఁడు చిత్రమీమాంసాఖండనావతారికలో వ్రాసినయీక్రిందిమాటలే వక్కాణించుచున్నవి.

"రసగఙ్గాధరే చిత్రమీమాంసాయా మయోదితాః,
యే దోషా స్తే ఽత్ర సంక్షిప్య కథ్యన్తే విదుషాం ముదే"

"సూక్ష్మం విభావ్య మయకా సముదీరితానా
మప్పయ్యదీక్షితకృతా విహ దూషణానాం.
నిర్మత్సరో యది సముద్ధరణం విదధ్యా
ద స్యాహ ముజ్జ్వలమతే శ్చరణౌ వహామి"

ఈరెండుకృతు లొక్కమాఱే పుట్టుచు వచ్చె ననుటకును, పుట్టినంతచిత్రమీమాంస నితఁ డపుడే ఖండించె ననుటకును సాహిత్యశాస్త్ర

పారీణతయందలి యితనియాత్మవిశ్వాసమునకు నీవ్యాజవినయముతోడి ప్రతిజ్ఞావచనములే చాలును. ఇతనిఖండనముతోనే చిత్రమీమాంసా రచన మాఁగిపోయిన దని దానితుదనున్నదీక్షితుని యీక్రిందిమాటయే చాటుచున్నది.

" అప్యర్ధచిత్రమీమాంసా న ముదే కస్య మాంసలా?
అనూరు రివ తిగ్మాంశో రర్ధేను రివ ధూర్జటేః"

దీనినిబట్టి మనకవి మంచియౌవనదశలోనే యీకృతినిర్మాణము నకుఁ బూనుకొనెను గాని, వార్ధకములోఁ గా దనుట స్పష్టము. ఇఁక, పైమూడవయభిప్రాయము చూతము. నిజముగా నిపుడు లభించినరస గంగాధరగ్రంథ మంతయుఁ జిత్రమీమాంసాఖండనమునకుఁ బూర్వమే సిద్ధమై యంతటితో నాఁగిపోయినచో, దీక్షితులు చిత్రమీమాంసకు స్వస్తి చెప్పి తరువాత రచియించిన [1] కువలయానందలక్షణముల నంతకు మున్నె సుమారైదేండ్లనాఁడు ముగించినరసగంగాధరములో నీజగ న్నాథుఁ డెట్లు విమర్శింపఁగలుగును? [2] శహజహానునాఁడో దారాశాహ నాఁడో నిర్మించినతనప్రాణాభరణములోనిశ్లోకమును, "కిం బ్రూమ స్తవ వీరతా" మిత్యాదికము నప్పటికి ముప్పదియేండ్లక్రిందట విడిచిపెట్టినతన రసగంగాధరములో నె ట్లుదాహరింపఁగలుగును?[3] ఇది సంభావ్య మేనా? పోనిండు. రసగంగాధరరచన మంతటితో మానుకొనువాఁ డారంభించిన యుత్తరాలంకారమును మఱినాలుగుమాటలతో ముగింపక, యుదాహ రించుచున్నశ్లోకము పూర్తిగా వ్రాయక యకస్మాత్తుగా విడిచి పెట్టునా [4] జహంగీరుపాలనముతరువాత సుమారు ముప్పదియైదేండ్లు జీవించిన యీనిశ్చలకార్యదీక్షుఁడు.

1. కువలయానందరూపకప్రకరణే-చిత్రమీమాంసాయాంద్రష్టవ్యమ్.

2. రసగంగాధరే-కువలయానన్దకృతోక్తమ్. ౩౪౩ కువలయానన్దకారాస్తు-౪౭౪-ఇత్యాది. 3. ప్రసాదలక్షణముక్రింద-౧౬. 4. కోపావనస్త్రీలోక్యాం...౧౨౨.

"రసగంగాధరనామా సందర్భో ఽయం చిరం జయతు"

అనుచు శాశ్వతయశస్సు నపేక్షించి యారంభించినయీమహత్తరకృతిని పూర్తి గావింపక వదలునా? గ్రంథవిస్తర మెందుకు? బుద్ధిస్థమైనపంచాననాత్మక మగుగ్రంథము నితఁడు మెల్లగా నావిష్కరించుచుఁ బోయినాఁడనియే మనము విశ్వసింతము- ఆగ్రంథ మెపుడు పోయినదో, ఎట్లు పోయినదో, కాలగర్భమున విలీన మైనది. ఈపండితరాజువెనువెంటనే వ్యాఖ్య యారంభించిననాగేశభట్టునకుఁ గూడ నది లభింపకపోవుట విషాదకరమే కాదు, అత్యాశ్చర్యకరము—దేశదేశముల రసతత్త్వజిజ్ఞాసువులకు రసస్వరూపము ప్రదర్శించినదీనిమహత్త్వము వర్ణనాతీతము. ఇఁకనిక్కడ నొక్కమాట—ఇందు దాయాలక్షణముల కుదాహరింపఁబడినశ్లోకము లన్నియు నితనిసుధాలహరీప్రాణాభరణభామినీవిలాసాదులలోనివే గాని యందన్యుని దొక్కటి లేదు. ఇందు కితనిమాట యిది—

"నిర్మాయ నూతన ముదాహరణానురూపం
 కావ్యం మ యాత్ర నిహితం న పరస్య కించిత్,
 కిం సేవ్యతే సుమనసాం మన సాపి గంధః
 కస్తూరికాజననశక్తిభృతా మృగేణ?"

ఇ త ని మ త ము.

ఈపండితరాజు పూర్వకర్మవశమున జాతిభ్రష్టుఁ డైనను మతభ్రష్టుఁడు కాఁడు. శుద్ధాద్వైతుఁడు. అందును విష్ణుభక్తుఁడు సూర్యోపాసకుఁడు. ఇందు కితనికృతులలోనిమాటలే ప్రమాణము:—

"శుద్ధం బ్రహ్మాలవాలం ప్రకృతిశబలితం యస్యమూలం కరాస్తత్-సుధా
"సాయం ప్రాతశ్చ సంధ్యాంజలి మవనిసురా స్సంప్రయచ్ఛన్తి యస్మై
తస్మై కస్మై చిదేత స్మమ పరమహాసే దేవతాయై నమో ఽస్తు

"పశే నిత్యం మాత ర్గుణమయి పరబ్రహ్మమహిషీ!
జగన్నాథ స్యాకర్ణయ మృదులవర్ణావళి మిమామ్" లక్ష్మీ—
"ఆధివ్యాధిజరాపరాహత యది క్షేమం నిజం వాంఛసి
శ్రీకృష్ణేతిరసాయనం రసయ రే! శూన్యైః కిమన్యైః శ్రమైఃకరు—
"ద్వారం నిర్వృతిసద్మనే విజయతే కృష్ణేతి వర్ణ ద్వయమ్"
"మదీయ మతిచుంబినీ భవతు కాపి కాదంబినీ" రస—
"నామం నామం ఘనశ్యామం ధామ తామరసేక్షణమ్" చి. ఖం—
"పురాతనానాం వచసా మగోచరం, మహేశితారంపురుషోత్తమంపతిం
అపాస్య తం త్వాం నిరపత్రపాసతీ, సతీ పతి ర్మే కథ మన్య మేష్యతి"
"సోఽయం సర్వాంతరాత్మా తవ దిశతు తరాం వాసరేశః శివాని"
"విహాయ సంసారమహామరుస్థలీ మలీకదేహాదిమిలన్మరీచికామ్"
మనోమృగో మే కరుణామృతాంబుధే విగాహను మీశ! త్వయి గాఢ
మీహతే"

ఇతనిభక్తిజ్ఞానవైరాగ్యములకును మనోహరపద్యకవితకు నివి చాలును. ఇంక నిపుడు నాకుఁ దెలిసినయొకనూత్నవిషయము.

"మొగలాయిరాజ్యతంత్రము నడపించినమంత్రులలో నితఁడొక విద్వన్మంత్రి. షాజహాన్ దారాశాహాలసభలలోనున్న సంస్కృతపండితులలో ప్రధానుఁడే కాక యితఁ డందలిసంగీతవిద్వాంసులు ముగ్గురిలో నొకఁడు. జగన్నాథపండితునిగానమునకు మెచ్చి షాజహానుప్రభు వతనిని వెండిరూపాయలతో తూపించెను. ఆ ౪౫౦౦ రూప్యములు నతని కిచ్చెను. పండితరాజు కొన్నిహిందూస్తానీరాగములను కర్ణాటకపక్కికి మార్చి కర్ణరసాయనముగా పాడుటయే తులాభారగౌరవమునకు మూలము" ఈవిషయము పాతకాగితములవల్లను, శ్రీరాజాసర్ శౌరీంద్రమోహనఠాకూరు రాంగ్లభాషలో రచియించినసంగీతశాస్త్రసం

బంధివ్యాసములవల్లను దెలిసినదఁట. ఈయంశములను ధ్రువపఱచుచు, ఆతాకూరు పేర్కొన్న జగన్నాథుఁడు పండితరాజే యని విష్ణునారాయణ భట్టుభాయ్ ఖండేగారును కవిరంజనకనుంగోగారును వ్యాసములు నిర్మించి రఁట[1] భామినీవిలాసములో నున్నయీక్రిందిశ్లోకపాదము పండితరాయలసంగీతశాస్త్రవైదుష్యము నించుక సూచించుచున్నట్లున్నది.

"యథా తానంవినా రాగో, తథా మానం వినా నృపః,
యథాదానం వినాహా స్త్రీ, తథా జ్ఞానం వినాయతిః

## సుందరదేవుఁడు

ఢిల్లీపురసమీపగ్రామవాసియైన యీవిద్వాంసుఁడు శా.౧౫౭౦ ప్రాంతమువాఁడు. శా. ౧౫-౧౬ శతాబ్దులలోని సంస్థానాధీశుల సభలలోనికవుల చాటుశ్లోకములను సంగ్రహించి యొకపద్యసంకలన గ్రంథము సమకూర్చినవాఁడు. విశేషించి మహమ్మదీయ ప్రభువులను, అక్బరు జలాలదీను నైజామ్షహా షహాజహాన్ మొదలగువారిని ప్రశంసించినపద్యము లం దెక్కువగా నున్నవి. అందు, ఉరుదుపదములు ప్రయోగించినయొక శ్లోక మిది:—

" జీమీ కంపతి బిభ్యతి ప్రతివనం బీబీ గనీమప్రజా,
స్యాగ్రస్య ప్రతనోతి చ స్ఖలనతాం మారా త్ప్రభు ర్భారతః,
దర్యావాః ప్రచలన్తి వీచినివహై ర్ధూళీభి రాప్తాబభా,
అస్థానే ప్రతిహన్యతీ తవ చమూ యానే ఉభిజానే ప్రభో!"

అక్బరీయకాళిదాసు అక్బరును స్తుతించినపద్య మిది:—

" వీర! త్వం కార్ముకంచే దకబర! కలయ స్యాగ్రటంకారఘోషం,
దూరే సద్యః కలంకా ఇవ ధరణిభృతో యాన్తి కంకాలశేషాః,

1. చూ. శాంతిపత్రిక. 1948-మేయి-10 సోమవారము.

శంకాపన్నశ్చ కింకారణ మితి మనసా భ్రాన్తి పంకాయితేన,
త్యక్త్వా హంకార మంకా ద్విసృజతి గృహిణీం కించ లంకాధినాథః
ఇది మహాజహాఁ ప్రశంస:—

" భూభృన్మౌళితటీషు వర్షతి మహాధారాధరే౽స్మిన్నసౌ,
జాతా భూమిసరస్వతీ విజయినీ కల్లోలినీ పావనీ,
శ్రీమత్సాహిజహా బ్రవీమి తదిదం మాహాత్మ్య మస్యాః కథం,
యస్యాం మజ్జతి పంకజీయతి శివ స్తన్మూర్ధ జే లీయతే "

శా. ౧౪౨౦ మొదలుగా రేవారాజ్య మేలినవీరసింహ, రామ చంద్రప్రభువుల నక్బరీయకాళిదాసాదులు స్తుతించినశ్లోకము లిందు గలవు. శా. ౧౪౬౨ మొదలుగా ౧౪౭౭ వఱకు రేవామండల మేలిన వీరభానురాజునాదరము గాంచిన భానుకరుఁడు మోహనదాసు మొద లగుకవులశ్లోకము లిందు గలవు. ఇది యొకవిధముగా నప్పటి కవిరాజ చరిత్ర యనఁదగి యున్నది. కాని, ఇది ముద్రితము కాలేదు.

# అభినవకాళిదాసు

భాగవతచంపు వనుప్రసిద్ధకావ్యము నిర్మించినయితని కిది బిరుద నామము. నిజ మైనపేరుమాత్ర మెవరికిని దెలియదు. ఎవరికో యన నేల ? దీనికి వ్యాఖ్యానము రచియించిన మోఁకుగుండం అక్కయ్య సూరి, యీకవి వెల్లాలవంశీయుఁ డనెను గాని పేరుచెప్ప లేకపోయి నాఁడు. కాని యీమాటవల్ల నీకవి యాంధ్రుఁ డని తెలిసినది. వ్యాఖ్యాత యాంధ్రుఁడే కదా ! ఇంకనో యీకృతి కాంధ్రలోకమం దున్నవ్యాప్తి యింకెందును లేదు. పంచకావ్యములు చదివినవిద్యా ర్థులు తరువాతరామాయణభారత భాగవత చంపువులు క్రమముగా తప్పక చదువుట మనదేశములో నాచారముగా నుండెడిది:—

భారతచంపూనిర్మాతయైన అనంతభట్టునకు నితనికి కవిత్వస్పర్థ యుండెడి దనియు, అతఁడు ముందు వ్రాసినభాగవతచంపువు నణఁగఁ ద్రొక్క నితఁడు భాగవతచంపువు నిర్మింపఁగా నిది ఏద్వన్నుతి, గాంచిన దనియు, పిదప నతఁడు భారతచంపువు రచియింపఁగా దానినిగూడ దిగఁద్రొక్క నితఁడు భారతచంపువు నిర్మించెను గాని, యితనిది పైకి రాలే దనియు నొకకింవదంతి కలదు. దీనిని స్థిరపఱుచునాధారములేదు గాని, వీ రిద్దఱు సమకాలమువా రనవచ్చును—ఇది యిటు లుండ:—

ఇతనిశిష్యుఁ డొకఁ డితనివలెనే బిరుదునామముతో నే కనఁబడు చున్నాఁడు. అతఁడు కవికుంజరుఁడు. అతఁడు రాజశేఖరచరిత్ర యను నొకకృతి నిర్మించెను. అందలిముఖ్యకథ యిది.

" విద్యానగరము పాలించురాజశేఖరుఁ డనుప్రభువుకొద్ద చోళ దేశమునుండి వచ్చినదుర్జయుఁ డాస్థానకవిగా నుండెను. అతఁడు మంచి పండితులకు గొప్పకవులకు రాజదర్శనము కానీయకుండెను. అట్టియెడ మనయభినవకాళిదాసు మాఱుపేరు పెట్టుకొని "నేను రఘువంశములో మూఁడుసర్గలు ప్రక్రియాకౌముదిలో సంధిపరిచ్ఛేదము చదివినాను" అని చెప్పఁగా, దుర్జయుఁడు రాజదర్శనము చేయించెను. అపు డచ్చటి మోసము రాజునకుఁ దెలిపి యితఁడుదుర్జయునిసభనుండి తొలగింపఁ జేసెను.

ఈకథనుబట్టి యితనికాలమున రామచంద్రాచార్యుని ప్రక్రియా కౌముది పఠనపాఠవ్యాప్తి గాంచి యున్న దనవచ్చును గదా! దీనినిబట్టి యితఁడు శా. ౧౫౫౦ ప్రాంతమువాఁ డగు నని యూహించుచున్నాను.

ఈచరిత్రలో సుబుద్ధి రసికశేఖరసంవాదమున మనకవి కవిత్వ మహత్త్వ మిట్లు వెల్లడియగుచున్నది.

" సుభాషితామృతాస్వాదసాదరో ఽస్మి చిరా దహమ్,
పురిపూరయ కామం మే సఖే రసికశేఖర!"

" రాజశేఖరభూపస్య సభాయాం మధురా గిరః,
నవీనకాళిదాసాదిగదితాః శ్రోతుమర్హసి"

ఇతనిభాగవతచంపు వాఙ్ముల్లాసములకృతి. కవిత్వము రసవంత మగుట విదితము. ఇతనికృత్యంతవాక్యమిది.

" తస్యాసౌ నవకాళిదాసవిదుష ష్షష్ఠోఽపి కావ్యామృతే,
చంపూనామని ధీమతాం కృతసముల్లాసో విలాసో ఽగమత్"

ఈక్రిందిది మంగళాచరణపద్యములలో నొకటి.

" ప్రాలేయాచలభాగధేయభవనం కల్యాణజాలాస్పదం
జాటాటీరతపఃఫలం కిలకిలల్లీలానుకాహ్లాదితమ్,
బిభ్రాణం పరిమాళి కంచన సుధాధారాధరం సాదరం
యన్మే భద్రమముద్రమాకలయతా మానందకందం మహః"

## అనంతభటు

ఇతఁ డభినవకాళిదాసుసమకాలికుఁ డని యతనిప్రతిస్పర్ధి యని యింతకు మున్ను చదివియున్నాము. ఇతఁడు నిర్మించిన భాగవత భారతచంపువులలో రెండవది వ్యాప్తికి వచ్చినది. ప్రతిస్పర్థలో నిర్గతికిని జయాపజయములు సమాన మైనవి. ఇతనిభారతచంపువునకు, కురవి రామలింగశాస్త్రి మల్లాదిలక్ష్మణస్వామి నారాయణస్వామి కుమార తాతాచార్యుఁడు నరసింహాచార్యుఁడు ననుతెలుఁగువారు వ్యాఖ్యాత లగుటనుబట్టియు దీని కాంధ్రదేశమందును తత్ప్రాంతములందు నెక్కువ వ్యాప్తి యుండుటనుబట్టియు నితఁ డాంధ్రుఁ డనియు శా. ౧౫౫౦ పైనున్నవాఁ డనియు భావింపవచ్చును.

ఇతనిచంపువు పన్నెండు స్తబకములగ్రంథము. కవిత్వము పటువుగాను సరసముగానునుండును. వస్తునిర్దేశరూప మైనగ్రంథారంభ మిది_

"తుహినకిరణవంశస్థూలముక్తాఫలానాం
విపులభుజవిరాజద్వీరలక్ష్మీవిభూష్ణామ్,
హసితసురపురశ్రీ రస్తి సా హస్తినామా,
రిపుజనదురవాపా రాజధానీ కురూణామ్"

గ్రంథాంతమందలి ధర్మరాజగుణవర్ణన మిది:—

"రాజ్ఞాం మౌళిపరంపరాం చరణయోః పాణౌ ప్రదానశ్రియం,
బుద్ధౌ రాజనయోదయం హృది కృపాం సత్యం రసజ్ఞాంచలే,
బాహౌ సాగరమేఖలాం వసుమతీం మస్తే కిరీటం ముదా,
కుర్వన్ ధర్మతనూభవ శ్చిర మసౌ గోపాయతి స్మ ప్రజాః"

ఈకవి తెలుపుకొన్న నిజవిషయ మిది:—

"ఆచాన్తవైరియశసా మమృతోర్మిళానాం
వాచా మనంతసుధియో వసుధైవ మూల్యమ్"

"దిగంతరలుఠత్కీర్తి రనంతకవికుంజరః
ప్రాణైస్తుల్యం సరస్వత్యాః ప్రాణైషీ చ్చంపుభారతమ్"

ఈమాటలలో నితనికి నభినవకాళిదాసునకు స్పర్ధ యున్నట్లు సూచిత మగుచున్నది. జనశ్రుతిలోఁ గొంత సత్య ముండును.

## వేంకటేశకవి

ఇతఁడు కాంచీపురమునకు దగ్గఱగా నున్న అరసనిపాలెములో నివసించినవాఁడు. ఆత్రేయగోత్రుఁడు. ఈకవి తనపూర్వపురుషులను తన జననాదివృత్తాంతమును తనకృతులలో నిట్లు తెలుపుకొనెను.

"నృసింహపౌత్రపౌత్రో ఽహం, తురీయః పురుషోత్తమాత్,
వేంకటేశగురోః పౌత్రః శ్రీనివాసగురో స్సుతః,
కలివర్షేషు వృత్తేషు శైలనందరసాబ్ధిషు ౪౬౯౭.
శాకే... చైత్రేవారుణభే ఽభవమ్..."

" ధృతితిథిమితే శకాబ్దే జనిమా నుపకాంచి వేంకటేశకవిః"
" గజశైలతిథీతుల్యే౧౫౭౮ శాలివాహశకే సతి,
వేంకటేశేన విహితః శ్రీరామయమకార్ణవః"
" వేదపూర్ణగుణపావకపద్యం, వ్యోమవహ్ని సమసర్గ ముదారమ్
కావ్య మంగగుణశైలయుగాబ్దే, వేంకటో ఽకృత కలౌకవివర్యః,"

శా. శ. ౧౫౧౮ లో నితఁడు జన్మించి ౧౫౫౭ లో రామచంద్రోదయమనుముప్పదిసర్గలమహాకావ్యమును ౩౩౦౮ పద్యములతో నిర్మించె ననియు శా. ౧౫౭౮ లో యమకార్ణవ మనుకృతి నిర్మించె ననియు తెలియుచున్నది.

ఇతఁడు శ్రీవైష్ణవుఁడు. యతిరాజదేశికుని, అతనికుమారుఁ డైన పద్మనాభుని రామానుజాచార్యుఁడు మొదలగువారి నితఁడు రామచంద్రోదయమునవతారికలో స్తుతించియున్నాఁడు.

" యతిరాజాహ్వయం వందే దేశికం దివ్యదర్శనమ్,
యతిరాజగురో స్సూనుం పాషండమతఖండనమ్,
ఆచార్యం పద్మనాభాఖ్యం భవసంతారకం భజే,
నమో రామానుజాచార్యాయ వేదాన్తార్థప్రదాయినే
ఆత్రేయపద్మనాభార్యసుతాయ గుణశాలినే"

ఇతఁడు శ్రీరామభక్తుఁడు కాశ్యాదితీర్థయాత్రలు సలిపినపావనచిత్తుఁడు. తనకృతులురెంటికి తానే టీకలు రచియించెను. తాను రచియించినకృతుల నిట్లు పేర్కొనెను.

" శ్రీరామచంద్రోదయసంజ్ఞ యాద్యం, కావ్యం ద్వితీయం యమకార్ణవాఖ్యమ్,
దైవజ్ఞతుష్ట్యైతు సుధీవిలాస, స్తన్నందనాఖ్యం చ కృతి ర్మదీయా"

ఈనాలుగుకృతులు నముద్రితములై పడియుండుట శోచనీయమే. కవిత్వమురుచి చూచుటకీ సూర్యవర్ణనము.

గుణజాలనిధే స్తస్య తైక్ష్ణ్య మేకం న దూషణమ్,
లక్ష్మీసుధానిధానస్య విషం జలనిధే రివ,
ప్రాచీసీమ న్తసిన్దూరం యన్మహస్సు ప్తబోధనమ్
కాన్తాకుతూహలాక్రా న్త శ్చక్రవాకో ఒభినన్దతి,
య దా ధత్తే ముముక్షూణాం మార్గే సంసరణ త్యజామ్,
ఆవిరంశ్చ ప్రపఞ్చస్య కా కథా గతికల్పనే ?,
ఆదాయ ప్రాణినాం ప్రాణా న స్తం యాతో దినే దినే,
సహస్రప్రాణభృతాం ప్రాత్తై రుదయం యో ఒధిగచ్ఛతి "

# నీ ల కంఠ దీ క్షి తు లు

ఇతఁ డొకపే రొందినవిద్వత్కవి. అప్పయదీక్షితులతమ్ముని మనుమఁడు. భూమిదేవీనారాయణదీక్షితులసుతుఁడు- గోవిందదీక్షితులతనయుఁ డగువేంకటేశ్వరముఖిశిష్యుఁడు పెత్తాతగారివద్దకూడా కొంత విద్యనభ్యసించినవాఁడే. వ్యాకరణాలంకార మీమాంసాన్యాయశాస్త్రములందు మంచినైదుష్య మార్జించినవాఁడు. ఎక్కువగా శివభక్తుఁడు, అనేకాధ్వరకర్త బ్రహ్మవేత్త. ఇతఁడు రచియించినకృతులలో మంచిఖ్యాతి గన్నది నీలకంఠవిజయచంపువు- దానితుద వ్రాసికొన్న యీ క్రిందిమాటనుబట్టి యితఁడు శా. శ. ౧౫౫౭ నాఁటికి విద్వాంసుఁడై ప్రౌఢకవియై విలసిల్లినట్లు తెలియును.

" అష్టత్రింశదుపస్కృత సప్తశతాధిక చతుస్సహస్రేషు
కలివర్షేషు గతేషు గ్రథితః కిల నీలకంఠవిజయో ఒయం"
ఆసమయము ౪౭౩౮ కల్యబ్దము.

ఈకవి కొంతకాలము మధురలో నొకసామంతరాజునొద్ద మంత్రిగా నుండి మీనాక్షీదేవి నారాధించుచు నచ్చటికి వచ్చువిద్వాం

సుల నాదరించుచు గ్రంథములు వ్రాయుచు సత్కాలక్షేపము చేసినవా డందురు. కలివిడంబనములో రాజసభా యాచక పండితాదులవర్ణనలను బట్టి యతఁ డట్లు రాజునాస్థానమం దున్నవాఁడే యనియు విశేషముగా లోకానుభవము కలవాఁ డనియు తోఁచుచున్నది. ఇతనికి అయ్యా దీక్షితు లనువాడుకపేరు కలదు. తన్నితఁడు శ్రీకంఠుఁ డని చెప్పి కొన్నాఁడు. అప్పయదీక్షితులు శ్రీకంఠునవతార మని తనగురు వని తనచంపువులో నిట్లు తెలిపియున్నాఁడు.

" లీలాలీఢపురాణసూక్తిశకలావష్టంభసంభావనా,
పర్యస్తశ్రుతిసేతుభిః కతిపయై ర్లీనేతే కలౌ సాంద్రతాం,
శ్రీకంఠో ఽవతతార యస్య వపుషా కల్యాకృత్యాత్మనా వాచ్యుతః,
శ్రీమా నప్పయదీక్షిత స్స జయతి శ్రీకంఠవిద్యాగురుః ".

ఇతని దీచంపువు గాక, శైవపురాణతామసత్వనిరాకరణము హాలాస్యాభ్యుదయము శివలీలార్ణవము గంగావతరణము కలివిడంబనము సభారంజనము అన్యాపదేశశతకము శాంతివిలాసము వైరాగ్యశతకము ఆనందసాగరస్తవము మొదలగున వింకను గలవు. ఇతఁడు తనపెత్తాతగారి చిత్రమీమాంసను విమర్శించుచు పండితరాయలు రచియించిన చిత్రమీమాంసాఖండనముపై ఖండనముగా చిత్రమీమాంసాదోషాధికార మనువిమర్శకృతియు నిర్మించెను. మఱియు నల చరిత మనుపేర నేడంకముల నాటక మొకటి నిర్మించెను. అందలి ప్రస్తావనలో రుక్మిణీపరిణయనాటకము నప్పయదీక్షితులు నిర్మించినట్లును, తనతండ్రి మహావీరచరితనాటకము, సాహిత్యరత్నాకరవ్యాఖ్యయు నిర్మించినట్లు తెలిపియున్నాఁడు.

ఇతనికృతు లనేకములు శివభక్తిబోధించునవే యైనను హృద్యములై దేశమున వ్యాపించినవి. ఇతనికలివిడంబనము కవిపండితవైద్య

దైవజ్ఞమాంత్రికాదులదాంభికత్వమును నవ్వు పుట్టించునట్లు పరామర్శిం
చిన యిది నిజమైనకలివిమర్శన మనఁదగియున్నది¹ ఇందలివి రెండు.

"అనృతం చాటువాదశ్చ ధనయోగో మహా నయమ్,
సత్యం వైదుష్య మిత్యేష యోగో దారిద్ర్యకారకః"
"దైవజ్ఞత్వం మాంత్రికతా భైషజ్యం చాటుకౌశలం,
ఏకైక మర్థలాభాయ ద్విత్రియోగస్తు దుర్లభః"
"యత్ర భార్యాగిరో వేదాః యత్ర ధర్మో ఽర్థసాధనం
యత్ర స్వప్రతిభా మానం తస్మై శ్రీకలయే నమః"

## అతిరాత్రసోమయాజి

నీలకంఠదీక్షితునిసోదరుఁడైన యీకవి శ్రీరామునికుమారుఁడు
కుశుఁడు కుముద్వతిని పెండ్లాడుట యనుకథతో నైదంకములనాటక
ముగా కుముద్వతీపరిణయము రచియించెను గాని, యదివ్యాప్తికి రాలేదు.
ఈనీలకంఠునిమూఁడవకొడుకు గీర్వాణేంద్రదీక్షితులు నిర్మించినశృంగార
కోశమును విలీనమైనది. ఇఁక నితనిసమకాలమువారు.

## కాళహస్తికవి

కామాక్షీదాసుఁ డనఁబడునితఁడు నీలకంఠదీక్షితులకు సమకాలి
కుఁడు వయసున దీక్షితులకంటె పెద్దవాఁడు, అప్పయదీక్షితులశిష్యుఁడు.
ఇతఁడు వసుచరిత్రచంపువు రచియించెను. ఇతని కించుకపూర్వుఁడగు
రామరాజభూషణుఁడు తెలుఁగున వసుచరిత్ర నిర్మించియున్నాఁడు.
అతఁడు చంద్రగిరి నేలినవెంకటపతిరాయలకు భ్రాతయైన తిరుమల
దేవరాయలు కృతిపతిగా దానిని రచియించె ననుట విదితము. తెలుఁగు

1. దీనిని నే నాంధ్రీకరించితిని. ముద్రితమైనది.

వసుచరిత్ర శా. ౧౪౯౦ ప్రాంతమునఁ బుట్టినదిగావున శా. ౧౫౫౭ ప్రాంతమునఁ బుట్టినయీసంస్కృతవసుచరిత్ర దాని ననుసరించె ననుట కవకాశ మేర్పడినది. అది యన్నకాలమునందు, ఇదితమ్మునికాలమందు పుట్టుటకూడా పైయభిప్రాయమును బలపఱుచుచున్నది. తెలుఁగుకృతివలెనే యీసంస్కృతకృతియు నాఱాశ్వాసముల వెలయుచున్నది. కథావిషయముకూడా అదే యనుట క్రిందిశ్లోకముచాలును
"వసుప్రభు ర్వాసవధాతరీత్యా, కోలాహలాద్రిశకుమారికాయాః
గీతోజ్జ్వలాయా గిరిజాభిధాయాః, కల్యాణశాలీతి కథాస్తుపుణ్యా"
దీనినిబట్టి తెలుఁగువసుచరిత్రప్పకాలమందే యెంతటిగౌరవమునకుఁ బాత్రమయ్యెనో తెలియఁగలదు. కాని సంస్కృతవసుచరిత్ర యెందణఁగిపోయినదో!

## నారాయణభట్టపాదుఁడు

నారాయణభట్టాథిరి యనునది యితనినామాంతర మందురు. కేరళదేశమండలి (మలబారు) నీలానదియుత్తరతీరమం దున్న మెప్పున్నూరు అనుపల్లె యితనినివాసము. ఈమాట ఉత్తరమలబారులోని "కటధన" పురపాలకుఁడైన ఉదయవర్మరాజు కావ్యమాలాసంపాదకులకు పంపినకోటివిరహపుస్తకమునుబట్టి తెలియవచ్చినది— మలబారులోని కురుంపత్తూరు మండలమందలి పొన్నానితాలూకాకు చెందిన చందనక్కవుదేవీక్షేత్రమునకు దగ్గఱగా నున్నమెల్పుతూరు గ్రామ మితనినివాసమని మఱియొకపాఠ మున్నది.

ఇతఁడు నంబూద్రిబ్రాహ్మణుఁడు. ఇతనితండ్రి మాతృదత్తుఁ డను మహాపండితుఁడు. ఇతనితల్లి పయ్యూరుపత్తేరి వంశమునకు చెందిన వనితారత్నము. ఇతనిగురు వచ్యుతపండితుఁడు పిసారోటివంశమునకు

చెందినవాఁడు. ఆవంశమునందునికన్యనే యితఁడు పెండ్లాడి, వేదాది విద్యలు నేర్చి గుణవంతుఁడై కాలము గడపుచుండ నితనికి చర్మరోగ మంకురించినది. అందుకు కారణము గురువుగారిదోష మఁట. ఎట్లయిన నేమి? ఇతఁ డారోగము శాంతించుటకై భగవదారాధనమే మంచిదని విశ్వసించి "గురువాయూరు" అనుపుణ్యక్షేత్రమున కేగి శ్రీమన్నారాయణు నారాధించుచు, ప్రతిదినము భాగవతార్థపర మైనయొక శ్లోకము నిర్మించి స్తుతించుచుండెను. ఇట్లాశ్లోకములు వెయ్యి యగు నప్పటి కితనిరోగము శాంతించినది. "ఆయురారోగ్యసౌఖ్యము" లభించినది. ఆశ్లోకములు "నారాయణస్తోత్ర" మనుపేర కేరళ దేశమున నిప్పటికిని భక్తలోకమున పఠనపారవ్యవహారమం దున్నవఁట. ఈశ్లోకసహస్రముకడపటియీక్రిందిశ్లోక మాస్తోత్రగ్రంథముపూర్తి యైనసమయమును తెల్పుచున్నది.

" అజ్ఞాత్వా తే మహత్త్వం య దిహ నిగదితం విశ్వనాథ! క్షమేథాం,
స్తోత్రం చైత త్సహస్రోత్తర మధికతరం త్వత్ప్రసాదాయ భూయాత్
ద్వేధా నారాయణీయం శ్రుతిషు చ జనుషాం స్తుత్యతావర్ణనేన,
స్ఫీతం లీలావతారై రిద మిహ కురుతా మాయురారోగ్యసౌఖ్యమ్ "

ఇందలితుదిపదము "ఆయురారోగ్యసౌఖ్యమ్" ఇందలియక్షరములను కటపయాద్యంకసంకేత రూపమైనవరరుచి వాక్యమునుబట్టి అంకెలుగా మార్చినచో, కలియుగమున నప్పటికి గడచినరోజులు ౧౭౧౨౨౧౦ అగును. ఈరోజులను సంవత్సరములకు మార్చఁగా, కలియుగములో ౪౬౮౦ సంవత్సరములు ఎనిమిదిమాసములు ఇరువది రోజులుగతించిన సమయమున నారాయణీయస్తవము పూర్తి గాంచెనని తెలియవచ్చెను. అనఁగా మూఁడుమాసముల పదిరోజులు తక్కువగా ఆసమయము, శా, ౧౫౧౨ అప్పటి కతఁడు సుమారు ౨౭ సంవ

త్సరములవాఁడు. ఇతఁడాయురారోగ్యసౌఖ్యములతో చిరకాలము జీవించి శా. ౧౫౬౮ ప్రాంతమున దివంగతుఁ డయ్యె నని యీ దేశము వారు రచియించిన యతనిజీవితచరిత్ర చెప్పుచున్న దఁట.

ఈకవి పెక్కుకృతులు నిర్మించెనుగాని యవి వ్యాపించలేదు. భట్టోజీదీక్షితుల సిద్ధాంతకౌముది చూచినపిదపనో లేక చూడక మునుపో యితఁడు ప్రక్రియాసర్వస్వము నిర్మించెనుగాని రామచంద్రాచార్యుని ప్రక్రియాకౌముదికిం బోలె దీనికి పేరు రాలేదు. స్వాహాసుధాకర మనుచిన్నకావ్య మొకటి ముద్రిత మైనది. అందలి దీశ్లోకము—

“రవి రయ మస్తం యాత స్సమాగతో హంత హంత చంద్రో ఽయమ్
యాతి వికాస మసీయం, కుముద్వతీ, కిం విలంబసే భృంగ !

కోటివిరహ మనెడిచిన్నశృంగారకావ్య మొకటి ముద్రిత మైనది దీనిని కేరళదేశీయులు ‘కోడిఅవిరహం’ అందురు. అనగా క్రోష్టృవిరహ మనియర్థము. సంగీతకేతు వనెడిద్విజోత్తముఁడు శృంగారలీల యనెడి యువతిని కామించుట యనేకల్పితకథ యిందు శృంగారప్రధానముగా ౧౦౭ శ్లోకముల వర్ణింపఁబడినది. కవిత్వము రసవంతముగానే యుండును. కామిని కాముకుని హెచ్చరించుచున్నమాట లివి:—

“కామినీ కాముకం ప్రాహ యామినీకాముకాననా”

“యాతప్రాయ మిదం దినం, కమలినీ దీనేయ మాలోక్యతామ్,
నీరంధ్రశ్చ పయోధర స్సచ శశీ దూరే ఽధునా వర్తతే,
విప్రాగారమిదం తటాకసవిధే స్వాయత్త మేతచ్చ తే,
గేహం, తత్ క్షపయ క్షపా మిహ మహాః కార్యాతిపాతో న చేత్”

నారాయణస్తవసహస్రముతో భాగవతకథాంశము లేకాక, భగవద్గీతాదులలోనియంశములు గూడ ప్రశంసింపఁబడినవి. ఇందుకు శ్రీకృష్ణుఁ డర్జును నోదార్చి తత్త్వము తెల్పుట యిట్లు వర్ణింపఁబడినది.

"జిష్ణో! త్వం కృష్ణసూతః ఖలు సమరముఖే బంధుఘాతే దయాళుమ్,
ఖిన్నం తం వీక్ష్య వీరం కిమిద మయి సఖే! నిత్య ఏకో ఽయ మాత్మా
కో వధ్యః కో ఽత్ర హంతా? తదిహ వధభయం ప్రోజ్ఝ్య మయ్యర్పితాత్మా,
ధర్మ్యం యుద్ధం చరేతి ప్రకృతిమనయ దాదర్శయన్ విశ్వరూపమ్"

ఇం దర్జునవిషాద మాదిగా విశ్వరూపసందర్శనాంతభగద్గీతార్థ మిమిడియున్నది— కేరళదేశములోనికటథనదభూపాలుఁ డైన ఉదయవర్మరాజా జీకవిచరితము రచియించి నట్లు కావ్యమాలాపత్రికాధిపతులు తెలుపుచున్నారు.

## ఆలూరి సూర్యనారాయణ కవి

ఇతఁ డాంధ్రుఁడు వాజపేయయాజి గొప్పపండితుఁడు అత్యాశుకవి దివసైకప్రబన్ధకర్త వేలూరునివాసి లింగప్రభువుసాస్థానములోని విద్వత్కవిరత్నము జ్ఞానాంబాయజ్ఞేశ్వరమహాగ్నిచిత్పుత్రుఁడు. ఈమాట లితనియేకదినప్రబంధములోనివే:—

" శ్రీయజ్ఞేశ్వరయజ్వనః సితకరా దాలూరివంశాంబుధేః,
జ్ఞానామ్బా సుషువే య మధ్వరివరం శ్రీసూర్యనారాయణమ్,
తస్య శ్రీమతి లింగయప్రభుసభామధ్యే ప్రతిజ్ఞాకృతః
శ్రీమా నేకదినప్రబన్ధసుకృతౌ సర్గ శ్చతుర్థో ఽజని "

ఇందు పేర్కొనఁబడినలింగయ వెల్లూరిలో రాజుగా నున్నచిన్నబొమ్మభూపాలునితనయుఁడు, చిన్నవీరనాయకునిపౌత్రుఁడు. చినబొమ్మరాజు శా. శ. ౧౫౨౩ ప్రాంతముల వేయించినదానశాసనములనుబట్టి యీకవిపోషకుఁడు లింగయప్రభువు నీకవియు శా. శ. ౧౫౫౦ ప్రాంతమున నున్నవా రని తెలియవచ్చును.

ఇతఁడు లింగభూపాలునిసభలో నొక్కదినమున ననఁగా ముప్పది గడియలకాలములో నొకప్రబన్ధము నిర్మింతు నని ప్రతిజ్ఞచేసి యాప్రకారము సభ్యులు కోరినకథావృత్తములతో భారతకథ సంగ్రహించి నాలుగుసర్గలకావ్యము నిర్మించి యిచ్చెను. దాని కేకదినప్రబంధ మనిపేరు ఈభావము తెలుపు నితనిమాట లివి:—

"నాడీభి ర్దివసస్య నవ్య మచిరా దవ్యాహతోహాస్పదైః,
శబ్దార్థైః ప్రభుసభ్యసమ్మతకథావృత్తక్రమై ర్యంత్రితమ్,
యత్కావ్యం నిరమాయి సంప్రతి మయా తస్మి న్హఠాత్కారతః,
ప్రాప్తం దోష ముపేక్ష్య కేవలగుణగ్రాహీ బుధ స్తుష్యతు"

ఆహా! అట్టియద్భుతప్రజ్ఞ కీవినయోక్తి భూషణ మగును.

కృత్యాదిదేవీస్తుతి యిది:—

"భవతు భూపసభావిదుషాం పురో, విదధతః కృతి మేకదినే మమ,
కుశలదాయి శివే! తవ వీక్షణం, కుశల మున్మిషితేన జగత్కృతా"

ఈయాశుకవి చక్రవర్తికి మహోపాధ్యాయుఁ డన్నబిరుదమున్నది. ఇతఁ డెన్నెనికృతులు నిర్మించియుండును. కాలగర్భమున నిట్టిమహాకవులకావ్యము లెన్ని యణఁగిపోయినవో !!

## చిదంబరకవి

దక్షిణాత్యకవులలో నితఁ డొకఁడు. సాహిత్యకవిత్వములు రెంటను ఘనుఁడు. కౌశికగోత్రుఁడు సూర్యనారాయణయజ్వపౌత్రుఁడు అనంతనారాయణబుధునిపుత్రుఁడు. ఇతనితల్లి వేంకటాంబ, మాతామహుఁడు వేదపురీశ్వరుఁడు. ఇతనియన్న శ్రీనివాసపండితుఁడు. శ్లేషయమకచిత్రకవిత్వము విజృంభించుకాలమున నితఁడు రాఘవయాదవ

పాండవకథలను మూఁడింటిని జోడించి కథాత్రయ మనుపేర త్ర్యర్థి కావ్యము నిర్మించెను. ఇతనిమాట లివి:—

" యజ్వా కౌశికభూషణం సమభవ ద్య స్స్వార్యనారాయణః,
పుత్ర స్తస్య సమః పురందరగురో ర్యో౽ నన్తనారాయణః,
సూనో స్తస్య చిదంబరస్య సుమతేః శ్రీకావ్యరత్నే కృతౌ,
సర్గో రాఘవపార్థకృష్ణచరితే సాఘ ద్వితీయో౽జని "
మాతా వేదపురీశ్వరా ద్బుధమణేః శ్రీవేంకటాఖ్యో౽న్వితా,
జాతా యస్య జగత్ప్రసిద్ధయశసో, యః శ్రీనివాసానుజః,

ఈ వేదపురీశ్వరాధ్వరి ఉత్తరార్కాటుజిల్లాలోని విరించిపుర గ్రామవాసి, మార్గసహాయచరిత మనుకావ్యము నిర్మించినవాఁడు. వాధూలగోత్రుఁడు. ఇతఁడు, యయాతితరుణానందము రోచనానందము ననునాటకములును, ఆచార్యదిగ్విజయ మనెడిశంకరాచార్య చరిత్రమును నిర్మించిన వల్లీసహాయకవివంశములోని పూర్వపురుషుఁడు వల్లీసహాయుఁడు శా. శ. ౧౬౦౦ ప్రాంతమువాఁడు. కావున, వేదపురీశ్వరుఁడును మనచిదంబరకవియు నితనికి పూర్వులై శా. శ. ౧౫౫౦ ప్రాంతమున నున్నవా రగుదురు. చిదంబరకవినివాసము తంజావూరు జిల్లాలోని పాలయూ రని కొంద ఱందురు.

చిదంబరకవి పైకథాత్రయ గాక పంచకల్యాణచంపువు భాగవతచంపువు శబ్దార్థచింతామణి యనుపేరరామకృష్ణకథలు జోడించిన మఱియొకచంపువు చిదంబరవిలాసకావ్యము నటరాజస్తనము శ్లేషచింతామణి మొద లగుకృతు లెన్నో రచియించెను. కాని, యితనివిగాని పైయుద్ధతివిగాని వ్యాప్తి లేక తంజావూరు పుస్తకాగారమునఁ బడియున్నవి. ఇతనికథాత్రయిమొదటిశ్లోక మిది:—

" అస్తి ప్రస్తుతహృద్యమార్గవితతా హస్తిశ్రితాభారతైః,
పూర్ణార్థే పథి మానవై రుచిభృతైః పూర్వాహినీ శైత్యయా,

ప్రాకారైః స్ఫటికోజ్జ్వలాపరిఘయా భాస్వజ్జయోల్లాసిభిః,
భూభృద్భిర్మధురేహ మానసభువా తుల్యైరయోధ్యాపరైః"

ఇతనిచిదంబరవిలాస మైదుసర్గలకావ్యము. దీని కితఁడే వ్యాఖ్య నిర్మించెను. ఒక్కప్రతిచివర నితనియాకింది శ్లోకము గద్యయు నున్నవి.

"ప్రబన్ధకర్తాపి చిదంబరేశ్వర, స్తదర్థహారో ఽపి చిదంబరేశ్వరః,
ప్రవర్తకో ఽప్యస్య చిదంబరేశ్వరో ముదే తదేతత్త్రితయం విపశ్చితామ్.

ఇతిశ్రీ పదవాక్యప్రమాణపారావారపారీణ కౌశిక గోత్రవిశేషక చిదంబరకవివిరచితాయాంచిదంబరకృతేశ్చిదంబరవిలాసస్య వ్యాఖ్యాయా మర్థప్రదీపికాఖ్యాయాం పంచమ స్సర్గః.

# జగన్నాధకవి

ఇతఁ డాంధ్రుఁడేమో యని యూహింపవచ్చునుగాని, కాశీనగరమున నివసించినవాఁ డగుట స్పష్టము. ఇతని తల్లి అక్కమ్మ, తండ్రి నారాయణదైవజ్ఞుఁడు. ఇతఁడు రచియించినది జ్ఞానవిలాస మనెడియెనిమిదిసర్గలవేదాంతగ్రంథము.

"అక్కా జగన్నాథ మసూతమాతా, పితా చ నారాయణదైవవిద్యమ్,
తన్నిర్మితే జ్ఞానవిలాసకావ్యే సర్గోఽయ యా వష్టమఉత్తమత్వామ్"

నాగరలిపిలో వ్రాయఁబడినదీనికాగితములప్రతి యొకటి తంజావూరుపుస్తకాగారమున (౩౭౯౨) నున్నది. దానికడపటిపుటమీఁద "ఇదం పుస్తకం కాశీతః ధుండిరాజయజ్వనా ప్రేషిత మపూర్వ మితి" అనువాక్య మున్నది. ముద్రారాక్షసవ్యాఖ్యాతలలో నొకఁడును శహాజీమహారాజుసభలో కొంతకాల మున్నవాఁడు నయినయీధుండిరాజు శహాజీమహారాజున కీపుస్తకము పంపినట్లు పైవాక్యమువల్ల విదితమైనది. శహాజీరాజ్యకాలము, శా. ౧౬౦౬–౧౬౩౨. కావున ధుండిరాజపూ

ర్వమనుకొన్నయీకావ్యము శా. ౧౫౬౦ ప్రాంతమునఁ బుట్టియుండు నని భావింపవచ్చును.

ఈకవి మంచిసాహిత్యవేత్త. వేదాంతశాస్త్రమున విశేషకృషి సలిపినశాంతచిత్తుఁడు. ఇతనియీకావ్యము ప్రబోధచంద్రోదయాదుల వంటిది. ఇందలిప్రధానవిషయము నితఁడే కావ్యార్థసంగ్రహ మనుపేర నిట్లు తెలిపియున్నాఁడు,

"సద్వృత్తిః పూః ప్రశస్తా భువి తదధిపతిః కోఽపి సత్త్వప్రకాశః,
శాన్తిః కాన్తాస్య, పుత్రీ సుమతి రితి సతాం సంగతి స్తా మ పుష్యత్
సఖ్యా సా విష్ణుభక్త్యా హరిభజన ముపాశిక్షి బాల్యే ప్రగల్భా,
స త్యాత్మానం వరీతుం వర మిహ విషయే భూరి వైర స్య మాప"
"జ్ఞాత్వా సత్త్వప్రకాశ స్సుమతిపరిణతిం తద్వరం సద్విచారా,
ద్వేదాన్తే ష్వాపలభ్య ప్రథిత మథ గురుం ప్రశ్రయే ణోపసద్య,
తే నాదిష్టం సుమత్యా సహ వరపురుషం యోజయిత్వా కృతార్థః.
సాసా దానందసాంద్రా హులభత పరమా యోగభూమిం స శాన్తామ్"
"పరిభా వైవ ముద్దిష్ట మేతత్కావ్యార్థసంగ్రహమ్,
వ్యాఖ్యాన మనుగృహ్ణన్తు మయా కృత మిదం బుధాః"

సత్త్వప్రకాశుఁ డనేరాజు సద్వృత్తియనే పట్టణ మేలుచున్నాడు. అతని భార్య శాంతి. వారికూతురు సుమతి, దానిని సజ్జనసంగతియనెడి పెంపుడుతల్లి పెంచినది. దానిచెలికత్తెయైనవిష్ణుభక్తి దానికి శ్రీహరిసేవ నేర్పినది. పెండ్లియీడు వచ్చినయీసుమతిని శ్రీహరి కిచ్చి ధన్యుడై రాజు పరమానందము నొంది సుఖముగా నున్నాఁడు.

ఈకవి శ్రీరామభక్తుఁడు వేదాంతవిచారమగ్నుఁడు తత్త్వజిజ్ఞాసువు, జ్ఞాని, ఆనంది. సుమతియానందావస్థ నిట్లు వర్ణించెను.

"కిమానన్దే లీనా వ్యతిగతపథే వాఙ్మనసయోః?
కి మానన్దైనైవ ప్రసభ మతిసాంద్రేణ ఘటితా?

కి మానన్దాకృత్యా పరిణమన మాసాద్య గళితా!
యథా సద్భాగ్యా సా సమజని తథా సైవ న పరా"
సారస్వతాభిమానులుద్ధరింపఁదగినకృతులలో నిది యొకటి.

# వేంకటాధ్వరి

వీరి యింటిపేరు అరిశాణపాలమువారు. ఇతఁడు కాంచీపురనివాసుఁడు. ఆత్రేయగోత్రుఁడు సీతాంబారఘునాథదీక్షితకవులపుత్త్రుడు వాజపేయాదిబహుక్రతువు లాచరించిన (యప్పయాచార్యునకు) శ్రీనివాసాచార్యునకుఁ బౌత్త్రుఁడు. తర్క వ్యాకరణ వేదాంత మీమాంసా విశారదుఁడు శ్లేషయమకచక్రవర్తి బిరుదాంకితుఁడు. ఇతనితండ్రి రఘునాథదీక్షితుఁడు చంద్రగిరిరాజైనవేంకటపతిరాయలగురు వగుతిరుమల తాతాచార్యుని మేనల్లుఁడు. శా. ౧౫౭౨–౧౬౦౨ నడిమివాఁడు. ఈవిషయమంతయు నితనికృతులయాద్యంతపద్యములే తెల్పుచున్నవి.

"కాంచీమండలమండనస్య మఖినః కర్ణాటభూభృద్గురోః
తాతార్యస్యదిగంతకాంతయశసో యం భాగినేయం విదుః,
అస్తోకాధ్వరకర్తు రప్పయగురో ర్నప్త్యైష విద్వన్మణేః
పుత్త్రశ్శ్రీరఘునాథదీక్షితకవిః పూర్ణో గుణై రేధతే"
"తత్సుత స్తర్క వేదాంతతంత్రవ్యాకృతిచింతకః"
"సీతాంబాగర్భసంభవస్య శ్రీమత్కాంచీనగరవాస్తవ్యస్య"

ఇతఁడు విశ్వగుణాదర్శము లక్ష్మీసహస్రము వరదాభ్యుదయము ప్రద్యుమ్నానందనాటకము సుభాషితకౌస్తుభము ఉత్తరరామ చరిత చంపువు శ్రీవణానందము రాఘవయాదవీయము మొదలగు పెక్కుకృతులు నిర్మించెను. ఈయన్నిటిలో స్వకపోలకల్పితము జగద్విమర్శరూపము నైనూతనమార్గముతో్రొక్కిన విశ్వగుణాదర్శ మత్యుత్తమము. సహ

స్రశ్లోకాత్మకమైన దీనికి లోకమున నెంతో ప్రచారము కలదు. రెండవ దితని వైదుష్యముతోడి కావ్యకల్పనకుదాహరణము. మూఁడవదియుముద్రితమై కొంతకాలము వాడుకలో నున్నది. ఇందు శ్లేషయమకనైపుణ్యా మెక్కువగాఁ జూపఁబడినవి. శ్లిష్టవిలోమకావ్య మగురాఘవయాదవీయము రచియింప నితఁడు పడినకష్ట మింతంత కాదు. పైనుండి క్రిందికిని క్రింది నుండి పైకిని జదువ నొకటే పాఠము వచ్చున ట్లీకృతి నిర్మించుట పాండిత్యప్రకర్ష వెల్లడించుటకుఁ గాక మఱేమి? యాగపశుహింస నింద్యముగా దనుట కితఁడు విశ్వగుణాదర్శమునఁ జెప్పినమాట లివి:—

"హింసాంతరే ష్వివ మఖాశ్రితహింసనేఽపి
జైనేతరో యది జనో భజతే జుగుప్సాం,
నార్యంతరే ష్వివ న నిందతి నందనానాం
నిష్పాదనం కిమనఘేఽపి నిజే కళత్రే?"

ఇతఁడు తనప్రద్యుమ్నానందనాటకప్రస్తావనలో దినైకకావ్యరచనసమర్థుఁడను శాస్త్రవ్యాఖ్యానకరణదక్షుఁడను దుర్వాదిగర్వభంజకుఁడ నని, ఆత్మప్రశంస గావించుకొని యున్నాఁడు. ఇతఁడు కావించిన వర్ణనలనుబట్టి యితనితండ్రి రఘునాథదీక్షితుఁడు కూడా శ్లేషయమకచక్రవర్తి యని తెలియుచున్నది—విశ్వగుణాదర్శములో నితఁడు జాతులు మతములు దేశములు శాస్త్రములు ఆచారములు మొదలగువానిగుణదోషములను నిష్పక్షపాతముగా వర్ణించి తననాఁటిపెద్దలయభిమతమును నెలకొల్పుచు వచ్చినాఁడు. దీనినిబట్టి యితఁ డొకసారి యాసేతుహిమాచలము తిరిగినవాఁ డనితోఁచును.

సూర్యచంద్రులు నేత్రము లగుటచే నొకటి ప్రకాశించునపుడు రెండవది సంకోచించియుండును గావున విష్ణు వొంటికంటిగ్రుడ్డియగు నని వర్ణించుటచే నితనిక న్నొకటి పోయిన దనియుఁ అపుడు లక్ష్మీదేవి నయనములు వర్ణింపఁగా మరల కన్ను వచ్చిన దనియు నితనికవిత్వమహా

త్త్వమున కొక కథకూడ కల్పిత మైనది 1. వేదాంతదేశికునియెడ నితని కతిభక్తి కల దని, అతనిపాదుకాసహస్రమును స్మరించి లక్ష్మీసహస్ర ముత్తమశైలిని నిర్మించుటే కాక, ఆచార్యపంచాశత్తు నిర్మించి, యీ దేశికుని స్తుతించుటచే తనజిహ్వాపావన మైన దనుకొన్నాఁడు.

" రసనాం దుర్నరేశానవర్ణనా పంకదూషితామ్"
ప్రత్యన్తదేశికోదన్తసుధాభి శ్శోధయామ్యహమ్"

ఇఁక నితనియశస్సునకు ప్రధానకారణ మైనవిశ్వగుణాదర్శమును గూర్చి రెండుమాటలు:- కృశానువిశ్వావసువు లనునిద్దఱుగంధర్వు లాకాశమున విమానముపై సంచరించి విశ్వమందలిమంచిచెడ్డలను విశదీకరింతురు. వారిలో మొదటివాఁడు దోషదర్శి, రెండవవాఁడు గుణదర్శి. వారు చూపించెడియీరెండు న్యాయావస్తులందు సహజములే కాని, కల్పితములు కావు.

" విశ్వావలోకస్పృహయా కదాచిద్విమాన మారుహ్యసమానరూపమ్,
కృశాను విశ్వావసునామధేయం, గంధర్వయుగ్మం గగనే చచార.
" కృశానురకృశాసూయః పురోభాగిపదం గతః,
విశ్వావసు రభూ ద్విశ్వగుణగ్రహణకౌతుకీ"

గ్రంథాంతమందలి విన్నప మిది.

" ప్రకాశదోషప్రచురేప్యముష్మిన్, గ్రంథేమదీయే కరుణానుబంధాత్
ప్రసాదవంతో న కృశానవన్తు పరంతు విశ్వావసవన్తు సంతః"

## అవతారకవి

ఇతఁడు కాశ్మీరీయుఁడు. చిత్రబంధ యమక కవిత్వప్రియుఁడు. ఇతఁడు నిర్మించిన "ఈశ్వరశతకము" చూచుటకుఁ జిన్నకావ్యమే కాని, పరిశీలించి చదువువారికి మహాకావ్యముగాఁ గనవచ్చును. వైదుష్యకవి

1. "నయనం తవ దేవి మంజులం విపరీతేఽపి విపర్యయం న యాతి"

త్వములు రెంటను ప్రౌఢము లని యీశతకమే తెలుపఁగలదు. ఇతనికాల మిది మిత్థ మని నిర్ణయింపఁ బ్రత్యక్షప్రమాణము లేదు గాని, స్తుతికుసుమాంజలికి వ్యాఖ్య నిర్మించినరాజానకరత్నకంఠుఁడు దానితుదఁ దనపితామహుఁ డైనయవతారపండితు నిట్లు వర్ణించియున్నాఁడు.

" సకలవిపశ్చిద్వర్యః, ప్రిజ్ఞాజితవృత్రహామాత్యః,
అవతారో ఽజని తస్మా, త్పాండిత్య స్యావతార ఇవ"

ఈరత్నకంఠుఁ డీవ్యాఖ్య సంవతు ౧౭౩౮ లో నగఁగా, శా. ౧౬౦౪ లో నిర్మించెను. ఇతనిపితామహుఁ డైనయవతారుఁడే మనయవతారకవి యై యుండుననుభావముతో నితఁడు శా. ౧౫౬౦ ప్రాంతమువాఁ డని నిశ్చయింపవచ్చును. ఈశతకమున కన్యుఁడు వ్యాఖ్యానము చేసినట్లు కనఁబడదు. మఱియొకఁడు కవిపరోక్షమున వ్యాఖ్య నిర్మించుటయుఁ గష్టమే. కావున నితఁడే యీశతకమునకు వ్యాఖ్య నిర్మించె ననియు నిశ్చయింపవచ్చును.

ఇందలిప్రతిపద్యము శివస్తుతిపరము. కాని, బహుశ్లోకముల యర్థము దుర్భేద్యము. ఇందు పాదైకాక్షరములు–ఏకాక్షరములు–ద్వ్యక్షరములు–త్ర్యక్షరములు–ఏకస్వరములు నైన శ్లోకము లెనిమిది. శృంఖలా సముద్గ వ్యావృత్త పాద యమకాదిభేదములతోడిశ్లోకము లెనిమిది, అనులోమ ప్రతిలో మైకపాద, ద్విపాద శ్లోకము లాఱు, పద్మ మహాదేవ జాగేశ్వర గోమూత్రికా వజ్ర త్రిశూల పరశు గదా ష్టదళపద్మ తవర్గ క్షురికాతూణ కవినామగర్భచక్రాదిబంధములు పదునాఱు నున్నవి. ఇట్లు చిత్రవిచిత్రములు భక్తిప్రధానములు మంత్రశాస్త్రరహస్యజ్ఞాపకములు నైననూఱుశ్లోకములు నూఱుచిన్నకావ్యము లనఁదగి యున్నవి. దీని కితఁడు వ్యాఖ్యానమే వ్రాయకున్న నిది వ్యర్థమై నశించియుండును. ఇది అఱువదినాలుగుశ్లోకముల నొక్క శ్లోకములో నిమిడ్చిన శిష్టకృష్ణ

మూ ర్తిశాస్త్రకృతకంకణబంధమును మించినది కాదుగాని, కాశ్మీరదేశపండితులలో నిట్టికవిత కితఁడే మొదటివాఁడగును. పాదయమకశ్లోకమున కొకటి:—

"తతేతి తతితాతైతా మమ మామా మిమా మమాః,
లలల్లోలాలిలీలాలై, రురురోరారరైరరమ్".

తన పేరు వచ్చునట్లు గావించిన యీశ్వరప్రార్థనమిది:—

"రత్నావతారం గంభీరం, భవ ముగ్రం హరేశ్వర!
నయనీతి గుణాం తంతు, మమ తాప్రియతా మిమామ్"

సంస్కృతకాశ్మీరదేశాపభ్రంశభాషలకు శ్లేషగా చెప్పినశ్లోకమిది. దీనినిబట్టి, యానాఁడు కాశ్మీరములో ప్రాకృతభాషలలో నొకటి యయిన అపభ్రంశము వాడుకలో నున్నవిధము తెలియవచ్చును.

"కురవేకాలేసావయమారేఽరససుకుమారసదానవ దేవ,
అనవదయాచిత భవ మదనారేఽచలమాము క్తియతే మయిహేవ"

## మేఘపండితుఁడు

ఇతఁడు జైనుఁడు కృపావిజయపండితునిశిష్యుఁడు తర్కవ్యాకరణజ్యోతిశ్శాస్త్రవేత్త. ఇతఁడు శా. ౧౫౯౩ లో దేవాభ్యుదయ మను పేర విజయదేవసూరిచరిత్రను, ౧౬౧౩ లో దిగ్విజయమహాకావ్య మను పేర విజయప్రభసూరిచరితమును నిర్మించెను. దీనినిబట్టి యితఁడు శా. ౧౫౭౦_౧౬౩౦ నడుమనుండె ననుట స్పష్టము.

పైకృతులు గాక యితఁడు శాంతినాథచరిత్ర మేఘదూతసమస్యాలేఖ సప్తసంధానమహాకావ్యము మొదలగు కావ్యములును రచియించెను. సందేశకావ్యముతుదిశ్లోక మిది:—

" మాఘకావ్యం దేవగురో ర్మేఘమాతం ప్రభప్రభోః
సమస్యార్థం సమస్యార్థం నిర్మమే మేఘపండితః "

శాంతినాథ దేవాభ్యుదయములలో నితఁడు శిశుపాలవధ నైషధ ములనుండి యొక్కొక్కపాదము గ్రహించి తక్కినమూఁడేసిపాదములు పూరించుచు శ్లోకములు నిర్మించెను. నైషధశ్లోకపాదములను గ్రహించి పూరించినశాంతినాథ చరితములోని శ్లోకములు రెండు:—

" నిపీయ యస్య క్షితిరక్షిణః కథాః (నైషధ)
సురా స్సురాజ్యాదిసుఖం బహిర్ముఖమ్.
ప్రివేదిరే ఽన్తస్థిర తన్మయాశయాః,
సదా సదానన్దభృతః ప్రశంసయా "

" యథా శ్రుత స్యేహ నిపీతతత్కథాః,
తథాద్రియన్తే న బుధా స్సుధా మపి (నైషధ)
సుధాభుజాం జన్మ న తన్మనః ప్రియం,
భవే ద్భవే యత్ర న తత్కథా ప్రథా "

ఇతనిసప్తసంధానమహాకావ్యమునుండి యొకటి:—

" అవనిపతి రహాసీ ద్విశ్వసేనాశ్వసేనా,
భిధదశరథనామ్నా య స్సనాభి స్సురేశః,
బలివిజయిసముద్రః ప్రోథసిద్ధార్థసంజ్ఞః,
ప్రసృత మరుణతేజ స్తస్య భూకచ్ఛపస్య "

ఈకావ్యమునందు వృషభనాథ శాంతినాథ పార్శ్వనాథ నేమి నాథ మహావీరస్వామి కృష్ణనాథ బలదేవు లనునేఁడుగురిచరితము లేక ముగా వర్ణింపఁబడినవి. ఇది యొకగొప్పవిషయము. తనకు మున్ను హేమచంద్రసూరి యిట్టిసంధానకావ్యము నిర్మించినట్లును అది యలభ్య ముకాఁగాఁ దానీకృతి నిర్మించినట్లును తెలిపియున్నాఁడు.

"శ్రీహేమచంద్రసూరీశైః సప్తసంధాన మాదిమమ్,
రచితం తదలాభేతు స్యా దిదం తుష్టయే సతామ్"

ఇతనియుక్తిప్రబోధ మనునాటకము పరమతవాదములను ఖండించుచు స్వమతము నిరూపించునది గా నున్నది.

## పరమానందకవి

ఇతఁడు మహారాష్ట్రదేశీయుఁడు శివభారతకర్త. ౩౧ సర్గలతోడియీ మహాకావ్యమున సుప్రసిద్ధమహారాష్ట్రశూరుఁడు మహోదారుఁడు నైన శివాజీమహారాజు చరితము వర్ణింపబడినది. ఆరాజేంద్రుఁడు శా. ౧౫౪౯ లో జన్మించి, ౧౫౯౬ లో మూర్ధాభిషిక్తుఁ డయ్యెను. వీరరసభరిత మైనయతనిలోకోత్తరచరితము వర్ణింపఁబడుటంజేసి యీకావ్యము శా. ౧౬౦౦ ప్రాంతమున రచియించిన దనవచ్చును. ఈకావ్యము పూనానగరమున ముద్రిత మైనది.

ఈపరమానందకవికి సమకాలమువాఁ డయినజయరామకవి పర్నాలపర్వతగ్రహాఖ్యాన మనుపేర నైదుల్లాసములకావ్యము నిర్మించెను. అందు పర్నాలకొండపట్టుకొన్నశివాజీమహావీరకృత్యమువర్ణింపఁ బడినది. ఇది ముద్రిత మైనట్లు కనరాదు. వీ రిద్దఱికిని పరుఁ డైనకేశవకవి రాజారామచరిత మనెడియైదుసర్గలకావ్యము రచియించెను. అందు ప్రసిద్ధశివాజీతనయుఁ డైనరాజారామభూపతిచరిత్రము వర్ణింపఁబడినది. ఇదియు నముద్రితము. ఇందు, ఢిల్లీనుతురుష్కసేనలను దారిలో నణఁగించి రామభూపతి కర్ణాటదేశమున మహారాష్ట్రరాజ్యము స్థాపించిన యుదంతము వర్ణిత మైనది.

"ఏవం శ్రీభవశాలవంశతిలకః శ్రీరాజరామప్రభుః,
ఢిల్లీశేన మహాబలైః పథి కృతాన్ ప్రత్యూహశైలా నివ,

సర్వాన్ మ్లేచ్ఛగణాన్ విమథ్య మహసా శ్రీవైష్ణవే నాధునా
తేషా మేన పరాభవాయ విజయీ వర్వర్తి కర్ణాటకే"

# శ్రీ కృష్ణ క వి

పూర్వోక్తనారాయణభట్టపాదుని తనయుఁ డైన యీకవి శా. ౧౫౫౦ ప్రాంతమునఁ గావ్యరచన మారంభించినవాఁడు. ఇతనితారా సుధాకరము చివర నున్న యీక్రిందిశ్లోకమునుబట్టి యితఁడు కేరళ దేశ ములోని కృష్ణరాజునాదరము గాంచినవాఁ డని తెలియుచున్నది.

" శ్రీకృష్ణరాజకరుణైకనికేతనేన, కృష్ణేన భాగవత ఇత్యభిశబ్దితస్య
నారాయణస్య తనయేన సమీరితే యం, తారాసుధాకర కథావిషయో

ము దేఽస్తు"

ఇతనితారాశశాంకము చిన్నశృంగార ప్రబంధము. ఇందు తారా చంద్రులయనురాగము బుధునిజన్మమును వర్ణింపఁబడినవి — ఇచ్చట నొకవిశేషము:—

విజయగంగచొక్క-భూపాలుని సామంతుఁ డైన సముఖమువేంక టకృష్ణప్పనాయకుని పోషణములో నున్న శేషమువేంకటపతికవి శా. ౧౬౨౨ ప్రాంతమునందు తారాశశాంకవిజయము రచియించె ననుట విదితము. గణింపరాని యీమహత్కాలభేదమున వీరిరువురు సమకాలికు లగుదురు. అందుచే నెవరికృతి నెవ రనువదించిరో నిర్ణయింపవీలు లేదు గాని యితని కృతి చిన్నది, వేంకటపతికవిది పెద్దది. కావున నిందలి సంక్షేపరూపకథ యందువిస్తరించిన దేమో యని యూహింప నవకాశ మేర్పడుచున్నది. లేదా, ఇద్దఱికి నేకకాలమం దేకకథయే రచనకు స్ఫురించియుండు నని భావించినను హాని లేదు. ఇతని తారాశశాంక ములోనియొక పద్యము:—

"ఏకం ద్విధా కలయితుం సకలా స్సమర్థాః,
ద్వావేక మారచయితుం త్వదృతే న కోఽపి,
త్వా మర్చయామి తదహం సుచిరంత్వయైవ
సంతాపితౌ ఘటయ నౌ భగవన్ మనోజ!"

ఇందలిభావము రామరాజభూషణునివసుచరిత్రలో—

"రెండంటఁజేయునీకాండచాతురికి నాద్యనిదర్శనంబు వామార్ధజాని"

అనువిధముగాఁ గనఁబడుచున్నది. కాళహస్తికవి వసుచరిత్రము ను సంస్కృతీకరించియున్నాఁడు. దాని నెఱిఁగి యితఁడు పైశ్లోకమురచి యించె ననుటకు సమయమును సరిపడుచున్నది. ఇంతకు నిట్టిభావైక్య ము కవులలో నున్న దేకదా! ఇది వివక్షణీయము కాదు.

ఇతఁడు రచియించిన మందారమరందచంపువులో వృత్తకావ్య రస నాటకాలంకారభేదములును తల్లక్షణములును లక్ష్యములతో విశదీకరింపఁబడినవి. ఇది సంస్కృతభాషాభిమానుల కత్యంత ముపకరించు చక్కని లక్షణగ్రంథ మనఁదగియున్నది కాని యిది యిపుడు వాడు కలో లేదు.

## కృష్ణభట్టు

ఇతనివంశమువారియుపనామము హాసింగు. ఇతఁడు హాసింగ రామేశ్వరభట్టసూరిపుత్రుఁడు, మహాబలేశ్వరమునగ్గఱ దౌలతాబాదు జిల్లాలోని జావలిపురమున నున్నవాఁడు. దౌలతేంద్రునియాస్థానకవి, దుష్టదమనకావ్యకర్త. ఆరాజుకాలము తెలియుట కవకాశము లేకున్నది. శా. శ. ౧౬౦౦లకు పరుఁడా?

"యథా జ్ఞాతా తథా దాతా మానీ మానకర స్సతాం,
దత్వా భుక్త్వా దివం యాతో దౌలతేంద్రో మహాయశాః"

ఇందు, జావిలిపుర మిట్లు వర్ణింపఁబడినది. యథాజావిలీరాజధానీ

"తోయం స్వచ్ఛతరం గుణై ర్లఘుతరం పాకే ఽమృతం భోజనే,
స్వాద్వన్నం రుచిరం బలిష్ఠ మతులం ద్రాక్షాక్షి పత్రామలమ్,
తద్భుక్త్వ సర్వజనో ఽపి తాదృశగుణో లోకోత్తరో వర్తతే,
సేయం జావిలి దాలతేంద్రనృపతేః కే నాధునా వర్ణ్యతే,

జావిలీ త్యక్షరత్రయసార్థకీకరణమ్:—

"జాతిశుద్ధనరై ర్యుక్తా, విఖ్యాతనృపమణ్డితా,
కవిభిః లిఖితశ్లోకా, తేన జావిలి కథ్యతే"

ఇందు మొదటిమూఁడుసర్గలలో క్రమముగా నృపాభాసస్వరూపములు విశదీకరింపఁబడినవి.

"క్షోణీభుజాం తదీయానా మన్యేషా మపి కృత్స్నశః,
అనుభూతస్వభావో ఽయం త్రిభి స్సర్గై రిహోచ్యతే"

ప్రతిజ్ఞాఖ్యే చతుర్థే ఽస్మిన్ ధర్మచర్చాకృతా పునః
నానావిధాని విదుషాం కౌతుకాని మహీంభుజామ్"

ప్రతిజ్ఞావాక్య మిది:-

"సభోపయోగీ న్యథ దేశకాలా, వాలోచ్య విద్వత్కవికృష్ణశర్మా.
సటీకపద్యా న్యపి శిష్టతుష్ట్యై, దండాయ దుష్టస్య కరోత్యజస్రమ్"

# వాదీంద్రకవి

ఇతఁ డొకవిచిత్రకావ్యకర్త. తొలుత కాశీనివాసి, తంజావూరుపాలకుఁ డైనశరభోజీమహారాజు కోరికచే వచ్చి యతనిసభలో విద్వత్కవి యైనవాఁడు. శా. శ. ౧౬౩౩ ప్రాంతమువాఁడు. కవిరాజబిరుదాంకితుఁడు. ఇతఁడు కవికర్పటిక యనెడివిచిత్రకావ్యము నిర్మించెను.

అది ౨౪౪ శ్లోకముల చిన్నగ్రంథము. అముద్రితము. కవిత్వ మభ్యసించువారి కిది సహాయపడునని కవియాశయము. ఇతఁడు తనశక్తిని కావ్యప్రయోజనమును గ్రంథారంభమం దిట్లు తెలిపియున్నాఁడు.

" యః కాతంత్రసుధానిధానకలశః సాహిత్యరత్నాలయః,
సానందస్ఫుటగద్యపద్యరచనాప్రాగల్భ్యశబ్దోదయః,
షట్కావ్యామృతపూరపూర్ణవదన స్సద్బృందచంద్రోదయః,
త స్యేయం కవికర్పటీక రచనా కణ్ఠే ప్రతిష్ఠాప్యతామ్,
" యత్నా దిమాం కంఠగతాం విధాయ, శ్రుతోపదేశా ద్విదితోపదేశః
అజ్ఞాతశబ్దార్థవినిశ్చయో ఒపి, శ్లోకం కరో త్యేవ సభాసు శీఘ్రమ్ "

అనుష్టుప్ఛందస్సులో చంద్రవర్ణన మొనర్చుటకు- కర్పూరపూర-డిండీరపిండ గజనీకర - ఇత్యాదిపంచాక్షరపదములను, నీకాశ సంకాశేత్యాదిత్ర్యక్షరపదములను చూపెను. అవి వల్లించినచో కర్పూరపూరనీకాశ మిత్యాదిపాదము లగు నని తెల్పెను. ఇట్లే శార్దూలాది వృత్తములు రచియించుటకును పదములజాపితాలు వ్రాసెను. ఈకృతి దేవేంద్రుని కవికల్పలతవంటిది. దీనికే యితఁడు కవిరాజబిరుద మందెనా?

# చక్రకవి

కావ్యచక్రము నిర్మించినయితఁ డంబాలోకనాథులకుమారుఁడు పతంజలిరామచంద్రుల సోదరుఁడు. పాండ్యచేరచోళమండలాధిపతుల సత్కారము లందినవాఁడు, నీలకంఠదీక్షితులను ప్రశంసించిన యితఁ డతనికిఁ బరుఁడై శా. ౧౬౦౦ ప్రాంతమున నున్నవాఁ డగును. ఇతఁడు మంచివైదుష్యము గలవాఁడు. కవిత్వముధారాళముగా నుండును.

రుక్మిణి గౌరి ద్రౌపది జానకి యనునలుగురు కన్యలకు వివాహ

ములు కావించినమూకవి చిత్రకవిత్వప్రియుఁడై చిత్రరత్నాకర మను నాలుప్రకరణములగ్రంథ మొకటి రచియించెను. అందు తనపూర్వోక్త కృతుల నిట్లు స్మరించియున్నాఁడు.

" రుక్మిణీ జానకీ గౌరీ ద్రౌపదీ పరిణీతయః,
కృతయో యస్య త స్యైషా కృతి శ్చూకకవే శ్శుభా "

ఇతనిజానకీపరిణయ ద్రౌపదీపరిణయములు మొన్న మొన్ననే ముద్రితములైనవి.

## మూ క మ హా క వి

ఇతఁడు కాంచీమండలమున జన్మించినవాఁడు. నోరుమొంగ యైనను బుద్ధిశాలి గావున సంస్కృతభాష నభ్యసించి కంచికామాక్షి నారాధించి యాదేవికరుణచే సత్కావ్యము రచియించుభాగ్యము గన్న వాఁడు. ఇతనిపేర ముద్రితమైనమూకపంచశతి కామాక్షీస్తుతిరూప పద్య కావ్యము. కాంచీమండలమందలిప్రసిద్ధసంస్కృతకవు లెవరు నిట్టిబుద్ధి శాలిని బేర్కొనకపోవుట చూడ నితఁడు శా. ౧౬౨౦ ప్రాంతమువాఁ డేమో యని తోఁచుచున్నది. కామాక్షీకరుణాకటాక్షమే తనకవితకు మూల మన్న మొదటిశ్లోక మిది.

" మోహాంధకారనివహం వినిహన్తు మీడే
మూకాత్మనా మపి మహాకవితావదాన్యాన్,
శ్రీకాంచిదేశశిశిరీకృతి జాగరూకా
నేకామ్రనాధతరుణీకరుణావలోకాన్ "

వ్రాఁతప్రతులలో నీశతకములు ముందువెనుకలుగా నున్నవిగాని యచ్చుప్రతిలో కటాక్షమందస్మిత, పాదారవింద, ఆర్యా, స్తుతి, సంజ్ఞలక్రమముగాఁ గనవచ్చుచున్నవి. కవిత్వము హృద్యముగా నుండును. కామాక్షి త్రిమూర్త్యాత్మిక యైనపరమేశ్వరిగా నిట్లు స్తుతింపఁబడినది.

"త్వమైవ జగదమ్బయా భువనమండలీ సూయతే,
త్వమైవ కరుణార్ద్రయా తదపి రక్షణం నీయతే
త్వమైవ ఖరకోపయా నయనపావకే హూయతే
త్వమైవ కిల నిత్యయా జగతి సంతతం స్థీయతే"

కామకోటిపీఠాధిపతులలో నిరువదియవయాచార్యుఁడు మూకార్భకశంకరాచార్యుఁ డని కనఁబడుచున్నది. అతఁడు క్రీ. ౪౦౦ ప్రాంతమువాఁడు. అతఁడే యీపంచశతి నిర్మించినవాఁ డని కొందఱూహించిరి గాని యది సరిగాదు. ఆమూకాచార్యుఁడు విద్యాఘనుఁ డనుజగద్గురుశంకరాచార్యునికరుణచే వాక్కువచ్చినవాఁ డని యీక్రిందిమాటలవల్లఁ దెలియుచున్నది. ఇది యతనిశిష్యుఁ డైనరామిలునిమణిప్రభానాటకములోనిసూత్రధారవచనము.

"మూకార్భో౽పి జగద్గురోః కరుణయా విద్యాఘనస్యాప్తవా
గాచార్యో ౽స్తి హి శంకరేంద్రబిరుద స్సర్వజ్ఞపీఠాధిపః"

## రామభద్రదీక్షితులు

ఇతఁడు తంజావూరుమండలమువాఁడు. కుంభకోణమునకు దగ్గఱనున్నకండ్రమాణిక్య మనుగ్రామ మితనిజన్మస్థానము. తండ్రి యజ్ఞరామదీక్షితులు. బాలకృష్ణపండితుఁడు చొక్కనాథమఖి యనువారితనిగురువులు. తంజావూరుపాలకుఁ డగుశహాజీ తనపేర కట్టించిన తిరువసనల్లూ రనఁబడుశహాజీపురాగ్రహారములోని బ్రాహ్మణులలో నితఁ డొకఁడు, శా. ౧౫౭౦-౧౬౪౦ నడిమివాఁడు. శిష్యవత్సలుఁడు రామభక్తుఁడు నైనయితనిని విద్యార్థులు అయ్యాదీక్షితు లనెడివారు. ఈకవి పతంజలిచరిత మన నెనిమిదిసర్గలకావ్యము నిర్మించెను అందు చంద్రగుప్తాదులకథలు కలవు. కవిత్వము సరసముగానే యున్నది

గాని, అందలి చరిత్రాంశములు ప్రామాణికములు కాఁజాలవు. ఇతనికృతులలో వ్యాప్తి గాంచినది జానకీపరిణయనాటక మొకటే. అందలిప్రస్తావనలోని యీక్రిందిశ్లోకమున నితనివిషయ మొకింత గోచరించుచున్నది.

" యస్య స్తౌతి మతిం మనీషిపదసి శ్రీనీలకంఠాధ్వరీ,
కౌండజ్యౌతిషికశ్చ యస్య కురుతే సమ్మాన మార్యై స్సహమ్,
య ఞ్చానుగ్రహదృష్టి మర్పయతి చ శ్రీబాలకృష్ణో గురుః,
సో ఽయం దీవ్యతి చొక్కనాథమఖినా మక్రీతదాసః కవిః"

దీనినిబట్టి నీలకంఠదీక్షితులవార్ధకములో రామభద్రదీక్షితుఁడు బాలకవియై వెలసె ననవచ్చునుగాని, నీలకంఠునికి మిత్రుఁ డనియు మన కవికి శ్వశురుఁ డనియుఁ జెప్పఁబడుచొక్కనాథమఖికాలమును, అతని కుమారుఁ డగుసదాశివమఖికాలమును సంశయాస్పదము లగుచున్నవి. నీలకంఠదీక్షితులు నీలకంఠవిజయచంపువు నిర్మించునాఁటికి ప్రౌఢకవి. ఆసమయము శా.౧౫౫౯. అప్పటి కతఁడు ముప్పదేండ్లవాఁ డనవలెను. చొక్కనాథుఁడుకూడా కొంచె మెచ్చుతక్కువగా నావయస్సువాఁడే యగు నని చెప్పవలసివచ్చినచో నతఁడు బసవేశ్వరునిసత్కారమందు నాఁటికి (శా. ౧౬౨౦) దాదాపు తొంబదియేండ్లవాఁ డగు ననవలెను. శా. ౧౬౮౦-౧౭౨౦ నడుమ తిరువాన్కూరురాజ్యము పాలించిన రామవర్మయాస్థానమున విద్వత్కవియై యతనికుమారుఁడు సదాశివమఖి యుండె ననవలెను. ఈపద్ధతినిబట్టి తండ్రికొడుకులజీవితకాలము ౧౯౦ ఏండ్లగును. ఇ దెట్లు విశ్వసనీయము? అందుచే చొక్కనాథమఖి నీలకంఠదీక్షితులకు బాలమిత్రుఁ డగు నని భావించి యతఁడు శా. ౧౫౩౦ ప్రాంతమున జన్మించి యుండు ననుకొన్నచో నతనికి డెబ్బదియేండ్లవయస్సున సదాశివమఖి యుదయించి యుండు నని యొకవిధముగాసరిపుచ్చుకొనవచ్చును-ఇంక-

మనకవి నిర్మించిన యితరకృతులు-రామభద్రశతకము రామబాణ స్తవము రామచాపస్తవము రామాష్టప్రాసము తూణీరస్తవము విష్ణుగర్భస్తవము పర్యాయోక్తినిష్యందము మొదలయినవి. ఇ వన్నియు నితనిశ్రీరామభక్తి కుదాహరణములు.

ఇతనిశృంగారతిలకభాణ మాఁటాఁటిభాణములలో మిన్న. ఇందు మధురలోని భుజంగశేఖరుఁడు నాయకుఁడు. ఇతనిమిత్రుఁ డైనవరదాచార్యులు రచియించిన వసంతతిలకభాణమునకు పోటీగా నితఁ డాభాణము నిర్మించెనఁట—ఇఁక నితనిగురువును శిష్యులును—

## చొక్కనాథమఖి

ఇతఁడు నరసాంబాతిప్పాధ్వరుల పుత్రుఁడు భారద్వాజగోత్రుఁడు. ఇతనిచరిత మింతకు మున్నే కొంత తెలిసికొనియున్నాము. ఈకవి శా. ౧౬౫౦_౧౭౩౦ నడుమ నున్నవాఁడు. కాంతిమతీ శహాజీరాజులపరిణయోదంతమును కాంతిమతీపరిణయ మనుపేరను, సేవంతికా బసవరాజుల వివాహోదంతమును సేవంతికాపరిణయ మనుపేరను నాటకములుగా రచియించెను.

రామభద్రదీక్షితుని శిష్యులలో నల్లాదీక్షితు లనఁబడుభూమినాథుఁడు శహాజీచరితమును ధర్మవిజయచంపువుగా నిర్మించెను. అతని సమకాలమువారు మిత్రులు నగు వెంకటకృష్ణకవి మొదలగువారును నటేశవిజయాదులు రచియించిరి. ఇట్టివారికావ్యము లన్నియు. తంజావూరు పుస్తకాగారమునఁ బడియున్నవి.

రామభద్రదీక్షితుని తమ్ముఁడగు రామచంద్రదీక్షితుఁడే కేరళాభరణము నిర్మించినవాఁడైతే, అందలి యవతారికలోనివంశవర్ణనమును బట్టి మనరామభద్రదీక్షితుఁడు రత్నఖేటశ్రీనివాసదీక్షితుని వంశములోని

వాఁడు కావలసియుండును. అప్పుడు మనకవి తనవంశము మూలపురుషుఁడన్న చతుర్వేదియజ్వయు శ్రీనివాసదీక్షితుల తరువాత విడిపోయిన పురుషుఁడైయుండు ననవలసివచ్చును. ఏమయినా ఆకావ్యము శా. ౧౬౨౦ ప్రాంతములోనిదనక తప్పదు.

# రామచంద్రదీక్షితుఁడు

ఇతని కేరళాభరణము స్వతంత్రకావ్యము. ఏదేశము చక్కఁగా నుండును? ఎందలి యాచారము మనోహరము? అని యింద్రుఁడడుగవసిష్ఠవిశ్వామిత్రులు చర్చించి కేరళదేశము రమ్య మనెడిసిద్ధాంతము ప్రతిపాదింతురు. ఇందలి మొదటి శ్లోక మిది—

" కతమో దేశో రమ్యః, క స్యాచారో మనోహరో మహతామ్,
ఇతివాదిని దేవపతౌ, సంఘర్షో ఽభూ ద్వసిష్ఠగాధిజయోః.

వెంకటాధ్వరివార్ధకదశలోనివాఁడై యితఁ డతనివిశ్వగుణాదర్శము ననుకరించి యిది నిర్మించె ననవచ్చును. ఇది యముద్రితము.

# సదాశివమఖి

ఇతఁడు పూర్వోక్తుఁడైనచొక్కనాథమఖితనయుఁడు. ఇతనితల్లి మీనాక్షి. ఇతఁడు శా. ౧౬౨౦ ప్రాంతమున జన్మించి సుమారు ౮౦ సంవత్సరములు జీవించినవాఁడని యింతకు మున్నె తెలిసికొని యున్నాము. ఇతఁడు, తిరువాన్కూరుపాలకుఁడైనబాలరామవర్మకులశేఖరవంచిపాలరాజు శా. ౧౬౮౦–౧౭౨౦ నడుమ రాజ్యము చేయు కాలమునఁ దదాస్థానమున విద్వత్కవిపద మలంకరించి రామవర్మయశోభూషణ మనెడియాలంకారికకృతి నిర్మించెను. అందలినాటకప్రకరణమున వసులక్ష్మీరామవర్మల వివాహకథ వర్ణించెను. ఆవసులక్ష్మిసింధు

రాజుకూఁతురు. తల్లిదండ్రులయాశయమునకు విరుద్ధముగాఁ దాను వరించినరామవర్మను పెండ్లాడుట యుందలివస్తువు. ఇది యముద్రితము.

ఈకవియే లక్ష్మీకల్యాణ మనునాటక మొకటి నిర్మించెను. అందు ప్రస్తావనలో తనపోషకుని విషయము స్వవిషయము నిట్లు తెలిపెను.

"యదృచ్ఛాసల్లాపై స్సమధిగతషట్తంత్రవిభవై,
శ్చమత్కుర్వన్ ధీరాన్ సపది రసభావప్రకటనైః,
కవీన్ ధిన్వన్, గానక్రమవివరణా ద్గాయకవరాన్,
పరిష్కుర్వన్ వంచిక్షితిపతిలకో ఒయం విజయతే"

మేనమామ యైనమార్తాండవర్మ గతించినంత రాజైన రామవర్మవంచిరాజు సూర్యుని పిదప వచ్చినచంద్రునివలె నున్నాఁడని వర్ణించెను. ఇందు మార్తాండరాజశబ్దములు శ్లేషించును.

"సతాం మార్గే స్థిత్వా సకలశుభ మాధాయ జగతాం,
విపక్షక్షోణీభృ త్తిమిరహరతేజస్విని విధేః,
గతే ఒస్తం మార్తాండే విధు రివ జనానందజనకః,
కలాసింధూ రాజా హృదయ మధిరూఢో విజయతే"

"అస్తి ఖలు భరద్వాజకులకలశజలనిధిహిమకరస్య సర్వతంత్రస్వతంత్రస్య చొక్కనాథయజ్వనః పుత్త్రస్య మీనాక్షీగర్భశుక్తిముక్తామణే స్సదాశివయజ్వనః కృతిః, అభినవం లక్ష్మీకల్యాణం నామనాటకమ్"

## శ్రీధర వేంకటేశ కవి

ఇతఁడు ద్రావిడదేశమున స్థిరపడినయాంధ్రదేశపండితుఁడు. రామభద్రదీక్షితుని సమకాలికుఁడు. తంజావూరు పాలకుఁడు శహాజీ మహారాజు నగ్రహారములో నివసించు ౪౬ గురు విద్వాంసులలో నితఁ డొకఁడు,

శా. ౧౬౧౦ ప్రాంతమువాఁడు. అయ్యావా లని పిలువఁబడుచు వచ్చిన యీకవి తనపోషకుని యుదంతమును శాహేంద్రవిలాస మనుపేర నొక పద్యకావ్యముగా వర్ణించెను. ఆరాజు శా. ౧౬౦౮-౧౬౩౭ నడుమ రాజ్యము చేసినవాఁడు.

ఈకవి స్వకాలమున వినుతి కెక్కినవాఁడు. ఇతఁ డిది గాక దయా శతకము మాతృభూతశతకము తారావళీశతకము ఆర్తిహరస్తవము మొదలగుకృతులు నిర్మించెను. శ్రీధరవారు వెలనాటి వైదికులు. ఇతఁడు మతమున నెక్కువ శ్రద్ధగలవాఁడై యద్వైతమతప్రశస్తివాదియై నాఁటి రాజసభలో నగ్రగణ్యుఁడై వెలసినవాఁడు. ఇతనినాఁటివిద్వత్కవులలో—

నల్లదీక్షితులు, గంగాధరపండితుఁడు శేషాచలపతి శ్రీనివాసకవి లక్ష్మణకవి సుమతీంద్రకవి మొదలగువారు శహాజీరాజుచరిత్రమును బహువిధముల వర్ణించుచు గ్రంథములు రచియించిరి. చిదంబరదీక్షితుని కుమారుఁడును కవితార్కికసార్వభౌమబిరుదాంచితుఁడు నైన అప్పదీక్షితుఁడును శృంగారమంజరీ శాహాజీయ నాటకములు నిర్మించెను. ఆనాఁటితంజావూరురాజులచరిత్రము గంగాధరపండితుని భోసలవంశావళిలో విశదముగా గోచరించును.

## శ్రీధర పేరుభట్టు

ఇతఁ డొకవిద్వత్కవి. పాణినీయపారదృశ్వయై నవీనపతంజలి బిరుద మందినవాఁడు కౌశికగోత్రుఁడు పూర్వోక్తవెంకటేశ పండితుని తనయుఁడు.

ఈకవి వసుమంగళ మను నైదంకముల నాటకము నిర్మించెను. అది మధురమీనాక్షీ యుత్సవమునఁ బ్రదర్శింపఁబడిన దఁట. ఉపరిచర వసువు గిరికను పెండ్లాడుట యనుభారతకథాంశ మిందలివస్తువు. రసము

శృంగారము. ఇతడు తనరచియించినరామచంద్ర విజయము భరతాభ్యుదయము వేంకటభాణము చకోరసందేశము ననుకృతులను తననవీన పతంజలి బిరుదమును వక్కాణించియున్నాఁడు.

రామరాజభూషణునివసుచరిత్రను జూచి కామాక్షీదాసుఁ డను కాళహస్తికవి వసుచరిత్రచంపువు నిర్మించినట్లే యితఁడు దాని ననుసరించి వసుమంగళనాటకము నిర్మించె ననవచ్చును. సమయముకూడా యందుకు సరిపడుచున్నది. తెలుఁగువసుచరిత్ర శా. ౧౪౯౦ ప్రాంతమునఁ బుట్టినది. సంస్కృతవసుచరిత్ర శా. ౧౫౫౦ ప్రాంతమున నుదయించినది. ఇది శా. ౧౬౫౦ ప్రాంతమున బయలు వెడలినది.

ఇతని నాటకాదులు కొన్నిటికి వ్యాఖ్య లుదయించుటంబట్టి యానాఁ డవి వ్యాపించిన వనవచ్చును. కాని యితనికృతులలో నొకటియు నచ్చుపడలేదు. ఇపు డిపుడు తమిళులు తమవారికొన్ని కావ్యములను తంజావూరుపుస్తకభాండాగారమునుండి పైకి లేవనెత్తుచున్నారుగాని, మనవారుమాత్ర మాంధ్రుల సంస్కృతాంధ్ర గ్రంథముల నుద్ధరింపఁబూనుకొన లేదు.

## భోసలరాజులు-తత్కవులు

పరమానందకవిజీవితమున సుప్రసిద్ధశివాజీచరితము నతనికుమారుఁడురాజారామభూపతిచరితము నించుక తెలిసికొనియున్నాము. తంజావూరుమండల మేలినయీమహారాష్ట్రరాజవంశము "భవశాలవంశ" మని వారియాస్థానకవి యైనకేశవుఁడు రాజారామచరితావతారికలో తెలిపియున్నాఁడు. భవశాల భోసలగా మాఱినదో లేక యిదే "భవశాల" గా మాఱినదో! దక్షిణదేశము పాలించినయీవంశమువారు కవులను పోషించి కావ్యములు రచియింపఁజేయుటయే కాక కొందఱు స్వయముగా కావ్యకర్తలై వెలసిరి. వారికృతులు దేశమునందు పఠన

పాఠవ్యవహారమున లేకున్నను, శరభోజీరా జేర్పఱచినపుస్తకభాండా గారమం దున్నవి.

ప్రథమశహాజీకొడుకులు శివాజీ వెంకోజీ. ఈ వేంకోజీ యనఁబడు వెంకోజీకొడుకులు శహాజీ శరభోజీ తుక్కోజీ. వీరిలో శహాజీ శా. ౧౬౦౯–౧౬౩౩ నడుమ రాజ్యము చేసెను–ఏకోజీ–కావ్యకర్త కాఁడు గాని యతనికాలమున (శా. ౧౫౯౭–౧౬౦౫) అతనిమంత్రి యైన బాలకృష్ణునితనయుఁడు జగన్నాథకవి రతిమన్మథ మను రూపకము నిర్మించెను. మఱియొకమంత్రి యైనఆనందయజ్వకుమారుఁడు శ్రీశైల కవి త్రిపురవిజయచంపువు రచియించెను. అవి సజీవములు. శహాజీ— ఇతఁడు మహోదారుఁడు. ఇతఁడు తనపేర తిరువసనల్లూ రనఁబడు శహాజీ పురాగ్రహారము కట్టించి యందు నలువదియార్వురు విద్వాంసులను నిలి పెను, చంద్రశేఖరవిలాస మనునాటకము నిర్మించెను. ఇంతకు మున్ను పేర్కొన్నవేంకటేశాదికవు లెందఱో యితనిచరితమును కావ్యములుగా నిర్మించియున్నా రని చదివియున్నాము. ఈరాజులపోషణ మందినకవు లింక నెందఱో కలరు. ఇతనిరాజ్యమును రామరాజ్యముతో పోల్చుచు శేషాచలపతి యనునొకకవి "కోసలభోసలీయ" మను నైదుసర్గలకావ్యము రచియించెను. ఇందు శ్రీరామకథ భోసలరాజకథ జోడింపఁబడినవి. ఇది మనోహర మైనకావ్యమేకాని యముద్రితము. ఇంక,

## శ ర భో జీ రా జు

ఇతఁడు శా. శ. ౧౬౩౩–౧౬౪౯ నడుమ తంజావూరుమండ లము నేలినవిద్వత్కవిరాజు. ఇతఁడు రామాయణకథను సంగ్రహించి రాఘవచరిత మనుపేర పన్నెండుసర్గల మహాకావ్యమును కుమారసంభ వచంపువును నిర్మించెను. రాఘవచరితానతారికవల్ల నీక్రిందివిషయము తెలియవచ్చినది.

ఢిల్లీశ్వరునికి సచివుఁడై యతనిసామ్రాజ్య మభివృద్ధికి తెచ్చి యతనివల్ల శ్వేతచ్ఛత్రాదులను బహుబిరుదము లందినశాహాజీమహారాజుకుమారులలో పెద్దవాఁ డయినయేకోజీ రాజ్యాధిపతి యయ్యెను. అతనికి దీపాంబిక యనుసాధ్వియందు జన్మించిన ముగ్గురుకొడుకులలో పెద్దవాఁ డయినశాహాజీమహారాజు భోజమహారాజును పోలినవాఁడు. అతనితరువాత రాజ్యమునకు వచ్చినవాఁ డీకవీంద్రుఁడు మహాశూరుఁడు నైనశరభోజీ.

“ఖ్యాత స్సనామాఖిలనందనీయో, మహీపతి శ్శాహజినామధేయః,
యదీయసాచివ్యసమేధితశ్రీః, ఢిల్లీపతి ర్యాభరికుతూహలేన,
ప్రాయచ్ఛ దత్యచ్ఛసితాతపత్ర, ధ్వజాదినానాబిరుదాఙ్కలక్ష్మీమ్ ”

“ మహౌజస స్తాసు చ తస్య జాతా, స్సుతా స్సువీరా స్సుగుణాభిరామాః
అభ్యర్హిత స్తే ష్వభవ చ్ఛ ధీమా, నేకోజినామా నృపసార్వభౌమః,

“ దీపామ్బికేతిప్రథితా పతిం త మవిన్ద దిన్దుం కిల రోహిణీవ,
తస్యా మజాయన్త సుతా స్త్రయో ఽస్య, శస్త్రేచ శాస్త్రేచ నికామదక్షాః,
తే ష్వగ్రజన్మా జగతి ప్రతీతః, శాహేంద్రనామా జితభోజకీర్తిః,

“ త స్యానుజన్మా తపనాతిచండ, ప్రతాపభూమప్రథమానలక్ష్మీః,
జగత్త్రయద్యోతిజయాపదానో, జయత్యుదార శ్శరభేంద్రనామా ”

“ ప్రౌఢైః కవీంద్రైః పరిశీలనేన, విజ్ఞాయ సాహిత్యవిలాసభేదాన్,
కరోతి కావ్యం రఘువీరగాథా, పవిత్రితం సైష ముదే బుధానామ్ ”

“ అస్తి ప్రసిద్ధా నగరీ రఘూణా, మలంఘ్యసీమా పరిఘా పరైర్యా తా,
తస్యా మజః కీర్తిసితాతపత్ర, చ్ఛాయయా మగ్నాయ శశాస పృథ్వీమ్ ”

అని యజమహారాజువర్ణనతో గ్రంథ మారంభించి శ్రీరాముఁడు రావణసంహారము గావించి తిరిగి వచ్చి రాజ్యము స్వీకరించునంతవఱకును మనోహరముగా కావ్యము నిర్మించెను.

ఇది యిటులుండ నొకవ్రాఁతప్రతిలో ద్వితీయసర్గాంతమున "ఇతి పంచరత్నకవికృతౌ రాఘవచరితే ద్వితీయ స్సర్గః"

అనుమాఁటలు కనఁబడినవని, యీకావ్య మాకవి రచియించి శరభోజీపేరుపెట్టినట్లు అప్పుచిదొర యొక్కయభిప్రాయము వెల్లడించెను. ఇందుకు వైలేఖకునిపొరపాటు తప్ప వేఱే యాధార మేమియు లేదు. రాజమహారాజులు నిర్మించినకృతుల కిట్టి యపవాదము మనదేశములో నున్నదే: కవిత్వము సరస మనుట కింకొకశ్లోకము:—

"తతో వసిష్ఠానుమతౌ స్థితో౽సౌ,
వాలోక్య సర్వా నపి మన్త్రివృద్ధాన్,
ఆహర్తు మిచ్ఛ న్మహ మశ్వమేధ,
మభీష్టసిద్ధ్యై తురగో విమోచ్యః"

ఇదియు నముద్రితమే. ఈభాషాసేవకుఁడైనరాజు తననాఁటికుపలబ్ధము లైనసంస్కృతగ్రంథము లనుగంటి పోకుండుటకై సరస్వతీ మహాల్ అనుపేర పుస్తకభాండాగారము నెలకొల్పెను. ఇతనిరాజ్యము తరువాత నెన్నిరాజ్యములో గతించినవి కాని, యీపుస్తకాగారము మాత్రము సకలజనానందదాయక మగుచు నట్టే విలసిల్లుచున్నది.

ఇతనితమ్మునిపౌత్రుఁడైనతుల్జాజీరాజు సంగీతసారామృత మను నొకకృతి నిర్మించెను. తంజావూరురాజ్యమున నీభోసలవంశరాజు లారంభించి యభివృద్ధికి తెచ్చినసారస్వతసేవయే వారితరువాత దక్షిణదేశపాలకు లైనవిజయరంగచొక్క భూపాలాద్యాంధ్రరాజులు భాషాపోషకు లగుటకు మార్గదర్శక మయ్యెను.

# అనంతార్యుఁడు

ఇతఁడు కర్ణాటకవులలో నొకఁడు, మైసూరు (మహీశూర) నివాసి కృష్ణరాజమహారాజునాస్థానములోనివాఁడు. ఆరాజు శా. శ. ౧౬౩౬—౫౩ నడుమ నున్నవాఁడు.

సింగరాజాచార్యునితనయుఁ డైనయీకవి కవిసమయకల్లోల మనునొకలక్షణగ్రంథము నిర్మించెను. ఇందు మమ్మట ధర్మసూరి ప్రముఖులమతములు గ్రహింపఁబడినవి. కృష్ణరాజజయడిండిమ మనుమఱియొక కావ్య మాతనిసుగుణములను వర్ణించుచు రచియించెను. అందలిది.

"కృష్ణనృపాలకృపాణీ చపలయాం పాణిసరణిచపలాయామ్,
అరివనితానయనపథా ద్వ్యపిటి రజ్జే చతుర్దిక్షు"

కవిసమయకల్లోలావతారికలో నితఁడు స్వవిషయ మిట్లు తెలిపెను.

"ఏధతాం సింగరాచార్యగురు ర్యత్కీర్తిచంద్రమాః,
క్షీరాబ్ధిశాయినో విష్ణో ర్నాభీపద్మం న్యమీలయత్,
తత్పుత్ర శ్చిత్రకృతి శ్చతురో ఽనన్తార్యకోవిద స్సుకృతీ,
చిత్రే కావ్యే ధీమాం శ్చక్రే కవిసమయకల్లోలమ్"

ఇతనితండ్రి సంగీతవిద్యలోఁ బ్రసిద్ధుఁడు. గాయకపారిజాత మను కృతి నిర్మించినవాఁడు. పూర్వోక్తాతిశయోక్తి కది కారణమై యుండ వచ్చును. ఇతఁడు చిన్నచిన్నసులభపదములతో శ్లోక మల్లుట యుపదేశించిపిదప నన్నమాట లివి.

"వర్ణానాం ది గియం ప్రోక్తా యథాలంకారశాస్త్రకమ్,
వర్ణనాకుశలై శ్చిన్త్య మనేవిధ మస్తి తత్"
ఉక్తవర్ణై రుపేతం యత్ తన్మహాకావ్య మిష్యతే"

తనకవిత నిట్లు ప్రశంసించుకొన్నాఁడు.

"ప్రాచీనసూరివచనప్రసన్నతా మే
వాణీ విశేషవిధురాపి ధినోతి ధీరాన్,
చంద్రార్కయోర్జ్వలకలఙ్కమషీవ యద్వా
చంద్రాననానయనకజ్జలకాళికేవ".

## వాంఛేశ్వరకవి

ఇతనిని కొందఱు వాంఛానాథుఁ డన్నారు. ఈకవి కర్ణాటకుఁడు వేదశాస్త్రవేత్త రాజనీతిజ్ఞుఁడు శా. ౧౬౬౨–౮౫ నడుమ తంజాపూరు రాజ్యము పాలించినతుక్కోజీపుత్త్రుఁ డగుప్రతాపసింహునిమంత్రి. దుష్టులను చేరఁదీయుచున్నయాతనికి హితము గఱపుటకై యన్యాపదేశముగా మహిమశతకము నిర్మించినవాఁడు. ఇతనిమునిమనుమఁడు మాధవార్యునిమనుమఁడు నరసింహపండితునికొడుకు నగువాంఛేశ్వరుఁ డితనిశతకమునకు వ్యాఖ్య రచియించెను. ఈవిషయ మీక్రిందిమూలకారవ్యాఖ్యాకారులమాటలవల్ల విశదమగును, ముందు కవిమాటలు.

"శ్రీమద్భోసలవంశదుగ్ధజలధే స్సంపూర్ణచంద్రోపమో,
య శ్శాస్తి క్షితి మక్షతి క్షితిపతి ర్మూర్తః ప్రతాప స్స్వయమ్,
దీర్ఘాయు ర్జితశత్రు రాత్మజయుతో ధర్మి ప్రజారాగవా,
నుల్లాఘోఽస్తు న నిస్తులై ర్నిజసభాస్తారైః క్రమా దాగతైః,
నానాజిప్రభుశాహజీంద్రశర భేంద్రానందరాయాదయో,
విద్వాంసః ప్రభవో గతాః, శ్రితసుధీసందోహజీవాతవః,
విద్యాయాం విషబుద్ధయోహి వృషలా స్సభ్యా స్త్విదానీంతనాః,
కిం కుర్వేఽమ్బ! కృపే వ్రజామి శరణం త్వా మేవ విశ్వావనీమ్"

ఈక్రిందివి వ్యాఖ్యాతమాటలు.

"తత్ర తంజాపురం నామ రాజస్థాన మనుత్తమమ్,
రాజానః ప్రథితా స్తత్ర భోసలీయాన్వవాయజాః,

తదమాత్యకులోత్పన్నః శ్రీమాన్ వాంఛేశ్వర స్సుధీః,
శిష్టః కర్ణాటజాతీయో వేదవేదాంగపారగః...
మహిషవ్యాజతో రాజబుద్ధిం చక్రే సునిర్మలమ్,
తస్య నప్తా మాధవార్యపౌత్రః శ్రీనరసింహాతః,
వాంఛేశ్వరో లబ్ధజన్మా పితృప్రోక్తేన వర్త్మనా,
వ్యాఖ్యాస్యే తం ప్రీణ మ్యైత న్మాహిషం శతకం ముదా,
కాశ్యాం రచితా మాహిషశతకవ్యాఖ్యా సుధీముదే భూయాత్
బాణాగ్న్యద్రీందుమితేశాకే — ౧౭౩౫—ఇది వ్యాఖ్యారచనకాలము.

దీనినిబట్టి నానాజీశాహజీ మొదలగు విద్వత్ప్రభులు గతించిన పిదప నేటికి తంజావూరుసంస్థానమున వృషలులు సభ్యు లగుట సంభవించిన దని ప్రతాపసింహమంత్రి వాంఛేశ్వరుఁడు విచారించి రాజును దుష్టసహవాసమునుండి మరల్చుట కీశతకము నిర్మించినట్లును దీనివల్ల ప్రతాపసింహుఁడు బుద్ధి తెచ్చుకొని దుస్సహవాసము మానినట్లును విశద మగుచున్నది. అన్యాపదేశకావ్యములలో నీమహిషశతక ముత్తమపఙ్క్తిని నడచిన దనుట నిజము, కవిత్వమును శ్రావ్యముగానుండును.

"సుగ్రీవో ఽసి గజేశ్వరో ఽసి! వపుషా నీలః ప్రమాథీ తథా,
ధూమ్రశ్చాసి మహానుభావ మహిష! త్వం దుర్ముఖః కేసరీ,
ఇత్థం తే సతతం మహాకపిశతాకారస్య సాహాయ్యతః,
సీతాం ప్రాప్య విలంఘ్య దుఃఖజలధిం నందాభిరామ స్స్వయమ్"

ఈవాంఛేశ్వరుఁడు గోవిందదీక్షితునిశిష్యుఁడు సద్వర్తనుఁడు రాజభక్తుఁడు, సంస్థానక్షేమమునకు భంగము కలిగించు దుర్మార్గుల నావలికి తోలుట యీశతకమునుద్దేశ మని విదితము. ఇతనికి ఘనశ్యాముఁ డను నొకకవి యీసమయమున ప్రత్యర్థిగా నుండెను. ఈసందర్భముననీవ్యాఖ్యాతనుగూర్చి యించుక.

# వాంఛేశ్వరుఁడు

ఇతఁడు మహిషశతకమునకే కాక హిరణ్యకేశి సూత్రములకును వ్యాఖ్య నిర్మించిన వైదికవాఙ్మయధురీణుఁడు, అది శా. ౧౭౩౮ లో పూర్తి గాంచినది. సాంబసదాశివునిశిష్యుఁడైన యితఁడు షడ్దర్శనములు చదివినవాఁడు శా. ౧౭౨౦-౧౭౫౪ నడుమ తంజాపురరాజ్య మేలిన రెండవశరభోజీ మహారాజునాదరము గాంచి సత్కారము లందినవాఁడు. కాశీనగరమున నుండి వ్యాఖ్యలు రచియించినతరువాతనే యితఁడు శరభోజీసత్కార మందినట్లు విదితము.

ఇతఁడు కాశీయాత్ర సలుపునపుడు దారిలో కృష్ణాతీరమందు పట్టవర్ధనవంశరాజు లగు రామచంద్ర హరి మహాదేవ గణపతు లనుసోదర ప్రభువులయాదరము గాంచినవాఁడని యితనివ్యాఖ్యావతారికలు చెప్పుచున్నవి. ఇతఁడు నిర్మించినకావ్యము లేవియు కనరావు గాని, తాతముత్తాతలకు పేరు తెచ్చినవైదికలౌకిక పాండిత్యమున నితఁడా కాలమున విద్వత్ప్రభువులమన్నన లందెను.

# ఘనశ్యాముఁడు

ఇతఁడు తంజాపూరునివాసి. మౌనభార్గవగోత్రమువాఁడు. ఇతని తల్లిదండ్రులు కమలాకాశీమహాదేవులు, పితామహుఁడు చౌండబాలాజీ మాతామహుఁడు తిమ్మాజీబాలాజీ. ఇతని మొదటిపేరు చౌండాజిపంతు. సుందరి కమల అనువా రితనిభార్యలు, చంద్రశేఖరుఁడు గోవర్ధనుఁడు ననువా రితనిపుత్రులు.

ఈకవి సంస్కృతసారస్వతము మథించినప్రతిభాశాలి. లౌకిక ప్రజ్ఞాధురీణుఁడు. భోసలవంశరాజులలోనిప్రతాపసింహునిమన్నన గన్న

వాఁడు. కొంతకాలము తుక్కోజీమహారాజునకు మంత్రిగానున్నవాఁడు శా. ౧౬౨౦-౧౬౮౦ లోనివాఁడు, మహిమశతకకర్త యైనవాంఛేశ్వరునికి సమకాలికుఁడు. అతనికిఁ బ్రతిస్పర్ధి. ఇతఁడు పదునెనిమిదవయేట యుద్ధకాండము నిర్మించి భోజునిరామాయణచంపువు పూరించిన ట్లీవిధముగాఁ దెలిపియున్నాఁడు.

"తే నాష్టాదశవత్సరేణ కవినా చౌండాజిపంతేన చ
శ్రీమా నాగచిత శ్చిరాయ జయతు శ్రీయుద్ధకాండో ముదా"

భోజచంపువునకితఁడే తరువాత వ్యాఖ్య వ్రాయుచు దానియవతారికలో భోజదేవు నిట్లు నుతించియున్నాఁడు.

"శ్వాసా యస్య నిబంధనా స్యనుపమః కంఠీరవో ఽయం కవిః
క్రీడాచంద్రతి శాణతి ప్రబలతి క్షేమేంద్రతి ప్రౌఢతి,
శ్రీకంఠ త్యపి భర్తృమేంఠతి పునః శ్రీసార్వభౌమ త్యహో,
నైకో వా నవఖండభూమిషు గుణం గృహ్ణాన్ విభు ర్భోజతి"

ఇతఁడు సుమారేఁబదికృతులు రచియించినమాట వాస్తవము. కాని, యిందొక్కటియు వీథికి రాక మూలల నణఁగిపోయినవి. ఇందు కితరకారణము లుండుఁగాక, సమకాలపండితులను కవులను తృణీకరించి విజృంభించినయితనిగర్వము కూడా యందొకటి కాకపోదు. ఇందు కితనిశమరుకాదులలోనియాత్మస్తుతివచనములు.

"పంచాశత్కృతయ శ్చ సట్టకముఖాః శ్రీకాళిదాసాధిక
స్యా స్యైతస్య మహాకవే ర్మమ ఘనశ్యామస్య వాచే నమః
"సరస్వతీ ఘనశ్యామో ఘనశ్యామ స్సరస్వతీ,
ఇత్యేవ యం ప్రతి ప్రాయః కింవదంతీ ప్రవర్తతే"
"తనురుచి యో న శ్యామః, కవీనాం స యది ఘనశ్యామః,
కవనే కమనశ్యామః, కి మసూయాభి ర్మృషైవ నశ్యామః"

కాళిదాసును మించిన తనవాక్కే తనకు నమస్కరింపఁదగిన దేవత యఁట! తనకును సరస్వతికిని భేదమే లేదఁట! తాను కవులలో ఘనశ్యాముఁడు కాని (గొప్పకోకిల) శరీరకాంతిలో శ్యాముఁడు కాఁడట!! "అసూయలకు చచ్చిపోదుమా" యన్నయితనిమాటలే నాఁడు సమానులలో నితఁ డేస్థితిలో నున్నాఁడో చెప్పుచున్నవి. అందుకే మహిషశతకకర్త యితని నన్యాపదేశముగా వృషలుఁడని తూలనాడి విడిచిపెట్టినాఁడు—ఇదంతా సత్యమైనా, యితనిసామర్థ్యము మాత్ర మసాధారణ మని చెప్పక తప్పదు. కవిపండితేతరులలో నితనికి పలుకుబడి హెచ్చు. ఆశు చిత్ర కవిత్వము లందుకు తోడ్పడినవి.సర్వతో ముఖ మైనపాండిత్య మున్నది. అందుచే రాజాదరణము లభించుచు వచ్చినది.

ఇతనికి భవభూతియందు గౌరవము మెండు. అతని మహావీర చరితములో నష్ట మైనయంకములు పూరించి దానికిని ఉత్తరరామచరిత్రకును వ్యాఖ్యలు నిర్మించెను. వాటికే కాదు, శాకుంతల వేణీసంహార ప్రబోధచంద్రోదయాదులు మఱిపన్నెండు కావ్యములకు వ్యాఖ్యానములు రచియించెను. ఉత్తరరామచరిత్రవ్యాఖ్య, ఒక శ్రీరామనవమి నాఁటిరాత్రిలో నిర్మించెనఁట. అది ముద్రితము. ప్రహసనములలో నితని చండానురంజనము గణింపఁదగినదే. దీనికడపటిశ్లోక మితనియాశు కవితాశక్తిని దెలుపుచున్నది.

" పటుషడ్భాషాకావ్యం నాటకభాణౌ చ సట్టకం చంపూః,
అన్యాపదేశశతకం రచితం యే నాశు ఖేలేవ"

ఇతనిభావస్వభావముల కితనిడమరుకమే సాక్షి. ఇది యొకవిచిత్ర మైనకల్పితరూపకము. ఇందలిప్రకరణము లలంకారము లనఁబడును. అవి, రాజానురంజన కవిదూషణ సుకవిసంజీవన కుకవిసంతాపనాదులు

పది. సూత్రధారపారిపార్శ్వకులు ప్రస్తావన జరిపినపిదప, కలహంసకలకంఠు లనుపాత్రములు ప్రవేశించి యభినయ మారంభింతురు. అన్యాప దేశముగాఁ నసూయ చూపువాం ఛేశ్వరాని విశ్వాత్కృవుల నంద ఱిని క్రమక్రమముగా నిందింతురు. సందర్భోచితముగా పోషకప్రభువుల నభినందింతురు.

రాజశేఖరుని కర్పూరమంజరి ననుకరించి యితఁడు నిర్మించిన యానందసుందరి యనుసట్టక మానాఁడు రంగమున కెక్కినట్లు కన వచ్చును— ఇతఁడు పూర్వకవికాలము తెలియక తననాఁడు వ్యాప్తికి వచ్చినభోజప్రబంధమును నమ్మి "భోజునిసభలో కాళిదాసభవభూతుల వలె మాననీయుఁ డైనబాణుఁడు కాదంబరి రచియించినట్లే దండి దశ కుమారచరిత యనుప్రహేళిక రచియింపఁబూని" యనుచు వ్రాసి యున్నాఁడు.

ఇతనిభార్య లిద్దఱును కవులు, వారు విద్ధసాలభంజికకు వ్యాఖ్య వ్రాయుచు నందు తమభర్త రచియించినయిరువదినాలుగు కృతులను వక్కాణించియున్నారు— ఇతనికొడుకు చంద్రశేఖరుఁ డితనిడమరుక మునకు టీక నిర్మించియున్నాఁడు. రెండవకుమారుఁడు పుట్టుగ్రుడ్డి, తండ్రి యుపదేశముననే సంస్కృతభాషాజ్ఞాన మార్జించి ఘటకర్పరకావ్యము నకు వ్యాఖ్య రచియించెను. అందు తనతండ్రి నిట్లు స్తుతించియున్నాఁడు.

" నిజజనకఘనశ్యామం, శేషవచఃప్రియ మశేషశాస్త్రజ్ఞం,
వందే యద్దత్తాగమ, దృశా సుఖసహం మ మాంధ్యదుఃఖ మభూత్ "

ఈఘనశ్యాముఁ డెట్టియుద్ధతుఁ డేని యగుఁగాక, జాత్యంధుఁ డైనకుమారుఁడు గోవర్ధనునికి జ్ఞాననేత్ర మిచ్చి యతనితోఁ గూడా యశఃకాయుఁడై జీవించియుండె ననుటకీశ్లోక మొక్కటియే చాలును.

" మూఢో ఽపి గోవర్ధననామధేయః,
పితృప్రసాదా దనవద్యవిద్యః,

సద్యః కవి స్తత్వరయా తనోతి
పంక్తి ప్రతీకాం ఘటకర్పరస్య ”

ఇట్లు భార్యలును పుత్రులును కవులై యుండఁగా తాను కవియై యానందించినఘనశ్యాముని జీవితము ధన్య మనుట నిజము.

# విశ్వేశ్వరపండితుఁడు

హిమాలయ సమీపమందలి ఆల్మోడానగరప్రాంతమున నున్న యొకపల్లె యితని నివాసము. ఇతఁడు “పాడియా కేపాండే” అను బ్రాహ్మణవంశమున నుదయించినవాఁడు ఇతనితండ్రి లక్ష్మీధరవరపండితుఁడు. శా. ౧౬౮౦ ప్రాంతమున నున్నయీతఁడు ౪౦ సంవత్సరములు నిండకతటినే దివంగతుఁ డయ్యెను. కాని, యీస్వల్పకాలములో నితఁడు చదివినచదువు వ్రాసినగ్రంథములు నాశ్చర్యము కలిగింపకపోవు. ఇతఁడు నిర్మించినవి గాఁ దెలియవచ్చిన గ్రంథము లివి:—అలంకారకౌస్తుభము అలంకారముక్తావళి కావ్యతిలకము కావ్యరత్నము రసచంద్రిక కవీంద్రకర్ణాభరణము రుక్మిణీపరిణయనాటకము నవమాలికానాటిక శృంగారమంజరీసట్టకము తర్కకుతూహలము సిద్ధాంతసుధానిధి మందారమంజరి ఆర్యాశతకము—వీనిలో మొదటియైదు నాలంకారికగ్రంథములు. ఆఱవది వ్యస్తసమస్తాదులగు శ్లేషజాతులను సోదాహరణముగాఁ దెలుపులక్షణగ్రంథము. ఇందలి ద్విసమస్తజాతి కొకయుదాహరణము.

“ కాముక-కదంబ-సద్భట-పూర్ణేందునిశీథినీ-భౌమాః,
వాచ్యాః, కథం చకాసతి కాంచనకలశాశ్చ కీదృశాః?”

జారుని కడిమిచెట్టును భటుని పూర్ణిమను అంగారకుని క్రమముగా నొక్కసమాసపదమునఁ దెలుపవలెను. ఆపదమే బంగారుకుండ లెట్లుండునో తెల్పునది కావలెను. ఇందుకు సమాధానము.

"కామినీపయోధరాకారాః,"

ఇట్లే యీకృతి చిత్రశ్లేషకవిత్వమున కాదర్శముగా నున్నది.

# రామదేవకవి

ఈతఁడు చిరంజీవిభట్టాచార్యుఁ డని ప్రసిద్ధి కెక్కినవాఁడు. వంగదేశమున రాఢాపుర మితనినివాసము. ఇతనితాత కాశీనాథుఁడు, తండ్రి రాఘవేంద్రుఁడు. గురువు జగదీశతర్కాలంకారపండితుఁడు. శా. ౧౬౫౩ ప్రాంతమున ఢక్కాసంస్థానమున మంత్రిగా నున్నయశ్వంతసింహునియాదరము గాంచినయీకవి, వృత్తరత్నావళి యనుఛందోగ్రంథమును శృంగారతటిని శివస్తుతి కల్పలత మాధవచంపువు కావ్యవిలాసము ననుకావ్యములును రచియించెను. ఇందు కడపటిరెండును ముద్రితములు.

విద్వన్మోదతరంగిణి యనునితనికృతి విచిత్ర కల్పనముతోడిది. ఇందు శృంగారహాస్యములు ప్రధానములు. నాట్యస్థలమున రక్తి కట్టు రూపకములలో నిది గణనీయము. ఇందు వివిధములైనజాతిమతాచారములు చర్చింపఁబడినవి. పాత్రముఖమున నట్టిచర్చలు ప్రేక్షకులకు నవ్వు పుట్టించును. ఇది ముద్రితమైనది. ఈగ్రంథముఖమున నితఁడు తన తండ్రి యగురాఘవేంద్రకవి శతావధానమహత్త్వము నిట్లు వర్ణించెను-

"ఏకైక మేకైకకవిప్రయుక్తం, శ్లోకస్థితం వర్ణ మపవ్యవస్థమ్,
ఆకర్ణ్య తత్సంఖ్య మథ ప్రయుఙ్క్తే స్వయంకృతం శ్లోకశతంచ వర్ణమ్
"రీత్యానయా శ్లోకశతం కవీనాం శతస్యనిర్వ్యక్త్యవధానరీత్యా,
సమస్యయా పూర్తిమతీ మథైనాం, స్వయంకృతశ్లోకశతీం తథైవ"

మఱియు నానాఁటియితరులు తనతండ్రిశతావధానమహిమను స్తుతించుచు వ్రాసినశ్లోకములను దనకృతులలో చూపియున్నాఁడు:—

" అయం హరిహర స్సిద్ధే రవిలంబసరస్వతీ,
సాక్షా చ్ఛతావధాన స్త్వ మవతీర్ణా సరస్వతీ"
" పుంరూపా దరణా సాక్షా దవతీర్ణా సరస్వతీ
జిత శ్శతావధానత్వే విష్ణునాసి న జిష్ణునా"

## మాధవకవి

ఇతఁడు కర్ణాటదేశీయుఁడు వారీగ్రామనివాసి. విష్ణుశర్మ యను (పంచతంత్రకర్తకాఁడు) మహావిద్వాంసునిపౌత్త్రుని పౌత్త్రుఁడు. ఇతని తండ్రి లక్ష్మణపండితుఁడు కవిచక్రవర్తి యనుబిరు దందినవాఁడు. శా. ౧౬౭౫ సంవత్సరము మాఘశుక్లచతుర్దశీ సోమవారమునాఁడు పూర్తి గావించిన యితనిదానలీలాకావ్య మొకటి ముద్రిత మైనది.

" తత్రాకారి కనీయసా సుకృతినా చేతశ్చమత్కారకం
కావ్యం కృష్ణకృపాభిలాషమనసా శ్రీదానలీలాభిధమ్ "
" వసుకరరసేందువర్షే పక్షే శుక్లే చతుర్దశ్యామ్,
చంద్రే తపసి కృతే యం వారీగ్రామే సురాజ్ఞి శూరజనే "

దీనినిబట్టి యితఁడు శా. ౧౬౦౦-౧౬౭౦ నడుమ నున్నవాఁడని తెలియ నయ్యెడి ఈకావ్యమున ౫౩ శ్లోకములు మాత్రము కలవు. గోపికలు శ్రీకృష్ణునికి పానీయము లిచ్చుట వాండ్రతో నతఁడు విహరించుట యనువిషయములు వర్ణింపఁబడినవి. కవిత్వము మృదువుగానే యుండును. రుచి చూచుట కొకటి:— ఇందు సృష్టి కంతకును సారము రాధ యని వర్ణింపఁబడినది.

" ధన్యేయం ధరణీ తతో౽పి మధురా తత్రాపి బృందావనం,
తత్రాపి వ్రజవాసినో యువతయ స్తత్రాపి గోపాంగనాః,
తత్రాపి న్యగుణైకధామపరమానందాత్మికా రాధికా,
లావణ్యాంబునిధి స్త్రీలోకరమణీచూడామణిః కాచన "

# దేవరాజకవి

ఇతఁడు తిరువాన్కూరుజిల్లాలోనిశుచీంద్రి మనుగ్రామమునకు దగ్గఱగా నున్నయాశ్రిమ మనెడియగ్రహారములో నివసించినవాఁడు శేషాద్రిపండితునికొడుకు. ఆయాగ్రహారికులు పండ్రెండుగురిలో నీకవి వంశమూలపురుషుఁడొకఁడు. ఇతఁడానాఁటి తిరునాన్కూరుమహారాజగుమార్తాండవర్మసభలోని విద్వత్కవి. ఆరాజు శా. ౧౬౫౧-౧౬౮౦ నడుమ రాజ్యము చేసెను.

ఇతఁడు తనపోషకప్రభువును నాయకుని గావించి బాలమార్తాండవిజయ మనునైదంకములనాటకము నిర్మించెను. అది యిపు డచ్చుపడినది. అందలివిషయము, నాయకునివిజయములు దానధర్మములు శ్రీపద్మనాభస్వామిసేవ మొదలయినవి. ఇందు ప్రస్తావనలో నీకవి తనపే రిట్లు తెల్పుకొనుచుఁ దాను వేదవిద్య చదివినవిషయ మెఱిఁగించినాఁడు.

"పరస్పరాదేశతయా ప్రయుక్తహాల్వర్ణకత్వా ద్ధృతవేదరూపమ్,
స్వకీయనామాద్యపదం వహన్తం జానీ కవిం వేత్సి హి రాజచూడమ్"

వకారదకారములు పరస్పరాదేశములగుటచే వేదరాజు దేవరాజయ్యెనఁట. ఇది యితని ప్రబంధాత్మకరత్నపేటికా వర్ణనము.

"ఏకా భూషణభూషి తేయ మితరా మాణిక్యహారోజ్జ్వలా,
కౌశేయాంబరధారణీయ మపరా చామీకరాఢ్యా పరా,
ఏషా పేటచతుష్టయీ మణిమయీ సమ్మానితా తే మయా,
ధీమన్ మామకపద్మనాభచరితాఖ్యాతుః ప్రబన్ధాత్మనా"

# శివరామత్రిపాఠి

ఇతఁడు కాశీమండలవాసి. తనగ్రంథమున నితఁడు నాగేశభట్టు పరిభాషేందుశేఖరమును స్మరించుటనుబట్టి శా. ౧౬౭౦ ప్రాంతము

వాఁడై యుండును. ఇతనినక్షత్రమాలికడపట నున్నయీశ్లోకమునుబట్టి యితఁడు పెక్కుకృతులు నిర్మించినవాఁ డని తెలియుచున్నది.

" కావ్యాని పంచ తను తేఽపిచ పంచసంఖ్యాః
టీకాస్తు సప్త దశ చైక ఉణాదికోశః
భూపాలభూషణ మథో రసరత్నహారో
విద్యావిలాస ఇనపూర్వశరత్ఫలాద్యాః "

కాని యీగ్రంథము లన్నియు నేమైనవో! ఇతనినక్షత్రమాల చమత్కారముగా నుండుటచే నించుక వ్యాపించినది. ఇది వ్యాకరణ పరిభాషలయర్థమును సులభముగా బోధించుచు చక్కనిలౌకికార్థమును గూడా తెల్పుచున్నది. ఇందు కొకటి.

" అర్థవద్గ్రహణే, నా నర్థకస్య గ్రహణమ్." పరిభాష
" అర్థవద్గ్రహణే యస్మా న్నానర్థకపరిగ్రహః,
సురూపధనినో ర్వేశ్యా గృహ్ణాతి ధనినం తతః"

సురూపార్థవంతులిరువురిలో వేశ్య అర్థవంతునే గ్రహించుచున్న దని లౌకికార్థము.

# రామవర్మవంచియువరాజు

అశ్వినేయ రామవర్మయనిపిలువఁబడిన యీరాజకవి కేరళదేశీయుఁడు. ఆ దేశమందలి వంచిజనపదము పాలించిన శ్రీపద్మనాభదాస వంచిపాలకులశేఖర రామవర్మవిభుని మేనల్లుఁడు. మేనమామ రాజ్యము చేయుచున్నకాలమం దితఁడు యువరాజుగా నుండి విద్యాభిమానుఁడై కవిత్వప్రియుఁడై కవిపోషకుఁడై కావ్యములు రచియించినవాఁడు. శా. ౧౬౭౭లో జన్మించినయితఁ డల్పాయుర్దాయుఁడై౧౭౦౯లో దివంగతుఁ డయ్యెను. కాని,యీయల్పకాలములోనే యితఁ డుత్తమకీర్తినార్జించెను.

ఇతఁడు రుక్మిణీపరిణయము శృంగారసుధాకరము కార్తవీర్యవిజయము సంతానగోపాలము వంచీస్తవము ననుకృతులు నిర్మించెను, ఇందు మొదటి దైదంకములనాటకము. కథ ప్రఖ్యాతము. కాని కొంత స్వాతంత్ర్యము చూపి రసోచితముగా పాత్రపోషణము గావించెను. ఇందు యదువీరుఁడైననాయకుఁడు వాసుభద్రనామమున విలసిల్లెను. రుక్మిణిని స్మరించిన యతనిమాటలు.

"యానేహంసమయీవ సారసమయీ వాత్యాయతే లోచనే
వర్ణే స్వర్ణమయీవ కర్ణమధురే వీణామయీవ స్వరే
మధ్యే శూన్యమయీవ ముగ్ధహసితే జాతీమయీవ స్మితా
కంఠే కంబుమయీవ సా ప్రియతమా చిత్తే వరీవర్తి మే"

వాసుభద్రునికై పరితపించుచున్నరుక్మిణికి దుఃఖాపనయనోపాయముగా చెలికత్తె నాయకునిముక్తాహారము తెచ్చి యివ్వఁగా తొమ్మునఁ దాల్చి యామె యన్నమాటలు.

"మదనశిఖికబళితో స్మే, అత్మేవ మహార్ఘహార! త్వం,
త్రిభువనజనమహనీయం, లబ్ధ్వా జనం వియుక్తో ఒపి
"భవతి శరీరం క్షీణం దయితస్య సమాగమే ఒలబ్ధే,
హృదయ! త్వం న విరహితం దయితేన క్లామ్యసీ త్యాశ్చర్యమ్,

## నారాయణతీర్థులు

ఇతఁడాంధ్రుఁడు తూర్పుగోదావరీ మండలములోని అమలాపురమితనిజన్మస్థానము ఇతనియింటిపేరుగాని, తల్లిదండ్రుల నామములుగాని తెలియరావు. ఇతనిగురువు శివరామానందతీర్థులు.

పైపేరే దేశమున విఖ్యాతికెక్కినది కాని, యీకవి, కావ్యాంతమందలియొక కీర్తనలో—

ఈమహాత్ముఁడుజయదేవ గౌరాంగ రూపగోస్వామి లీలాశుకులను బోలిన భక్తశిఖామణి, కొంతకాలము గృహస్థాశ్రమమందుండి సన్యసించెనో లేక బ్రహ్మచర్యాశ్రమమునుండియే సన్యసించెనో! కాని, శ్రీకృష్ణలీలాతరంగిణిమాత్రము సన్యసించినపిదపనే నిర్మించినట్లితని మాటలే తెల్పుచున్నవి. రుక్మిణీస్వయంవరసందర్భమందు దూతి రుక్మిణికి శ్రీకృష్ణునిచూపుచు నిట్లు పలికినది. ఈగీతపాదము ద్వాదశతరంగములోనిది.

“సుందరం పశ్య సుందరి! నందయశోదానందనం,
నందనందన మాకలయ, నారాయణతీర్థయతిగీతం”

అందే, రుక్మిణి కృష్ణుని ధ్యానించుచు నిట్లన్నది.

“నందసునందాదివంద్య మనన్యక, నారాయణతీర్థయతివరదం ”

“మనసాపి న గణయామి, మాధవా దన్యదైవం,
భవ్యనారాయణతీర్థ దివ్యదృగ్విధాయినం”

భగవదనుగ్రహమున నితఁడు దివ్యజ్ఞానదృష్టి సంపన్నుఁడయ్యె నన్న యీమాటయే నారాయణతీర్థయతి సాధనచతుష్టయ సంపత్తి సిద్ధించిన జ్ఞానయోగి యని విశ్వసించుటకు చాలును.

ఈతీర్థులు గేయకవిత్వ పద్యకవిత్వములు రెంటను ప్రవీణుఁడు. కవనమా, ప్రసాదగుణభాసురము, సుఖబోధ్యము. ఇందుకు శ్రీకృష్ణాన్వేషణసందర్భమందలియొకశ్లోకము—

“కదాచిద్గోవిందే గతవతి పరానందసదనం
నిరాకారం ధామ స్వక మితి చ విజ్ఞాపయతి తాః,
తదాకారం సాక్షాత్పర మధిగతాః కృష్ణరసికాః
పున స్తం గాయంత్యో రహసి మృగయంతి ప్రియతమం”

ఈతనికృతియందలి పండ్రెండు తరంగములలోను వర్ణింపఁబడిన విషయముల క్రమ మిది:—శ్రీకృష్ణప్రాదుర్భావము; కృష్ణుని బాల్యలీల,

గోవత్సపాలనము. గోపాలనము, గోపీవస్త్రాపహరణగోవర్ధనోద్ధరణములు, గోపీకృష్ణసమాగము, గోపికాగీతలు, రాసక్రీడ, అక్రూరాగమనాదికము, కంసవధ, ద్వారకాప్రవేశము, రుక్మిణీ కల్యాణము—దీనినిబట్టి రుక్మిణీపరిణయాంతకథ యిందు వర్ణిత మని విదితము—

ఇతని ప్రథమతరంగాంతగద్యమిది:—"ఇతి శివరామానందతీర్థపాదసేవక నారాయణతీర్థవిరచితాయాం కృష్ణలీలాతరంగిణ్యాం శ్రీకృష్ణప్రాదుర్భావవర్ణనం నామ—" ప్రతితరంగమందు నొక్కొకప్రధాన విషయమం దవాంతరకథావిశేషము లెన్నేని కలవు.

ఒక రిద్దఱు వ్యాఖ్యాతలు ద్వైత,విశిష్టాద్వైతపరముగా కృష్ణావతారతత్త్వము నావిష్కరించిరి గాని, శ్రీకృష్ణుఁ డద్వితీయపరబ్రహ్మమనెడిభాగవతార్థమునే ప్రసిద్ధరచయిత లైనకృష్ణభక్తు లందఱు విశదీకరించుచు వచ్చి రనుట నిజము. ఈతీర్థు లట్టిశుద్ధాద్వైతుఁ డని యితని కృతి పఠించినవారికి విదితమే. ఇందుకు రాసక్రీడావర్ణనమందలి రెండు మాటలు:—

"బ్రహ్మానుభూతిరసికాం శౌరే ర్వ్యాగ్లక్షణాం సుధాం,
గోప్యః పిబంత్యో మోదం తే కృష్ణబ్రహ్మణి తాః స్థితాః"
"అద్వయ మఖండిత మశేషజగదాదిం,
యత్రచ జగత్త్రితయ మాస్థిత మనంతే,
యత్ర విలయం పున రుపైతి మృది కుంభో
యద్వ, దవధారయత సత్య మితి మా మోహ్"

ఇట్లు "సత్య మితి మా మో" హ్మనుమకుటముతోడి యిరువది గేయములలోను సకలవేదాంతసార మైనయద్వితీయపరతత్త్వము చక్కఁగా నావిష్కరింపఁబడినది. ఇట్లే వస్త్రాపహరణసందర్భమందలి గోపీకృష్ణసంవాదమును పరమాత్మైకత్వమును బోధించుచున్నది:—

కృ- ఆవరణం మమ నహి తే దాతుం, భావయ గోపవధూజనబృంద !
గో- దేవ ! య దావరణం మమ నీతం, దేహి విభో ! భవతా త దనంత!

ఇతనిభక్తియోగనిష్ఠకు మెచ్చుకొని యాకాలమునం దితనిని భక్తు లారాధించుచుండెడివారఁట. భూస్వాము లైన కోలవెన్ను బుచ్చమరావు తిమ్మన్నరావుగార్లు భాగవతుల లింగన్న మొదలగువారి కిచ్చిన భూదానపట్టానుబట్టి యీకవి—ఫసలీ 1151–క్రీ. 1745– అనఁగా శా. ౧౬౬౮ ప్రాంతమందున్నవాఁ డని తెలియుచున్నది.

## శ్రీశైలం వేఙ్కట నృసింహకవి

ఇతనితండ్రి దాసమాచార్యుఁడు. అతఁడే యితనివిద్యాగురువును. అలంకారేందుశేఖర మనెడియైదుప్రకరణములకృతి నితఁడు రచియించెను. మొదటి ప్రకరణము తుదిగద్య యిది:—

" ఇతి శ్రీశైలకులతిలకస్య శ్రీదాసమాచార్యస్య తనయేన
తచ్చరణనలినయుగానుగ్రహలబ్ధసరససాహిత్యవిలాసేన
వేంకటనృసింహకవినా విరచితే ఉలఙ్కారేన్దుశేఖరనామ్ని
రసాలంకారశాస్త్రే నాయకప్రకరణం సమాప్తమ్ "

ఇతఁడు చూపినప్రకరణానుక్రమణిక యిది:—

" ఆదౌ నాయకలక్షణం తదను సత్కావ్యస్వరూపం తతః
శృఙ్గారాఖ్యరసశ్చ దోషగుణయో రుక్తిం చ శబ్దార్థగాం,
వాచ్యాలంకృతయ స్సహైవ గదితా స్సంసృష్టిభి స్సంకరై
రేవం పంచభి రంచితం ప్రకరణైః శాస్త్రం బుధాః పశ్యత "

ఈగ్రంథమునవతారికలో— చరిష్ణుసాలగ్రామవాసి యగు కృష్ణరాయబుధునికి పౌత్రుఁడును, హరిరాయబుధునికి పుత్రుఁడు నైన సుబ్రహ్మణ్యరాయకవి రచియించిన శాంతావిలాస మనెడి గీతప్రబంధ

మునకుఁ దాను వ్యాఖ్య రచియించినట్లు వ్రాసికొనియున్నాఁడు. ఆగ్రామ మెక్కడిదో, ఆసుబ్రహ్మణ్యకవి యెప్పటివాఁడో తెలియకున్నది. ఇతఁడు ... చెట్లూరనెడియొకగ్రామనామమును సంస్కృతీకరించెనేమో! అది కర్ణాటాంధ్రసంయోగమందలి యొకయూరు కావచ్చును. శివభక్తుఁడును శ్రీమంతుఁడు నైన యాసుబ్రహ్మణ్యసుధి యీకవికి పోషకుఁడగుట సత్యము. తద్వర్ణన మిది:—

“ సుమనః పరిమల్లాఢ్య సుధర్మాభ్యుదయాంచితం,
చరిష్ణుసాలనామాస్తి పురం సురపురోపమమ్ ”

“ తస్మి న్నాసేతుశీతాచలవితతయశాః సర్వసర్వంసహేశ
శ్రేణీమాణిక్యమాళివ్రజకలితశిరోలాలితామూల్యభూమా,
శ్రీమాన్ ధీమద్వరేణ్యప్రణుతగుణగణస్వాదుమాధ్వీకధారా
ధుర్యోదారాత్మసూక్తి ర్వ్యలస దసదృశః కృష్ణరాయార్యవర్యః ”

“ శ్రీకృష్ణార్యకుమారకాగ్ర్యహరిరాయాభిఖ్యవిద్వత్సుతః
సుబ్రహ్మణ్యసుధీ స్సదాశివకృపా శుంభత్కవితోన్నతిః—”

శ్రీశైలవంశములో అన్నయార్యుఁడు తత్త్వగుణాదర్శమును శ్రీనివాసార్యుఁడు తత్త్వమార్తాండజిజ్ఞాసా దర్పణములను రచియించి యున్నారు. ఆసోదరపండితులు శా. ౧౬౦౦ ప్రాంతమువారు. మైసూరుపాలకులలోని చిక్కదేవరాయనిసభలో శా. (౧౫౭౦-౧౬౨౮ నడుమ) శ్రీశైలం తిరుమలార్యుఁ డనునొకవిద్వాంసుఁ డున్నాఁడు. శా. ౧౭౦౦ ప్రాంతమునందు తాతార్యుఁడు మొదలగుకొందఱు కవులున్నారు. వారి నెవ్వరి నితఁడు స్మరించలేదు. ఇతనిని పైపూర్వులన్నయార్యాదులు స్మరించినట్లు కనఁబడదు. అయినా, యితఁడు శా. ౧౬౮౦ ప్రాంతమువాఁ డగునేమో కాని యంతకుఁ బూర్వుఁడు కాఁ డని తోఁచుచున్నది. 30- జూలై 1831 తేదీని వ్రాసినయితని

యలంకారేన్దుశేఖరముప్రతి యొకటి మద్రాసుప్రాచ్యపుస్తకభాండాగారమున నున్నది. అది యైనను ప్రథమప్రకరణముమాత్రమే. అయితే, ఆసేతు హిమాచలముగల సకలరాజాధిరాజులపూజ లందిన యీకవి పోషకునిపితామహుఁ డైనయాకృష్ణరాయార్యుఁ డెవరై యుండును. ఇది చరిత్రపరిశోధకులు పరిశీలింతురు గాక! ఇంక, కావ్య మవశ్యకర్తవ్య మని యీకవి గావించినప్రతిపాదన మాలోకింతము.

" శ్రేయసాం భవతి భూయసాం పదం, చేతనస్య భువి మానుషం జనుః,
సాహితీ యది ఘటేత తత్ర సా, సౌరభం పరమ మేవ ధర్మణః,
భాతి విద్రుమలతాంకురే యథా, పద్మరాగకలికా నవోదితా,
శక్తి రస్తి యది కావ్యనిర్మితౌ, తత్ఫలం హి తపసాం మహీయసామ్"

## నృసింహకవి

ఇతఁడు మైసూరునివాసి హాలాస్యమాహాత్మ్య మను తెలుగువచనకృతి రచియించిన యాంధ్రుఁడు, శివరామబుధునికుమారుఁడు అభినవకాళిదాసబిరుదాంకితుఁడు. అభినవభవభూతి బిరుదాంకితుఁ డైనఆలూరుతిరుమలకవి మిత్రుఁడు. శా. శ. ౧౬౪౬-౧౬౭౦ నడుమ చిరకాలము మైసూరుసంస్థానమున మంత్రియు సేనానాయకుఁడు నై పేరొందిన వాఁడును కలువె వీరభూపాలుని పుత్రుఁడును విద్వాంసుఁడు నైన నంజరాజు కృతినాయకుఁడు గా నంజరాజయశోభూషణ మనెడియాలంకారిక గ్రంథము నితఁడు నిర్మించెను. ప్రతాపరుద్రీయము ననుకరించి బయలుదేఱినయాలంకారికకృతులలో నిదియును దొలుతఁ బేరు గాంచినదే. ఇందు నాటకప్రకరణమునం దుదాహరణముగా చంద్రకలాకల్యాణ మనుపేర నొకరూపకమును స్వాయముగా నిర్మించియున్నాఁడు.

# ఈశ్వర సుమతి

నేఁటికిని సుమతినామాంకితు లందు కల రన్నవినికినిబట్టి యితఁడు తిరునల్వేలిజిల్లాలోనివాఁ డని యూహించుచున్నాను. ఇతనికాలము తెలియు నెట్టిప్రమాణమును లభించలేదుగాని, యితనిప్రాసయమకప్రియత్వము ప్రాచీనుఁడు కాఁడనుట కొకప్రమాణ మనవచ్చును. శా. శ. ౧౬-౭౦ ప్రాంతమువాఁడేమో!

ఇతఁడు పార్వతీపరిణయ మనుపద్యకావ్యము నిర్మించెను. తంజావూరుపుస్తకాగారమం దున్నదీనియొకప్రతిలోను తుదిభాగము శిథిలమైనదిగాని, యున్నదానినిబట్టి యిది యెనిమిదిసర్గలకావ్య మనఁదగియున్నది. ఈపేర నెందరో యెన్నివిధములకావ్యములో నిర్మించినారు కాని గుణమునం దిది యాపూర్వకావ్యములకు తీసిపోవునట్లు లేదు. ముందు హిమాలయవర్ణనముతో కావ్య మారంభ మైనది. ఇందు, అస్తమించుసూర్యబింబమును ఉదయించు చంద్రబింబమును హిమవంతుని కుండలములవలె నున్న వని చమత్కరించి యిట్లు వర్ణించెను.

"అస్తం య దమ్బోరుహబాన్ధవోద్యత్కుముద్వతీనాయకయో ర్దినాన్తే
బింబద్వయీ యస్య నితాన్తగౌరీ గణ్డస్ఫురత్కుణ్డలతాం విధత్తే"

ఇరువదిరెండుశ్లోకములలో హిమగిరి నపూర్వకల్పనలతో వర్ణించియున్నాఁడు. అందు శృంగారప్రియత్వ మీక్రిందివిధముగాఁ జూపెను.

"గుహాసు యస్మిన్ పురుషా లభన్తే యోషాజనానాం పురుషాయితాని"
"మన్దం చరన్ గన్ధవహః కిరాతీ రతిశ్రమం యత్ర నుద త్యజస్రమ్"

సప్తమసర్గలో సజ్జనసందర్శన మీక్రిందివిధముగా వర్ణింపఁబడినది.

"అక్ష్ణోః ప్రీతి మనక్తి చిత్త మసకృ న్నేనేక్తి లుమ్పత్యఘం,
సమ్పత్తిం మహతీం వ్యనక్తి విపదం ఛిన్తే విభిన్తే వ్యథామ్,

వైశిష్ట్యం విశినష్టి మార్ష్టి జడతాం ప్రద్వేష్టి దుశ్చేష్టితం
సర్వాభర్ష్టి మపి ప్రయచ్ఛతి సతాం ప్రాయేణ సన్దర్శనమ్"

# సూర్యనారాయణసుమతి

సుమతినామాఙ్కకుటుంబములోని మఱియొకకవి యైనయితఁడు తనప్రాసభారతకావ్యముతుద నీక్రిందిశ్లోకము లిఖించెను. దీనినిబట్టి యితఁడు కాశ్యపగోత్రుఁడు విశ్వనాథసుమతిపుత్రుఁడు నగును.

" పుత్రః కాశ్యపవిశ్వనాథసుమతేః శ్రీసూర్యనారాయణ
శ్చిత్రం ప్రాససమేతభారత మిదం కావ్యం కవి ర్వ్యాతనోత్
అత్ర ప్రీతి మనుత్తమాం సుమతయో యా న్త్యేత దాహుః కవే ర
త్రత్యం ఫల మిన్దిరాపతి రలం దద్యా త్పరోక్షం ఫలమ్ "

బుద్ధిమంతు లగువారు తనకావ్య మాదరముతో చదువుటయే కవికి ప్రత్యక్షఫలము. తరువాత శ్రీపతి యిచ్చునది పరోక్షఫలము.

ఇది పదునొకండుసర్గలకావ్యము. కర్ణాటకవిత్వశక్తి నాశ్రయించి యితఁ డిందు ప్రాసనియమ మేర్పఱచుకొన్నాఁడు. కావ్యమంతట నన్నివృత్తములలోను ప్రాస వాడి భారతకథను వర్ణించెను.

ఇతఁడు పూర్వోక్తుఁ డైనయీశ్వరసుమతికి తరువాతవాఁ డనెడి విశ్వాసముతో శా ౧౬౮౦ ప్రాంతమువాఁ డగు నని యూహించితిని. అగస్త్యవిద్యానాథునిబాలభారతము చదివి యితఁ డీప్రాసభారతము నిర్మించినాఁడేమో! ఇతని కవిత్వ మంత ప్రౌఢము కాదు గాని ధారాశుద్ధి కలదు. ధర్మరాజురాజ్య మిట్లు వర్ణింపఁబడినది.

"పితామహాముఖా దధో నిఖిలధర్మనిత్యాగమాః
శ్రితాః సుమతిశాలినా సుఖకరితా సురాణాం నృణామ్,

సతా సరసభాషిణా సకలదుష్టసంహారిణా
కృతా వసుమతీ సతీ చిర మనేన సైకప్రియా.

## రాక్షసకావ్యకర్త

కాళిదాసు నిర్మించిన వేఱు కావ్యములే కాని, మఱిముప్పదియేఁడు కృతుల నతనిపేరు మోయుచున్నది. జ్యోతిర్విదాభరణము మొదలైనయట్టికృతులలో రాక్షసకావ్య మొకటి. ఇది సుమారు ముప్పది శ్లోకముల చిన్నకావ్యము. దీనికి వ్యాఖ్యానము కూడా పుట్టినది.

గోత్రము తెలియనిఋషి యాంగిరసగోత్రుఁ డైనట్లుగా కవి పేరు తెలియనికావ్యములు కొన్ని కాళిదాసీయము లైనవి. కాళిదాసు పేరు పెట్టుకొన్న ఖ్యాతి వచ్చు నని కొన్ని పుట్టుకలోనే కాళిదాసకృతము లైనవి. భోజచరిత్రాది చాటుప్రబంధములు పుట్టినపిదప, కాళిదాసు శృంగారప్రియుఁడు పరకాంతాలోలుఁ డన్నప్రవాదము ముదిరిన పిదప నేదో కొంచెము కవిత్వము నేర్చినకాముకశేఖరు లొక రిద్దఱు కాళిదాసులే యైరి. అట్టివారిలో నొకరసికశిరోమణి యీరాక్షసకావ్య కర్త. ఈకృతి యర్వాచీనమే. ఇఁక నిందలివిషయము. "ఒకానొక శృంగారపురుషుఁ డొకవనములో తనకు వశ్య రాలైనయొకరమణితో నేమేమో సంభాషించి క్రీడించి తరువాత నాలుగెడ్లబండి యెక్కి తన యింటికేగెను.

" కశ్చి ద్వనం బహువనం విచరన్ వయస్థో
వశ్యాం వనాత్మవదనాం వనితాం వనార్ద్రామ్.
తద్వార్యరిప్రద ముదీక్ష్య సముత్థితంఖే,
నాగా మిమాం మదకల స్సకలాం బభాషే."

"ఏతావదుక్తవతి సుమానా స్స ఉక్త్వా
రన్త్వా దినం సహ తయా ప్రియయా వ్యాదీనః
యామ్యం చతుర్భి రనదుద్భి రదీనవద్భి
రారుహ్య, మాన మథ స ప్రయయా స్వగేహమ్"
"ఇతి శ్రీకవిచక్రవర్తి శ్రీకాళిదాసకృతం రాక్షసకావ్యమ్"
తరువాత నీక్రిందిశ్లోక మున్నది.
"విరమతి కథనం వినా న ఖేదః సతి కథనే సముపైతి కాఽత్ర లజ్జా?
ఇతి కలహ మధోముఖీ సఖీభ్యోఽలపితుమనా లపితుం సమాచకాంక్ష"

నాయిక తనతెన్నున తానింటి కేగి చెలికత్తెలను జూచి విచారముతో నున్నట్లు తలవంచుకొని జరిగినది చెప్పితేనేకాని దుఃఖము శాంతింపదు. చెప్పినపిదప నింక సిగ్గేమిటి? అనుచు వనములో తమకు జరిగిన కలహమును వినిపింప దొడంగెను. అనఁగా రహస్యక్రీడను మాటుఁగుప్పుచు కలహాకథను నాయకుఁ డుపదేశించినట్లు చెప్పఁబూనెనఁట. ఈయుసత్కావ్యములోనివిషయము రాక్షసకృత్యము, తాను నిర్మించినకృతిని మఱియొకని కారోపించుట రాక్షసకృత్యము. కావున నిది రెండు విధముల రాక్షసకావ్య మైనది.

# కొల్లూరి సోమశేఖర కవి

ఇతఁడు గోదావరీమండలమందలి అమలాపురముతాలూకాలోనిపేరూరు గ్రామమున జన్మించినద్రావిడబ్రాహ్మణుఁడు. ఇతఁడు సాహిత్యనిధి, మంచికవి. శా. ౧౬౫౦-౧౭౦౦ నడుమ ఖ్యాతి గాంచి యున్నపీష్వామాధవరావుసభలో సత్కార మందినవాఁడు. భాగవత చంపువు నిర్మించెను గాని, అది యణఁగియున్నది. వారణాసి ధర్మసుధి సాహిత్యరత్నాకరము ననుకరించి దానిని మించియుండవలె. నన్నభావ

ముతో నితఁడు సాహిత్యకల్పద్రుమ మను నలక్షణగ్రంథము నిర్మించెను గాని, అదియుఁ బాఠకలోకము నాకర్షింపక యట్లే యున్నది. అందలి కొంతభాగము మొన్న మొన్ననే ఆంధ్రాక్షరములతో ముద్రిత మైనది.

## శివానందుఁడు

దేవావతరణ మనెడితొమ్మిదిసర్గలమహాకావ్యము నిర్మించిన యితఁ డెక్కడివాఁడో యెప్పటివాఁడో తెలియదు. తెలుఁగులిపిలో వ్రాయఁబడినయీకావ్యము తాటాకుపుస్తక మొకటిమాత్రమే తంజావూరుపుస్తకాగారమం దున్నది. బర్నెలు సంపాదించిన దీనియిప్పటి సంఖ్య 3899 పుస్తకముమాత్రము శిథిలము గాక యున్న దనియు, ఇందు వర్ణింపఁబడిన యద్భుతకథలు కొన్ని తంజావూరుజిల్లాలోని తిరుక్కడయూరికి సంబంధించినవిగా నున్న వనియు నందలిగ్రంథపట్టిక నిర్మించినవా రనుచున్నారు. గ్రంథాంతమం దున్న "ఘటపురస్య మహిమాన మనపాయః" అనుమాటలోని ఘటపురము కుంభకోణమో, కడయూరో! మాయవరముతాలూకాలో నున్న కడయూరిలో నమృతఘటేశ్వరస్వామియాలయ మున్నది. ఇందలికథలు కొన్ని యాస్వామికి సంబంధించిన వగునేమో! ఈ తెలుఁగువ్రాఁతప్రతిని బట్టి యీకవి దక్షిణదేశమందాకాలమున స్థిరపడినయాంధ్రులలోని వాఁడనియు శా. శ. ౧౭౦౦ ప్రాంతమువాఁ డనియు తోఁచెడిని. ఇతని యీకావ్యము ముద్రింపఁ దగినదగును.

ఈపార్వతీపరమేశ్వరభక్తుఁడు శుద్ధాద్వైతుఁడు వేదాంతవిజ్ఞాని. కులగోత్రముల నైనను తల్లిదండ్రుల నైనను పేర్కొనలేదు. కాని, కవితాభిమానము లేకపోలేదు. తనకావ్యము తప్పక సుధీరంజన మగు ననుచు రసికత్వము తోఁప నిట్లనెను.

పురాతనే సత్యపి కావ్యసంచయే, మదీయకావ్యే రమతాం సుధీజనః,
విహాయ లోకే జరఠాంగసంగతిం, యువా తరుణ్యాం రమతే
యథా తథా "

ఇతని కవిత్వము హృద్యముగానే యుండును. ఇది గౌరీ స్తవము
ప్రకృతిలక్షణము:—

క్షణా దిదం యా సకలం చరాచరం,సృజత్యవత్య స్తయతి త్రిభి ర్గుణైః,
యయా నిరంగో ఒపి శివో ఒజ్గవా నభూ, త్కరోతు గౌరీ మమ
సా శుభం సదా "

గ్రంథాన్తము నందున్న యితనిమాట లివి:—
ఇతిశ్రీశివానందకృతౌ దేవావతరణే మహాకావ్యే నవమ స్సర్గః,
' బ్రహ్మైవేదం జగ త్సర్వం, బ్రహ్మణో ఒన్య న్న కిఞ్చన,
బ్రహ్మే న్య ద్భాతి చే న్మిథ్యా, యథా మరుమరీచికా "

# సంకర్షణకవి

ఇతఁడు శేషాచార్యునికుమారుఁడు సత్యాభినవతీర్థయతీంద్రుని
శిష్యుఁడు. సత్యనాథాభ్యుదయ మనెడిపదునొకండుసర్గలకావ్యము నిర్మిం
చినవాఁడు. కృష్ణాతీరమండలికొల్లూరుగ్రామ మితనినివాసము. ఇతనిగురు
వైనసత్యాభినవయతీంద్రుఁడు పూర్వకాలమునందు కృష్ణాతీరమున వసిం
చినవేదవేత్త యగుకృష్ణాచార్యునికి శ్రీహరికటాక్షమువల్ల కలిగినసత్య
నాథుఁ డనుమహాభక్తునికథలు చెప్పి కొల్లూరుగ్రామవాసుల కద్భు
తానందములు సమకూర్చినట్టును, ఆమహాత్మునికథనే గ్రంథముగా
నిర్మించినట్లు నవతారికలో వ్రాసికొన్నాఁడు. ఆమాటలు.

పురావధానీ సమభూ ద్ధి కృష్ణాచార్యాహ్వయో భూసురరా డ్ధరాయాం
యో బృంహయన్ సద్గుణవారిరాశి ర్గోత్రే ఒమలేమానసుభార్గవాఖ్యే

"కృష్ణాతటస్థే సమచారినామ్ని ద్విజాగ్రణీః సంవసతేఽతి శక్తః
"సేవాప్రసన్నస్య హరేః ప్రసాదాత్ ద్రుతం తయోః పుత్ర మణిర్బభూవ,
"ఏవం స సత్యాభినవో యతీన్ద్రః శ్రీసత్యనాథేంద్రమహాప్రభావమ్,
"పునః జనాన్ కృతార్థాన్, కొల్లూరుసంస్థాన్ విదధే దయాలుః,

ఈవిధముగా గ్రంథారంభము గావించి సత్యనాథమహాత్త్వము వర్ణించి గ్రంథాంతమం దిట్లు వ్రాసినాఁడు.

" శ్రీసత్యాభినవీనతీర్థయతిరాట్ శిష్యేణ తత్ప్రీతయే
శేషాచార్యతనూభవేన రచితే సంకర్షణే నాదరాత్
కావ్యే శ్రావ్యపదే మహాగుణనిధి శ్రీసత్యనాథోదయే
శ్లాఘ్యే సద్గుణసారలుబ్ధకవిభిః సర్గో ఽయ మేకాదశః

సత్యనాథయతీంద్రుఁడు శా. ౧౫౭౬ లో సిద్ధినొందెను. అతని చరిత మితనినాఁటికిపురాతనమైనది గావున నితఁడు శా. ౧౭౦౦ ప్రాంతమువాఁ డగును. ఈకావ్య మముద్రితము.

# భగవన్తకవి

ఇతఁడు దాక్షిణాత్యుఁడు తంజావూరుపాలకు లైనమహారాష్ట్ర రాజులనాఁటివాఁడు. విస్పష్టముగా తెలియరాదుగాని, యితఁడు శరభోజీ పరిపాలించుసమయమున తంజావూరులో నున్నవాఁ డని తోఁచుచున్నది. అంగలిమహారాష్ట్రచరిత్రలో నీకవిపే రున్నట్లుగా లిఖితపుస్తకపట్టిక సిద్ధముచేసినవా రనుచున్నారు.

ఇతనితండ్రి రంగాధరాధ్వరి. అన్నలు వరసింహసూరి, త్ర్యంబకాధ్వరి. ఇతఁడు భాగవతకథ ననుసరించి ముకుందవిలాస మనెడిపది సర్గలమహాకావ్యము నిర్మించెను. ఇందుకు దశమసర్గాంతమందలి యీక్రిందిశ్లోకమే ప్రమాణము.

" గంగాధరాధ్వరిసుతో నరసింహసూరే,
ర్య త్ర్యంబకాధ్వరిమణేశ్చ సుధీః కనీయాన్,
కావ్యే ఽముగా విరచితే భగవ త్తరామ్నా,
సర్గ శ్శుభో ఽజని ముకుందవిలాసనామ్ని "
ఇతిశ్రీముకున్దవిలాసేదశమస్సర్గః ..."

ఈగ్రంథము శిథిలము గాక చక్కఁగా నున్నది. కాని, యచ్చు పడలేదు. కల్పనలు వర్ణనలు భావములు నంత హృదయాకర్షకములుగా, లేవు. అయినా, యానాఁటి కొందఱికవితకు తీసిపోదు. రెండుశ్లోకములు.

" కృష్ణోఽపి కీ ర్తిధవళః పరిపూతమూ ర్తిః,
జారోఽపి సంగరహితోఽపి సహస్రదారః,
లక్ష్మీధరోఽపి విహితో దధిదుగ్ధచోరః,
తన్నిర్గుణం సగుణ మప్యనిశం భజామః "
ప్రాస్తాం పురస్కృత్య ధరాం సురారి,
కాన్తాంవిరించిప్రముఖా స్సుధాశాః,
దుగ్ధాబ్ధిమధ్యే శయ మంబుజాక్షం, శరణ్య మీయు శ్శరణం త్రిలోక్యాః

## వేంకటభూపతి

ఇతఁడు మైసూరునివాసి (మహీశూరపురము) ప్రధానిబిరుదాంచితుఁడు. మైసూరుమహారాజులయాస్థానమందు మంత్రియై యున్నవాఁడని బిరుదునుబట్టి యూహింపనగును. ఇతనికాల మిది యని విస్పష్టము కాకున్నది గాని, శా. శ. ౧౭౦౦ ప్రాంతమువాఁ డగును. మంచిసాహిత్యజ్ఞానము గలయీకవి కామకలావిలాసభాణము కుక్షింభరిభైక్షవప్రహసనము వీరరాఘవవిజయవ్యాయోగము విబుధదానవసమవాకారము సీతాకల్యాణ మనెడివీథి రుక్మిణీస్వయంవర మనెడియంకము

ఊర్వశీసార్వభౌమ మనునీహామృగము ఉద్ధృతవృకోదరప్రేక్షణకము అనెడిరూపకములను, అలంకారమణిదర్పణ మనులక్షణము నిర్మించినట్లు మైసూరుగ్రంథపట్టికవల్ల తెలియవచ్చును. కాని, యిందొకటియు వీథికి రాలేదు. కవిత్వము మృదుమధురమై శ్రావ్యముగా నుండును.

ఈక్రిందిశ్లోక మితనివీథిలోని దని నా కప్పుడు తెలియదు గాని, యిది నా బాల్యమందు విద్యార్థిలోకమున వ్యాపించి యున్నది. కల్పనము చమత్కారముగా నున్నది. ఇది నాందీశ్లోకము.

"శ్రీమద్ధామ సమామనన్తి కమలం తద్బాన్ధవం వా యయో,
ర క్ష్ణీన్దీవరరూప మాహు రథవా తద్బాన్ధవం వా బుధాః
సావర్ణ్యం తటితా నవ శ్శుభతరం ధత్తేఽథ వా తద్వతా,
భూయాస్తాం భుజగేన్ద్రశైలవసతీ తౌ దంపతీ సంపదే"

పార్వతీముగ్ధావస్థావర్ణన మైనయీక్రిందియీహామృగనాందీశ్లోక మెంతయు హృద్యముగా నున్నది.

"శంభో స్తత్ప్రథమం విహారభవనం సంభావితాయా రహః,
స్తంభోపాన్తనిగూఢసస్మితసఖీనేత్రాంబుజై రర్చితా,
చూడాచంద్రసులక్షితా మణిమయే దీపేఽపి హస్తావృతే,
దేవ్యాః ప్రేమభయత్రపావిలసితా ముగ్ధాస్థితిః పాతు వః"

ఇతఁడు రసికుఁడు విద్వాంసుఁడు అద్వైతుఁడు కవితాచతురుఁడు. ఇట్టివానిగ్రంథములు కూడా అడుగంటిపోయినవి. గ్రంథవినాశనమునకు గ్రంథబాహుళ్యము నొకకారణ మగునుగదా!

## నెల్లూరి వీరరాఘవకవి

ఇతఁడు కాశ్యపగోత్రుఁ డాపస్తంబసూత్రుఁడు రంగమంత్రి మనుమఁడు వీణవేంకటపతికొడుకు నెల్లూరుపురనివాసి. ఉత్తరకాండ

కథతోకూడ రామాయణకాండములకథ నేడుకాండములు గా సంగ్రహించి విశేషణరామాయణ మనుకావ్యము నిర్మించినవాఁడు. ఈమాట లాకావ్యమందలియవతారికయే తెల్పుచున్నది.

"శ్రీమత్కాశ్యపగోత్రపూతమహితాపస్తంబసూత్రస్య చ,
శ్రీమన్నెల్లురిరంగమంత్రిసుధియః పౌత్రస్య విద్యానిధేః,
శ్రీమత్పూజితవీణవేంకటపతేః పుత్రస్య రామాయణం
కావ్యం స్వీకురు వీరరాఘవకవేః శ్రీరామ! మే వాఙ్మయమ్"

ఇతఁడు చాటుకథాకావ్యకవి ఆశుకవి చిత్రకవి యైన ట్లీక్రింది మాటలు చెప్పుచున్నవి.

"శ్రీరామాంఘ్రిసరోరుహాఙ్కిత మిదం శ్రీరాఘవాఖ్యావతా,
ప్రోక్తం చారుతరం విశేషణమహారామాయణం వా నవమ్,
శ్రీమచ్చాటుకథాశుకావ్యరచనాచాతుర్యవాగ్వైఖరీ
శ్రీవైచిత్ర్యధురంధరేణ కవినా చంద్రార్కతారం వసేత్"

ఇతనికాలము సరిగా గోచరింపకున్నది గాని కవితారీతినిబట్టి యర్వాచీనుఁ డనితోచుచున్నది. శా. శ. ౧౭౦౦ ప్రాంతమువాఁడయి యుండును. ఈగ్రంథ మచ్చుపడలేదు. రుచి కొక్కశ్లోకము.

"దశరథవరపుత్రం తాటకాదేహదాత్రం,
జలధరసమగాత్రం సన్మునిశ్రేణిమిత్రమ్,
వికచకమలనేత్రం విశ్వసంస్తోత్రపాత్రం,
రఘుసరసిజమిత్రం నౌమి సీతాకళత్రమ్"

# ఏలేశ్వరపు పెద్దిభట్టు

తొల్లి విదర్భనుండి వలసవచ్చినయొక వెలనాటివైదికకుటుంబము గోదావరీమండలములోని యేలేశ్వరమున స్థిరపడినది. అందలియొకపురు

షుఁడు వేదవేదాంగవేత్త యైనమహాపండితుఁడు. వేదపాఠమునందు ధర్మనిర్ణయమందు ప్రామాణికుఁ డైనయావిద్వాంసుఁ డేలేశ్వరోపాధ్యాయు లని ప్రసిద్ధి కెక్కెను. ఆతనివంశములోనివాఁ డీకవి. శా. ౧౭౦౦ ప్రాంతమువాఁడు. ఇతఁడు వేదశాస్త్రప్రవీణుఁడు సాహిత్యవేత్త కవి. ఇతనికృతులలో నుత్తమ మైనదిసూక్తివారిధి. ఇది పదుమూఁడధ్యాయములగ్రంథము. భర్తృహరి యందలిగౌరవముచే నతని త్రిశతిలోని మొదటిశ్లోకమును తనకృతిమొదటను రెండవశ్లోకమును కృత్యంతమందు నితఁడు చేర్చుకొనియున్నాఁడు. ఈకృతి లోకజ్ఞానమున కాకరమై యలరుచున్నదిగాని ముద్రితముగాదు. బహుపండితులు తఱచుగా నుదాహరించు నీక్రిందిశ్లోకము దానిలోనిదే.

"ఆశాయా దాసా యే తే దాసా స్సర్వలోకస్య,
ఆశా దాసీ యేషాం తేషాం దాసాయతే లోకః"

ఈనీతికావ్యమందిట్టి శ్లోకములు ౧౪౦౦ ఉన్నవి.

## వేంకటాచార్యులు

వీరియింటిపేరు తిరుమఁబుక్కపట్టణంవారు. ఇతనితండ్రి అన్నయాచార్యుఁడు. నైజామురాజ్యములోని శూరవరముజమీందారు నాస్థానమందు శా. శ. ౧౭౦౦ ప్రాంతమం దున్నవాఁడు. ఇతని గురువు శ్రీనివాసాచార్యులు. ఈకవి తనవిషయ మిట్లు తెలిపియున్నాఁడు.

"షట్తన్త్రేషు స్వతన్త్రః ఫణిపతిభణితిప్రౌఢమేధాసనాథైః,
శ్రుత్యన్తాత్యన్తికశ్రీకృతిపటుమతిభిః శ్రీనివాసార్యవర్యైః,
తర్కాలంకారవాగీశ్వర ఇతి య దిదం మే విశిష్య స్వనామ,
ప్రోక్తం త త్తత్కటాక్షౌ ద్విశదయుతు మయం కౌస్తుభో ఉభూ న్నిబద్ధః

" శ్రీమ త్త్రిమ్మలబుక్కపట్టనమహావంశాబ్ధిరాకాసుధాకరశ్రీమద
ణ్ణయార్యదీక్షితతనయస్య తర్కాలంకారవాగీశ్వరస్య సర్వతం
త్రస్వతంత్రస్య శ్రీమద్వేంకటాచార్యస్య కృతిషు అలంకార
కౌస్తుభ స్సమాప్తః "

ఈగ్రంథమందు ౧౦౮ అర్థాలంకారములును ౬ శబ్దాలంకార ములును లక్ష్యలక్షణ సమన్వితములై యున్నవి. కవితారీతి తెలియుట కనుమానాలంకారమున కిచ్చినయీయుదాహరణము చాలును.

" కున్దబృన్ద మకరన్ద నన్దితా మన్దతున్దిల మిళిన్దసున్దరమ్,
శౌరిహారివన మేత దఙ్గణే శూయతే య దిహ వేణునిక్వణః "

ఈకవి అచలాత్మజాపరిణయ మనుపేర నొక శ్లేషకావ్యము కూడా రచియించియున్నాఁడు. ఈ రెండును పేరు లేక యణఁగియున్నవి.

# మధుసూదనకవి

ఇతఁడు మిథిలానివాసి, ఉచితీకులసముత్పన్నుఁడు. శుభదాపద్మ నాభులతనయుఁడు. మంచిసాహిత్యము గొప్పలోకజ్ఞానమును కల వాఁడు. చక్కనికవిత్వము చెప్పనేర్పరి. ఇతనికాల మిది యని నిర్ణ యింప నాధారము లేదు గాని, లభించినలిఖితపుస్తకములకాలమును బట్టి యితఁడు శా. ౧౬౨౦ ప్రాంతమువాఁ డని తెలియుచున్నది. ఇతఁడు తనయన్యాపదేశశతకముతుద వ్రాసినపద్యము లివి:—

" లేభే యం శుభదా తపోభి రమలైః శ్రీపద్మనాభా త్సుతం,
యద్దేశో మిథిలాఖిలావనితలాలంకారచూడామణిః,
తే నేదం మధుసూదనేన కవినా విద్యావతా నిర్మితం,
శ్లోకానాం శతకం ముదే సుకృతినా మన్యాపదేశాహ్వయమ్ "

"నిరవద్య మద్య శత మేత దతిప్రకటార్థవర్ణపద సంవలితమ్,
ఉచితీకులాంబుజవనీరవిణా మధుసూదనేన కవినా రచితమ్"

శంభుకవి యన్యోక్తిముక్తాలతయు, పండితరాయలభామినీ విలాసమును దీని కెక్కువమార్గదర్శకము లైన వనవచ్చును. కవిత్వము చమత్కారజనకమై వినోదహేతు వగును. ఇందు కొకయుదాహరణము ప్రాణులచిత్తవృత్తి దైవవశమై యుండు నన్నసత్య మిట్లు వర్ణింపఁబడినది.

"క స్సంబంధో య దభిరమతే వీక్ష్య మేఘం మయూరీ,
కై వాసక్తి ర్య దమృతరుచౌ సానుబంధా చకోరీ,
కో వా హేతుః పతతి పరితో యత్కృశానౌ పతంగః
ప్రాయే ణైవం విధి పరవశా ప్రాణినాం చిత్తవృత్తిః"

ఇది కావ్యమాలలోఁ బ్రకటింపఁబడినది.

# విశ్వనాధకవి

ఇతఁడు గోదావరీ తీరమునందలి యొక విద్వద్వంశములోనివాఁడు ఇతనితండ్రి తిరుమలదేవుఁడు కాశీపురమున కేగి యచ్చట స్థిరపడుటచే నితఁ డక్కడనే పెరిగి సంస్కృతభాష చక్కఁగా నభ్యసించి శబ్దశాస్త్ర ప్రవీణుఁడై కవియై యందు ఖ్యాతి కెక్కెను. ఆంధ్రుఁడై యన్యదేశమునఁ బే రొందిన యీకవి శా. ౧౭౩౦ ప్రాంతమువాఁడు.

ఇతఁడు రచియించిన మృగాంకలేఖానాటిక యచ్చుపడి యాదేశమున వ్యాప్తి గాంచినది. ఇది బహువిధముల రత్నావళీప్రియదర్శికల ననుకరించినది. ఇందలికథ మృగాంకలేఖాకర్పూర తిలకుల పరిణయము. కథ కల్పితము, రసము శృంగారము కవిత్వము రసవంతముగానే యుం

డును. చైత్రమాసవాయువులు మన్మథునిదూత లని వర్ణించిన యీక్రిందిశ్లోకమితని శైలికుదాహరణము.

“ కావేరీ జలసంగశీతలశిలాపృష్ఠే లుఠన్తః క్రమా,
ద్దాంధ్రీపీనపయోధరోచ్చశిఖరప్రోద్ధారసంచూర్ణితాః,
చోళీలోచనలాలితాః కుచతటే లాటీభి రాలింగితాః
దూతా ఏవ మనోభవస్య భువనే చంచన్తి చైత్రానిలాః”

దీనినిబట్టి యితఁడు నాలుగు దేశములు తిరిగినవాఁడేమోయని తోఁచుచున్నది.

# కల్యాణసుబ్రహ్మణ్యకవి

ఈతఁడును పూర్వోక్తుఁడైన బాలరామవర్మకులశేఖరునియాస్థానములోనికవియే. ఇతనితండ్రి సుబ్రహ్మణ్యము. తాత గోపాలుఁడు. తిరువాన్కూరు మధ్యభాగమందలి పరితలము వీరి మొదటినివాసము. అదియే వీరియింటిపేరు. ఇతఁ డలంకారకౌస్తుభ మనే కావ్యలక్షణగ్రంథము రచియించెను. అందు రామవర్మను, అనంత పద్మనాభస్వామిని, తాను స్తుతించుచు రచియించినశ్లోకములే యుదాహరించియున్నాఁడు.

తనపోషకరాజు గతించినసమయమునందాసంస్థానము విడిచి చందనూరులోని సామంతరాజులకడ కేగి కొన్నిసంవత్సరములందుండి పిదప శా. ౧౭౩౬లో తిరువాన్కూరురాణి తన్ను పిలువనంపఁగా మరల నాయాస్థానము చేరి శా. ౧౭౪౦ ప్రాంతమున స్వర్గస్థుఁ డగువఱకు నందే యుండెను-ఆసమయమందే సంస్కృతభాషలో నున్నవ్యవహారమాలయను తిరువాన్కూరురాజకీయవ్యవహార గ్రంథమును మలయాళములోని కనువదించెను-ఇతని యీలక్షణగ్రంథముగాని, పద్మనా

భవిజయముగాని ముద్రితము కాలేదు. అలంకారకౌస్తుభములోని దొక శ్లోకము.

"రారాజన్మధురాధరాం ప్రవిలసచ్చోళాం కనత్కుంతలాం,
కాశ్మీరాంగవిభూషణాతిలలితాం కాంచీగుణాలంకృతామ్,
క్షోణీం శ్రీరఘురామవ న్నిరుపమాం రత్నాకరోర్యూర్మికాం,
జాలాం తా మనురంజయ త్యనుదినం శ్రీరామవర్మప్రభుః"

# విశ్వేశ్వరకవి

ఇతఁడు అల్మోధపురప్రాంతమువాఁడు. పాండేవంశములోనివాఁడు ఇతనితండ్రి లక్ష్మీధరుఁడు,అన్న ఉమాపతి. ఈకవి బాల్యమునందే గ్రంథ రచన మారంభించి పెక్కుకృతులు నిర్మించి 3౮ సంవత్సరములవయస్సు నందే పరలోకగతుఁ డయ్యెను.

ఇతఁడు నిర్మించినకృతు లనేకములు.అం దలంకారశాస్త్రవిషయ మున రచియించిన వధికము. వానిలో నీక్రిందికృతులు బొంబాయిలోను కాశీనగరమందును ముద్రితము లైనవి. అలంకారకౌస్తుభము అలంకార కర్ణాభరణము అలంకారకులప్రదీపము అలంకారముక్తావళి కావ్యలీల రసచంద్రిక రుక్మిణీపరిణయనాటకము శృంగారమంజరి యనుప్రాకృత కావ్యము మొదలయినవి కొన్ని యముద్రితములు. ఈకవివంశములోని యెనిమిదవతరమువా రిప్పు డున్నట్లు తెలియచుండుటచే నితఁడు శా.శ ౧౭౮౦ప్రాంతమువాఁ డని విశ్వసింపవచ్చును.

శివభక్తుఁడు సుశీలుఁడు సంస్కృతసారస్వతస్వతంత్రుఁడు నై నయీ కవి ముం దలంకారకౌస్తుభము నిర్మించి బాలురసుఖబోధకై పిదప నలం కారముక్తావళి నిర్మించినట్లు, తనతండ్రి మహాపండితుఁ డైనట్లు నీక్రింది విధముగా నందలియవతారికలో తెలిపియున్నాఁడు.

"నానాపక్షవిభావనకుతుకి మలంకార కౌస్తుభే కృత్వా,
సుఖబోధాయ శిశూనాం క్రియతేముక్తావళి స్తేషామ్"
"ఆచార్యః ప్రథమో గిరాం విజయతే విద్వాన్ స లక్ష్మీధరః"
"శ్రీమన్మహీమహితతద్దసీమధీమ,
న్మూర్ధన్యతాకలనసజ్జతధన్యతాకః,
లక్ష్మీధరో య ముదసూత ముదం ప్రసూతాం,
విశ్వేశ్వరస్య కృతి రస్య చిరస్య లోకే"

కవిత్వము ధారాశుద్ధి కలిగి శ్రావ్యముగా నుండును.

"ఆప్యాదే ర్జగతాం నవో లవణిమా సీద న్తి గాత్రాణి కిం,
రజ్యన్తే నహి మానసాని విషయే ప్రిత్యగ్ని రుద్ధాత్మనామ్.
ధిగ్వృత్తిం మనసః స్పృహాం తరళితాం లక్ష్యేత వాయం మయా,
ప్రేయా నిత్యచలాధిరాజదుహితు శ్చిన్తా చిరం పాతు వః"

# శంకరపురిరామచంద్రకవి

ఈకవి రాధావినోదకావ్యము నిర్మించినవాఁడు. ఇతనిపితామహుఁడు పురుషోత్తమపండితుఁడు. తండ్రి జనార్దనబుధుఁడు. ఇతఁ డాంధ్రుఁడు. శా. శ. ౧౭౫౦ ప్రాంతమువాఁడేమో!

ఇతఁడు శ్లేషయమకచిత్రకవిత్వప్రియుఁడు. తనచిన్నకావ్యమునకు తానే టీక రచియించుకొన్నాఁడు. లేకున్న నప్పటివారికే తెలియక పోవును. దీనిప్రారంభ మి ట్లున్నది. శ్రీదక్షిణాకాళికాయై నమః.

" మాలీనోద్యతమాలీ మాలీనో బలమాలీ,
మాలీనో వనమాలీ మాలీనో ఽవతు మాలీ"

తుద నున్నమాట లివి:—

"సజ్జనాః స్తోష మాయ్యాన్తి యది చే త్కిం ఖలేన నః?
దివాకరహీతానాఞ్చ శశినా కిం సరోరుహామ్? "

"రామచంద్రకవినా కవినాదఃపూరుషో త్తమసు తేన సుతేన,
రాధికాహృదయశోకద మాసీ ద్రాధికాహృదయశోకద మారాత్ "

"పురుషో త్తమసుతః జనార్దనః—"తత్సూనుప్రవరేణశంకరపురీ
శ్రీరామచంద్రేణసత్కావ్య స్యాస్య వినిర్గతస్య సుధియా భావప్రకాశః
కృతః "

"బ్రహ్మాదిభిః సురవరైః పరిగీయమానం
సంగీయమాన మఖిలం శ్రుతిభి ర్మురారిమ్,
గోపాంగనానయనవిభ్రమలాస్యమానం
సచ్చిత్స్వరూప మనఘం హృది భావయామి "

## శంభుకాళిదాసు

ఇతఁ డెక్కడివాఁడో! ఎప్పటివాఁడో! కాని, ఆధునికుఁడు. శా.శ. ౧౭౫౦ ప్రాంతమువాఁడేమో! ఇతఁడు రామాయణకథను రామచంద్ర కావ్య మనుపేర నిర్మించెను. నాలుగుసర్గలు, సుమారు ౩౫౦ శ్లోకములు. కవిత్వము సరసముగానే యున్నది కాని, అముద్రితము. గ్రంథాద్యరామస్తుతి.

"సానందం పరిపూరితాఖిలజగత్కామాయ నీలోత్పల,
శ్యామాయ ప్రభవే ప్రకీర్తితగుణగ్రామాయ రామాయణే,
ఆరామాయ సతాం మనో మధులిహాం కామాభిరామాయ చ,
ప్రోద్దామాయ పరాక్రమై రనుదినం రామాయ తస్మై నమః

# శ్రీనివాసకవి

వాజసనేయశాఖీయుఁడు లక్ష్మీవేంకటబుధులపుత్రుఁడు నైన యితనిచరితము నవేద్యమే. ఇతఁ డెనిమిదిసర్గలసుమనోరంజన మను కావ్యము రచియించెను. ఇందలివిషయము శ్రీకృష్ణునిరాసక్రీడ. కవిత్వము రుచిగానే యుండును.

" కాచన సుమనోహారం నిదధే సుమనోహారం హరేః కణ్ఠే,
తస్యై సన్తుష్టో ఽయం హృత్స్థం నవరత్నహార మేవ దదౌ "

# వీరేశ్వరభట్టు

అన్యోక్తిశతకకర్త యైనయీకవి శతకాంతమునందు వ్రాసిన శ్లోక మిది.

" యో ఽభూ ద్ద్రావిడచక్రవర్తి ముకుటాలంకారభూతస్య రే
మౌద్గల్యస్య హరే స్సుతః క్షితితలే వీరేశ్వర స్సత్కవిః,
తస్య ప్రోద్గతసూక్తి నిర్మల సుధాశుద్ధాన్తరస్య క్షణా
దేషా నిర్మితి రుత్తమా మతిమతాం నిత్యం ముదే జాయతామ్"

ఈకవి తండ్రి మౌద్గల్యగోత్రుఁ డైనహరి యని తెలిసినదిగాని, అతఁ డే ద్రావిడచక్రవర్తిగారికిరీటమున కలంకారముగా నుండెడివాఁడో తెలియదు. అయినా తమిళదేశమువాఁ డనవచ్చును. మహాకవినను కొన్న యితని యితరకృతు లేవియుఁ గనరావు కాని, యిది తక్కిన వారి యన్యాపదేశకృతులను మించినది కా దనియు, నితఁడు మిక్కిలి యర్వాచీనుఁ డనియు. (శా. ౧౭౫౦) భావింపవచ్చును. శైలి తెలియుటకై సముద్రాపదేశముగా నున్నయీక్రిందిశ్లోకము చదువఁదగును.

" ముక్తానా మసి నాయక స్త్రిజగతా మానందకందస్థలీ
జ్యోత్స్నానాథజని ర్జనైకశరణం మందాకినీవల్లభః,

కిం వాతః పర మస్తి జీవననిధే జల్పన్తి లోకా ముహుః,
తారం య త్తవ జీవనం ప్రతిదినం తే నైవ దూయామహే"

# లక్ష్మణాచార్యుఁడు

సహ్యాద్రికి సంబంధించియున్న మహారాష్ట్రదేశమందుకృష్ణవేణీనదీ తీరమం దున్నవాఱినగర మితనిజన్మస్థానము. ఇతనియింటిపేరు సాఖ గానంవారు. ఇతనితల్లి రాధాదేవి, తండ్రి వేణీమాధవుఁడు. సోదరుఁడు రాముఁడు. గురువు తర్కాదిశాస్త్రప్రవీణుఁ డైనరఘునాథపండితుఁడు. అత్రిగోత్రసంభూతుఁ డైనయీకవి 'చండీకుచపంచాశిక' యనుచిన్న స్తుతికావ్యము నిర్మించెను. ఇతఁ డర్వాచీనుఁడు శా. ౧౭౫౦ ప్రాంతము వాఁడు. ఇందు మొదటి ౧౮ శ్లోకములు గ్రంథావతారిక. తరువాతి ౫౦ శ్లోకములు దేవీస్తనస్తవము. కడపటి ౧౫ పద్యములు ఫలశ్రుతి. ఈవర్ణనమునెడ పాఠకులకు రోఁత పుట్టునేమో యని శంకించుకొని "ముందు తల్లికాళ్ళను వర్ణించవలసినదే కాని స్తన్యపానము ముఖ్య మని విశ్వసించి బాలలక్ష్మణుఁ డీస్తుతి చేసె" ననియవతారికలో నిట్లు చెప్పుకొన్నాఁడు.

"యద్యపి పదనుతి రాద్యా, కార్యా మాతు స్తథాపి విశ్వస్య,
ముఖ్యా మితి స్తనపానం, లక్ష్మణబాలేన తత్ స్తుతి ర్విహితా"
ఇఁక నితఁడు చేసిన స్తన్యపాన మెట్టిదో చూతము.

" అజీవం తదుపాస్మహే ఉదద్రిదుహితుః కర్పూరగౌరం కుచ
ద్వంద్వం నీలగళం సుచందనయుతం తత్ప్రాజ్ఞ ఖేంద్వంకితమ్,
య ద్వీక్ష్యైవ మమర్ద కిం నవ మిదం జీవత్య శేషే మయి
ప్రారూఢం శివయుగ్మ మన్య దబలాహ్వాన్మర్మ ణీ తీర్ష్యయా "

" చందనలేపనమునఁదెల్లనై నల్లనిమొనలతో తొలినాఁటి నఖక్షతములనేబాలేందురేఖలతో నొప్పుచున్న పార్వతివక్షోజయుగ్మమును జూచి శివుఁడు భ్రాంతుఁడై, నేను జీవించియుండఁగానే యెవరో యిద్దఱు శివులు వచ్చి నాప్రియురాలిఱొమ్మెక్కినారిదేమిటి? యనుచు నేత్రస్తనములను నలిపివేసెనో ఆ స్తనములను యావజ్జీవ ముపాసింతు నని యీ కవి స్తనోపాసనచేసినాఁడు. అసత్కావ్య మన నిట్టిదే కదా! వైష్ణవము ముదిరి వీరవైష్ణవుఁడై నయీకవి గౌరీశంకరనిందకుఁ డగుట విదితము. కావ్యమాలాసంపాదకు లెందుకు దీనిని ప్రకటించినారో!

ప్రతిశ్లోకములోను జననీ మాతః ఇత్యాదిగా సంభోధించినంత మాత్రమున నితఁ డీశ్వరీభక్తుఁ డనియెవరు నమ్మెదరు? "హరుఁడు నీ స్తనములను మర్దించి జగత్సంమర్దనపద్య నభ్యసించుచున్నాఁ డనుట యెట్టికల్పనమో, పరిశీలించువారి కీకావ్య మెట్టిదో గోచరించును. కుచములను ఏనుగులతోఁ బోల్చి కావించినయీవర్ణన యొకటే చాలును దీనియనౌచిత్యమును వెల్లడించుటకు

" భవేతాం క్షేమాయ స్మరహరవధూరోజకరిణౌ
యయో రేకా రోమావళికపటశుణ్డాద్భుతకరీ,
మహాదేవస్యా స్తప్రచురతరకాసారగతయా
యయా తద్వ్యాపారామ్బుజ మపహృతం క్రీడనవిధౌ"

# శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి

కాసలనాటి వైదికులలోని పండితకుటుంబములలో శిష్టువారి దొకటి. వీరి మొదటినివాసము గోదావరిమండలమున కాకినాడకు దగ్గఱగానున్న గొల్లపాలెము. అందలిసూరంభట్టుగారి వంశమున నితడు శా. ౧౭౧౨లో జన్మించెను. ఇతనితల్లి గౌరమ్మ, తండ్రి సర్వశాస్త్రి

తాత గోవిందప్ప. ఇతఁడు వసిష్ఠగోత్రుఁ డాపస్తంబసూత్రుఁడు కృష్ణ యజుర్వేదశాఖీయుఁడు. సంగీతసాహిత్యములు రెండును రెండుకన్నులుగా నాంధ్రదేశమునలుగడల సంచరించి రాజసత్కారము లందినధీరుఁడు. సంస్కృతాంధ్రములందు బహుగ్రంథములు రచియించి, అనుచిత్ర బంధ యమక శ్లేష కవిత్వములఁ జాతుర్యము చూపి మెఱసినవాఁడు, సంగీతశాస్త్రమునఁ గృతార్థుఁడై పెక్కుకృతులు నిర్మించి వీణావాద్య మునఁ బేరొందిన యుత్తమగాయకుఁడు. యజుర్వేదమభ్యసించుచునే కావ్యనాటకాలంకార గ్రంథములు చదివి వ్యాకరణశాస్త్రమునఁ గృత పరిశ్రముఁడై చిన్ననాఁట నంకురించిన సంగీతకలను పెంపొందించుకొన్న ప్రజ్ఞాశాలి. న్యాయమీమాంసాదులఁ గూఁడ బరిచయము సంపాదించిన చతురుఁడు. కాని యితనికిఁ బేరు తెచ్చినవి కవిత్వసంగీతములు రెండే.

రామచంద్రపురమున శ్రీరాజా కాకర్లపూడి రామచంద్రరాజు గారియాస్థానమున నీకవితండ్రి సర్వశాస్త్రిపౌరాణికుఁడుగా నుండెడివాఁడు. ఆయనవృద్ధుఁ డగునప్పటి కితఁడు వారియాస్థానమున విద్వత్కవిస్థాన మలంకరించి కవితావినోదమున రాజుమెప్పు గాంచి యీనాములు సంపాదించి కొన్నిసంవత్సరములు గడపి, అమలాపురముదగ్గఱ నున్న అయి నవిల్లిగ్రామము మొఖాసాదారగుదంతులూరి వెంకటకృష్ణరాజుగా రాహ్వానింపఁగా రామచంద్రరాజుగారి యనుమతి నంది యచ్చటి కేగి కొన్నేండ్లందుండి మఱికొన్ని యీనాములు సంపాదించెను. అనంతర మారాజు ననుమతినంది మరలరామచంద్రరాజుసభకు వచ్చి యాతేని సోదరు లగుజగన్నాథపద్మనాభ నరసింహరాజుల యాదరమునకుఁ బాత్రుఁడై కవిత్వగోష్ఠిఁ గాలము గడపుచుండెను. ఆసమయమందే షడ్వికామదాపరిణయ మనుప్రబంధము నిర్మించి పద్మనాభరాజునకు

కాజులూరుగ్రామసభలో కృతియిచ్చెను. ఆకాలమునం దితఁడు రచియించిన వెక్కువగాఁ దెలుఁగుకృతులే.

తన పేరు చక్కఁగా వ్యాపించుచున్నయాకాలమునందే యీకవి జగ్గంపేటపాలకుఁడైన శ్రీరాజా రావు వెంకటరావుసభలో వీణవాయించియు, ఆశుకవిత్వము చెప్పియు సభ్యుల మెప్పించి యారాజువల్ల భూరూపసత్కారము గాంచెను. ఇట్లు పెద్దాపురము కాట్రావులపల్లి మొదలగుచోట్ల నున్నభూనాయకులు చేయుసమ్మానము లందుచు శా. ౧౭౭౦ ప్రాంతమున నాఁటి రాజగు శ్రీదామెరవెంకటపతిరాయణింగారియాహ్వాన మంది కాళహస్తిసంస్థానమున కేగెను. అక్కడ రమారమి ౧౨ సంవత్సరము లుండి యాతేనియాదరమున సంతుష్టుఁడై గ్రంథములు రచియించెను. అందున్నకాలమునం దితఁడు—కంకణబంధము యక్షోల్లాసము-మదనాభ్యుదయభాణము-నల్లవీపల్లవోల్లాసము-నీలశైలనాథీయము—అనుసంస్కృతకృతులును, హరికారిక లనుపేర సంస్కృతమున నాంధ్రవ్యాకరణము నిర్మించెను. ఇతనియనర్గళసంస్కృతకవితాధారకు మెచ్చియారాజు భూము లిచ్చి గౌరవించి యభినవకాళిదాసబిరుద మొసఁగెను. ఇతని కంకణబంధ మిది:— విద్యున్మాలావృత్తము.

“ నేతా దేవాళీనామాశా, ధానాధీనానేకాలోకీ,
మాస్థానాభాఖ్యాయోగీశం, పాయాదేతం రామే రాజా ”

ఇతనికిఁ బూర్వము ననులోమవిలోమపద్ధతిని శ్లోకములు నిర్మించినవా రున్నారుగాని, ఒక్కశ్లోకములో పెద్దకథ యిముడునట్లు వ్రాసినవారు లేరు. ఇది యపూర్వము, క్లిష్టాతిక్లిష్టము నైనమాట నిజము.

ఇందు, అనులోమముగా నొక్కొక్కయక్షరముతో నారంభించి చదివిన, ముప్పదిరెండక్షరములశ్లోకములు ముప్పదిరెండును, అట్లే

విలోమముగాఁ జదివిన ముప్పదిరెండుశ్లోకములును మొత్త మఱువది నాలుగుశ్లోకము లేర్పడును. దీనికి, కంకణబంధరామాయణ మని పేరు. దీని కితఁడు వ్యాఖ్యానము వ్రాసికొన్నాఁడు గాని లేకున్న నితనికే తరువాత నర్థభ్రాంతి కలిగియుండును. వ్యాఖ్యావతారికలో నితఁ డీకృతి నిట్లు ప్రశంసించుకొనెను.

"నను కంకణబంధకృతిః కృతినా మపి నో సుకరా యదివా కవిభిః,
కతిభి ర్ఘటి తాస్తి తథాపి కథా, క్రమసంగ్రథితా న చకాస్తి భువి"

"చతుష్షష్ట్యర్థసంబంధో బంధో ద్వాత్రింశదక్షరః,
సతాం ముదే విజయతాం నితాంత మతిదుష్కరః"

"ప్రాచేతసాది కవిరాజ విరాజమాన
వాక్కేళి సింధుతతి సంగతి బంధురస్య
శ్రీరామకీర్తిభరభవ్యపయఃపయోధే
స్సేయం కృతి ర్భవతి కంకణబంధ ఏవ"

ఇం దేర్పడునఱువదినాలుగుశ్లోకములలోను ఆఱుకాండలలోని యఱువదినాలుగువిషయములు వర్ణింపఁబడిన వట.

"ద్వాదశాంశాః ప్రథమతో ద్వితీయేతు త్రయోదశ,
తృతీయే ష ట్చతుర్థే స్యు రేకాదశ తతో దశ,
పంచమే, ద్వాదశ తథా షష్ఠే కాండే క్రమా త్కృతాః"

మేఘుఁడు దూత్యము నిర్వహించి వచ్చి యక్షునికి సంతోషము గూర్చినట్లు మేఘసందేశమునుత్తరకథ నితఁడు యత్యుల్లాసముగా వర్ణించెను. ఈకృతి యీనాఁ డించుక వ్యాప్తికి వచ్చినట్లు హవిర్యాజి యైన సీతారామపండితునివ్యాఖ్యానము తెలుపుచున్నది.

ఈకవికి రావణదమ్మీయము లేక లంకావిజయ మనుద్వ్యర్థి కావ్యము నిర్మించినయాంధ్రకవి పిండిప్రోలులక్ష్మణకవి వయసునఁ బెద్దవాఁడైనసమకాలికుఁడు. ఉప్పులూరిగంగాధరశాస్త్రి ఇంద్రగంటి విశ్వపతిశాస్త్రి బులుసు అచ్చయ్యశాస్త్రిగార్లితనిగురువులు, వేదార్థ ప్రవక్తయై విఖ్యాతి కెక్కినమహాపండితుఁడు బులుసుపాపయ్యశాస్త్రి యితనికి గురుపుత్త్రుఁడైనమిత్త్రుఁడు.

సంస్కృతసాహిత్యము గాని శాస్త్రజ్ఞానముగాని లేనివాఁడైనను, పిండిప్రోలులక్ష్మణకవి తెలుఁగుకవిత్వమునం దితని కందందు ప్రతిస్పర్థిగా నుండెడివాఁడు. పాపయ్యశాస్త్రి కవి కాకున్నను శాస్త్ర ప్రసంగములయం దితనికిఁ బ్రతిస్పర్థియై యుండెడివాఁడు. శా.౧౭౮౬లో శ్రీరావువెంకటకుమారమహీపతి గంగాధర రామారాయణింగారు పట్టాభి షిక్తులై పీఠికాపురసంస్థానాధీశ్వరులై వేదశాస్త్రపండితులను కవులను సత్కరించుచున్నవార్త విని యీ విద్వత్కవి పిఠాపురము వచ్చి రాజా వారిని సందర్శించి కవిత్వసంగీతములను శాస్త్రవిజ్ఞానమునను సంతోష పరవశులను గావించి భూరూపసత్కార మపేక్షించెను. అప్పటి కించు కపూర్వమే పాపయ్యశాస్త్రిగారికి భూదానముచేసినపీఠికాపురీశ్వరుఁ డికఁ బండితులకు భూమి యివ్వఁదలచుకొనలే దని చెప్పి వేయినూట పదా ఱిచ్చెను. అది హేతువుగా నితఁడు పరోక్షమునఁ జెప్పినయొక శ్లోకము దేశమున నిలచియున్నది.

"రావురామనృపతా వుదారతా, భావు కాత్ర న కదాపి లోభితా,
కింతు సాధుసదలబ్ధవృత్తితా, హంత, పూర్వభవపాపవృత్తితా!"

అట్టియీకవి తరువాతకాశ్యాదిపుణ్యక్షేత్రములు సేవించివచ్చి శా. ౧౭౯౨లో దివంగతుఁడయ్యెను. ఈయనకొడుకు సర్వశాస్త్రి కవిగాయకుఁడునై కాళహస్తిసంస్థానమందుండి తండ్రిపేరు నిలిపెను.

# కోరాడ రామచంద్రశాస్త్రి

ఈకవి వేఁగినాటియాంధ్రుఁడు. గోదావరీమండలములోని అమలాపురముతాలూకాయందలి నడవపల్లి, కోరాడ వారిమొదటినివాసగ్రామము. ఈశాస్త్రి శా. శ. ౧౭౩౮ యువసంవత్సరాశ్వయుజశుద్ధ దశమినాఁడు జన్మించి ఆతాలూకాలోనే కేశనకుఱ్ఱు అనుగ్రామమున మాతామహులయింటఁ బెరిగెను. ఈయనజీవితచరితము ముద్రితములైన ఘనవృత్తాదిపీఠికలందు గనవచ్చుచున్నది గావున నిందు సంగ్రహముగా తెలిసికొందము.

ఈయన కౌండిన్య గోత్రుఁ డాపస్తంబసూత్రుఁడు శ్రీశైలమున మహాతపస్సు గావించినమహాదేవశాస్త్రివంశములోనివాఁడు. ఈకవి తల్లి సుబ్బమాంబ, తండ్రి లక్ష్మణశాస్త్రి, తాత అంబాదాసు, ముత్తాత జగన్నాథశాస్త్రి, ఆముత్తాతతండ్రి అల్లాడశాస్త్రి శతఘంటికచూడామణి బిరుదాంచితుఁడు. వీరిది విద్వద్వంశము.

ఇతఁడు మాతామహాదులవద్ద కావ్యనాటకములు చదివి కవనమల్లుచు కవితాసక్తి హెచ్చు కాఁగా నప్పటికి ప్రసిద్ధకవులైన శిష్టు కృష్ణమూర్తిశాస్త్రియొద్ద నలంకారగ్రంథములు చదివి సాహిత్యపటుత్వముతో కవితాపటిమగూడ నార్జించినప్రతిభాశాలి. ఆసుకవి యన్నపేరొంది స్వగ్రామమైన నడవపల్లి దేవాలయాంగణమున నొకమాఱు శతావధానముసలిపి శతావధానిబిరుద మందినవాఁడు. ఈకవి జీవికార్థమే దేనుద్యోగ మార్జింపనిల్లువెడలిబందరు పురముచేరి యందున్న నోబులు పాఠశాలలోనాంధ్రోపాధ్యాయపద మధిష్ఠించి యదికళాశాలమైనపిదపఁగూడనందే యధ్యాపకుఁడు గానుండిన యధ్యాపకశ్రేష్ఠుఁడు. ఈయన మెనుబదినాలుగేండ్లుజీవించి శా. శ. ౧౮౨౨ శార్వరిసంవత్సరశ్రావణమాసమున దివంగతుఁ డయ్యెను.

ఈకవి యాంధ్రమందును సంస్కృతమందును బహుకృతులు నిర్మించెను. వానిలో తొలుత నెన్నఁదగినది ఘనవృత్తము. ఇది కాళిదాసు మేఘసందేశమున కుత్తరభాగము. అందు తనసందేశము తన భార్యకు చెప్పవలసిన దని యక్షుఁడు మేఘుని కోరుటతో గ్రంథము సమాప్త మైనది. అట్లుకోరఁబడిన మేఘుఁ డాయక్షకాంత చెంతకు కామరూపముతో నేగి యక్షుని క్షేమవార్తను వానిసౌజన్యసౌశీల్యములను తెలియఁజేసిన ట్లుత్తరకథగా నీకవి యారెండుసర్గలకృతి నిర్మించెను. వృత్తము మందాక్రాంతమే శైలియు మనోహరము ప్రౌఢము- ఇది గ్రంథారంభశ్లోకము:—

" ఇత్యుక్తోఽసౌ సపది జలద స్తేన దీనాత్మనాలం
శ్రుత్వా కామం సరసహృదయప్రాగ్రణీత్వా త్ప్రహృష్టః,
లోకే దీనావన మనుపమం పుణ్య మాదత్త ఏవం
సన్తః ప్రోచు స్తదిహ హి మయా తోషణీయ స్సఖా మే "

ఈవిద్వత్కవి సంస్కృతమున ౨౨ కృతులును తెలుఁగున తొమ్మిదిగ్రంథములునునిర్మించెను.వీనిలోఘనవృత్తాదిసంస్కృతకృతులు నాంధ్రాక్షరముల నచ్చుపడినవి. వానిలో ఘనవృత్తమువలె శృంగార సుధార్ణవభాణమును ప్రశంసాపాత్రము. ఇది సాధారణభాణమువలెఁ గాక గుణమునందును రూపమునందును గూడ పెద్దది. శైలియు ఘనవృత్తశైలికంటె మృదువు. అయినను వర్ణన లతిదీర్ఘములై పాఠకులకు విసుగు పుట్టించునవిగా నున్నవి. ఎట్లయిన నీకవిభాష పరుషముగానే యుండును. ఈమాట యీకవి యీభాణములోనే యిట్లు తెలిపికొనెను "పునః కర్ణం దత్వా కిం బ్రూథ-అముష్య క్షీరకణస్య స్వతఃపరుషభాషిణః— పారుష్యదోషోపి నోద్ఘాటనీయోఽత్ర ... ...

ఈకవి ఈభాణప్రస్తావనలో శిష్టుకృష్ణమూర్తిశాస్త్రి నెక్కువగా కొనియాడియున్నాఁడు. ఆయన యనుగ్రహముచేతనే తనకు కవిత యబ్బె నని యిట్లు స్తుతించెను.

"తదనుగ్రహవారితాజ్ఞతాజనితాంచత్కవితావతారకః చర్యం"
శ్రీశిష్టవంశకమలాకర వాసరేశం శ్రీకృష్ణమూర్తి గురు మాగమచారు
నానాప్రబంధపరికల్పనవిత్తవృత్తం సేవేయ కృష్ణవమి తం దయితా
ర్థసిద్ధ్యై

ఇతని దేవీవిజయ చంపువు ముద్రితము. పరదేవతా గుణగణ వర్ణనరూప మైనయీకృతి పాఠ్యముగా వ్యాపించఁదగినదే, కుమారోదయ చంపువు పదియేడుల్లాసముల యుద్గ్రంథ మముద్రితము.

ఈకవి శబ్దతర్కాలంకారమీమాంసాశాస్త్రములందు నిష్ణాతుఁడని యితనికృతులలోని పెక్కువర్ణనలే తెలుపఁగలవు. ఈకవి శృంగార వర్ణన కొకయుదాహరణము.

"నాభి ర్యాతి గభీరతాం సహహృదా మధ్యం పరం భీరుతాం,
దృగ్భ్యాం పల్లవరాగతాంపదరదతామం పున శ్చేతసా,
శ్రోణీ సంవృతమధ్యతా మురసిజద్వం ద్వేన మందప్రభాం
యానం కేశభరేణ సా మృగదృశా తద్యావనే నావృతా"

ఈకవివంశము విద్యాసంపన్నమగు సంతతితో వర్ధిల్లుచున్నది.

# అవసరాల పద్మరాజు

ఇతఁడు గోలకొండవ్యాపారు లనఁబడు తెలగాణ్యపునియోగుల శాఖకుఁ జెందినయాంధ్రుఁడు. పిఠాపుర సంస్థానపాలకు లగుశ్రీరావు నీలాద్రి రాయలసచివుఁడు, శా.౧౭౬౦ ప్రాంతమువాఁడు. బాలభాగవత

మనఁబడు భారతచంపువు నిర్మించినసుకవి. దీని కితనిపేరనే పద్మరాజ చంపు వని ప్రతీతి వచ్చినది. ఈపద్మరాజునకు వర్ణాధికభోజరా జనునర్థమున, అంభోజరా జనుబిరుదనామము వచ్చినది. (పద్మము = అంభోజము) వర్ణాధికుఁడు = (బ్రాహ్మణుఁడైన భోజరాజు, అనియునర్థము.

నూతేండ్లనాఁటి కవులలో నింతటిహృద్యశైలిని గ్రంథము రచియించినవా రరుదే, ఈగ్రంథము వ్రాఁతప్రతులమూలముగానే కొంతకాలము పఠనపాఠవ్యవహారమున వ్యాపించి, పిదప క్రీ. ౧౮౦౮ లోఁబ్రకటితమైనది. దీనికి దేవులపల్లి రామసూరి సుధీచంద్రికయు రాఘవార్యుఁడు కవిరంజనియు వ్యాఖ్యలు నిర్మించిరి. సుధీచంద్రికావతారికయే యితనిపై వృత్తాంత మిసుమంతయు సూచించినది. ఇది మైదుసర్గల కావ్యము ప్రతిసర్గతుద నొకశ్లోక మున్నది.

"మహా త్వ్యముష్మిన్ సరసీవ పద్మ, రాజద్విజోదంచితసూక్తిహృద్యే,
కావ్యేన వేభాగవతే ఽయమగ్ర్య,స్సర్గ స్తరంగ స్తబకోపకోపమోఽగాత్"

కవిత్వము సరస మనుట తథ్యమేకాని, కృష్ణునిబాల్యచేష్టలు వర్ణించునెడ శృంగారము మిక్కిలి పచ్చిగా నున్నది.

"త్వాం దృష్ట్వాహి పరు న్మయూరరసమోరస్కా భ్రువంకందుక
ద్వంద్వం మే గళితం చిరాయ నిహితం గూఢం త్వయా కంచుకే
గృహ్ణే మీతి సముల్లసన్నఖపదం—

ఇది వానిలో మేలు. ఆకాలమందలి కవులు శృంగారప్రియులు గదా! ఇది తెలుఁగుదేశములోమాత్రమే వ్యాపించినది, శైలి కొకటి

"చిర మధిగతా మృద్ధిం లుంపన్ పలాశపతే ర్భృశం,
సపది రచయ న్నామోదాంచచ్ఛ్రియం సుమనశ్చయమ్,
ప్రసవమహితాం లక్ష్మీం చైత్రోలతాస్వివ తా స్వలం
యువతిషు హరి స్తన్వన్ ప్రీత్యా శశాస జగ చ్చిరమ్"

# సంకర్షణ పండితుఁడు

ఈకవి సకలకలాకులతిలకుఁ డన్నఖ్యాతి వహించినశివదాససూరి పుత్త్రుఁడు. నృసింహచంపువు రచియించినకవికులతిలకుఁడు. ఇతఁడు తన కృతియవతారికలో నిజవిషయ మి ట్లుటంకించెను.

"మీమాంసాజన్మభూమిః ఖని రపి నిఖిలన్యాయసాంఖ్యాగమానాం,
వేదాన్తానాం చ వక్తా కవికులతిలకః సర్వసామన్తపూజ్యః,
శ్రౌతాబ్ధే ర్మందరాద్రిప్రతినిధి రతులః శ్రీనృసింహప్రసాదాత్,
చంపూకావ్యం రసాలం రసయతి విబుధానందసందోహహేతుః"

సకలసామంతరాజుల సత్కారము లంది సకలదేశములు తిరిగి సకలకవులకు శిరోమణి యైనయింతటికవీంద్రునికావ్యము వ్యాప్తి లేక యముద్రితగ్రంథాలయములలో నంతరించి యున్నది. ఈస్వోత్కర్ష వర్ణనము చూడ నితఁడు బాగా యర్వాచీనుఁ డని తోఁచుచున్నది. శా. ౧౭౫౦ ప్రాంతమువాఁడై యుండును.

# కచ్ఛపేశ్వరదీక్షితుఁడు

రామచంద్రయశోభూషణ మనెడిమూఁడుపరిచ్ఛేదములయాలంకారికకృతి నిర్మించినయితని జన్మభూమి చెన్నరాజధానిలోనిఉత్తరార్కాటుమండలమందలి బ్రహ్మదేశమనెడి యగ్రహారము. ఆకృతి యవతారికలోని యీక్రింది శ్లోకములవల్ల నితనిచరితము కొంత తెలియుచున్నది.

"శ్రీబ్రహ్మదేశాభిధ మగ్రహార మధిష్ఠితో వేదవిదాం వరిష్ఠః,
శ్రీకాళహస్తీశ్వరయజ్వవర్య శ్చక్రే స్ఫుటం భాగవతస్య టీకామ్"

" తస్య- విఖ్యాతనారాయణవాసుదేవశ్రీకృష్ణసంజ్ఞా స్తనయా బభూవుః,
తత్ర- వాసుదేవసుమతే స్తనూభవః కచ్ఛపేశ్వరమఖీతి విశ్రుతః,
సంతనోమి రసరూపణాం నవం లాలనీయ మఖిలై ర్బుధై రహమ్ "

దీనినిబట్టి యీకవివంశమువారు వైదికధర్మనిరతు లనియు నితనిపితామహుఁడు శ్రీమద్భాగవతమునకు టీక నిర్మించినవాఁడనియుఁ దెలిసినది. ఈకృతిలో బొమ్మభూపాలాదు లుదాహరణముగాఁ గైకొనఁబడుదు రన్నమాట యిది:—

" శృఙ్గారవీరాదినిరూపణేషు కృతా వి హోదాహరణక్రియ స్తే,
శ్రీబొమ్మభూపాల తదీయయోధ తద్వైరిణో వైరివధూజనాశ్చ "

ఈబొమ్మభూపాలుఁడు కార్వేటినగరము జమీందారులలో నొకఁడు. శా. ౧౭౬౦ ప్రాంతమువాఁడు. కావున నీకవియు నప్పటివాఁడు కావచ్చును.

ఈకృతిలోనిమూఁడుపరిచ్ఛేదములందును క్రమముగా శృంగారము వీరాదిరసాష్టకము భావములును నిరూపింపఁబడినవి. ప్రతాపరుద్రీయశోభూషణము ననుకరించిన వందలకొలఁదియాలంకారికకృతులలో నిది యొకటి. ఇందు చెప్పఁదగిననవ్యత యేమియు లేదు. ఆమాట యితఁడే యిట్లు వెల్లడించియున్నాఁడు.

" పుష్పేభ్యో భ్రమరేణ సంభృతమివ క్షౌద్రం మనోజ్ఞై ర్వచో
గుమ్ఫైః పూర్వకవిప్రబన్ధనివహా దుద్ధృత్య సారం కృతమ్,
విద్వన్మణ్డలలాలనీయవచసా శ్రీకచ్ఛపేశేన త
చ్ఛృఙ్గారాదినిరూపణం విజయతా మాచన్ద్రతారాస్థితి "

# పరవస్తు వేంకట రంగనాధాచార్యులు

శ్రీవైష్ణవవిద్వత్కుటుంబములోని యీమహాకవి విశాఖపట్టణ నివాసి భారద్వాజగోత్రుఁడు విక్టోరియాచక్రవర్తినీ దత్తమహామహోపాధ్యాయ బిరుదాంచితుఁడు ఆర్యవరగురుఁడు భట్టనాథగురుకులతిలకుఁడు శ్రీనివాస గురుతనయుఁడు అనేకకృతికర్త బహుదేశభాషా పరిశీలకుఁడు నని యితనిమంజులనైషధ ప్రస్తావనయే తెలుపుచున్నది. ఈపండితుఁడు శా. ౧౭౪౪ లో జన్మించి ౧౮౨౨లో పరమపదించెను.

సంస్కృతభాషలో బహువిధోపయోగ కరమైనగొప్ప నిఘంటువు నిర్మింపనారంభించి యీవిద్వాంసుఁడు కొంతవఱకు కాకృత్యము నిర్వహించెను గాని, అది పూర్తి కాలేదు. ఆర్షపుస్తకాలయ మనుపేర నీతఁడు ప్రతిష్ఠించిన పుస్తకభాండాగారము నేటికిని తత్పౌత్త్రులచే పోషింపఁబడుచున్నది. నేను సంస్కృతవాఙ్మయచరిత్ర రచియించు సమయమున నందలిగ్రంథము లెన్నో నాకు సహాయపడినవి. ముద్రితాముద్రిత బహువిధగ్రంథ సంతతితో నిండినయాభాండాగార మావిద్వద్కవికీర్తికి గొప్పగుర్తు. అదియే యీయనయమోఘవైదుష్యమునకు జ్ఞాపకము.

హర్షనైషధమునకును అనర్ఘ్యరాఘవమునకును సముచితమైనవ్యాఖ్యలు నిర్మింప నారంభించెను గాని వాటిని పూర్తిచేయలేదు. ఈతఁడు వ్యాకరణశాస్త్రమునకును ఉత్తరమీమాంసకును సంబంధించిన కృతులును, కుంభకర్ణవిజయ మనుకావ్యమును రచియించెను. ఈతనికృతులలో దేశమున వ్యాపించి విద్వన్నుతి గాంచినది మంజులనైషధ నాటకము.

ఇది యేడంకములరూపకము. నలదమయంతులచరిత మిందలి వస్తు వనుట విదితము. ఇందు నటీసూత్రధారసంభాషణరూపమున దేశ

మందలిసంస్కృతభాషాదుష్టిని చక్కఁగా విశదీకరింపఁబడినది. కథా ప్రారంభమందే " కీర్తి ర్నామాద్భుత మసులభంచ ఫలం" అనుచు కీర్తిసముపార్జనము జన్మసాఫల్య మనునుద్దేశము చూపఁబడినది.

దమయంతీసదృశప్రతిమాకల్పన మిందు ముందు నలుని కామె యెడ ననురక్తి కలిగింప హేతువైనది. ఇట్టియభినవకల్పనములచేతనే యీకృతి మంజుల మనఁబడినది. కవిత్వరుచి కొకశ్లోకము. దమయంతి స్వయంవరప్రతిజ్ఞ చేసిన దని యామెచెలికత్తెలవల్ల విని నలుఁ డన్నమాట.

" సర్వత్ర హ న్త బలవాన్ భవితవ్యభావః
ప్రాగ్జైస్సమపిప్రియతమా గణితా సఖీ వామ్,
ఏవంసతి త్రిదశచిత్తగ తేయ మాసీత్,
జానాతి కోను విషమం విధివిపాకమ్"

# ముదుంబై వేంకటరామనరసింహాచార్యులు

విజయనగరమున శ్రీవిజయరామగజపతియాస్థానమున విద్వత్కవిగా నున్నయితఁడు, శా. ౧౭౬౪ లో జన్మించి,౧౮౪౨లో పరమ పదించినచిరకాలజీవి. ఇతఁడు శ్రీవత్సగోత్రుఁడు, రంగమాంబావీర రాఘవాచార్యులతనయుఁడు సంస్కృతసాహిత్యమున నుత్తమజ్ఞాన మార్జించి కవియై విజయనగరాధీశునిమన్నన నందినచతురుఁడు. ఈకవి ౧౧౪ గ్రంథములు రచియించె నని ప్రతీతి. వాటి కెందును ప్రచార మున్నట్లగపడదుగాని, గజేంద్రవ్యాయోగము రాజహంసీయమను వాస వీపరాశరీయము చిత్సూర్యాలోకము మొదలగు రూపకములును ఖలావ హేలనము నీతిరహస్యము ఉజ్జ్వలానందము కావ్యాలంకారసంగ్రహము మున్నగుకృతులును రామచంద్రకథామృతాదిపద్యకావ్యములును విన వచ్చుచున్నవి.

పరవస్తురంగాచార్యులకంటె నీయన పదేండ్లు చిన్నవాఁడు. ఈ యాచార్యు లిద్దఱికి మనస్స్పర్థ లున్నహేతువున మామూలుమర్యాద లతో రంగాచార్యులుగారికి విజయనగరమహారాజదర్శనము కాకుండ నీతఁ డడ్డుపడుచుండెడివాఁడఁట—ఆసందర్భములో తమ కిద్దఱకుసంబంధిం చినవివాదమును స్మరింపఁజేయుచు, తనయౌన్నత్యము ప్రకటించు కొనుచు శ్రీరంగసింహాచలస్వాములను వర్ణించినట్లుగా నితఁడుచెప్పిన శ్లోక మిది:—

"రంగేంద్రసింహశైలేంద్రౌ న సజాతీయవైభవౌ,
ప్రాకారోన్నతి రేకత్ర, చాన్యత్ర త్వచలోన్నతిః"

## ఘట్టుపల్లి కుమారస్వామిశాస్త్రి

ఇతఁడు మల్లికార్జునపండితారాధ్యులవంశములోనివాఁడు. ఇతని తల్లి శంకరాంబిక, తండ్రి రామలింగార్యుఁడు. వీ రాంధ్రులు, నైజా ములోనిఓరుగల్లుప్రాంతమున నున్నవారు. ఈకవి శా. ౧౭౫౦ ప్రాం తమం దున్నవాఁడు.

గురురాజకవి యనునతఁడు శా. ౧౫౦౦ ప్రాంతమున సోమ నాథునిపండితారాధ్యచరిత్రమును సంస్కృతీకరించినాఁడు. మైసూరు రాష్ట్రములోని శివమొగ్గజిల్లాయందలి కేలాడిసంస్థానము పాలించిన ప్రభువు శివభక్తుఁడు బసవప్పనాయకుఁడు శా. ౧౬౩౧ లో శివతత్త్వ రత్నాకర మనును త్తమకృతిని సంస్కృతమున నిర్మించియున్నాఁడు, ఈరెంటి నెఱింగినయీకవి చెన్నబసవపురాణమును సంస్కృతమున కనువదించెను. ఈపురాణమును తెలుఁగులో మొదట రచియించిన వాఁడు విరూపాక్షపండితుఁడు. తరువాత నిర్మించినవాఁడు అత్తలూరు

పాపయామాత్యుఁడు. ఈకుమారస్వామి యారెండాంధ్రకృతులను చూచియే దీనిని నిర్మించియుండు ననుట నిక్కము. అగస్త్యుఁడు రేణుకాదేవికి చెన్నబసవకథ బోధించుచున్నట్లుగా గ్రంథ మారంభ మగును. శివునిపుత్త్రుఁ డైనకుమారస్వామియే చెన్నబసవఁడై పుట్టె నని వీరశైవులవిశ్వాసము. అందుచే నీకుమారస్వామి యతనిచరితమును సంస్కృతకృతిగా రచియించెను. ఈగ్రంథ మోరుగంటిలో ముద్రిత మైనది. ఇతనికవిత రుచి చూచుటకు రెండుశ్లోకములు:—

" ప్రాప్తత్యాగ్యనకుండలైః కటితటే ప్వాబద్ధసన్మేఖలైః,
రత్నైశ్చాంబరభూషణై శ్చ బహుధా సర్వా నలంకృత్య సః,
భేరీడిండిమవాద్యభేదనికరై రామోద మాపాదకై,
శ్చావృ త్యాశు సమాగతః ప్రవిలసచ్ఛామాహ్వాయ స్సాయుధః "

" శ్రీశైలేశ మహేశ శంకర భవ శ్రీకంఠ భక్తప్రియ,
పాపారణ్యదవానల ప్రబలదైత్యాదీంద్రశంబ ప్రభో!
ప్రాలేయాచలకన్యకారమణ భోఃఫాలాక్ష! మృత్యుంజయ
శ్రీమచ్ఛ్రీగిరిమల్లికార్జునవిభో! మద్బాలకం రక్షయ "

ఇట్టి శివస్తుతికావ్యము లెన్నో జన్మించినవి. అందు శివకర్ణామృతమును నిర్మించినవేంకటేశకవి స్తుతిరీతి చిత్రముగా నుండును అందు కీ క్రిందివక్రోక్తి చదువఁదగును.

" శివే! మాం భజ, హేస్థాణో! లక్ష్మ్యా కార్యం న మే, ప్రియే!
కిం న జానాసి మే వాణీం, బ్రహ్మాణీ తే కుత శ్శివ! "

# వేంకటనారాయణదీక్షితులు

ఇతఁడు గోదావరీమండలమున గొడవర్తివంశమున జన్మించిన వాఁడు, ఋగ్వేదీయుఁడు, లక్ష్మీకామేశ్వర పండితులతనయుఁడు, అష్ట

భాషాకవి, శబ్ద శాస్త్రవిజ్ఞాత శివభక్తుఁడు వేదాన్తార్థరహస్యవేత్త నవీనుఁడు. శృఙ్గారసారము నెడి యీయుల్లాసముల కావ్యలక్షణగ్రన్థము నిర్మించినవాఁడు. ఇతనికృత్యాది వాక్యములివి కొన్ని,

"బాహ్యాభ్యాచ్యం సకలం శ్రుతిస్మృతివిదా మాచారసంశీలనం,
వేదాన్తార్థరహస్యవేదన మనూజానే రుపాస్తిః పరా,
భాషాభిః కవితాష్టభిశ్చ భువనే ఖ్యాతా యదీయా స హి
శ్రీకామేశ్వరవైదికోత్తమసుతః స్వైరం విజేజీయతే"

"లక్ష్మ్యమ్బికాగర్భసుధాసముద్రసుధారుచిః శ్రీగొడవర్తివంశ్యః,
శృంగారసారాఖ్య మిదం రసజ్ఞసంతుష్టయే ఽసౌ రచయ త్యుదారం"

ఈకృతిలో కావ్యనిరూపణాది పంచభాగములు కలవు.

మాధుకరవృత్తిచే తా నీకృతి నిర్మించిన ట్లితఁడే యిట్లు చెప్పెను.

"పుష్పసిద్ధస్య మధునో వ్యాతే ర్మధుకరా ఇవ,
గ్రన్థసితానాం వచసాం సంగ్రహే త్కృతినో వయమ్"

ఈకవి శృంగారసారావళి యనునటియొకకృతి రచియించిన ట్లవతారికలోని యీక్రిందిమాటలు తెల్పుచున్నవి.

"శృంగారసారావళ్యాఖ్యే గ్రంథే మద్రచితే బుధైః,
సమీక్ష్యతాం నాటకాదే ర్లక్ష్యలక్షణవిస్తరః"

కృత్యాదిపద్య మిది:—

"అజామివ దధ త్కాన్తాం నిజాం త్రైవర్ణ్యశాలినీం,
గజాస్యజనకం జ్యోతి ర్భజామః స్థిరసంపదే."

ఇతఁడు శా. ౧౭౫౦ ప్రాంతమువాఁడగును.

# సామరాజదీక్షితులు

ఇతఁ డుత్తరదేశీయుఁడు నరహరిబిందు పురందరునితనయుఁడు సాహిత్యసారజ్ఞుఁడు శా. ౧౭౫౦ ప్రాంతమువాఁడు. శృంగారరసమును లక్ష్యలక్షణాత్మకముగా వివరించుచు శృంగారామృతలహరి యనుచిన్నలక్షణగ్రంథము రచియించెను. అందలియాద్యశ్లోకములు.

"సిన్ధుసుతాకుచ కుంకుమపాటల వక్షఃస్థలం కిమపి,
ఉపవీణితంచ నిగమైః సటాజటాలం మహః కలయే"

"నరహరిబిందుపురందరజనుషా విదుషాథసామరాజేన,
శృంగారామృతలహరీ విరచ్యతే రసికజీవాతుః"

"స్థాయీభావోరసః స్మృతః" అనుప్రాచీనలక్షణ మెత్తుకొనివిచారణగావించుచు, "స్థాయియన్నంతమాత్రమున నిరంతర ముండునది యని భావింపరాదు. విరుద్ధములు అవిరుద్ధములు నైనయితరభావములచే నణఁగిపోవునది కాదు గనుక దీనిని స్థాయి యన్నారు గాని, నిత్య మను తలంపుతో కాదు, అనుచు స్వమతమును భరతాచార్యునియీక్రిందివాక్యములచే బలపఱుచుకొనెను.

"విరుద్ధా అవిరుద్ధావా యం తిరోధాతు మక్షమాః,
ఆనందాంకురవీరో ఒసౌ భావః స్థాయిపదాస్పదమ్"

ఇతనిమలయానిలవర్ణన మిది.

"భృఙ్గశ్రేణీ కృపాణీ పరసిరుహవధూధూళిభి ర్ధూపరాజః,
పమ్పాసమ్పాతకమ్పస్ఖలితగతి రలం మాధవీమల్లికాసు,
మన్దంమన్దం విసర్పన్ మలయగిరిదరీగహ్వరేభ్యో దుకూలం
కర్షత్కర్ణాటకాన్తాకుచకలశగతం వాతి మన్ద స్సమీరః"

భోజునిశృంగారప్రకాశిక ననుకరించినకృతులలో నిది యొకటి.

# నారాయణశాస్త్రి

ఈకవి తంజావూరుజిల్లాలో నడుకావేరిగ్రామమున నివసించినవాఁడు. భట్టశ్రీ బాలసరస్వతీ బిరుదాంచితుఁడు. ఇతఁడు శా. ౧౭౮౨ లో జన్మించి ౧౮33లో దివంగతుఁ డయ్యెను. ఇతనియన్న శ్రీనివాసశాస్త్రి షడ్దర్శనపాఠి గొప్పయుపన్యాసకుఁడు, బ్రహ్మవిద్యాపత్రిక స్థాపించి అద్వైతమతప్రచారము గావించిన మతాభిమాని.

నారాయణశాస్త్రి సాహిత్యనిధి, కవితాచతురుఁడు. పెక్కుసభలలో నుపన్యసించి సారస్వతసేవ గావించినవక్త. ఇతనిగ్రంథరచనోత్సాహ మత్యద్భుతము. ఇట్టి యసాధారణప్రజ్ఞాశాలి రచియించిన రూపకములు లెక్కకు ౮౨, ఇతనిజీవితకాల మంతా ౫౧ సంవత్సరములు. కవనమే జీవనసాఫల్య మనుకొన్నవాఁడు కాకున్న నిన్నినాటకములు రచియింపలేఁడు. కవితోత్సాహి యగుపురుషుఁడు తనకృతులను లోక మెట్లు చూచుచున్న దన్నవిషయము తలఁపఁ డనుట కిట్టికవు లెందఱో కలరు—ఇతనికృతులలో మైథిలీయము శర్మిష్ఠావిజయము కలివిధూననము ప్రిజ్ఞాసామంతము శూరమయూరము మొదలగునవికొన్ని యిపుడు క్రమక్రమముగా ముద్రితము లగుచున్నవి.

ఇతనికృతులలో ననేకములు చెన్నపురిప్రాచ్యపుస్తకాలయమందును తంజావూరుపుస్తకాలయమందు నున్నవి. కొన్ని యితనికుమారునివద్ద కొల్లెంగాడు దగ్గఱ నున్న ఆలంపల్లంగ్రామములో నున్నవి. ఇతఁడు బహువిధవృత్తములతోఁడి బహురూపకములే కాక పాఠ్యకావ్యములను కొన్ని నిర్మించెను. అందు సుందరవిజయ మనెడియిరువదినాలుగుసర్గలమహాకావ్యము గౌరీవిలాసచంపువు చింతామణి యనెడి

యాఖ్యాయిక జగద్గురుశంకరాచార్యజీవితచరిత్రి (వచనకావ్యము అనునవి ముఖ్యములు. ఇవిగాక, నాటకదీపిక కావ్యవిమర్శ కావ్యమీమాంస యనెడియాలంకారికకృతులు కూడా యితనివి కనవచ్చును.

## హోసుదుర్గం కృష్ణమాచార్యులు

ఈకవి నైజాము రాజ్యములోని జటప్రోలుసంస్థానమునకు శా. శ. ౧౭౭౩–౧౮౦౩లో పాలకుఁడుగా నున్నసురభివేంకటజగన్నాధరావుగారి యాస్థానవిద్వాంసుఁడు. ఇతఁడు పోషకుని యనుమతిని లక్ష్మీనృసింహ విలాస మనుచంపువును మదనగోపాలమహాత్మ్య మనుకావ్యమును నిర్మించెను. ఇందు నృసింహవిలాసావతారికలో జటప్రోలుసంస్థానపాలకుల క్రమము విశదీకరింపఁబడినది. అది చరిత్రకారులకు సహాయకారి కాఁగలదు. అందలిమాధవరాయవర్ణన మిది.

"కిశ్చాత్యద్భుతదీప్తిదివ్యభవనం మంచాలకట్టాభిధ,
గ్రామే విశ్వజనీనకీర్తిమహితే భూమేః పతి ర్మాధవః,
నిర్మాల్యీకృతవైరిశాసనభరో నిర్మాయ నిర్మాయక,
స్తత్ర స్థాపయ దాత్మనామ మధురం చిత్రాకృతిం శ్రీహరిమ్"

ఈమాధవరాయఁడే చంద్రికాపరిణయ మనెడియాంధ్రప్రబంధము రచియించెను. మహోపాధ్యాయ ఎలకూచిబాలసరస్వతిచే భర్తృహరిసుభాషితమును తమతండ్రియైనసురభిమల్లభూపాలుని కంకితముగా నాంధ్రీకరింపఁజేసెను. ఈరాయఁడు శా. శ. ౧౬౬౪ ప్రాంతమువాఁడు ఇతనివంశములోని సరసుఁడును కవితాప్రియుఁడు నగుశ్రీరాజాసురభి లక్ష్మారావుబహదరుగారినాటికి కొల్లాపురము రాజధాని. క్రీ. 1911

మొదలుగా తమ జీవితకాలమున, నన్నునునాకృతులను పోషించిన స్వదేశప్రభువులలో వీరొకరు. అపుడు నేను వీరియాస్థానకవిని.

గద్య

ఇది శ్రీహారితగోత్ర మల్లాది వెంకమాంబా శ్రీరామావధాని
పుత్త్రి సూర్యనారాయణశాస్త్రి ప్రణీతమైన సంస్కృత
కవిజీవితమందు ప్రథమసంపుటము ఓన్నమః
పరమాత్మనే.



श्रीः

ॐम्

नमः परब्रह्मणे

# సంస్కృతకవిజీవితము.

## శ్రీహర్షుఁడు.

శ్లో॥ "ఇదంకవిభ్యః పూర్వేభ్యో । నమోవాకం ప్రశాస్మహే।
వందేమహి చ తాం వాణీ। మమృతామాత్మనః కలాం ॥

ఎవ్వఁడు సంస్కృతవాఙ్మయంబు నభివృద్ధికిం దెచ్చు కవిసల్లజులకాశ్రయదాతయై గీర్వాణవాణినాదరించు విధాతయై సామంతభూకాంతులకానందసంధాతయై స్వీయలోకంబు ననుగ్రహింప శత్రుజేతయై విలసిల్లె నాయీ శ్రీహర్షుఁడు రత్నావళీ ప్రియదర్శికా నాగానందరూపకంబులకుం గర్తగానుండె. ఈతని చరిత్ర నానావిధమున నేకాక పెక్కుఁగవుల్ల చరితములం దెలుపుటచేఁగూడ మనకానందదాయకమగును. కాని యీతని దేశకాలములంగూర్చియుఁ గవిత్వవిభుత్వములంగూర్చియు నవీన విమర్శకుల నేకాభిప్రాయములం గలిగియుండిరి. ఒక్క శతాబ్దమునకుంబూర్వ వృత్తాంతమైనఁ బూర్తిగా నెఱుంగఁజాలని మనము వేలకొలది సంవత్సరములకుంబూర్వపు వృత్తాంతంబు నెఱుంగ సమర్థులము గామనిన నాశ్చర్యము గాదు. కావున నీతనింగూర్చియు వారివారికి దొరకిన యాధారంబుల

జన్యుఁడని తెలియుచున్నది. కాని పైరూపకంబులను శ్రీహర్షుఁడు వ్రాయలేదనియు నతనియాస్థానమందలి కవియెవఁడో వ్రాసి యారాజుపేరిడెననియుఁ బూర్వవిమర్శకులందఱు నేకగ్రీవముగాఁ జెప్పియున్నారు. కావున నిఁక నాయావిమర్శకుల యభిప్రాయంబులను క్రమముగాఁ దెల్పుచు వానిపైవిమర్శనంబునఁ దత్కవిశ్రీహర్షులకాలము నిర్ణయింపఁ గడంగుదము.

విల్సనుదొర తనహిందూనాటకములను గ్రంథము ౨ వ భాగములో సోమదేవభట్టుని కథాసరిత్సాగరములోను, కల్హణపండితుని రాజతరంగిణియందును గాశ్మీరరాజుగా వర్ణింపఁబడిన హర్షదేవుఁడే రత్నావళీకర్తయగు శ్రీహర్షుఁడనియు నితఁడు కాశ్మీరమును రాజ్యముచేసిన కాలమందనఁగాఁ గ్రీస్తుశకము ౧౧౧౩—౧౧౨౫ సంవత్సరములనడుమ రత్నావళిపుట్టియుండెననియు వ్రాసి తాను హిందూనాటకములోనికి మార్చిన రత్నావళిపీఠికలలో శ్రీహర్షరాజు నాశ్రితుండగు ధావకుఁడో మఱియొకఁడో రత్నావళిని రచించి యారాజుపేరు పెట్టియుండునని కూడ వ్రాసెను. కాని యారాజుపేరనున్న ప్రియదర్శికా నాగానందములమాటయే యెత్తలేదు. కానిడా. ఎగ్లుయిరను రత్నావళి శ్రీహర్షుని కాలమున బయలుదేఱెనని యంగీకరించెను గావున దీనిలోనివాక్యములు భోజరాజుపితామహుండును వాక్పతిరాజనామాంతరుండునునై ౧౦ వ శతాబ్దము నుత్తరభాగమందున్న ముంజమహీపాలుని యాస్థానంబుననున్న ధనంజయకవి రచించిన దశరూపకంబునఁ బెక్కుచోట్ల నుదాహరింపఁబడుటచే నీశ్రీహర్షుఁడు ౧౦ వ శతాబ్దంబునకుం గడుఁబూర్వుఁడైయుండవలెనుగాని ౧౨ వ శతాబ్దంబులోనివాఁడుమాత్రము కాఁడని ధ్రువమగుచున్నది.

మఱికొందఱు విమర్శకులీ రత్నావళ్యాది రూపకంబులనున్న శ్రీహర్షుఁడు కాశ్మీరరాజగు హర్షదేవునికంటె మిక్కిలి ప్రాచీనుఁడగు మఱి

యశోకుఁడు బింబిసారుఁడు మొదలగు చక్రవర్తులనేకులుండఁగా నేవో కొన్ని తన్మతధర్మములుగలిగినదన్నంతమాత్రమున నాగానందము హర్ష వర్ధనుని కాలములోనిదని చెప్పుటకంటెఁ దన్మతాభివృద్ధిగలిగిన క్రీ॥ పూ॥ ౪వ శతాబ్దము మొదలు క్రీ॥ శ॥ ౭వ శతాబ్దంబులోపుగా నేరాజుకాలములోనైనఁబుట్టియుండునని యేలచెప్పరాదు? బౌద్ధమతమెన్నఁడును మాతృమతమయిన హిందూమతమునకు విరుద్ధముగాలేదు. చిరకాలము హిందూబౌద్ధమతములు రెండును సమానగౌరవమునొందుచు సరిగా వచ్చినవి. ఈరెండుమతములవారుకూడఁ బరస్పరము విద్యాగురువులుగానుండుటయు, నీరెండుమతములవారి నప్పటిరాజులు సమానముగా నాదరించుటయుఁ గన్పడుచున్నది. గుప్తరాజులు శైవులు వైష్ణవులునయ్యు బౌద్ధమతస్థులకు మఠములనిమిత్తము ధనమిచ్చుటయు విక్రమాదిత్యుని సంస్థానమునఁ గాళిదాసువలెనే బౌద్ధులగు క్షపణకామరసింహులు నవకవిరత్నములలోనివారగుటయునిందులకుదాహరణములుగానున్నవి. మఱియు "అహింసాపరమోధర్మ" యనుసూత్రముననుసరించు ధర్మమొక్క బౌద్ధమతమునందేలేదు. బహుప్రాచీనములగు వేదవేదాంతములలో "నహింస్యాత్సర్వభూతాని" యనుశ్రుతి యంతకుముందే ఘోషించుచున్నది. నిశ్చయముగా నీమతమునకు ముందే జన్మించిన రామాయణ భారతాది గ్రంథములలోఁగూడఁ బరోపకారము, అహింసనము, భూతదయాళుత్వము మొదలుగాఁగల పరమధర్మములు శిబిదధీచ్యాదులకథలమూలముగాఁ బెక్కుచోట్ల వివరింపఁబడుట మనము కనుచుంటిమి. మఱియుఁ గథాసరిత్సాగరమునందును విక్రమార్కచరిత్రమునందునుగూడ నీధర్మములకుఁ బెక్కుదాహరణములుగలవు. విక్రమార్కుఁడు పరోపకారమునకై యగ్నిలోఁబడినట్లు మనముచదువుచుండలేదా? కావున జీమూతవాహనుని చర్య శిబివిక్రమార్కులచరిత్రకు మించినదిగాదని యూహింపవచ్చును.

ఇఁక జీమూతవాహనుని బోధిసత్త్వుఁడని వర్ణించుటయందురా? అదియు నేదోయాదృచ్ఛికంబుగా నుపయుక్తంబగు పదముగాని తన్మతప్రశంసకై కాదని యీ కథారచనమే తెల్పుచున్నది. బోధిసత్త్వుఁడని పేరు మాత్రమే యున్నదిగాని కథాసందర్భమునుబట్టి చూడఁగా నాగానందమామూలాగ్రముగాఁ గృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయమద్వైతమును దెల్పినట్లును వేదాంతదేశికుని సంకల్పసూర్యోదయము విశిష్టాద్వైతమును బోధించునట్లును బౌద్ధమతవృత్తాంతమేమైనఁ దెల్పుచున్నదా? కావున బౌద్ధమతద్యోతకమను నొకకారణంబుననే నాగానందము హర్షవర్ధనుని నాఁటిదనుటయు రత్నావళీ ప్రియదర్శికలు రచించినకవికంటె దీనిరచించినవాఁడు వేఱనుటయుఁగూడ యుక్తియుక్తములుగావు.

మఱియు నాగానందములోని కథకూడ నేకముఖముగా నుండక భిన్నమయినట్లున్నది. మొదటి మూఁడంకములలోను నాయికానాయకులపరస్పరానురాగపరిణయంబులును, మిగిలిన రెండంకములలోను గరుత్మంతునివలనఁ బాములసంరక్షించుటయు వర్ణింపఁబడినవి. కాని బౌద్ధమతసూచనమేమియు లేదు. ఈనాటకపాత్రములు, రంగస్థలంబులు, పాత్రసంభాషణంబులుగూడ నార్యమతసంబంధములుగానే యున్నవి. కథానాయకుండగు విద్యాధరుఁడు ,,వందనీయాఃఖలు దేవతా” యనివచించెను. వానితండ్రి రాజ్యమును గుమారునకిచ్చి యార్యమతానుసారియై వానప్రస్థుఁడై నిత్యాగ్నిహోత్రియై యుండెను.

నాయికయగు మలయవతి గౌరీదేవిని బూజించుచుండెను. ఆమె వంశమునకుఁ గౌశికమహర్షి గురువుగానుండె. వారియాశ్రమమున గౌరీదేవతాలయము గలదు. గరుడుఁడు హరిభక్తుఁడు, అనునీవిషయంబులచే నాటకమంతయు నార్యమతానుసారంబుగానే యుండుటచేతను, రత్నావళీ నాగానందములను హర్షవర్ధనునికాలమందలి యితరగ్రంథముల

ను జక్కగా విమర్శించి చదివినవారికి రచనాశైలింబట్టి యీ ద్వితీయ శిలాదిత్యుని యాస్థానమందలి బాణుఁడుగాని యింకొకఁడుగాని పై రూపకంబులఁ జేసియుండరని తోఁచుచుండుటచేతను, నాగానందము బౌద్ధమతద్యోతకమను నిరాధారంబగు నొక్కయభిప్రాయమును ఖండించుటచేతనే కాక నాటకరచనాకవితాశైలులంబట్టియు వక్ష్యమాణంబగు సదాధారంబుననుసరించియు నీరూపకంబులు హర్షవర్ధనునికాలములోనివి కావని స్పష్టముగాఁ జెప్పవచ్చును. మఱియు నీమూఁడురూపకంబులను గాదంబరిని జూచినయెడల వీనిని బాణుఁడు రచింపలేదనియుఁ జక్కగా నూహింపవచ్చును. బాణునికాలంబున సంస్కృతభాష, శ్లేషయమకదీర్ఘసమాసాములచేఁ గాఠిన్యమువహించి యతిప్రౌఢావస్థంజెందియున్నది. పూర్వగ్రంథంబులలోఁగూడ నక్కడక్కడఁగొంచెమట్టివి కన్పడుచున్నను బాణునికాలమున నద్భుతకల్పనవర్ణనములు శ్లేషయమకములు దీర్ఘసమాసములు పదాభివృద్ధి ప్రౌఢాభిప్రాయములు మొదలుగాఁ గవితానైపుణీధర్మములత్యభివృద్ధిలోనికి వచ్చినవని కాదంబరీహర్షచరిత్రలే తెల్పుచున్నవి కావున నక్కాలంబునఁబాండిత్యప్రౌఢిమం దెల్పు ప్రబంధంబులే కాని మృదుశైలినుండు నాటకములు పుట్టలేదని తలంపవచ్చును. అపుడు సుప్రసిద్ధములగు నాటకములు రచించినవాఁడొక్క మహాకవిభవభూతి యుండెనుగాని యతఁడు హర్షవర్ధనుని కొక్కశతాబ్దము తరువాతివాఁడు. ఆతని నాటకంబులును మృదుశైలినుండక భాషాప్రాగల్భ్యమునే చూపుచున్నవి.

మఱియు బాణుఁడువ్రాసిన పార్వతీపరిణయనాటకమొకటిగలదు. దానియందుఁ గాళిదాసు కుమారసంభవమునుండి గ్రహింపఁబడిన కథ యిద్దఱిసంభాషణంబున నున్నదిగాని నాటకరీతియేమియుఁ గానరాదు. ఆకథాసన్నివేశముగాని పద్యధోరణిగాని సభారంజకంబులుగామినానా

టకంబు రత్నావళీనాగానందముల నెన్నటికిం బోలియుండదని యూహింపవచ్చును.

ఇక ధనంజయుని దశరూపంబునను వామనుని కావ్యాలంకార సూత్రవృత్తియందునుగూడ రత్నావళీ నాగానందములలోని పద్యములుండుటచే నంతకుమున్న కన్యాకుబ్జంబున కధిపతియు విక్రమాదిత్యునివలె రాజ్యతంత్రంబులనధికసమర్థుండును విద్వత్కవులకాశ్రయుండునగు హర్షవర్ధనుని సంస్థానంబుననున్న యార్యబౌద్ధమతకవులిరువురు క్రమముగా రత్నావళీ నాగానందముల రచించి యుభయమతసమ్మతుండగు నారాజునకంకితము చేయుటకు బదులుగా నాతని పేరే పెట్టియుందురను కొందఱియభిప్రాయంబును విమర్శింతము.

రత్నావళీప్రియదర్శికానాగానందములకుం గర్తయొక్కండా? లేక యిద్దఱా?

మూండుప్రస్తావనలలోనుగూడ

§ "శ్రీహర్షోనిపుణః కవిః పరిషదప్యేషా గుణగ్రాహిణీ।
లోకేహారిచ వత్సరాజచరితం (సిద్ధరాజచరితం) నాట్యేచ దక్షా
వస్త్వేకైకమపీహ వాంఛితఫలప్రాప్తేః పదంకింపున। [వయం
ర్మద్భాగ్యోపచయాదయం సముదితస్సర్వోగుణానాంగణః॥"

అనుపద్యము సమానముగానుండుట, ప్రియదర్శికమూండవయంకములోని తృతీయశ్లోకంబగు

"అంతఃపురాణాం విహితవ్యవస్థః పదేపదేఽహంస్ఖలితాని రక్షన్।
జరాతురస్సంప్రతి దండనీత్యా సర్వంనృపస్యానుకరోమివృత్తం॥"

---

§ కవియా? శ్రీహర్షుండు. సభాసదులా? రసజ్ఞులు. వత్స (సిద్ధ) రాజచరితమా? లోకరంజకము. మనమా? నాట్యమున సమర్థులము. ఇందొకొక్కటియే చాలును. అన్నియుంగూడినం జెప్పనదేమి?

అనునదియే నాగానందము నాల్గవయంకము మొదట నుండుట, మొదలుగా ననేకపద్యపాదాభిప్రాయంబులు మూఁటిలో నొక్కవిధముగా నుండుటచేతను శైలీమార్దవాదికవితాధర్మంబు లొక్కపోలిక నుండుటచేతను నీరూపకత్రయంబునకుఁ గర్త యొక్కఁడే కాని యిరువురుగారని నిశ్చయముగా నమ్మవచ్చును.

ఇఁక నాగానందము బౌద్ధమతద్యోతకము కాకపోయినను భిన్నమతానుగుణంబులగు నాందీపద్యముల నొక్కకవి యెట్లు చెప్పియుండునని సంశయము గలుగవచ్చును. ఔనుగాని, రెండుమతంబులయందును సమానాదరంబుగలిగిన తనరాజుమతంబు ననుసరించి పరమతద్వేషము లేనియా యిరువురిలో నెవ్వఁడో యొక్కఁడే యట్లు ధ్యానించియుండునని యూహించుట యాశ్చర్యముగాదు. ఇంతవఱకుఁ గవి యొక్కఁడని తేలిన నాకవి యెవఁడని విమర్శింపవలసియున్నది.

రత్నావళీ మాలవికాగ్నిమిత్రముల కథలను బరిశీలించుచుండఁగాఁ బాత్రనామభేదమే కాని రెండు నొక్కవిధముగా నున్నవి. వత్సరాజాగ్నిమిత్రులిరువురు పట్టమహిషిగలిగిన నాయకులే నాయికలగు రత్నావళీమాలవికలిద్దఱుఁగూడ నాకస్మికముగా దొరకినవారై రాజులకంటఁబడకుండ రాణులచేఁ బెంపఁబడుచువచ్చిరి. రెంటిలోఁగూడ నాయికలచిత్రఫలకములనుజూచియే నాయకులు మోహింతురు. రెంటిలోఁగూడ విదూషకుఁడు నాయికానాయకులకుఁ బరస్పరము ప్రేమగలుపుటయు దాని నెఱింగిన రాణులు కోపించి నాయికలఁ జెఱలఁ బెట్టించుటయు నేదో యొకయుపద్రవమువలన నాయికలు దప్పుటయుఁ జివరకు నాయికలు దమకాత్మీయులగుట దేవేరులెఱింగి విచారించుటయుఁ దామంగీకరించి వారినిఁ దమభర్తలకుఁ బెండ్లిండ్లుగావించుటయు ననుకథాభాగమంతయు నొక్కవిధముగానున్నది. దీనింబట్టిచూడ నీరెంటిలో నేదో యొకటి రెండవదానిననుసరించి

వ్రాయఁబడినట్లు గ్రహింపవలసియున్నది. దీనింగూర్చి " కాళిదాసు మాలవికాగ్నిమిత్రమునను సరించి రత్నావళి వ్రాయబడియుండును. దానిపోలికలు దీనియందుఁజాలగల " వను మేక్డోనలునభిప్రాయంబును, " కాళిదాసనాటకములు లోకములో సుప్రసిద్ధములుగానున్నవి వానిలోనికథననుకరించి రత్నావళి వ్రాయఁబడియుండు " నను శ్రీదత్తునభిప్రాయంబును, డాక్టరుహాలుయొక్క మతముననుసరించి బాణుఁడే మాలవికాగ్నిమిత్రముననుసరించి రత్నావళిని వ్రాసియుండుననని తెల్పుచున్నవి. కాని తనహర్షచరితమునందు

† " నిర్గతాసు నవాకస్య కాళిదాసస్య సూక్తిషు ।
ప్రీతిర్మధురసాంద్రాసు మంజరీష్వివ జాయతే ॥ "

అనిసగౌరవంబుగాఁ గాళిదాసునిఁబొగడిన బాణుఁడు వానిగ్రంథమునుండి కథాకల్పనంబునపహరించి పుస్తకము వ్రాయుచు దానిలోనా తనిపేరైననెత్తక పైగాఁదననాటికలో * " అపూర్వవస్తురచనా " అని యెట్లు చెప్పికొనును?

బాణుఁడు రత్నావళికిఁగర్తయని నాగానందపీఠికలోవ్రాసి ముందుగా లోకమును భ్రమపెట్టిన హాలుయొక్క యాధారములు రత్నావళింగూర్చి కావ్యప్రకాశములోనున్న ‡ " కాళిదాసాదీనామివ యశః శ్రీహర్షాదేర్ధావకాదీనామివ ధన " మ్మనుచోట " బాణాదీనా " మనియున్న

---

† మనోహరములగు పూలగుత్తులయందువలెనే కాళిదాసుని సరసవాక్యములయం దెవనికిఁ బ్రీతిగలుగదు?

* పూర్వమందులేని కథారచనము.

‡ శ్రీహర్షాదులవలనఁ గాళిదాసాదులకు యశస్సు, ధావకాదులకు ధనము సంభవించినట్లు.

పుస్తకమునం దానుజూచితిననియు నొకవ్యాఖ్యాతకూడనట్లె వ్రాసియున్నాఁడనునదియొకటియు, రత్నావళిలోనున్న “ద్వీపాదన్యస్మాదపి” యనుశ్లోకము హర్షచరిత్రలో నయిదవయుచ్ఛ్వాసమున నున్నదనునది రెండవదియునైయున్నవి. మొదటిదానికి పోలుచూచినయొక్క వ్రాఁతప్రతియుఁ బేరులేనియతని వ్యాఖ్యాతయు సాక్షులుగాని యింకేదానిలోను నట్లుండకపోవుటచేతను, రత్నావళిలోని శ్లోకమొక్క యతఁడుచూచిన హర్షచరిత్రపుస్తకములోనేకాని యింకేపుస్తకమునందునుండకపోవుటచేతను నా రెండాధారంబులవిశ్వసనీయంబులగును. కాని కొన్ని తెలుఁగుపొత్తములలోమాత్రము “ధావక” యనియుండుటకుబదులుగా “భావక” యనియున్నది. అదివ్రాఁతలోభేదము తెలియని (ధా) కుబదులుగాఁబడిన (భా) కావచ్చును. సరియే కానిండు “బాణాదీనా” మనువారియభిప్రాయము బాణుఁడుదీనిని వ్రాసి ధనాశచే శ్రీహర్షునకు విక్రయించియుండుననికదా? అట్లయిననింతకంటె సుప్రసిద్ధములు మహాప్రబంధములునగు కాదంబరీహర్షచరిత్రలనమ్మి మేల విశేషధనమునకమ్ముకొనఁడు? హర్షచరిత్రలో బాణుఁడు స్వవిషయమువర్ణించుకొనుటలో “నున్నతవంశస్థుఁడు ధనికుఁడునగు తన్నుసగౌరవముగా హర్షవర్ధనుఁడురప్పించి యాస్థానంబుననుంచుకొనె” ననియుండఁగా బాణునకుఁగృతులనమ్ముకొనుగతి యెట్లుసంభవించును? కావునఁబ్రమాదవశంబున నెచ్చటనోచూచి బాణుఁడని భ్రమపడుటగాని మహాప్రౌఢస్థితిలోనుండి పండితైకగ్రాహ్యంబై నారికేళపాకంబుననున్న కాదంబరిరచనకును సరసమార్దవంబై కదళీపాకంబుననున్న రత్నావళిరచనకును నెంతైనఁబోలికయుండెనా? కథలోఁగాని భాషలోఁగాని యభిప్రాయింబులలోఁగాని యింకను రత్నావళివలెనే ప్రియదర్శికగూడఁగాళిదాసునినాటకంబులఁబోలుచు విశేషంబుగా మాలవికాగ్నిమిత్రమునకెనయగుచున్నది.

అంగదేశరాజగు దృఢవర్మ తనపుత్రికయగు ప్రియదర్శికను వత్సరాజగు నుదయనునకీయఁదలంచియుండునంతలోఁగళింగరాజువచ్చి దృఢవర్మను జయించుకొనిపోయి చెఱలోఁబెట్టును. అంతమంత్రియగు వినయవసువు ప్రియదర్శికను దృఢవర్మమిత్రుఁడగు వింధ్యకేతువుగృహమునకుఁ దీసికొనివచ్చును. అంతట నుదయనునిసేనలువచ్చి వింధ్యకేతువును జంపఁగా సేనానాయకుఁడగు విజయసేనుఁడు ప్రియదర్శికను బందలముగాఁగొనివచ్చి రాజునకుఁగానుకగానీయ నతండు రాణికప్పగించును. ఆమెయు నాబాలికకు గానాదికలలనేర్పించును. ఇంతవఱకు మాలవికాగ్నిమిత్రకథనుబోలియున్నది. దానిలోఁబరివ్రాజికవలెనే దీనిలో సాంకృత్యాయినిగలదు. పుష్పాపచయంబొనరించునాయికను భ్రమరబాధనుండి నివారించు నెపంబున నాయకున కనుకూలసమయము లభించుట, పరస్పరానురాగము, విదూషకపరిహాసము మొదలుగాఁగొంతకథాభాగముమాత్రము శాకుంతలంబునుబోలియున్నది. మిగిలినకథయంతయుఁగొంచెమించుమించుగా మాలవికాగ్నిమిత్రమునే పోలియున్నది.

ఇదిగూడ రత్నావళివలెనే చాలవిధముల మాలవికాగ్నిమిత్రమునుబోలియుండుటచేఁ గొందఱీయభిప్రాయంబుచొప్పున బాణుఁడే దీనినిగూడవ్రాసెననవలసియుండునుగదా? ఆహా! యొరునినాటకంబుననుకరించి యొకరాజునే కథానాయకునిఁగాఁజేసి రెండురూపకంబులురచించువెఱ్ఱియెందైననుండునా? ఇదెవ్వఁడైన విశ్వసించునా? కావున నీరెండుకథలు నొక్కదానిఛాయననుసరించినవిగావనియు, వీనికాధారంబులగు మూలగాథలుగలవనియు మనమెఱుంగవలయును.

సకలదేశీయభాషాకావ్యంబులకు మూలాధారంబును వివిధసరసకథాభూయిష్ఠంబునునగు బృహత్కథయనుకావ్యంబు పైశాచిభాషలోనున్నట్లును దానిని గుణాఢ్యుఁడనుకవివరుఁడు రచించినట్లును, దానిని

సంస్కృతభాషలోనికిఁ గథాసరిత్సాగరమను పేరుతో మార్చిన సోమ
దేవభట్టు తెల్పుచుండెను. ఆబృహత్కథలోఁ బ్రధానముగాఁ గౌశాంబీ
రాజ్యనాథుఁడగు నుదయనునిఁగూర్చి పెక్కుకథలుగలవు. ఈకావ్యము
ప్రాయికముగాఁ గ్రీస్తుపూర్వము రెండవశతాబ్దముతుదను బుట్టియుం
డునని పెక్కండ్రు గ్రహించియున్నారు. బృహత్కథకు భాషాంతరీక
రణమగు కథాసరిత్సాగరము ౨ వ లంబకము ౬ వ తరంగములోఁ
దొలుతవాసవదత్తను బెండ్లియాడియున్నయుదయనునకును బంధుమతికి
ని వివాహముజరిగినట్లున్నది. ఆబంధుమతియే ప్రియదర్శిక. మఱియు ౩ వ
లంబకము మొదటితరంగములో నుదయనుఁడు పద్మావతిని బెండ్లియాడిన
ట్లున్నది. ఆపద్మావతియే రత్నావళి. కొంచెము చిన్నభిన్నమార్పులతో
నా రెండుకథలకు నీరెండుకథలు సరివచ్చుచున్నవి. కావున రత్నావళీ ప్రి
యదర్శికలు పూర్వచరిత్ర దెల్పునాటికలే కాని, కల్పితములుగాని, యేదా
నికినను కరణములుగాని, కావనిస్పష్టమగుచున్నది. అయిననీనాటికాకర్త
ప్రధానంబు నభిరుచికరంబు నగువాసవదత్తాచరితంబును రూపకముగా
వ్రాయక యీచిన్నకథల నేలగ్రహించెనని శంకించుకొనఁగాఁ దత్కథా
భాగమునంతకుముందే యొకకవి రూపకంబుగా వ్రాసియుండుననిమనకు
సమాధానమువచ్చుచున్నది. కాళిదాసు మేఘసందేశములో " ప్రాప్యా
వంతీనుదయనకథా కోవిదగ్రామవృద్ధాన్ " అనుచో నుదయనవాసవదత్తా
కథాప్రసక్తి నతిగౌరవంబుగాఁ బేర్కొనుటయు, బాణుఁడు హర్షచరిత్రలో

$ " కవీనామగలద్దర్పో నూనం వాసవదత్తయా।
శక్త్యేవ పాండుపుత్రాణాం గతయా కర్ణగోచరం॥ "

అనియుత్కృష్టముంబుగా వర్ణించుటయు, వాసవదత్తయనునొక విరు
పమానకావ్యముగలదని తెల్పుచున్నవి. కాని యీవాసవదత్త సుబంధుకృత

---

$ కర్ణగోచరంబగు పాండుపుత్రులశక్తిచేతనువలెనే వాసవదత్తచేఁ గవులగ
ర్వమణఁగిపోయినది.

వచనకావ్యముగాదని సుబంధువుతనకావ్యంబున “ మత్తైవేంద్రమతీ మహిష్యప్యజానురాగిణీబభూవ...” “ విఫలమేవమమ్యంతస్యక్త్రతే మర్త్యాననశ్శ్వాపమనుబభూవ శకుంతలా ” “ సదారామాశ్రితైగ్మహావీరచరితైరివ నారికేళీధరైః ” అనికాళిదాస భవభూతికథాభాగంబులనుస్మరించుటయే నిదర్శనముగుచున్నది. కాని భవభూతి మాలతీమాధవములో “ వాసవదత్తాచ పిత్రా రాజ్ఞే సంజయాయ దత్తామాత్మానముదయనాయ ప్రాయచ్ఛత్ ” అనిచెప్పుటచే సుబంధువాసవదత్తకథనుదాహరించెనేమోయని సంశయముగలుగవచ్చును. కాని పైవాక్యంబునర్థంబునకనుగుణంబుగా సుబంధువాసవదత్తలో వాసవదత్త యుదయనుని పరించి కూడఁబోయెనను మాటలేకుండుటయు, మాలతీమాధవపరస్పరానురాగవిషయంబునఁగాళిదాసవిక్రమోర్వశీయశాకుంతలనాటకపాత్రలంబోలి యుదయనవాసవదత్తలనిదర్శించుటచేనదిగూడ నాటకమైయుండవచ్చునని తప్పక గ్రహింపవలసియుండుటయు, సవిమర్శపాఠకులకు భవభూతినాటకములలోని వాక్యములు చిన్నమార్పులతో వచనవాసవదత్తలోఁ గనుపడుటయు, సుబంధువు భవభూతికంటెఁ దరువాతివాఁడని దృఢపఱచుచున్నవి. ఇష్లేడాక్టరు పీటర్సను, హాలునుగూడ నభిప్రాయపడియుండిరి. అందుచేఁదనతరువాత జీవించియున్న భవభూతివాక్యముల నుదాహరించిన సుబంధుని బాణుఁడెట్లుస్మరించును? కాళిదాసెట్లుతలంచును? కాఁబట్టి కాళిదాస బాణ భవభూతులచేఁ బేరొకొనఁబడిన వాసవదత్తనాటకమయినఁ గావలయును. లేదా? * మహాభాష్యకర్త పేరొకొనినట్లుగా నాఖ్యాయికమైనఁగావలయుననితోఁచుచున్నది.

నాగానందకథగూడ నుదయనుని కథలలోఁ గథాసరిత్సాగరము నాల్గవలంబకము రెండవతరంగములోనుండుటచేఁగల్పితకథగాక పూర్వ

* ఈవిషయము సుబంధుజీవితములోనుండును.

చరితమేయనియు, దానియందు వాసవదత్తగర్భోత్పత్తివర్ణింపఁబడుటచే
రత్నావళీప్రియదర్శికలకనుబంధముగా నుండుటయే కాక శ్రీహర్షుని పేరనే
యుండుటచే దీనింగూడఁదత్కవియే వ్రాసియుండుననియుఁ దేలుచున్నది.

మఱియు సంస్కృతభాషలోఁ గాళిదాసకృతులు సుప్రసిద్ధయశ
స్సుగాంచినను వానిలోనివానికంటెనధికముగా రత్నావళ్యాదులలోని
పద్యములే తఱచుగా దశరూపాదిలక్షణగ్రంథములలో వ్రాయఁబడుటచే
రత్నావళీప్రియదర్శికలు పూర్వము కొందఱనుమానించినట్లు మాలవికా
గ్నిమిత్రమునకుఁబ్రతిరూపంబులుగావని నిర్ణయింపఁబడుటయే కాక ప్రౌఢ
కవితారచనస్వకపోలకల్పనాది ప్రావీణ్యంబుగలిగి వచన రచన యశస్సు
గాంచి, పార్వతీపరిణయనాటకంబునఁ దననాటకరచనాసామర్థ్యముం దె
ల్పినబాణకవికి గ్రంథచౌర్యవృత్తిగల్పించుటయనర్హమగుటచే బాణునకు
రత్నావళ్యాదులతో నేసంబంధములేదని సులభముగాఁ దెలియుటయు,
ముందు చెప్పఁబోవునట్లుగాఁగాళిదాసుకంటెఁగూడ నీరూపకంబులే కొం
చెము పూర్వంబులని నిశ్చయింపఁబడుటయు లభ్యమయినదని సంతసించు
చు, మాలవికాగ్నిమిత్రము పాటలీపుత్రరాజగు నగ్నిమిత్రుఁడు నాయకు
డుగాఁగలుగుటచేఁ బూర్వచరితనాటకమునవలసివచ్చినదిగాని దానికథా
రచనమంతయు రత్నావళీప్రియదర్శికల ననుసరించుకొనియే కాళి
దాసుదానినివ్రాసెనని భావింపవచ్చును. ఇంతవఱకు శ్రీహర్షునిరత్నావ
ళ్యాదులు మాలవికాగ్నిమిత్రముకంటెనుగూడఁగొంచెము పూర్వములని
గ్రహించితిమిగావున దానినిస్థిరపఱచుచు వానిని భావకుఁడు (భాసుఁడు)
రచించెనని నిర్ణయించుటకుఁదగినయాధారంబులకై కడంగుదము.

మాలవికాగ్నిమిత్రప్రస్తావనలోఁ బారిపార్శ్వకుఁడు "ప్రథితయశ
సాం భాససౌమిల్లకవిపుత్రాదీనాం ప్రబంధానతిక్రమ్య వర్తమానకవేః
కాళిదాసస్య కృతౌ కథం పరిషదో బహుమానః" (అనఁగా) మహాయశ

స్సుగలిగిన భాసాదిపూర్వకవులనాటకంబులుండఁగా వర్తమానకవియగు కాళిదాసునికావ్యంబున సభ్యులకెట్లాదరంబుగలుగును? అనిసూత్రధారు నడిగెను. ఈప్రశ్నంబునఁ గాళిదాసుకంటెఁబూర్వము సరసదృశ్యప్రబంధ ములురచించిన భాసాదికవులుగలరని తెలియుచున్నది. ఈవిషయంబునఁ గొందఱు భాషావేత్తలు కాళిదాసుతనయితరనాటకంబులలో నెక్కడఁ బైవిధంబుగాఁజెప్పక యొక్కమాలవికాగ్నిమిత్రములోనే వాకొనుటచే భాసుఁడు రత్నావళినిరచించినట్లును, దానికంటెఁగూడఁ దననాటకంబు సరసంబుగానుండుననుతలంపును లోకంబునవెల్లడించుటకై పైప్రశ్నం బునకు సూత్రధారోక్తిగా—

“ పురాణమిత్యేవ నసాధుసర్వం నచాపి కావ్యం నవమిత్యవద్యం ।
సంతఃపరీక్ష్యాన్యతరద్భజంతే మూఢఃపరప్రత్యయనేయబుద్ధిః ॥ ”

(అనఁగా) కావ్యము ప్రాఁతదియగుటచే సరసమైనదియుఁ క్రొత్తదియగుటచే విరసమైనదియుఁగాదు. రసజ్ఞులు పరీక్షించి సరసమగు దానిని గ్రహింతురు. మూఢులు పరులయభిప్రాయంబునే విశ్వసింతు” రనుసమాధానంబును వ్రాసినట్లును భావించుచున్నారు. ఈభావనలోఁ గాళిదాసునకారోపింపఁబడునాత్మాభిమానమునుదీసివైచి యాలోచింపఁగా నతనికి భాసకవియందత్యంతగౌరవముగలిగినట్లును, శాకుంతల విక్రమోర్వశీయప్రస్తావనలలో “అపూర్వనాటక” మ్మనియుండి మాలవికాగ్నిమిత్రములో నట్లులేకుండుటచేతను రత్నావళీ మాలవికాగ్నిమిత్రము లొక్కవిధముగానుండుటచేతను రత్నావళిలోనికథను మేఘదూతలోఁ బ్రసక్తిగల్పించి “ప్రాప్యావంతీనుదయనకథాకోవిదగ్రామవృద్ధాన్ పూర్వోద్దిష్టామనుసరపురీం శ్రీవిశాలాం విశాలాం। ” అనివర్ణించుటచేతను రత్నావళినిజూచియే కాళిదాసు మాలవికాగ్నిమిత్రమును వ్రాసినట్లును దోఁచుచున్నది.

పైదానిలోనియుదయనకథాశబ్దమును బృహత్కథయందు ప్రయోగించెననితలంచినను బృహత్కథలో వాసవదత్తతండ్రిపేరు చండమహాసేనుఁడనియుండఁగాఁ గాళిదాసు మేఘసందేశములో నుజ్జయినీవర్ణనంబుననున్న “ప్రద్యోతస్య ప్రియదుహితరం వత్సరాజోఽత్రజహ్రే హైమం తాళద్రుమవనమభూదత్ర తస్యైవ రాజ్ఞః।” అనుపద్యములోఁ బ్రద్యోతనామంబు నెట్లు సేకరింపఁగలిగెను? బృహత్కథలోగూడ నింకొకచోఁ బ్రద్యోతుఁడుండెనుగాని యతఁడు మగధరాజుగావర్ణింపఁబడెను. కాళిదాసీప్రద్యోతునుజ్జయినీరాజుగావర్ణించెను. కావున రత్నావళీ ప్రియదర్శికాకర్త తనరూపకంబులలోఁ గ్రమముగా “ప్రద్యోతస్యసుతా వసంతసమయస్త్వంచేతి నామ్నాధృతిం।” “సపరిజనం ప్రద్యోతం విస్మయముపనీయ వాదయన్ వీణాం వాసవదత్తామపహరామి॥” యని వ్రాసినదానినిజూచియే కాళిదాసు మేఘసందేశములోనట్లువ్రాసెనని యింకొకసమాధానమిచ్చుచు రత్నావళీప్రియదర్శికలనుజూచియే కాళిదాసు మాలవికాగ్నిమిత్రమునురచించెననుమనయభిప్రాయంబును స్థిరపఱచుకొందము.

కొందఱు మేఘసందేశములోని “ప్రద్యోతస్య ప్రియదుహితర” మ్మనుశ్లోకము ప్రక్షిప్తములలోనిదనివ్రాసియున్నారుకాని యదియంతయుక్తముగా లేదు.

రెండవశిలాదిత్యుండగు హర్షవర్ధనుని సాంస్థానికమహాకవియగు బాణభట్టుఁడు హర్షచరిత్రంబునందుఁ గ్రమముగాఁ బూర్వకవిస్తవంబొనరించుచు భాసకాళిదాసులనిట్లువర్ణించెను.

* “సూత్రధారకృతారంభైర్నాటకైర్బహుభూమికైః।
సపతాకైర్యశోలేభే భాసో దేవకులైరివ॥”

* సూత్రధారునిచే నారంభింపఁబడిన పెక్కునాటకములచే భాసుఁడు కీర్తిఁ బొందెను.

" నిర్గతాసు నవాకస్య కాళిదాసస్య సూక్తిషు।
ప్రీతిర్మధురసాంద్రాసు మంజరీష్వివ జాయతే॥ "

ఈపద్యములంబట్టిచూడఁగా నాటకకర్తలలో ఘనయశస్సుగాంచిన యాద్యుఁడు భాసుఁడనియు నతఁడు కాళిదాసుకంటెఁ బూర్వుఁడనియు బాణునియభిప్రాయమైనట్లు మనకుగోచరమగుచున్నది.

రాజశేఖరకవికృతంబగు కవివిమర్శములోనివని ముప్పదినాలుగు శ్లోకముల నక్కడక్కడనుండి సంగ్రహించి కావ్యమాలలో ముద్రితమగు కర్పూరమంజరిపీఠికలో దుర్గాప్రసాదపండితులువ్రాసియున్నారు. వానిలో భాసకవిని వానిరత్నావళ్యాదిబహురూపకంబులనుగూర్చి ప్రబలనిదర్శనముకనుపడుచున్నది. కాని యట్టిగ్రంథములోకములోఁబ్రసిద్ధముకాకుండుటచే దానిఁగూర్చి కొంచెముముందుగాఁ బ్రసంగింపవలసియున్నది. శార్ఙ్గధరపద్ధతి, సూక్తిముక్తావళి, సుభాషితహారావళి, సుభాషితావళి మొదలుగాఁగల సంకలనగ్రంథములలోఁ బెక్కుచోట్లఁ బెక్కుకవులయుదంతంబులవర్ణించు శ్లోకంబులనేకంబులుగలవు. ఇవన్నియు నేదైననొకగ్రంథమునుండియెత్తివ్రాయఁబడినవిగానుండును. కవివిమర్శమనుగ్రంథమే లేనియెడల నింతమందికవులఁగూర్చినపద్యంబులెట్లు వేలువేలుగాసంభవించును? ఈశ్లోకంబులం వర్ణింపఁబడిన కవులందఱు రాజశేఖరునకుఁ బూర్వులేకాని తరునాతివారుకారు. ఈపద్యంబులైనను సందర్భములేక భిన్నభిన్నాంశంబులం దెలియఁజేయుచున్నవిగాని యొకవిషయమును సాంతముగాఁదెలియఁజేయుటలేదు. పైశ్లోకములలో నొకటియైన రాజశేఖరుని యితరగ్రంథములలోఁగలదేమోచూతమన్న నెక్కడను గానరాదు. కావున రాజశేఖరకవికృతంబగు కవివిమర్శమనునొక గ్రంథము గలదని నిశ్చయముగా నమ్మవలసియున్నది. పెక్కండ్రు హిందూదేశపండితులుగూడనిట్లతలంచియున్నారు. [illegible]

రామాయణనాటకములో "విద్ధినస్త్రప్రబంధా" నని వ్రాసికొనుటచే నిపుడు సుప్రసిద్ధములగు నాలుగు కావ్యములుగాక యింక రెండుగ్రంథము లుండవలయునని తెలియుచున్నది. వానిలో నొకటి కర్పూరమంజరివలెనే ప్రాకృతంబగు సవ్యాఖ్యలిఖితసట్టకము డాక్టరు ఆపర్టుదొరవారికి దొరకి నట్లొక కవి వ్రాసియుండెను. ఇందుచేఁగూడ రాజశేఖరునికృతులలో నా అవది కవివిమర్శమని మనము నమ్మవచ్చును. ఈకవివిమర్శములో రాజ శేఖరకవి—

* ఆదౌ భాసేనరచితా నాటికా ప్రియదర్శికా।
నిరీక్ష్యస్య రసజ్ఞస్య కస్య నప్రియదర్శనా।
తస్య రత్నావళీనూనం రత్నమాలేవ రాజతే।
దశరూపకకామిన్యా వక్షస్యత్యంతశోభనా।
నాగానందం సమాలోక్య యస్య శ్రీహర్షవిక్రమః।
అనందానంగభరితస్స్వసభ్యమకరోత్కవిం।
ఉదాత్తరాఘవం నూనముదాత్తరసగుంభితం।
యద్వీక్ష్య భవభూత్యాద్యాః ప్రణిన్యుర్నాటకానివై।
శ్లోకపర్యవసానస్య నవాంకాకిరణావళీ।
మాకందస్యేవ కస్యాత్ర ప్రదదాతి ననిర్వృతిం।
భాసనాటకచక్రేపి ఛేకైః క్షిప్తే పరీక్షితుం।
స్వప్నవాసవదత్తస్య దాహకోஉభూన్నపావకః॥

అని భాసకవిని, వానిరత్నావళ్యాదికావ్యంబులనుగూర్చి యత్యుదాత్తముగా వర్ణించెను. ఇందులకుఁదాహరణముగాఁ కర్ణాకర్ణికగావ

* గీంతలపై గ్రంథములను భాసుఁడు రచించెను. ఇతనినాగానందమును జూచి। శ్రీహర్షవిక్రమరాజీతనిఁ దనసభలోఁ జేర్చెను

చ్చునొకకథగూడఁగలదు. అది విశ్వసింపఁదగినదికాదుగాని చమత్కారముగానుండునుగావున నిందువ్రాసెదను.

ఒకనాఁడు శ్రీహర్షవిక్రముఁడు వేఁటనుండి తిరిగి వచ్చుచుండఁగా దారిలో నొక చాకలివాఁడొక వ్రాఁతపుస్తకమును జేతఁబట్టుకొని కూరుచుండి యారవైచిన తనబట్ట లెగిరిపోవుటయైన నెఱుఁగక తదేకదృష్టితో నేదోయాలోచించుచు వ్రాయుచుండెనఁట. అంతనారాజు వానిఁజూచి యాశ్చర్యపడి దగ్గఱకు వెళ్లి వానివృత్తాంతమునడిగి తెలిసికొని యిపుడేమివ్రాయుచుంటివనియడుగఁగా నారజకుఁడు నాగానందమురచించుచుంటినని చెప్పి కొన్నిశ్లోకములు చదివి వినిపించెనఁట. అంతట భూవరుండు పరమానందపడి వానినిదీసికొనిపోయి యాస్థానకవిగానొనరించి యోధావకా! నీవిప్పటికిరచించిన రూపకంబులను నాపేరఁబ్రకటింపుమని కోరెనఁట. పిదప జాతినామంబున ధావకుఁడనిపిలువఁబడు నాభాసుఁడు ధనాశచే సూత్రధారునిచేనారంభింపఁబడు ప్రస్తావనను రూపకముఖంబులఁగల్పించివ్రాసి శ్రీహర్షునిపేరఁ బ్రకటించెనఁట. ఇది లోకములో నుత్తమయశస్సుగాంచిన కాళిదాసాదులయెడఁగూడ నిట్టికథలు వినుచున్నయార్యులమనంబుల నాకర్షింపదని వేఱుగా వ్రాయనక్కఱ లేదు. కాని రత్నావళీ ప్రియదర్శికా నాగానందములలోని మూఁడుప్రస్తావనలొక్కవిధముగానేయుండుటచే భాసునకుఁబూర్వము నాటకంబులలోఁ బ్రస్తావనయను నొకభాగంబు లేదనిమాత్రము పూర్వపండితులూహించియున్నారు. ఈయభిప్రాయంబును దెలుపుటకే కాఁబోలు బాణుఁడు "సూత్రధారకృతారంభైః" అనుచో సూత్రధారునిచేఁజేయఁబడిన యారంభములుగల నాటకంబులు రచించినవాఁడని భాసుని సవిశేషముగావర్ణించెను? ఇది ట్లుండఁగాఁ బైనుదాహరించిన కవివిమర్శములోని శ్లోకములవలన భాసుఁడు, ఉదాత్తరాఘవము, కిరణావళి, స్వప్నవాసవదత్తయను రూపకంబు

లను, « భాసనాటకచక్రేఽపి ” యనుటచే నింకను బెక్కునాటకంబుల నురచించినట్లుకూడఁ దెలియుచున్నది. తాను భవభూతియొక్కయవతారమని బాలరామాయణములోవ్రాసికొనిన రాజశేఖరుఁడు « భవభూత్యాదులు భాసుని యుదాత్తరాఘవమునుజూచి నాటకములు వ్రాసియుందు ” రని చెప్పుటచేతను, సర్వాలంకారికులుకూడ దీనిలోనిశ్లోకంబులఁద మకృతులనుదాహరించియుండుటచేతను, భాసునికృతులలో నుదాత్తరాఘవముత్యుత్తమమనితోఁచుచున్నది. దీనిప్రస్తావనలో భాసుఁడు తానిరువదిమూఁడురూపకంబులకుఁ గర్తనని వ్రాసికొనినట్లొక వాడుకగలదు. ఇది కింవదంతి గాక—

‡ « భాషాసు రమ్యా గీర్వాణీ తస్యాం కావ్యం మనోహరం।
తత్రాపి రూపకం రమ్యం తత్ర భాసకవేః కృతిః।
భావకాపరనామాయం భాసో భాసయతే జగత్।
తత్త్వైరివాదిపురుష శ్చతుర్వింశతిరూపకైః॥

అనునొకమహాశయుని ప్రామాణికశ్లోకములవలననిజమనిస్థిరపడుచు నాయుదాత్తరాఘవముతో నిరువదినాలుగురూపకంబులగునని పైశ్లోకములకు సరివచ్చుచున్నది.

« ప్రభావతీముకుటతాడితకాద్యాని భూరిశః।
రూపకాణి విచిత్రాణి భాసేన రచితానివై॥ ”

అనుశ్లోకంబుననున్న ప్రభావతి, ముకుటతాడితము మొదలుగాఁగలవికూడభాసనాటకచతుర్వింశతిసంఖ్యనుబూర్తిచేయఁదోడ్పడుచున్నవి.

‡ భాషలలో సంస్కృతము రమ్యమైనది. అందును గావ్యము. అందును నాటకము. అందును భాసునినాటకము. భావకుఁడను నామాంతరముగలిగిన భాసుఁడు భగవంతుఁడిరువదినాలుగు తత్త్వములచేవలెనే తన యిరువదినాలుగు రూపకంబులచేతను జగంబును బ్రకాశింపఁజేయుచుండెను. చూ॥ నాగానందపీఠిక.

మఱియు నీధావకాపరనాముఁడగు భాసుఁడొక యమకకావ్యమును రచించి దానిచివర "ఆలంబ్య చాంబుతృషితః కరకోశపేయం భావానురక్తవనితాసురతైశ్శపేయం। * జీయేత యేన కవినా యమకైః పరేణ తస్మై వహేయముదకం ఘటకర్పరేణ॥" అని ప్రతిజ్ఞయొనరింపఁగా దానింగనిన యితరకవులోర్వఁజాలక యతనికి ఘటకర్పరుఁడని పేరు పెట్టిరనియు నందుచే నాయమకకావ్యమునకు ఘటకర్పరకావ్యమని పేరు వచ్చినదనియు నది మిక్కిలి సరసంబైనదనియు—

$ "జీయేత యేన కవినా యమకైః పరేణ।
తస్మై వహేయముదకం ఘటకర్పరేణ।
శ్రుత్వేతి భాసకవినోక్త మమృష్యమాణాః।
ప్రాహుస్తమన్యకవయో ఘటకర్పరాఖ్యం॥"

† "ధావకేన కృతం రమ్యం యమకాద్యైరలంకృతం।
ఘటకర్పరకావ్యం హి సంతోషాయ నకస్యచిత్॥"

అను ప్రామాణికశ్లోకములుగూడ దృష్టాంతములగుచున్నవి.

ఈఘటకర్పరకావ్యమిమిగులఁ బెద్దదియని తోఁచుచున్నది గాని యిపుడొక్కసర్గముమాత్రమే ముద్రితమైయున్నది. పైరాజశేఖరకవివిమర్శాది సాక్ష్యమువలన నెంతలకెంత ప్రయాసపడుచుంటిమో యట్టి రత్నావళ్యాది కర్తయగు భాసుఁడే ధావకుఁడనియు నతఁడే ఘటకర్పరుఁడనియు నతఁడే—

* యమకములో నన్ను జయించినవానికి నేను గుండెపెంకుతో నీళ్ళుమోసెదను.

$ ఈప్రతిజ్ఞనువిని పరులీతనికి ఘటకర్పరుఁడని పేరుపెట్టిరి.

† ధావకుఁడు రచించిన యమకాదిభూషితమగు కావ్యమెవనికానందము గలిగించదు?

$ " ధన్వంతరి క్షపణకామరసింహశంకు।
వేతాలభట్ట ఘటకర్పర కాళిదాసాః।
ఖ్యాతోవరాహమిహిరో నృపతే స్సభాయాం।
రత్నానివై వరరుచిర్నవవిక్రమస్య ॥ "

అను శ్రీహర్షవిక్రముని యాస్థానంబులోనున్న నవకవులలో నొకఁడనియు సులభంబుగఁ దెలియుటకంటె మహాప్రయోజనం బింకేమిగలదు? వీనికొకగ్రంథకర్తనికిమూఁడు పేర్లున్నట్లీక్రింది ప్రామాణిక శ్లోకముగూడ నాధారమగుచున్నది.

" సజయతి కవికులతిలకో భాసకవిర్ధావకాన్యనామాయం।
సహృదయహృదయాహ్లాదీ ఘటకర్పరనామతః ఖ్యాతః॥ "

ఈఘటకర్పరకవి రచించినట్లు నీతిసారమను మఱియొక కావ్యము కనుపడుచున్నది. ఏకవి స్వభావమైనను వానిగ్రంథములవలనఁ గనుఁగొనవచ్చుననుట నిశ్చయముగదా? నీతిసారంబునకు మొదటనున్న యీక్రింది మూఁడుశ్లోకంబులవలనను ఘటకర్పరుఁడు తన్ను సమకాలికకవులసహానంబున నెల్లిదంబుగఁజూచుచుండినట్లును గుణగ్రాహులకట్టి నీచాశయముండదుగావున నట్టి కొందఱితోఁ దనకు స్నేహముగలిగినట్లును దారిద్ర్యకష్టమనుభవింపలేక కవితాగౌరవంబునకాశపడక ధనాశ చేఁదనకృతులు శ్రీహర్షుని పేరఁబ్రకటించినట్లును స్వానుభవమును సూచించెను.

* " గిరా కలాపీ గగనే పయోదా।
లక్షాంతరేఽర్కశ్చ జలేషు పద్మాః।
ఇందుర్ద్విలక్షం కుముదస్య బంధుః।
యో యస్య మిత్రం నహి తస్య దూరం॥ "

---

$ ఇందలి తొమ్మండ్రుకవులు విక్రముని సభలోనున్నవారని జ్యోతిర్విదాభరణము చెప్పుచున్నది.

* నెమలికి మేఘమును, పద్మములకు సూర్యుఁడును, కలువకుఁ జంద్రుఁడు నెంతదూరమందుండిరి? మిత్రులకు దూరమన్నమాట లేదుగదా?

§ " మాతా నిన్దతి నాభినందతి పితా భ్రాతా నసంభాషతే।
భృత్యః కుప్యతి నానుగచ్ఛతి సుతః కాంతాచ నాలింగతే।
అర్థప్రార్థనశంకయా నకురుతేఽప్యాలాపమాత్రం సుహృత్।
తస్మాదర్థముపార్జయస్వచ సఖే! హ్యర్థస్య సర్వే వశాః॥ "

† " ధనైర్నిష్కులీనాః కులీనా భవంతి।
ధనైరాపదం మానవా నిస్తరంతి।
ధనేభ్యః పరో బాంధవో నాస్తి లోకే।
ధనాన్యార్జయధ్వం ధనాన్యార్జయధ్వం॥ "

ఈక్రిందిప్రామాణికశ్లోకంబుగూడఁ బైసూచనంబును స్థిరీకరించుచున్నది.

" శ్రీహర్షవిక్రమారాకస్య సభాయాం శుశుభేచ సః।
నవరత్నేష్వన్యతమో ఘటకర్పరనామతః॥ "

భాసకాళిదాసులనుగూర్చిన యింకొకకథ తెలిపి యిఁకనీచర్చవిడిచెదము. దరిద్రుఁడు రాజానుగ్రహంబున ధనవంతుఁడును సరసనాటకకర్తయునగు తనయెడఁ గాళిదాసునకసహనముగలదని భావించియేకాఁబోలు భాసుఁడు తననీతిసారములోఁ, గాళిదాసుని కుమారసంభవములోమూఁడవదియగు " అనంతరత్నప్రభవస్య యస్య హిమం నసౌభాగ్యవిలోపిజాతం। ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః॥ " అనుశ్లోకంబులోని యర్థాంతరన్యాసము లోకానుభవముగలిగి చెప్పినదికాదని యధిక్షేపించునట్లుగా దానియుత్తరార్థమునే సరిగా

---

§ తల్లిదండ్రులు, సోదరులు, భార్యాపుత్రులు, మిత్రులుగూడ ధనములేనివారినాదరింపరు. ధనమందఱినివశపఱచును. కాఁబట్టి ధనమార్జింపుఁడు.

† ధనమువలనఁ గులహీనులు సత్కులీనులగుదురు. దానివలనఁ గష్టములదాఁటవచ్చును దీనికంటె బంధువులేఁడు. కాఁబట్టి ధనమార్జింపుఁడు.

నెత్తికొని " ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోరితి యోబభా. షే। నూనం నదృష్టం కవినాపి తేన దారిద్ర్యదోషో గుణరాశినాశీ॥ " అని వ్రాసినట్లు కనుపడుచున్నది. గుణరాశిలోనొక్క-దోషమణఁగిపోవునని కాళిదాసు సత్యానుభవమేకలవాఁడయ్యేనేని యొక్క-నిర్ధనుఁడను దోష ముగాక మిగిలిన సద్గుణంబులకు గనియగు భాసునియెడ స్నేహభావమే లచూపఁడు? కాళిదాసు తన్నుఁబ్రేమించువాఁడనియుఁ గుమారసంభవ ములోఁ జెప్పినట్లు లోకానుభవముగలవాఁడేయనియు నెఱింగినయెడల ఘటకర్పరుఁడు నీతిసారములో నతనినాక్షేపించుట యెట్లుసంభవించు ను? కావుననిది సత్యమైయుండనోపు. ఎట్లయిననిది భాసకాళిదాసులు స మకాలికులని తెలుపుటచే మనచమువరులకు రుచింపకపోదు.

పైవిమర్శనంబువలన నింతవఱకు నిజముగా రత్నావళ్యాదులను రచించినవాఁడు భాసుఁడనియు నతఁడే ధావకుఁడనియు నతఁడే ఘటక ర్పరనామంబున విక్రమార్క-బిరుదాంకితుఁడగు శ్రీహర్షుని యాస్థానం బున నవకవిరత్నములలోనొకఁడై చతుర్వింశతిరూపకంబులను మఱికొ న్నికావ్యంబులను రచించిన మహాకవియనియుఁ గాళిదాసుకంటెఁ బెద్ద వాఁడై ముందుగాఁ గవియశస్సుగాంచినవాఁడయ్యుఁ గాళిదాసునకు స మకాలికుఁడనియు మాలవికాగ్నిమిత్రములో " భాససౌమిల్లాదులగ్రంథ ములుండగా వర్తమానకవి కావ్యము నెడ సభకెట్లాదరముగల్గును? అని యుండుటచేఁ గాళిదాసు మాలవికాగ్నిమిత్రము వ్రాయునప్పటికి బహు నాటకకర్తయగు భాసుఁడు గతించియుండుననియు నకా-రణంబుననే నిజముగా భాసునియెడ గౌరవంబుగలిగిన కాళిదాసు తనయేయితరనా టకంబులోలేనిక విస్మరణమిందొనరించియుండెననియునిశ్చయింపఁబడినది.

ఇఁక నెవ్వని యాస్థానంబున భాసుఁడుండెనని నిర్ణయించితిమో యా శ్రీహర్షవిక్రమాదిత్యుని కాలమునుగూర్చి విమర్శింపవలసియున్నది.

కాశ్మీరంబునఁ గొన్నివత్సరంబులు ప్రభువుగానున్న హర్షునియాశ్రితకవియగు మాతృగుప్తుఁడే కాళిదాసుఁడని భ్రమపడి యాతని కాలముతో సరిపుచ్చుటకై యనేకప్రయాసపడి యాశ్రీహర్షవిక్రమునిఁ గ్రీస్తుపూర్వమాఱవశతాబ్దంబునఁ జేర్చిన యొక ఘనవిమర్శకుని విమర్శనసారంబిందు ముందుగాఁ జూపుచున్నాఁడను.

రాజతరంగిణి మూఁడవతరంగంబు మొదటిభాగంబుననున్న " కాశ్మీరంబున ముప్పదిసంవత్సరముల రెండుమాసములు రాజ్యముచేసి సంతతిలేనివాఁడై హిరణ్యరాజు, కాలధర్మమునొందినపిదపఁ దన్మంత్రుల ప్రార్థనచే నరాజకంబగు కాశ్మీరరాజ్యమునకు, నక్కాలంబున నుజ్జయినిలోఁ జక్రవర్తిగానుండి శ్రీదేవి తన్నువరించినట్లు శ్రీబిరుదంబును నిరుపమానపరాక్రమంబున శకాది శత్రువులజయించినవాఁడగుట విక్రమార్క బిరుదంబును జెందిన హర్షుఁడు తనయాశ్రితకవియగు మాతృగుప్తుని రాజుగానొనరించె " ననుకథాభాగంబు నాధారంబుగాఁ జేసికొని యీమాతృగుప్తుఁడే జగద్గురుశంకరాచార్యులవారిశిష్యుండును హయగ్రీవవధకావ్యకర్తయునగు భర్తృమేంఠునాదరించెననియుఁ బైనిఁ జెప్పిన హర్షుఁడే యీకాలంబుననఁగాఁ గలియుగము ౨౫౫౦ అయినపిదపననఁగాఁ గ్రీస్తుపూర్వము ౫౫౭ లో శకులనుజయించి శకకాలమునిలిపెననియు నితఁడే రత్నావళ్యాదిరూపకములలోనున్న శ్రీహర్షుఁడనియు నితఁడే ధన్వంతర్యాదికవిరత్నములకాశ్రయుఁడనియు నేదోయొకవిధముగా లెక్కించివ్రాసి * మాతృగుప్తునిఁగాళిదాసుగాఁ జేయుటయేకాక, నవకవులను శంకరాచార్యులను వారిశిష్యులను విక్రమార్కుని వీరినందఱిని గ్రీస్తుపూర్వము ౬ వ శతాబ్దంబులోని సమకాలికులనుగాఁ జేసెను. కాని, రాజతరంగిణిలోఁ గల్హణుఁడు, మాతృగుప్తునిఁ గాశ్మీరరాజుగాఁ జేసిన హర్షుఁడు నవకవిరత్న

* ఈవిషయము కాళిదాసజీవితములో వివరింపఁబడును.

ములకాశ్రయుఁడగు హర్షవిక్రమునికంటె నన్యుఁడైనట్లు వర్ణించియుండు టచేతను, మాతృగుప్తునిచే సమ్మానింపఁబడిన భర్తృమేంఠునకును, వాని సహపాఠియగు రామిలునకును, గురుపాదులగు జగద్గురుశంకరాచార్యులవారికిని, ధన్వంతర్యాది కవులకును, హర్షవిక్రమునకును సమకాలికత్వమును స్థిరపఱచునే యితరప్రబలగ్రంథాద్యాధారంబులు కనుపడకుండుటచేతను, క్రీ॥ పూ॥ ౧౮౮ లోఁ బాటలీపుత్రమున రాజుగానున్న పుష్పమిత్రునికుమారుఁడగు నగ్నిమిత్రుఁడే విక్రమాదిత్యాశ్రితుఁడగు కాళిదాసుని మాలవికాగ్నిమిత్రమునకు నాయకుఁడగుటచేతను, క్రీ॥ పూ॥ రెండు మూఁడు శతాబ్దంబులలోఁబుట్టిన బృహత్కథలోని యుదయనోదంతమే భాసకృతంబులగు రత్నావళీ ప్రియదర్శికలకు మూలాధారమైయుండుటచేతను, హర్షనామంబులును విక్రమాదిత్యబిరుదనామంబులును గలరాజులనేకుండుటచే ఘటకర్పరకాళిదాసాదులకాశ్రయుఁడగు హర్షవిక్రముని కాలము నిర్ణయింపవిమర్శకులు భ్రమపడుచుండిరనుట తెల్లమగుటచేతను రత్నావళ్యాదులలోనున్న శ్రీహర్షుఁడు మాతృగుప్తునిఁ గాశ్మీరరాజుగాఁ జేసినవాఁడును క్రీ॥ పూ॥ ౬ వ శతాబ్దంబులోనివాఁడును గాఁడని నిశ్చయించి పైవిమర్శనమంతవిశ్వసనీయముగాదని యూహింపవలసియున్నది.

ఇదిట్లుండఁగాఁ గొందఱువిద్వాంసులీశ్రీహర్షవిక్రము నేడవశతాబ్దము మొదటఁజేర్చియుండిరని యిదివఱకే చదివియుంటిమిగదా? మఱికొందఱు క్రీ॥ శ॥ ౫౩౫ లో శకులనుజయించిన యశోవర్మయే యీశ్రీహర్షవిక్రమాదిత్యుఁడనియు నితఁడే నవకవిరత్నములకుఁ బోషకుఁడనియు వ్రాసియున్నారు. మఱికొందఱు ౩౬౫ లో శకయవనాది శత్రువులనోడించి విక్రమాదిత్యబిరుదమునొందిన రెండవచంద్రగుప్తుఁడే యితఁడనిభావించియున్నారు. శ్రీవిలియమ్సు కాళిదాసవిక్రమార్కులు ౩ వ శతాబ్దంబు ప్రారంభములోనివారని తెలిపియుండె. శ్రీలేసన్ను వీరిని రెండవశతా

బ్దమునడుమఁ జేర్చియుండెను. విల్సను తనపూర్వాభిప్రాయముమార్చికొని శ్రీహర్షవిక్రమకాళిదాసాదులు క్రీ॥ పూ॥ ౫౬ లో నుండిరని మఱియొకచోట వ్రాసియుండెను. ఇవన్నియుఁ జూడఁగా మనకుఁ గ్రీస్తుపూర్వమాఱవశతాబ్దంబు మొదలుగాఁ గ్రీస్తుశకమేడవశతాబ్దంబులోపుగానున్న భాసకాళిదాసాది కవిరత్నశీహర్షవిక్రములకాలనిర్ణయంబను క్షీరసాగరంబునడుమ నోలలాడుటసంభవించినట్లుతోఁచుచున్నది. కైను మనమెట్లయినను వీరియభిప్రాయంబులకు మధ్యస్థులమే. ఇటునటు నెవ్వారియెడను నపరాధంబొనర్పక మధ్యవర్తిగానుండుటమంచిదిగదా? కావున నాద్యంతవిమర్శకులమధ్యకాలమును నిష్పక్షపాతబుద్ధితో నాలోచించి మనమాధ్యస్థ్యమును నిర్వహించుకొని యీ కాలనిర్ణయసాగరమును దరించితిమేని నిందాపాత్రులముగాము.

శ్రీహర్షవిక్రమాదిత్యుఁడెప్పటివాఁడు? క్రీ॥ పూ॥ ప్రథమశతాబ్దిమునకుఁ బైవాఁడు కాఁడని యిదివఱకే తేలియున్నది. § హిందూమైథాలజీలో నుదాహరింపఁబడిన పూర్వోక్తవిమర్శకుల భిన్నాభిప్రాయంబులే క్రీ॥ శ॥ ప్రథమశతాబ్దమునకుందరువాతివాఁడు కాఁడని నిదర్శనములగుచున్నవి. ఇఁక నీవిక్రమార్క బిరుదాంకితుఁడగు రాజు క్రీ॥ పూ॥ ౫౬ లోనున్నవాఁడే కాని యింకెవ్వఁడును గానరాఁడు. కావున నతఁడే నవకవిరత్నములకాశ్రయుఁడగు శ్రీహర్షవిక్రముఁడని శ్రీవిల్సను మతమూఁతగాఁగల మనయభిప్రాయంబునకీక్రింది శ్రీనారాయణశాస్త్రిగారి శకకాలనిర్ణయంబుగూడ నాధారముకాఁగలదు.

“ మనయాలోచనకుఁ బూర్వచరిత్రకర్తలవ్రాఁతలు సరిపడకపోయినపుడు వానినిఁ దప్పులనిత్రోసివేయుటకంటె మనమే ప్రమాదపడితిమేమోయనిభావించి తొంటివ్రాఁతలయందు గౌరవముంచితిమేని యేవి

§ ౧౪౨. ౩౫౬. పు.

షయమందయినను నిజము దొరకకపోదు. పూర్వకవులు చరిత్రకాలనిర్ణయావసరంబునఁ దమశక్తికొలఁది యాథార్థ్యము నెఱింగియే వ్రాసియుందురని నమ్మవలసియున్నది. తనకుముందు క్షేమేంద్రాద్యనేకకవులు రాజచరిత్రలు వ్రాసిరనియు వానియందుఁబ్రమాదంబులఁగనుఁగొని శాసనాదులఁబరిశీలించి సవరించి రాజతరంగిణి వ్రాయుచుంటిననియుఁ బ్రతిజ్ఞచేసిన కల్హణునికంటె మనమెక్కువశత్త్వమెఱుంగఁగలమా? కావున శ్రీహర్షవిక్రమునికాలనిర్ణయంబునకుఁగూడ, రాజతరంగిణిలోని శకకాలనిర్ణయమే సరియయినమార్గముఁ జూపఁగలదు.

(1) క్రీస్తుపూర్వము కలియుగాబ్దములు— ౩౧౦౨

(2) కలియుగములో ౨౪ సంవత్సరములు గతించిన వెనుకఁ గాశ్మీరమునఁబ్రారంభింపఁబడిన లౌకికాబ్దములు— ౩౦౭౮

(3) కలియుగములో ౪౬౮ సం॥ అయినపిదప నారంభింపఁబడిన యుధిష్ఠిరకాలాబ్దములు— ౨౬౩౪

(4) కలియుగములో ౨౫౫౦ సం॥ జరిగినపిదపఁ గాశ్మీరమున వెడలిన శకకాలాబ్దములు— ౫౫౨

(5) కలియుగములో౩౦౪౬సం॥అయినపిదప విక్రమాదిత్యునిచేనారంభింపఁబడిన (సంవతు) మాలవశకాబ్దములు ౫౬

పైనిఁజెప్పినవానిలో నాల్గవదియగు శకకాలము, కాశ్మీరమున హర్షుఁడనురాజు శకులను జయించినపు డేర్పఱుపఁబడినది. ఇంతకుఁబూర్వము కాలనిర్ణయంబున శకపదమే లేదు" అని శకకాలనిర్ణయ మొనరించిరి.

ఇది శ్రీహర్షవిక్రమాదిత్యాదికాలనిర్ణయంబునకు సరిగానుండకపోయినను క్రీ॥ పూ॥ వెడలిన శకకాలమునుగూర్చి యుపయోగకరముగానే యున్నది.

ఈశకకాలములో "నవాధికపంచశతసంఖ్యే శాకే వరాహమిహిరో దివంగతః" $ అను బ్రహ్మగుప్తుని ఖండఖాద్యమునందలి యామరాజురచించిన వ్యాఖ్యానముననున్న వాక్యమువలన ౫౦౯ వ సంవత్సరమున వరాహమిహిరుఁడు కాలధర్మము నొందినట్లు తెలియుచున్నది. అనఁగా నీతనిస్మృతికాలము క్రీ॥ పూ॥ ౪౩ వ సంవత్సరమగుచున్నది. ఈవరాహమిహిరుఁడు శ్రీహర్షవిక్రముని యాస్థానమందలి నవీకవిరత్నములలోనివాఁడని పెక్కం డ్రంగీకరించినవిషయమే. విక్రమార్క (మాలవ) శకప్రారంభానంతరముకూడ వరాహమిహిరుఁడు ౧౩ సంవత్సరములు జీవించియున్నట్లు పైవాక్యమువలన ధ్రువపడుచున్నది. అట్టియెడ వరాహమిహిరునకాశ్రయుఁడగు మనశ్రీహర్షవిక్రముఁడు క్రీ॥ పూ॥ ౫౬ లో మాలవశకమేర్పఱచెనన నాక్షేపణమేమిగలదు?

మఱియు నిందులకుఁదార్కాణముగా, విల్సనునభిప్రాయంబునకుఁదోడుగాఁ శ్రీకేలుపండితులుకూడఁ గాళిదాసకవిని, మందసారశాసనాదికముననుసరించి పరిశీలించి క్రీ॥ పూ॥ ౫౬ లోఁ జేర్చినట్లు తెలియుచున్నది. ఈమహాకవి కాళిదాసునకాశ్రయుఁడగు మనశ్రీహర్షవిక్రముఁడుకూడ శ్రీకేలుగారియభిప్రాయంబునఁ క్రీ॥ పూ॥ ౫౬ లోనివాఁడనుట నిస్సంశయంబుగ నిశ్చితంబగునుగదా?

మఱియుఁగావ్యప్రకాశములోని ‡"కాళిదాసాదీనామివ యశః శ్రీహర్షాదేర్ధావకాదీనామివ ధనం" అనువాక్యము నర్థముపవరించిన బహువ్యాఖ్యాతలయభిప్రాయంబున దేహళీదీపన్యాయంబుగాఁ గాళిదాస ధావకులకు శ్రీహర్షుఁడాశ్రయదాతయైనట్లు ధ్రువమగుచున్నది. దీనింబట్టికూడ

$ కాళిదాసజీవితముననిది వివరింపఁబడినది.

‡ ఇదికూడ భాస (ధావక) కాళిదాసుల సమకాలికత్వమును స్థిరపఱుపనాధారంబు కాఁగలదు.

సర్వసమ్మతముగాఁ గాళిదాసునిపోషకుఁడైన విక్రమాదిత్యుఁడు శ్రీహర్ష విక్రమాదిత్యుఁడనియు నతఁడు ధావక కాళిదాసాదికవిరత్నములకుఁ బోషకుఁడనియుఁ దెలియుచున్నది.

కావునఁ బైసర్వవిమర్శనంబునకనుగుణంబుగాఁ గ్రీ॥ పూ॥ ౧౮౮ లోఁ బాటలీపుత్రమున రాజుగానున్న యగ్నిమిత్రుఁడు గథానాయకుఁడుగాఁగల మాలవికాగ్నిమిత్రమునురచించినవాఁడును, క్రీస్తుశకము ప్రథమ శతాబ్దము నంతంబుననున్న తనకవితాచ్ఛాయననుసరించిన యశ్వఘోషునకుఁగడుఁబూర్వుఁడునగు కాళిదాసునకాశ్రయుఁడగుటచేఁ గ్రీస్తుపూర్వ శతాబ్దంబునకుఁ బూర్వుఁడును, గ్రీస్తుశకముపూర్వభాగంబునకుఁబరుఁడునుగాక, క్రీ॥ పూ॥ ౫౭ మొదలుగాఁ గ్రీ॥ శ॥ మొదటిశతాబ్దంబులోపల నింకొక విక్రమాదిత్యుఁడుగలఁడని యెవ్వరియభిప్రాయంబును గాకుండుటచే నప్పటివాఁడేయై క్రీ॥ పూ॥ ౭౩ వ వత్సరంబువఱకును జీవించియున్న బృహత్సంహితాకర్తయగు వరాహమిహిరకవిరత్నమునకుఁ బోషకుఁడగుటచేఁదప్పకయితఁడే మాలవశకకర్తయని నిర్ధారితుఁడై శ్రీవిల్సనుకేలుపండితులయభిప్రాయంబులఁ గాళిదాసాదికవిరత్నముల కాశ్రయుఁడగు విక్రమార్కుఁడే మాలవశకకర్తయని పరిష్కృతుఁడగు మనశ్రీహర్షవిక్రముఁడు క్రీ॥ పూ॥ ౫౭ లో నుజ్జయినీరాజ్యసింహాసనంబునధిష్ఠించినవకవిరత్నములతో నానందించియుండునని నాయభిప్రాయము.

శ్రీహర్షుఁడు:—ఇతఁడు శకజయంబున విక్రమాదిత్యబిరుదాంకితుఁడై విక్రమార్క నామంబున జగత్ప్రసిద్ధిఁగాంచిన యుజ్జయినీచక్రవర్తి. ఇతఁడు తానువిద్వాంసుఁడగుటయేకాక భాసకాళిదాసాది నవకవిరత్నంబులనుబోషించి సంస్కృతభాషాలతాంగిని బరిపాలించిన మహానుభా

ఈకాలనిర్ణయంబునుగూర్చి యింకను మిగిలియున్న ప్రబలాధారముల నీతని సమకాలికుఁడగు మహాకవి కాళిదాసునిజీవితమున జూపుచున్నాఁడను.

•పుఁడు. భాసుఁడు (ధావకుఁడు) లేక ఘటకర్పరుఁడు రచించి యాతని పేరి డినను రత్నావళీప్రియదర్శికానాగానందములకితఁడే కర్తయని చెప్పఁదగు ను. మృదుశైలికిని, సరసాభిప్రాయంబులకును, సార్థకపదరచనకును, ర సౌచిత్యంబునకును, ప్రదర్శనీయతకును నీతనినిర్దుష్టంబులగురూపకములు మిక్కిలితగియున్నవి. అందును నాగానందము మందానందసందాయకమ నసందియములేదు. మొదటి రెంటిలోఁ గథాసరిత్సాగరంబునను, విష్ణుపు రాణంబునను వర్ణింపఁబడినట్లుగాఁ బాండవులకు సప్తమపురుషుండును ధీ రోదాత్తుఁడును గౌశాంబీనాథుఁడును దక్షిణనాయకుఁడు నగునుదయనుఁ డు కథానాయకుఁడు. మహారాజపుత్రికలును సహజసౌందర్యసౌశీల్యాది సుగుణపేటికలునగు రత్నావళీప్రియదర్శికలు కథానాయికలు. తక్కినపా త్రలును నీచములుగాక యుత్తమంబులు. ఇందుఁబ్రధానరసము శృంగా రము మూఁడవదానిలో భూతదయాళువును, బరోపకారపరాయణుఁడు ను, సర్వసముఁడును, స్వరాజ్యంబుమంత్రులయందిడి వానప్రస్థులగుజననీ జనకులకు సేవసేయునుత్తమలక్షణలక్షితుఁడును, విద్యాధరచక్రవర్తియు ననుకూలనాయకుఁడు నగుజీమూతవాహనుఁడు కథానాయకుఁడు. సత్కు లప్రసూతయు సకలసద్గుణవతియు నగుమలయవతి కథానాయిక. ఇందు శృంగారకరుణములు ప్రధానరసములు ఈరూపకత్రయంబున వృత్తి యో? కైశికి. పాకమో? కదళీపాకము. వీనియందలివర్ణనంబులో? అప్ర యత్నసిద్ధంబులైతత్కాలోపస్థితసులభపదఘటితంబులై సదలంకారాలం కృతంబులై యలరారుచున్నవి. ఈలక్షణంబులకుదాహరణముగాఁ గువ లయానందకర్త యనుభయతాత్పర్యరూపకాలంకారమునకుఁ గైకొనిన యీక్రిందిరత్నావళీపద్యము చాలును.

* "కింపద్మస్య రుచిం నహన్తి నయనానందం విధత్తే న కిం।
వృద్ధింవా ఝషకేతనస్య కురుతే నాలోకమాత్రేణ కిం।
వక్త్రేందౌ తవ సత్యయం యదపరశ్శీతాంశురుజ్జృంభతే।
దర్పస్స్యాదమృతేన చేదిహ తవాప్యస్త్యేవ బింబాధరే॥"

మఱియు ముగ్ధాంగనాహృదయావస్థం దెలుపు నీక్రిందిపద్యమెంత మధురముగా స్వభావసిద్ధముగానున్నది?

† "హ్రియా సర్వస్యాగ్రే నయతి విదితాస్మీతి వదనం।
ద్వయోర్దృష్ట్వాలాపం కలయతి కథామాత్మవిషయాం।
సఖీషు స్మేరాసు ప్రకటయతి వైలక్ష్యమధికం।
ప్రియాప్రాయేణాస్తే హృదయనిహితాశంకవిధురా॥"

విషముత్రాగి బాధపడుతనసోదరియగు ప్రియదర్శికను రక్షింపుమని వాసవదత్త వేడుకొనఁగా రాజు అడించుచుఁ జెప్పినయీక్రిందిపద్యము దయారసమొలికించుచు విషయనిగరణంబున నర్థాంతరన్యాసంబున నాయకుని ధీరోదాత్తలక్షణంబు దెలుపుచు నెంతనీతిదాయకముగానున్నది?

‡ "సంజాతసాంద్రమకరందరసాం క్రమేణ।
పాతుం గతశ్చ కలికాం కమలస్య భృంగః।

---

* మ॥ హరియింపంగను లేదె తమ్మిసిరి? నేత్రానందముంగూర్పదే? ।
స్మరతాపంబును బెంపదే మిగులవీక్షామాత్ర? నీమోముచం ।
దురుఁడుండన్ మఱిచంద్రుఁడేటికి దివిందోచున్? విధుండా సుధా।
కరతన్ గర్వమునొంద నద్దికలుగుంగానీదు కెమ్మోవిలోన్॥

† ఉ॥ అకటా! యందఱుఁ దెలిసిరంచు శిరంబునువంచు సిగ్గుచే।
నెకటాని నిర్దేశమునిన నెంచుకొనుందనమాటగాఁగనా।
చకటాని నెచ్చెలుగ్ స్మితము సల్పిన నివ్వెఱగొందు బేలయై। [కం॥వీ॥
యకటా మలాయతాక్షి హృదయంబునఁగల్గుభయంబు పెంపునన్॥

‡ తుమ్మెద మకరందపానము చేయఁ దామరపువ్వును జేరి మంచుతగిలిపడిపోయినది. దైవము ప్రతికూలముగానుండఁగాఁ గోరికలు ఫలింపవుగదా?

దగ్ధా నిపత్య సహసైవ హిమేన చైషా।
వామే విధౌ నహి ఫలం త్వభివాంఛితాని॥"

నాగానందములోని యీక్రిందినవోఢానమాగమవర్ణనంబు శృంగారరసవిషయంబున నీతిపథంబునతిక్రమింపక మృదుశైలిని విశదభావంబునను రసమాధుర్యంబునను స్వభావోక్తికిది పెట్టినది పేరన్నట్లుగానున్నది.

§ "దృష్టా దృష్టిమధో దధాతి కురుతే నాలాపమాభాషితా।
శయ్యాయాం పరివృత్య తిష్ఠతి బలాదాలింగితా వేపతే।
నిర్యాంతీషు సఖీషు వాసభవనాన్నిర్గంతుమేవేహతే।
జాతా వామతయైవ మేఽద్య సుతరాం ప్రీత్యై నవోఢా ప్రియా॥"

ఈక్రిందిపద్యము జీమూతవాహనుని ధైర్యసాహసౌదార్యంబులం దెల్పుచు శాంతినూర్జితమును గురిపించుచు జాతినైనం గరగించునట్లున్నది.

శిరాముఖైః స్యందత ఏవ రక్తమద్యాపి దేహే మమ మాంసమస్తి।
తృప్తిం న పశ్యామి చ తే మహాత్మన్ కిం భక్షణాత్త్వం విరతో గరుత్మన్"

ఓ పక్షిరాజా! నానరములనుండి నెత్తురు ప్రవహించుచునేయున్నది. ఇంకను నా దేహమున మాంసము గలదు. నీకడుపును నిండినట్లు కనుపడదు. ఏమి మహాత్మా! మాంసభక్షణము మానితివి?

-దీనినే ధనంజయకవి ధీరోదాత్తలక్షణంబునకు నౌదార్యంబునకుం గూడ నుదాహరించెను.

---

§ నాయకుఁడు నాయికనుగూర్చి తనలోననుకొనును. నేనుజూచినపుడు తానుక్రిందికిఁజూచును. పలుకరించిన మాటలాడదు. శయ్యమీఁద వెనుకఁదిరిగి పండుకొనును. బలాత్కారముగాఁ గౌఁగిలించిన వణఁకును. చెలులు పడకయిల్లు విడువఁగాఁ దానును వెళ్ళఁగోరును. నాకీది ప్రతికూలురాలుగానున్నను ప్రీతినే కలిగించుచున్నది.

రసౌచిత్యంబునకు క్షేమేంద్రుఁడౌచిత్యవిచారచర్చలో నుదాహరించిన యీక్రిందిపద్యమొక్కటియ చాలును.

“ ఉద్దామోత్కలికాం విపాండురరుచిం ప్రారబ్ధజృంభాంక్షణా ।
దాయాసశ్వసనోద్గమై రవిరతై రాతన్వతీ మాత్మనః ।
అద్యోద్యానలతామిమాం సమదనాం నారీమివాన్యాం ధ్రువం ।
పశ్యన్ కోపవిపాటలద్యుతి ముఖం దేవ్యాః కరిష్యామ్యహం ॥ ”

ఇందుఁ గోమలాంగీసమానధర్మములు గలనవమాలికాలతకు విరహావస్థ నారోపించుటచే వాసవదత్తయందుఁగనుపడు నీర్ష్యావిప్రలంభశృంగారరసమునకు నౌచిత్యచమత్కారకారిణియగు దీప్తికల్పింపఁబడినది. మఱియు నితరులనాటకములందువలెఁగాక యీతనిరూపకములందన్నిరసములు సహజముగా వర్ణింపఁబడినవి.

రత్నావళినుండి క్షేమేంద్రుఁడు భయానకరసంబునకుదాహరించిన యీపద్యమెంతచక్కగానున్నది?

¶ “ నష్టం వర్షవరైర్మనుష్యగణనాభావా దకృత్వాత్రపా ।
మంతఃకంచుకికంచుకస్యవిశతి త్రాసాదయం వామనః ।
పర్యంతాశ్రయిభిర్నిజస్య సదృశం నామ్నః కిరాతైఃకృతం ।
కుబ్జా నీచతయైవ యాంతి శనకై రాత్మేక్షణా శంకినః ॥ ”

రత్నావళీనాగానందములలోని యీక్రిందిరెండుశ్లోకములు శృంగారరసౌచిత్యమును, అవయవసహజసౌందర్యశోభావిశేషంబును, దెల్పు

---

¶ బంగరుగొలుసీడ్చుకొనుచు గుఱ్ఱపు*సాలనుండి రాజగృహంబుచొచ్చి మదించిన కోఁతినిజూచి పురుషులలో లెక్కలేని కొజ్జావాండ్రు సిగ్గులేక తొలఁగిపోయిరి. పొట్టివాఁడు కంచుకికంచుకములో దూఱుచుండెను. ప్రక్కలనున్న కిరాతులు తమపేరునకుఁదగినట్లు పొలిమేరఁజూచిరి. కోఁతి తమ్ముఁజూచుననుశంకచే మఱుగుజ్జువాండ్రు మిక్కిలివంగి మెల్లగాఁబోవుచుండిరి.

చు హర్షుమీఱక, కవికిఁగలస్వభావపరీక్షణశక్తిని, వర్ణనసామర్థ్యమును విశదీకరించుచున్నవి.

§ "కృచ్ఛ్రాదూరుయుగం వ్యతీత్య సుచిరం భ్రాంత్వా నితంబస్థలే ।
మధ్యేఽస్యాస్త్రివలీతరంగవిషమే నిష్పందతామాగతా ।
మద్దృష్టిస్తృషితేవ సంప్రతి శనైరారుహ్య తుంగౌ స్తనౌ ।
సాకాంక్షం ముహురీక్షతే జలలవప్రస్యందినీ లోచనే ॥"

‡ "ఖేదాయ స్తనభార ఏవ కిము తే మధ్యస్య హారోఽపరః ।
తామ్యత్యూరుయుగం నితంబభరతః కాంచ్యానయా కిం పునః ।
శక్తిః పాదయుగస్య నోరుయుగళం వోఢుం కుతో నూపురౌ ।
స్వాంగైరేవ విభూషితాసి వహసి క్లేశాయ కిం మండనం ॥"

ఈక్రిందిపద్యములు జీమూతవాహనుని సుగుణసంపదఁ దెల్పుచుఁ గరుణరసంబున నచేతనంబులకుఁగూడ నేడ్పుపుట్టించుచున్నవి.

† "నిరాధారం ధైర్యం కమివ శరణం యాతు వినయః ।
క్షమః క్షాంతిం వోఢుం క ఇహ విరతా దానపరతా ।
హతం సత్యం సత్యం వ్రజతు చ కృపా క్వాద్య కృపణా ।
జగజ్జాతం శూన్యం త్వయి తనయ! లోకాంతరగతే ॥"

---

§ నాచూపు మిక్కిలికష్టమునఁ దొడలు దాఁటి కటిప్రదేశమునఁ దిరిగి వళిత్రయమున నెచ్చుతగ్గుగానున్న మధ్యభాగమున నాగిదప్పికవడి మెల్లగా నెత్తయిన స్తనములెక్కి నీటిబిందువులు స్రవించు నేత్రములను గోరికతోఁ జూచుచున్నది.

‡ ఓకాంతా! నీనడుమునకు స్తనభారమే చాలును. హారములబరువేల? నితంబభారమే తొడలకుఁ జాలును. మొలనూలేల? పాదములు తొడలనే మోయలేకున్నవి. అందెలేల? నీయవయవములే నీకువస్తువులుగానున్నవి. ఇంకను నగలేల?

† జీమూతవాహనుని మరణమునకువిచారించు తండ్రిమాటలు. ఓకుమారా! నీవులోకాంతరమేఁగఁగా ధైర్యము, వినయము, దానపరత్వము, సత్యము, దయ, యివియన్నియు నిరాధారములైనవి. జగమా? శూన్యమైనది

$ "చూడామణిం చరణయోర్మమ పాతయతా త్వయా।
లోకాంతరగతేనాపి నోఝ్ఘితో వినయక్రమః॥"

ఈతని భాషాస్వాతంత్ర్యమునకును, కవితానైపుణ్యమునకును ఔచిత్యమునకు నీక్రిందిరెండుపద్యములుదాహరణములుగాఁగలవు.

‡ "అక్లిష్టబింబశోభాధరస్య నయనోత్సవస్య శశినఇవ।
దయితాముఖస్య రేఖా సుఖయతినః ప్రథమదృష్టేయం॥"

† "కుసుమసుకుమారమూర్తిర్దధతీ నియమేన తనుతరం మధ్యం।
ఆభాతి మకరకేతోః పార్శ్వస్థా చాపయష్టిరివ॥"

ఆహా! ఈకవికిఁగల చిత్రకళాపరిజ్ఞానమును, ఉపమాప్రయోగసామర్థ్యమును, పదార్థతత్త్వజ్ఞానమును, సమయోచితపదస్ఫూర్తిని, వేయేల? సర్వకవితాధర్మములను దెల్పుటకింతకంటె నితరంబేమియుదాహరింపవలెను? ఒకముక్కుగాని, పెదవికాని, చెవిగాని చక్కగానుండి మిగినవియట్లుండకపోవుటకాక, సర్వావయవములు చెప్పినట్లుసమష్టిలోనుం

---

$ నాపాదములపై శిరోమాణిక్యమునువిడిచిన నీవు లోకాంతరమేగియు వినయము విడువకుంటివి.

‡ చిత్రకారనైపుణిగలిగిన జీమూతవాహనుఁడై దురంగులు సేకరించి చంద్రకాంతశిలపైఁదనప్రియురాలిరూపము వ్రాయఁబోవుచు ముందుగా ముఖబాహ్యరేఖను జిత్రించిచూచి యిట్లానందించుచున్నాఁడు. మండలాకారశోభగలిగి కనుపడు ప్రతిపచ్చంద్రరేఖవలె దొండపండుఁబోలు క్రిందిపెదవిశోభగలిగి, కన్నులపండువుగానుండు సుందరిముఖరేఖ నన్నానందపెట్టుచున్నది.

† పుష్పసుకుమారమైనట్టి మూర్తిదాల్చి।
తనుతరంబగుమధ్యంబు తనరుచుండఁ।
గమ్మవిల్తునిపార్శ్వభాగమున నున్న।
కుసుమచాపమువలె దేవి కొమరుమీఱె॥

డుట యొక్కసౌందర్యమనఁబడునో యట్లే యొక్కమార్దవముగాని, పద గుంఫనముగాని, యలంకారముగాని యధికముగానుండి తక్కుంగలవ ట్లుండకపోవుటకాక, యెల్లకావ్యధర్మములు యథోక్తముగా నుచితస్థితిలో నుండుట కవితాసౌందర్యమనఁబడును. అట్టివే తాదృశసంస్కృతమహాక వుల కవితాసారస్యమనుభవైకవేద్యముగాని వాఙ్మాత్రగోచరముగాదు. అయిననీమహాకవి కవిత్వనైపుణికి దిక్ప్రదర్శనముగాఁగొన్ని పద్యములు దాహరించితిని. ఇంతమాత్రముచేఁగూడ స్థాలీపులాకన్యాయంబుగ సార స్యముగ్రహించుసరసుల కీకవిప్రతిభావిశేషంబు గోచరముగాకపోదు.

మఱియు సమకాలికంబులగు నీతనినాటకంబులందును మహాకవి కాళిదాసనాటకములందును సమానాభిప్రాయంబులుగల పద్యంబులనేకం బులుగలవు రుచిచూపుట కీక్రింది వారిరెండుశ్లోకంబుల నుదాహరించుచు న్నాఁడను.

“ సఖిలు నఖలు ముగ్ధే సాహసం కార్యమీదృక్ ।
వ్యపనయ కరమేతం పల్లవాభం లతాయాః ।
కుసుమమపి విచేతుం యోనమన్యే సమర్థః ।
కలయతి సకథం తే పాశముద్బంధనాయ ॥ రత్నా ”

“ నఖలు నఖలు బాణస్సన్నిపాత్యోఽయమస్మిన్ ।
మృదుని మృగశరీరే పుష్పరాశావివాగ్నిః ।
క్వబత హరిణకానాం జీవితం చాతిలోలం ।
క్వచ నిశితనిపాతా వజ్రసారాశ్శరాస్తే ॥ శాకుం ”

పైరెంటింటను గొంచెము విషయము భేదముగాని వృత్తంబును బదంబులును, అభిప్రాయంబును, హృదయావస్థయు సమానముగానున్నవి

జగత్ప్రసిద్ధంబులగు కాళిదాసనాటకములతిమనోరంజకంబులగుట సర్వవిదితమేకాని యీశ్రీహర్షనాటకంబులును వానికెల్లవిషయంబులందీ సిపోవుసరిగదా! భాషాసౌలభ్యంబునఁగూడ దృశ్యప్రబంధములలో నెల్లనివి యే మొకటివని తెల్లమగుచున్నది. ఈనాటకంబులకాలమున నింద్రజాల విద్యకుఁ బ్రాచుర్యమధికముగానున్నట్లు కనుపడుచున్నది. శ్రీహర్షుఁ డుభ యమతసమ్మతుఁడు వివేకియు నగుచక్రవర్తియని స్వార్థపరిత్యాగము పరోపకారము ప్రధానముగాఁగల నాగానందమే బోధించుచు జగంబు నకు నీతిదాయకముగానున్నది. ఈనాటకంబులనుపయోగింపఁబడినసౌర సేనియను ప్రాకృతభాషకూడ మిక్కిలిమృదువై సంస్కృతంబును జక్క గాఁబోలియున్నది. ఇట్టిప్రాకృతోపయోగమింకెవ్వరి నాటకంబులలోను లేదని విల్సనుకూడ దృఢాభిప్రాయపడియున్నాఁడు. ఇదికూడ వీనిప్రా చీనస్థితికి నొకకారణంబగును. ఇందలి కవిత్వ "మదోషౌ సగుణౌ సా లంకారౌ శబ్దార్థౌ కావ్య" మ్మను కావ్యలక్షణమునకు సరిపడి నిర్దుష్ట మై పాణినీయసమ్మతమై యన్వయకాఠిన్యము లేక సర్వజనాదరణీయము గా నున్నది. వేయేల? పద్యగద్యరత్నములప్రోవగుట రత్నావళి రత్నా వళియనియు, దర్శనరమణీయంబగుటఁ బ్రియదర్శిక ప్రియదర్శికయనియు, నచేతనంబులకుఁగూడ నీతికరుణౌదార్యములనుబోధించి సంతోషదాయ కంబగుట నాగానందము నాగానందమనియుఁ జెప్పవచ్చును.

శుభమస్తు.

# శ్రీ కాళిదాసమహాకవి.



మ॥ ధరణీచక్రవివేకిమానసగుహాంతర్యామి వాణీస్వయం।
వరవాల్మీకిమునిప్రణీతకవితాబ్రహ్మాండపూర్ణంబు ని।
త్యరసాత్మాత్మమహత్త్వబోధకకృతి వేదాంతైకవేద్యంబు స।
త్పరమానందము కాళిదాసకవిరాడ్బ్రహ్మంబు భావించెదన్॥

[ఈమహాకవి, శ్రీహర్షవిక్రమాదిత్యునిసభకలంకారభూతుండగు నవకవిరత్నశిరోరత్నమై క్రీస్తుపూర్వమేఁబదియాఱులలోనున్నవాఁడను ఘనవిమర్శకులననుసరించిన నాయభిప్రాయంబిదివఱకే విదితమైయున్ననీతని కాలమునుగూర్చి యనేకులనేకవిధములుగా వ్రాసియుండుటచేఁ బరస్పరవిరుద్ధములగు వారి యభిప్రాయంబులను సంగ్రహంబుగా సవిమర్శముగాఁ జూపుచు జగద్విఖ్యాతిఁగాంచిన యీకవితల్లజుని జీవితము విపులముగా వ్రాయఁబూనితిని].

ఎల్లవిదేశీయభాషలలోనంతను విశేషముగా హూణభాషలో నీమహాకవి నీతనికావ్యములనుగూర్చిన యుపన్యాసములు పెక్కుగలవని వినికని యుంటిమిగాని మనదేశభాషలలోనంతను నాంధ్రభాషలో నీతనికవిత్వచరిత్రతత్త్వముం దెల్పునుపన్యాస మొకటైనఁగలదని కని విని యెఱుంగము.

ఎవ్వనినామంబు భగవన్నామంబువలె సర్వభావలయంబునకు ధ్యానగోచరంబగునో యెవ్వనిరూపబదృశ్యంబయ్యుఁ గీర్తిరూపంబున భరతఖండంబు చతురాశాకుడ్యంబులఁ జిత్రితంబగునో యెవ్వనికృతులు

సకలదేశభాషాధురీణులనిలయంబుల గృహదైవంబులఁబోలి యారాధనీయంబులగునో యెవ్వనికావ్యామృతరస మనుభూతపూర్వంబయ్యె నెల్ల నాగరికులకెప్పటికప్పుడు శ్రోత్రపేయమై యయస్కాంతశకలముమాడ్కిఁ హృదయాకర్షకంబగునో యెవ్వనిశ్రావ్యకావ్యపద్యపాదంబొకండైననోటికిరానిచదువరి హిమాలయంబు మొదలుగాఁ గన్యాకుమార్యగ్రమువఱకును గలయెల్లజానపదులలో లేఁడో యామహానుభావునిచరితము వ్రాయఁ బూనునాసాహసంబును దెల్పికొని క్షమింప వివేకిలోకంబును బ్రార్థింపక మున్నె యంతటిసర్వజ్ఞుండే యహంకారిని గాసార్థంబు రఘువంశంబున వ్రాసిన—

* "మందః కవియశఃప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతామ్ ।
ప్రాంశులభ్యే ఫలే లోభాదుద్బాహురివ వామనః ॥"

అనుశ్లోకంబునుదలంచిననాకు హృదయవేపథంబు వొడముచున్నది. అయిన నీతనికావ్యరసముగ్రహించిన యాబాలవృద్ధమెల్లరకునీమహానుభావుఁడెవఁడు? ఎప్పటివాఁడు? ఎక్కడివాఁడు? అనువిషయంబులనొక్కసారియైననాలోచింపమనస్సు తొందరపడకపోదనుట యెల్లరు నెఱింగినదేకావున నాశక్తికొలఁదిఁబెద్దలఁబురస్కరించుకొని యీకవిచరితలేఖనంబునకుఁ గడంగెదను.

ఈమహాకవికాళిదాసుని జననంబున వన్నెకెక్కిన సుదినమేది? తనుపరిపూర్ణపుణ్యఫలంబుగా నీకీర్తికుమారునిఁ గనుపారఁగన్నమన్నన గొనుజననీజనకులెవరు? ఈపావనుని చరణతలంబులఁబవిత్రంబగు ప్రదేశమేది? ఈవిద్వాంసుని విద్యాగురువెవఁడు? ఈపురుషపుంగవుని జీవచరిత్ర యెట్టిది? ఈసుకృతిని జీవలోకమునుండి యెడఁబాపిన దుష్కాలమేది?

---

* ఎత్తయిన చోటనున్న ఫలమునుగోరి చేతులెత్తిన పొట్టివానివలెఁ గవియశస్సుగోరునేను పరిహాసపాత్రుఁడనగుదును.

యనునతికుతూహలంబున వెల్వడు నీప్రశ్నంబులకు యుక్తియుక్తంబగు ప్రతివచనమీతని కావ్యంబులలో మృగ్యంబై వానివ్యాఖ్యానంబులలో శశవిషాణప్రాయంబై యేతదర్వాచీనగ్రంథంబులలో గగనకుసుమోపమంబై రాజచరిత్రలలో మరుమరీచికాసలిలసమంబై శాసనాదులందుఁ జింత్యంబై యింకనన్నివిధములశూన్యంబై శోచనీయంబై .. ఏమో " యనివచ్చుటచే నివియన్నియు నిష్ప్రయోజనంబులగు దరిద్రుని మనోరథంబులమాడ్కిఁ బొంగి వెంటనే క్రుంగవలసినవగుచున్నవి. ఇంతకును గారణంబు మనదేశంబునఁ బూర్వము దేశచరిత్రలు వ్రాయునాచారము లేకుండుటగదా? ఈతనికావ్యంబులకు లెక్కలేనియన్నివ్యాఖ్యానములు వ్రాసినవారిలో నొకఁడైన నీతనికాలముఁ దెల్పెనా? ఈతనిగ్రంథంబులఁ బెక్కుదేశభాషలలోనికి మార్చినకవులలో నొకఁడైననీతనియుదంతంబు వ్రాయఁగడంగెనా? అనేకులాలంకారికు లీతనిపద్యరత్నంబులఁ దమపుస్తకంబులనుదాహరించిరిగాని యొకఁడైననీతనికథాప్రసంగమెత్తెనా? ఇమ్మహాత్ముని కృతిరత్నంబు లిపుడెట్లు దివ్యప్రభల విలసిల్లుచుండెనో తమజననకాలంబునఁ గూడనట్లేప్రకాశించినట్లు పూర్వాపూర్వకవుల ప్రస్తావనలే తెల్పుచున్నవి.

ఈపుంభారతికీర్తివాహనంబులగు కావ్యరాజహంసంబు లీభరతఖండమెల్లెడ నెట్లు సంచారమొనరించుచున్నవో మొదటినుండియు నితరఖండంబులఁగూడ విహరించుచునేయున్నట్లు కనుపడుచున్నది. అయిన నీతనివృత్తాంతంబుఁ దెల్పు దృఢాధారమింతయైనఁగనుపట్టదు. కాని యీతనింగూర్చి జననంబాదిగా మరణమువఱకునుగల సర్వదినచర్యను దెల్పునన్నిపుక్కిటిపురాణగాథలు లోకంబునఁ జిరకాలమునుండి కర్ణపరంపరాయత్తములై వచ్చుచున్నవి. అవియన్నియు నిజమని నమ్ముదుమా? అసత్యమని త్రోసివేయుదుమా? అందుఁగొన్నియమానుషచర్యలఁ జెప్పునవి యగుటచే నమ్మరానివై మఱికొన్ని నీతిదాయకములగుటచే విశ్వసనీయ

ములై సత్యాసత్యరూపములైన యాకథలు „ అట్టిమానవుఁడు లోకము నజన్మించియుండునా " యనియు „ ఆహా మహానుభావుఁడు కాళిదాసు భగవదవతారమే " యనియు రెండుతెఱంగులఁ బండితపామరలోకమును భ్రమపెట్టుచున్నవి. ఇదిట్లుండఁగా „ నిరువురుమువ్వురుకాళిదాసులున్నట్లు తెలియుచున్నది. వారిలో నెవఁడీతఁ" డను నొక్కగొప్పవిషయము మఱియు భ్రాంతినిగలిగించుచున్నది. దీనికిందోడు „ కాళిదాసనుపేరుగలకవియే లేఁడు. ఇదియొకబిరుదనామముకావచ్చు " ననునూతనమార్గము మిక్కిలిదిగ్భ్రాంతిని గావించుచున్నది. ఇవన్నియుఁజూడఁగా మన కాళిదాసచరితమార్గము పైకిబాగుగాఁగన్పడుచున్నను నడచినకొలఁదిని దొంగయూబిలోదింపునట్లుగానున్నది. అయిన నేబుధవరుఁడు విమర్శకయోగుల హృదయడోలాంతరంబులనూఁగుచుండె నేలోకజ్ఞుఁడు రసజ్ఞులవదనంబు సదనంబుగావించుకొనియుండె నేసుశ్లోకుఁడు కోవిదులకర్ణంబులకు విందొనర్చుచుండె నేప్రతిభావంతుఁడు కాళిదాసనామవాచ్యులకాద్యుఁడయ్యె నేపూజ్యపాదునినామమే తరువాతివారిబిరుదనామమునకు నిదానమయ్యె నారఘువంశశాకుంతలాది కావ్యనాటకకర్తయగుకవిసార్వభౌముఁడే మనకాళిదాసని నిర్ణయించి యొకదారిత్రొక్కెదము.

ఈమహాకవికాళిదాసుఁడెవఁడు? ఎప్పటివాఁడు?

ఆంధ్రమహాకవియగు తెనాలిరామకృష్ణునికారోపింపఁబడు పరిహాసకథలఁబోలినకథలకాశ్రయుండై ధారానగరాధిపతియైన భోజమహారాజునకాశ్రితుఁడై సంస్కృతభాషలోని సంకలనగ్రంథమగు భోజప్రబంధమునందలి కవిపాత్రలలోనొకఁడై మనయాంధ్రభాషలోముద్రితములగు కాళిదాసచరిత్రలకునాయకుఁడగు విటసార్వభౌముఁడుకాఁడు.

౧౧ వ శతాబ్దంబులోని శ్రీభోజనరేంద్రుని పితామహుండును ౧౦ వ శతాబ్దంబు చివరిభాగంబుననున్నవాఁడు నగుముంజమహీపాలు

ని యాశ్రితుఁడగు ధనంజయుని దశరూపంబునఁ బేర్కొనఁబడినవాఁడును 7 వ శతాబ్దంబు మొదట నుజ్జయినీ కన్యాకుబ్జంబుల నేలిన హర్షవర్ధనుని యాస్థానమందలికవియగు బాణభట్టునిచే మిగులనుతింపఁబడినవాఁడునగు కాళిదాసు భోజరాజు కాలము నాఁటివాఁడనుట యెంతయు నసంగతము.

“ హర్షచరిత్రలోఁ గవిస్తుతి చేయుచు బాణభట్టుఁడు, సూత్రధార కృతారంభములగు బహురూపకంబులచే భాసుఁడు కీర్తిఁ బొందెనని భాసకవిని, మధురసాంద్రమ్ములైన కాళిదాసోక్తులయం దెవనికాదరము గలుగదని కాళిదాసుని వర్ణించుటలో భాసుని రత్నావళ్యాదిరూపకంబులకంటె మిక్కిలి మనోహరములై మహాయశస్సు గాంచిన కాళిదాసుని శాకుంతలాదినాటకంబులఁ బ్రశంసించక పోవుట చూడఁగా బాణుఁడు హర్షచరిత్ర వ్రాయునప్పటికిఁ గాళిదాసు నాటకములైనను వ్రాయకయుండవలెను లేదా? వ్రాసినను వానికా కాలమున సంప్రసిద్ధి లేకుండవలెనని తోఁచుచున్నదిగావునఁ గాళిదాసు బాణునకు సమకాలికుఁడుగాని యొక్కింత ము పూర్వుఁడుగాని యైయుండవలె ” నని మొదటఁ గాదంబరీపీఠికలో వ్రాసిన డాక్టరు పేటర్సను “ నేను గాదంబరిలోఁ జూపినయభిప్రాయము ప్రమాదికము కాళిదాసు క్రీస్తుశకమునకుఁ గొంచెము పూర్వమునుండి వచ్చుచున్న విక్రమశకము మొదటివాఁడై యుండు ” నని తన పూర్వాభిప్రాయంబును దరువాత మార్చుకొనెనని చెప్పుచుఁ గొందఱు విమర్శకులా పూర్వాభిప్రాయంబును గూడఁ గాళిదాసు నాఱవశతాబ్దములోఁ జేర్చుటకొక యాధారముగా గ్రహించియు నారేయదిమర్కల ప్రమాణమని తలఁచియుండుటచే దానినిమనము పరిగణింపనక్కఱలేదు. ఇదిట్లుండఁగా—

§ “ రఘువంశకావ్యమునందున్న “ తం భావాయ ప్రసవసమయాకాంక్షిణీనాం ప్రజానా । మంతర్గూఢం క్షితిరివ నభో బీజముష్టిం దధా

§ ప్రసవసమయమును గోరు ప్రజలయభీష్టంబు కొఱకు నిండుచూలాలయిన యగ్నివర్ణపత్ని సింహాసన మెక్కి రాజ్యము నరించెను.

నా। మౌలైస్సార్ధం స్థవిరసచివై ర్హేమసింహాసనస్థా। రాజ్ఞీ రాజ్యం విధివ దశిష ద్భర్తురవ్యాహతాజ్ఞా॥"

యనుశ్లోకంబునవర్ణింపఁబడిన యగ్నివర్ణపత్నీగర్భస్థుఁడగు రాజకుమారునితోఁ గావ్యముసమాప్తిచేయుటవలన సూర్యవంశరాజులపరిపాలనకాలంబునుబట్టిచూడఁగాఁ క్రీ॥ పూర్వమెనిమిదవ శతాబ్దంబులోనున్న యా రాజబాలునకుఁ గాళిదాసు సమకాలికుఁడాశ్రితుఁడునై యుండవలె" నని ఘోచిదొరవారభిప్రాయపడిరిగాని యా బాలుని జననంబును నామంబునైనఁ దెల్పక యతఁడు గర్భస్థుఁడైయుండఁగాఁ దల్లి దేశపరిపాలనచేయుచుండెనని చెప్పి యాకథాభాగమును విడుచుటచేఁ దనకావ్యనిర్మాణము నాఁటికి జన్మమైన నెత్తనివానితోఁ గాళిదాసునకు సమకాలికత్వమూహించుట యసంభవమనియు నొకవేళ యతఁడు పుట్టినవెనుకనే కాళిదాసతని నాశ్రయించియుండవచ్చునని యూహించినను దనయాశ్రయదాతవృత్తమును బిదపనైన దానికనుబంధముగా వర్ణింపకపోవుటచూడఁగా నట్టి యూహకవకాశమే లేదనియు, రఘువంశముయొక్క సమాప్తియు నైజముగా దరిదేలినట్లుగాను డకి మధ్యభాగమున విడువఁబడినట్లుండుటచేతను, వాయుపురాణము మొదలుగాఁగల కొన్నిగ్రంథములనుబట్టి గర్భస్థబాలుఁడు మొదలుగా ననేకరాజులు రాజ్యముచేసినట్లు కనుపడుచుండినను వారివృత్తాంతము వర్ణనీయముకాకపోవుటచేతనో కావ్యవిస్తరభీతిచేతనో యంతటితో సమాప్తినొందించియుండునని యూహింపఁదగినదగుటచేతను గాళిదాసు క్రీ॥ పూ॥ ౮ వ శతాబ్దములోనివాఁడు కాఁడనియు సహజసిద్ధంబగు కాళిదాసనాటకశైలికిని శాకుంతలాదులవలెఁ బ్రసిద్ధిఁ గాంచిన భవభూతినాటకంబుల ప్రయత్నసిద్ధంబగు శైలికిని నడుమ నాఱేడుశతాబ్దంబులకంటె నధికకాలముండియుండదని గ్రహింపఁదగినదగుటచేఁ గాళిదాసు క్రీస్తుశకప్రారంభమునకు దగ్గఱివాఁడైయుండుననియు వి

"శ్వసింపవచ్చు" నని ఘోషించెదరు వారి యభిప్రాయంబును ఖండించిన †యస్. పి. పండితులయాశయంబును డాక్టరుభాడాజీగారి కాళిదాసోపన్యాసము తెల్పుచున్నది. మఱియు జ్యోతిషగ్రంథప్రమాణము వలనఁ దెలియఁబడుచున్న (సంవత్) మాళవశకమును క్రీ॥ పూ॥ ౫౬ లో స్థాపించిన విక్రమాదిత్యుని యాస్థానమందలి నవరత్నములలోఁ గాళిదాసొకఁడని జ్యోతిర్విదాభరణమందలి కవిరత్నపద్యము చెప్పుచున్నది గావునఁ గాళిదాసు క్రీస్తుపూర్వము ప్రథమశతాబ్దమునం దుండియుండు" నని సర్ విలియమ్ జోన్సు నిశ్చయించినట్లుకూడఁ దెలుపుచున్నది.

కాని క్రీ॥ పూ॥ ౫౬ లో నుజ్జయినీరాజుగానున్న విక్రమాదిత్యుఁడే లేఁడనియుఁ గ్రీ॥ శ॥ ౫౪౪ లో జరిగిన కోరూరు యుద్ధములో నుజ్జయినీప్రభువగు విక్రమహర్షుఁడు కడపటిసారి మ్లేచ్ఛులను జయించెననియు నావిక్రమార్కు జయంబున కభిజ్ఞానంబుగ నిలుపఁబడిన శకము ౬౦౦ సంవత్సరములు వెనుకకు జరిపి ప్రారంభింపఁబడుటచేఁ గ్రీ॥ పూ॥ ౫౬ నుండి వచ్చుచున్నదనియు నందుచే విక్రమార్కుఁ డప్పటివాఁడని తలంపఁగూడదనియు నతఁడు క్రీ॥ శ॥ ౬ వ శతాబ్దములోనివాఁడనియు విక్రమార్కశకనిర్ణయమును గూర్చి మొదట సాహసంబుగాఁ జెప్పిన ఫెర్గూసాను దొర యభిప్రాయంబు నేఁటివారికొందఱు విమర్శకులు గ్రహించి కవిరత్నాశ్రయుఁడగు విక్రమాదిత్యుఁ డాఱవశతాబ్దములోనివాఁడని వ్రాసియుండిరి. ఈయభిప్రాయము నంగీకరించి మేక్సుముల్లరుపండితుఁడు మొదలుగా మఱికొందఱు "క్రీ॥ శ॥ ౬ వ శతాబ్దములో నారంభింపఁబడిన విక్రమశకమెందుచే నాఱువందలవత్సరములు వెనుకకు జరుపఁబడినదో యెవరును సయుక్తికంబగు కారణమును జెప్పరైరి" యని దీని నాక్షేపించినట్లుగా శ్రీ నందర్గికారులు చెప్పుచు రాజతరంగిణ్యామలంబట్టి యిద్దఱు ముగ్గురు విక్ర

† చూ॰ శ్రీనందర్గికారుల రఘువంశపీఠిక

మార్కులు కనుపడుటచే మాలవశకకర్తయెవడో నిర్ణయించుట కష్టసాధ్యమేయని సంశయించుచుండుదకుఁ గాళిదాసాశ్రయుఁడగు విక్రమాదిత్యుఁడు ౬ వ శతాబ్దములోనివాఁడేయని కోరూరుసిద్ధాంతము నవలంబించినట్లు కనుపడుచున్నది.

ఫెర్గూసాను యొక్క మతమునను సరించిన పైవిమర్శకుల యభిప్రాయమాలోచింపఁగాఁ గ్రీ॥ ౫౪౪ లో నున్న విక్రమార్కుఁడుగాక క్రీ పూ॥ ౫౬ లోఁ దన పేర విక్రమార్క (మాలవ) శకమును నిలిపినరాజే లేఁడనియు, శకవ్యాప్తికై యాఱువందలయేండ్లు వెనుకనుండి ప్రారంభింపఁబడినదనితలంచుటచేఁ గ్రీ॥ పూ॥ ౫౬ మొదలుగాఁ గ్రీ॥ ౫౪౪ వ సంవత్సరములో పుగా మాలవవిక్రమార్క నామంబులతో నొకశక మేవ్యవహరింపఁబడియుండుటకవకాశము లేదనియు స్పష్టముగాఁ దెలియుచున్నది. కాని, యీక్రిందనుదాహరింపఁబడు శాసనములు పైవాదంబునకపవాదంబుగల్పించుచు నట్టిశక మొకటిగలదని ధ్రువపఱచుచున్నవి.

$ జయభటునికవి శాసనములో "విక్రమసంవతు ౪౩౦" అనియే దో యొకసందర్భమును దెల్పుచున్నట్లు తెలియుటచేతను డాక్టరుఫ్లీటు కనుపఱిచిన మందసారశాసనములోని—

"మాలవానాం గణస్థిత్యా యాతే శతచతుష్టయే।
త్రినవత్యధికేఽబ్దానా మృతౌ సేవ్యఘనస్వనే।
సహస్య మాసశుక్లస్య ప్రశస్తేఽహ్ని త్రయోదశే।
మంగలాచారవిధినా ప్రాసాదోఽయం నివేశితః॥"

అను శ్లోకమువలన "మాలవశకము ౪౯౩" అనియున్నట్లుకనుపడుటచేతను గ్రీ॥ ౫౪౪ లో జరిగిన కోరూరుయుద్ధములోని విక్రమాది

$ చూ॰ ఇండియన్ ఆంటిక్వెరీ ౧౮౭౬.

త్యుని జయమునకుఁ బూర్వమే విక్రమార్క మాలవనామములతో నొకశకమున్నట్లును క్రీ॥ పూ॥ ౫౭ నుండి వచ్చుచున్న సర్వసమ్మతమైనశకమదియే యైనట్లును స్పష్టమగుచున్నది.

మఱియుఁ గాళిదాసునుగూర్చి వ్రాసిన డాక్టరు కేర్న అనువిమర్శకుఁడు "చైనాదేశస్థుఁడగుఫాహియాను ౪౧౪ లో హిందూదేశయాత్ర చేయవచ్చినపుడు గయలో నమరదేవనిర్మితమని యొకశిలాశాసనముచెప్పుచున్నగుడి లేదనియుఁ బిదప ౬౪౩ లో హుయన్‌త్సాంగువచ్చినపుడట్టిదేవాలయముగనుపడినదనియు వ్రాయఁబడియుండుటచే నీమధ్యకాలంబుననున్న యమరదేవునకు సమకాలికుఁడగు కాళిదాసు ౬ వ శతాబ్దంబుకడపటివాఁడైయుండు" నని యొకనూతనమార్గముం ద్రొక్కెను. దీనిపై మఱికొందఱువిమర్శకులు "ఫాహియాను గయలోని యమరదేవుఁడుకట్టించినగుడిని జూడకపోవచ్చును. చూచినను దానినిగూర్చి వ్రాయకపోవచ్చును. లేదా? అతనియాత్రకుఁదరువాతనే యాగుడినిర్మింపఁబడినదనితలంచినను నాయమరదేవుఁడు నవకవిరత్నములలోనియమరసింహునికంటె నన్యుఁడుకావచ్చును. కాని యంతమాత్రముచేతనే నామలింగానుశాసనకర్తయగు నమరసింహుఁడే యాయమరదేవుఁడనియు నాతనికి సమకాలికుఁడగు కాళిదాసాఱవశతాబ్దములోనివాఁడనియుఁ జెప్పుటయుక్తముగా" దని దృఢాభిప్రాయముం దెల్పిరి.

మఱికొందఱు § "బ్రహ్మగుప్తుని ఖండఖాద్యగ్రంథముయొక్క వ్యాఖ్యానముననున్న "నవాధికపంచశతసంఖ్యశాకే వరాహమిహిరాచార్యో దివంగతః" అనువాక్యమునందలి శాకపదమునకు శాలివాహనశకమనియర్థముచేసి శకకాలము ౫౦౯ అనఁగాఁ క్రీ॥ ౫౮౭ లో మృతి

§ సం. కా. ర. పీఠిక.

నొందిన వరాహమిహిరుఁడు నవరత్నములలోనివాఁడగుటచే నతనికిసమకాలికుఁడగు కాళిదాసు ౬ వ శతాబ్దము రెండవభాగములోనివాఁడై యుండు" నని వ్రాసిరి. సరియే కానిండు. వరాహమిహిరుని మరణకాలమునను సరించి విక్రమాదిత్యాశ్రితుఁడగు కాళిదాసును క్రీ॥ ౫౮౭ ప్రాంతమునఁజేర్చిన కోరూరుసిద్ధాంతమునవలంబించినపైవారు, మాలవశకోద్ధారకుఁడగు విక్రమార్కుఁడు ౫౪౪ లో శకులనుజయించి ౫౫౦ లో మృతిఁబొందెనని వ్రాయుచుండినను దదాశ్రితుఁడగు వరాహమిహిరుఁడిఁక ౩౭ సంవత్సరములు జీవించియుండెనని తలంచుట యాశ్చర్యముగాదుగావున నతనికి సమకాలికుఁడగుకాళిదాసు నాఱవశతాబ్దంబులోఁజేర్చుటకై వరాహమిహిరమరణకాలబోధకంబగు శాకపదమునకు శాలివాహనశకమర్థముచేసిరిగాని యంతకుఁబూర్వమే ౩౭ సంవత్సరములక్రిందట మాలవశకమునునిలిపిన యతనిపోషకుఁడగు విక్రమార్కునిశకమనియేలయర్థముచేసిరికారో తెలియకున్నది. ఒకవేళ పైవాక్యము వ్రాసినవాఁడామరాజుగదా? యతనియభిప్రాయము శాలివాహనశకమేమైయుండుననితలంతురేని యతఁడయినను క్రీ॥ ౬౨౮ లో నున్నవాఁడని వారే తెలుపుచుండుటచే వరాహమిహిరమరణకాలంబునకు ౪౧ ఏండ్లుమాత్రమే తరువాతివాఁడై యుజ్జయినీరాజ్యంబుననున్నయతఁడా మాలవశకమును సంపూర్ణముగా వ్యవహరించుకొనుచుండి యావరాహమిహిరునకు మిత్రుఁడో శిష్యుఁడోనైయుండి కొంచెమించుమించుగా విక్రమాదిత్యునిఁగూడ నతిబాల్యమునఁజూచినవాఁడేమైయుండి విక్రమార్కశకమనునర్థమునందే శాకపదమును బ్రయోగించియుండుననిమాత్రముతలంచి యా శాకపదమునకు మాలవశకమనియర్థమేల చెప్పరాదు? అట్లు చెప్పినయెడల ౫౧౯ లో గతించిన వరాహమిహిరునకును, నతనిపోషకసమకాలికులగు విక్రమాదిత్యకాళిదాసులకును నడుమ ౯౧ సంవత్సరములు వారితలంపు

నకుభంజకంబగు వ్యవధానముండెనని వారెఱుంగరా? కావునఁ జైశాకపదమునకీ రెండుశకములు నర్థముగాక శ్రీహర్షజీవితములో వ్రాసినట్లుగాఁ గ్రీ॥ పూ॥ ౫౭-౦ లోఁ బ్రారంభింపఁబడిన శకకాలమే యర్థమనియు, నికారణంబునఁ గాళిదాసునాఱవశతాబ్దములోనివాఁడని నిర్ణయింపఁగూడదనియు నాలోచింపవలసియున్నది.

మఱికొందఱు ౩౯౫ లో శకాములనుజయించి విక్రమాదిత్యబిరుదమొందిన రెండవచంద్రగుప్తునినాఁటివాఁడు కాళిదాసని వ్రాసినదాని నిదిమికిలి నిరాధారంబని కాళిదాసవిక్రమార్క కాలనిర్ణయకర్తలెల్లరు నిర్వచించియున్న నదికూడ విక్రమార్క కాళిదాసాదుల నాఱవశతాబ్దములోఁ జేర్చిన కోరూరుసిద్ధాంతము సంశయాస్పదమనుటకుఁ జాలును. అయిననేది యింతమందిని భ్రమపెట్టుచుండె నట్టికోరూరుయుద్ధమునకొక్క యాల్బరూనిమాటతక్క వేఱొక్కసాక్ష్యమేదియుఁ గనుపడనందుననిది విశ్వసింపఁదగినదికాదని యెల్లనవీనచరిత్రకర్తల యభిప్రాయము లేకీభవించుచున్నందుననిఁక దీనిపై వాదములు విమర్శింపక యితరాభిప్రాయములంగనుఁగొనెదము.

తమయాశయంబునకుఁగొందఱు వ్రాతల నాధారముగాఁదీసికొని కాళిదాసు బాణునకు సమకాలికుఁడో కొంచెముపూర్వుఁడో యైయుండుననునభిప్రాయముమనస్సులోనుంచుకొని యతని నాఱవశతాబ్దం బుతుది భాగంబునఁజేర్చి రఘువంశపీఠికలో వ్రాసిన శ్రీనందర్గికారుల ప్రమాణంబులముందుగా విమర్శింపవలసియున్నది,

క్రీ॥ శ॥ ౬౩౪ లో ద్వితీయపులికేశినివేశితంబగు నైహోలశాసములోనున్నదని "యేనాయోజిన వేఽశ్మ స్థిరమర్థవిధౌ వివేకినాజిన వేశ్మ, సవిజయతాం రవికీర్తిః కవితాశ్రిత కాళిదాసభారవికీర్తిః॥" అనుశ్లోకమునుదాహరించుటవలన భారవి కాళిదాసులు సమకాలికులై పైశాసస

కాలముననుండియుందురని వారియభిప్రాయమైనట్లు కనుపడుచున్నదిగా-
ని వారుపైశ్లోకమునకర్థము వివరించియుండకపోవుటచూడఁగా లోకప్రసి-
ద్ధుఁడగు మనకాళిదాసునకాపద్యార్థము సంబంధించదని వారికే సంశయ-
ముకలిగినట్లు తోఁచుచున్నది. ఆహా! యీశ్లోకము యమకప్రధానమై
క్లిష్టార్థంబై యెవనిఁగూర్చి వెడలెనో వానివిక్రమౌదార్యములం దెల్పు నిరుప-
యోగంబై కాళిదాసువిక్రమాదిత్యునాదరణపాత్రుఁడను నెల్లవిమర్శకచ-
రిత్రకర్తలయభిప్రాయంబునకును ధన్వంతర్యాదికవులకు సమకాలికుఁడను
చాలమంది యాశయంబునకును భంజకంబై రవికీర్తికాశ్రితుఁడనియుభా-
రవికి సమకాలికుఁడనియు నెవ్వరునెపుడునెఱుఁగని నూతనవిశేషముం
దెల్పునట్లొకవిధముగా సర్థమైనదేమోకాని, కాళిదాసభారవికవులకీర్తి
వంటికీర్తిగల రవికీర్తియని కీర్తివిషయమై యుపమానంబుగా యమకము
నకుసరిపడినట్లుగాఁ బ్రాచీనప్రసిద్ధుఁడగు కాళిదాసును నవీనప్రసిద్ధుఁడగు
భారవినిగైకొనినట్లర్థమగునది పులికేశితో నెట్టిసంబంధముగలవాఁడో తె-
లియఁబడని రపికీర్తివర్ణనముం దెల్పుచుఁ గాళిదాసప్రశంస నేమియుఁ జెప్ప-
నందునఁ గాళిదాసు భారవిసమకాలికుఁడై యాశాసనకాలమున నుండి
యుండుననితలంచుట యాశ్చర్యకరమగును. అట్లయినయెడలఁ గాళిదాసె
వరికుపమానంబుగా నుదాహరింపఁబడిన నతఁడాకాలంబునవారికి సమ-
కాలికుఁడై యుండునని చెప్పవలసివచ్చునుగదా? ఇదియుంగాక శాకుంత-
లాది శైలికిని బాషాణత్రయమని ప్రసిద్ధికెక్కిన మొదటిసర్గత్రయముగ-
లిగిన కిరాతార్జునీయముశైలికిని భాషాకాలస్థితినిబట్టి యెన్నివందలసంవ-
త్సరములయంతరముండవచ్చునో చదువరులే యూహింపసమర్థులు. పై
శాసనపద్యము విమర్శింపఁగా నీకవులనిద్దఱి నొకకాలపువారని చెప్పుధోర-
ణియేకనుపడదు. ఒకవేళ వారట్లుతలంచిరేమోయని మనమనుకొనిన నం-
దలి కాళిదాసు, తత్కాలంబున జ్యోతిషస్వరశాస్త్రముల కభివృద్ధివచ్చిన

ట్లుకనుపడుటచేత— “ఆసీత్కాశ్యపవంశజో౽రగాతనయాతీరాధివాసో ద్విజః। శ్రౌతస్మార్తవిచారసారచతురశ్శ్రీభానుభట్టస్సుధీః। తత్పుత్రో హరిభక్తినిర్మలతనుర్జ్యోతిర్విదామగ్రణీః। శాస్త్రం శత్రుపరాభవాఖ్యమకరోచ్ఛ్రీకాళిదాసఃకవిః॥” అనుపద్యమువలనఁ దెలియఁబడు శత్రుపరాభవశాస్త్రకర్తయగు మఱియొకకాళిదాసైయుండవచ్చునుగాని రఘువంశాదికర్తయు నవాఙ్మనసగోచరపితృగోత్రనివాసుఁడు నగుమనకాళిదాసు కాఁడని ధ్రువముగానమ్మవచ్చును. మఱియుఁ బైశాసనమును స్థాపించిన కర్ణాటమహారాష్ట్రదేశపాలకుఁడగు నారెండవపులికేశి ౬౩౦ లో నుజ్జయినీరాజగు హర్షవర్ధనునినోడించెనని చరిత్రలవలనఁ దెలియుటచేఁ క్రీ॥ ౭వ శతాబ్దంబు మొదటనున్న హర్షవర్ధనుని యాశ్రయియగు బాణభట్టుఁడీషద్వైషమ్యముగాఁ దననాఁటివాఁడు తనశత్రుపక్షమువాఁడు నిరుపమానకావ్యకర్తయు నగుకాళిదాసునెడ నసహనపడుటకుమాఱుగా హర్షచరిత్రలో— “నిర్గతాసు నవా కస్య కాళిదాసస్య సూక్తిషు। ప్రీతిర్మధురసాంద్రాసు మంజరీష్వివ జాయతే॥” యనియత్యుదాత్తముగావర్ణించుటనెన్నటికి సంభవింపదని యెల్లరకుం దెలియుచుండుటచేఁ బైశాసనములోనివాఁడు మనకాళిదాసేకాకపోవలెను. లేదా? ఘనకీర్తికై ప్రాచీనకవులలో సుప్రసిద్ధుఁడగు నతఁడట్లుపమానంబుగా గ్రహింపఁబడియుండవలెనని తెలియుటయేకాక మనకాళిదాసప్పటికి మిక్కిలిప్రాచీనుఁడనికూడఁ దెలియుచున్నది.

క్రీస్తుపూర్వము ప్రథమదశయనియుఁ గ్రీస్తుశకము మొదలుగా నావశతాబ్దమువఱకు మధ్యమదశయనియు నప్పటినుండి యున్నతదశయనియు సంస్కృతభాషకు మూఁడుదశలనుగల్పించి చక్కనిశైలిలోఁ గావ్యములువ్రాసినకాళిదాసు భాషయొక్కయున్నతస్థితికాలమున విక్రమాదిత్యునితో నుండవచ్చునని వ్రాసిన మేక్సుముల్లరు నభిప్రాయంబునుగూడ

శ్రీనందర్గికారులు తమశాసనంబునకనుగుణంబుగా గ్రహించిరిగాని మే. క్సిముల్లరు చెప్పిన భాషాస్థితులు స్థూలదృష్టితోఁజూచి చెప్పినవిగాని సూక్ష్మ పరీక్షతోఁ బరిగణించినవిగావనియు భాషకుచ్ఛనీచస్థితులెడనెడఁగొన్ని వే లయేండ్లనుండియే క్రమముగా వచ్చుచున్నవనియు వారుతలంచిన భాషా మధ్యమదశలోఁగూడ గ్రంథంబులు వెడలకుండఁగ లేవనియుఁ బూర్వోక్తక వితాశైలులంబట్టికూడఁ గాళిదాసకవిత, యామధ్యస్థితిప్రారంభకాలము నకే తగియుండుననియు డాక్టరు పేటర్సను బహులరు మొదలుగాఁగలవా రువ్రాయుటచే దీనితోఁగూడ సైహోలశాసనప్రమాణముగూడదుర్బల మగుచున్నది.

మఱియు దిఙ్నాగాచార్యకాళిదాసులనుగూర్చి కింవదంతిగాఁ బం డితపరంపరాయత్తమై వచ్చుచున్నయొకకథను బౌద్ధతార్కికులైన యా ర్యాసంగవసుబంధులవృత్తాంతమును బొందుపఱిచి మనకాళిదాసాఱవ శతాబ్దములోనివాఁడని ధ్రువపఱిచిన యింకొకప్రమాణమునుగూర్చి చర్చిం పవలసియున్నది.

‡ క్రీ॥ పూ॥ ౩౫౯ లో సైనబుద్ధనిర్వాణమునకుఁ బిదప ౯౦౦ సంవత్సరములయినతరువాతననఁగాఁ క్రీ॥ శ॥ ౫౪౧ లో నార్యాసంగుఁడు వసుబంధువుననియిద్దఱుబౌద్ధతార్కికులున్నట్లును వారియొద్ద దిఙ్నాగా చార్యుఁడు ప్రమాణాదిశాస్త్రములఁజదివినట్లును టిబెట్టుదేశస్థుఁడగురత్న ధర్మరాజు భగవద్బుద్ధజీవితములోవ్రాసినవాక్యమును, మేఘసందేశము పదునాల్గవశ్లోకంబుననున్న “ స్థానాదస్మాత్సరసనిచుళాదుత్పతోదఙ్ముఖః ఖం దిఙ్నాగానాం పథిపరిహరన్ స్థూలహస్తావలేపాన్ । ” అనుదా ని వ్యాఖ్యానమున ధ్వన్యర్థముగాఁ గాళిదాసునకు నిచుళుఁడను నొకమి

‡ బుద్ధనిర్వాణము క్రీ॥ పూ॥ ౪౭౭ లో జరిగినట్లుటీవలివారు శాసనాదులవల నఁ గనుఁగొనియున్నారు.

త్రుఁడును దిఙ్నాగుఁడనునొకశత్రువునుగలిగియుండ రని మల్లినాథసూరి వ్రాసినవాక్యమునుగలిపి యార్యాసంగవసుబంధులకు శిష్యుఁడగు నాదిఙ్నాగాచార్యుఁడే మేఘదూతలో నుపాలంభింపఁబడిన యాదిఙ్నాగుఁడనియుఁ గావుననాతనికి సమకాలికుఁడైన కాళిదాసాంఅవశతాబ్దంబు పరభాగంబుననుండుననియు నిర్ణయించిరి. కాని యిట్లులోకమును భ్రమపెట్టిన మల్లినాథసూరిప్రమాదంబునకు నిదానంబగు దిఙ్నాగకాళిదాసుల వివాదంబునిజస్థితి యీక్రిందివిధముగాఁ దెలియనగును.

ఆర్యాసంగవసుబంధులకు శిష్యుఁడగు దిఙ్నాగాచార్యుఁడు బౌద్ధుఁడు తార్కికుఁడు నై పేరొందినకాలమున వెనుకనుదాహరింపఁబడిన భానుభట్టునిపుత్రుఁడును జ్యోతిష్కుఁడు నార్యమతస్థుఁడునగు కాళిదాసను నొకకవిగలఁడు. జ్యోతిశ్శాస్త్రమున విశ్వాసములేని యాదిఙ్నాగునకు నీకాళిదాసునకును మతభేదముచేతనేకాక శాస్త్రప్రమాణభేదముచేఁగూడ గొప్పశత్రుత్వము సంభవించియుండును. కావుననే గణకుఁడైన యీకాళిదాసకవి— "నత్వా సురాసురశిరోమణిరత్నరశ్మి। చిత్రీకృతాంఘ్రియుగళం హరిమాదిదేవం। శ్రీకాళిదాసగణకస్స్వరశాస్త్రసారం వక్ష్యామ్యహం ప్రబలశత్రుపరాభవాఖ్యం॥" అనుశ్లోకమువలన శత్రుపరాభవమనుపేరుగల స్వరశాస్త్రగ్రంథమును రచించినట్లుకనుపడుచున్నది ఇదినిజస్థితియైయుండఁగాఁ గాలక్రమమునఁ గర్ణపరంపరాయత్తమైవచ్చుచున్న పైవృత్తాంతమును విన్నవాఁడునాల్గుశతాబ్దములక్రిందటి మల్లినాథసూరి "దిఙ్నాగానాం పథిపరిహరన్ స్థూలహస్తావలేపాన్।" అనుచో దిఙ్నాగపదమును జూచినంతనే దిఙ్నాగకాళిదాసులవివాదకథను స్మృతికిఁదెచ్చుకొని యర్థసందర్భమునుబట్టి దిఙ్నాగాచార్యునధిక్షేపించుటకుఁ దగినట్లుగా ధ్వన్యర్థముసరిపడుటచే శత్రుపరాభవశాస్త్రంబువెలుంగక కాళిదాసనామసామ్యంబునఁ బ్రమాదపడి మనమహాకవికాళిదాసునకు

దిఙ్నాగాచార్యుఁడను నొకశత్రుఁడుఁగలఁడని మొదట వ్రాసెను. పిదపనిపుడు రత్నధర్మరాజు వ్రాఁతనుగనుఁగొనిన కొందఱువిమర్శకులు కాళిదాసు నాఱవశతాబ్దములోఁ జేర్చుతమయభిప్రాయంబునకనుగుణంబుగా మల్లినాథసూరి వ్రాఁతనాధారంబుగాఁజేసికొనిరి. కాని యీదిఙ్నాగాచార్యునకాఱువందలయేండ్లు వెనుకనున్న మనకాళిదాసు సమకాలికుఁడని యూహించుట యసంగతమనియు, మేఘదూతలోనున్న దిఙ్నాగపదము వర్ణసామ్యంబున ధ్వన్యర్థకమై దిఙ్నాగాచార్యపరమగుటకనుకూలముగానుండుటచే నట్లువ్రాసినమల్లినాథసూరి యాలోచనంబు ప్రామాదికంబనియు ౬ వ శతాబ్దములోని దిఙ్నాగాచార్యునకు శత్రువగువాఁడు గణకుఁడైన కాళిదాసనియు నిరాక్షేపముగా విశ్వసింపవచ్చును. దీనినే మిక్కిలి పరిశీలించి వ్రాసిన ప్రొఫెసరుఆప్టేమొదలగువారియభిప్రాయముగూడ ధ్రువపఱచుచున్నది.

మూలగ్రంథమగు రామాయణములో నెక్కడను వర్ణింపఁబడని హూణరాజులను రఘువంశములోవర్ణించుటచూడఁగాఁ గాళిదాసు పంజాబు కాశ్మీరరాజ్యములలో హూణులుండుటయుఁ గ్రీ॥ ౫౩౨ ప్రాంతమున హూణరాజగు మిహిరకులుని యశోధర్మబలాదిత్యులోడించుటయు నెఱిఁగియుండుననితోఁచుచున్నది. కావుననతఁడు క్రీ॥ ౬ వ శతాబ్దములోనుండునని వ్రాసిన కె. బి పాఠకులయభిప్రాయము, "మహాభారతములోని హూణరాజవర్ణనముచూచి కాని క్రీ॥ పూ॥ ౩ వ శతాబ్దము మొదలుగాఁ గ్రీ॥ మొదటిశతాబ్దముకడపటివఱకుఁ బూర్వహిందూదేశమునకు మిక్కిలి దగ్గఱగానున్న బ్యాక్ట్రియాలోహూణులురాజ్యముచేయుట నెఱింగికాని కాళిదాసురఘువంశమున హూణులవర్ణించియుండు" నను ప్రొఫెసరుఆప్టిగారియభిప్రాయంబునఖండింపఁబడుటచేఁగూడఁ గాళిదాసాఱవశతాబ్దములోనివాఁడు కాఁడని తేలుటయేకాక పూర్వోక్తవిధముగానితఁడు క్రీ॥ పూ॥ ౫౬ లోనివాఁడని స్పష్టపడుచున్నది.

ఈటియు మహాకవిమూర్ధన్యుఁ డగు కాళిదాసు పరకవితాచ్ఛాయ ననుసరించెననుట విశ్వాసార్హము కాకుండుటచేతను, కవియశస్సుగోరని సుజ్ఞానియై పూజ్యుఁడగు బుద్ధునియందలి భక్తిచే నతని చరితము మాత్రము వ్రాసిన యశ్వఘోషుఁడు కాళిదాసకవితాచ్ఛాయననుకరించెననుట నింద్యము కాకుండుటచేతను, సవిమర్శముగా బుద్ధచరితముచదివినవారికెల్ల నందంము రఘువంశాదికావ్యంబులలోని వర్ణనాభిప్రాయంబులయనుకరణము సరిగాఁగనుపడుటచేతను క్రీ॥ శ౨ ప్రాంతఁబుననున్న యశ్వఘోషుని కంటెఁ గాళిదాసు ప్రాచీనుఁడైనట్లు కనుపడుచున్నది. డాక్టరు పేటర్సనుకూడ నిట్టేయభిప్రాయపడి కాళిదాసు క్రీస్తుశకమునకు దగ్గఱివాఁడై యుండు నని వ్రాసెను.

డాక్టరు భౌదాజీపండితులు తమ కాళిదాసోపన్యాసమున నుదాహరించిన జైనపండితుఁ డగు మేరుతుంగాచార్యుని పాఠావళిలోని యీక్రింది వాక్యములుగూడ నితని కాలనిర్ణయమునకాధారములగుచున్నవి.

“నభోవాహనునితరువాత గర్దభిల్లుఁ డుజ్జయినిని ౧౩ సంవత్సరము లేలెను. అతఁడు కాలికాచార్యుని చెల్లెలగు సరస్వతినవమానపఱచినందున నాయాచార్యుఁడు కినిసి శకులను రావించి గర్దభిల్లునోడింపఁజేసియా స్థానమున వారిని నిలిపెను. ఆశకులు ౪ వత్సరములుజ్జయిని నేలిరి. పిదప గర్దభిల్లునికొడుకు విక్రమాదిత్యుఁడా శకులనుజయించి రాజ్యముసంపాదించి తన పేర విక్రమ (సంవతు) శకమును స్థాపించెను. ఈశకస్థాపనము వీరనిర్వాణానంతరము ౪౭౦ సం॥లకు జరిగినట్లుగానున్నది. ఆవిక్రమాదిత్యుఁడు నిరుపమానపరాక్రమశాలియై భూదేవేంద్రుఁడన ౬౦ వత్సరములు రాజ్యము చేసెను. తరువాతనాతనిపుత్రుఁడగు వీరచరితుఁడు లేక ధర్మాదిత్యుఁడు.

౪౦ సం॥లు విభుత్వమొనరించెను. అతనికిఁబిదప భైల్లుఁడు, నైల్లుఁడు, నాహడుఁడు ననుమువ్వురుక్రమముగా ౧౧, ౧౪, ౧౦ వర్షములుజ్జయిని నేలిరి అటుతరువాత శాలివాహనశకమువచ్చినది " అనిపాఠావళిలోనున్నవాక్యములనుబట్టిచూడఁగాఁ క్రీ॥ ౭౮ లో వెడలిన శాలివాహనశకమునకుఁ బూర్వము ౧౩౫ సంవత్సరములక్రిందటననఁగాఁ క్రీ॥ పూ॥ ౫౭ లో విక్రమాదిత్యుఁడుజ్జయిని నేలినట్లు నతఁడు తనపేరశకమునిలిపినట్లును దెల్లమగుచున్నది ఈశకకాలమునే పెక్రంద్రు ౫౬ అనివ్యవహరించుచుండిరి దీనిచేఁగూడఁ క్రీ॥ ౫౪౪ లోని కోరూరుయుద్ధమునకుఁబూర్వము విక్రమశకవ్యవహారము లేదనువారివాదముతో మిగిలిన చిన్నవాదములన్నియునడుగంటుటయేకాక విక్రమ (మాలవ) శకకర్తయు ననన్యసామాన్యపరాక్రముఁడు కవితాపోషకుఁడునగు విక్రమాదిత్యుఁడు క్రీ॥ పూ॥ ౫౬ లోనుండెనను వారివాదములెల్ల నిరంకుశముగాఁ దలలెత్తుచున్నవి. కావునఁగాళిదాసుని జ్యోతిర్విదాభరణములోని నవరత్నపద్యమందలి కవిరత్నములచే నలంకృతుఁడగు ధరావరశిరోరత్నమా విక్రమాదిత్యుఁడేయనియు నాతనికిఁ బ్రాణమిత్రుఁడై మహాకవి కాళిదాసుఁడాకాలముననుండెననియు నిస్సంశయముగా విశ్వసింపవచ్చును. ఈవిషయంబున జ్యోతిర్విదాభరణము కాళిదాసు చేసినదికాదని కొందఱుతలంచుచుండిరిగాని, " రూమదేశప్రభువునుజయించినవాఁడును, శంక్వాదిపండితులను, ఘటకర్పరాదికవులను వరాహమిహిరాదికాలతంత్రకవులను, బోషించువాఁడు నుజ్జయినీచక్రవర్తియు నగువిక్రమాదిత్యునిసభలోని వాఁడు విక్రమార్కునిస్నేహితుఁడును రఘువంశాదికావ్యకర్తయునగు కాళిదాసుఁడు కలియుగము ౩౦౬౮ (అనఁగాఁక్రీస్తుపూర్వము ౩౪) వ సంవత్సరమున నీజ్యోతిర్విదాభరణమును రచించె " నని దాని ౨౨ వయధ్యాయములోఁ గాళిదాసువ్రాసికొనిన

ట్లున్న ¶ శ్లోకములవలనఁదప్పక మనకాళిదాసే క్రీ॥ పూ॥ ౩౮ లో నీగ్రంథమును రచించియుండునని ప్రబలాధారమాగ్రంథమువలననే కనుపడుచున్నది. మఱియు "మత్వా వరాహమిహిరాదిమతైరనేకైః" త్రిఖేందుభిః (౧౦౩) విక్రమభూపతేర్మితే శాకేన్వితీహ క్షయమాసకోభవేత్ ॥ అనియు, ౧--౮ అధ్యాయములలో నున్నవచనములంబట్టి విక్రమశకము ౧౩ లో వరాహమిహిరుఁడుపోయినవెనుకనే యీగ్రంథముపుట్టియుండుననియు, ఈవిక్రమశకమున ౧౦౩ వ సంవత్సరమునఁనొకక్షయమాసము రాఁగలదనియుండుటచే నంతకంటెఁదప్పక పూర్వమేయుండవలసినయీగ్రంథమునసుసరించి యీకాళిదాసవిక్రమాదిత్యులు క్రీ॥ పూ॥ ౫౬ లో నివారనుట నిశ్చయమనియుఁ దేలుచున్నది. ఒకవేళ "ఇదికాళిదాసుచేసినదిగాదు. ఎవఁడోరచించి యీతనిపేరుపెట్టియుండును" అనికొందఱుతలంచినను నిదికాళిదాసవిక్రమాదిత్యులకాలము నెఱింగినయొకకవిరచించిన జ్యోతిషగ్రంథముగాని చాటుపద్యసంగ్రహముగాదని యీగ్రంథ

---

¶ యోరూమకేశాధిపతిం శకేశ్వరం జిత్వా గృహీత్వోజ్జయినీం మహాహవే।
ఆనీయ సంభ్రామ్య ముమోచ తంత్వహో శ్రీవిక్రమార్కస్సమసహ్యవిక్రమః॥

శంక్వాదిపండితవరాః కవయస్త్వనేకే జ్యోతిర్విదస్సమభవంశ్చవరాహపూర్వాః।
శ్రీవిక్రమార్కనృపసంసది మాన్యబుద్ధిస్తైరప్యహం నృపసఖాకిల కాళిదాసః॥

కావ్యత్రయం సుమతికృద్రఘువంశపూర్వం।
పూర్వంతతస్సనృతిహితం శ్రుతికర్మవాదం।
జ్యోతిర్విదాభరణకాలవిధానశాస్త్రం।
శ్రీకాళిదాసకవితో హితతోబభూవ॥

వర్షైస్సింధురదర్శనాంబరగుణైః (౩౦౬౮) యాతే కలౌ సమ్మితే।
మాసే మాధవసంజ్ఞికేచ విహితో గ్రంథక్రియోపక్రమః॥

ధన్వంతరిక్షపణకామరసింహశంకు వేతాలభట్టఘటకర్పరకాళిదాసాః।
ఖ్యాతోవరాహమిహిరోనృపతేస్సభాయాం రత్నానివైవరరుచిర్నవవిక్రమస్య॥

ముగనినయెల్లవారికిఁ దెలియుచుండుటచే నందలికవిరత్నపద్యము నేమియు నాధారములేకుండఁగా నూరక కట్టుకథయని పుక్కిటిపురాణమనిత్రోసి వేయువారిమాటలఁబాటింపక నవకవిరత్నభూషితుఁడగువిక్రమార్కుఁడి తఁడేయనియు నమ్మఁదగియున్నది.

మఱియుఁ గాళిదాసును క్రీ॥ పూ॥ ౫౬ లోఁ జేర్చిన డాక్టరుభౌదాజీమొదలుగా నొకరిద్దఱుకొన్నియేండ్లు కాశ్మీరరాజుగానున్న మాతృగుప్తుఁడే యీకాళిదాసని భ్రమపడిరిగాని రాజతరంగిణినిబట్టి యతఁడు వేఱొకకవియని తెలియఁబడుటచేత నేకాక, క్షేమేంద్రుఁడుతనయౌచిత్యవిచారచర్చలో మాతృగుప్తునిదనియుఁ గాళిదాసునిదనియు నాయాసందర్భముల వేఱువేఱుగా శ్లోకంబులనుదాహరించుటచేఁగూడఁ గాళిదాసు మాతృగుప్తునికంటె నన్యుఁడని ధ్రువమగుచున్నది.

మఱియుఁ బైకాలమును స్థిరపఱుప శాకుంతలనాటకమునుండి యొకటియుదాహరణమునుజూపి యింతటితోనితని కాలనిర్ణయంబునుముగించుచున్నాఁడను. శాకుంతలమాఱవయంకములో రత్నాంగుళీయకముతోఁబట్టుబడిన ధీవరునిప్రసక్తిలోఁ జోరునకుమరణదండనము వైధమగునట్లు చెప్పఁబడినది. అనపత్యుఁడై మృతినొందిన ధనమిత్రునకు భార్యయున్నను నతనియర్థంబునకు రాజేకర్తయైనట్లు వచింపఁబడినది. చోరదండనవితంతుకర్తృత్వంబులయెడదారుణముగానున్న యీరెండాచారములును గాళిదాసకాలంబున మన్వాపస్తంభవసిష్ఠస్మృతులు మిక్కిలి వ్యవహారములోనున్నట్లు చెప్పుచున్నవి. ఈపైధర్మసూత్రములు బృహస్పతిశంఖయాజ్ఞవల్క్యాదిస్మృతులలోఁ గడుమార్పును జెందుటఁజూడఁగాఁ గ్రీస్తుమొదటిశతాబ్దంబులోని బృహస్పతిస్మృతికంటె శాకుంతలనాటకమేప్రాచీనమైనట్లు తేలుచున్నది.

‡ ఈయభిప్రాయంబునే ప్రొఫెసరుఆప్టిగారు మిక్కిలి నొక్కి వ క్కాణించిరి. కావున సర్వవిధములఁ బైయెల్లఁ దర్కకులయభిప్రాయముం బట్టి కాళిదాసు విక్రమాదిత్యునియాస్థానమందలివిద్వత్కవిరత్నమై (ధావక) ఘటకర్పరాదులకు సమకాలికుఁడై క్రీ॥ పూ॥ ౫౬ మొదలుగా క్రీస్తుశకప్రారంభమువఱకునున్న మధ్యకాలంబున జీవించియుండునని నాయభిప్రాయము.

## మహాకవికాళిదాసప్రశంస.

హిందూదేశకవితారహారంబునకు నాయకమణియగు నీమహాకవినిజచరిత్ర మనకేమియుఁ దెలియదు. ఈతఁడు మొదట విద్యాహీనుఁడై భార్యయుపదేశమునఁ గాళికాలయమునఁబ్రవేశించి యాదేవినిఁగొలిచి యామెచేఁదననాలుకపై వ్రాయఁబడిన బీజాక్షరంబులమహిమచేఁ గవితానైపుణిఁబడసెననునది మొదలుగా ననేకకథలీతనిచర్యలం దెల్పుచున్నవిగాని లోకములో మిక్కిలిగొప్పవానినిఁగూర్చి యట్టియద్భుతకథలు వెడలుట స్వాభావికముగావున నవి పామరాదరణీయము లగునుగాని పండితగ్రాహ్యములు కాఁజాలవు. ఇతఁడు స్మార్తుఁడగుసారస్వతబ్రాహ్మణుఁడని యొకరిద్దఱువ్రాసిరి. రఘువంశశాకుంతలాదికృతుల మంగళాచరణశ్లోకములంబట్టి యితఁడు శివభక్తుఁడు నద్వైతమతస్థుఁడు నైనట్లుగోచరమగుచున్నది. శిప్రానదిని, మహాకాలదేవుని, ఉజ్జయినీపురంబును, జక్కగా వర్ణించుటచే నితఁడుజ్జయినీపురనివాసుఁడనియు, రాజ్యంబును, రాజలక్షణంబులను, రాజసభలను, స్వానుభవముగా వర్ణించుటచేనితఁడు విక్రమాదిత్యపూజితుఁడనియు, హిమాలయాదిపర్వతంబులను, రఘుమహారాజుదిగ్విజయయాత్రను, గంగాదిమహానదులను, గాశ్మీరైకస్థితజీవతుకుంకుమ

‡ శ్రీ, రామచంద్రకాశే శాకుంతలపీఠిక.

పుష్పంబును సవిమర్శముగా వర్ణించుటచూడఁగా నీలోకజ్ఞుఁడు స్వయముగాఁ బ్రాచీనోత్తరహిందూస్థానమంతయుఁ జూచినవాఁడనియు ధ్రువమగుచున్నది.

ఇతఁడు సంస్కృతవాఙ్మయంబున సర్వజ్ఞుఁడనుటకంటె శ్రుతిస్మృతిశాస్త్రపురాణాదులను జదివినవాఁడనుట స్వభావోక్తిగాదు. పైయెల్లవిషయంబులకుఁ గ్రమముగా నుదాహరణములఁ జూడఁగలము. ఈతనికావ్యములంబట్టివిశేషవిత్తవంతుఁడనికాని గర్భదరిద్రుఁడనిగాని మనమేమియు గ్రహింపఁజాలముకాని, మహదాశ్రయుఁడగుటచేనితఁ డుదారహృదయుఁడై నిర్విచారముగాజీవించినట్లుమాత్రముతోఁచకమానదు. ఈతనిప్రవర్తనముమిక్కిలిపరిశుద్ధమై యప్పటికిప్పటికినిగూడ నెల్లరకు ననుకరింపఁదగినదనుటకు శాకుంతలపంచమాంకములోని „అనిర్వర్ణనీయం పరకళత్రం” పరభార్య చూడఁదగినదిగాదను నొక్కవాక్యముచాలును. ఈవిద్వత్కవిపుంగవుని కవిత్వపాండిత్యమహిమాతిశయంబుపారంబుగానక యనేకులీక్రిందివిధముగాఁబొగడియుండనిఁక వానిలోఁతుగనుంగొన నేరికిశక్యము? ఈతనికావ్యంబులకుఁ గల్పాంతస్థాయినియగు సంజీవినీవ్యాఖ్యవ్రాసిన మహామహోపాధ్యాయమల్లినాథసూరి— „కాళిదాసగిరాం సారం కాళిదాసస్సరస్వతీ। చతుర్ముఖోఽథవా సాక్షాద్విదుర్నాన్యేతుమాదృశః॥” అనియు, మీమాంసాశాస్త్రకర్తయగు భట్టపాదుఁడు—„కవయః కాళిదాసాద్యాః కవయో వయమప్యమీ। పర్వతే పరమాణౌచ పదార్థత్వం వ్యవస్థితం॥” అనియు, కొండొకప్రాచీనాలంకారికుఁడు—„తస్మాదాలోచితాశేషలోకశాస్త్రేణ ధీమతా। కర్తవ్యం కాళిదాసాదేః కావ్యానాం పరిశీలనం॥” అనియు, నొకానొకసరజ్ఞుఁడు— „కాళిదాసకవితా నవం వయో। మాహిషం దధిసశర్కరం పయః। ఐణమాంసమబలాచకోమలా। సంభవంతు మమ జన్మజన్మని॥” అనియు, గోవర్ధనాచా

ర్యుఁడు—"సాకూతమధురకోమలవిలాసినీ కంఠకూజితప్రాయే। శిక్షాసమయేఽపి ముదే రతలీలా కాళిదాసోక్తిః॥" అనియు, నింకొకయర్ధాగ్ధవాది—"పురాకవీనాం గణనాప్రసంగే కనిష్ఠికాధిష్ఠితకాళిదాసా। అద్యాపి తత్తుల్యకవేరభావా దనామికా సార్థకనామధేయా॥" అనియు నింకనుబలువురు పలుతెఱంగులనీతనిఁ గొనియాడిరని విని కనియుంటిమి. ఈలోకోపకారిరచించినవని లోకమునఁబెక్కు గ్రంథములు కనుపడుచున్నవిగాని వానిరచనాక్రమముమాత్రము సరిగాఁదెలియకున్నది. అయినను శైలినిబట్టి యొకదానితోనొకటిసరిచూడఁగా ఋతుసంహారము కుమారసంభవము, మాలవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము, మేఘసూత, శాకుంతలము, రఘువంశము, ననుకృతులీతఁడు క్రమముగారచించియుండునని యెల్లవిమర్శకులంగీకరించియున్నారు. శ్రుతబోధ, శృంగారతిలకము, శృంగారరసాష్టకము, సేతుబంధము, జ్యోతిర్విదాభరణము ననునైదుకావ్యములకర్తృత్వము నీకాళిదాసునకారోపింపఁబలువురుసంశయించియుండిరి. ఇఁకనీతనిపేరనేయున్న కర్పూరమంజరి, శ్యామలాదండకము, పుష్పబాణవిలాసము, ప్రశ్నోత్తరమాల, కుంతేశ్వరదౌత్యము, రాక్షసకావ్యము, నవరత్నమాల యనునివి మనకాళిదాసువ్రాసినవిగావని కొందఱునిశ్చయించియున్నారు. ఎల్లకవితాలక్షణంబులలోను గొంచెముకొంచెముగా ఋతుసంహారాదులకుసరివచ్చుటచే సంశయాస్పదముగానున్నయీమకృతులీకాళిదాసు చేసినవేయని యూహింపదగిన నామూలాగ్రమొక్క విధముగా సుబోధకంబై ప్రవాహరూపంబగు మృదుమధురశైలికిని గీర్తికిని నించుకయైన రఘువంశాదులఁబోలకుండుటచేనివి యీకాళిదాసునవియగునా కావాయని సంశయింపఁదగినవేయగుటచేతను, సేవిషయంబునను మేఘసూతాదులతోఁ బోలకుండుటచేఁ గర్పూరమంజర్యాదులీతనివిగావని నిశ్చితంబగుటచేతను, మొదటియేడుకావ్యములే

యీకవి రచించెనని మనము విశ్వసింతము. వానిలో ఋతుసంహారము కూడ మిగిలినవానితోఁ బోల్చినయెడల నీతనిది కాదేమో యనుటకుం దగినట్లుగానున్నదిగాని యది బాల్యప్రయత్నమగునను వారిమాటల విశ్వాసముంచి పరిశీలించితిమేని సుకవితాసుందరి, ఋతుసంహారమున బాలయై కుమారసంభవంబున ముగ్ధయై మాలవికాగ్నిమిత్ర విక్రమోర్వశీయంబుల మధ్యయై మేఘదూత రఘువంశ శాకుంతలంబులఁ బ్రౌఢయై యీడై జోడై యన్వర్థంబగు నిర్జరవాణీసంజ్ఞఁబడసి యీ కాళిదాసకవిబ్రహ్మతో బిన్నటనాఁటనుండియు విహరించియుండెనని యూహింపఁగడంగుదుము.

శృంగారరసప్రధానంబై గ్రీష్మాది షడృతుధర్మంబుల బోధించుచు నూటనలువదిమూఁడు శ్లోకంబులతో నలరారుచున్న ఋతుసంహారమొక నాయికకు నాయకుఁడు చెప్పినట్లుగానున్నది. ఇందు సార్వత్రికముగా స్త్రీవర్ణనంబును దత్తత్కాలానుగుణంబుగాఁ బశుపక్షితరులతాపుష్పాదివర్ణనంబులును గలవు ఇది నిర్దుష్టంబైనను, విచిత్రకల్పనాలంకారరమ్యంబై పాఠకులకత్యాదరము గలిగించునది గాకుండుటచే నీతని ప్రథమకృతియనవలసి వచ్చినది. ఇందుండి యొకపద్యము నుదాహరించెదను.

‡ "స్త్రీణాం విహాయ వదనేషు శశాంకలక్ష్మీం ।
కామంచ హంసవచనం మణినూపురేషు ।
బంధూక కాంతిమధరేషు మనోహరేషు ।
క్వాపి ప్రయాతి సుభగా శరదాగమశ్రీః ॥"

కుమారసంభవము హిమవంతునికిఁ బార్వతి జన్మించుటయు నామె నీశ్వరుండు పరిణయంబగుటయు నతనికిఁ గుమారస్వామి జనించుటయు

‡ శరత్కాలలక్ష్మి చంద్రకాంతిని గాంతల మోములందును, అంచల పలుకులను బడఁతుల యందెలయందును, బంధూకపుష్పశోభను వెలదుల క్రిందిపెదవులయందును
[illegible]

నతఁడు తారకాసురుని సంహరించుటయునను కథాభాగంబున శివపద్మపు రాణములలోనిగాథలననుసరించి యతివిచిత్రకల్పనవర్ణనములతోనున్న పదియేడుసర్గలకావ్యము. ఇందు మొదటి పదియేడుశ్లోకంబులలోనున్న హిమాలయవర్ణనముచూడఁగా దానియౌన్నత్యము నందలిగంగానదియుత్పత్తిని, దానదీపములవలెఁ బ్రకాశించునోషధులను, నందలివృక్షమృగవిశేషంబులను గాళిదాసు స్వయముగాఁజూచినవాఁడని తెలియుచున్నది. మొదటిసర్గలోని పార్వతీయౌవనవర్ణనంబును నెనిమిదవసర్గలోని శివసమాగమవర్ణనంబును గూడశృంగారరసమర్యాదనునీతిపథంబునతిక్రమింపక యుక్తపదప్రయోగహృద్యంబులై శ్రావ్యంబులగుటయేకాక యాతనికవితాగౌరవమును వేనోళ్లఁజాటుచున్నవి. ఇందులకు— "ఏతావతా నన్వనుమేయశోభి కాంచీగుణస్థానమనిందితాయాః।" (అనఁగా) తరువాతదీనినీశ్వరుఁడు తనయంకభాగమున నెక్కించుకొనుననుటచేతనే పవిత్రురాలగు పార్వతినితంబప్రదేశమూహింపఁదగినశోభగలది యగుచున్నది యనుచో ననిర్వచనీయంబగు తత్సౌందర్యాతిశయమును వ్యంగ్యముగాఁ దెల్పు "ననుమేయశోభి" పదంబును, "వీక్షితేన పరిగృహ్య పార్వతీ మూర్ధకంపమయముత్తరం దదౌ।" సరససల్లాపంబునకై యేదోయడుగునట్టి యీశ్వరునిప్రశ్నంబులను బార్వతి చూపుచేతనే గ్రహించి తలయూపుటచేతనే యుత్తరము చెప్పెననుచో విస్పృతంబను లజ్జానుభావము స్ఫురింపఁబడుటయు, "ప్రేక్ష్య బింబమనుబింబమాత్మనః కానికాన్యపి చకార లజ్జయా।" అద్దములో ముఖమందలి నఖక్షతాదిచిహ్నములఁజూచుకొనుపార్వతి తనకుఁదెలియకుండఁగ వెనుకఁగూరుచున్న భర్తనీడనుదనప్రతిబింబమునకు వెనుకఁజూచి సిగ్గుపడియేమేమో చేసెననుచో నవయువసంవరణాదిచేష్టలతిమార్దవముగా నిర్వదింపఁబడుటయు మొదలుగా ననేకోదాహరణములుగలవు. మఱియును—

నమస్త్రిమూర్తయే తుభ్యం ప్రాక్సృష్టేః కేవలాత్మనే।
గుణత్రయవిభాగాయ పశ్చాద్భేదముపేయుషే।
తిసృభిస్త్వమవస్థాభి ర్మహిమానముదీరయన్।
ప్రళయస్థితిసర్గాణా మేకః కారణతాం గతః।
జగద్యోనిరయోనిస్త్వం జగదీశో నిరీశ్వరః।
జగదాదిరనాదిస్త్వం జగదంతో నిరంతకః।
ఆత్మానమాత్మనా వేత్సి సృజస్యాత్మానమాత్మనా।
ఆత్మనాకృతినా చ త్వమాత్మన్యేవ ప్రలీయసే॥
ద్రవస్సంఘాతకఠినస్థూలసూక్ష్మో లఘుర్గురుః।
వ్యక్తో వ్యక్తేతరశ్చాసి ప్రకామ్యం తే విభూతిషు।
త్వామామనంతి ప్రకృతిం పురుషార్థప్రవర్తినీం।
తద్దర్శినముదాసీనం త్వామేవ పురుషం విదుః।
యోగినోయం విచిన్వంతి క్షేత్రాభ్యంతరవర్తినం।
అనావృత్తిభయం యస్య పదమాహుర్మనీషిణః॥

అనిసృష్టిక్రమంబును సగుణనిర్గుణబ్రహ్మలక్షణంబును దెల్పునీశ్లోకంబులు మన్వాదిస్మృతులను భగవద్గీతలను స్మరింపఁజేయుచు నౌపనిషదపురుషజ్ఞానముపదేశించుచు నాహా యీమహాత్ముఁడు విద్వద్వరిష్ఠుఁడే యని ఘోషించుచున్నవి.

ఆయాసందర్భంబులనన్నిరసములు నీకావ్యమునఁగనుపడుచున్నవి గాని నాల్గవసర్గలోఁ గరుణరసమును జివరిరెండుసర్గలలో వీరభయానకరసములును మిక్కిలివర్ణింపఁబడినవి. పతివియోగదుఃఖమోర్వఁజాలకచావఁదలంచిన రతీదేవివాక్యముగానున్న—

† " శశినాసహ యాతి కౌముదీ సహమేఘేన తటిత్ప్రలీయతే।
ప్రమదాః పతివర్త్మగా ఇతి ప్రతిపన్నంహి విచేతనైరపి॥ "

† చంద్రునితోఁ జంద్రికయు, మేఘముతో మెఱుపును, బోవుచున్నవి. సతులు పతులననుగమింతురనుట యచేతనములకుఁగూడఁ దెలిసినదిగదా?

అనుశ్లోకము కాళిదాసకాలమున సహగమనాచారముగలదని తెలుపుచున్నది.

పార్వతీవివాహవిషయంబుననున్న "అశోచ్యాహి పితుః కన్యా సత్పాత్రప్రతిపాదితా । సుతాసంబంధవిధినా భవ విశ్వగురోర్గురుః ॥" అనునాంగిరసవాక్యమును, శాకుంతలమందలి, "గాంధర్వేణ వివాహేన బహ్వ్యోరాజర్షికన్యకాః । శ్రూయంతే పరిణీతాస్తాః పితృభిశ్చాభినందితాః ॥" "అస్మాన్ సాధువిచింత్య సంయమధనా నుచ్చైఃకులంచాత్మన స్త్వయ్యస్యాః కథమప్యబాంధవకృతాం స్నేహప్రవృత్తించ తాం।" అను దుష్యంతకణ్వవాక్యంబులను, రఘువంశములోని యిందుమతీస్వయంవరవిధిని, బరిశీలించినయెడల నీకవికాలంబునకే మనువసిష్ఠాదిస్మృతులును, నాపస్తంభాదిసూత్రములును మిక్కిలివ్యవహారంబులో నున్నవనియు, క్షత్రియులలోనున్నట్లుగా బ్రాహ్మణులలో గాంధర్వాదివివాహములు లేవనియుఁ బుత్రికకుఁదగినవరుని సంపాదించుభారమిప్పటివలెనే యప్పుడుగూడఁ దండ్రిదేయనియు, "ప్రాయేణ గృహిణీ నేత్రాః కన్యార్థేషు కుటుంబినః ।" అనువాక్యమునఁ గూఁతురిపెండ్లివిషయమున భార్యయాలోచనంబే భర్తకుముఖ్యముగాఁ గావలసియుండునదియనియుఁ దెలియుచున్నది. మఱియుఁ బార్వతివివాహమెంతయు సరసస్వభావముగా వర్ణింపఁబడినది. అందుండియొకశ్లోకముదాహరించెదను.

‡ "కంపేన మూర్ధ్నః శతపత్రయోనిం వాచాహరిం వృత్రహణం స్మితేన।
ఆలోకమాత్రేణసురానశేషాన్ సంభావయామాసయథాప్రధానం"

---

‡ అనఁగాఁ దనపెండ్లికి దేవతలందఱు రాఁగా నీశ్వరుఁడు బ్రహ్మదేవునిఁ జూచి సానందముగాఁ దలయాడించియు, విష్ణుమూర్తినిజూచి దయచేసితిరాయని యడిగియు, నింద్రునిఁజూచిచిఱునవ్వునవ్వియు, మిగిలినయమరులనొక్కసారికన్నులారఁజూచియు, నెవరికెట్లుతగునోయట్లు గౌరవించెనని భావము.

మేఘసందేశము. ఇదియొక యమూల్యకావ్యరత్నము. దీనిసారస్య మును బలుతెఱంగులవెల్లడించు వ్యాఖ్యాతలు ముప్పదిమందికంటె నధిక ముగాఁగలరనుటకంటె దీనిఘనతను వేఱుగానుతింపనక్కఱలేదు. హను మత్సందేశమును మనస్సులోనుంచుకొని కాళిదాసీమేఘసందేశమును వ్రాసెనని పూర్వవ్యాఖ్యాతలూహించియున్నారు. అదిసత్యమే యయిన ను దానికి దీనికిని సందేశముమాత్రమే తుల్యమగునుగాని మిగిలినయితర నికృతులకాధారములగు నితివృత్తములున్నట్లుగా దీని కేమూలకథయుఁ గానరాదు. కేవలకల్పితకవితాకల్పలతకాద్యఫలఁబనఁదగునిది నూటపది యేనుపద్యముల చిన్నకావ్యమైనను భావప్రధానంబై యక్షీణరసభరితం బై సార్వజనీనంబగుచున్నది. ఈకావ్యంబున రసము విప్రలంభశృంగార ము. పాకము, ద్రాక్షాపాకము. వృత్తి, కైశికి. రీతి, వైదర్భి. అలంకార ము, స్వభావోక్తి. పెక్కులి సర్వకావ్యాలంకారములకిదిగని. అనేకక వులు దీనిని బెక్కుదేశభాషలలోనికి మార్చిరనుట దీనిరుచిని, సర్వసమ ర్థుఁడగు మల్లినాథసూరి మేఘసందేశములోను మాఘకావ్యములోనునా వయఃకాలముగడచినదనుట దీనిభావగాంభీర్యమును బ్రకటించుచున్నవి. కుబేరునిశాపముచే భార్యావియుక్తుఁడై చిత్రకూటపర్వతమునఁ దనశాప కాలమును నొక్కసంవత్సరమునుగడపుచున్న యొకానొకయక్షుఁడలకా పురంబుననున్న తనప్రియురాలికిఁ దనవార్తనెఱింగింపుమని మేఘునితోఁ జెప్పుటయను కాథాభాగముగలదియగుటచే దీనికి మేఘసందేశమనుపే రువచ్చినదని కావ్యధోరణిని వ్యాఖ్యాతలయభిప్రాయంబునను నిర్వచింపఁ బడుచున్నదిగాని యట్టివార్తయిచ్చియని యొకవ్యాఖ్యాతయువ్రాసియుం డలేదు. దీనిపైమహాకవియగుకాళిదాసు తనయీ కావ్యోద్యమంబునకుఁ బ్రధానప్రయోజనంబగునట్టి సందేశమును దెల్పకయే కావ్యమునుసమాప్తి నొందించెనా? లేక దీనిందెల్పుచివరిభాగమునశించెనా? కాకయట్టిసందే

శమిందే దుర్గ్రహంబై యుమిడియున్నదా? అనిపలు తెలుంగుల వెడలినసం దియంబుల కుత్తరముగా నుత్తర మేఘములోని నలువది రెండవశ్లోకంబున ర్థమే యీకావ్యనిగూఢఫలంబగు సందేశమని తెలియుచున్నది. మృదుమ ధురసరసంబగు నాశ్లోకమునిందుదాహరించెదను.

"త్వామాలిఖ్య ప్రణయకుపితాం ధాతురాగైశ్శిలాయాం।
మాత్మానం తే చరణపతితం యావదిచ్ఛామి కర్తుం।
అస్రైస్తావన్ముహురుపచితైర్దృష్టిరాలుప్యతే మే।
క్రూరస్తస్మిన్నపి నసహతే సంగమం నౌ కృతాంతః॥"

ఓప్రేయసీ! ప్రణయకలహమునఁ గోపగించినట్లున్న నీయాకార మును రాగద్రవ్యములతో శాతిపలకమీఁదఁ జిత్రించి నీపాదములమీఁదఁ బడినట్లుగా నాయాకృతిని జిత్రింపఁబోవునంతలోఁ బొరలిపొరలివచ్చుక న్నీళ్లచే నాదృష్టికప్పఁబడిపోయినది. అకటా! పాడుదైవము చిత్తరువు లోఁగూడ మనసమాగమమును సహింపకుండెను. అనితన భార్యనుగూర్చి యక్షుఁడు పంపఁబోవువార్తయయినట్లు తెల్లమగుచున్నది.

ఈతఁడీకావ్యమునఁ జిత్రకూటమార్గమధ్యమందున్న పర్వతముల ను నదులను దేవక్షేత్రంబుల నీక్రిందివిధముగా వర్ణించి ప్రాచీనోత్తరహిం దూదేశస్థితిని బ్రకటించెను.

"ఓయుత్తమకులసంభూతుఁడవైన మేఘుఁడా! కుబేరశాపము వలన వియోగదుఃఖమనుభవించుచున్న నావార్త నలకాపురంబుననున్న నాభార్యకుఁజెప్పుటకై నీవు వెళ్లవలసినమార్గమును ముందుగావిని తరువాత (త్వామాలిఖ్యయనుపద్యమందలి) నావార్తనువిందువుగాక. నీవీచిత్రకూ టశిఖరమునుండి యుత్తరదిక్కుగాబయలువెడలి మాలమను నెత్తయినక్షే త్రము నెక్కి యక్కడనుండియుత్తరముగానాషాఢమాసమునఫలించుమామి డిచెట్లుగల యామ్రకూటపర్వతమున కేగి పిదప రేవా (నర్మద) నదిని

జూచి క్రమముగా దశార్ణదేశములనుబొంది వానిరాజధానియగు విదిశా పురమునుజేరి యచటవేత్రవతీనదీజలముత్రాగి యచటికిదగ్గఱగానున్న నీ చైరాఖ్యపర్వతమున నలసటదీర్చుకొని క్రమముగా వననదీతీరభూములందు డుచు నిర్వింధ్యానదికిఁ బశ్చిమముగా నుత్తరదిక్కునకుఁబోవునీ కాన దికిఁ దూర్పుగానున్న యుజ్జయినీపురమునకుఁబోవుట చుట్టుదారియైనను దప్పక యానిర్వింధ్య (సింధునది) మార్గమునుబట్టి యవంతిదేశములను బొంది వానిరాజధానియు శిప్రానదీతీరస్థమునగు నుజ్జయినికి వెళ్లి యాపుర శోభంగని దానిసమీపముననున్న గంధవతీనదీతీరమందలి మహాకాలక్షే త్రమును జేరి మహాకాలనాథుని సాయంతనపూజ నెఱవేర్చుకొని మరలివ చ్చి యుజ్జయినిలో నా రాత్రిగడపి యుదయమున నేపయనమై గంభీరాన దిమీదుగా దేవగిరిఁజేరి యందుఁగుమారస్వామిని సేవించి బయలుదేరి చర్మణ్వతీనదినిదాఁటి బ్రహ్మావర్తదేశముసరసి యందర్జునుని శరవర్షమున కుఁజోటైన కురుక్షేత్రమునుజూచి పిదప నతిరుచ్యమగు సరస్వతీజలము త్రాగి పిదపఁ గనఖలపర్వతముదగ్గఱగాఁబ్రవహించు గంగానదినడ్డముగా దాఁటి యంతహిమాలయంబుం జేరి యందలివిశేషంబులెల్లంగనియందుం డి వెడలి క్రౌంచరంధ్రమునుండి యుత్తరముగాఁబోయి కైలాసపర్వతము నకతిథివై మానససరస్సుఁగని యాగిరిపైనున్న గంగామకూలయగు నల కానగరినిజూడఁగలవు" అనిపూర్వమేఘమున మార్గమువర్ణించి యుత్తర మేఘమున నలకాపురంబును యక్షునిగృహంబును జక్కగావర్ణించెను. ఇట్లుచిన్నకథాబీజమునంకురింపఁజేసి శృంగారరసముపోసి చక్కగాఁబెం చి యీకావ్యకల్పతరువుగాఁజేసిన యీకవి కవితాచాతుర్యమనుభవైక వేద్యము. ఇతఁడీకావ్యమున ౪౯ వ శ్లోకమున నురయనునర్థమున హాలా యను దేశభాషాపదమును బ్రయోగించెను. దీనినమరసింహుఁడుగూడ "సురాహలిప్రియాహాలా" యనినుడివెను. మఱియు నితఁడు రఘువం

శము ౪వ సర్గ ౬౭వ శ్లోకమున నితరపూర్వకవులెవరును వర్ణింపని కాశ్మీరదేశములోని సింధునదీతీరభూములలోనున్న కుంకుమపుష్పమువర్ణించెను. ఈతనిసమకాలికుఁడగు నాయమరసింహుఁడే ,, అథకుంకుమం. కాశ్మీరజన్మాగ్నిశిఖం వరం బాహ్లీకపీతనే " యనివచించెను. పూర్వహిందూదేశనాగరికతకుఁదార్కాణమై శ్రావ్యమందాక్రాంతావృత్తభాసురంబై సదభిప్రాయమంజులంబైన యీకావ్యము సంస్కృతభాషావిధూటికిఁది లకమని నమ్మఁదగినది

రఘువంశము. ఇదియాబాలవృద్ధము జగమెచ్చిగినకావ్యము. గతించిన పందొమ్మిదిశతాబ్దములనడుమ నెల్లవిధముల దీనింబోలినకావ్యమింకొకటిలేదనుట యెల్లచదువరులకు ననుభవసిద్ధమగుటచే దీనికిదియే సాటియనవచ్చును. అసులభశైలి కాపదమార్దవమున కారసపుష్టి కాచిత్రకల్పనమున కాస్వభావవర్ణనమున కాభావగ్రహణమున కాయూవిద్యమున కానైపుణి కాప్రౌఢిమకుజన్మభూమియగు నిఖిలోకజ్ఞానమున కాదర్శముగానున్నది. దీనిపై నలువదివ్యాఖ్యానములవఱకునుగలవుగాని వానిలో మల్లినాథసూరిసంజీవినీటీక మిక్కిలిప్రాచుర్యమునుజెందియున్నది ఉత్తమకవితాపారంగతుఁడగు నీకాళిదాసు తనయేయితరకావ్యమునలేని స్వకథనంబును బ్రౌఢకవిలక్షణంబునకనుగుణంబుగా నహంకారనిరాసపూర్వకంబుగా నిందిట్లానరించెను.

క్వసూర్యప్రభవో వంశః క్వచాల్పవిషయా మతిః।
తితీర్షుర్దుస్తరం మోహాదుడుపేనాస్మి సాగరం॥

పందొమ్మిదిసర్గలుగల యీమహాకావ్యము భాషాభివృద్ధికై పఠించుటకేకాక పుణ్యపురుషులకథలు వినుటకును నుత్తమనాయికానాయకసత్పాత్రలంగనుటకును రాజచరిత్రలఁదెలియుటకును జతుర్వర్గసాధనంబెఱుంగుటకును నీతిసారఁబుగ్రహించుటకును దేశకాలపాత్రవిశేషాంశఁబుల సూ

హించుటకును లోకంబుననుపయోగపడుచున్నది. ఈప్రబంధమున దిలీపుఁడు మొదలుగా నగ్నివర్ణునివఱకును గలసూర్యవంశ రాజులగు నయోధ్యాప్రభువులచరిత్రముఁదెల్పుచుఁ గాళిదాసు వాల్మీకి రామాయణకథను జక్కగా వివరించెను.

దిలీపుఁడు, రఘువు, అజుఁడు, దశరథుఁడు, రాముఁడు, కుశుఁడు, రాజాతిథి, నిషధుఁడు, నలుఁడు, నభస్సు, పుండరీకుఁడు, క్షేమధన్వుఁడు దేవానీకుఁడు, అహీనగుఁడు, పారియాత్రుఁడు, శిలుఁడు, ఉన్నాభుఁడు వజ్రనాభుఁడు, శంఖణుఁడు, వ్యతిషాశ్వుఁడు, విశ్వసహుఁడు, హిరణ్యనాభుఁడు, కౌసల్యుఁడు, బ్రహ్మిష్ఠుఁడు, పుత్రుఁడు, § పుష్యుఁడు, ధ్రువసంధి, సుదర్శనుఁడు, అగ్నివర్ణుఁడు ననునిరువదితొమ్మండుగురు రఘువంశ రాజులయవిచ్ఛిన్నమైన పురుషక్రమమిందుఁ జూపఁబడినది.

రామాయణములో సీతావివాహసందర్భముననున్న "పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా" యనునుపమానంబును గ్రహించి యీకవి దిలీపుఁడు నందినీధేనువుననుసరించుసందర్భంబున ‡"స్థితస్స్థితా ముచ్చలితః ప్రయాతాం నిషేదుషీ మాసనబంధధీరః। జలాభిలాషీ జలమాదదానాం ఛాయేవ తాం భూపతిరన్వగచ్ఛత్ ॥" అనుచో మిక్కిలి సరసముగావివరించిప్రయోగించినట్లు కనుపడుచున్నది. దిలీపుని స్త్రీలింగమగుఛాయతోఁబోల్చుటదోషముగాదని "లౌకిక్యుపమాకులింగవచనములతోనిమిత్తములే" దను వామనునివాక్యముచేసమర్థించి యీయుపమ నిరుపమానమని చారిత్రవర్ధనుఁడు తనవ్యాఖ్యానమున వ్రాసెను.

---

§ వీరిలోఁ బుత్రరాజకుమారుఁడగు పుష్యుఁడు బ్రహ్మవేత్తయగు జైమినిమునికి శిష్యుఁడై మోక్షప్రాప్తికి యోగవిద్యనభ్యసించెనని వర్ణింపఁబడినది.

‡ దిలీపుఁడు, నందినీధేనువు నిలిచినపుడు నిలిచి, పడుకొనినపుడు కూరుచుండి, నీరుద్రాగినపుడు నీరాని, నీడవలెనే దానినను గమించెను.

మఱియు రఘుమహారాజు దిగ్విజయయాత్ర చేయుసందర్భంబున నాల్గవసర్గలోఁ బూర్వహిందూదేశస్థితిచక్కఁగాఁ దెలుపఁబడినది. చతురంగబలసమేతుఁడగు రఘుచక్రవర్తిముందుగాఁ దూర్పుగా బయలువెడలి ప్రాచ్యరాజులజయించి సముద్రప్రాంతంబునకువచ్చి సుహ్మదేశీయులవశపఱచుకొని క్రమముగా వంగదేశీయులనోడించి గంగాద్వీపములలో జయస్తంభములనాటి పిదపఁ గపిశానదినిదాఁటి యుత్కలదేశరాజులు తనకుమార్గదర్శకులుకాఁగాఁ గళింగదేశమునకువచ్చి మహేంద్రాద్రిపైనారాజును గెలిచిపిదపసముద్రతీరముననే దక్షిణదిక్కుగావచ్చి కావేరీనదిదగ్గఱగామలయపర్వతప్రాంతమునఁ గొంతవిశ్రమించి పిదపఁ బాండ్యదేశభూపతులకుఁ బ్రతాపముచూపి తామ్రపర్ణీనదిం గని మలయదర్దురపర్వతములనెక్కి క్రమముగా సముద్రమునకుదూరమందున్న సహ్యాద్రినతిక్రమించి కేరళదేశరాజులనణఁచి పిదప నపరాంతదేశప్రభువులవలనఁ బన్నుగ్రహించి త్రికూటాద్రిని జయస్తంభముగాఁ గావించి పిదపఁ బారసీకులజయింప మెట్టదారిని వెడలి యశ్వసాధనులగు యవనులఁ బెక్కండ్రఁ దుములయుద్ధమున హింసించి మిగిలినవారినిరక్షించి పిదపనుత్తరదిక్కుగావచ్చి యుత్తరదేశీయులనుద్ధరించుచు సింధునదీతీరంబులసంచరణంబున శ్రమతీర్చుకొనుచుఁ గ్రమముగా హూణరాజులనుదమణఁచి పిదపఁ గాంభోజులజయించి తరువాత హిమాలయంబునధిరోహించి లౌహిత్యానదినిదాఁటి ప్రాగ్జ్యోతిషజనపదేశ్వరునిగొట్టి కామరూపదేశనాథునిసేవఁబడసి దిగ్విజయసంపన్నుఁడై యయోధ్యకువచ్చెను. ఈదేశయాత్రను సవిమర్శముగా నెల్లవిశేషంబులం దెల్పుచు వర్ణించుటచూడఁగాఁ గాళిదాసీయాత్రయంతయుఁ జేసినవాఁడనితోఁచకపోదు. ఇందలిసర్గలన్నియు రసభరితంబులై మనోహరంబులుగానున్నవిగాని సీతాపరిత్యాగరూపమగు పదునాల్గవసర్గమాత్రము వానినెల్లమించియున్నది. సీతను విడుచు రాముని యాక్రందివాక్యమా రాజధర్మమునకే యాకృష్టాంతనైపుణికేమి పెట్టినది పేరుగానున్నది.

“ అనైమి చైనామనఘేతికింతు లోకాపవాదోబలవాన్మతో మే ।
ఛాయాహి భూమేశ్శశినోమలత్వే నారోపితా శుద్ధిమతఃప్రజాభిః”

ఆహా! అడవిపాలగుసీత రామునకువర్తమానించిన యీక్రింది వాక్యములు కరుణరసమొలికించుచుఁ బతివ్రతాలక్షణంబులగు క్షమాధైర్యములం దెల్పుచు నెంతసరసముగానున్నవి?

§ వాచ్యస్త్వయామద్వచనాత్సరాజా వహ్నౌవిశుద్ధామపియత్సమక్షం।
మాం లోకవాదశ్రవణాదహాసీః। శ్రుతస్య కిం తత్సదృశం కులస్య ॥

† సాఽహం తపస్సూర్యనివిష్టదృష్టి రూర్ధ్వం ప్రసూతేశ్చరితుం యతిష్యే।
భూయోయథా మేజననాంతరేఽపి త్వమేవభర్తా నచ విప్రయోగః ॥

నాటకములు:—భాసుని రత్నావళితో సరిచూచుచు నీతని మాలవికాగ్నిమిత్రముకథను శ్రీహర్షజీవితములోఁ గనియుంటిమి. ఊర్వశీపురూరవస్సులు కథానాయకులుగాఁ గలుగుట విక్రమోర్వశీయమనియు, శకుంతలయుదంతముఁ దెలుపుట శాకుంతలమనియుఁ బేరువడసిన రెండునాటకములును బురాణప్రసిద్ధవృత్తములే. మాలవికాగ్నిమిత్రములోనికథ క్రీ॥ పూ॥ రెండవశతాబ్దమునడుమ మగధదేశరాజుగానున్న యగ్నిమిత్రునికథను దెల్పునదిగానున్నది. వీనిలో విక్రమోర్వశీయము “ సప్తాష్టనవపంచాంకం దివ్యమానుషసంశ్రయం। త్రోటకంనామ తత్ప్రాహుః ప్రత్యంకం సవిదూషక ” మ్మను లక్షణంబునకుసరిపడుటచేఁ ద్రోటకమనిపిలువఁబడుచున్నది. శృంగారరసాశ్రయంబులగు నీమూఁడురూపకంబులలో నేకాక లోకములోని యితరనాటకములకంటెఁగూడ శాకుంతలముత్తమమను చ

---

§ † నీవగ్గిలోనే యగ్నిశుద్ధియైనను లోకాపవాదముచేనన్ను విడిచితివి. ఇది నీకులమునకును శాస్త్రమునకును దగియుండునుగదా? నేనో ప్రసవమయిన పిదప జన్మాంతరమందైనను నీవే భర్తవుగాఁ బలయును వియోగము రాఁగూడదు. అనిసూర్యునిఁగూర్చి తపస్సొనరించెదను.

దువరులయభిప్రాయంబును « కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకుంతలా ” అనులోకోక్తి స్థిరపఱచుచున్నది. ఇదియెల్లకవితాలక్షణంబులకును స్వభావాదివర్ణనంబునకును సాత్త్వికాదిభావములకును నుచితంబగు రసంబునకును గనిమై స్వదేశీయులహృదయంబునేకాక పరదేశీయులచిత్తంబునుగూడ రంజింపఁజేసి వన్నెకెక్కినది. గేటియనుజర్మనీదేశపండితుఁడీనాటకమును జదివి యానందముపట్టఁజాలక మైమఱచి నాట్యమొనరించెనని వాడుకగలదు. స్వభావవర్ణనమీతనిసొమ్మని ప్రతికావ్యమామూలాగ్రముగా బోధించుచుండ నెన్నియుదాహరణములు చూపుదునుగి అయిననొకటి. శాకుంతలప్రథమాంకములోని రథవేగవర్ణనము

* యదాలోకేసూక్ష్మం వ్రజతి సహసా తద్విపులతాం ।
యదర్ధే విచ్ఛిన్నం భవతి కృతసంధానమివ తత్ ।
ప్రకృత్యా యద్వక్రం తదపి సమరేఖం నయనయో-
ర్నమే దూరే కించిత్ క్షణమపి నపార్శ్వే రథజవాత్ ॥

అనన్యసామాన్యోపమాలంకారరత్నములకుఁ బేటికయగు నీతనిఁగూర్చి « ఉపమా కాళిదాసస్య ” యనునార్యోక్తిచాలదుగావున నుపమాలంకారమేయితఁడని చెప్పిన బాగుగానుండును. చూడుఁడు.

* చరణాంకనివేశితాం ప్రియాయాస్సరసాం పశ్యవయస్య! రాగలేఖాం ।
ప్రథమామివ పల్లవప్రసూతిం హరదగ్ధస్య మనోభవద్రుమస్య ॥

---

* దూరమందేది చిన్నదిగాఁగనుపడినదో యదివేగముగాఁబెద్దదియగుచున్నది. ఏది నడుమ నెడముగలిగియున్నదో యదిసరిగాఁగనుపడుచున్నది. ఈరథవేగమువలన నాకు దూరమందుఁ బార్శ్వమందుఁగూడ నేదియు నిమిషమైనను దృష్టిగోచరముగాకున్నది.

* మిత్రుఁడా! శివునిచేఁగాల్చఁబడిన మన్మథవృక్షముయొక్క మొదటి క్రొత్తచిగురువలెనే సరసముగానున్న ప్రియురాలిపాదాంతమునందలి రాగరేఖను జూడుము.

§ గచ్ఛతి పురశ్శరీరం ధావతి పశ్చాదసంస్తుతం చేతః। [మాలతీం
చీనాంశుకమివ కేతోః ప్రతివాతం నీయమానస్య॥ శా. ౧

† నాతి శ్రమాపనయనాయ నచ శ్రమాయ।
రాజ్యం స్వహస్తధృతదండమివాతపత్త్రం॥ శా. ౫

‡ భ్రమరఇవ విభాతే కుందమంతస్తుషారం।
నచఖలు పరిభోక్తుం నైవశక్నోమి హాతుం॥ శాకుం. ౫

ఈతనికావ్యామృతసరస్సునుండి లెక్కించిమెన్నియుపమాబిందువులంద్రాగి తృప్తినొందగలము? ఎన్నిసారులుచదివినను నెప్పటికప్పుడభినవరసోదయముగానుండు నీతనిశాకుంతలమునేమనివర్ణింతును? సంస్కృతాక్షరములువచ్చినవారికెల్ల నోటికివచ్చెడు దీనినాల్గవయంకములోని సరసములగు నాలుగుశ్లోకములనునిందు వ్రాయుట చర్వితచర్వణమగునుగావున వానివిడిచి యింక నీతనికవితావిశేషంబులకు దిక్ప్రదర్శనముగానుదాహరణంబులంజూపుచున్నాఁడను. ఈక్రింది స్త్రీరూపవర్ణనముచూచినయెడల ననితరకవిజనానుమేయంబగు కవితాప్రపంచనిర్మాణమున నీతనిప్రతిభాసామర్థ్యమెంతవఱకుఁబోయినదో మనమూహింపఁజాలము. వీనిభావంబును భావారసజ్ఞులకనుభవైకవేద్యముగాని వచనైకగోచరముగాకున్నది. ఆహా యేమివర్ణనము?

§ గాలికెదురుగాఁ గొనిపోఁబడు ధ్వజముయొక్క పట్టుగుడ్డవలెనే ముందుశరీరము నడచుచున్నది. వెనుక హృదయము పఱుగెత్తుచున్నది.

† తనచేతితోఁబట్టుకొనిన గొడుగువలెనే రాజ్యము, అతిశ్రమనుబోఁగొట్టదు శ్రమనుగలిగింపదు. (అనఁగా) కష్టముతోఁగూడిన సుఖమునిచ్చునని భావము.

‡ మంచుతోఁగూడినమల్లెమొగ్గను దుమ్మెదవలెనే, యీశకుంతలను విడువఁజాలను, పరిగ్రహింపఁజాలను.

§ చిత్రే నివేశ్య పరికల్పితసత్త్వయోగా।
రూపోచ్చయేన విధినా మనసా కృతాను।
స్త్రీరత్నసృష్టిరపరా ప్రతిభాతి సా మే।
ధాతుర్విభుత్వమనుచింత్య వపుశ్చ తస్యాః॥

† అస్యాస్సర్గవిధౌ ప్రజాపతిరభూచ్చంద్రోనుకాంతిప్రద।
శృంగారైకరసస్స్వయంను మదనో మాసోనుపుష్పాకరః।
వేదాభ్యాసజడః కథంనువిషయవ్యావృత్తకౌతూహలో।
నిర్మాతుం ప్రభవేన్మనోహరమిదం రూపంపురాణోమునిః॥

‡ ఆభరణస్యాభరణం ప్రసాధనవిధేః ప్రసాధనవిశేషః।
ఉపమానస్యాఽపి సఖే ప్రత్యుపమానం వపుస్తస్యాః॥ వి. ౨

ఇవి చూడఁగా మూఁడవపద్యములోని వర్ణనమువలెనే వీనికివియే సాటియని తోఁచుచున్నది.

ఈతనికృతులలో నర్థకఠినములును రసహీనములు నగుశ్లేషచిత్రయమకాదులు లేవనియే చెప్పవచ్చును. అయిననీతని విక్రమోర్వశీయము

§ బ్రహ్మదేవుఁడు చక్కనియాకారమును జిత్తరువులోవ్రాసి ప్రాణముపోసి శకుంతలను నిర్మించెనో? లేక, సేకరించిన కాంతిసమూహముతో మనస్సుచేతనే నిర్మించెనో? విధాత సృష్టిసామర్థ్యమును, దానిశరీరలావణ్యమును జూడఁగా, నీస్త్రీరత్నసృష్టి యింతకంటెను వేఱయినదనియే నాకుఁదోఁచుచున్నది.

† ఈయూర్వశినిర్మింపఁ గాంతిప్రదుఁడైన చంద్రుఁడు స్రష్టయగును. లేదా? శృంగారరసనిలయుఁడగు మన్మథుఁడుగావలయును. కాదా? పుష్పాకరమైనవసంతము గావలయును. కానియెడల, వేదజడుఁడు, విషయసుఖముల నెఱుఁగనివాఁడును ప్రాచీనమునియునగు బ్రహ్మ యిట్టిమనోహరరూపమును నిర్మింపనెట్లుసమర్థుఁడగును?

‡ దానిదేహము ఆభరణమున కాభరణము; అలంకారమున కలంకారము; ఉపమానమునకు నుపమానముగానున్నది.

నాల్గవయంకములో నతిమధురము నతిసులభము నతిసరసమును బ్రశ్నోత్తరరూపంబునగు ద్విగతమను పేరుగల శ్లిష్టచిత్రకవిత్వమునకొక్క యుదాహరణముగలదు. ఎట్లనఁగా—

" సర్వక్షితిభృతాం నాథ! దృష్టా సర్వాంగసుందరీ ।
రామారమ్యే వనాంతేఽస్మిన్ మయా విరహితా త్వయా ॥ "

ఓసర్వక్షితిభృన్నాథ! యీవనాంతమున నాచేవిడువఁబడిన సర్వాంగసుందరి నీచేఁజూడఁబడినదాయని పర్వతంబునడిగిన రాజుప్రశ్నంబునకామాటలచేతనే యోసర్వక్షితిభృన్నాథ! యీవనాంతముననీచే విడువఁబడిన సర్వాంగసుందరి నాచేఁజూడఁబడినది యని ప్రశ్నముయొక్క ప్రతిధ్వనియేయుత్తరము గావచ్చును. ఇదిసంస్కృతములోనేకాక తెలుఁగులోనట్లువచ్చుటకనుకూలపడదు.

సహజసౌందర్యవర్ణనకొక్క యుదాహరణము.

* " సరసిజమనువిద్ధం శైవలేనాపి రమ్యం ।
మలినమపి హిమాంశోర్లక్ష్మ లక్ష్మీం తనోతి ।
ఇయమధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ ।
కిమివహి మధురాణాం మండనం నాకృతీనాం ॥ శా. ౧

శాస్త్రజ్ఞానము. ఇతఁడెఱుంగనిశాస్త్రము లేదనియిదివఱకే చదివితిమి. ఈకవి పాణినీయమునేకాక చాంద్రాదివ్యాకరణములనుగూడ నెఱింగినవాఁడని యీతనిపదప్రయోగమే తెల్పుచున్నది. పాణినీయవిరుద్ధములనఁబడుచు మల్లినాథాదులచే సమర్థింపఁబడిన యొకటిరెండుప్రయోగములఁజూపెదను. " త్రియంబకం సంయమినందదర్శ " యనుచోఁ

---

* పద్మము నాఁచుతోఁగూడినను రమ్యముగానేయుండును. నల్లగానున్నను చిహ్నము చంద్రునకు శోభనేచేయుచున్నది. ఈశకుంతలయో నారబట్టకట్టినను మిక్కిలి చక్కగానేయున్నది. సుందరాకారంబులకేవి యలంకారములుగావు?

దప్పక రావలసినయణాదేశమునకుమాఱుగా నిమిత్తమాధారము నులేని „ఇయజ్ఞా" దేశమువచ్చినది. పాణినీయవిరుద్ధమైనను బద్మపురాణస్థితంబైన యీప్రయోగము మహాకవి చెప్పినదగుటచే నట్లంగీకరింపఁబడినది యనియు, „ తత్రివిశ్రామహేతోః" అనుచో హ్రస్వము రావలసియుండఁగా దీర్ఘముండుట యపాణినీయమే యని కొందఱనిరిగానియిది „ విశ్రామోవా" యనుచాంద్రవ్యాకరణంబున సాధువనియు, మల్లినాథుఁడువ్రాసెను.

మఱియు „ ఛాయాహి భూమేశ్శశినోమలత్వే నారోపితా శుద్ధిమతఃప్రజాభిః" అనఁగాఁ జంద్రునిపైఁ బ్రతిఫలించినభూమియొక్క నీడనే నలుపని ప్రజలుచెప్పుచున్నారనిభావము. దీనింబట్టి చంద్రునిలోని నైల్యమును భూఛాయయనువారిభావన నితఁడు ఖగోళజ్ఞానంబునఖండించినట్లు కనుపడుచున్నది.

మఱియు „ అథౌషధీనా మధిపస్య వృద్ధౌ తిథౌచ జామిత్రగుణాన్వితాయాం" అనుసీతావివాహముహూర్తంబుచేఁగూడ నితఁడుజ్యోతిశ్శాస్త్రభాగంబు నెఱింగినవాఁడనవచ్చును.

„ వీర్యవంత్యౌషధానీవ వికారో సాన్నిపాతికే। కు, ౧౧.

ఆమయస్తు రతిరాగసంభవః॥ ర. ౧౯ స. సంగవస్తు భిషజామనాశ్రవః। రాజయక్ష్మపరిహానిరాయయౌ। వైద్యయత్నపరిభావినంగదం మహౌషధిం నక్తమివాత్మభాసః॥ (కు. ౧) భోగీవ మంత్రౌషధిరుద్ధవీర్యః (ర. ౧౨) తేనహి దంశచ్ఛేదః పూర్వాకృత్యేతి శ్రూయతే. ఛేదోదంశస్య దాహోవా క్షతేర్వా రక్తమోక్షణం। ఏతాని దష్టమాత్రాణా మాయుషః ప్రతిపత్తయః॥ (మాల. ౪. అం.) అనియు ననేకవిధములుగా నీతనికావ్యములలోనున్న యోషధిరోగచికిత్సావిషయక వాక్యములవలన నీకవికాలమున సుశ్రుతచరకాదిసంహితలును నోషధితత్త్వశాస్త్రంబును

నభివృద్ధిలోనున్నవని తెలియుచున్నది. మఱియు నీసర్వజ్ఞుఁడు హస్త్యా యుర్వేదజ్ఞానంబును వాత్స్యాయనాది కామసూత్రజ్ఞానంబును నందం దుఁబ్రకటించెను.

విశేషాంశము:— « సంతానకాకీర్ణమహాపథం తచ్చీనాంశుకైః కల్పితకేతుమాలం " చీనాంశుకమివకేతోః, కథం సముద్రవ్యవహారీ సార్థవాహో ధనమిత్రోనామ నౌవ్యసనే విపన్నః, అనేనసాగరం విహారాంబురాశేస్తీరేషు తాలీవనమర్మరేషు। ద్వీపాంతరానీతలవంగపుష్పైరపాకృతస్వేదలవామరుద్భిః॥" అనియునుండుటచేఁ గాళిదాసకాలంబున హిందూదేశమునకుఁ జీనాదేశమునుండి యితరద్వీపములనుండి కొన్ని సరకులువచ్చుచుండెడివనియు నీదేశస్థులు సముద్రముపై నోడలమూలముగా సండాదీవులకును దగ్గఱిచిన్నచిన్నదీవులకునుఁబోవుచు వాణిజ్యము చేయుచుండెడివారనియుఁ దెలియుచున్నది. ఆహా యీయంశము సముద్రయానము నిషిద్ధముకాని యప్పటిమనదేశనాగరికతను విద్యాసంపద గలిగియు దారిద్ర్యమనుభవించుచున్న యిప్పటిమనదేశదురవస్థను దెలిపి యొకసారి సంతోషవిచారములు గలిగింపహేతువగుచున్నది. మహామహుఁడగు నీతనికావ్యములు చదివినంగాని యిట్లుగొన్నియంశములు చూపినంతమాత్రమునఁ దృప్తితీరదని యింతటితో నీవిమర్శనముముగించెదను.

## అశ్వఘోషుఁడు.

ఇతఁడుత్తమకవియశస్సుగాంచినవాఁడుకాకపోయినను సంస్కృతభాషలో మంచిపాండిత్యముగలవాఁడై బుద్ధచరితమనునొకకావ్యమురచించినకవి. ఈకవి బౌద్ధమతస్థుఁడని బుద్ధచరితములోని « శ్రియం పరార్ధ్యాం విదధద్విధాతృజి। త్తమోనిరస్యన్నభిభూతభానుభృత్। నుదన్నిదాఘం జితచారుచంద్రమా। స్సవంద్యతేఽర్హన్నిహయస్యనోపమా॥" యనుమంగళాచరణశ్లోకమే చెప్పుచున్నది.

మొదటనీతఁడు పాటలీపుత్రమున వసించినవాఁడయ్యెఁ బిదపని పుఁడు పేషావరనిపిలువఁబడు పురుషపురమునవసించినవాఁడనియుఁ గని ష్కమహారాజునకు మతగురువనియుఁ దెలియుచున్నది. ఈయంశము తోఁగూడ నీతనికాలము బహువిమర్శకులకభిమతంబగు ప్రొఫెసరుకాల గారియభిప్రాయంబున నీక్రిందివిధముగా ధ్రువపడుచున్నది.

,, అతిప్రతిభావంతుఁడగు నొకమహాకవిశైలి ననుకరించుటకుఁద రువాతికవులు ప్రయత్నపడుటసహజముగాని వారికాశైలియలవడుట దు ర్లభము సరిగదా పైగాదానివలనఁ గొంతవికృతిగూడసంభవించును. ఒ కవేళ వారట్లుపాటువడియనుకరించినను నెవరికవిత్వము ననుసరించిరో దానినిదెలిసికొనుటసులభము. బుద్ధచరితమునందుఁ బెక్కుతెలుంగులఁ గాళిదాసుకావ్యములనుండి గ్రహింపఁబడిన యభిప్రాయములు కల్పనము లు వర్ణనములు వాక్యములు సరిగాఁగన్పడుచున్నవి. బుద్ధచరితమునుండి యే కాళిదాసట్లుగ్రహించెనేమోయని కొందఱనవచ్చునుగాని వీరియిద్ద ఱికావ్యములఁజదివిన యేస్వల్పబుద్ధియుఁ, గవితాజన్మభూమియు స్వతంత్ర కవియునగు కాళిదాసునకట్టియపవాదమారోపింపఁడని నామతము. అది గాక కాళిదాస కావ్యముల శైలిసహస్రాంశ లేశమైనను బుద్ధచరితమంత వెదకిచూచినఁ గనుపడదు. రఘువంశమేడవసర్గలోని పురంధ్రీవర్ణనము కు మారసంభవము మూఁడవసర్గలోని కామవర్ణనమును బుద్ధచరితము మూఁ డుపదుమూఁడుసర్గలలోఁ గ్రమముగా సరిగాఁగన్పడుచున్నవి. కావున న శ్వఘోషుఁడు కాళిదాసునికావ్యత్రయమును ముందుంచుకొని తనకా వ్యమునురచించెనని తప్పకయూహింపవచ్చును. బుద్ధునియందలిభక్తిచేఁ బ్రయత్నపూర్వకముగాఁ గావ్యమువ్రాసిన ధర్మతత్త్వజ్ఞానియగు నశ్వ ఘోషుఁడు కవితల్లజుఁడగు కాళిదాసుననుకరించెనుట యాశ్చర్యకరము

గాదు. కావునఁ గ్రీ॥ ౭౮ దికిఁబైనున్న కనిష్కమహారాజునకు గురువుగానున్న యశ్వఘోషునికంటెఁ గాళిదాసాక శతాబ్దమైనను బూర్వుఁడైయుండునని యిదివఱకే నిశ్చయింపఁబడినదగుటచే నశ్వఘోషుఁడు క్రీ॥ శ॥ ప్రథమశతాబ్దముపరభాగములోనివాఁడైయుండు" నని బుద్ధచరిత్రపీఠికలో వీరియిరువురకవిత్వశైలినిసరిచూచుచు నిఁకనునమితముగా వ్రాసిన శ్రీకాలుగారియభిప్రాయమునుబట్టిచూడఁగా నితఁడు క్రీ॥ ౭౦—౧౨౦ లోపలనున్నవాఁడని తెలియుచున్నది.

కుశనవంశజుఁడును బౌద్ధుఁడును గాశ్మీరాదిదేశములజయించినవాఁడును నగు రాజకనిష్కుఁడు పాటలీపుత్రమందున్న బౌద్ధాచార్యుఁడగు నశ్వఘోషునిఁ దనపురుషపురమునకుఁ దీసికొనిపోయి గురువుగానొనర్చుకొనెనని దేశచరిత్రలవలనను దెలియుచున్నది.

బుద్ధచరితము పదియేడుసర్గలకావ్యము. దీనిలో మొదటిపదునాలుగుసర్గలు నితఁడువ్రాసినవనియుఁ దరువాతిమూఁడుసర్గలు నేపాలదేశస్థుఁడు బౌద్ధుఁడు నగునమృతానందుఁడు వ్రాసినవనియుఁ గొందఱూహించియున్నారు. ఈయూహకుఁ దగినంతతృప్తికరమగు కారణమేదియుఁగనుపడదు. ఇతఁడురచించినది కావ్యమేకాక మఱియొకటేదియు లేదు. దీనినుండి కొన్నిపద్యములను రఘువంశాది కావ్యపద్యములతోఁ బోల్చుచు నిందుదాహరించెదను.

సమానపదప్రయోగంబునకుదాహరణములు.

| రఘువంశము. | బుద్ధచరితము. |
|---|---|
| దిశః ప్రసేదుర్మరుతో వవుస్సుఖాః | దిశః ప్రసేదుః ప్రబభౌ నిశాకరః |
| కుమారసంభవము. | |
| వాతావవుస్సౌఖ్యకరాః ప్రసేదుః | వాతావవుస్స్పర్శసుఖామనోజ్ఞాః |

సమానాభిప్రాయంబునకుదాహరణము.

అరిష్టశయ్యాం పరితో విసారిణా
సుజన్మనస్తస్య నిజేన తేజసా।
నిశీథదీపాస్సహసా హతత్విషో బభూ
వురాలేఖ్యసమర్పితా ఇవ॥ర.౩ ౫౫.
మేఘసందేశము. ౨. ౪౯
కస్యైకాంతం సుఖముపనతం దుఃఖ
మేకాంతతోవా నీచైర్గచ్ఛత్యుపరిచ
దశా చక్రనేమిక్రమేణ।

సహిస్య గాత్రప్రభయో జ్జ్వలన్త్యా।
దీపప్రభాం భాస్కరవన్ముమోష।
మహార్హ జాంబూనదచారువర్ణో।
విద్యోతయామాస దిశశ్చ సర్వాః॥
౧, ౩౨.
అశోఽపి నైకాంతసుఖోఽస్తి కశ్చి
న్నైకాంతదుఃఖః పురుషః పృథివ్యాం

ఈకావ్యమునిర్దుష్టమై బౌద్ధమతధర్మములను నీతిని వస్తుతత్త్వమును దెల్పుచు లోకోపకారకముగానున్నది. ఇందులకీ క్రిందిపద్యము లుదాహరణములుగాఁజాలును.

‡ నావజానామి విషయాన్ జానే లోకం తదాత్మకం।
అనిత్యంతు జగన్మత్వా నాత్ర మే రమతే మనః॥
జరా వ్యాధిశ్చ మృత్యుశ్చ యది నస్యాదిదం త్రయం।
మమాపిహి మనోజ్ఞేషు విషయేషు రతిర్భవేత్॥
పతత్త్వత్పరమం బ్రహ్మ నిర్లింగం ధ్రువమక్షరం।
యన్మోక్షఇతితత్త్వజ్ఞాః ప్రవదంతి మనీషిణః॥

‡ లోకము విషయాత్మకము ననిత్యముననితెలిసి యందునామనస్సు ప్రవేశింపకున్నది. వ్యాధిజరామరణములులేనియెడల నాకుఁగూడ మనోహారంబులగు విషయసుఖంబుల బుద్ధిప్రవేశించును. తత్త్వజ్ఞులగువారు దేనిని మోక్షమనిచెప్పుదురో, అది యంతములేనిదియు, లింగములేనిదియు, నిత్యమైనదియు నగుపరబ్రహ్మము (జ్ఞేయమనిభావము).

# చంద్రకకవి.

-:0:-

ఇతఁడు గొప్పకవియనియుఁ గాశ్మీర నివాసుఁడనియుఁ దుంజీన రాజుకాలంబుననున్నవాఁడనియు రాజతరంగిణి రెండవతరంగములోని "నాట్యం సర్వజనప్రేక్ష్యం యశ్చక్రే సమహాకవిః। ద్వైపాయనమునేరంశస్తత్కాలే చంద్రకోఽభవత్"॥ అను శ్లోకమువలనఁ దెలియుచున్నది. ఒక్కకనింగుహాముమతమున మాత్రమే యీతుంజీనకుఁడు క్రీ॥ ౩౧౮ లో రాజ్యమునకువచ్చినట్లున్నదిగాని మిగిలిన యెల్లరు నీతఁడు క్రీ॥ ౧౦౩ లోఁ గాశ్మీరరాజ్యసింహాసన మెక్కినట్లు భావించుటచే నీతనికి సమకాలికుండగు మన కవి క్రీ॥ ౧౦౩—౧౫౦ నడుమ నున్నవాఁడని భావింపవచ్చును.

ఇతఁడురచించిన నాట్య ప్రబంధము నాకు సంభవింపలేదుగాని యీతని కవితాధోరణి తెల్పుటకు క్షేమేంద్రుఁడౌచిత్యవిచారచర్చలో నుదాహరించిన శ్లోకము నిందు వ్రాయుచున్నాఁడను. ఇది క్షాత్ర తేజంబును దెల్పుచు మిక్కిలి సరసముగానున్నది.

శ్లో॥ యుద్ధేషు భాగ్యచపలేషు నమే ప్రతిజ్ఞా।
దైవం నియచ్ఛతి జయంచ పరాజయంచ।
ఏషైవ మే రణగతస్య సదా ప్రతిజ్ఞా।
పశ్యంతి యన్నరిపవో జఘనం హయానాం॥

§ (తా) భాగ్యచంచలములగు సంగ్రామంబుల నాకే ప్రతిజ్ఞయు లేదు. జయాపజయములను దైవమే విధించును. కాని, యుద్ధరంగమున కేగిన నా గుఱ్ఱముల వెనుకటి భాగమును మాత్రము శత్రువులు చూడరని నిత్యప్రతిజ్ఞ నొనరింతును.

# భర్తృహరి.

-:0:-

ఇతఁడు విక్రమార్కుఁడను రాజునకు సోదరుఁడని చెప్పునొక కథయు నీతని వైరాగ్యమునుగూర్చి యొక నింద్యమైనకథయు వాడుకలోనున్నవి. కాని నిరాధారములైన యాకథలువిశ్వసనీయములుగావు.

పలువురు పలుతెలంగుల నీతనిఁ గ్రీ॥ ౪వ శతాబ్దము మొదలుగా ౮వ శతాబ్దంబులోపుగా నాయాకాలములఁ జేర్చిరిగాని యీతని కాలనిర్ణయమునుగూర్చి యీతనిభట్టి కావ్యములోని కడపటి శ్లోకంబును బంచతంత్రమును సరిగాఁజెప్పఁగలవని నావిశ్వాసము.

కాని, భట్టి కావ్యము భర్తృహరి చేసినది యగునా కాదా యని లోకములో నొకసంశయముగలదు. ఇదివట్టిప్రవాదమే కాక దాని వ్యాఖ్యాతలభిన్నాభిప్రాయంబులంగూడ స్థిరపడుచున్నది. ఈ కావ్యమునకు జయమంగళుఁడనువాడు జయమంగలావ్యాఖ్యానంబును భరతసేనుఁడనువాఁడు ముగ్ధబోధినీ వ్యాఖ్యానంబును వ్రాసిరి. వీరిలో మొదటివాఁడు వ్యాఖ్యాముఖంబున «శ్రీస్వామిసూనుః కవిర్భట్టినామా రామకథాశ్రయంమహాకావ్యంచకార" యనియు వ్యాఖ్యాంతగద్యంబున «వలభీవాస్తవ్యస్య శ్రీస్వామిసూనోర్భట్టిమహాబ్రాహ్మణస్య మహావైయాకరణస్య" యనియు వ్రాసెను. ఇఁక రెండవ వ్యాఖ్యాతటీకాముఖంబున «భర్తృహరిర్నామకవిశ్శ్రీరామకథాశ్రయంమహాకావ్యంచకార" యనియు వ్యాఖ్యాంతంబున «ముగ్ధబోధిన్యాం భట్టిటీకాయాం" అనియు వ్రాసెను. ఇతఁడు కావ్యాంతమందలి నాలుగుశ్లోకములకు వ్యాఖ్యానము వ్రాసినట్లుకనుపడదు. ఆనాలుగుశ్లోకములు కావ్యప్రశంసను దెల్పుచున్నవి గాని కథకుసంబంధించినవిగావు. అవిప్రక్షిప్తములుగాని యీకావ్యము

లోనివికావేమోయనుకొనెదమనినఁ గడపటిశ్లోకము కావ్యకారకనాయకులను దెల్పునదిగానున్నది. కావున నవిప్రక్షిప్తములుగావనియుఁ గేవల కావ్యఫలబోధకంబులగుటచే వానికివ్యాఖ్యానము ముఖ్యముగాదని భరతసేనుఁడు విడిచియుండవచ్చునని యు మనమునన్నవచ్చును. ఈవ్యాఖ్యాతలలో మొదటివానియభిప్రాయంబునుబట్టిచూఁడగా భట్టియనువాఁడు బ్రాహ్మణుఁడనియు నతఁడు రచించినకావ్యముగావున దీనికిభట్టికావ్యమని పేరువచ్చినదనియుఁ దెలియుచున్నది. కాని మిక్కిలినవీనుఁడగు నితఁడు కవినామమే కావ్యమునకువచ్చినదని భ్రమపడి చివరిశ్లోకంబునర్థంబునఁ బ్రమాదపడి యిట్లువ్రాసెనేమోయని సంశయములో నింకొకసంశయము వొడముచున్నది. ఇఁక రెండవవ్యాఖ్యాత యభిప్రాయంబున భర్తృహరి యీకావ్యమునకుఁ గర్తయని తెలియుచున్నని తఁడు కృతికర్తనుగృతినాయకునిఁదెలుపు చివరిశ్లోకంబునకర్థమువ్రాయకపోవుటచే నిన్నమొన్నటిముద్రణంబులలోనున్న యీచివరినాలుగుశ్లోకంబులనితఁడు నిజముగా నెఱుఁగఁడేమోయనియు నెఱిఁగియుండినఁగవినివాసాదులందెల్పునదిపద్యమునకైన నర్థమువ్రాయకుండునాయనియు జనించుశంకలతో నితనికీకావ్యకర్త భర్తృహరియని యెట్లు తెలిసెను? ఈకావ్యమునకు భట్టికావ్యమని పేరెట్లువచ్చెను? అని యిఁక రెండుసందేహములుత్పన్నములగుచున్నవి. ఆహా! తీఁగతీసినకొలఁదిని డొంకకదలునన్నట్లిట్లాలోచించినకొలఁదిని సంశయపరంపరవచ్చుచునేయుండును. కావున నీవ్యాఖ్యాతలలోఁ బ్రమాదమెవనిది? ఈసందేహములనిర్మూలించుసమాధానమేది? అను రెండువిషయంబులనుగూర్చి ప్రసంగింపమున్ముగా భట్టికావ్యములోని చిట్టచివరిశ్లోకంబునకర్థమువిమర్శింతము. “ కావ్యమిదం విహితం మయావలభ్యాం। శ్రీధరసూనునరేంద్రపాలితాయాం। కీర్తిరతోభవతాన్నృపస్య తస్య। క్షేమకరః క్షితిపోయతః ప్రజానాం॥” దీనికి జయమంగళుఁడు వ్రాసినయర్థ

మేనునఁగా శ్రీధరుఁడను వానికి కుమారుఁడైన నరేంద్రునిచేఁ బాలింపఁబడు వలభీపురమునందు నేను (కవిపేరులేదు) ఈకావ్యము వ్రాసితినిగావున నీ కావ్యరచనకీర్తి ప్రజాసంరక్షకుఁడగు నారాజునకగుఁగాక యని యాశీర్వాదపరముగా నర్థము వ్రాసెను. కానివ్యాఖ్యాముఖంబున భట్టిపదమునకు విశేషణముగా లేని మహాబ్రాహ్మణపదము వ్యాఖ్యాంతగద్యంబున లేఖకప్రమాదంబుననో ముద్రాపకులప్రమాదంబుననో క్రొత్తగాఁ జేరినదిగాని జయమంగళుఁడు వ్రాసినదిగాదని మనము విశ్వసించితిమేని పైపద్యార్థము భట్టికావ్యమని పేరువచ్చుటకును దీనికర్తృత్వము భట్టి భర్తృహరులకిద్దఱికి నారోపించుటకును దగినకారణమును మనకు బోధించును. ఈవిషయంబున నీపద్యములోనిపదములకును వ్యాఖ్యానములోని పదములకును గొన్ని మార్పులుగలవుగాని యట్టిస్వల్పదోషములకుఁబోరాదక దీనిభావమాలోచింతము.

శ్రీధరసూనునరేంద్రపాలితయగు వలభీపురములో నేనీకావ్యము వ్రాసితినిగావున నీకావ్యకర్తృత్వయశస్సుజనపాలకుఁడగు నారాజు నే పొందుఁగాకయనిదీనికవి యీకావ్యకర్తృత్వయశస్సు నారాజునకిచ్చిన ట్లు తెలియుచున్నది. ఈభావమునుబట్టి యీకావ్యమారాజుపేరఁ బరగుచున్నదనుట నిశ్చయముగావున శ్లోకములోని యానరేంద్రుఁడు భట్టి యని తేలుచున్నది. కావ్యకర్తృత్వకీర్తినిజెందిన యారాజుపేర నీకావ్యముపరగుచున్నదిగావున దీనికవి భట్టి యనివ్రాయుట జయమంగళుని దోషముగాదు. ఈయర్థంబున శ్లోకములోని శ్రీధరపదమునకు శ్రీస్వామి యర్థముగావచ్చునుగావున భట్టి శ్రీస్వామిసూనుఁడని సరిపోవుచున్నది. ఇఁక నైహికసుఖదూరుఁడు నహంకారశూన్యుఁడు పరతత్త్వజ్ఞానియునగు భర్తృహరి నిష్కాముఁడై లోకహితకరముగాఁ గావ్యములనురచించి తనయేకావ్యములోను స్వవిషయము దెల్పకపోయినను నామహాత్ముని కవి

త్త్వకీర్తి వాక్యపదీయభట్టికావ్యసుభాషితనామంబులతో గంటలుగట్టు కొని జగమంతటసంచారమొనరించి దిగంతముల విశ్రమించియున్నదనుట యందఱకును దెలిసినదియే కావున దీనికవి భర్తృహరియనివ్రాయుట భరతసేనునిదోషమును గాదు. కావున దీనింబట్టి భర్తృహరియే యీకావ్యము రచించి వల్లభీపురరాజగు భట్టిభూపాలునిపేరఁ బ్రకటించియుండునని మనమూహింపవచ్చును. ఇఁకనీవలభీపురరాజెవఁడో యెప్పటివాఁడో తెలిసినమనకవికాలముగూడఁ దెలియఁగలదు.

షాహరాజులయనంతరమున సౌరాష్ట్ర (గుజరాత్) దేశమును బాలింప వల్లభీరాజులువచ్చినట్లును వారిలో భట్టారుకుఁడనురాజు తమ వంశనామంబున వల్లభీపురము రాజధానిగాఁజేసికొని ౫ వ శతాబ్దము పూర్వభాగంబున రాజ్యమొనరించినట్లును దేశచరిత్రలు చెప్పుచున్నవి. ఈషద్వైషమ్యముగానున్న నామసామ్యమునుబట్టి యీభట్టారుకుఁడే భట్టియని మనము విశ్వసించితిమేని భర్తృహరి యయిదవశతాబ్దపూర్వభాగంబుననున్నవాఁడనిస్పష్టమగును. మఱియు నెనిమిదవశతాబ్దముపరభాగమందున్న విష్ణుశర్మ పంచతంత్రములో నితనిసుభాషితములోనిపద్యములుదాహరింపఁబడుటగూడ నితఁడంతకుఁబూర్వుఁడని తెలియుచున్నది. ఈతనిమూఁడుగ్రంథంబులను వానిలో విశేషంబుగా వైరాగ్యశతకంబును జదివినయెడల నితఁడుచిరకాలము గురుకులవాసముచేసి వేదవేదాంతములయందును సమగ్రమైనశబ్దశాస్త్రమందును సాంఖ్యయోగతర్కశాస్త్రములయందును బరిజ్ఞానముసంపాదించిన బ్రాహ్మణోత్తముఁడని తెలియకపోదు. పతంజలిభాష్యముపై వాక్యపదీయమను వ్యాఖ్యానము వ్రాసిన యీమహావైయాకరణశిరోరత్నము శబ్దశాస్త్రజ్ఞానంబునకై లక్ష్యలక్షణరూపకంబుగా రామకథను నిరువదిరెండుసర్గల పద్యప్రబంధముగా వ్రాసి వల్లభీపురరాజగు భట్టిభూపాలునిపేర భట్టికావ్యముగాఁ బ్రకటించినట్లుపై

ప్రమాణమువలనఁ గనుపడుటచే నితఁడా సౌరాష్ట్రదేశమందలి వల్లభీపురమున నివసించినవాఁడనియుఁ గొంతకాలము భట్టిభూపాలునియాస్థానమునలంకరించినవాఁడనియుఁ దేలుచున్నది. ఇదిట్లుండఁగా—

భర్తృహరి కొండొకదేశమును బాలించునపు డొకబ్రాహ్మణుఁడ చటికివచ్చి యొకయమూల్యమైనఫలము నారాజునకిచ్చెననియు నతఁడు దానిని దనభార్యకిచ్చెననియు నామెతనయుపభర్తకిచ్చెననియు వాఁడుతనభార్యకిచ్చెననియు నది యాపండుచేతఁగొనిపోవుచుండఁగా రాజుచూచి యావృత్తాంతమంతయుఁ గ్రమముగాఁగనుఁగొని సంసారమునుబరిత్యజించి విరాగియై యపుడు సుభాషితమును రచించెననియుఁ జిరకాలమునుండియొకకింవదంతి కర్ణపరంపరాయత్తమైవచ్చుచున్నది.

ఈకథ యంతయు సత్యము కాకపోయినను భర్తృహరికొక బ్రాహ్మణుఁడు ఫలమిచ్చుటమాత్రము సత్యమైనట్లు సుభాషితమునకు రామచంద్రపండితుఁడు వ్రాసినవ్యాఖ్య మొదటనున్న ‚‚ సకలవిద్యాపారంగతుఁడై స్త్రీలోలుఁడై యున్నభర్తృహరికొక బ్రాహ్మణుఁడొకఫలమొసంగెను. అతఁడద్దానిభక్షించి జ్ఞానముగలిగి విరాగియై సంసారమోహము విడనాడి సుభాషితమువ్రాసె ” నను శ్లోకతాత్పర్యమునఁదెలియుచున్నది. ఇదిట్లైనను పైకథను రామచంద్రపండితుఁడు వ్రాసినపాఠాంతరముగానున్నది. నీచులని నిందించుటకుఁగాకపోయిన మహాత్ములని నుతించుటకైనను వాల్మీకునిఁ జండాలుఁడనియుఁ గాళిదాసు నెటుకులవాఁడనియుఁజెప్పునట్లుగా నుత్తమప్రతిష్ఠంజెందిన కీర్తికాయులయెడ నేదోయొకదోషంబునో యద్భుతకథనో కల్పించుట లోకంబునకు స్వభావసిద్ధంబగుటచే నుత్తమవైరాగ్యమునొందిన ముముక్షువైన మనభర్తృహరియెడఁగూడ నాతనివైరాగ్యంబునకిది ప్రధానకారణంబైయుండుననిలోకమూహించియుండవచ్చునుగాని యిట్టికథలు పండితలోకమునకు నమ్మఁదగినవి

కావు. ఎట్లయిననీతఁడు గొంతకాలము యథేచ్ఛముగా విషయలోలుఁడై పిదప గొప్పవైరాగ్యమును జెందెననుటకు సుభాషితమే నిదర్శనముఁగ గలదు.

ఇతఁడు మొదట వాక్యపదీయమును బిదప దానికి లక్ష్యముగా భట్టికావ్యమును దరువాత నైహికాముష్మికనీతిజ్ఞానఖని యగుసుభాషితత్రిశతినిరచించియుండును. ఇతఁడద్వైతమతవేత్త, జ్ఞానయోగి, శివభక్తుఁడుననియీక్రిందిపద్యములు చాటుచున్నవి.

"దిక్కాలాద్యనవచ్ఛిన్నానంత చిన్మాత్రమూర్తయే।
స్వానుభూత్యేకమానాయ నమ శ్శాంతాయ తేజసే॥
మహేశ్వరేవా జగతామధీశ్వరే జనార్దనేవా జగదంతరాత్మని।
నవస్తుభేదప్రతిపత్తిరస్తి మే తథాపి భక్తి స్తరుణేందుశేఖరే॥"

ఈశాస్త్రికర్త వాక్యపదీయమునకు లక్ష్యగ్రంథముగా శ్రీరామవృత్తము నిరువదిరెండుసర్గలుగాఁ బ్రకీర్ణ, అధికార, ప్రసన్న, తిఙన్తకాండములను పేర్లతోఁ బద్యకావ్యముగా రచించెను. ఈకవిత్వము శైలిచేఁగాని మనోహరములగు కల్పనవర్ణనములచేఁగాని యంతగా రుచించునదిగాదు. కాని పాణినీయశబ్దజాలమువల్లెవేయుటకు మిక్కిలియనుకూలముగానున్నది. ఇందుండియొకపద్యముదాహరించెదను.

"పపాత రాక్షసో భూమౌ ররాటచ భయంకరం।
తుతోద గదయాచారిం తం ముద్ధావాద్రిణా కపిః॥"

లోకవిఖ్యాతింగాంచిన యీతనిసుభాషితములోని కాలమహిమవర్ణనముగు—"సా రమ్యా నగరీ మహాంత్సనృపతి స్సామంతచక్రంచతత్పార్శ్వే తస్యచ సా విదగ్ధపరిష త్తాశ్చంద్రబింబాననాః। ఉద్వృత్తస్సచరాజపుత్రనివహ స్తేవందినస్తాఃకథా। స్సర్వం యస్య వశాదగాత్స్మృతిపథం కాలాయ తస్మై నమః॥" అనుపద్యము పూర్వోక్తవిధముగానితఁ

డు గొంతకాలము వల్లభీపురరాజుసభలో నధికగౌరవము పొందినవాఁడ నుటకు నిదర్శనమగుచున్నది. ఈకావ్యము బాలురకుంగూడఁ దెలియునం తటిసులభశైలిలో సర్వవేదశాస్త్రసారంబున కాదర్శముగానున్నది. ఇం దులో నీతిశతకమైహికజ్ఞానమును, వైరాగ్యశతకమాముష్మికజ్ఞానంబును బోధించుచు నెట్టిమూఢునిహృదయంబునైనను గరగించునట్లుగానున్నవి. మూఁడవదిపేరునకు శృంగారశతకమైనను నీతివైరాగ్యముల రెంటినిబో ధించుచు నడుమనాయకమణివలె నలరారుచున్నది. ఇంతకంటెనీతివైరా గ్యముల నేవియుపదేశింపఁగలవు. చూడుఁడు!

† స్మృతా భవతి తాపాయ దృష్టా చోన్మాదకారిణీ।
స్పృష్టా భవతి మోహాయ సానామ దయితా కథం॥
వేశ్యాసౌ మదనజ్వాలా రూపేంధనవివర్ధితా।
కామిభిర్యత్ర హూయంతే యౌవనాని ధనానిచ॥
కశ్చుంబతి కులపురుషో వేశ్యాధరపల్లవం మనోజ్ఞమపి।
చారభటచోరచేటక విటనటనిష్ఠీవనశరావం॥"

మఱియు నీక్రిందిశ్లోకమితఁడే తప్పక భట్టికావ్యమురచించినవాఁ డనుటకును వైరాగ్యబోధకునుగూడ నుదాహరణమగును.

"అశీమహి వయం భిక్షా మాశావాసోవసీమహి।
శయీమహి మహీపృష్ఠే కుర్వీమహి కిమీశ్వరైః॥"

---

† వేశ్య, తలఁచుకొనినఁ దాపముచేయును. చూచిన వెఱ్ఱిపుట్టించును. తాఁకి న మోహముగలిగించును. అదియెట్లు దయితయగును? కామవంతు లెందుజవ్వనము ను ధనమును హోమముచేయుదురో యా వేశ్య రూపమనుపుల్లలచేవృద్ధిఁబొందుమద నాగ్నియే. చోరభటచేటవిటనటులుమియునట్టి మూఁకుఁడు (పీకిదాను) అయిన వే శ్యయధరోష్ఠము నేకులపురుషుఁడు చుంబనముచేయును?

జగంబున గృహదైవతమువలెనుండు నీకావ్యమునుగూర్చి యింక విస్తరించివ్రాయక యొకశ్లోకముదాహరించెదను.

"వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయంతీ।
రోగాశ్చ శత్రవఇవ ప్రహరంతి దేహం।
ఆయుః పరిస్రవతి భిన్నఘటాదివాంభో।
లోకస్తథాప్యహితమాచరతీతి చిత్రం॥"

సర్వసమర్థుఁడగునితఁడీ సుభాషితత్రిశతి స్వయముగా వ్రాసియుండుననుమాట నిర్వివాదమేకాని, కాలవశంబున నిందలిపద్యములుగొన్నిలోపించుటయు వానిస్థానంబులఁ గాళిదాస శౌఖదత్తాదికవులవి శ్లోకంబులు చేరుటయు సంభవించినదని యెఱుఁగవలయును.

బాలసరస్వతి, లక్ష్మణకవిగూడఁ దెలిఁగించిన యీశ్లోకములు సుప్రసిద్ధములుగాఁ నర్థమువివరింపలేదు.

# భారవి.

-:o:-

ప్రాచీనమహాకవులలో నొకఁడగు నితఁడేకాలమున నెందువసించెనో యది తెలిసికొనుటకష్టసాధ్యమేయగును. కాని యీతనికాలమును గూర్చి శార్మణ్యదేశీయుఁడగు యాకోబీపండితుఁడోరియంటల్ జర్నల్ అను త్రైమాసికపత్రికమూఁడవభాగములో "ఎట్లయినను మాఘునియొక్క అవశతాబ్దము మధ్యభాగమునకుఁ బైవాఁడుకాఁడని స్థిరపడుటచే నీతనికంటెఁ బూర్వుఁడగు భారవి యాఱవశతాబ్దప్రారంభముననుండుటనిస్సంశయము" అనివ్రాసినదానింబట్టి యితఁడు క్రీ॥ శ॥ ౬-వ శతకము మొ

దటనుండియుండునని తేలుచున్నది. మఱియు ౬౩౪ లో రెండవపులకేశి చేఁబ్రతిష్ఠింపఁబడిన యైహోలశాసనములోనున్నట్లుగాఁ దెలియుచున్న "యేనాయోజినవేశ్మ స్థిరమర్థవిధౌ వివేకినాజినవేశ్మ। సవిజయతాం రవికీర్తిః కవితాశ్రితకాళిదాస భారవికీర్తిః॥" అనుశ్లోకమువలన నప్పటికే సుప్రసిద్ధుఁడై రవికీర్తికుపమానభూతుఁడుగానున్న భారవి తప్పక యొక శతాబ్దముక్రిందటివాఁడైయుండు నని మఱికొందఱువ్రాసిరి. కావునని హేతువులంబట్టి భారవి క్రీ॥ శ॥ ౫౫౦ ప్రాంతమునఁ గిరాతార్జునీయకావ్యమునువ్రాసియుండునని గ్రహింపనచ్చును. ఇతనిదేశమేదో సరిగాఁ దెలియదుగాని కొందఱు దక్షిణహిందూస్థానములోనివాఁడని యభిప్రాయపడియున్నారు. నిజమయినదికాకపోయినను నితనిఁగూర్చి మనదేశమునఁ గింవదంతిగావచ్చునొకకథ హాస్యరసముగానుండునుగావున దానినిందు వ్రాయుచున్నాను.

భారవి చిన్నతనముననే మంచిసాహిత్యము నేర్చి పాణినీయమున నధికసమర్థుఁడై చక్కనికవిత్వము చెప్పుచున్నకాలమున నపుడపుడు కొందఱు పెద్దమనుష్యులాతనితండ్రిదగ్గఱకువచ్చి భారవిని బొగడుచుండనతఁడు "వానికేమి తెలియును జిన్నవాఁడు మీరంతగానుతింపఁదగిన గొప్పతనమేమియు లే" దని ప్రత్యుత్తరము చెప్పుచుండెడివాఁడఁట. ఆమాటలువినుచున్న భారవి తనవిద్యాసంపదఁజూచి తండ్రియసహనపడుచుండెనని భావించి యీవృత్తాంతము తల్లితోఁజెప్పుచుఁ దండ్రినిజంపినంగాని తనకుఁబ్రతిష్ఠరాదని కృతనిశ్చయుఁడై యొకనాఁడు తండ్రిభోజనముచేయుచున్నకాలమున నొకపెద్దతిరుగలిరాయితీసికొని తండ్రినెత్తికి సరిగాఁబైనున్నదూలముపైఁ గూరుచుండి యారాయివిడువవలెనని తలంచునంతలో నాతనితల్లి భర్తనుగూర్చి "ఏమండి మనపిల్లవాని నెవరైననుతించినపుడు వానికేమి తెలియును వానిముఖమునిందించెదరఁట. వాఁడందునకువ్యస

నపహసించుచుండె" ననిపలుకరించెనఁట. అంతనావృద్ధుఁ "డోసీ వెఱ్ఱిదానా! పిల్లవానిసామర్థ్యము నేనెఱుఁగనా మనపిల్లవానినిమనము పొగడుకొనుట వానికిశ్రేయస్సుగాదని యిట్లుచెప్పుచుంటినుగాని వానిమీఁదనాకుఁ గోపమనుకొంటివా" యనిబదులుచెప్పెనఁట. అంతనామాటలువినుచున్నభారవి పాపభీతచేతస్కుఁడై వారికిఁదెలియకుండఁగా వేటుచోటినుండిక్రిందికి దిగివచ్చి నాయనా! పూజ్యులగుపెద్దలకేరికైన హానిచేయనుంకించువానికి దండనమేమియనియడిగెనఁట. అంతనతఁడు, కుమారా! యట్టివారాఱు నెలలత్తవారియింటనుండవలెనని బదులుచెప్పెనఁట. అపుడుభారవి తనదుర్వృత్తి తెలిసియే యిట్లు సూక్ష్మదండనమువిధించెనని యనుకొని మాఱుమాటాడక నేనేయట్టివాఁడనని చెప్పి సాష్టాంగదండప్రణామంబు గావించి తనదుష్టప్రయత్నమెఱిఁగించి క్షమింపవేడుకొని తనభార్యతోఁ గూడ వెంటనేపయనమై వెళ్లియత్తవారియింటనుండెనఁట. వారును విద్వాంసుఁడగుజామాతవచ్చెనని మొదటాఱుదినములకు గౌరవముచేసియెప్పటికినాతఁడింటికిఁ బ్రయాణముకాకుండుటచూచి క్రమక్రమముగా నతనియెడ ననాదరణముచూపుచుండెడివారఁట. అంతనతఁడు పశ్చాత్తప్తుఁడై "శ్వశురగృహనివాస స్స్వర్గతుల్యో నరాణాం యది వసతి దినాని త్రీణి పంచాథ సప్త। దధిమధుఘృతభక్ష్య క్షీరసారప్రవాహ స్తదుపరిని వసేచ్చేదన్నసారప్రవాహః॥" యనితలంచుకొనుచు నొకమాసముగడపెనఁట. పిదపమామగారు బావమఱఁదులు నతనికిఁ బలువిధములగు పనులనియోగించుచుఁ దుదకుఁ బొలములోఁ జొన్నచేనికాపునియోగించిరఁట. భారవియుఁ దండ్రివిధించినయీదండనముకంటె మరణమే మేలనియెంచికొని నిత్యము భార్యయన్నముతెచ్చిపెట్టుచుండఁ బొలములోనే కిరాతార్జునీయమువ్రాసికొనుచుఁ జేనుకాయుచునుండెనఁట. ఇట్లుండ నెప్పటివలెనే భార్యవచ్చి నేఁడువ్రతదినము మాయింటనందఱు నోఁచుకొనుచు

న్నారు నాకుడబ్బులేదేమిచేయుదు ననికన్నీరువిడువ నతఁడు నీవువిచారిం పకుమనిచెప్పి స్వానుభవపూర్వకముగాఁ గథాసందర్భమునకనుకూలము గా నపుడేవ్రాయుచున్న రెండవసర్గలోని—

* "సహసా విదధీత నక్రియా మవివేకః పరమాపదాం పదం।
వృణతేహి విమృశ్యకారిణం గుణలుబ్ధాః స్వయమేవ సంపదః॥"

అనుశ్లోకము నొకతాటియాకుపైవ్రాసియిచ్చి దీనిని విక్రయించినయె డల నీకుఁగావలసినసొమ్మువచ్చునని చెప్పిపంపఁగా నామెయు నింటికేగి యాపద్యము నొకవర్తకునకువిక్రయింప నతఁడానందించి నూఱువరాలి చ్చెనఁట. పిదప నతఁడిట్లాఱుమాసములునుగడపి మహాపాతకవిముక్తుఁడై యింటికివచ్చెనని యొకకథగలదు.

తల్లిదండ్రులఁగొట్టియో తిట్టియో యింటినుండి వెడలఁగొట్టియో యపూర్వయశస్సునొందిన విద్యామహాభిమానులు నహంకారశూరులుపర శ్రేయస్సహనదూరులు నగుపండితమల్లు లప్పుడకా దిప్పటికిని గొందఱుగల రుకాని లోకంబునకు నీతిగఱపుమహాకావ్యమువ్రాసినభారవి యంతటి జ్ఞానహీనుఁడగుననుట విశ్వసనీయముగాదు. కావున నీకథకూడఁగాళిదా సాదులకథలవంటిదేయని యూహింపఁదగును.

ఇతఁడు భారతములోని పాండవులయరణ్యావాసకథను దీసికొని దుర్యోధనునిరాజ్యపద్ధతిని, రాజనీతిని జక్కఁగావివరించుచుఁ దుదకుఁగిరా తవేషధారియగు శివునకు నర్జునునకు జరిగినయుద్ధము కిరీటికి మహేశ్వ రుఁడు పాశుపతాదికమునొసంగుట యనుకథాభాగంబును బ్రధానము గాఁజేసికొని కిరాతార్జునీయమను పేరుతోఁ బదునెనిమిదిసర్గలమహాకా వ్యమురచించెను. ఇంతకంటెనితఁడు వ్రాసినగ్రంథమేదియుఁగనుపడదు.

* తొందరపడియెట్టికార్యము చేయరాదు. అవివేకమెల్లయాపదలకు మూల ము. ఆలోచించిపనిచేయువానిని గుణాధీనములైన సంపదలు వరించును.

ఇందు మొదటిమూఁడుసర్గలకుఁ బాషాణత్రయమని వ్యవహారముగలదు. ఈకవిత్వము నారికేళపాకమై యర్థగాంభీర్యముఁగలదని “ నారికేళఫలసమ్మితం వచో భారవేః సపది తద్విభజ్యతే। స్వాదయంతు రసగర్భనిర్భరం సారమస్య రసికా యథేప్సితం ॥” అను మల్లినాథసూరివచనంబును, “ ఉపమా కాళిదాసస్య భారవేరర్థగౌరవం ” అనులోకోక్తియుఁ జెప్పుచున్నవి. ఈకావ్యమునకు నేకనాథుఁడు, జోనరాజు, నరహరి, మల్లినాథుఁడు మొదలుగా ననేకులు వ్యాఖ్యానములు వ్రాసిరి. కాని వీనిలో మల్లినాథసూరి లిఖించిన ఘంటాపథవ్యాఖ్యయే లోకములో సుప్రసిద్ధముగానున్నది

భారవి బ్రాహ్మణుఁడు; పాణినీయ వ్యాకరణంబునను నీతిశాస్త్రంబునను నధికసమర్థుఁడు; చిత్రయమకబంధకవిత్వప్రియుఁడు. ఇతఁడు పదియేనవసర్గలో నతిక్లిష్టంబుగ బంధకవిత్వమునుగూర్చెను. ఈతనికవిత్వశైలి కఠినమయినదయినను సవిమర్శముగాఁ జదువువారికి మిక్కిలిరుచికరముగానుండును. చిరకాలమునుండి కాళిదాసత్రయమునకుఁ దరువాతఁ బఠనకావ్యముగా వ్యవహరింపఁబడు నీకావ్యమునుగూర్చి రసజ్ఞులకు వేఱుగాఁ దెలుపనక్కఱ లేదు. శైలి తెలియుటకై దీనినుండి నీతిజ్ఞానంబులకనువగు రెండుపద్యములనుదాహరించెదను.

§ శుచిభూషయతి శ్రుతం వపుః ప్రశమస్తస్య భవత్యలంక్రియా ।
ప్రశమాభరణం పరాక్రమః స నయాపాదితసిద్ధిభూషణః ॥

‡ జీయతాం దుర్జయా దేహే రిపవశ్చక్షురాదయః ।
జితేషు నను లోకోఽయం తేషు కృత్స్నస్త్వయా జితః ॥

---

§ చక్కనినీతిశాస్త్రము దేహమునలంకరించును. దానిని శాంతి యలంకరించును. దానిని బరాక్రమమలంకరించును. దానిని నీతిసిద్ధి యలంకరించును.

‡ దేహములోనున్న చక్షురాదిశత్రువులను ముందుగా జయింపవలయును. వానిని జయించిన యెడల లోకమంతయు గెలువవచ్చును.

# మాఘుఁడు.

---:o:---

సంస్కృతభాషలోని యెల్లగొప్పకవులను భోజమహారాజునాఁటి వారని చెప్పుబల్లాలపండితసంకలితం బగుభోజప్రబంధమువలెనే కొన్ని యంశంబుల మేరుతుంగాచార్యునిప్రబంధచింతామణియుఁ బ్రభాచంద్రుని ప్రభావకచరితంబును గూడవిశ్వసింపఁదగినవిగావనియుఁ గాలనిర్ణయావసరంబుల వీనినాధారములుగాఁ దీసికొనఁగూడదనియుఁ బ్రాచ్యపాశ్చాత్య విమర్శకులెల్లరు నిర్ణయించుటచే మాఘుఁడు భోజరాజునాశ్రితుఁడని చెప్పునీమూఁడుగ్రంథంబులు నీతనికాలనిర్ణయంబునకుఁ బ్రమాణంబులుగాఁ జాలవు. అయినను బ్రభావకచరితమువలనఁ దెలియుకొన్నిక్రొత్తయంశములనిందుఁ వ్రాయుచున్నాను. "గూర్జరదేశమందు మాలమనుపురవరంబు గలదు. అందా దేశమును బాలించు శ్రీవర్మలాతుఁడను రాజుగలఁడు. అతనికి సుప్రభదేవుఁడను నొకబ్రాహ్మణమంత్రిగలఁడు. ఆతనికి దత్తకుఁడు, శుభంకరుఁడు నను నిరువురుకుమారులుగలరు. వారిలోఁ బెద్దవానికిఁ బుత్రుఁడును భోజరాజునకు బాల్యస్నేహితుఁడు నగుమాఘుకవి శిశుపాలవధ కావ్యమునురచించెను. రెండవవానితనయుఁడగు సిద్ధకవి యుపమితిభవప్రపంచకథయనుకావ్యము నురచించెను." అనియున్నది. ఈసిద్ధకవి తనకావ్యముచివర "గ్రంథనిర్మాణసంవత్సరములు ౯౬౨" అనివ్రాసినట్లుకొందఱు చెప్పుచున్నారు. దీనింబట్టి యితఁడు క్రీ॥ ౧౦౫౦ లో నున్నట్లు తేలుచుండుటచే నీతనిపెత్తండ్రికుమారుఁడగు మాఘుఁడుకూడ నప్పటివాఁడే యైయుండునని జర్మనీదేశస్థుఁడగు డాక్టరుక్లాటు మొదలగుకొందఱభిప్రాయపడియుండిరి. కాని, మాఘుఁడు పత్నీసహితుఁడై దారిద్ర్యముచే భోజరాజును యాచింపవచ్చెనని తెల్పుపై రెండుగ్రంథంబులకును, మాఘుకవి యాగర్భశ్రీమంతుఁడగుమంత్రిపుత్రుఁడని తెల్పుదీనికిని బరస్పరవిరోధము

మెండుగాఁగనుపడుట చేతను, మాఘునకు సిద్ధర్షి పితృవ్యపుత్రుఁడని తెల్పు నే యితరాధారంబులు లేకుండుట చేతను, ప్రభాచంద్రుఁడు తనకావ్యంబు మొదటనే వ్రాసిన "బహుశ్రుతమునీశేభ్యః ప్రాగ్గ్రంథేభ్యశ్చ కానిచిత్ । ఉపశ్రుత్యేతి వృత్తాని వర్ణయిష్యే కియంత్యపి ॥" యనుశ్లోకమే యిందలి కాలనిర్ణయాదులు సంశయాస్పదములని తెలుపుట చేతను పైకథ కింవదంతియని విశ్వసింపఁదగినది. మఱియుఁ గ్రీస్తుశకమునవమశతాబ్దము త్తరభాగంబుననున్న కాశ్మీరదేశవాసియగు నానందవర్ధనాచార్యుఁడు ధ్వన్యాలోకంబున శిశుపాలవధలోనిశ్లోకంబులను దాహరించుట చేఁగూడఁ పైకథ యవిశ్వసనీయంబనియు మాఘుఁడంతకంటెఁగూడఁ గడుఁబూర్వుఁడనియుఁ దేటపడుచున్నది. ఇదియుట్లుండఁగా, భారవిజీవితములో వ్రాసినట్లుగా శార్మణ్యదేశీయుఁడగు యాకోబీపండితునియభిప్రాయంబననితఁడుతప్పక యాఱవశతాబ్దము మధ్యభాగములోనివాఁడని తెలియుచున్నది. మఱియుఁ దారానాథతర్కవాచస్పతివాచస్పత్యకోశంబున మాఘపదంబున కర్థము వ్రాయుచు "తావద్భాభారవేర్భాతి యావన్మాఘస్య నోదయః" (మాఘకవిపుట్టునంతవఱకు భారవికీర్తిప్రకాశించుచున్నది) అనియుద్భటుఁడు చెప్పినట్లు వ్రాయుట చేఁగూడ మాఘుఁడు భారవికి వెనువెంటనే బయలుదేఱినవాఁడని ధ్రువపడుచున్నది. కావున మాఘకవి ౫౫౦ ప్రాంతమున శిశుపాలవధకావ్యము రచించియుండునని విశ్వసింపవచ్చును.

ఈకవి బ్రాహ్మణుఁడు; ఉత్తమవంశసంభూతుఁడు. కావ్యాంతమున వ్రాసికొనిన స్వవంశవర్ణనపద్యములంబట్టి యితఁడు § శ్రీవర్మలరాజు రాజ్యంబున సర్వాధికారపదమునొందిన సుప్రభదేవునకుఁ బౌత్రుఁడును

§ ఈరాజుపేరు కొన్నికొన్నిపుస్తకములలో ధర్మనాభుఁడు, ధర్మలాతుఁడు, వర్మనాముఁడునని నానావిధములుగానున్నది. మల్లినాథుఁడాచివరిశ్లోకంబులకర్థము వ్రాయలేదు. కావుననవి సంశయాస్పదములని కొందఱనుచున్నారు.

సత్యసంధుఁడు నుదారుఁడు నగుదత్తకునకుఁబుత్రుండునని తెలియుచున్నది ఇతఁడు తననివాసస్థానమును జెప్పకపోయినను బెకరాంద్రుతలంచినట్లు గూర్జరదేశస్థుఁడని చెప్పవచ్చును. కవిత్వమును బట్టి యీతఁడు శబ్దతర్కవేదాంత శాస్త్రములయం దధికసమర్థుఁడనియూహింపవచ్చును.

ఇక్కావి మస్తశిక్షకుఁడగు శ్రీకృష్ణుఁడు శిశుపాలునిఁజంపుటయను భాగవత గాథను జక్కాగావివరించి ప్రౌఢశైలిలో నిరువదిసర్గలమహాకావ్యమును రచించెను. ఇంతకంటెనితఁడు వ్రాసినమఱియొక కావ్యమేదియుఁగనుపడదు. కాని, క్షేమేంద్రుఁడుతనయౌచిత్యవిచారచర్చలో మాఘునిదని యుదాహరించిన "బుభుక్షితైర్వ్యాకరణం నభుజ్యతే పిపాసితైః కావ్యరసో నపీయతే। నవిద్యయా కేనచిదుద్ధృతం కులం హిరణ్యమేవార్జయ నిష్ఫలాః కలాః॥" అనుశ్లోకమును, వల్లభదేవుఁడు సుభాషితావళిలో మాఘునిదని వ్రాసిన "శీలం శైలతటాత్పతత్వభిజనస్సందహ్యతాంవహ్నినా। మాశౌషం జగతిశ్రుతస్యపిఫలక్లేశస్య నామాప్యహం। శౌర్యేవైరిణీ వజ్రమాశునిపతత్వర్థో౽స్తు మేసర్వదా। యేనైకేనవినాగుణాస్తృణబుసప్రాయాస్సమస్తాఅమీ॥ నారీనితంబఫలకే ప్రతిబధ్యమానా హంసీవ హేమరశనా మధురం రిరాస। తన్మోచనార్థమివ నూపురరాజహంసాశ్చక్రందురార్తముఖరం చరణావలగ్నాః॥" అనుపద్యములును నితఁడురచించినయింకొకగ్రంథమేదయినఁగలదేమో యను సంశయమును గలిగించుచున్నవి. కాని వీనిలో రెండవశ్లోకము భర్తృహరినీతిశతకములోఁగూడఁ గనుపడుటచేతను క్షేమేంద్రవల్లభదేవులు భర్తృహరిమాఘులకుఁ బెక్కుశతాబ్దములతరువాతివారగుటచేతను వాడుకనుబట్టి పైనీతిపద్యములకర్తృత్వ మెవరికెవరిప్రమాదంబుననారోపింపఁబడినదో మనమూహింపఁజాలము. ఒకవేళనిజముగాఁ బైమూఁడుపద్యములు మాఘకవిరచించినవేయనియూహింపదగినయెడల రెండవనీతిపద్యము భర్తృహరినీతిశతకములోఁ దరువాతనెవ్వరో యధికముగాఁ జేర్చియుందురని నమ్మవలసియుండును.

ఈతనిశిశుపాలవధకావ్యమునకు వల్లభదేవుఁడు, రంగరాజు, ఏకనాథుఁడు, చారిత్రవర్ధనుఁడు, మల్లినాథుఁడు ననుపెక్కండ్రువ్యాఖ్యానములువ్రాసిరి. కాని మల్లినాథసూరి సర్వంకషావ్యాఖ్య హిందూదేశమంతటను వల్లభదేవుని సందేహవిషౌషధవ్యాఖ్య కాశ్మీరదేశంబునను ప్రఖ్యాతిచెందియున్నవి. ఈతనికవిత్వము కఠినమైనదైనను సారస్యము నర్థగాంభీర్యమునుగలదియని "ఉపమా కాళిదాసస్య భారవేరర్థగౌరవం। దండినః పదలాలిత్యం మాఘేసంతి త్రయోగుణాః॥ నవసర్గగతే మాఘే నవశబ్దో నవిద్యతే।" యనుపండితవచనంబులును, "మాఘే మేఘే గతంవయః" అనుమల్లినాథసూరివచనంబును దెల్పుచున్నవి. లోకంబునఁ బఠనపాఠవ్యవహారంబునఁ బంచకావ్యములలో వన్నెకెక్కినయీకావ్యమును గూర్చి యధికమేమియువ్రాయనక్కఱలేదు. ఇతఁడు భారవివలెనే చిత్రయమకబంధకవిత్వప్రియుఁడై భాషలోఁదనకుఁగలయధిక పాండిత్యమును వెల్లడించెను. ఈకావ్యంబున యదునందనుఁడు నాయకుఁడు. శృంగారాది రసములతోఁగూడిన వీరము ప్రధానరసము. మహాకావ్యలక్షణంబులగు నష్టాదశవర్ణనంబులు సిద్ధంబులు. ఇంద్రప్రస్థగమనాద్యుపాయవిషయంబైన శిశుపాలవధ ఫలము. అట్టియికావ్యమెవరిహృదయంబు నాకర్షింపకపోవును? రుచిచూచుటకిందుండి రెండుపద్యముల నుదాహరించెదను.

‡ అన్యథా భూషణం పుంసాం శమో లజ్జేవ యోషితాం।<br>
పరాక్రమః పరిభవే వైయాత్యం సురతేష్వివ॥

† మాజీవన్ యః పరావజ్ఞాదుఃఖదగ్ధోఽపి జీవతి।<br>
తస్యాజననిరేవాస్తు జననీక్లేశకారిణః॥

---

‡ సురతవ్యతిరిక్తకాలమున స్త్రీలకులజ్జవలెనే పరాభవములేనియెడఁ బురుషులకు శమమే భూషణము. సురతకాలమున స్త్రీలకు ధార్ష్ట్యమువలెనే పరాభవమునఁ బురుషులకుఁ బరాక్రమము భూషణము.

† పరునివలన నవమానింపఁబడినవాఁడు నింద్యజీవనము చేయుచున్నాఁడు. తల్లికిఁగష్టముగలిగించినయట్టివాఁడు పుట్టకపోయిననుమేలే.

# ఆచార్య దండి.

-:0:-

"జాతే జగతి వాల్మీకౌ కవిరిత్యభిధాభవత్।
కవీఇతి తతో వ్యాసే కవయస్త్వయి దండిని॥"

అను శ్లోకోత్తర ప్రశంసకుఁ బాత్రుఁడగు నీమహాకవి కాలముగాని జీవచరిత్రగాని సరిగాఁ దెలియఁజేయు నాధారము లేవియు లేవుగాని, మేగ్డోనలు, విలియము మొదలగు పాశ్చాత్యులును, సందర్గికారులు, దుర్గాప్రసాదపండితులు మొదలగు మనదేశీయులునుగూడ నీకవి యాఱవశతాబ్దము నంతంబుననుండియుండునని భావించిరి. వారయినను సరియయిన ప్రమాణము లేవియును జూపియుండలేదు. కాని ౯ వ శతకము త్తరభాగంబుననున్న రాజశేఖరునిదని సుభాషితహారావళిలోనున్న "త్రయోఽగ్నయస్త్రయో వేదా స్త్రయోదేవా స్త్రయోగుణాః। త్రయో దండిప్రబంధాశ్చ త్రిషులోకేషు విశ్రుతాః॥" అను శ్లోకంబువలనను, ౮ వ శతాబ్దముత్తర భాగంబుననున్న వామనపండితుఁడు తన కావ్యాలంకారసూత్రవృత్తిలో నీతనిమతము న్ఖాటించినట్లుండుటవలనను వారికిఁ బ్రాచీనుఁడైయితఁడు పైని జెప్పినకాలంబుననేయుండునని విశ్వసింపవలసియున్నది.

ఈకవి రచించినవిమూఁడుగ్రంథములని లోకములోఁ బ్రసిద్ధిగలిగి యుండఁగా దశకుమారచరితము కావ్యాదర్శము నను రెండుకోశములే యీతనిపేరఁగనుపడుచున్నవి. కాని కావ్యాదర్శముఖంబున "ఛందోవిచిత్యాం సకలస్తత్ప్రపంచో నిదర్శితః" అనియుండుటచే నీతఁడురచించిన ఛందోవిచితియనుగ్రంథము గలదనికొందఱును వ్యాఖ్యాతలుదీనికిఁ బింగళకృతచ్ఛందస్సని యర్థమువ్రాయుటచేనిది యీతనిదిగాదని మఱికొందఱును, కవిహృదయమనుకావ్యమొకటి యీతనిదిగలదని యొకరిద్దఱును,

దాదృశకావ్యమే లోకమున వినఁబడ లేదని కొందఱును, మల్లికామారుత మీతనిదని కొందఱును, అది యుద్దండాపరనాముఁడగు రంగనాథకవిదని యింకఁ గొందఱును, శూద్రకరాజు పేరనున్న మృచ్ఛకటిక మీతనిదేయని కొందఱును, వీరిగుఱించు కాలికత్వాదులం దెల్పు నాధారములు లేవనియు ఱికొందఱు నివ్విధముగా భిన్నాభిప్రాయులయియుండిరి. ఎట్లయిన నీతని మూఁడవకావ్యమిద్దియని నిర్వచింప నెవరికిని శక్యముగాకున్నది.

కావ్యాదర్శము సర్వకావ్యధర్మములను దెల్పునట్టి లక్షణగ్రంథము. ఈతనికిఁ బూర్వమే లోకములో నిట్టి గ్రంథములుగలవని యాతని ప్రతిజ్ఞారూపకముగానున్న "పూర్వశాస్త్రాణి సంహృత్య ప్రయోగానుపలభ్య చ। యథాసామర్థ్యమస్మాభిః క్రియతే కావ్యలక్షణం॥" అనుశ్లోకమే చాటుచున్నది. దండికవి యీగ్రంథము రచించి యెవరికో రాజపుత్రులకు స్వయముగాఁ జెప్పెనని యొకకింవదంతిగలదు. ఇదిమూఁడుపరిచ్ఛేదములు గలది. మొదటిదానిలో గద్యపద్యాత్మక కావ్యంబుల వృత్తులు రీతులు మొదలగునవియు, రెండవదానిలో నర్థాలంకారాదిధర్మంబులును, మూఁడవదానిలో శబ్దాలంకారాదిలక్షణంబులును నిర్వచింపఁబడినవి.

ఇతఁడు లోకమునకుఁ బ్రసాదించిన మహాకావ్యము దశకుమారచరితము. ఇదియెనిమిదియుచ్ఛ్వాసములుగలది. దీనికనుబంధముగా, నైదుచిన్నయుచ్ఛ్వాసములుగల గ్రంథోపక్రమరూపంబగు పూర్వపీఠికయు, నొకయుచ్ఛ్వాసముతో నుపసంహారరూపంబగు నుత్తరపీఠికయుఁ గలవు. ఎల్లవచనకావ్యంబులలో నింతమృదుమధురశైలిగలదింకొకటి లేదనుటకు "దండినః పదలాలిత్య" మ్మనులోకోక్తియే ప్రమాణము.

ఇదిపదిమందియుత్తమబాలురచరిత్రను దెలుపు నొకచక్కని యాఖ్యాయిక. ఇందుమగధదేశమందలి పుష్పపురము రాజధానిగాఁగల రాజహంసుని కుమారుఁడైన రాజవాహనుఁడను రాజబాలుఁడు ప్రధాననా

యకుఁడు. చమత్కృతిజనకంబగు నీకిథయంతయుఁ జదువవలయునుగాని సంగ్రహించివ్రాసినంతమాత్రమున రుచింపదు. ఈవచనంబునడుమరత్నమువలెనున్న యొకపద్యమిందువ్రాసెదను.

§ కిం క్రూరం స్త్రీహృదయం।
కిం గృహిణః ప్రియహితాయ దారగుణాః।
కః కామస్సంకల్పః।
కిం దుష్కరసాధనం ప్రజ్ఞా॥

---

§ క్రూరమైన దేది? స్త్రీలమనస్సు. గృహస్థునకిష్టమైన దేది? భార్యగుణము. కామమేది? సంకల్పమే. కష్టమైనపనులసాధించున దేది? బుద్ధి. అనిప్రశ్నోత్తరములు.

# శూద్రకరాజు.

-:0:-

ఈకవికాలము నెవ్వరు నింతవఱకు స్థిరపఱచియుండలేదు. కాని, యమ్. విలియము, విల్సను పండితులిరువురునుగూడ నితనిఁ గ్రీ॥ ౨ వ శతాబ్దములోఁజేర్చిరి. ఇందులకుఁ గలియుగము 3300 ల కాలమున శూద్రకుఁడనునొకరాజు దేశపరిపాలనచేసినట్లు స్కాందపురాణములోనున్న వాక్యమే ప్రమాణముగాఁగనుపడుచున్నది. మేక్డోనలుపండితుఁడు, మృచ్ఛకటికమును దండిరచించి శూద్రకుని పేరుపెట్టియుండుననియు నీరాజు క్రీ॥ ౬౦౦ ల ప్రాంతముననుండియుండుననియువ్రాసెను. వీనిలో నెద్దానినైనను స్థిరీకరించి మృచ్ఛకటికకర్తయితఁడనినిర్వహింప నేగ్రంథాధారమును వారుచూపియుండలేదు. మఱియుఁ గాదంబరిలో బాణుఁడు వర్ణించిన శూద్రకరాజొకఁడుకనుపడుచుండెను. ఇతఁడెప్పటివాఁడోకనుఁగొనుటకునునాధారములేదు. కావున మనకవియగుశూద్రకుఁడేకాలంబు

నెందుండెనో నిర్ణయింపఁదగినయాధారంబులేవియయినఁ గనుపడువ అయినను క్రీ॥ ౨—౬ శతాబ్దములనడుమవాఁడనితలంచెదము. ఎట్లయినను క్రీ॥ ౮ వ శతాబ్దముత్తరభాగంబుననున్న వామనునికావ్యాలంకారసూత్రవృత్తిలో నీమృచ్ఛకటికములోనిశ్లోకములుండుటచేఁ దత్కర్తయగు శూద్రకుఁడంతకుఁబూర్వుఁడైయుండుననిమాత్రము తెలియుచున్నది.

ప్రస్తావనలోని “గజగమనుఁడు, చకోరనేత్రుఁడు, పూర్ణచంద్రాననుఁడు, సురూపుఁడు, క్షత్రియముఖ్యుఁడు, విశేషసత్త్వుఁడు, సమరవ్యసనుఁడు, తపోధనుఁడు, వేదవేత్త, ప్రమాదరహితుఁడు, ఋగ్వేద సామవేద గణిత హస్తిశిక్షావిశారదుఁడు నగుశూద్రకరాజు కుమారునకు రాజ్యమిచ్చి యశ్వమేధయాగమొనరించి నూఱుసంవత్సరముల పదిదినములయాయుర్దాయమువడసి యగ్నిప్రవేశముచేసెను” అనువాక్యముంబట్టి యీకవి తననాటకము తనయనంతరమభినయింపఁదగినదను భావముతో జాతకాదిగణనంబునఁ దనజీవనసమయంబునుగూడ నిందుఁదెల్పెననియు, నగ్నిప్రవేశముగూడ శరభంగమునికిఁబోలె సర్వస్వారనామకయజ్ఞవిశేషంబున విధివిహితమైయొప్పుననియు నిందువలన “గ్రంథకర్తయనంతరము గ్రంథమెట్లువ్రాసెను” ననునాక్షేపణకవకాశములేదనియు దీనివ్యాఖ్యాతలువ్రాసియుండిరి. కాని, పైవర్ణనధోరణిఁబట్టిచూడఁగాఁ గవిస్వయముగాఁ దన్నట్లువర్ణించుకొనఁడనియు నినాటకము రచించి గతించిన యీకవియనంతరమీప్రస్తావనమఱియొకఁడెవఁడో రచించియుండుననియు నూహింపనగుచున్నది. పైయంశములంబట్టి యీతఁడుక్షత్రియుఁడనియుఁ బ్రభువనియుఁ జెలుచున్నది. తఁడేదేశమును బాలించినవాఁడో తెలియుటకీనాటకంబునఁ గంఠోక్తంబగు నాధారమేమియుఁగనుపడదు. కాని, యీనాటకంబునఁ బ్రధానముగాఁ బ్రసంగింపఁబడిన యవంతీపురవర్ణనము చూడఁగా నీతఁడుజ్జయినీప్రాంతరాజ్యము నేలెనేమోయని సంశయము గలుగుచున్నది.

ఈకవి రచించినది మృచ్ఛకటికముగాక యితరంబేమియు లేదు. ఇది పదియంకములనాటకము (ప్రకరణము) ఇందు శృంగారము ప్రధానరసము. ధీరశాంతుఁడగు చారుదత్తుఁడు నాయకుఁడు. గుణానురక్తయు వేశ్యయునగువసంతసేనకథానాయిక. ఈనాటకమాఱవయంకములో సువర్ణశకటికకై విలపించు చారుదత్తునికుమారుఁడగు రోహసేనునకు దాసియగురదనిక క్రీడార్థముగా మృత్తికాశకటికనిర్మించి యిచ్చెననుకథాభాగంబునే ప్రధానముగాఁజేసికొని కవిదీనికి మృచ్ఛకటికమనుపేరుపెట్టినట్లు కనుపడుచున్నది. కాని కథమాత్రము విశేషముగాదీనికేమియు సంబంధింపక యతివిచిత్రముగానున్నది. కథాకల్పనలో దీనికిఁబోలినది ముద్రారాక్షసముగాక మఱియొకటి లేదనవచ్చును.

ఉజ్జయినిలో నుదారుఁడు సత్యవాదియు యశోరాశియు సుగుణవంతుఁడు నగుచారుదత్తుఁడను బ్రాహ్మణుఁడు వాణిజ్యంబున ధనముగోల్పోయి పరమదరిద్రుఁడయియున్నయెడ నీతనిసుగుణసంపదవిని యీతనియందనురక్తయైన యప్పురనివాసినియు వారనారీమణియు నగువసంతసేన, యధికధనమొసంగెదనని నిర్బంధపెట్టు గుణహీనుఁడు రాజశ్యాలకుఁడు నగుసంస్థానకునకువశపడక స్వయముగానీతనియింటికివచ్చి యీతనిపైఁబ్రేమచూపి తనయాభరణంబులదాఁచునెపంబున నితనిచేతికిచ్చి వెళ్ళును. వసంతసేనచేటిక యగుమదనికనువరించిన శర్విలకుఁడను బ్రాహ్మణచోరుఁడు చారుదత్తునియింటనర్ధరాత్రంబునఁ గన్నమువేసి ప్రవేశించి యావస్తువులనపహరించి తెచ్చి వసంతసేనకిచ్చి మదనికనువిడిపించితీసికొనిపోవును. మఱునాఁడు చారుదత్తుఁడు పరధనమునుపోఁగొట్టితి నేమిగతి యనివిచారించు వేడ నాతనిభార్య పతిసత్యభంగముగాకుండఁగాఁ దనమెడలోనిరత్నహారమునుదీసియిచ్చెను. దానినతఁడు వసంతసేనవస్తువులకు బదులుగాఁబంపును. అంతవసంతసేన చారుదత్తునియింటికివచ్చి తనవస్తు

వులవృత్తాంతముచెప్పి రత్నహారమును మరలనిచ్చి యాతనివరించి నాఁటిరాత్రి యందుండి మఱునాఁడుదయమున జీర్ణోద్యానంబున కేగిన చారుదత్తునిఁగలిసికొనబయలు వెడలి ప్రమాదవశమున వీథిలోసిద్ధముగానున్న రాజశ్యాలకునిబండియెక్కి యాతనినందనంబునకు వెళ్ళెను. అంతవాఁడు దానినిమిక్కిలినిర్బంధించి వశపడమిని దానిమెడపిసికి పడవైచి చచ్చినదనితలంచి "వసంతసేనను జారుదత్తుఁడుచంపె" ననులోకప్రవాదము కల్పించి శిక్షాధికారులకువిన్నవింపనేగెను. అంతఁబూర్వము చారుదత్తుని సేవకుఁడు నొకసారి వసంతసేనవలనఁగాపాడఁబడినవాఁడు నిపుడుబౌద్ధశ్రమణకవేషంబుననున్నవాఁడు నగుసంవాహకుఁడనువాఁడాదారినివచ్చి యపుడే మూర్ఛదేఱినవసంతసేననుజూచి లేవనెత్తి మెల్లగాఁదీసికొనివెళ్ళును. పిదప రాజశ్యాలకునిమాటవిని వసంతసేనతల్లినిఁ జారుదత్తునిరావించి విచారించి యధికరణికులు నాయకునియెడదోషముమోపి పాలకుఁడనుతమరాజునకెఱిఁగించి యాతనియానచే నతనికి శూలారోపణశిక్ష విధించిరి. అంతఁజండాలురతనిని వధ్యస్థానమునకుఁదీసికొనివచ్చి చంపనుద్యమించునంతలో శ్రమణకవసంతసేనలచటికివత్తురు. ఆతనిమరణము తప్పును. అంతలో దుర్వినీతుఁడగు పాలకరాజునుజంపి పూర్వమునాయకునిచే నుపకృతినొందిన యార్యకుఁడనువాఁడురాజై చారుదత్తునికిఁ గొంత రాజ్యభాగమిచ్చును. పిదపఁ జారుదత్తునిభార్యాపుత్రులు, వసంతసేన, నాయకునితోసుఖముగానుందురు. ఇదికథాసారసంగ్రహము. ఇందుదారిద్ర్యము దానివలనికష్టములు; జూదము దానియనర్థములు; చౌర్యము అందలినైపుణి; వ్యవహారము దానిముష్టత్వము; ప్రభుత్వము అందలియవివేకము; సత్యము దానియుపయోగము; వేశ్య దానిసునీతి; దుర్మార్గులు వారిస్వభావములు; అనునివిలోకజ్ఞానదాయకములుగా నభివర్ణింపఁబడినవి. ఈకవిమహారాజయ్యు నింతయతీతముగా లేమినెట్లువర్ణించెనని యాశ్చ

ర్యముగలుగును. దీనింగూర్చి చారుదత్తునివాక్యములఁ దెలుఁగుననిందువ్రా
సెదను. "కటికిచీఁకటిలో దీపదర్శనమువలె దుఃఖములలో సుఖముచ
క్కఁగనేయుండును. కాని, చిరకాలముసుఖమనుభవించి దరిద్రుఁడగువాఁ
డు జీవన్మృతుఁడేయనఁదగును. అల్పక్లేశకరము మరణము. అనంతదుఃఖ
కరము దారిద్ర్యము. ఈరెంటిలోమరణమేయుత్తమము. అదృష్టవశమున
ధనమువచ్చును. పోవును. అందులకువిచారములేదుగాని సంపదతొలఁగఁ
గానే మైత్రినుండిమిత్రులుగూడఁదొలంగుదురనునిదియే దుఃఖకరముగా
నున్నది. లేమివలన సిగ్గును, దానివలనఁదేజోహానియు, దానిచేనవమాన
మును, నద్దానమనోవైకల్యము, దానిచే బుద్ధిరాహిత్యము, దానన నాశన
ముసంభవించును. ఆహా! నిర్ధనత్వమెల్లయాపదలకుమూలముగదా! బం
ధువులు మాటాడరు. మిత్రులాదరింపరు. విపత్తులుచుట్టుకొనును. అక
టా! దరిద్రునిగతియేమి? ఇతరులుచేసిననేరమునకుఁగూడఁదానే యాస్ప
దమగును. దరిద్రునితో నెవ్వఁడునుఁజెలిమిచేయఁడు. ధనికులగృహంబు
లకుత్సవంబులఁజేరిన నతని వారుతృణప్రాయముగాఁజూతురు. వస్త్రాద్య
లంకారములులేనికారణమున గొప్పవారికిదూరముగానుండవలసివచ్చును
వేయేల? లేమి యాఱవమహాపాతకమే."

మఱియు, వేశ్యాదూషణవచనంబులిట్లెంతయు నీతిప్రదములుగా
నున్నవి. "వేశ్యలలో శుచిత్వమనునదియసంభవము. ధనమనెడుఫలము
లుగలసత్పురుషులనెడువృక్షములు వేశ్యలనెడుపక్షులచే భక్షింపఁబడిని
ష్ఫలత్వమునొందుచున్నవి. వారకాంతలు ధనకారణంబున నవ్వుదురు;
ఏడ్చుదురు. నమ్మింతురు. తామునమ్మరు. కావునవారిని శ్మశానపుష్పము
లవలె విడువఁదగును. వెలవెలఁది మనస్సులోనొకనినిఁదలఁచి మఱియొ
కనిఁజూపుచేఁబిలిచి యింకొకనియెడననురాగముచూపి తుదకొక్కనిశరీ
రంబునఁగామించును". మఱియు నాయకునిసచ్చరిత్రకొకటిరెండుదాహ

రణములు — మొదట వసంతసేనవచ్చి తనయెదుట నిలువఁబడినపుడు చారుదత్తుఁడు, “శరన్మేఘమునఁగప్పఁబడిన చంద్రలేఖవలెనున్నది ఈ మెయెవతె?” అనుకొని “పరభార్యచూడఁదగినదికాదుగదా” యని మరలెను. పిదపబోగముదియని తెలిసి “కాపురుషునికోపమువలెనే యేకాంతమూలముగా జనించినకామము ధనహీనుఁడనగు నాగాత్రములయందే యణఁగుచున్నదో యీవసంతసేనయా?” యనిమరల ననురాగంబునఁ జూచెను. వసంతసేనవస్తువులు దొంగయపహరించినపిదప మఱియు నితఁడు “బిచ్చమెత్తియైనను సంపాదించి దానివస్తువులకుబదులుగా ధనమిచ్చెదనుగాని, నాసచ్చరిత్రకుభంగముగలుగ సత్యము నుపిడువను” అనెను.

మఱియుఁ జారుదత్తునివరించిన వసంతసేనమాటలెంతయు వేశ్యాజాతి కేకాక లోకమునకుఁగూడ మంచినీతినిచ్చుచున్నవి. తన్నునిర్బంధించు రాజశ్యాలకునుగూర్చి నాయిక — “ఓదుష్టచరిత్రా! పవిత్రురాలను సచ్చరిత్రగలదానను నన్నేల ధనముచేనాశపెట్టెదవు? సువాసనయు మకరందమునుగలిగిన పద్మమును మధుపములువిడిచిపెట్టునా? కులశీలములు గలవాఁడు దరిద్రుఁడైనను బ్రయత్నమునఁబొందఁదగును. తమకుఁదగినవారినిబడయుటయనునది పణ్యస్త్రీలకుఁ బరమశోభగదా?”

ఈతఁడుపయోగించిన యుపమానంబులు మిక్కిలిలోకానుభవమునుబోధించుచున్నవి. చూడుఁడు.

1 “అసత్పురుషసేవేవ దృష్టిర్విఫలతాం గతా।”
(అనఁగా) చీఁకటిలోదృష్టి కాపురుషునిసేవవలెనే వ్యర్థమగుచున్నది.

2 “అదృశ్యరూపా చపలాజరేవ యా మనుష్యసత్త్వం పరిభూయ వర్తతే।” (అనఁగా) కనుపడనిదై చంచలమై ముసలితనమువలెనే నిద్ర మనుష్యునిశక్తి నతిక్రమించి క్రమ్ముచున్నది.

---

ఈనాటకకాలమున బౌద్ధమతమభివృద్ధిలోనున్నట్లే కనుపడుచున్నది.

* "వర్షోదకముద్గిరతా శ్రవణాంతవిలంబినా కదంబేన।
ఏకస్తనోభిషిక్తో నృపసుతఇవ యౌవరాజ్యస్థః॥"

మఱియు లోకానుభవంబునకింకొకయుదాహరణము.

§ "ధనైర్వియుక్తస్య నరస్య లోకే కిం జీవితేనాదితఏవ తావత్।
యస్య ప్రతీకారనిరర్థకత్వాత్కోపప్రసాదా విఫలీభవంతి॥"

---

* వర్షబిందువులవిడుచుచుఁ జెవితుదనున్న కదంబపుష్పముచే, యువరాజ
రాజబాలునివలెనే వసంతసేన స్తనమొకటి యభిషిక్తమైనది.

§ లోకములో ధనములేనివానిజీవనమేల? అతనికోపంబును, అనుగ్రహంబు
గూడఁ బ్రతిక్రియాశూన్యంబులై వృథాయగునుగదా?

# బాణభట్టుఁడు.

—:0:—

ఇతఁడు బ్రాహ్మణుఁడు; ఆపస్తంభసూత్రుఁడు. వాత్స్యాయన
ంశసంభూతుఁడు; శోణానదికిదక్షిణముగానున్న ప్రీతికూటమనుగ్రామ
తని మొదటినివాసస్థలము; ఈతనితండ్రి చిత్రభానుఁడు. తల్లిరాజదేవి.
తనికిఁ జంద్రసేనమాతృషేణు లను పారశవులగు నిరువురుభ్రాతలుగల
. పారశవుఁడనఁగాఁ బెండ్లియాడినశూద్రస్త్రీయందు బ్రాహ్మణునకుజ
ంచినవాఁడనియర్థము. దీనింబట్టి కొన్నివందలసంవత్సరములక్రిందటివఱ
ను మన్వాదిధర్మశాస్త్రానుసరణముగా బ్రాహ్మణాదులు తమక్రిందిజా
కన్యలనుగూడఁ బెండ్లిచేసికొనుచుండిరని తెలియవచ్చుచున్నది. భా
కవియగు నీశానుఁడీతనికిఁ బరమమిత్రుఁడు. ఇంకనీతనివంశంబును వి
న్మిత్రపరిచరవర్గంబును వివరముగా వర్ణింపఁబడినది. ఈయెల్లయంశం
లకు నీతనిహర్షచరిత్రమేప్రమాణము. ఇతఁడతిభూధనసంపన్నుండయ్యు

బాల్యంబుననే యధీతవేదవేదాంగుఁడై గార్హస్థ్యసుఖములనుభవించుచు స్వగ్రామంబుననున్నకాలంబునఁ దనకవిత్వపాండిత్యాతిశయంబువిని న శ్రీహర్షమహారాజునాజ్ఞచే నతనిసోదరుఁడగు § కృష్ణభూపాలుఁడు తన కై యొకసందేశహరునిఁబంప నితఁడాతనిమాటనతిక్రమింపఁజాలక శ్రీహర్షచక్రవర్తియాస్థానమునకువచ్చినట్లు హర్షచరిత్రలోఁగనుపడుటచే నీబాణుఁడాహర్షునకు సమకాలికుఁడై యాతనిసంస్థానంబున నున్నవాఁడని స్పష్టపడుచున్నది.

ఈశ్రీహర్షుఁడే హర్షవర్ధనుఁడనియు ద్వితీయశిలాదిత్యుఁడనియువ్యవహరింపఁబడినట్లు దేశచరిత్రలు వాకొనుచున్నవి. తూర్పునఁ గళింగదేశమును దక్షిణమున నర్మదానదివఱకును బశ్చిమమున వల్లభీరాజ్యమును నుత్తరమున నేపాళరాజ్యమును స్వాధీనపఱచుకొని యవ్యాహతముగ శత్రురాజులనణఁచి వీరాతివీరుఁడనిప్రసిద్ధికెక్కిన యీసార్వభౌముఁడు క్రీ॥ ౬౦౬ మొదలుగా ౬౪౮ వఱకుఁ గన్యాకుబ్జంబు రాజధానిగా నుత్తరహిందూదేశమేలినట్లు కనుపడుచున్నది. బాణుఁడీతనియుదంతమునే వ్రాసినకతనెల్లవిమర్శకుల నిశ్చితాభిప్రాయమగుటచేనీకవి క్రీ॥ ౭ వ శతాబ్దంబుపూర్వభాగంబున శ్రీహర్షచక్రవర్తియాస్థానమలంకరించి కాన్యకుబ్జంబున నివసించియుండెనని విశ్వసింపవచ్చును.

ఈకవి ప్రథమవయస్సునఁ జండీశతకపార్వతీపరిణయనాటకంబులను, సకలసామ్రాజ్యలక్షణలక్షితుఁడగు హర్షుఁడు కృతినాయకుఁడుగాఁగలిగి మృదుశైలీవిభాసితంబగు హర్షచరిత్రమును మధ్యమవయస్సునను, విద్వజ్జనవదనసదనంబై సుకవికంఠభూషణంబై కుకవిమనశ్శల్యంబై “ బాణోచ్ఛిష్టం జగత్సర్వ ” మ్మను పండితలోకోక్తికినిదానంబై యుత్తమశైలీనిబద్ధంబగు కాదంబరీపూర్వభాగంబునంతిమవయస్సునను గ్రమము

§ ఇతఁడుగూడ హర్షవర్ధనుని భ్రాతయయినట్లున్నది.

గారచించినట్లు తోఁచుచున్నది. కాని యీతని యితరగ్రంథములలోవలె రసపుష్టియు వర్ణనానైపుణంబును దీనియందు లేకపోవుటచేతను, ప్రసిద్ధాలంకారగ్రంథములలో దీనిపేరెక్కడ నుదాహరింపఁబడకపోవుటచేతను దీనికథ కేవలము శబ్దార్థంబులఁ గుమారసంభవకావ్యమునకనుకరణమైనాటకోచితకల్పనంబు లేనిదియగుటచేతను, పార్వతీపరిణయనాటకంబీబాణునిదికాదనియు దీనినిరచించినవాఁడు వామనబాణుఁడను నింకొకకవియై యుండవచ్చుననియు నేతదితరప్రబలాధారశూన్యంబుగ వ్రాసినయొకపండితునియభిప్రాయంబుపై « పార్వతీపరిణయనాటకము సరసముగాలేదు. గావున నే తప్పకబాణభట్టునిదనినన్నుఁదగును. ఏమనఁగా—చండీశతకమును హర్షచరితీయపద్యములను జూచినయెడల నీతనిపద్యకవిత్వమంతరుచికరముగాదనియే తేలుచున్నది. ఇదియుంగాక దృశ్యశ్రవ్యకావ్యములరీతిభిన్నముగానుండుననుట నిర్వివాదము. దీర్ఘపదవాక్యభూయిష్ఠంబగు మహావర్ణనము గద్యకావ్యమునకుంబోలెఁ బద్యకావ్యమునకు సరిపడదుగదా. మఱియుస్వకపోలకల్పితంబు సరసవర్ణనంబునగు శృంగారభూషణమును రచించిన వామనబాణున కీనీరసనాటకకర్తృత్వమారోపించుట యనుచితంబు. కావున బాణభట్టుఁడు పార్వతీపరిణయంబురచించెనని చిరకాలమునుండివచ్చుచున్న ప్రవాదమునుల్లంఘనీయ" మని వ్రాసిన యొకానొకవిమర్శకునియభిప్రాయంబు మూలచ్ఛేదికాకుండుటచేతను, కాదంబరీశైలికిఁబాటువడినకొందఱికీరూపకమీతనిదిగాదనుతలంపుగలుగుట సహజమేయగునప్పటికిని, హర్షచరిత్రకాదంబరులలోవలె దీనిప్రస్తావనలోఁగూడ « అస్తి కవిసార్వభౌమో వాత్స్యాయనవంశసంభవో బాణః" యనుకవిస్వకథనంబు సమానార్థకంబుగానుండుటచేతను, వయోఽవస్థాభేదంబునఁ గవితాశైలీభేదంబుగూడఁ గలుగుననుటసత్యమేయని కాళిదాసాదిమహాకవికావ్యపరిశీలకులకనుభవపూర్వసిద్ధంబగుటచేతను, పరిశీలిం

చిచూడఁగాఁ గల్పనయందు వర్ణనమందును శైలియందును బాకమునం దును రసమునందు నౌచిత్యమునందునుగూడ నపరిపక్వంబగు నీనాటకము తప్పక యీతనిబాల్యప్రయత్నమైయుండుననుభావంబును హిమవంతుఁడు మేనకతోఁ దమపుత్రికయగు పార్వతికిఁబెండ్లివయస్సువచ్చినదని వర్ణించి చెప్పిన లౌకికజ్ఞానబాహ్యంబగు "ఆభోగశాలి కుచకుట్మల మాయతాక్ష్యా। వక్షోఽస్యఖాకాశమభివాంఛతి సన్నిరోద్ధుం। అప్యస్తి నాస్తి వచసాం విషయేఽవలగ్నే। తన్వీసముల్లసతి కాచనరోమరేఖా॥" అనుపద్య మేనకకుబోధించుచుండుటచేతను, కాదంబరివంటి ఘనకావ్యమువ్రాసిన మహాకవికీసామాన్యరూపకకర్తృత్వమారోపింపమా యనునభిమానంబు ననుమానంబునువిడిచితేమేని తప్పకబాణుఁడే బాల్యంబునఁ బార్వతీపరిణయంబురచించియుండునని నిశ్చయింపవచ్చును.

ఇదిదైదంకములనాటకము దీనిశైలికఠినమైనదికాకపోయినను గల్పనవర్ణనాదులయందును సదలంకారములయందును, ప్రౌఢముగాక సరసజనరంజకంబుగాలేదని యుపమానాదులయెడ నసంఖ్యముగాగ్రహింపఁబడిన చంద్రచంద్రికావంద్రకలాశబ్దంబులే వాకొనుచున్నవి. అయిన దీనినుండి యొకపద్యముదాహరించెదను.

†"అవలోకనాయ లోలా దృష్టిరియం మృగదృశో నివృత్తిమతీ।
గత్వా ప్రతిప్రవాహం రాజతి శఫరీ నివర్తమానేవ॥"

హర్షచరిత్రమెనిమిదియుచ్ఛ్వాసముల గద్యకావ్యము. ఇదిబాణభట్టహర్షరాజులయొక్క వంశవర్ణనంబునకును జీవనచరిత్రకును నాదర్శముగానున్నది. మొదటిరెంటిలోను బాణకవినిహర్షుఁడురప్పించుట, యతఁడు రాజసభకేగుట. రాజతనియెడ మనస్సులోననురాగముగలవాఁడయ్యె

---

† భర్తనుజూడవెడలిన పార్వతిదృష్టి సిగ్గుచే మరలినదై ప్రవాహమునకెదురేగి మరలిన చేఁపవలెనే ప్రకాశించుచున్నది.

మొదటఁబైకి ననాదరభావముచూపుట పిదపఁగ్రమముగా నత్యంతమైత్రిఁ గనఁబఱచుట మొదలుగాఁగల వృత్తాంతము వివరింపఁబడినది. మూఁడవదానిలో—బాణకవి యొకనాఁడు బంధుగృహంబున కేగి సకలజ్ఞాతివర్గంబుతో నాసీనుఁడై యుండ సుదృష్టియనువాఁడు వాయుపురాణంబు చదువుట, వంది యదివిని యీపురాణము హర్షచరిత్రకంటె భిన్నముగా లేదని చెప్పుట, దానిపై బాణుని పినతండ్రికొడుకు శ్యామలుఁడు "హర్షరాజు మూలపురుషుఁడు మొదలుగా భార్గవవంశంబును దెల్పుచు హర్షచరిత్రవర్ణింపు" మని బాణుని వేఁడుట, యంతనతఁడా వంశవర్ణనకుపక్రమించుటయును కథాభాగము వర్ణింపఁబడినది. నాల్గవదానిలో—పుష్పభూపతిపుత్రుఁడగు ప్రతాపశీలుఁడను నామాంతరంబుగల ప్రభాకరవర్ధనుఁడు రాజ్యము చేయుట, యతనికి యశోవతియను ధర్మపత్నియందు రాజ్యవర్ధనుఁడు హర్షుఁడునను పుత్రులును రాజ్యలక్ష్మియను పుత్రికయు జన్మించుట, సంప్రాప్తయౌవనులగు కుమారులకుఁ దండ్రి నీతినుపదేశించుట, కుమారికకుఁ బెండ్లి సేయుటయను భాగములు వర్ణింపఁబడినవి. ఐదవదానిలో—జనకుని యానతిచే రాజ్యవర్ధనుఁడు హూణరాజులపైదండెత్తనుత్తరదిక్కునకుఁ బోవుట, యశోవతీప్రభాకరవర్ధనుల మరణము హర్షునివిచారము చెప్పఁబడినవి. ఆఱవదానిలోఁ బితృమరణదుఃఖితుఁడగు రాజ్యవర్ధనుఁడువచ్చి తాను రాజ్యము నొల్లనని యస్త్రసన్న్యాస మొనరించి తమ్మునకు రాజ్యమిచ్చుట, హర్షుఁడు కడువిచారించి మాలవరాజు తమబావమఱదిని జంపి తమచెల్లెలిని గాన్యకుబ్జంబునఁ జెఱలోఁబెట్టెనని విన్నవించుట, యదివిని యతఁడుద్దీపితకోపుఁడై మఱలఁ గృపాణపాణియై మాలవరాజుకులమునున్మూలింప వెడలి తత్సైన్యంబును సంహరించి యస్త్రములు విడిచియున్నకాలంబున మోసంబున నాగౌడాధిపుఁడతనిని జంపుట, యావృత్తాంతమును విని హర్షుఁడు కాలానలోగ్రుఁడై "కొన్నిదినములలో గౌడవంశమును నిర్మూలింప

కపోయితినేని యగ్నిలోఁబడి మృతినొందుదు" ననికఠినప్రతిజ్ఞ చేయుటయును నవి విశదీకరింపఁబడినవి. ఇఁక సప్తమాష్టమ భాగంబులలో హర్షుఁడు తన ప్రతిజ్ఞ నెఱవేర్చి కాన్యకుబ్జంబు నాక్రమించుట, కారాగారమునుండి తప్పించుకొని సపరివారముగా వింధ్యాటవికిఁబోయిన తనసోదరిని వెదకి పట్టుకొనుట, యొకమునివలన నేకావళి యనుముక్తాహారమునుబడయుట, సర్వదిగ్విజయజిగీష యనువిషయంబులభివర్ణింపఁబడినవి. ప్రతిప్రకరణము లోని సారమాయాభాగముల మొదటనొకటి రెండుపద్యములలోవ్రాయఁ బడినది. స్వాశ్రయభూతుఁడగు సార్వభౌముని చరితము వర్ణించుటయందును, బూర్వకవికావ్యముల సగౌరవముగావర్ణించుటయందును నుత్తమపదవికి నర్హుఁడగునీకవి యీకావ్యముఖంబున వ్యాస, భట్టారహరిచంద్ర సాతవాహనప్రవరసేన భాసకాళిదాసాఢ్యరాజకవులను, వాసవదత్తాబృహత్కథలనుగొనియాడెను.

కాదంబరి—ఈపేరుగలస్త్రీ కథానాయికగాఁగలుగుటఁ గవిదీనికీపేరు పెట్టియుండును. కాని, ముఖ్యపాత్రసూచనము గ్రంథాదినుండి యుండుట యాఖ్యాయికలకు నావశ్యకమగు రసకారణమైయుండఁగా నిందుఁగథలోఁజాలభాగముగతించిన వెనుక దానితో నేసంబంధమును లేనట్లుగాఁగాదంబరీప్రవేశము మధ్యభాగమునఁ గనుపడుటచేతను, గ్రంథమాద్యంతము కథానాయకుఁడగు చంద్రాపీడునియుదంతము చెప్పుచుండుటచేతను, దీనికిఁ జంద్రాపీడచరితమని పేరున్న బాగుగానుండునని తోఁచుచున్నది. అయిననీకథ గుణాఢ్యునిబృహత్కథలోని కాదంబరికథననుసరించి వ్రాయఁబడినదిగావునఁ గవియీపేరు పెట్టియుండునని మనముసమాధానముచేసికొనవచ్చును. సంస్కృతభాషలో లెక్కకుమిక్కిలితక్కువగానున్న వచనప్రబంధములలో దీనికున్నగౌరవము మఱియొద్దానికిని లేదు. బాణభట్టకవిబ్రహ్మ తనయనన్యసామాన్యంబగు పరిశీలనశక్తి, కల్పనాచా

తుర్యము, వర్ణనాసౌందర్యము, సాహిత్యసంపద, భాషాస్వాతంత్ర్యము ననునైదురంగులతోఁ జిత్రకలానైపుణ్యంబునఁ గాదంబరినిరచించి సార్వ జనీనం బగునీతి యనుజీవంబువోసెనో యనఁదగునీకావ్యము సంస్కృతి వాఙ్మయంబున ఘనయశస్సుగాంచినదనుటకు, ,, కాదంబరీ రసజ్ఞానామాహారోఽపి నరోచతే " యనుపండితలోకోక్తియేనిదర్శనము. కాని, యతి కఠినమూతనపదంబుల నుపయోగించుట సమాసము దీర్ఘములై రెండర్థములతో దుర్గ్రాహంబులుగానుండుట, కొన్నిచోట్లఁ రెండవయర్థమునిరర్థకముగానుండుట, మఱికొన్నిచోట్లఁ గర్తృపదంబునకు మూఁడునాలుగు పుటలుదాఁటినవెనుకఁగాని క్రియాపదముతోనన్వయములేకుండుట, విశేష్యంబుల విశేషణంబులును, విశేషణంబుల విశేషణంబులును వానివిశేషణంబులునుగలిసి యన్వయకాఠిన్యమునుగలిగించుట, కథగూడ నమానుషచర్యలందెలుపుచు నైజముగానుండకుండుట మొదలుగాఁ గొన్నియంశంబులు కవిపాండిత్యప్రకర్షమును దెలుపుటకుమాత్రమే యుపయోగపడుచుఁ గథాసారస్యమునకు భంగముగలిగించుచున్నవని కొన్నియాక్షేపములుచూపుచు సర్వసాధారణంబులగు మనుష్యావస్థలను, బ్రాసాదములను బురంబులను, మున్యాశ్రమంబులను, వనంబులను, హిమాలయంబును, అచ్ఛోదసరస్సును, మహాశ్వేతాప్రస్తావమును, మిగులనైజముగావర్ణించి దీనియందుఁ గవియసాధారణప్రతిభాచాతుర్యంబుఁజూపెనని వీబరుమొదలుగా నన్యదేశీయవిమర్శకులుగూడ నీకావ్యమునధికముగాఁబ్రశంసించిరి. పరిశీలింపఁగా నీతనికవితాశైలి వక్రముగానున్నదనుటకు రాఘవపాండవీయకర్తయగు కవిరాజుచెప్పిన ,, సుబంధుర్బాణభట్టశ్చ కవిరాజఇతిత్రయః। వక్రోక్తిమార్గనిపుణా శ్చతుర్థో విద్యతేనవా॥ " యనుశ్లోకమే ప్రమాణము.

ఈకావ్యంబున శృంగారరసముప్రధానము. కథానాయకులగు కా

దంబరీచంద్రాపీడుల పరస్పరానురాగము చక్కగాఁ గ్రమక్రమప్రవర్ధనముగా నీతిదాయకముగా వివరింపఁబడినది. తక్కుంగలపాత్రలవర్ణనంబు గూడఁ బ్రాపంచికజ్ఞానంబునకు దాహరణముగాఁజాలును. మనోహరంబగు కథకాలవాలమై గీర్వాణభాషలోనియెల్లపదములకు నిఘంటువై యుత్తమశైలీరచనంబై పండితహృదయప్రాసాదమలంకరించిన యీకాదంబరినిగూర్చి యిఁకనధికముగా వ్రాయక తారాపీడునికుమారుఁడగు చంద్రాపీడునకు యౌవరాజ్యపట్టాభిషేకసమయమునకుముందుగా మంత్రియగు శుకనాసుఁడుపదేశించిన నీతిసారసంగ్రహమింతుఁ దెలుఁగున లిఖించెదను.

“ నాయనా! చంద్రాపీడ! అఖిలశాస్త్రములనభ్యసించిననీ కుపదేశింపఁదగినదేదియును లేదు. యౌవనంబు గాఢాంధకారము. ధనసంపత్తి దారుణంబు. అగర్భరాజత్వ మభినవయౌవనత్వ మసమానరూపత్వ మమానుషశక్తిత్వ మనునిది గొప్పయనర్థపరంపర. ఎంతచదివినవానికిని జవ్వనంబునబుద్ధి కాలుష్యమొందకపోదు. చంద్రోపలంబుల శశికిరణంబులు చొరునట్లు ధీరునిచిత్తంబునకు గురూపదేశముచక్కగా నెక్కును. అదియే యభాగ్యునిచెవులకు సలిలమువలెనే పీడఁగలిగించును. కావున బాలా! విషయసుఖంబు లెఱుంగనినీ కీసమయ ముపదేశయోగ్యము దుస్స్వభావంబునకు వంశంబును వినయంబునకుఁ జనువును గారణంబులుగావు. చందనతరువునఁబుట్టు నిప్పుగాల్పదా? శాంతపఱచుజలమున్నను బడబానలముగ్రముగాదా? గురూపదేశముయోగ్యులకు నిర్మలజలస్నానము. అస్వర్ణకర్ణాభరణము. అహంకారదాహజ్వరపరీతయగుప్రకృతిగలరాజులకిది ముఖ్యావశ్యకము. కుమారా! లక్ష్మిమిక్కిలి చంచలురాలు. లభించియు లభింపకయుఁగూడ దుఃఖముగలిగించును. కులమునుజూడదు. శీలంబును గాంచదు. విద్యను వినదు. ధర్మమునననుసరింపదు. త్యాగము నాదరింపదు. జ్ఞానమును విచారింపదు. గుణమునుగోరదు. పౌరుషమును బాటింపదు.

మానమును మన్నింపరు. ఇట్టిలక్ష్మినిబరిగ్రహించి రాజులు సకలదుర్విన యంబులకుఁ బాత్రమగుదురు. పట్టాభిషేకసమయంబుననే దాక్షిణ్యము జరాసరణము, పరలోకచింత, సత్యవాదిత్వము వారినెడఁబాయును. సప్తవ్యసనంబులను సద్గుణంబులనివారు తలంతురు. అనువర్తులమాటలా దరింతురు. దర్శనమిచ్చుటయే యనుగ్రహమనియూహింతురు. ఆలోకనం బె యత్యుపకారమనుకొందురు. పలుకేబంగారమనిభావింతురు. ఆజ్ఞయే వరదానమనిస్మరింతురు. దేవతలకు నమస్కరింపరు. బ్రాహ్మణులనర్చింప రు. మాన్యులమన్నింపరు. ఎవఁడు రాత్రిందివ మున్నవి లేనివి విపరీతము గాఁజెప్పుచుఁ జేతులుగట్టుకొని యనుసరించియుండునో యతనిమాట యొట్టిదైన నాలకింతురు. ఓకుమారా! అతికష్టచేష్టాదారుణంబగు రాజ్య తంత్రంబునను మహామోహకారణంబగు జవ్వనంబునను సర్వజనసమ్మతం బుగాసంచరింపఁబ్రయత్నింపుము. ఎట్టివిద్వాంసునైన నెట్టిధీరునైన నెట్టి సత్కులప్రసూతునైన లక్ష్మి దుర్మార్గునిఁగాఁజేయు నన్నమాటమాత్రము మఱచిపోకుము".

——:0:——

## భూషణభట్టుఁడు.

---

ఇతఁడు బాణభట్టునికుమారుఁడు. తండ్రియనంతరమున, నసమా ప్తంబగు కాదంబరీకావ్యమును దానుసంపూర్తిగావించినట్లుగాఁ గాదం బర్యుత్తరభాగముఖంబునవ్రాసిన “యాతేదివంపితరి తద్వచసైవసార్థం విచ్ఛేదమాప భువి యస్తు కథాప్రబంధః। దుఃఖంసతాం తదసమాప్తికృ తం విలోక్య ప్రారబ్ధపవ సమయానకవిత్వదర్పాత్ ॥" అనుపద్యమువల

నఁదెలియుటచే నితఁడు ౭వ శతాబ్దంబు మధ్యభాగంబున నున్నవాఁడని నిశ్చయమగుచున్నది.

ఈయుత్తరభాగము పూర్వభాగమంత ప్రౌఢముగా లేదుగాని యితఁడు దీనిని సరసముగాఁ గ్రమముగా సమాప్తినొందించుటలో నెల్లవిధములఁ దండ్రినే యనుకరించినట్లు కనుపడుచున్నది.

చంద్రాపీడుఁడు గంధర్వరాజపుత్రియగు కాదంబరియొద్దనుండి వచ్చినపత్రలేఖవలనఁ బ్రియురాలివృత్తాంతము వినుచుండఁగా బాణుఁడీకథను డి విరమించినట్లు కనుపడుచున్నది. భూషణభట్టాతరువాతివృత్తాంతమునందుకొని ప్రియవిరహపీడిత యగుకాదంబరివచనములను బత్రలేఖ చంద్రాపీడునకు వినిపించుట యను కథాభాగముతోఁ గాదంబరీకావ్యము నుత్తరభాగమారంభించెను. ఈభాగంబునఁ గాదంబరీచంద్రాపీడులు పెక్కుకష్టములంబడి తుదకుస్మృతినొంది మరలజీవించుట, కాదంబరీచంద్రాపీడులవివాహము, మహాశ్వేతాపుండరీకులసమాగమము, వారిమహిమానువర్ణనము, చక్కఁగావిశదీకరింపఁబడినవి. కథ శుభాంతముగాముగిసినది.

ఎంతగొప్పకవియైనను దనంతఁదాను సరసకథలఁగల్పింపఁగలఁడుగాని యొకనియభిప్రాయమనుసరించి పూర్వోత్తరసందర్భవిరోధము లేకుండ రసభంగముగాకుండ మధ్యభాగమందుకొని కథనుసమాప్తిచేయఁ జాలఁడు. అట్టియెడ నిట్టిదురూహ్యంబగు కథోపరిభాగంబు నీషద్వైషమ్యము లేకుండఁగ నొక్క మనస్సునఁబన్నినట్లుగా సయుక్తికముగాఁబెంచి పూరించుట, తండ్రివచనరచనానైపుణిని గథాశయంబును బ్రత్యక్షముగా నెఱిఁగినకొడుకునకుఁదగును గాని యింకెవ్వనికిశక్యమగును? ఆహా? పండితలోకభూషణుండగు భూషణభట్టునిఁ గన్నబాణభట్టునిభాగ్యమే మనవచ్చును?

# మయూరకవి.

——:0:——

సూర్యశతకకర్తయగు మయూరుఁడు బాణభట్టునకు శ్వశురుఁ, నియొకఁడును శ్యాలకుఁడనియొకఁడును జెప్పుచు నీతఁడుజ్జయినీరాజగు వృద్ధభోజునిసభలోనున్నవాఁడని మానతుంగాచార్యుఁడు భక్తామరస్తోత్రవ్యాఖ్యలోను, మేరుతుంగాచార్యుఁడు ప్రబంధచింతామణిలోను వ్రాసిరి. ఇట్టివికాలనిర్ణయంబునకు సరిపడవని యిదివఱకే తెలిపియుంటిమి. కాని మొత్తముమీఁద మయూరుఁడు బాణునకుబంధువని నమ్మవచ్చును.

ఇతఁడు బాణభట్టునకు సమకాలికుఁడై కాన్యకుబ్జంబున హర్షవర్ధనుఁ డను శ్రీహర్షునియాస్థానంబుననున్నట్లుగా శార్ఙ్గధరపద్ధతి మొదలగువానిలోఁ బ్రసిద్ధముగానున్న రాజశేఖరుని " అహో ప్రభావో వాగ్దేవ్యా యన్మాతంగదివాకరః। శ్రీహర్షస్యాభవత్సభ్యః సమో బాణమయూరయోః ॥ " అనుపద్యమును, నవసాహసాంకచరితము రెండవసర్గలోఁ బరిమళకాళిదాసువ్రాసిన " సచిత్రవర్ణవిచ్ఛిత్తి శాలినో రవనీపతిః। శ్రీహర్షఇవ సంఘర్షం చక్రే బాణమయూరయోః ॥ " అనుపద్యమును దృఢాధారములుకాఁజాలును. కావున మయూరకవి హర్షవర్ధన బాణభట్టులతో 2 వ శతాబ్దము పూర్వభాగంబున నున్నట్లు నిశ్చయింపవచ్చును.

ఇతఁడురచించినది సూర్యశతకము దక్క మఱొకటేదియుఁగానరాదు. మయూరకవిరచించినవని సుభాషితావళ్యాదులలో సూర్యశతకాతిరిక్తము లగుకొన్నిశ్లోకములుకనుపడుచున్నవిగాని యట్టిగ్రంథమేదియులభింపలేదు. రాజశేఖరుఁడీతనిఁబ్రశంసించినపద్యమొకటి సూక్తిముక్తావళిలో నిట్లున్నది.

" దర్పం కవిభుజంగానాం గతా శ్రవణగోచరం।
విషవిద్యేవ మాయూరీ మాయూరీ వాఙ్నికృంతతి "

ఈతనిశతకంబునకు వల్లభదేవాదులైదుగురు వ్యాఖ్యానములు వ్రాయుటయే దీనిఘనతను దెల్పుచున్నది. ఈకవియే తనశతకంబునుగూర్చి కట్టకడ నిట్లు ప్రశంసించెను.

‡ శ్లో॥ శ్లోకాలోకస్య భూత్యై శతమితిరచితా శ్రీమయూరేణ భక్త్యా।
యుక్తశ్చైతాః పఠేద్య స్సకృదపి పురుష స్సర్వపాపైర్విముక్తః।
ఆరోగ్యం సత్కవిత్వం మతి మతులబలం కాంతిమాయుః ప్రకర్షం।
విద్యామైశ్వర్యమర్థం సుతమపి లభతే సోఽత్రసూర్యప్రసాదాత్॥

ఈతనికవిత్వము మిక్కిలిమృదుమధురమై భక్తజనహృదయరంజకంబుగా నుండును.

‡ మయూరుఁడురచించిన యీనూఱుశ్లోకములు పఠించిన వారికి సూర్యానుగ్రహంబున నాయురారోగ్యవిద్యాబలైశ్వర్యములు గలుగును.

-:0:-

# భవభూతి.

ఈమహాకవియే తననివాసాదులఁగూర్చి తననాటకంబులలోనిట్లు వ్రాసికొనెను. “దక్షిణాపథంబున విదర్భదేశంబునఁ బద్మపురమనునగరముగలదు. దాన వేదవేదాంగవేత్తలు తైత్తిరీయశాఖాధ్యేతలు పంచాగ్నులు క్రతుకర్మఠులు సత్కర్మాచరణులు కాశ్యపగోత్రులు నగునుదుంబరులనిపిలువఁబడు బ్రాహ్మణులుగలరు. వారిలో వాజపేయయాజియగు మహాకవియనువానికి నైదవపురుషుఁడును, భట్టగోపాలునకుఁబౌత్రుండును, జ్ఞాననిధియనునాచార్యునకు శిష్యుఁడును, శ్రీకంఠపదలాంఛనుండును, పదవాక్యప్రమాణజ్ఞుండు నగుభవభూతియనుకవి గలఁడు.”

వింధ్యపర్వతంబునకు దక్షిణంబుగా నార్యులేతెంచినమార్గమునకు దక్షిణాపథమని పేరుపెట్టిరి. విదర్భదేశమనఁగా నిప్పటి Bedar అని గ్రహింపనగును. దీనినే మనపూర్వులు వెలనాడనివ్యవహరించుచువచ్చిరి. కావుననే మనదేశమందలి వెలనాటిబ్రాహ్మణులకు విదర్భజులని నామాంతరము గలదు. వీరచ్చటినుండియే కృష్ణాగోదావరీతీరంబులకు వచ్చియుందురు. ఈయర్థంబును దలంచియే కాఁబోలు డాక్టరుభాండారుకారు, భవభూతి తెలుఁగుసీమను జన్మించినవాఁడని వ్రాసియుండెను. ఈ పైయంశములనుబట్టి యీకవి విదర్భజుఁడగు వైదికబ్రాహ్మణుఁడనియుఁ గృష్ణయజుశ్శాఖీయుఁడనియుఁ గ్రతులోలుఁడగుస్మార్తాద్వైతియనియుఁ గాశ్యపగోత్రుఁడనియు స్పష్టమగుచున్నది. ఈకవి తనవంశ్యులయుత్తమత్వమునుగూర్చి— "* తే శ్రోత్రియాస్తత్త్వవినిశ్చయాయ। భూరిశ్రుతం శాశ్వతమాద్రియంతే। ఇష్టాయ పూర్తాయచ కర్మణేఽర్థాన్। దారానపత్యాయ తపోఽర్థమాయుః॥" అనివర్ణించుకొనెను.

§ శ్రీకంఠబిరుదాంకితుఁడగునీతనికాలనిర్ణయమునుగూర్చి యెల్లవిమర్శకులైకమత్యము గలిగియుండుటచే విశేషించి వ్రాయనక్కఱలేదు. రాజతరంగిణిలోని "కవిర్వాక్పతిరాజ శ్రీభవభూత్యాదిసేవితః। జితో యయౌ యశోవర్మా తద్గుణస్తుతివందితాం॥" అనుశ్లోకమునుబట్టి లలితాదిత్యనృపాలుఁ డుజ్జయినీకన్యాకుబ్జంబులకుఁ బ్రభువగుయశోవర్మను

---

* వేదజ్ఞులగువారు బ్రహ్మజ్ఞానముకొఱకు శాస్త్రములను, యాగాదులకును తటాకాదినిర్మాణములకును ధనమును, సంతానముకొఱకు భార్యలను, తపస్సుకొఱకు నాయుర్దాయమును గోరుచుందురు.

§ ఇదివఱకువిపులముగా వ్రాసి ముద్రించిన యీతనిజీవితమునిందు సంగ్రహించితిని. అందుదాహరించిన కవులకాలనిర్ణయంబులుగూడఁ గొన్నియీసంస్కృతకవిజీవితములో సందందుమార్చఁబడినవి.

జయించి తదాస్థానకవి యగుభవభూతిని గాశ్మీరమునకుఁ దీసికొనివెళ్ళిన ట్లు తెలియుచున్నది. రాజతరంగిణినిబట్టి లలితాదిత్యనృపాలునికాలముతో సరిచూడఁగా యశోవర్మ క్రీ॥ శ॥ ౭౩౦ వఱకు నుజ్జయిని నేలినట్లుకనుపడు చున్నది. మఱియు ౮ వ శతాబ్దమునడుమనున్న వామనుఁడు కావ్యాలం కారసూత్రవృత్తిలో మహావీరచరితాదులను బేర్కొనుటచేఁగూడ నీతని కంటె మనకవిపూర్వుఁడైనట్లుస్థిరమగుచున్నది. కావున మనకవి క్రీ॥ శ॥ ౭౩౦ ప్రాంతమునజీవించియుండెననుట నిశ్చయము.

కృతివిమర్శనము—సంస్కృతవాఙ్మయంబున భవభూతిమహాక వి పేరు సుప్రసిద్ధమైనిలిచియున్నది. శబ్దార్థగౌరవంబగు కిరాతార్జునీయము మొదలుగాఁ గవికర్ణరసాయనంబై కల్పనాచాతుర్యవిలసితంబై యుత్తమ శైలీనిబద్ధంబగు కాదంబరివఱకును స్వభావవర్ణనావిభూషితంబులగు ర త్నావళీప్రియదర్శికలు మొదలుగా నిరుపమానోపమానస్వభావాలంకృతం బై సకలసరసహృదయరంజకంబై విలసిల్లు కాళిదాసకృతిజాతంబువఱకు నుగల కావ్యనాటకాదులనిర్మించిన ప్రాచీనకవుల యెల్లకవితాధర్మంబులు నుగల కృతిరత్నత్రయంబును నిర్మించినభవభూతినిబోలినవాఁడు ప్రాచీనక వులలో నింకొకఁడు లేఁడు. మాలతీమాధవములోని యీక్రిందిపద్యంబు నీతనిలోకోత్తరపాండిత్యంబును సర్వతంత్రస్వతంత్రతను వెల్లడించుచు న్నది. దీనికి నిదర్శనంబు లాయావిమర్శనభాగంబుల ముందుగనుఁగొన వచ్చును.

† “ యద్వేదాధ్యయనం తథోపనిషదాం సాంఖ్యస్య యోగస్యచ।
జ్ఞానం తత్కథనేన కిం నహి తతః కశ్చిద్గుణో నాటకే।

† నాటకంబున సారస్యములేదేని వేదశాస్త్రములఁ జదివితినని చెప్పనేల? ఇందేమయిన నర్థగౌరవాదికవితాసారస్యము గలదా? అదియే నాపాండిత్యనైపు ణ్యములదెలుపును.

యత్రౌచిత్యముదారతా చ వచసాం యచ్చార్థతో గౌరవం।
తచ్చేదస్తి తతస్తదేవ గమకం పాండిత్యవైదగ్ధ్యయోః॥"

మఱియు నీతనివిద్వత్కవితాసారస్యంబు నెఱింగిన నీలకంఠదీక్షితాదులీతనియం దత్యంతగౌరవముచూపుచు నీక్రిందివిధముగా వర్ణించుటయు నిందుల కుదాహరణముగానున్నది.

✓ ‡ "ప్రాచేతసేన యాఽఽనీతా పాలితా భవభూతినా।
సర్వతశ్చర్వ్యతే వాణీ సైవాద్య కవిమానిభిః॥"॥

"భవభూతేస్సంబంధా ద్భూధరభూరేవ భారతీభాతి।
ఏతత్కృతకారుణ్యే కిమన్యథా రోదితి గ్రావా।
భవభూతికవేర్వాచ స్స్వదంతే రసరంజితాః।
సుమనోభ్యస్సుధాస్యంది బంధమాధుర్యబంధురాః"

"భభూవవల్మీకభవః కవిః పురాతతః ప్రపేదే భువి భర్తృమేంఠతాం।
స్థితఃపునర్యో భవభూతిరేఖయా సవర్తతే సంప్రతి రాజశేఖరః॥

ఈమహాకవి క్రమముగా మాలతీమాధవము, మహావీరచరితము, ఉత్తరరామచరితమును మూఁడునాటకంబులురచించెను. భవభూతివిరచితంబులని శార్ఙ్గధరపద్ధతిలో— "నిరవద్యాని పద్యాని యది నాట్యస్య కాతుతిః। భిక్షుకక్షాపనిక్షిప్తః కిమిక్షుర్నీరసో భవేత్॥" అనియొకపద్యమును గదాధరభట్టుని రసికజీవనములో—

† "కిం చంద్రమాః ప్రత్యుపకారలిప్సయా।
కరోతి గోభిః కుముదావబోధనం।

‡ వాల్మీకిమూలముగావచ్చి భవభూతిచేఁబెంచఁబడిన వాణినే తక్కుఁ-కవులందఱునను సరించుచుండిరి.

† చంద్రుఁడు ప్రత్యుపకారమునుగోరి కలువలకు వికాసమొసంగుచుండెనా? లేదు. పరోపకారమనందే తమజీవితమును వినియోగించుటయనునది గొప్పవారికి స్వభావము.

స్వభావ ఏవోన్నతచేతసాం సతాం।
పరోపకారవ్యసనంహి జీవితం॥"

అనియొకపద్యమును గనుపడుటచే నితఁడురచించిన మఱియొక గ్రంథముగలదేమోయని కొందఱనుమానించుచున్నారుగాని, దానిపేర యిన శ్లోకమందింతకు ఱకు దెలియఁబడక పోవుటచేతను బై పద్యములు చాటుపద్యములవలెనుండుటచేతను నట్టిగ్రంథమొకటిగలదని చెప్ప సాహసింపఁజాలను.

పైమూఁడు నాటకంబులలోఁగూడ నొకదానిలోని పద్యములు వచనములు నింకొకదానిలో సమానముగాను గొంచెముమార్పులతోను వేఱువేఱుసందర్భంబుల నన్నియంకములందును సామాన్యముగా నుండుటచే నేదిముందురచింపఁబడెనోయని యనుమానము గలుగుచున్నదిగాని యుత్తరరామచరితము మూఁడవదియను నిర్వివాదాంశమునకుఁబోక మహావీరచరితము మొదటిదియనుకొందఱి యభిప్రాయమునకు భిన్నముగా మాలతీమాధవము మొదటిదనివిశ్వసింతము. ఇది ప్రథమప్రయత్నమగుట చేత నేకాఁబోలు నను కాలికజనరంజకంబగునో కాదో యనుసంకోచంబు సూచించునట్లుగా 'వ్యాజవినయంబుదోఁచ నీక్రిందిపద్యమీనాటకంబున నే వ్రాయుటయు దీనిప్రథమత్వమును స్థిరీకరించుచున్నది.

"యే నామ కేచిదిహనః ప్రథయంత్యవజ్ఞాం।
జానంతి తే కిమపి తాన్ప్రతి నైషయత్నః।
ఉత్పత్స్యతే మమతు కోఽపి సమానధర్మా।
కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ॥"

---

. ఎవరునన్ను నిరసింతురో యట్టి బ్రహ్మజ్ఞానులకొఱకుఁగాదీ ప్రయత్నము. నాకుఁదగినవాఁడు ముందుపుట్టఁగలఁడు. కాలమా? నిరవధియైనది. భూతలమా? విశాలమయినది.

**మాలతీమాధవము** పదియంకములనాటకము. దీనినే ప్రకరణమం అందురు. ఇందలికథమిక్కిలి మనోరంజకంబుగా శృంగారరసప్రధానంబుగాఁ బ్రదర్శనయోగ్యంబుగా లోకనీతిదాయకంబుగా నవనవోన్మేష ప్రతిభాచాతుర్యంబునఁ గల్పింపఁబడినది.

విదర్భరాజుమంత్రి యగుదేవరాతుఁడును బద్మావతీరాజుమంత్రి యగు భూరివసువును గామందకియను సన్న్యాసినియు నొకగురువునొద్ద విద్యనేర్చిరి. కథాసందర్భంబును బాత్రసంభాషణంబును బట్టిచూడ వీరు ముప్వురు బ్రాహ్మణజాతివారని తెలియుచున్నది. విద్యాభ్యాసకాలంబున నామంత్రులిరువురు "మనము పరస్పరమపత్యసంబంధము చేసికొనవలయు" నని ప్రతిజ్ఞయొనరించుకొనిరి పిదపఁగొంతకాలంబునకు దేవరాతుఁడు తనపుత్రునాన్వీక్షికీవిద్య నేర్చుకొనుటకుఁ బద్మావతికిఁ బంపెను. ఆసమయంబుననే పద్మావతీరాజు తననర్మసచివుఁడగు నందునునకు మాలతినీయవలయునని మంత్రియగు భూరివసువునుగోరుచుండెను. ఇట్లుండ మాధవుని సౌందర్యాది సుగుణగణంబును మాలతీమాధవుల పరస్పరానురాగంబును రహస్యంబుగ నెఱింగిన భూరివసువు పైకేమియు నెఱుంగనివానివలెనుండి మాలతీమాధవులకుఁ జౌర్యవివాహము జరిగింపవలయునని కామందకిని బ్రోత్సాహపఱిచెను.

కామందకి వారిపరస్పరానురాగంబునకుఁ దగినప్రయత్నములు చేయుచుండెను. మాధవునిరూపంబును మాలతిచిత్రఫలకంబున వ్రాయుట, మదనోద్యానవిహారము, పరస్పరప్రేమగలిగిన పరిచారకులగు మందారికాకలహంసలు వీరికన్యోన్యవార్తలఁ దెలుపుట, ప్రియస్నేహితుఁడగు మకరందుఁడు మాధవునకనుకూలవర్తియైయుండుట, మాలతీమాధవుల వకులమాలాచిత్రఫలకవినిమయము, పరస్పరవిరహతాపమునను నివిచక్ర-గాఁగల్పింపఁబడెను. పిదప నఘోరకంఠుఁడు మాలతినపహరించి దేవత

కుబలియీయ నెంచుట, మహామాంసవిక్రయమున కచటి కేగిన మాధవుఁడు దాని నెఱిఁగి యాకాపాలికుని జంపుట, యంతఁ గపాలకుండలయను నాతని శిష్యురాలు మాలతి నెత్తికొనిపోవుట, మాధవుఁ డందులకు విచారించుచు నడవుల కేగుట, మాలతీ దొరకుట, వారిపరిణయము ననుకథాభాగముతో నీనాటకము శుభాంతముగా సమాప్తమగును.

నాటకవిశేషములు—ఆత్మహత్యావిషయమై జాతిగుణశీలాదులకనుగుణంబుగా మహామాంసవిక్రయ మనునద్భుతోపాయమును నితఁడే కాక యింకెవ్వరును గల్పించియుండలేరు. మహామాంసమనఁగా "నిష్కపటమైనదియు శస్త్రప్రాణముగానిదియుఁ బురుషదేహమునుండి తీయఁబడినదియు" నని యర్థము. మఱియు మాలతి కామందకికి వశ్యురాలగుట నుగూర్చి వర్ణించిన-

* "వ్రజతి విరహే వైచిత్త్యం నః ప్రసీదతి సన్నిధౌ।
రహసి రమతే ప్రీత్యా వాచం దదాత్యనువర్తతే।
గమనసమయే కంఠే లగ్నా నిరుధ్య నిరుధ్య మాం।
సపది శపథైః ప్రత్యావృత్తిం ప్రణమ్య చ యాచతే॥

ఆ శ్లోకంబున దూతికావశీభూత నాయికాలక్షణంబు స్వభావానుగుణంబుగా వర్ణింపఁబడినది. మాధవుఁడు కాపాలికునితోఁ జెప్పినయీ క్రిందిపద్యము మాలతీసౌందర్యవర్ణనాగర్భితంబగు కరుణరసంబును దెల్పుచు నెంతయు శ్రావ్యముగా నున్నది.

---

* నేను విడిచినపుడు కలఁతపడును. దగ్గఱనున్నయెడ నెమ్మదిగా నుండును. ఏకాంతమునఁ జక్కగా మాటాడుచున్నది. ప్రేమతోఁ బ్రత్యుత్తరమిచ్చుచున్నది. అన్నివిధముల నుపచారము చేయుచున్నది. నేను బయలుదేరునపుడు మెడపట్టుకొని యాపి యొట్టు పెట్టించుకొని మ్రొక్కి నేను దిరిగివచ్చుటను గోరుచున్నది.

§ "అపారం సంసారం పరిముషితరత్నం త్రిభువనం।
నిరాలోకం లోకం మరణశరణం బాంధవజనం।
అదర్పం కందర్పం జననయననిర్మాణమఫలం।
జగజ్జీర్ణారణ్యం కథమసి విధాతుం వ్యవసితః॥"

మఱియు భవభూతికాలంబున నతిదుష్టంబగు కాపాలికమతంబును నరబలియు నభివృద్ధిలోనున్నవని తెలియుచున్నది. మఱియు మేఘసందేశకావ్యంబున యక్షుఁడు మేఘునిఁ బ్రార్థించినట్లుగా మాధవుఁడు "మాలతినిజూచినయెడల నామెకు నాయవస్థనుజెల్పు" మని మేఘునిఁ బ్రార్థించుసందర్భంబున మందాక్రాంతాఛందోబద్ధంబగు—

† "దైవాత్పశ్యేర్జగతి విచరన్ మత్ప్రియాం మాలతీం చే।
దాశ్వాస్యాదౌ తదనుకథయే ర్మాలతీయామవస్థాం।
ఆశాతంతుర్నచ కథయతా త్యంతముచ్ఛేదనీయః।
ప్రాణత్రాణం కథమపి కరోత్యాయతాక్ష్యాస్సఏకః॥"

అనునీపద్యము భవభూతి సగౌరవంబుగాఁ గాళిదాసకవితాచ్ఛాయ ననుసరించినట్లు తెల్పుచున్నది.

పూర్వోత్తరసందర్భవిరోధంబును బాత్రప్రయోగభంగంబును లేకుండ నాటక మొకవిధముగా నీతిదాయకముగానున్నది. మాధవునియె

§ ఈసుందరిని హింసించి సంసారంబు నసారంబుగాను, ముజ్జగంబును రత్నములేనిదిగాను, లోకమును దృష్టిలేనిదిగాను, మన్మథుని గర్వహీనునిగాను, జననేత్రనిర్మాణమును నిష్ఫలముగాను, జగంబును జీర్ణాటవిగాను నెట్లు చేయఁదలంచితివి?

† ఓమేఘుడా! నీవుతిరుగుచు దైవవశమ్మున నాప్రియురాలగు మాలతిని జూచితివేని ముందుగా నామెనూఱడించి పిదప నాయవస్థనుజెప్పుము. కాని నాయాశయనుదారమునుమాత్రము బొత్తిగాఁ ద్రెంపివేయకుము. ఆమెకదియొకటియే ప్రాణరక్షణమగుచున్నది.

త మాలతికిని మకరందునియెడ మదయంతికిని ననురాగంబెన్నఁడు వికల
ముకాలేదు. తనప్రయత్నంబునకెన్నియభ్యంతరములు వచ్చినను గామం
దకి వెనుదీయక తనపట్టునిర్వహించెను. ప్రాజ్ఞులగువారు యుక్తవిషయం
బులఁబట్టువిడుతురనుటకు మొదట విపరీతబుద్ధిగలిగిన రాజనందనులు చివ
రకాయుద్వాహంబుల మంచిబుద్ధితో నంగీకరించిరి. ఈనాటకకాలంబునఁ
గూడ రాజులయొక్క బ్రాహ్మణులే మంత్రులుగా నుండిరనుట నిక్కము.
ఏమన? భూరివసు దేవరాతులు బ్రాహ్మణజాతికిం జెందినట్లు గురుకులవాసము
చేసిన శిష్యులై రాజనీతినెఱిఁగిన మంత్రులై వర్ణింపఁబడుటయు రాజు
లతో సంబంధబాంధవ్యములుగలవారని వర్ణింపఁబడకపోవుటయు క్షత్రియ
చిహ్నవస్త్రాదిపదవాచ్యులు కాకపోవుటయు, నఘోరఘంటుఁడు దేవరా
తుపుత్రుఁడగు మాధవుని "అరే బ్రాహ్మణడింభ" యనిసంబోధించుట
యు మొదలుగాఁగల వర్ణనంబులెల్లఁ బూర్వోక్తంబును స్థిరపఱచుచు మా
ననాటకంబున నాయికానాయకులగు మాలతీమాధవులు బ్రాహ్మణులని
తెలుపుచున్నవి మఱియు నీనాటకమంతయు విమర్శింపఁగా భవభూతి
కాలంబున స్త్రీలు విద్యావతులై శిల్పకళాచిత్రవిద్యలనేర్చుచుండిని
యుఁ బ్రాజ్ఞలగుటచే సత్యప్రేమగలవారై తమకనుకూలురగు వరులవ
రించుచుండిరనియు బ్రాహ్మణులలోఁ గూడ రజస్వలావివాహముగలదని
యుఁ దెలియుచున్నది. కన్నెలకుఁ బతిపరిణయంబున స్వాతంత్ర్యముగలదను
గొప్పనీతిని బాల్యవివాహములపాలై దుఃఖభాజనులుగాక వధూవరులొ
కరిగుణసంపదనొకరెఱుఁగునంతవఱకు వివాహితులుగాకుండిరను మంచి
యాచారమును మనకీనాటకము బోధించుటకంటె వ్యవహారాపకారమే
మున్నది? ఇట్లు చెప్పుటచేఁ గన్నియలు జనకులనతిక్రమించి స్వయముగాఁ
గావలసిన వరులవరించుచుండిరనికాని, లజ్జా పరిత్యాగముచేసి పరపురుషు
లతో సంభాషించుచు రచ్చకొట్టములకేగుచుండిరనికాని తెలిసికొనరా

రామచరితనాటకములలో నెల్లనిది యుత్తమమయినదని యుత్తరశబ్దము నకు శ్లేషార్థకత్వమును మనముకల్పించుకొనిన బాగుగానుండును. ఇది కరుణరసప్రధానమయిన యేడంకముల నాటకము. భవభూతి వాల్మీకిమహర్షికృతమగు నుత్తరకాండములోని ముఖ్యపాత్రలమాత్రము దీసికొని తన ప్రౌఢకవితాచాతుర్యంబును బ్రతిభావైశద్యంబునుపయోగించి కల్పించి కథాసన్నివేశము నేర్పఱచెను. అత్యుత్తమకథాగ్రథితంబును మృదుమధురపదలలితంబును బ్రతిరంగసభారంజకంబునగు మూర్ఖజనహృదయపాషాణంబులనైన నవనీతంబుగాఁ జేయుచు దర్శకులకుఁ దన్మయత్వంబు గల్పించు నీనాటకరాజంబుఁబోలినది ప్రాచీనరూపకంబులలో వేఱొండు లేదని "ఉత్తరే రామచరితే భవభూతిర్విశిష్యతే" యనులోకోక్తి ప్రసిద్ధమై యుండఁగా నేనుమరల వ్రాయనక్కఱలేదు. ఏతాదృశనిరుపమానరూపకంబు రచించినభవభూతికూడ "ఏగతిరచియించిరేని సమకాలమువారలు మెచ్చరేకదా" (యనిపింగళిసూరకవి చెప్పినట్లుగాఁ) దనకాలంబున నసహనశీలురగుకుకవులమూలముగాఁ దననాటకంబులకుఁ బ్రసిద్ధిలేమిం గాఁబోలు నటసూత్రధారసంభాషణరూపకంబుగా సీతాపవాదంబు సూచించునట్లుగా—

* "సర్వథా వ్యవహర్తవ్యం కుతోహ్యవచనీయతా।
యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనోజనః॥"

అనితనసంకోచంబును నిరంకుశకవితాప్రాశస్త్యంబును బ్రౌఢముగా వెలిపుచ్చెను. కాని యీనాటకశిరోభూషణంబు భవభూతికృతంబు

* పలుతెఱంగుల వ్యవహరింపంగవలయుఁ। దప్పులేకుండు టెట్లని చెప్పనగును।
మగువలకుఁబోలె వాక్కులమంచితనము। నందులోకంబు దుర్జనమగునుజుమ్మి॥
(ఇందుదాహరింపఁబడి తాత్పర్యసంగ్రహము వ్రాయఁబడిన శ్లోకంబులకు సరియయిన నా తెలుఁగుపద్యములు చూడనగును).

లనుటంజేసి తొలిరెండు నాటకంబులఁ జదివింపఁ జేయునదియే కాక యెప్ప టికప్పుడు నవనవోన్మేషసారస్యంబుఁ గురిపించుచు నైహికకాములగు మానవుల యాంతరంగిక సుఖదుఃఖవికారంబులఁ బ్రదర్శించి యాముష్మికంబు సమకూర్చు తత్త్వదర్శనంబగునో యీయుత్తరరామచరిత్రంబును జదివితీఱవలయునుగాని వేనోళ్ళఁ బొగడినం దనివోఱదు.

ఈనాటకమంతయు సీత నిండుచూలాలగుట మొదలుగాఁ గుశలవులు ద్వాదశాబ్దంబులవారై తలిదండ్రులఁ గలిసికొనినయనంతవఱకు నైన పండ్రెండువత్సరంబులలోని విచిత్రకథను దెల్పుచున్నది. ఈకథాభివేశంబు సర్వజనసామాన్యంబుగాదుగావున ముందుగాఁ గథాసంగ్రహంబు వ్రాసి పిదప విమర్శనంబునకుఁ గడంగెదను.

శ్రీరామపట్టాభిషేకోత్సవమునకరుదెంచిన జనకచక్రవర్తి మరల మిథిలకరుగఁ దండ్రినెడఁబాసినందులకు విచారించుచున్న సీతను రాముఁడూఱడించుచుండెను. ఆసమయంబున నష్టావక్రమహర్షి వచ్చి కౌసల్యాదులతో ఋష్యశృంగసత్రయాగమునకేగిన వసిష్ఠమహాముని చెప్పిన యాశీర్వచనంబులను రాజకార్యాలోచనంబులను దెల్పెను. అంతసీతకానందముఁ గలిగింపఁ జిత్రింపఁజేసిన పూర్వరామాయణకథయొక్క చిత్తరువును జూడ రావచ్చునని లక్ష్మణుండువచ్చి విన్నవించెను. పిదప రామలక్ష్మణులు సాభిజ్ఞానంబుగ సీతకుఁ జిత్రవృత్తాంతముఁ దెల్పుచుండ సీత మరల భాగీరథిని జూడవలయుననికోరెను. రాముఁడు రథము రావింపుమని సౌమిత్రిం బంపెను. జానకియు నిండుచూలాలగుటచే నలసియొకగదిలో రాముని బుజముపై నిద్రించెను. అప్పుడు దుర్ముఖుఁడను నంతఃపురసంచారివచ్చి వైదేహీవిషయమగు లోకాపవాదంబును రామునకుఁ దెల్ప నతండుమిక్కిలిశోకించి సీతాపరిత్యాగంబునిశ్చయించుకొని యామెనువిడిచిపోయెను. తరువాత సౌమిత్రివచ్చి సీతను రథమెక్కించి తీసికొనిపోయి యర

ణ్యంబునవిడిచివచ్చెను. అంతఁగర్భాంతర్వత్నియగుమైథిలి దిక్కుమా
లినదై ప్రసవవేదనసహింపఁజాలక గంగలోదిగెను. అంతగఁగావసుంధర
లు సీతను నీటిలోఁగన్నబిడ్డలనుదీసి సీతనుదమయొద్దనుంచుకొని యాశి
శువుల వాల్మీకికినొప్పగించిరి. అతండును వారికిసకలవిద్యల నేర్పుచుఁ
బెంచుచుండెను. ఇట్లుండ హిరణ్మయసీతనుగూడి యశ్వమేధంబొనరింప
యత్నించు శ్రీరాముఁడు లక్ష్మణపుత్రుండగుచంద్రకేతువును ససైన్యము
గా గుఱ్ఱముతోఁబంపి తానొకబ్రాహ్మణపుత్రుని యధర్మమరణంబునకుఁ
గారణమగు శూద్రమునితపస్సువిని దండకారణ్యంబునకు రథారూఢుండై వ
చ్చి యాశంబూకుని సంహరించెను. అంతఁబూర్వమరణ్యావాసంబున సీ
తకుఁజెలికత్తెయగు వాసంతి రామునిఁజూచి సీతావియోగంబునకు దుః
ఖించి పూర్వముభార్యతోఁగూడఁ దిరిగినప్రదేశంబులనాతనికిఁ జూపుచుం
డెను. ఈవృత్తాంతమువిని భాగీరథి “సీతావియోగదుఃఖితుండగు రాఘ
వునకీవనవిహారము ప్రమాదకర” మనియెంచి తమసయనుయోగినితో జానకి
నచ్చటకుఁబంపెను. కాని సీతయు నామెసంభాషణంబును రామునకుఁగనఁ
బడదు వినఁబడదు. రాముఁడు నాతనిసంభాషణంబును సీతకుఁగనఁబడును
వినఁబడును. అంతరఘుపుంగవుఁడాయయి భాగంబులు చూచుచు సీతను
స్మరించుచు మాటిమాటికి మూర్ఛిల్లుచు సీతవచ్చిస్పృశింపలేచుచు సీత
యేతన్ను నిజముగాఁ దాఁకినదనియూహింగును మరల నొడలెఱుంగకుం
డును. ఇట్టిదర్శనస్పర్శనంబుల సవిచారసంతోషులగు సీతారాములయభి
నయంబెంతసభారంజకంబుగానుండునో చూచియానందింపవలెను. ఇట్లు
వారందఱు గొంతసేపుండి యథాపూర్వంబుగా నేగిరి. ఇదిట్లుండ జన
కచక్రవర్తి పుత్రికాదుఃఖంబునోర్వఁజాలక రాజ్యంబు పరిత్యజించి భూప్ర
దక్షిణంబొనరించుచు వాల్మీకియాశ్రమంబునకువచ్చెను. సీతయవస్థను వి
నిన వసిష్ఠుండు నయోధ్యకుఁబోవనిచ్చగింపక యరుంధతీ కౌసల్యా కైకే

యగా సుమిత్రతలతో నచ్చటకే వచ్చెను. వీరంటఱు లవునిఁజూచి సీతాపుత్రునిగా నెఱింగి దుఃఖించుచుండిరి. ఆసమయంబుననే రాముని యజ్ఞతురగము రాఁగా లవుఁడుదానిని గట్టించెను. చంద్రకేతువువచ్చి యశ్వమునకై లవునితోఁ బోరాడును. ఇందలి వీరిసంభాషణంబు శ్రవణానందకరంబైయుండును. అంతదండకారణ్యమునుండి వెడలివచ్చిన రాముఁడు వీరియుద్ధము నువిని యిటకువచ్చి సంగరము నివారించెను. అంతభరత శ్రమంబున నచ్చరలచే రామనాటకమాడింపనేగిన కుశుఁడు సంగరంబువినివచ్చి గర్వించుచుండఁదమ్ముఁడు శ్రీరామవృత్తాంతము సెప్పి శాంతపఱిచెను. తనపుత్రులేమోయని పూర్వపక్షసిద్ధాంతములొనరించుకొనురామునకును దండ్రి యనియెఱుంగని కుశలవులకును జరిగిన సంభాషణంబు వినిశీఅనలెను. అంత శ్రీరాముఁడాయా యానవాళ్ళంబట్టి వారిని దనపుత్రులుగా నెఱింగి విచారించుచుండ వసిష్ఠాదులు రామునిఁజూడవచ్చిరి. వాల్మీకియు సీతనువిడిచినవెనుక జరిగినవృత్తాంతము నాటకరూపంబుగఁ దెలిపి సర్వజగంబునకు సీతారాములయెడ భక్తిగలిగించెను. అరుంధతియు సీతను బుత్రులతో శ్రీరామునకొప్పగించెను. ఇట్లు శుభాంతముగా నాటకము సమాప్తమగును.

ఇఁకఁ గృతివిమర్శనంబునఁ గవితావిశేషంబుల నెఱింగించెదను.

౧ వ యంకము. వసిష్ఠుని యాశీర్వచనంబును వినిన శ్రీరాముఁడు సీతతోఁ జెప్పినట్లుండిన—

* "లౌకికానాంహి సాధూనామర్థం వాగనువర్తతే।
ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి॥"

---

* సద్గుణులు లౌకికులునగు సాధుజనుల।
సుడువులర్థంబు వెనువెంటనడచుచుండు।
ననఘులాద్యులునగు మహామునులుపలుకు।
పలుకు వెనువెంట నర్థంబు పరుగులెత్తు॥

యనుపద్యమైహికాముష్మికజ్ఞానుల వాక్ఛుద్ధితారతమ్యమును దెల్పుచు నుత్తమభావగర్భితమై యలరారుచున్నది. మఱియు వసిష్ఠుఁడు శ్రీరామునకు వర్తమానించిన—

§ "జామాతృయజ్ఞేన వయం నిరుద్ధా।
స్త్వం బాలఏవాసి నవంచ రాజ్యం।
యుక్తఃప్రజానా మనురంజనేస్యా।
స్తస్మాద్యశో యత్పరమం ధనం వః॥"

అనుశ్లోకము రాజనీతిసారభూయిష్ఠంబై భవభూతి యశోవర్మాదులయాస్థానంబుననున్నట్లు చాటి చెప్పుచున్నది.

ఈమహాకవి పూర్వనాటకంబులలో నెందును నదృష్టచరంబగు చిత్రప్రదర్శనంబను నూతనమార్గంబు నీనాటకంబునఁద్రొక్కెను. అయ్యది పూర్వరామాయణ కథాసంగ్రహద్యోతకంబై యయ్యయిపట్లశృంగార వీరకరుణాద్భుతరసంబుల సభారంజకంబగు మఱి కథకుమాత్రమై నుత్తమాంకంబునకుమూలమై ప్రతిపద్యసరసమై ప్రథమాంకంబు నలంకరించుచున్నది ఈభాగంబు సాంతంబుగాఁ జదివినంగాని స్థాలీపులాకన్యాయంబుగ విమర్శించినంతమాత్రంబున మనోరంజకంబుగాదు. గోదావరీతీరమందలి తమరహస్యవర్తనములఁ దలంచుచుంటివాయని సీతను రాముఁడడుగుసందర్భంబుననున్న, † "కిమపి కిమపి మందం మందమాసక్తియోగా దవిరళితకపోలం జల్పతోరక్రమేణ। అశిథిలపరిరంభవ్యాపృతైకైకదోష్ణో

§ మేమల్లుని యజ్ఞములోనున్నాము. నీవు చిన్నవాఁడవు పెద్దలయాచారము ననుసరించి ప్రజానురాగంబునకుఁ బ్రయత్నింపుము.

† ఓప్రేయసీ! మనము బుజములు కలిపికొని గట్టిగాఁ గౌఁగిలించుకొని పరుండి యత్యనురాగంబున నేసేమో చెప్పుకొనుచుండగా రాత్రి తెలియకుండగా వెళ్ళిపోయినదిగదా?

రవిదితగతయామా రాత్రిరేవ వ్యరంసీత్ ॥" అనుష్యమందలి స్వభావ వర్ణితంబగు ననుకూలదాంపత్యానురాగరసమనుభవైకవేద్యము గాని వచనైకగోచరముగాదు. తనబుజముపైనిద్రించి పలవరించుజానకింగని శ్రీరాముఁడు దాంపత్యమున కవిచ్ఛిన్నసౌఖ్యముంగోరుచు వర్ణించిన,

‡ " అద్వైతం సుఖదుఃఖయోరనుగతం సర్వాస్వవస్థాసుయ,
ద్విశ్రామో హృదయస్య యాత్ర జరసా యస్మిన్నహార్యోరసః।
కాలేనావరణాత్యయాత్పరిణతే యత్ప్రేమసారే స్థితం।
భద్రం తస్య సుమానుషస్య కథమప్యేకంహి తత్ప్రాప్యతే ॥"

అనుశ్లోకంబాత్మైకత్వవిజ్ఞానము బోధించుచు భవభూతియొక్క యద్వైతమతసారంగతత్వము బ్రకటించుచున్నది. దుర్ముఖునివలన సీతాపవాదంబునువిని దుఃఖించురాముని హృదయావస్థనువర్ణింప నాకవికీరునకేచెల్లునుగాని యనమిట్టిదని మరలవ్రాయఁజాలము. బ్రహ్మవిద్యపఠించు నాత్రేయివర్ణనముగూడ మాలతీమాధవవిమర్శనములోఁజెప్పినట్లుగా నీకవిరాజుకాలమందలి స్త్రీవిద్యాప్రాచుర్యముందెల్పుచున్నది.

శ్రీరామాయణకావ్యరచనకుముందుగా వాల్మీకిమహర్షి యాకస్మికప్రతిభావిశేషంబున నుచ్చరించిన " [1] మానిషాద! ప్రతిష్ఠాం త్వమగమశ్శాశ్వతీస్సమాః। యత్క్రౌంచమిథునాదేక మవధీః కామమోహితం ॥" మ్మను శ్లోకమునను వాదించి దానింగూర్చి " [2] చిరమామ్నాయాదన్యత్ర మాత్రనశ్ఛందసామవతార" యనియు " [3] అథ భగవాన్ ప్రాచేతసః ప్ర

‡ సకలావస్థలయందును సుఖదుఃఖంబులను ముసలితనమునందును నైక్యంబున ననురాగంబుగలిగియుండు దాంపత్యమునకు భద్రముగలుగుఁగాక.

1 ఓనిషాద! క్రౌంచమిథునములలో నొకదానిని జంపితివిగావున నీవు చిరకాలము ప్రతి[illegible]. 2 వేదములకుఁదరువాత చందస్సుల నూతనజననము చిత్రముగానున్నది. 3 వాల్మీకిమహర్షి [illegible]ంబున మొదటిదగు రామాయణకావ్యమురచించెను.

థమం మనుష్యేషు శబ్దబ్రహ్మణస్తాదృశం వివర్తమితిహాసం రామాయణం ప్రణినాయ" యనియువర్ణించుటచే సంస్కృతభాషలో రామాయణమే ఛందోబద్ధంబగు నాదికావ్య మనుమహాకవి భవభూతినమ్మకమే మనకు మార్గదర్శకముగానున్నది.

ఏవి సభ్యులహృదయంబుల నాకర్షించు నట్టి పూర్వరామాయణకథాభాగంబులనుద్ఘాటించుచు, గోదావరి, పంచవటి, ప్రస్రవణము మొదలుగాఁగలవాని మిక్కిలివర్ణించుటచూడ భవభూతి పోలవరము మొదలు భద్రాచలమువఱకుఁగల గోదావరీతీర కాననప్రదేశంబుల స్వయముగాఁ జూచి యానందించినవాఁడని తోఁచుచున్నది.

శంబూకవధార్థము జనస్థానంబునకేతెంచిన శ్రీరాముఁడు పంచవటిదర్శింపవచ్చుటయు నాసమయంబుననే సీత తమసతోఁగూడఁ దనకు మామలకు ద్వాదశవత్సరపూర్తియగుట సూర్యునారాధింప నచ్చటికే వచ్చుటయు రామునిఁజూచి యాతనిమాటలువిని సీతదుఃఖించుటయు నామె చేతితో స్పృశింపనానందించి యామెకనుపడమికి రాఘవుఁడు వగచుటయు ననుకథాభాగంబు మిక్కిలి ప్రౌఢముగాఁ గల్పింపఁబడినది. ఈ సందర్భంబునఁ బూర్వము మైథిలి పెంచిన గజమృగమయూరవృత్తానులవర్ణనంబు సహజముగానున్నది. ఇందు సీతారాముల పరిదేవనంబు భవభూతి యనుభవసిద్ధంబుగా వర్ణించినాఁడాయను నంతస్వాభావికంబుగా నధికవిచారవంతుల హృదయావస్థం దెలుప నుదాహరణంబుగా నున్నది. మఱియు మూడవయంకముచివరనున్న—

* "ఏకోరసః కరుణఏవ నిమిత్తభేదా।
ద్భిన్నః పృథక్ పృథగివాశ్రయతే వివర్తాన్।

* నీరొకటియే సుడి, బుడగ, మొదలుగాఁగల వికారములను బొందినట్లుగాఁ గరుణరసమొకటియే నిమిత్తభేదమువలన వేఱువేఱురూపములఁజెందును.

ఆవర్త బుద్బుద తరంగమయాన్వికారా।
నంభోయథా సలిలమేవహి తత్సమస్తం॥

అనుశ్లోకము జానకీరాఘవసమాగమ వృత్తాంతమున కనురూపముగానుండుటయేకాక నాటకంబునకు వీరశృంగారములలో నేదైన నొకరసము ప్రధానముగానుండవలయు ననినభరతనాట్యశాస్త్రమునకు విరుద్ధముగా నున్నయీనాటకమందలి కరుణరసంబును సాధించుచు “శృంగారఏకఏవరస” యనుశృంగారప్రకాశకారాదిమతంబు ఖండించుచు రాగివిరాగిసాధారణం బగుకరుణరసమే సర్వరసప్రకృతియని నిర్ధారణ చేయుచుఁ గావ్యనాటకలక్షణంబుల భవభూతికిం గలస్వాతంత్ర్యమును ఘోషించుచున్నది.

ఇంక నాల్గవయంకము మొదలుగా నాటకాంతమువఱకుఁగల కథ వాల్మీకియాశ్రమమున జరిగినట్లున్నది. విష్కంభకమునకు బదులుగా సౌధాతకి యనువాల్మీకిశిష్యుని ప్రవేశము చతుర్థాంకమునఁగలదు. మఱియునీయంకముత్తమస్త్రీపురుషపాత్రప్రవేశంబై రాజమర్యాదలను, దంపతీప్రభావంబును, మహారాజకాంతలసుగుణసంపదను, దెల్పుచు సశాంతకరుణరసమొలికించుచు లోకంబునకు నీతిదాయకముగానున్నది. ఇందొకచోఁగౌసల్యావిషయకంబుగా “పురంధ్రీణాం చిత్తం కుసుమసుకుమారం హి భవతి” యనియు నింకొకచో సీతావిషయకంబుగా “గుణాఃపూజాస్థానం గుణిషు నచ లింగం నచ వయః” అనియు స్త్రీసామాన్యంబుగా నర్థాంతరన్యాసములు చెప్పుటచేతను మాలతీమాధవమందలి స్త్రీపాత్రప్రజ్ఞావిశేషవర్ణనంబుచేతనుగూడ భవభూతి కవిసామాన్యులవలె స్త్రీజాతిమాత్రనిందకుఁడు కాఁడు సరిగదా గుణదోషవిమర్శనంబుగల స్త్రీపక్షపాతియని తోఁచుచున్నది.

జనకాదులసమీపించునపుడు లవుని సంభాషణంబు రాజలక్షణం

బులకనుగుణంబుగా గంభీరంబునుదారంబును బాల్యచిహ్నమునకనురూపంబుగా హృదయాహ్లాదకరంబు యుక్తియుక్తంబునై యశ్వరక్షకుల మాటలు వినునపుడు క్షత్రధర్మంబున కనుసరణంబుగా సధైర్యశౌర్యంబునైయాపాత్రమునకెంతయుం దిగియున్నది.

ఒకనిఁజూచి యొకఁడు మనంబున నానందించుచు నొకనినొకఁడు పొగడుకొను రామలక్ష్మణకుమారు లగులవచంద్రకేతువుల సంభాషణంబున హృద్యంబై వీరకరుణరసమిశ్రంబైనయీపంచమాంక మీనాటకకల్పభూజంబునకు ఫలకల్పంబుగానున్నది. లవునిఁజూచివిచారించు సుమంత్రునిమాటయగు—

* "మనోరథస్య యద్బీజం తద్దైవేనాదితో హృతం।
లతాయాం పూర్వలూనాయాం ప్రసవస్యోద్భవః కుతః॥"

అనునది సాభిప్రాయమై నిష్కారణసీతాపరిత్యాగమందలి విచారముంబ్రకటించుచు రామాదులు సీతావిషయకవార్త యెఱుంగమిందెల్పుచు నర్థగౌరవముగానున్నది. కాఁటియు రామపరశురాములంగూర్చి లవునియొత్తిపొడుపుమాటలగు—

"[1] సిద్ధం హ్యేతద్వాచి వీర్యం ద్విజానాం।
బాహ్వోర్వీర్యం యత్తు తత్ క్షత్రియాణాం।
శస్త్రగ్రాహీ బ్రాహ్మణో జామదగ్న్యః।
తస్మిన్ దాంతే కాస్తుతిస్తస్య రాజ్ఞః॥"

---

* హృదయమా! నీకోరికకు బీజమగు సీతను దైవము మొదటనేహరించెను. మొదలు తెగిన తీఁగకు మొగ్గలుపుట్టునా?

[1] విప్రులకు వాక్కునను రాజులకు భుజములందు వీర్యము సిద్ధము. పరశురాముఁడు శస్త్రము పట్టిన బ్రాహ్మణుఁడు. ఆతనిజయించినాఁడని రామునకేమిగొప్ప?

"[2] వృద్ధాస్తేనవిచారణీయచరితా స్తిష్ఠంతు హుంవర్తతే।
సుందస్త్రీదమనేప్యకుంఠయశసో లోకే మహాన్తోహియే।
యానిత్రీణికుతోముఖాన్యపిపదాన్యాసన్ ఖరాయోధనే।
యద్వా కౌశలమింద్రసూనుమథనే తత్రాప్యభిజ్ఞో జనః॥"

అను శ్లోకము లెంతయు సరసంబులై కవిచాతుర్యమును వెల్లడించుచున్నవి. ఇంక నాఱవయంకము విష్కంభంబున లవచంద్రకేతువులయుద్ధము సరసంబుగ వర్ణింపఁబడినది. మహానుభావుఁడగు శ్రీరామచంద్రమనిఁ గనిన కుశలవులవినయసంతోషములను నాయుయుయానవాళ్ళచే నాబాలురఁ దనపుత్రులు గాశంకించుకొను రాముని హృదయావస్థనువర్ణింపనామహాకవిభవభూతికే చెల్లును. రాముఁడు కుశలవులఁ జూచితినలో—

"[1] భూయిష్ఠంచ రఘుకులకౌమారమనయోః పశ్యామి......
అయే నకేవల మసద్వంశసంవాదిన్యాకృతిః ......
నను పునరివ తన్మే గోచరీభూతమక్ష్ణో।
రభినవశతపత్రశ్రీమదాస్యం ప్రియాయాః......
శుల్లాచ్ఛదంతచ్ఛవిసుందరేయం।
సైవోష్ఠముద్రా సచ కర్ణపాశః......

అని సీతనుదలంచుకొని కన్నీరువిడువ లవుండు మహారాజా! యేలవిచారించుచుంటివనియడిగెను. అంతఁగుశుండు లవునితో—

"[2] వినాసీతాదేవ్యా కిమివ నచ దుఃఖం రఘుపతేః।

---

[2] తాటకనుజంపి గొప్పకీర్తిపొందిన యాపెద్దలనుండనిమ్ము. ఖరాసురునిఁజంపునపుడు మూఁడడుగులు వెనుకకువేయుటయు వాలినిజంపిన నేర్పును జగద్విదితమే.

[1] కేవలము మాపోలికయేకాదు. సీతపోలికకూడ బాగుగాఁగలదు.

[2] తమ్ముఁడా! ప్రాణప్రియురాలయిన సీతపోఁగా రామునకు దుఃఖమేలరాకుండునుః వారిస్నేహమాః యట్టిది. ఈవియోగమాః యిట్టిది. రామాయణము చదువనివానివలె నిట్లడిగెదవేమిః

ప్రియానాశే కృత్స్నం కిల జగదరణ్యం హి భవతి ।
సచ స్నేహస్తావా నయమపి వియోగో నిరవధిః ।
కిమేతం త్వం పృచ్ఛ స్యనధిగతరామాయణ ఇవ ॥"

అని చెప్పిన సమాధాన మెంత సభారంజకంబై కరుణరసపూరితంబు గానున్నదో చదువరులకే తెల్లము. ఇవ్విధంబుగాఁ దాను తండ్రి యని తెలియని కుమారులతో సంభాషించుచు సవిచారానందము బొందుచు రాముఁడు వసిష్ఠాదులఁ జూడ నేగె నిట్లా అనయంకము ముగిసినది.

పిదప వాల్మీకి మహర్షి యానతిచే లక్ష్మణుండు గంగాతీరంబున సభాసన్నివేశంబు గావింప, సకలపౌరజానపదులు రామాదులును సభ్యులుగానుండ, సీతాపరిత్యాగంబాదిగా సీత భూవిలయమగునంతవఱకును గల వాల్మీకికృతం బగు నాటకంబు నచ్చరలభినయించి సీతాసచ్చరిత్ర మహిమంబును గుశలవుల జనన వర్ధనంబులను లోకమునకుఁ బ్రకటించిరి.

ఇట్లు నాటకంబులో నంతర్నాటకంబు కల్పించి సకలకవిజనసంస్తవనీయులైనవారిలో భవభూతియే మొదటివాఁడు. పిదప నరుంధతి పరమపవిత్రయగు సీతాదేవిని సర్వజనమనోహరులగు కుశలవులను శ్రీరామునకొసంగెను. ఇట్లు శుభోదర్కంబుగా నాటకము సమాప్తంబగును.

ఈకవికిఁ బాణినీయశాస్త్రంబున నపారప్రజ్ఞగలదని యితని నాటకంబులఁ జదివినవారెల్ల గ్రహింతురు. మఱియుఁ బద్యాంతంబుల నతిరమ్యంబుగా నొక్క విశేష్యంబునకు రెండుక్రియాపదంబుల నర్థభేదంబు గఁ బ్రయోగించు నైపుణ్యము పెక్కుచోట్లఁ గన్పట్టుచున్నది.

ఒకపద్యంబున నిద్దఱు సంభాషించుటయుఁ బద్యమధ్యభాగంబున దానిభావంబును మార్చి యింకొకవిధముగా ద్రిప్పుటయు మొదలుగాఁగల కవితాచాతుర్యంబునకు ముందీకవికావ్యము లేమార్గదర్శకములగుచున్నవి మఱియు "అమృతాత్మనః కలా" యను నాందీభాగమును,

"విద్యాకల్పేన మరుతా మేఘానాం భూయసామపి। బ్రహ్మణీవ వివర్తానాం క్వాపి విప్రలయఃకృతః॥" అను శ్లోకంబును వేదవేదాంతజ్ఞాని యగు భవభూతి యద్వైతశాస్త్రంబునకు దాహరణంబుగాఁజాలును.

ఈకవి సామాన్యముగా నెల్లవృత్తంబులను వ్యవహరించెనుగాని శిఖరిణీవృత్తంబును బెక్కుచోట్ల రసవద్భాగంబులవాడుటచే నీఛందస్సీతనికి మిక్కిలి ప్రియంకరమయినట్లు కనుపడుచున్నది.

-:o:-

# భట్టనారాయణకవి

వేణీసంహారనాటకకర్త యగునీబ్రాహ్మణుఁడు క్రీ॥ ౧౦౭౭ లోఁ గాన్యకుబ్జంబునుండి వంగదేశమునకువచ్చినట్లు కొందఱువంగదేశీయులభిప్రాయపడిరని తెలియుచున్నది. § కొందఱుపాశ్చాత్యవిమర్శకులీతఁడు ౯వ శతాబ్దము ప్రథమభాగములోనివాఁడని వ్రాసిరి. కాని, యీతనినాటకములోని శ్లోకము లానందవర్ధనునిధ్వన్యాలోకంబునను, వామనునికావ్యాలంకారసూత్రవృత్తియందునుగూడఁ గనుపడుటచేనితఁడు వారికిఁ బూర్వుఁడైనట్లు స్పష్టపడుచున్నది. మఱియునితఁడు తననాటకప్రస్తావనలో నవనాటకమని వ్రాసికొనుటచేఁగూడ భారతకథానాటకరచనంబునఁ జిత్రభారత బాలభారత పాండవానందాది నాటకంబులకంటె నీనాటకము ప్రాచీనమని తెలియుచున్నది. కావున నెట్లయిన నితఁడు, ఎనిమిదవ శతాబ్దంబుపూర్వభాగములోనివాఁడనఁగా భవభూతికిఁగొంచెముతరువాతివాఁడో సమకాలికుఁడోయైయుండునని యూహింపవచ్చును

§ చూ. ఇండియా ఇంపీరియల్ గేజటీరు.

ఇతఁడు రచించినది వేణీసంహారమొకటియే కనుపడుచున్నది. ఇచట వేణియనఁగా శిరోజములు వానిని సంహారమనఁగా ముడుచుట యనియర్థము. ఇంకుమాయజూదంబున నోడినపాండవుల ధర్మపత్నియగు ద్రౌపదిని గొప్పవట్టి దుశ్శాసనుఁడు సభలోనికీడ్చుకొనివచ్చినపుడు విడిపోయిన తలవెండ్రుకలను, వనవాసానంతరము భీముఁడు యుద్ధమున దుర్యోధనునితొడలు తెగఁగొట్టి వానిరక్తమునఁదడిసినచేతులతో ముడివేయుటయను కథాభాగము వీరరసోద్రేకముగావర్ణింపఁబడినది. మఱియుఁగథానాయకుఁడగు భీమసేనునిచేఁ గౌరవశతమును సంహరించుట, యందునుదుశ్శాసనునిపొట్టచీల్చి రక్తముత్రాగుట, దుర్యోధనునితొడలు తెగఁగొట్టుటయను ఘనప్రతిజ్ఞ లతిఘోరముగా నిర్వహింపఁబడినవి.

ఇది కేవలవీరరసప్రధానంబైనను దీనిశైలిమాత్రము సులభముగానేయుండి యాపాతమధురముగానుండును. వీరరసరూపకములలో దీనింబోలినప్రదర్శనరంజకంబగు నాటకంబొండు లేదు. ఈక్రిందిభీమవచనమీ నాటకసారమంతయుఁ దెలుపుచున్నది.

† "చత్వారో వయమృత్విజస్సభగవాన్ కర్మోపదేష్టా హరిః।
సంగ్రామాధ్వరదీక్షితో నరపతిః పత్నీ గృహీతవ్రతా ।
కౌరవ్యాః పశవః ప్రియాపరిభవక్లేశోపశాంతిః ఫలం । [౧॥అం॥
రాజన్యోపనిమంత్రణాయ రసతి స్ఫీతం యశోదుందుభిః ॥"

ఈక్రిందికథాభాగమెంతయు హృదయరంజకంబుగా నుండును. భీముఁడు దుశ్శాసనునినెత్తురుత్రాగి దుర్యోధనునిఁజంపి యాతనిరక్తము

† ఈయుద్ధయజ్ఞంబున మేము నల్వురము ఋత్విక్కులము. కృష్ణుఁడు అధ్వర్యుఁడు. ధర్మరాజు యజమానుఁడు. ద్రౌపది వ్రతదీక్షాపరురాలు. కౌరవులు యాగపశువులు, ప్రియురాలిపరాభవశాంతి ఫలము. రాజులను బిలుచుటకు కీర్తిదుందుభి మ్రోగుచున్నది.

మేనఁజూసికొని “ ‡ ఊరూకరేణ పరిఘట్టయతస్సలీలం। దుర్యోధనస్య పురతోఽపహృతాంబరాయాః। దుశ్శాసనేన కచకర్షణభిన్నమౌళి। సా ద్రౌపదీ కథయత క్వపునః ప్రదేశే॥ ” అని ద్రౌపదింజేరఁగోరుచు వెదకుచుఁ బరుగెత్తివచ్చుచుండ, ధర్మరాజాతని జూచి దుర్యోధనుఁడని భ్రాంతిపడి సవేగముగాఁగౌఁగిటంబట్టి, ఓ దురాత్మా! దుర్యోధనా! ఉండుండుము. అనినిలిపి యిట్లుపలికెను. “ § ఆశైశవాదనుదినం జనితాపరాధః। మత్తో బలేన భుజయోర్హతరాజపుత్రః। ఆసాద్య మేఽన్తరమిదం భుజపంజరస్య। జీవన్ప్రయాసి నపదాత్పదమద్యపాపః॥ ” పిదప భీముఁడని తెలియుటయు నందఱుసంతసించుటయు ద్రౌపదిశిరోజముల నతఁడు ముడుచుటయు ననుకథాభాగముతో నాటకము ముగియును.

---

‡ చేతితోఁ దొడలుతట్టుచున్న దుర్యోధనునియెదుట విప్పఁబడిన చీరగలదియు దుశ్శాసనుఁడు పట్టియీడ్వఁగా విడినకొప్పుగలదియు నగు ద్రౌపది యెచ్చటనున్నది?

§ ఓరిపాపీ దుర్యోధనా! చిన్ననాటనుండి పెక్కుతప్పులుచేయుచు నాతమ్ములఁబలుబాధలఁబెట్టుచున్ననీవు నేఁటికి నాభుజపంజరమునఁ జిక్కితివి. ఇఁకఁబ్రాణముతో నడుగుతీసి యడుగుపెట్టిపోఁగలవా? ౬. అం.

-:0:-

# సుబంధుకవి.

ఇతనికాలమును నిర్ణయించుటకుఁదగిన సదాధారంబు లేవియుఁగనుపడవు. కాని, కొందఱుహూణవిమర్శకులవ్రాఁతలననుసరించి మనదేశీయులుగూడ నొకరిద్దఱుభ్రమపడి “ వాసవదత్తలో సుబంధువాఁడవశేతాబ్దము తుదిభాగముననున్న దండికవి రచించినఛందోవిచితియను గ్రంథంబును, దిఙ్నాగాచార్యాదులచే దూషింపఁబడినవాత్స్యాయనమునిన్యాయసూత్రభాష్యము నుద్ధరింప న్యాయవార్త్తికంబురచించిన యాఁడవశతా

బ్దములోని న్యాయవిద్యావిశారదుఁడగు నుద్యోతకరుని, ధర్మకీర్తియనువా
నిని స్మరించుటచే వారికిఁబరుఁడై ౭ వ శతాబ్దము పూర్వభాగమందు
న్న బాణభట్టునిచే నుతింపఁబడిన వాసవదత్తగలవాఁడగుటచేతను, రా
ఘవపాండవీయకర్తయగు కవిరాజుచే "సుబంధుర్బాణభట్టశ్చ కవిరాజ
ఇతిత్రయః" అనుశ్లోకంబున బాణునికంటె ముందుగా నిర్దేశింపఁబడిన
వాఁడగుటచేతను, బాణునికంటెఁబూర్వుఁడునైయుండు" ననియింకనే
వేవోకారణంబులిట్టివే చూపుచు సుబంధుని ౬ వ శతాబ్దంబు తుదిభాగం
బునఁ జేర్చిరి.

ఈసందర్భమున వారుచూపిన కారణములంత ప్రబలములు కాకపో
యినను సుబంధువు దండ్యాదులకంటెఁ దరువాతివాఁడనుట మనకాతం
కమును గలిగించునదిగాదుగాని బాణుఁడు ప్రశంసించిన వాసవదత్త సు
బంధువురచించినదనునదిమాత్రము నిస్సంశయముగనంగీకరింపఁదగినది గా
దు. ఈవిషయము శ్రీహర్షవిక్రమాదిత్యజీవితములో వివరింపఁబడినను మ
రలనిందు విమర్శింపఁదగియున్నది. బాణుఁడు హర్షచరిత్రలోఁ బ్రశంసిం
చిన వాసవదత్త సందర్భమునుబట్టి సుబంధు వాసవదత్తాకథకంటె భిన్నము
యిన యొకయాఖ్యాయికయనియు నయ్యదియిపుడు లోకవ్యవహారము
లోనున్న దృశ్యశ్రవ్యకావ్యములన్నిటికంటె మిగులఁబ్రాచీనమైనదనియు,
మహాభాష్యకర్త యగుపతంజలిమహర్షియుఁ గైయటాచార్యులునుగూడ
"లుబాఖ్యాయికాభ్యోబహులం, ఆఖ్యానాఖ్యాయికేతిహాస పురాణేభ్య
శ్చ" అనువార్తికములయర్థము వివరించుటలోఁ గ్రమముగా నాఖ్యాయి
కాపదంబునకు వాసవదత్తాపదంబు నుదాహరించుటయే ధ్రువపఱచుచు
న్నది. కాని, యట్టివాసవదత్తమఱియొకటియుండవచ్చునుగాని బాణుఁ
డుస్మరించినది సుబంధుకృతిగాదనుటలో బలవత్ప్రమాణమేమనియడుగుదు
రేని బాణుఁడు, హరిచంద్ర సాతవాహన ప్రవరసేన భాసకాళిదాసా

ములఁబేర్కొని సుబంధుని పేరెత్తకపోవుటయు, సరసవచనరచనయందధిక చాతుర్యముఁ జూపినయతఁడు గాళిదాసాదులఁగూడ నట్లునుతింపక, యతిశ్లిష్టశిష్టవాక్యరచనగల సుబంధువాసవదత్తను “కవీనామగలద్దర్పోనూనం వాసవదత్తయా। శక్త్యేవ పాండుపుత్రాణాం గతయా కర్ణగోచర” మ్మని యత్యుత్తమముగా నుతించు ననుట నమ్మఁదగినది కాకపోవుటయుఁ దగినప్రమాణంబులు కాఁజాలును.

ఇదియిట్లుండఁగాఁ బైని వ్రాసిన “కవీనాముగలద్దర్ప” యనుశ్లోకము కలకత్తాముద్రితపుస్తకములలోఁ దక్కఁ దక్కినయాంధ్రలిఖితముద్రితవాసవదత్తాపుస్తకములలోఁ జివరఁగనుపడుచుండుటచే నిది సుబంధుకృతమై హర్షచరితలోఁ గవిప్రశంసాపద్యములలోఁ జేరినదా? లేక బాణకృతమై లోకపరంపరాగతమై క్రమంబుగ వాసవదత్త తుదకుఁజేరినదా? యనిగొప్పసంశయమొకటి సంభవించుచున్నది. కాని పైశ్లోకము వాసవదత్తాపుస్తకంబులలోఁ గొన్నిటిలోమాత్రమే యుండుటచేతను, స్వోత్కర్షపరంబుగ సుబంధుఁడురచించినదీనిని బాణుఁడపహరించి తన కవిస్తుతిలోఁగూర్చెననుట యనుచితమగుటచేతను, తానప్పుడే గ్రంథసమాప్తిచేసి యింకనులోకములో వ్యాపింపకమునుపే తనవాసవదత్తచే నెల్లకవులగర్వముఁణఁగిపోయినదని సుబంధువు కావ్యాంతమున వ్రాసికొనెననుటగూడ నసంభవము నసమంజసమునగుటచేతను, నది సుబంధునిపద్యముగాదనియుఁ బతంజల్యాదులచే నుదాహరింపఁబడిన ప్రసిద్ధప్రాచీన వాసవదత్తనుగూర్చి బాణుఁడట్లు ప్రశంసించియుండఁగా దానిలోనివాసవదత్తాపదంబును గనినవీనులు నామసామ్యంబుననో సుబంధునియందలిగౌరవంబుననో యాశ్లోకమును వాసవదత్తను దామువ్రాసికొనువెడఁ జివరఁజేర్చియుందురనియు నిస్సంశయముగ విశ్వసింపవచ్చును. ఇంకఁగవిరాజు బాణునికంటె సుబంధుని ముందుగా నిర్దేశించుటయుందురా?

ష్వర్థి కావ్యమునకుఁ గడంగినయతఁడు ప్రత్యక్షరశ్లేషవిధానదక్షుఁడను గౌరవంబుచేతనో యాదృచ్ఛికంబుగానో యట్లు చెప్పియుండునుగాని యంతమాత్రముననే వారిపౌర్వాపర్యంబు నెఱింగి యట్లు చెప్పియుండుననియు నిట్టివి కవికాలనిర్ణయంబున కాధారంబులనియుఁ దలంపనగునా? అట్లయిన నీసుబంధువునే వామనబాణాదులు బాణభట్టునికంటెఁ బరునిఁగా నిర్దేశించిరి. అందుచే ననేకాభిప్రాయానుసరణంబుగాఁ బరుఁడేల కాఁగూడదు? సరియే. అట్లయిన నాప్రాచీనవాసవదత్తయేదని మరలనడుగుదురేని, పేరయినఁ దెలియని భట్టారహరిశ్చంద్రుని గద్యకావ్యముతోఁ గవిపేరయినఁ దెలియని యాప్రసిద్ధవాసవదత్త సుఖముగా నెచ్చటనో నిద్రించుచున్నదని యుత్తర మీవలసివచ్చును. ప్రసక్తానుప్రసక్తంబుగ నేదో వ్రాసితిమిగాని యింతయేల? ఈతనికంటెఁ బూర్వుఁడగు భవభూతి యెనిమిదవశతాబ్దంబు మొదటివాఁడని భవభూతి శ్రీహర్ష జీవితములలోఁ జదివియుండఁగా నితఁడు బాణునికంటెఁ దరువాతివాఁడనుట కనుమాన మేమున్నది? ఇంకనో పరిశీలింపఁగాఁ గావ్యాలంకారసూత్రవృత్తిలో నుత్కలికాప్రాయంబునకుదాహరణంబుగా † నీవాసవదత్తలోని వాక్యమొకటి గనుపడుటచే నెనిమిదవశతాబ్దంబుపరభాగములోనివాఁడగు వామనాచార్యునికంటె నితఁడు పూర్వుఁడైనట్లు తేలుచున్నది. కావున నేవిధముగా నాలోచించిన ననేకసమ్మతంబుగా సుబంధుకవి ౭ వ శతాబ్దంబు మధ్యభాగంబున నుండియుండు నని నిశ్చయింపవచ్చును.

ఈకవి నివాసజీవనచరిత్రాదులేమియుఁ దెలియవు. కాని యితఁడు జ్జయినీప్రాంతమువాఁడేమోయని కొందఱూహించిరి. ఇతఁడు బ్రాహ్మ

---

† కులిశశిఖరఖరనఖరప్రచయప్రచండచపేటాపాటితమత్తమాతంగకుంభస్థలగలన్మదచ్ఛటాచ్ఛురితచారుకేసరభారభాసురముఖే కేసరిణి.

ణుఁడు. కథాముఖంబున సమానభక్తితోఁ గావించిన శివకేశవస్తుతియే యీతని దద్వైతమతఁడని తెల్పుచున్నది. వాసవదత్తయను గద్యకావ్యము దక్క నితనిది మఱేదియుఁ గానరాదు. దీనింగూర్చి కవియే కావ్యాంత మున నిట్లు వ్రాసికొనెను.

"ప్రత్యక్షరశ్లేషమయప్రపంచ విన్యాసవైదగ్ధ్యనిధిం ప్రబంధం।
సరస్వతీదత్తవరప్రసాద శ్చక్రే సుబంధుస్సుజనైకబంధుః॥"

కేరళభూపాలునిచే నొసంగఁబడిన "అభినవబాణభట్టశబ్దశ్లేషా లంకారభూషణ" యనుబిరుదంబు వడసిన శ్రీకృష్ణసూరి దీనికి విమర్శినీ వ్యాఖ్యరచించెను. కాదంబరీదశకుమారచరితలవలె దీనికిఁ బ్రచారము లేకపోవుటకుఁ గారణము కవిత్వమక్షరశ్లేషకఠినమై దుర్గ్రహంబుగా నుం డుటయేయని దీనిచదువరులు గ్రహించియుందురు. ఈకథ ప్రసిద్ధవాసవ దత్తాకథలకంటె భిన్నముగాఁ గనుపడుచున్నది. కాళిదాసునిమేఘసందే శంబునను, శ్రీహర్షుని రత్నావళీప్రియదర్శికలలోనుగూడ వాసవదత్తతం డ్రి యుజ్జయినీరాజగు ప్రద్యోతుఁడని నిర్వచింపఁబడినది. గుణాఢ్యునిబృ హత్కథకుఁ బరివర్తనములగు బృహత్కథామంజరీ కథాసరిత్సాగరము లలోఁ జండమహాసేనుఁడని నిరూపింపఁబడినది. ఈకావ్యంబునందో కుసు మపురరాజగు శృంగారశేఖరుఁడని చెప్పఁబడినది. వీనికన్నిటికిని మూలా ధారమగు బృహత్కథలో నెట్లున్నదో యెవరికిని దెలియదు. కొన్నిటిలోఁ దండ్రి కనుమతమనియు, మఱికొన్నిటిలో నభిమతము గాదనియుఁ గనుపడు చున్నదిగాని యెట్లయినను వాసవదత్త యాత్మమనోహరుండును గౌశాం బీనాథుఁడు నైన యుదయనుని బెండ్లియాడెనను బలోనన్నియు నేకీభవిం చుచున్నవి. ఈకావ్యమునందో తండ్రి తన్నుఁ బుష్పకేతున కీయఁదలంచి యుండఁగా వాసవదత్త కందర్పకేతుని వరించి యాతనిచేఁ గొనిపోఁబడె ననియున్నది. కాని, కథామధ్యభాగంబునఁ బ్రకటించిన "అపూర్వా బృ

హత్కథా మయా శ్రుతా ప్రత్యక్షీకృతాచ" అను వాక్యమువలన నీకవి బృహత్కథ నెఱింగినవాఁడే మోయని సంశయముగలుగుచున్నది. ఇందలి కథమాత్రము ప్రసిద్ధవాసవదత్తాకథకు భిన్నముగానున్నను సరసముగానే పెంచఁబడినది. దానినిమిక్కిలి సంగ్రహించి యిందువ్రాసెదను. సంప్రాప్తయౌవనుండును, చింతామణిరాజసూనుండును, గథానాయకుఁడునగుకందర్పకేతువొక్కనాఁడు స్వప్నంబున మనోహరాంగియగు పదునెనిమిదియేండ్లవయస్సుగల యొకకన్యనుజూచి తదేకధ్యానుండై యొకనాఁడు తనమిత్రుఁడగు మకరందునితోఁగూడ వింధ్యాటవికిఁబోయి నిశాసమయంబున నొకజంబూవృక్షముక్రింద విశ్రమించియుండెను. ఆసమయమున నానేరేడుచెట్టుమీదనున్న శారిక యపుడేవచ్చిన యాత్మప్రియుఁడగు శుకంబునుజూచి యింతప్రొద్దుపోవువఱకు నెచ్చటనుంటివని యతికోపముతోనడిగెను. అంతనాశుకము కోపింపకుము బృహత్కథవినుటచే జాగయినదనిచెప్పెను. అంతనాశారికప్రార్థింప శుక మాకథ నుపక్రమించి కుసుమపురరాజగుశృంగారశేఖరునిపుత్రికయు సంప్రాప్తయౌవనయు నగు వాసవదత్త యతిమనోహరాంగుఁడగు నొకరాజపుత్రునిఁ గందర్పకేతువనువతనినామాక్షరంబులను స్వప్నంబునఁగని విని యాతనియెడబద్ధానురాగయై యాతనిభావమెఱుంగఁ దమాలిక యనుశారికనుబంపుట యదియు నాచెట్టుక్రిందనేయుండుట యనునంతవఱకుఁజెప్పెను. అంతమకరందుఁడాతమాలికనుబిలిచి యావద్వృత్తాంతముంగనుఁగొనెను. పిదపవారిరువురయనురాగము సమాగమము నతినిపుణంబుగ నతివివరంబుగ వర్ణింపఁబడినది. కొన్నికొన్నిచోట్ల నుపమానంబులు విదర్శనంబులు కటువుగానున్నను గథచక్కఁగాఁ బెంపువడసి హృదయరంజకంబుగాఁ బండితగ్రాహ్యంబుగానున్నది.

# దామోదరగుప్తుఁడు.

ఇతఁడు నిరుపమానపరాక్రముఁడును సంస్కృతభాషాపోషకుఁడును శబ్దశాస్త్రస్వతంత్రుఁడును గాశ్మీరరాజునగు (జయాదిత్యుఁడు) జయాపీడునియాస్థానమునఁ బ్రధానమంత్రియు విద్వత్కవియునై ప్రసిద్ధికెక్కిన వాఁడు.

జయాపీడభూపాలుఁ డుద్భటుఁ డనుగొప్పపండితునిఁ దనవిద్వత్సభకగ్రాసనాధిపతినిఁగావించెననియు, బలిచక్రవర్తి కవిని (శుక్రాచార్యుని) మంత్రిగా నేర్పఱచుకొనినట్లీతఁడు దామోదరగుప్తునిఁ దనదివాణమునఁ బ్రధానమంత్రిగా నొనరించుకొనెననియు, నీతనితో వామనపండితుఁడు మొదలుగా ననేకవిద్వన్మంత్రులును, మనోరథుఁడు, శంఖదత్తుఁడు, చటకుఁడు, సంధిమంతుఁడు, మొదలుగాఁగవులును దదాస్థానంబుననుండిరనియు, ‡ రాజతరంగిణి నాల్గవతరంగమువలనఁ దెలియుచున్నది. ఈరాజతరంగిణినిబట్టి లెక్కింపఁగా జయాపీడుఁడు క్రీ॥ శ॥ ౭౫౧ మొదలుగా ౭౯౭ వఱకుఁ గాశ్మీరము నేలినట్లుకనుపడుచున్నదని చరిత్రకారులు నిర్ణయించిరి. కావున నీదామోదరగుప్తకవి యీకాలంబుననే కాశ్మీరంబునఁ దదాస్థాన మలంకరించియుండు నని విశ్వసింపవచ్చును.

ఇతఁడు బ్రాహ్మణుఁడు. రాజనీతినిఁ జక్కఁగా నెఱింగినవిద్వత్కవి. ఈతఁడురచించినది కుట్టనీమతమను కావ్యము దక్క నింకేదియుఁ గానరా

---

‡ సదామోదరగుప్తాఖ్యం కుట్టనీమతకారిణం ।
కవింకవిం బలిరివ ధుర్యంధీసచివంవ్యధాత్ ।
మనోరథశ్శంఖదత్తశ్చటకస్సంధిమాంస్తథా ।
బభూవుః కవయస్తస్య వామనాద్యాశ్చ పండితాః ॥ ౪—౪౯౬—౯౭.

డు. ఈగ్రంథమైనను జిరకాలము లోకంబున లుప్తప్రాయమై యుండఁగా డాక్టరు పేటర్సను మహాశయుఁడు ౧౮౮౫ లో ఖంబాతునగరములో శిథిలమై తాళపత్రలిఖితమైయున్న యొకప్రతిని సేకరించినట్లు కావ్యమాలాధిపతులు తెలిపియుండిరి. ఇది యాదిమధ్యాంతముల నక్కడక్కడ జీర్ణమై యసంపూర్ణముగా నేయున్నది. అయినను బోయినవి పోఁగా ౯౨౭ ఆర్యా శ్లోకములతోనున్న యీప్రాచీనకావ్యము కావ్యమాలలలోఁ బ్రకటింపఁబడినందుల కెంతయు సంతసింపఁదగియున్నది కుట్టనియనఁగా నాయికానాయకులను గూర్చునట్టి దూతిక యనియర్థము. దానిస్వభావమును దెలుపునట్టి యీగ్రంథము కుట్టనీమతమను పేర రచింపఁబడినది. రాజుల వేశ్యాలంపటత్వమును గనిన యీకవి వారికి నీతి దెలుపుటకీగ్రంథమును రచించినట్లుకనుపడుచున్నది. వేశ్యల చేష్టలను, వేశ్యమాతల మాయలను, కుంటెనకత్తెలచాతుర్యమును, జారులదురవస్థలను లోకంబునకు బోధించునట్టి యిట్టి నీతికావ్యము ప్రాచీనకావ్యములలో లేదని నొక్కి వక్కాణింపవచ్చును.

వారాణసీనగరనివాసిని యగుమాలతి యను వారాంగన యొకనాఁడు మేడపైనుండి సమీపంబున నొకగాయకుఁడు ప్రసంగవశమున బఠించిన « యౌవనసౌందర్యమదం దూరేణాపాస్య వారవనితాభిః । యత్నేన వేదితవ్యాః కాముకహృదయార్జనోపాయాః ॥ " అను శ్లోకంబును విని మేడదిగివచ్చి యప్పురంబున దూతికాకృత్యంబునఁ బ్రసిద్ధివహించి కామిజనులఁ దనగృహంబున బంధించియుంచిన వికరాల యనుముదుసలి కుంటెనకత్తెయింటికేగి యభీష్టవిటుల వశపఱచుకొను నుపాయంబు దెల్పుమని ప్రార్థింప నప్పుడది యుత్తమ విటవశీకరణోపాయంబులను సోపాఖ్యానముగ సోదాహరణముగ వివరించి యనుభవపూర్వకంబుగా నుపదేశించెను. ఈకావ్యము చదివిన కామి వారకాంతల మాయల నెఱింగి మోక్షకామి కాక పోఁడు. దీనియుపసంహార మెట్లున్నదో తెలియదుగాని దీనిధోరణిచూడఁ

గా నెట్టివిద్యాధనసంపన్నులయ్యును మహైత్రికి శీఘ్రముగాలోఁబడుచుర నియు నెంతటిలోకజ్ఞానులయ్యును బయోముఖవిషకుంభములవంటి వేశ్యామాతలకపటవచనముల విశ్వసింతురనియు నొకమాఱు వెలయాండ్రతగులంబునకొడఁబడినవాఁడు ధనమానహానియయినను వారినివిడువఁజాలఁడనియు, విటులు వెలవెలఁదులకుటిలవర్తనంబులఁ గనుఁగొనఁజాలక వారి తేనెమాటల మోసపోవుదురనియు లోకంబునకునీతిగఱపుటకే యీకావ్యముద్దేశింపఁబడినదని తెలియుచున్నది. అకటా! యిట్టికావ్యము సొంతముగానుండక యున్నభాగ్యమైననింతదాఁక ప్రజలమొగమెఱుంగక యడుగంటియుంటకు హిందూదేశముచేసికొన్నపాపమేమో తెలియకున్నది.

ఈకావ్యశైలి యతిపేశలమై హృద్యంబై పండితపామరసుగమంబైయున్నది. ఇందలిసుందరసేనోపాఖ్యానము సరసజనరంజకంబుగా నీతిదాయకముగానున్నది. పాటలీపుత్రనివాసియు యజ్వయు నగుపురందరవిప్రోత్తమునిపుత్రుఁడు నధీతవేదశాస్త్రుఁడు నగుసుందరసేనుఁడు వయఃకాలంబుసమీపించినతఱిని గుణపాలితుఁడనుమిత్రునితో దేశాటనంబుసలుపనేగి తుదకు నర్బుదంబనుపర్వతంబు నెక్కి యందుసంచరించుచు రెండవరతీదేవియోయనఁదగునొకగంధర్వాంగనంగాంచి దానిమాయకులోఁబడి యిల్లుమఱచియుండుట, అంతఁదండ్రి యీసంగతి నెఱిఁగి యొకపత్రికవ్రాసి పరిచరునిచేతనచ్చటికిఁబంపుట, వారిపరస్పరానురాగవియోగాదులును సహజముగావర్ణింపఁబడినవి. పురందరుఁడు వ్రాసినపత్రికలోనినీతులు నిరుపమానములు. కథాంతరంబులనందందుఁగూర్చిన నీతిపద్యరత్నంబు లభూతపూర్వంబులు. వానిలోనొకటిరెండుదాహరించెదను.

§ దేశాంతరేషు వేషస్వభావభణితాని యే న బుధ్యంతే ।
సముపాసతే న చ గురూన్ విషాణవికలాస్త ఉష్ట్రాణః ॥

---

§ ఎవరు దేశాంతరంబునఁ బరులవేషభాషాస్వభావంబులను దెలిసికొనరో పెద్దలను సేవింపరో వారుకొమ్ములులేనియెద్దులనఁదగుదురు.

† క్షణదృష్టనష్టవల్లభజన్మజరావ్యాధిమరణపరిపూర్ణే ।
పరివర్తిని సంసారే కః కుర్యాదాగ్రహం మతిమాన్ ॥

† జన్మజరావ్యాధిమరణపూరితమై నిమిషములోఁగనుపడినశించునట్టి సంసారమందు బుద్ధిమంతుఁడైనవాఁడెవఁడభిమానము పెట్టికొనును?

——:O:——

# వామనపండితుఁడు.

కావ్యాలంకారసూత్రవృత్తికర్త యగునీవామనుని, నీతనికాలమునుగూర్చి రాజతరంగిణి యాధారముగాఁ బెక్కండ్రమత మేకీభవించుచునే యున్నది. కాని, యొకవిమర్శకుఁడు "మాఘుని శిశుపాలవధలోని పద్యముల నీతఁడుదాహరించినవాఁడగుట నవమశతకోత్తరభాగంబుననున్న మాఘునికంటె నితఁడు తరువాతివాఁడుగావలసియుండు" నని వ్రాసినసంశయాభిప్రాయమునకు సమాధానమింతకుమున్నె మాఘుఁడాఱవశతాబ్దములోనివాఁడని యెఱిగినచదువరులకుఁ దెలుపనక్కఱలేదు.

చీనాదేశమునుండివచ్చిన హుయన్ స్యాంగు హిందూదేశయాత్ర చేయునప్పటికే వ్యాకరణగ్రంథ మగుకాశికావృత్తి పఠనపాఠవ్యవహారములోనున్నదని యాతనియాత్రావర్ణనగ్రంథంబువలనఁ బాశ్చాత్యులు తెలిపియుండుటచేఁ దత్కర్త యగువామనాచార్యునికంటె నీకవియన్యుఁడని తెలియుచున్నది అతఁడే యీతఁడేలకాఁగూడదని సంశయముగలుగవచ్చును గాని యెనిమిదవశతాబ్దంబు మొదటనున్న భవభూతినాటకములలోని పద్యము లీతనిగ్రంథంబుననుండుటచే నీవామనుఁడు భవభూతికంటె వరాచీనుఁ డనుటకు సందేహ మేమున్నది?

మఱియు నభినవగుప్తాచార్యుఁడు ధ్వన్యాలోకలోచనంబు ప్రథమోద్యోతంబున వ్రాసిన ‡ వాక్యమునుబట్టి ధ్వన్యాలోకకర్త యగు నానందవర్ధనాచార్యునికంటె నీవామనుఁడు ప్రాచీనుఁడైనట్లు తెలియుచున్నది. ఈయానందవర్ధనుఁడు ౯ వ శతాబ్దముత్తరభాగంబునఁ గాశ్మీరమునేలిన యవంతివర్మరాజునకు సమకాలికుఁడైయుండెనని రాజతరంగిణి చెప్పుచున్నది. దీనింబట్టి భవభూత్యానందులకు నడుమవాఁడైన వామనుఁడొకఁడు కాశ్మీరకుఁడేయని పెక్కండ్రభిప్రాయపడుచున్నారు.

కావున రాజతరంగిణినిబట్టి దామోదరగుప్తజీవితమున వ్రాసినట్లుగా నితఁడాతనికి సమకాలికుఁడై కాశ్మీరరాజగు జయాపీడునియాస్థానంబున విద్వన్మంత్రియై క్రీ॥ శ॥ ఎనిమిదవశతాబ్దంబునుత్తరభాగంబుననే యుండియుండు నని నమ్మవచ్చును.

ఇతఁడుత్తమకులసంభూతుఁడై రాజమిత్రుఁడై పండితగౌరవపాత్రుఁడైన సాహిత్యచక్రవర్తి సాహితీకలలోఁ గావ్యాలంకారసూత్రవృత్తియను పేరఁ గావ్యలక్షణంబులకు నుత్తమనిబంధనంబులగు సూత్రముల రచించి వానియర్థము స్వయముగా వివరించినయుత్తమాలంకారిక సార్వభౌముఁడు, ఈతనికిఁ బూర్వముకూడ భరతదండిభామహాదుల గ్రంథములు గలవుగాని యవి దీనివలె ఘంటాపథములు గావని యేతదర్వాచీనాలంకారికులే వాకొనిరి.

ఈగ్రంథ మైదధికరణములుగా నిర్మింపఁబడినది. మొదటిదానిలోఁ గావ్యముయొక్క దృష్టాదృష్టప్రయోజనాదులు నిర్ణయింపఁబడినవి. ౨లో, పదార్థదోషవాక్యార్థదోషాదులు నిరూపింపఁబడినవి. ౩లో, కావ్యగుణం

‡ (తెలుఁగు) వామనునియభిప్రాయంబున నిది యాక్షేపాలంకారము. భామహాభిప్రాయంబున సమాసోక్తి. ఈయాశయంబును దలంచియే యానందవర్ధనుఁడు రెండలంకారముల కొక్కయుదాహరణమిచ్చెను.

బులు తెలుపఁబడినవి. ౪లో, శబ్దార్థాలంకారాదులు వర్ణింపఁబడినవి. ౫లో, శబ్దశుద్ధికావ్యసమయాదులు నిర్ణయింపఁబడినవి. సంస్కృతభాషలో నిదియలంకారగ్రంథముగా నేకాక విమర్శనకావ్యముగాఁగూడ నుపయోగపడుచున్నది. శబ్దతర్కాలంకారశాస్త్రములయం దధికసమర్థుఁడగునీకవి పండితలోకమండనం బగునీకృతియేకాక వేఱొకటిరచించినట్లు కనుపడదు. నిర్గుణపరబ్రహ్మధ్యానపరంబగు కృత్యాదిశ్లోక మీతనిజ్ఞానంబును గావ్యప్రతిజ్ఞ నిట్లు తెల్పుచున్నది.

“ ప్రణమ్య పరమం జ్యోతి ర్వామనేన కవిప్రియా।
కావ్యాలంకారసూత్రాణాం స్వేషాం వృత్తిర్విధీయతే॥ ”

-:0:-

# రుద్రభట్టుఁడు.

శృంగారతిలకకర్త యగునీకవి యేదేశస్థుఁడో తెలియదుగాని బ్రాహ్మణుఁడనిమాత్రము నామమే చెప్పుచున్నది. ఈతనికాలమైన నిదమిత్థమ్మని నిర్వచింప నాధారములేదుగాని పంచతంత్రకర్త యగువిష్ణుశర్మకంటెనితఁడు ప్రాచీనుఁడనిమాత్రము తెలియుచున్నది. ఏమనఁగా—ఈతనికావ్యములోని “ సార్ధం మనోరథశతైః స్తనుధూర్తకాంతా ” ఇత్యాది శ్లోకమును లబ్ధనాశనప్రకరణంబున విష్ణుశర్మ యుదాహరించెను.

మఱియు నీతఁడు పంచతంత్రప్రథమభాగంబునఁ గ్రీ॥ ౭౫౫—౭౮౬ నడుమనున్న దామోదరగుప్తుని కుట్టనీమతములోని “ పర్యంకస్స్వాస్తరణః పతిరనుకూలో మనోహరం సదనం ” అనుపద్యము నుదాహరించినవాఁడగుటచే ౮ వ శతాబ్దముచివరివాఁడని విశదమగుచున్నది.

కాఁబట్టి యీరుద్రభట్టుగూడ ౯ వ శతాబ్దములోనివాఁడని యూహింపవచ్చును. మఱియు గ్రంథముఖంబుననున్న “ప్రాయో నాట్యం ప్రతిప్రోక్తా భరతాద్యైర్రసస్థితిః। యథామతి తథాప్యేషా కావ్యం ప్రతినిగద్యతే॥” అనుపద్యమున “నాట్యరసంబును భరతాదులుదెల్పిరి. కావ్యరసంబును నేనుదెల్పెద” నని ప్రతిజ్ఞచేయుటచేఁగూడఁ గావ్యాదర్శకర్తయగు నాచార్యదండికంటె నర్వాచీనుఁడగునని తోఁచుచున్నది. ఈగ్రంథాంతముననున్న “త్రిపురవధాదేవగతా ముల్లాసముమాం సమస్తదేవనుతాం। శృంగారతిలకవిధినా పునరపి రుద్రః ప్రసాదయతి॥” అనుపద్యమువలన నితఁడు త్రిపురవధమనునింకొక కావ్యమును రచించినట్లు గోచరమగుచున్నది.

ఈతఁడు రచించిన శృంగారతిలకము కావ్యరసాలంకారకావ్యము. ఇందు సంభోగశృంగారము, విప్రలంభశృంగారము, హాస్యాదిరసనిరూపణము ననుమూఁడుపరిచ్ఛేదములుగలవు. ఇందలి వివిధనాయికానాయకరసాదిలక్షణంబులకు స్వయముగా లక్ష్యంబులు రచించినయీతనికవిత్వశైలి మృదుమధురంబై కర్ణరసాయనంబగుచున్నది. శృంగారహాస్యకరుణరసంబులఁ గైశికీవృత్తిప్రయోగింపఁదగినదని చెప్పుచు ప్రయోగించినయుదాహరణమిందుఁజూపెదను.

§ “సౌందర్యం శశలాంఛనస్య కవిభిర్మిథ్యైవ తద్వర్ణ్యతే।
సౌభాగ్యం క్వను పంకజస్య రజనీసంభోగభగ్నత్విషః।
ఇత్యాలోచ్య చిరాయ చారు దిమతత్రైస్యతుకురంగీదృశో।
వీక్షేతే నవయౌవనోన్నతముఖౌ మన్యే స్తనావాననం॥”

---

§ కవులు చంద్రునికి సౌందర్యముగలదని యసత్యముగావర్ణించుచున్నారు. రాత్రులయందుఁ గళాహీనంబగుపద్మమునకు శోభయెక్కడిది? అనిచిరకాలమాలోచించి కురంగాక్షియొక్క నూతనయౌవనోన్నతముఖములగు కుచములు నిత్యసౌందర్యముగలిగిన ముఖమును జూచుచున్నవని తలంచెదను.

## విష్ణుశర్మ

ఇతఁడు [illegible]
జొంగినవాఁడు. ఈయంశంబు నీక్రింది గ్రంథాదిపద్యములు ధ్రువపఱచుచున్నవి. “మనవే వాచస్పతయే శుక్రాయ పరాశరాయ ససుతాయ। చాణక్యాయచ విదుషే నమోఽస్తు నయశాస్త్రకర్తృభ్యః॥ సకలార్థశాస్త్రసారం జగతి సమాలోక్య విష్ణుశర్మేదం। తంత్రైః పంచభిరేతచ్చకార సుమనోహరం శాస్త్రం॥”

అర్థశాస్త్రపరిజ్ఞాతయై పంచతంత్రమను నీతికావ్యము వ్రాసినయీకవి తనకావ్యకథాముఖంబున “దాక్షిణాత్యంబగు మహిలాపురంబునఁ బ్రభువుగా నున్నయమరశక్తిభూపాలుఁడు దుర్వినీతు లగుతనపుత్రులకు నీతిఁగఱపఁ దనయాస్థానమందలి తక్కుంగలపండితుల ప్రోత్సాహంబునఁ దన్నునియోగింపఁ దానీనీతిశాస్త్రమునురచించినట్లుగా వ్రాసికొనినదాని “నిది కేవలము కథకుపోద్ఘాతముగాఁ జెప్పినదిగాని నిజవృత్తాంతముగా” దనిమనము తలంపకుంటిమేని యీవిష్ణుశర్మ దాక్షిణాత్యంబగు మహిలాపురమున నివసించినవాఁడనియు నమరశక్తిరాజునకాశ్రితుఁడనియు నూహింపవచ్చును. ఈకవి పైశాచిభాషలోనున్న గుణాఢ్యుని బృహత్కథలను జాలవఱకు గ్రహించి వచనరూపకముగా వ్రాయుచు నడుమనడుమ నీతిసార నీతిప్రదీప మన్వాదిస్మృతులలోని నీతిపద్యంబులఁ బొందుపఱచి చక్కనిమృదుశైలిలో వినసొంపుగాఁ జమవనింపుగా నీకావ్యమునురచించినట్లు కనుపడుచున్నది

క్రీ॥ శ॥ ౫ వ శతాబ్దము పూర్వభాగములోనివాఁడని నిర్ణయింపఁబడిన భర్తృహరి సుభాషితనీతిశతకములోని “దౌర్మంత్ర్యాన్నృపతి

ర్వినశ్యతి యతిస్సంగాత్సుతోలాలనా ద్విప్రోఽనధ్యయనాత్కులం కుతనయాచ్ఛీలం ఖలోపాసనాత్ । హ్రీర్మద్యాదనవేక్షణాదపి కృషిస్స్నేహః ప్రవాసాశ్రయా । న్మైత్రీచాప్రణయాత్సమృద్ధిరనయా త్త్యాగాత్ప్రమాదాద్ధనం ॥" అనుపద్యమొకటిరెండుపదములభేదముతోఁ బంచతంత్రము మొదటితంత్రంబునఁ గనుపడుటచేనితఁడు భర్తృహరికిఁ దరువాతివాఁడనుట నిశ్చయము. ఇదిట్లుండఁగా నాఱవశతాబ్దముమధ్యభాగంబుననే యీపంచతంత్రము నౌషరువానను పారసీకరాజుకాలంబున మొదటఁ బారసీకభాషలోనికి మార్చఁబడినదగుట నంతకుఁబూర్వుఁడుగాఁదగిన విష్ణుశర్మ ౫ వ శతాబ్దంబునంతంబుననో యాఱవశతాబ్దంబు మొదటనో యుండునని నిశ్చయించి పీటర్సను మొదలగువారీతని నాఱవశతాబ్దము మొదటఁజేర్చిరి. కాని, ౮ వ శతాబ్దములోనివారగు దామోదరగుప్త రుద్రభట్టులపద్యము లీపంచతంత్రములోఁ గనుపడుచుండుటచే వారికంటె నితఁడు తప్పకపరుఁడై ౮ వ శతాబ్దముచివరివాఁడైయుండునని తోఁచుచున్నది. దీనింబట్టి పారశీకభాషలోనికి మార్చఁబడినకాలము తప్పనఁదగినదో, లేక పైకవులపద్యములిందుఁ బ్రక్షిప్తములుగాఁ జేరినవనఁదగినదో యూహింపశక్యముగాకున్నది. ఎట్లయిననీతఁడాఱవశతాబ్దము పూర్వభాగమునకుఁ బూర్వుఁడును, ఎనిమిదవశతాబ్దము పరభాగమునకుఁ బరుఁడును గాఁ డనుటనిశ్చయము.

ఈతనికావ్యమొక్క మనదేశమునే కాక చిరకాలమునుండి యితరఖండములఁగూడ నలంకరించుచున్నదనుటకంటె దీనిఘనతను వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. మిత్రభేదము, మిత్రలాభము, కాకోలూకీయము, లబ్ధనాశనము, అపరీక్షితకారకము, ననునైదుతంత్రములుగల యీనీతిప్రబంధము బాలురకేకాక పెద్దలకుఁగూడ శిక్షసేయునదియై బుద్ధిసెప్పునదియై హితముగఱపునదియై ముదమొదవునదియై ప్రభువై గురువై మిత్రమై క

శ్రుతమై వేదమై శాస్త్రమై పురాణమై కావ్యమై ప్రాపంచికజ్ఞానమును కరతలామలకముగాఁ జేయుచున్నది.

ఈకావ్యంబునఁ బెక్కుచోట్లఁ బాణినీయవిరుద్ధము లగుప్రయోగములుగలవుగాని యవి లేఖనంబునను ముద్రణంబునను సంభవించినవి కాని శబ్దశాస్త్రజ్ఞుఁ డగునీతనివి గావని నమ్మవచ్చును. ఈకావ్యములోని పద్యములు ముక్కాలు మువ్వీసమితరులవే కాని యీతనివిగూడఁ గొన్నిగలవు. ఇందుండి రెండు నీతిపద్యములను దాహరించెదను.

"మాతృవత్పరదారాణి పరద్రవ్యాణి లోష్ఠవత్ ।
ఆత్మవత్సర్వభూతాని యః పశ్యతి సపశ్యతి ॥"

ఈక్రిందిపద్యము వాదిప్రతివాదుల వివాదంబునకు ధర్మసూత్రము గానున్నది.

"వివాదేఽన్విష్యతే పత్రం। పత్రాభావేతు సాక్షిణః।
సాక్ష్యభావే తతోదివ్యం। ప్రవదంతి మనీషిణః ॥"

పూర్వకాలంబున నేయిరువురకైన వివాదము సంభవించినపుడు న్యాయకర్తలు మొదటఁబత్రమునుజూచెడివారు. అది లేనియెడల సాక్షులనువిచారించెడివారు. వారు లేనియెడల వాదిప్రతివాదులను బ్రమాణముచేయించి నిజమైనతీర్పుచెప్పెడివారఁట. ఒకరూకకిద్దఱుకూటసాక్షులు ముగ్గురు దొంగలేకరును వచ్చునీకాలంబునఁబైనిజెప్పినవన్నియుఁ గూడినను మనన్యాయాధికారులసభలలో న్యాయము తేలకున్నదనిన నాశ్చర్యమేమి? ఆహా కాలవ్యత్యాసము?

——:0:——

## *మురారికవి

ఇతనిసరియయినకాలము నిర్ణయింపనాధారములేదుగాని ౯ వ

* ఇతఁడు ౧౨ వ శతకమునఁదుండువాఁడనియుఁ గావ్యప్రకాశమునకు వ్యాఖ్యవ్రాసిన వాఁడనియుఁ గొందఱనిరిగాని, నిదర్శనము లేవియుఁ గానరావు.

శతాబ్దము త్తరభాగములోని రత్నాకరకవి హరవిజయకావ్యము ౩౮ వ సర్గలోని « అంకేఽథనాటక ఇవో త్తమనాయకస్య నాశంకవిర్వ్యధిత యస్య మురారిరిత్థం । ఆకాంతకృత్స్నభువనః క్వగతస్సదైత్యనాథో హిరణ్యకశిపుస్సహ బంధుభిర్వః ॥ " అనుపద్యములోని « అంకనాటకకవిమురారి" పదము లప్రకృతార్థపరముగా మురారికవినిదెల్పుటచే నతనికంటె నితఁడుపూర్వుఁడైయుండుననియు; నితఁడుతనయనర్ఘరాఘవప్రస్తావనలో « యది క్షుణ్ణం పూర్వై రితి జహతి రామస్య చరితం గుణై రేతావద్భిర్జగతి పునరన్యో జయతి కః " అనితనకుఁబూర్వము నేకులు రామకథను రూపకములుగాఁవ్రాసియుండిరని యంగీకరించుటచేతను, సుప్రసిద్ధంబగు నీతనినాటకంబులోని పద్యములెందును గావ్యాలంకారసూత్రవృత్తిలో లేకపోవుటచేతను భవభూత్యాదులకంటెను వామనునికంటెను బరుఁడై యుండుననియుఁదెలియుచున్నది. కావుననితఁడు క్రీ॥ ౭౫౦—౮౦౦ నడుమ నుండు నని యూహింపనగును.

ఇతఁడు మౌద్గల్యగోత్రుఁడు. తంతుమతీవర్ధమానభట్టులకుఁబుత్రుఁడు. సర్వశాస్త్రములఁజదివినవాఁడు; బాలవాల్మీకిబిరుదాంకితుఁడు. అనేకులీక్రిందివిధముగానుతించుటయేయీతని సామర్థ్యముంబ్రకటించుచున్నది

« దేవీం వాచముపాసతే హి బహవస్సారంతు సారస్వతం । జానీతే నితరామసౌ గురుకులక్లిష్టో మురారిః కవిః " « మురారిపదచింతాచేత్తథా మాఘే మతిం కురు " « మురారిపదచింతాయాం భవభూతేస్తు కాకథా "

ఈతనియనర్ఘరాఘవ మనర్ఘమైనది. ఇందు దశరథుఁడు విశ్వామిత్ర యజ్ఞసంరక్షణార్థము రామలక్ష్మణులనుబంపుట మొదలుగా రావణవధానంతరమయోధ్యకుఁజేరిన శ్రీరాముని పట్టాభిషేకము వఱకును గల శ్రీరా

మాయణకథ యేడంకములలోవర్ణింపఁబడినది. "రక్షాంసీతి పురాపి సంశృణుమహే" యను పయోగము ప్రామాదికమని భట్టోజీదీక్షితులాక్షేపించినను, పాణినీయప్రయోగవిశేషంబులకు లక్ష్యముగానుండి సర్వశాస్త్రప్రసక్తి గలిగి ప్రౌఢముగా లోకోత్తరముగానున్న యీనాటకకవిత్వమునుజూచియే పండితులు "మురారేస్తృతీయఃపంథాః" అనుసామెతగల్పించినట్లు కనుపడుచున్నది. రామరావణపరముగునర్థముసూచించునట్లు లోకనీతిదాయకముగానున్న యీసూత్రధారవచనమెంతయుఁ జక్కగానున్నది.

§ "యాంతి న్యాయప్రవృత్తస్య తిర్యంచోఽపి సహాయతాం।
అపంథానంతు గచ్ఛంతం సోదరోఽపి విముంచతి॥"

రెండవయంకములోని యీక్రింది సూర్యోదయవర్ణనమెంతయు సరసముగానుత్ప్రేక్షింపఁబడినది.

† "ఏకద్విత్రిచతుఃక్రమేణగణనా మేషామివాస్తంయతాం।
కుర్వాణా సమకోచయ ద్దశశతా న్యంభోజసంవర్తికాః।
భూయోఽపి క్రమశః ప్రసారయతితా స్సంప్రత్యమూనుద్యత
స్సంఖ్యాతుం సకుతూహలేవ నళినీ భానోస్సహస్రంకరాన్॥"

§ న్యాయముగాఁబోవువానికిఁ పశుపక్ష్యాదులుగూడఁ దోడ్పడును. అపమార్గమునఁబోవువాని సోదరుఁడుగూడ విడిచిపెట్టును.

† తామరలత, అస్తమించునట్టియేసూర్యకిరణములను, ఒకటిరెండుమూఁడు నాలుగనిలెక్కించుచుఁ దనకమలదళములను ముడిఁచెనో మరల నుదయించునట్టి యాకిరణములనే యిపుడు సంతోషముతోఁదిరిగిలెక్కించుచుఁ గ్రమముగాఁ దన దళములనువిశ్వచుండెను. అనఁగా సహస్రకిరణుఁడుదయించెను సహస్రపత్రము వికసించెను. అనితాత్పర్యము.

నాల్గవయంకములోని రామపరశురాములసంభాషణం బెంతయు వినసొంపుగానుండును. తాను శివధనుస్సు విఱిచినందులకుఁ గోపించు పరశురామునిఁగూర్చి రాముని వాక్యము.

† "బాలస్వభావసులభేన కుతూహలేన ।
కృష్టం ధనుర్భగవతో వృషభధ్వజస్య ।
తత్రానుషంగిక మముంగళ మీదృశంతు ।
సంవృత్తమత్ర నమయా గణితస్త్వమాసీః ॥"

ఈతనికవిత్వము ప్రతిపద్యసరసంబై పాండిత్యప్రకర్షముగానున్నదనుట కీక్రిందిచాటుశ్లోకము చాలును.

‡ "యేశబ్దశాస్త్రనిష్ణాతా యే శీలితనిఘంటవః ।
తేషామేవాధికారో஽స్తి మురారికృతనాటకే ॥"

† చిన్నతనపువేడుకచే శంభునివిల్లుపట్టివంచఁగా నాకస్మికముగా విఱిగిపోయినది. ఈవిషయంబున నిన్నుఁ బరిగణింపలేదు.

‡ శబ్దశాస్త్రముచదివి నిఘంటువులుపరిశీలించిన వారికే మురారినాటకము చదువ నధికారము గలదు.

## ఆనందవర్ధనాచార్యుఁడు.

-:0:-

ప్రసిద్ధాలంకారికుఁ డగునీబ్రాహ్మణుఁడు కాశ్మీరదేశస్థుఁడు. కాశ్మీరంబు నేలినయవంతివర్మసామ్రాజ్యంబున నీకవి కీర్తిఁగాంచెనని రాజతరంగిణిలోని "ముక్తాకణశ్శివస్వామీ కవిరానందవర్ధనః । ప్రథాం రత్నాకరశ్చాగాత్ సామ్రాజ్యే஽వంతివర్మణః ॥" (౫--౩౪) అనుశ్లోకమువలనఁ దెలియుచున్నది. ఈయవంతివర్మ ౮౫౫ మొదలుగా ౮౮౪ వఱకును గాశ్మీరము నేలినట్లు రాజతరంగిణివాకొనుచున్నది. మఱియు ౧౦ వ శతా

బ్దము పూర్వభాగమం దున్నరఘువంశాదివ్యాఖ్యాత యగువల్లభదేవుని పౌత్రుఁడగు § కయ్యటుఁ డీయానందవర్ధనునిదేవీశతకమునకు వ్యాఖ్యానమువ్రాసి దానిచివర “వల్లభదేవాయనితశ్చంద్రాదిత్యాదవాప్య జన్మేమాం। కయ్యటనామా రచయద్వివృతిం దేవీశతస్తోత్రే॥ వసుమునిగగనోదధి (౪౦౭౮) సమ, కాలేయాతే కలేస్తథాలోకే। ద్వాపంచాశేవర్షేరచితేయంభూమిగుప్తన్నృపే” అని తనవ్యాఖ్యాన రచనకాలమును నిర్ణయించెను. ఈకాలము క్రీ॥ శ॥ ౯౭౭ నకు సరిపోవుచున్నది. కాఁబట్టి కైయటరాజశేఖరులకుఁ బ్రాచీనుఁడు గావలసినయానందవర్ధనుఁడు శ్రీమదవంతివర్మసమకాలికుఁడై, ౮౫౫-౮౮౪ నడుమ నుండె ననుట నిశ్చయము.

ఇదియుంగాక రాజశేఖరుఁడీతనిఁ బ్రశంసించినట్లుగా సుభాషితావళ్యాదులలో “ధ్వనినాతిగభీరేణకావ్యతత్త్వనివేశినా। ఆనందవర్ధనః కస్యనాసీదానందవర్ధనః” అనుపద్యముగూడఁ గనుపడుచున్నది.

ఈపండితసార్వభౌముఁడు రచించినధ్వన్యాలోక మభినవగుప్తాచార్యునిలోచనముతోఁగూడఁ బ్రసిద్ధికెక్కియున్నది ఇందుఁ గావ్యమునకు ధ్వనియేయాత్మయని నిరూపింపఁబడినది ఇదిగాక యీతఁడు కావ్యతత్త్వము, పంచబాణలీల, దేవీశతకము, అర్జునచరితము, మొదలుగాఁ గొన్నిగ్రంథములురచించినట్లు తెలియుచున్నది. దేవీశతకముచిత్రబంధయమకశ్లేషాదిబద్ధంబై యతిక్లిష్టముగానున్నది. ఇందు, మహారాష్ట్రీపిశాచమాగధ శౌరసేనాపభ్రంశభాషలకు సంస్కృతభాషతో శ్లేషకల్పింపఁబడినది. దీనింబట్టియీపండితుఁడు షడ్భాషాపరిపూర్ణుఁడని తెలియుచున్నది. ఇందుండి భాషాషట్కసమావేశమునకొక్కటి యుదాహరించెదను. “ఆలోలకమలేచిత్తలలామకమలాలయే। పాహి చండిమహామోహాభంగభీమబలామలే”.

§ ఈకయ్యటుఁడు మహాభాష్యవ్యాఖ్యాత కాఁడు.

# రత్నాకరుఁడు.

——.o:——

ఇతఁడు గూడఁ గాశ్మీరరాజగు నవంతివర్మభూపాలుని రాజ్యకాలంబున నానందవర్ధనునితో క్రీ॥ శ॥ ౮౫౫-౮౮౪ సమమునుండెనని యాతని జీవితమున నుదాహరించిన రత్నావళీ శ్లోకములు గనిన చదువరులకు వేఱుగాఁ దెలుపనక్కఱ లేదు.

ఈతని విద్వత్కవిత్వమహత్త్వముం దెల్పు హరవిజయ మహాకావ్యమును గనియే కాఁబోలు రాజశేఖరుఁ డీతని "మాస్మ సన్తు హి చత్వారః ప్రాయో రత్నాకరా ఇమే। ఇతీవ సత్కృతో ధాత్రా కవిరత్నాకరోఽపరః" అని ప్రశంసించినట్లుగా సుభాషితహారావళిలోఁ గనుపించుచున్నది.

ఈకవి రచించిన వక్రోక్తిపంచాశికయను నేఁబది శ్లోకముల శివస్తోత్రము మఱియొకటి కనుపడుచున్నది. ఇందుఁ బార్వతి శివుఁడును బరిహాసార్థముగాఁ బరస్పరము మాటల కన్యార్థము చేసికొనుచు నొండొరుల వంచింపఁ జూతురు. ఇందుండి యొక్క పద్య ముదాహరించెదను.

"త్వం హాలాహలభృత్కరోషి మనసో మూర్ఛాం మమాలింగితః।
హాలాం నైవ బిభర్మి నైవ చ హలం ముగ్ధే కథం హాలికః।
సత్యం హాలికతైవ తే సముచితా సక్తస్య గోవాహనే।
వక్రోక్త్యేతి జితో హిమాద్రిసుతయా స్మేరో హరః పాతు వః"

పార్వతి— నీవు హాలాహలభరుఁడవు కౌఁగిలింపఁబడి నా మనస్సునకు మూర్ఛ గావించుచుంటివి.

శివుఁడు— ఓసి ముగ్ధా! నేను హాలను (సురను) హలము (నాఁగలి) భరించువాఁడను గాను హాలికుఁడ ననుకొంటివా?

పార్వతి— సత్యమే. ఎద్దు నెక్కు నీకు హాలికత్వము తగును. అని పార్వతి వక్రోక్తిచే జయింపఁబడి నవ్వు శివుఁడు మిమ్ము రక్షించుఁ గాత.

హరవిజయమహాకావ్య మేఁబదిసర్గలు గలది. ఇందు శివుఁడంధకాసురుని సంహరించి దేవతల కానంద మొసంగుటయనుకథాభాగము వర్ణింపఁబడినది. సర్వవిధలోకజ్ఞానమున కిది యాకరముగా నున్నది.

## పద్మగుప్తుఁడు.

—:o:

ఈతఁడు కాశ్మీరదేశస్థుఁ డగుబ్రాహ్మణుండు. క్రీ॥ ౮౫౫-౮౮౪ నడుమఁగాశ్మీరము నేలినయవంతివర్మభూపాలుని చరితము నే తననవసాహసాంకచరిత్రమున సమగ్రముగా వర్ణించినవాఁడగుటచే నితం డారాజునకు సమకాలికుఁడో కొంచెముతరువాతివాఁడో యగు ననితోఁచుచున్నది. మఱియు ౧౧ వ శతకము పూర్వమందున్న క్షేమేంద్రుఁడును, ౧౦ శతక ముత్తరభాగమందున్నధనంజయుఁడునుగూడఁ దమయలంకారగ్రంథంబుల నీతనిశ్లోకములుదాహరించినట్లుండుటచే నెట్లయిననీతఁడు ౯ వ శతాబ్ద ముత్తరభాగములోనివాఁ డనుట నిర్వివాదము.

ఈతనినవసాహసాంకచరితము పదునెనిమిదిసర్గలమహాకావ్యము ఇందు మహాకావ్యలక్షణానుసరణంబుగా నష్టాదశవర్ణనంబు లతిరమ్యాముగా నందందు వర్ణింపఁబడినవి. కవిత్వమతిపేశలమై శ్రావ్యముగా నుండును. ఇందుండి యొకపద్య ముదాహరించెదను.

§ "మార్గాని ద్విషతాంకులాని సమరే త్వత్ఖడ్గధారాకులే।
నాథాస్మిన్నితి వందివాచిబహుశో దేవ! శ్రుతాయాం పురా।

§ ఓరాజా! "ఈయడవిలోనే తొల్లి నీఖడ్గధారచే నాకులమైన సంగ్రామంబున శత్రువులుమునిఁగిపోయిరి" యని నుతించువందిమాటవిని గూర్జరరాజపత్ని మరల జలము జనించు ననునాశతో నీకత్తిమీఁద దృష్టి విడుచుచున్నది.

ముగ్ధా గుర్జరభూమిపాలమహిషీ ప్రత్యాశయా పాథసః ।
కాంతారే చకితా విముంచతిముహుః పత్యుఃకృపాణే దృశౌ ॥ "

దీనింబట్టి యవంతివర్మ గూర్జరదేశరాజును జయించెననికూడఁ దెలియుచున్నది.

## విశాఖదత్తుఁడు.

—,o:—

ముద్రారాక్షసకర్త యగునితఁడు సామంతప్రభు వగువటేశ్వరదత్తునకుఁ బౌత్రుండును మహారాజపదలక్షితుఁ డగుపృథువునకుఁ బుత్రుండును నయినట్లుప్రస్తావనవలనఁ దెలియుచున్నది. అజ్మీరుప్రభువును, చౌహాణరాజు నగుపృథురాయియే యీకవితండ్రి యగుపృథువైయుండునని యు నీతఁడు క్రీ॥ ౧౧-౧౨ శతాబ్దములలోనివాఁడనియు వ్రాసినవిల్సనుపండితునియభిప్రాయంబును, ౧౧ వ శతాబ్దములోనివాఁ డనుమహాలుపండితునభిప్రాయంబును నివి ప్రామాదికంబులని శ్రీకాశీనాథత్ర్యంబకతెలాంగుమహాశయులు నిర్ణయించిరి. ఁ మఱియు ముద్రారాక్షసములో బౌద్ధమతధర్మము లధికముగా వర్ణింపఁబడుటచేఁ దన్మతమభివృద్ధిలోనున్నకాలముననఁగా క్రీ॥ శ॥ ౬-౭ శతాబ్దములలోనిది పుట్టియుండుననియు నింతకంటె నితరసదాధారంబు లేవియుఁ గనుపడవనియు వారే నిర్వచించిరి. ఎట్లయిననిది ౧౧ వ శతాబ్దముకంటెఁ బ్రాచీనమై నదనుటకు దీనిలో నిపద్యములు దశరూపంబునను దాహరింపఁబడుటయే నిదర్శనమగుచున్నది ఈతనినాటకము రెండవయంకములోని " ప్రారభ్యతే నఖలు విఘ్నభయేన నీచై " రిత్యాదిపద్యము చాలమందియితరకవులశ్లోకంబులకాకరంబగు భర్తృహరినీతిశతకములోఁగనుపడుటచే నితఁడు భర్తృహరికంటెఁ

బూర్వుఁడేమోయని కొందఱికిసంశయముగలుగుచున్నది. కాని, పైపద్య మీనాటకము జనించిన వెనుకనే యెవరో నీతిశతకములో నధికముగాఁ జేర్చి యుందురనియు నవి భర్తృహరిస్వీయముగాఁ జేర్చినదిగాదనియు నూహింపవలసియున్నది.

మఱియుఁ గావ్యాలంకారసూత్రవృత్తిలోఁ గాని, ధ్వన్యాలోకంబులోఁ గాని యీయుత్తమనాటకంబులోని శ్లోకములుదాహరింపఁబడక పోవుటచూడఁగా ౯ వ శతాబ్దముకంటె నితఁడు ప్రాచీనుఁడు కాఁడేమో యని సంశయము గలుగుచున్నదిగాని, కాలనిర్ణయంబుల కీయలంకారగ్రంథములే ముఖ్యాధారంబులు కాకపోవుటచే నెట్లు చెప్పుటకును వలనుపడకున్నది. కావున నింతకంటెఁ బ్రబలాధారములు లభించునంతవఱకునీకవి ౭-౯ శతాబ్దములనడుమ వాఁడైయుండునని యనమూహింతము.

ఇతఁడు రచించినది ముద్రారాక్షసముగాక మఱియొకటి కనుపడదు. ఇది, రాజనీతిని, రాజ్యతంత్రంబులను దెలుపుచక్కని నాటకము. చందనదాసునింట మంత్రిరాక్షసుని ముద్ర (వ్రేలియుంగరము) దొరకుటయు దానిమూలముగా నతఁడు చాణక్యునకువశ్యుఁ డగుటయు ననునంశంబులు ప్రధానంబులుగా దీనికీపేరువచ్చినది. ౧. నవనందరాజులచే నవమానింపఁబడిన చాణక్యుఁడను బ్రాహ్మణుఁ డారాజుల సంహరించి వారిసవతితల్లి కుమారుఁడైన చంద్రగుప్తునిఁ బాటలీపుత్రమునకుఁ బ్రభువుగానొనరించెదనని ఘోరప్రతిజ్ఞచేసి గుప్తముగాఁ గిరాతరాజుతోను మ్లేచ్ఛరాజగు పర్వతకునితోను మైత్రియొనరించి వారిచే నవనందరాజులను జంపించి చంద్రగుప్తుని రాజుగా నొనరించెను. మఱియు మంత్రిరాక్షసుని యెల్లయుపాయంబులకుఁ బ్రతిక్రియలొనరించి యారాజులతండ్రి యగుసర్వార్థసిద్ధినిఁ బర్వతకాదులనుగూడ మాయోపాయంబులఁ జంపించెను. పిదపఁ బర్వతకునికుమారుఁ డాపురము విడిచి స్వపురంబు చేరుటగని మం

త్రిరాక్షసుఁడాతనియొద్దకుఁ జేరి చంద్రగుప్తునివధ కుద్యమించుచుండెను. ఇట్లుండఁ జాణక్యుఁడెట్లయిన నారాక్షసునిఁ జంద్రగుప్తునిమంత్రిగా నొనరింపవలెనని యెన్ని పెక్కుకుటిలోపాయంబులు పన్ని తుద కాతనిఁ జంద్రగుప్తునియొద్దకుఁ జేర్చెను" అనుకథా సంవిధానంబు నతినిపుణముగా రాజనీతిపరముగాఁ బెంచి కవి దీనియందుఁ దనప్రతిభాసామర్థ్యమును గల్పనా చాతుర్యమును జూపెను. ఇందు వీరరసము ప్రధానము, అద్భుతరసము దానియంగము, ధీరోదాత్తుఁడు నాయకుఁడు, బృహత్కథావిష్ణుపురాణప్రఖ్యాత మితివృత్తము. ఇందుండి చాణక్యమంత్రిరాక్షసులవాక్యములను దెలిఁగించి వ్రాసెదను ,, నవనందరాజులను డియించితిని. చంద్రగుప్తునికి రాజ్యమిచ్చితిని. కోపానురాగంబులకు ఫలము శత్రుమిత్రులయెడసమానముగా విభజింపఁబడినది కాని మంత్రి రాక్షసుండు వశపడక పోయినచో స్థైర్యమెట్లు కలుగును? నందవంశశేషమున్నయెడల నాతఁడు వశ్యుఁడు కాఁడని యే సర్వార్థసిద్ధినిఁ గూడఁ జంపించితిని. అయిన నితఁడు మలయకేతువును బట్టి చంద్రగుప్తునిఁ జంప నెంచుచున్నాఁడు. ఓమంత్రిరాక్షసా! బాగుబాగు లోకములో భృత్యులు సంపదతోఁ గూడినరాజును ధనాశచే సేవింతురు. తమ ప్రభువు లాపదలో నున్నను మరల సంపదఁ గాంతురను నాసచేఁ గొందఱు సేవింతురు. తమ ప్రభువంశము నిర్మూలమయినను సర్వకామములఁ బరిత్యజించి రాజభక్తిచే వారిశత్రువులయెడఁ బ్రతిక్రియఁ గలఁచు నీవంటి యుత్తములు లోకములో లేరు. కావున నే నిన్నుఁ గాంక్షించుచుంటిని" అని చాణక్యుని యాలోచనము. ,, ఆహా యెంతకష్టము? చంద్రగుప్తునిఁ జంప విషకన్యను బ్రయోగింపదానిచేఁ బర్వతకుఁడు చచ్చెను విషశస్త్రాదిప్రయోగములు చేయఁగా వానిచే నాభృత్యులు చచ్చిరి. నాసీతులన్నియు నాయాలోచనకు వ్యతిరిక్తములై చంద్రగుప్తునికి ఫలించుచున్నవిగదా? అని రాక్షసుని యాలోచనము.

“§ ప్రాణములనైనను గోల్పోవుదునుగాని నన్నునమ్మి నాయింట నుంచినమంత్రి రాక్షసునిభార్యాపుత్రులను సమర్పింప” ననుచందనుదాసుని శరణాగతరక్షణధర్మమును, తనకు దొరకినముద్రమూలముగా నసత్యపత్రిక కల్పించి మలయకేతువుమనస్సు చెఱిచి రాక్షసుని వశపఱచుకొను చాణక్యునిరాజనీతియు, అశక్యమగునంతవఱకును జంద్రగుప్తునున్మూలింపనుద్యమంబు విడువని రాక్షసునిరాజభక్తియు నీనాటకమున కలంకారములుగానున్నవి.

ఉత్తమమధ్యమాధములగుణమును దెల్పునీక్రిందిశ్లోకమే భర్తృహరినీతిశతకములోఁ బ్రక్షిప్తముగాఁ జేరినట్లున్నది.

† ప్రారభ్యతే నఖలు విఘ్నభయేన నీచైః।
ప్రారభ్య విఘ్ననిహతా విరమంతి మధ్యాః।
విఘ్నైః పునః పునరపి ప్రతిహన్యమానాః।
ప్రారబ్ధ ముత్తమగుణా న పరిత్యజంతి॥

---

§ చూ॥ బొంబాయిప్రతి ముద్రారాక్షసటీక.

† నీచులు విఘ్నభయముచేఁ గార్య మారంభింపరు. మధ్యములు కార్యమారంభించి విఘ్నభయముచే విడుచుదురు. ఉత్తములో యెన్నియంతరాయములు వచ్చినను దామువట్టినకార్యము విడువరు.

## రాజశేఖరుఁడు.

——:o:——

లోకప్రసిద్ధం బగుపేరు గాంచినమహాకవులలో నొకఁ డగునీతనిఁ గూర్చియనేకప్రాచీనకవులును నవీనవిమర్శకులును మిక్కిలి ప్రసంగించియుండిరి. సాయనమాధవాచార్యుని శంకరవిజయంబున రెండుమూఁ

ముచోట్ల నాటకత్రయకర్తయని ప్రసంగింపఁబడిన కేరళక్షితిపాలకుఁడగు రాజశేఖరుఁడు శంకరభగవత్పాదులసమకాలికుఁడగుమఱియొకరాజకవి కావచ్చు ననినదుర్గాప్రసాదపండితులయభిప్రాయము యుక్తియుక్తమని నమ్మఁదగును.

బాలరామాయణాదికర్త యగుమనరాజశేఖరుఁడు తనకావ్యంబుల మహేంద్రపాలరాజును వర్ణించియుండెను. ఈరాజునుగూర్చి ఇండియన్ ఆంటిక్వేరీ ౧౫వ భాగములో "ఓమ్స్వస్తి శ్రీమహోదయసమావాసితానేకగోహస్త్యశ్వరథపత్తిసంపన్నస్కంధావారాత్ — పరమభగవతీభక్తో మహారాజ శ్రీభోజదేవస్తస్య పుత్రస్తత్పాదానుధ్యాత శ్రీచంద్రభట్టారికాదేవ్యాముత్పన్నః పరమభగవతీభక్తో మహారాజ శ్రీమహేంద్రపాలదేవశ్శ్రావస్తిభుక్తౌ శ్రావస్తీమండలాంతఃపాతి బాలయికావిషయసంబద్ధపానీయకగ్రామసముపగతాన్ సర్వానేవ యథాస్థాననియుక్తాన్ ప్రతివాసినశ్చ సమాజ్ఞాపయతి—సంవత్సర—౧౦౦ ౫౦ ౫ మాఘసుది ౧౦ నిబద్ధం" అని మహేంద్రపాలదానపత్రము ముద్రితమై యున్నది. ఇందువేర్వేఱుగానున్న యంకెలఁగలిపినయెడల ౧౫౫ అగుచున్నది. ఇది హర్షవర్ధనరాజ్యారంభకాలమనియు దీనికాతనిరాజ్యారంభకాలమున కయిన క్రీస్తువత్సరములు ౬౦౬ కలిపినయెడల ౭౬౧ వచ్చుచున్నదనియు నిదియేదానపత్రసమయమనియు డాక్టరుఫ్లీటుగారియాశయము. దీనింబట్టియే యాతనియాశ్రితుఁడగురాజశేఖరుఁడు ౯వ శతకము పరభాగముననుండుననియొకరిద్దఱునిర్ణయించిరి. కాని, దానపత్రములోని సంఖ్య దురూహ్యముగానున్నదనియు దానింబట్టి హర్షవర్ధనకాలము కల్పించుటయు నకాలంబున మహేంద్రపాలరాజశేఖరులుండిరనుటయు యుక్తియుక్తముగా లేదనియుఁ జాలమందియభిప్రాయము. ఔను నిజమే. రాజశేఖరుఁడు ౧౦వ శతాబ్దము పూర్వభాగమున నుండెనని యనేకనిదర్శనము లుండఁగాఁ బైతప్పులెక్క నెవఁడు విశ్వసించును?

ఈదానపత్రము కాలనిర్ణయమునకుమాత్రమే సరియయినమార్గముచూపకున్నదిగాని మనకవికి నాతనిప్రభువునకును సంబంధించియేయున్నది. ఎట్లనఁగా? దానపత్రములోని మహోదయము మహేంద్రపాలునిరాజధాని యగుమహోదయమనునామాంతరంబుగల కాన్యకుబ్జమైనట్లుగా " కాన్యకుబ్జం మహోదయం, మహోదయః కాన్యకుబ్జే " అను విశ్వప్రకాశ మేదినీ నిఘంటువులవలనను, బాలభారతప్రస్తావనలోని మహోదయనగరప్రసంగమువలనను, బాలరామాయణ దశమాంకములోని రామలక్ష్మణవచనములుగానున్న " మందాకినీపరిక్షిప్తంమహోదయంనామనగరం " ఇదం ద్వయం సర్వమహాపవిత్రం పరిస్ఫురాలంకరణైకహేతుః। పురంచ హేజానకి కాన్యకుబ్జం సరిచ్చ గౌరీపతిమౌలిమాలా॥ అనువాక్యపదంబులవలనను ధ్రువమగుచున్నది.

పైదానపత్రమునుబట్టి కొందఱునిర్ణయించినకాలమే కవికాలమని చెప్పినయెడల ౭౩౦ లోఁగాన్యకుబ్జంబునేలిన యశోవర్మకు నాతనికవియగు భవభూతికిని, మనరాజును గవియు సమకాలికులు గావలసివచ్చునుగదా? అట్లయినయెడల భవభూతిని సుబంధువు, వానిని గవిరాజు, వీరిముగ్గురిని రాజశేఖరుఁడు కాలక్రమంబున వారిగ్రంథముల స్మరించుట యెట్లు తటస్థించును? ఇదికాక, కాన్యకుబ్జంబును యశోవర్మయేలుచుండఁగా మహేంద్రపాలుఁడేలెననుట యసంభవముగదా? కావున భవభూతి రాజశేఖరులయంతరము తుదకొకశతాబ్దముకంటె నధికముగానుండవలయునని తేలుటచే ననేకవిమర్శకసమ్మతంబుగా మనకవికాలము ౮౯౮ తటస్థించుచున్నది. ఇస్లేప్రొఫెసరుపీబరు మొదలగువారు తెలిపియుండిరి. మఱియు ౧౦ వ శతకముకట్టకడ నున్నభోజరాజుపెత్తండ్రి యగుముంజ (వాక్పతిరాజ) మహీపాలుని యాస్థానకవి యగుధనికకవి దశరూపావలోకంబున నీతనికర్పూరమంజర్యాదులలోని పద్యములుదాహరించుటచే

గూడ మనకవి దశమశతకాంతిమభాగంబునకుఁ బూర్వుఁడుగావలసియున్నది. దీనిచేతనే మనకవి ౧౧ వ శతకమునంతంబున నుండెనను విల్సను పండితునియభిప్రాయంబును ౧౪ వ శతకమున నుండె ననువాక్సిముల్లరు నాశయంబునుగూడ నిరాకృతంబులగుచున్నవి. ఇదియుంగాక ౮౮౪ లోఁ గాశ్మీరము నేలినయవంతివర్మరాజసమకాలికు లగునానందవర్ధన రత్నాకరులనితఁడు నుతించినట్లుండుటచేతను శా॥శ॥ ౮౮౧ లోననఁగా క్రీ॥ ౯౫౯ లో యశస్తిలకచంపువురచించిన జైనసోమదేవుఁడీతని నుతించినట్లుండుటచేతను మనకవి వీరిమధ్యకాలంబులోనివాఁడని స్పష్టపడుచున్నది. కావున నెవ్విధంబుననాలోచించినను రాజశేఖరకవి క్రీ॥శ॥ ౮౮౪ ౯౫౯ నడుమ నుండె ననుట నిశ్చయ మగుచున్నది.

ఈకవి తననాటకప్రస్తావలలోఁదన్ను రాజగురువని వర్ణించుకొనుటచేతనే బ్రాహ్మణుఁడని తెలియుచున్నది. విద్ధసాలభంజికాబాలరామాయణప్రస్తావనలలోనున్న „ అకాలజలదస్య పౌత్రః” సమూర్తో యతాసీ ద్గుణగణఇవాకాలజలద స్సురానందసోపి శ్రవణపుటపేయేన వచసా। నచాన్యే గణ్యంతే తరలకవిరాజప్రభృతయో మహాభాగ స్తస్మిన్నయమజని యాయావరకులే॥ తదాముష్యాయణస్య మహారాష్ట్రచూడామణేరకాలజలదస్య చతుర్థో దౌర్దుకిః (దౌహికిః) శీలవతీసూనురుపాధ్యాయశ్శ్రీరాజశేఖరః „ అనువాక్యమువలన నీతఁడు మహారాష్ట్రదేశస్థుఁడనియు, అకాలజలదకవికి మునిమనుమనికొడుకనియు” యాయావరనామకవంశమున జన్మించినవాఁడనియు, మహేంద్రపాలవర్ణనమునుబట్టి స్వదేశము విడిచి కాన్యకుబ్జంబునకు రాజాశ్రయంబునవచ్చెననియుఁ దెలియుచున్నది.

ఈతఁడురచించినవి బాలభారతము, కర్పూరమంజరి, విద్ధసాలభంజిక, బాలరామాయణము ననునాలుగుగ్రంథములులోకంబున వ్యవహారిం

పఁబడుచున్నవి. కాని, యీతఁడు బాలరామాయణప్రస్తావనలో వ్రాసి కొనిన "విద్ధినష్షట్ప్రబంధాన్" అను వాక్యమువలన, శ్రీహర్షవిక్రమాది త్యజీవితములలో వ్రాసినట్లుగా డాక్టరు, ఆపడ్డుదొర వారు సేకరించినట్లు తెలియుచున్న సవ్యాఖ్యలిఖితసట్టకమును, సుభాషితావళ్యాదులలో నికవివిషయంబు లగురాజశేఖరుని పెక్కుశ్లోకంబులనుబట్టి కొందఱూహించినట్లుగాఁ గవివిమర్శమను గ్రంథము నీతనివేయని విశ్వసింపఁదగుటచేని తఁడాఱుగ్రంథములు రచించినట్లు ధ్రువ మగుచున్నది.

పైనాలుగు గ్రంథములలోఁగూడ నీకవి రఘుకులచూడామణియగు మహేంద్రపాలదేవుఁడు తనశిష్యుఁడని వర్ణించి బాలభారతప్రస్తావనలో విశేషముగా రఘువంశముక్తామణియు, నిర్భయనరేంద్రపుత్త్రుఁడునగుమహీపాలదేవుని వర్ణించెను. కర్పూరమంజరీప్రస్తావనలోఁగూడఁ దన సమకాలికు లగుమృగాంకలేఖాకథాకారాపరాజితకవులుతన్నునుతించినట్లుగా "బాలకవిః కవిరాజో నిర్భయరాజస్య తథోపాధ్యాయః" అని చెప్పికొనెను. ఈయంశములనుబట్టిచూడఁగా మహేంద్రపాలునికే నిర్భయరాజను నామాంతరంబుగలదనియు నాతనిపుత్త్రుఁడు మహీపాలదేవుఁడనియుఁ దండ్రికొడుకుల కిద్దఱకును నీకవి గురువై వారియాస్థానమున నుత్తమపదము నొందియుండెననియు విశద మగుచున్నది.

ఈతని బాలభారతమునకుఁ బ్రచండపాండవ మనునామాంతరంబుగలదు. "రాజశేఖరకవేర్మహాత్మనో బాలభారతమిదం హినాటకం" అనిప్రస్తావనలో నుండుటచే నిదితుదకైదంకములుగలదియైనను గావలయును. కాని, దీని రెండంకములుమాత్రమే వ్యవహారంబుననున్నవి. దీనిధోరణిఁ జూడఁగాఁ గవి, బాలరామాయణమువలెనే భారతకథను సంగ్రహించి ప[illegible]ంకములరూపకముగా రచించియుండునని తోఁచుచున్నది. అట్లుకానియెడల దీనికిఁ బ్రచండపాండవ మనునామమే చెల్లదు. ప్రథమాంకము

లో—వ్యాసప్రాచేతసప్రవేశము, రాధావేధము (లక్ష్యవిశేషమునుగొట్టుట) పణముగాఁగల ద్రౌపదీస్వయంవరమున కెల్లరాజులువచ్చుట, బ్రాహ్మణవేషధరుఁడగునర్జునుఁడు దానినిఁగొట్టి పందెముగెలుచుట, పరరాజులయాగ్రహమును వర్ణింపఁబడినవి. రెండవదానిలో—దుర్యోధనుఁడు ధర్మరాజును ద్యూతమునకుఁబిలుచుట, యామాయజూదముననితఁడు శకునిమూలముగా సర్వమునోడుట, దుశ్శాసనావమానిత యగుద్రౌపదిప్రతిజ్ఞ, పాండవులు వనవాసమునకేగుట యనునంతవఱకును వర్ణింపఁబడినది.

కర్పూరమంజరి యిదియొకసట్టకము. ప్రవేశకము, విష్కంభము లేనిదై యంకములకు బదులుగా నాలుగుజవనికాంతరములుగలిగి ప్రాకృతభాషామయమైనరూపకము సట్టకమనఁబడును. ఇట్టిసట్టకము రచించుటకుఁగారణము కవియిట్లు తెల్పెను. “ సంస్కృతవాక్కులు కఠినములు, ప్రాకృతవాక్కులు సుకుమారములు. పురుషులకుఁ గాంతలకునుబోలె వానికి విశేష మంతరముగలదు ”

మఱియునిక్కవి, పారిపార్శ్వికవచనంబుగాఁ దనపత్నియు, చాహువానకులసంభూతయు నైనయవంతిసుందరి కోరఁగా దీనినిఁబ్రయోగించినట్లుచెప్పుటయుఁ, గథలోని స్త్రీపాత్రలకవితారసజ్ఞతను వర్ణించుటయుఁ జూడఁగా నక్కాలంబున స్త్రీలవిద్యాభిమానమును వారిగౌరవంబును గోచరము లగుచున్నవి. శృంగారరసప్రధానంబగు దీనియందుఁజండపాలభూవరుఁడు వినోదార్థముగా నద్భుతసిద్ధి గలభైరవానందుఁడను యోగీశ్వరునిచే మంత్రబలమునఁ దనయింటికి రప్పింపఁబడినతనపట్టమహిషిపినతల్లికూఁతురును గుంతలదేశరాజుపుత్రికయు నగుకర్పూరమంజరిని బరిణయంబగుట యనుకథాభాగము సవిస్తరముగా సరసముగా సులభశైలిని వర్ణింపఁబడినది.

బాలరామాయణము పదియంకములప్రకరణము. దీనియందు రామాయణకథ యంతయు సంగ్రహముగా వర్ణింపఁబడినది. ఈతనికవితాశక్తి గౌరవంబుల కాలవాలమై ప్రసిద్ధి గాంచినయీనాటకంబుకథను వివరింప నవసరము లేదు గావున నొకటిరెండుపద్యములుమాత్రముదాహరించెదను

"కర్పూరఇవ దగ్ధోఽపి శక్తిమాన్ యోజనేజనే।
నమోఽస్త్వవార్యవీర్యాయ తస్మై మకరకేతవే॥ 3 అం"

దీనివలన మాడ్చినను బచ్చకర్పూరముశక్తి నశించ దనువస్తుతత్త్వము బోధింపఁబడుచున్నది.

సీతభర్తతో నడవికి వెళ్ళినపిదప నామెవార్తను సుమంత్రుఁడు దశరథునకుఁ జెప్పుసందర్భమున నున్నయీశ్లోక మెంతయు శృంగారకరుణరససారస్య మొలికించుచు దీని కిదియే సాటి యనునట్లున్నది.

"మసృణచరణపాతం గమ్యతాం భూః సదర్భా।
విరచయ సిచయాంతం మూర్ధ్ని ఘర్మః కఠోరః।
తదితి జనకపుత్రీ లోచనైః రశ్రుపూర్ణైః।
పథి పథికవధూభి ర్వీక్షితా శిక్షితాచ॥"

మార్గములోఁ బతివిరహిత లగు స్త్రీలు సీతనుజూచి, "అమ్మా! త్రోవ దర్భాంకురములతో నిండియున్నది మెల్లగానడుగు లిడుము. ఎండతీక్ష్ణముగానున్నది చీరచెఱఁగు నెత్తిమీఁద వేసికొనుము" అనిబాష్పపూరితనేత్రలై యనురాగంబున బోధించిరఁట. ఇందుసీతసౌకుమార్యము నామె యరణ్యగమనవిచారము నిర్వచింపఁబడుటయేకాక సీతవలెమనకుఁ బతిననుసరించిపోవుభాగ్యము సంభవించినదికాదుగదా యనువియోగినులమనోవైకల్యము గూడసూచింపఁబడినది.

విద్ధసాలభంజిక నాలుగంకములరూపకము. ఇది కేవలకల్పితకథ యగునొకనాటిక. ఇది కేవలశృంగారరసభూయిష్ఠంబై సరసజనహృద్యం

బుగానుండును. ఇందు మృగాంకలేఖా విద్యాధరమల్లదేవులయనురాగము పూర్ణముగా వర్ణింపఁబడినది. ఇందలి శృంగారరసము మంగళాచరణపద్యంబువలననే సూచింపఁబడుచున్నది.

‡ "దృశాదగ్ధం మనసిజం జీవయంతి దృశైవయాః।
విరూపాక్షస్య జయినీ స్తాస్తువే వామలోచనాః॥"

విరహాతురుఁడగు కథానాయకునివచనం బగునొక్క పద్యముదాహరించెదను.

† "శ్యామాం శ్యామలిమానమానయత భో స్సాంద్రైర్మషీకూర్చకైః
మంత్రం తంత్ర మథ ప్రయుజ్య హరత శ్వేతోత్పలానాం శ్రియం।
చంద్రం చూర్ణయత క్షణాచ్చ కణశః కృత్వా శిలాపట్టకే।
యేన ద్రష్టుమహం క్షమే దశదిశ స్తద్వక్త్రముద్రాంకితాః॥"

ఇట్టిసుహాకవులకృతులఁ జదివి యానందింపవలయును గాని స్థాలీపులాకన్యాయంబుగ విమర్శించుటచే నేమి తనివి తీఱును?

‡ ఈశ్వరుఁడు చూపుచేఁగాల్చిన మన్మథుని దమచూపుచే జీవింపఁజేయునట్టి జవరాండ్రను నుతించెదను.

† ఓసేవకులారా! మృగాంకలేఖాముఖముద్రాంకితములైన పదిదిక్కులునే నుజూచుటకుఁ దగినట్లుగా, రాత్రికి మషీతూలికలతో నల్లరంగువేయుఁడు. మంత్రమో తంత్రమో కల్పించి తెల్లకలువలశోభహరింపుఁడు. చంద్రుని రాతిమీఁదవేసి పిండిచేయుఁడు.

---

# భల్లటకవి.

—:o:—

క్రీ॥ ౧౦ వ శతాబ్దముచివరనున్న శ్రీమదభినవగుప్తాచార్యుఁడు ధ్వన్యాలోకలోచనంబునఁ బెక్కుచోట్ల నీశనిశతకములో నిపద్యములను

దాహరించుటచే నీకవి ౯ వ శతాబ్దముచివరనో ౧౦ వ శతకము మొదటనో యున్నవాఁడనితోఁచుచున్నది. కాశ్మీరదేశస్థుఁ డగునితఁడు రచించినది భల్లటశతకముగాక మఱియొకటేదియుఁగనుపడదు. అనేకాలంకారికు లీతనిశ్లోకములఁ దమగ్రంథముల నుదాహరించుటయె దీనిప్రశస్త్యమున కుదాహరణము. వివిధనీతులను దెల్పునిది ప్రాపంచికజ్ఞానదాయకముగా సులభశైలినున్నది. ఇందుండి యొకశ్లోక ముదాహరించెదను.

§ "ఆబద్ధకృత్రిమసటాజటిలాంసభిత్తి।
రారోపితో మృగపతేః పదవీం యదిశ్వా।
మత్తేభకుంభతటపాటనలంపటస్య।
నాదం కరిష్యతి కథం హరిణాధిపస్య॥"

§ మెడకు జూలుచుట్టి సింహపదవి కెక్కించినంతమాత్రమునఁగుక్క, మదపుటేనుఁగులనెత్తిచీల్చునట్టిసింగముగర్జనము చేయఁగలుగునా?

# ఆర్యక్షేమీశ్వరుఁడు.

—:o:—

ఈతనిచరిత్ర మీక్రింది హిందూదేశచరిత్రవలనను, గొందఱుపూర్వాణవిమర్శకులయభిప్రాయంబులను నిట్లుధ్రువపడుచున్నది.

† క్రీ॥ ౮౮౩ లో ఘూర్జరరాజ్యప్రభువుగానుండి కన్యాకుబ్జంబుగెలిచి దానిఁదనరాజధానిగాఁ గావించుకొనిన ప్రథమభోజునిమనుమఁడగు ద్వితీయభోజునికుమారుఁడు మహీపాలదేవుఁడు క్రీ॥ శ॥ ౯౧౩ లోఁ జండల్ రజపూతులరా జగుయశోవర్మతోఁబోరాడి బుందెల్ ఖండుభాగమును, ౯౧౬ లో దక్షిణములోనిరాష్ట్రకూటరా జగుధ్రువునితోఁబోరా

† చూ॥ హిందూ దేశకథ.

డి ఘూర్జర రాజ్యములోఁ గొంత భాగమును గోలుపోయినవాఁడయ్యు ని రంతరముగా శత్రువులతోఁబోరాడుచు మరలఁగొన్ని రాజ్యములను సం పాదించినట్లు కనుపడుచున్నది. ఈకనోజురాజగుమహీపాలుఁడే చండ కౌశికములోని మహీపాలుఁ డనునభిప్రాయంబుతో ‡ యమ్ విలియ ము మేగ్డోనలుపండితులు, చండకౌశికము ౧౦ వ శతాబ్దములోఁ బుట్టి యుండునని వ్రాసిరి. కాని, చండకౌశికప్రస్తావనలో— "ఆదిష్టోఽస్మి దుష్టామాత్యబుద్ధినాగురాలఁఘ్య సింహారంహసా, భ్రూభంగలీలాసము ద్ధృతాశేషకంటకేన, సమరసాగరాంతర్భ్రమద్భుజదండ మందరాకృష్టల క్ష్మీస్వయంవరప్రణయినా శ్రీమహీపాలదేవేన—యస్యేమాం పురావిదః ప్రశస్తిగాథాముదాహరంతి. యస్సంశ్రిత్య ప్రకృతిగహనా మార్యచాణ క్యనీతిం। జిత్వా నందాన్ కుసుమనగరం చంద్రగుప్తోజిగాయ। కర్ణాట త్వం ధ్రువ ముపగతా నద్య తానేవహంతుం। దోర్దండాఢ్యస్సపునరభవ చ్ఛ్రీమహీపాలదేవః॥" అనిసూత్రధారవచనము కనుపడుచున్నది. (అనఁ గా) మహత్తులైనతనకుమంత్రులకు లోఁబడనియీతఁ డవలీలగా సర్వశత్రువుల జయించి సార్వభౌమత్వము నొందెననియుఁ బూర్వము తనచేజయింపఁబడి యిపుడు కర్ణాటరాజై పుట్టిననవనందరాజులను మరల గెలుచుటకుఁ జంద్ర గుప్తుఁడే యీమహీపాలరాజరూపముగా జన్మించె ననియు దీనిభావము. దీనింబట్టి తమప్రభువులపరాజయమును వర్ణించుట కవులకు స్వభావము గామిగావునఁ గవి యీతనిజయమునే వర్ణించినట్లుకనుపడుచున్నను మొ త్తముమీఁద నితఁ డనేకరాజులతోఁ బెక్కుసార్లు యుద్ధముచేసినవాఁడని యీవర్ణనము పూర్వోక్తచరిత్రభాగమును విశ్వసింపఁజేయకపోదు. మఱి యు నీతఁడు రాష్ట్రకూటరాజగుధ్రువునిమీఁద దండెత్తకమున్నో లేక యోడివచ్చి మరల గెలువుగోరునపుడో కవి యీనాటకము రచించియుం

‡ ఇండియన్ విజడమ్. ఇంపీరియల్ గెజటీరు.

డునని యుఁ గావున నీ పైశ్లోకములో—“కర్ణాటత్వం ధ్రువముపగతా” ననుచో నవనందావతార మగుకర్ణాటరాజును, ధ్రువరాజును జంపుట కొఱకని యర్థమువచ్చునట్లుగా నిశ్చయార్థకం బగుధ్రువపదమును ధ్రువరాజపర మగునట్లుగాఁ గూడఁ బ్రయోగించియుండు ననియు ధ్రువపదసారస్యమువలనఁ దెలియుచున్నది. కావున నెట్లయిన నీకవి పూర్వోక్తవిమర్శనానుగుణంబుగా ౧౦ వ శతాబ్దము మొదట జీవించియుండు నని ధ్రువమగుచున్నది. ఈమహీపాలునకే కార్తికేయుఁడనునట్టియొక పేరుగలిగినట్లు నతఁడు తన్ను విశేషముగా గౌరవించినట్లుగాఁ గవి నాటకాంతమున “ప్రతిదినమొక్క కథయంక నాభినయింపఁజేసి సువర్ణాలంకారవస్త్రాదు లొసంగినకార్తికేయరాజుకీర్తి కవికీర్తితో క్షీరసాగరాంత మొందుఁగాక” యని వ్రాసినవాక్యమువలనఁ దెలియుచున్నది

ఈకవి బ్రాహ్మణుఁడు; ఈతనిముత్తాత విజయప్రకోష్ఠపండితుఁడు. ఇతఁడు రచించినది చండకౌశిక మను నైదంకములనాటకముగాక మరియొకటి కానరాదు. ఉగ్రకోపుఁడగు విశ్వామిత్రుఁడు మూలముగాఁగల దీనికిఁ జండకౌశిక మని పేరువచ్చినది. ఇందుఁ బుత్రదారాత్మవిక్రయంబునఁ బ్రతిజ్ఞ నెఱవేర్చుకొని సత్యపరిపాలనం బొనరించుట విషయము. కవి, మహాభారతములోని హరిశ్చంద్రోపాఖ్యానమునే తీసికొని కొన్నిమార్పులతో నీనాటకంబు నురచించెను. ఈక్రిందికవివిజ్ఞాపన మెంతయు గుణగ్రహణంబును బోధించుచు లోకానుభవమును సూచించుచున్నది.

‡ “దృష్టం కిమపి లోకేఽస్మి న్ననిర్దోషం ననిర్గుణం ।
ఆవృణుధ్వ మతో దోషా న్వివృణుధ్వం గుణాన్ బుధాః ॥”

జంతువులకెల్ల జీవనకారణంబులలో నిద్రయే మొదటి దనునీక్రిందిహరిశ్చంద్రవచన మెంతయు శరీరారోగ్యపద్ధతిని బోధించుచున్నది.

---

‡ దోషము లేనిది, గుణము లేనిది గూడ లోకములో లేదు. కావునఁ దప్పులఁ గప్పిపుచ్చి గుణములఁ గ్రహింపుఁడు.

† "చిత్తం ప్రసాదయతి లాఘవ మాదధాతి।
ప్రత్యంగ ముజ్జ్వలయతి ప్రతిభాపి శేషం।
దోషా నుదస్యతి కరోతిచ ధాతుసామ్యం।
ఆనంద మర్పయతి యోగవిశేషగమ్యం॥"

ఈక్రింది వాసకసజ్జికామనోరథభంగవర్ణనము స్వభావసిద్ధమై కడుహృద్యంబుగా నుండును.

§ "లీలాసంభృతమండనోత్సుకతయా నీతః ప్రదోష స్తయా।
మన్మార్గార్పితనేత్రయాచ గమితో యామ స్తథైనాపరః।
నాయాతి స్మర ఇత్యుదశ్రు వికలం వ్యాధూయ భూషావిధిం।
శయ్యోపాంతవివర్తనై రథ నిశాశేషః కథం యాపితః॥"

కౌశికునిఋణముదీర్పనుపాయంబులేక చింతించుహరిశ్చంద్రునివాక్యములు. "కుబేరునిజయించి ధనముసంపాదించెదననిన రాజ్యభ్రష్టుండనైన నాకిజయమెట్లుకలుగును? యాచించితెచ్చెదనంటినా? అదిబ్రాహ్మణులదిగాని రాజులవృత్తిగాదు. వాణిజ్యమందునా? అదిధనమూలమైనది. ఏదియైనను గాలవిలంబనము నపేక్షించును. నేనో దైవవశంబునఁ గాలవిలంబనము చేయఁదగను. అకటా! ఏమిచేయుదును? నాదేహమునైన విక్రయించి శాశ్వతమైనసత్యమును రక్షించెదను. దానినిఁ గాపాడని

† మనస్సును నిర్మలముగాఁ జేయును. అవయవములను దేలికపఱచును. బుద్ధిని గూర్చును. శరీరదోషములఁబోగొట్టును. శరీరధాతువుల సమస్థితిలోనుంచును. యోగగమ్యమైనయానందము నిచ్చును.

§ ఆభరణములసమకూర్చుకొనుసంతోషముతోఁ బ్రదోషకాలమును వెళ్ళబుచ్చును. నాకై యెదురుచూచుచు మొదటిజాము జరపును. ఈమోసగాఁడింకను రాలేదనివిచారించుచు నగలను దీసివైచి శయ్యచుట్టు తిరుగుచు నిశాశేషమెట్లు వెళ్ళఁబుచ్చినదో కదా?

యెడల నైహికాముష్మికములు నశించును" హరిశ్చంద్రుని సత్యధైర్యముల కానందించునీక్రిందిధర్మనువచనము చూడుఁడు.

√* "సుఖంవా దుఃఖంవా కిమిహహి జగత్యస్తి నియతం।
వివేకప్రధ్వంసా ద్భవతి సుఖదుఃఖవ్యతికరః ;
మనోవృత్తిః పుంసాం జగతి జయినీకాపి మహతాం।
యయా దుఃఖందుఃఖం సుఖమపి సుఖంవా నభవతి ॥"

శ్మశానవాటికలోఁ బరితపించు శైబ్యనుజూచి హరిశ్చంద్రుఁడు తన భార్యయనిపోల్చు సందర్భంబున నున్నయీక్రిందిపద్యము సరసంబై సకరుణంబై శైలిచే నన్నివిధములఁ గాళిదాసకవితనుస్మరింపఁ జేయుచున్నది.

‡ "సా వాణీ కరుణార్తనాదవికలా వ్యాసంద్ర తంత్రీస్వనా।
తేచామీ భ్రమరౌఘనీలకుటిలాః పర్యాకులా మూర్ధజాః।
తాన్యంగాని కృశాన్యమూని సహసా దుఃప్రత్యభిజ్ఞానిమే।
కాంతిస్సైవ పురాణచిత్రమలినా లేఖాభిరున్నీయతే॥"

ఈనాటకము చదువువారికి జాలిపుట్టించుచు మృదుమధురపద్యభాసురంబై యొప్పుచున్నది,

---

* జగములో సుఖముగాని దుఃఖముగాని, నియతముగానున్నదా? వివేకాభావముచే సుఖదుఃఖవ్యతికరముగలుగుచున్నది. దేనిచే సుఖము సుఖమువలెను, దుఃఖము దుఃఖమువలెను గనుపడదో యట్టిమహాత్ములమనోధైర్యమే జయశీలమగును

‡ ఆర్తనాదము గలిగియు వీణాస్వనమువలెనున్న యావాణి యదే. తుమ్మెదలవలెనున్న యావిడిపోయినకుటిలశిరోజము లవియే. ఆనవాలుపట్టరాక మిక్కిలి చిక్కిన యాయంగము లవియే. చిరకాలమునాఁటిచిత్తరువువలెమలినమై రేఖలచే నూహింపఁదగిన యాశరీరశోభ యదియే.

# జైనసోమదేవుఁడు

-:0:-

ఇతఁడు జైనమతస్థుఁడయిన ట్లీతనికృత్యాద్యంతబులందున్న జిన జైనాచార్యవర్ణనమే తెల్పుచున్నది. కావ్యాంతమునున్న "శకనృపకాలాతీతసంవత్సరశతేష్వష్టస్వేకాశీత్యధికేషు (౮౮౧) గతేషు సిద్ధార్థిసంవత్సర చైత్రమాసమదనత్రయోదశ్యాం...... శ్రీమదరికేసరిణః ప్రథమపుత్రస్య శ్రీమద్వాగరాజప్రవర్ధమానవసుధారాయాం గంగధారాయాం వినిర్మిత మిదం కావ్యం" అనుగద్యమువలన శా॥ శ॥ ౮౮౧ అనఁగాఁ గీ॥ ౯౫౯ లో నితఁడుండెననియు నీతని నివాసము చోళరాజ్యములోని గంగధార యనుగ్రామమనియుఁ దెలియుచున్నది. మఱియుమూఁడవయాశ్వాసమున రాజశేఖరుని నుతించినవాఁ డగుట నాతనికంటెఁ బరుఁడుగా నలసియున్నది.

ఈతనిగురువు నేమిదేవుఁడు. ఇతఁడు యశస్తిలకచంపువనునెనిమిదియాశ్వాసముల మహాకావ్యము రచించెను. ఇందు మొదటియైదాశ్వాసములలోను యశోధరమహారాజుచరితంబును దక్కినవానిలో జినోపాసకాధ్యయనక్రమంబును వర్ణింపఁబడినవి. కథాసందర్భమునుబట్టి నడుమ నడుమ ననేకోపాఖ్యానము లుదాహరింపఁబడినవి. కవిత్వము సులభ మైన దేయైన నెందుచేతనో లోకంబున నిది వన్నెకెక్కనదిగాదు. కాని యీకవి మాత్రము రవ యాశ్వాసముచివర "మయా వాగర్థసంభారే భుక్తే సారస్వతే రసే। కవయోఽన్యే భవిష్యంతి నూనముచ్ఛిష్టభోజనాః॥" అని యత్యహంకారమును జూపియుండెను. కావ్యధోరణినిబట్టి యీతఁడు శ్రుతిస్మృతులయం దాదరము గలవాఁడనియే తేలుచున్నది. కాని యజ్ఞాదిక్రతువులను మిక్కిలియిట్లు నిందించెను.

"లోకేంద్రియై ర్లోకమనో౽నుకూలై స్స్వజీవనాయాగమపష సృష్టః। స్వర్గోయదిస్యా ప్రశుహింసకానాం సూనాకృతాం తర్హి భవేత్స కామం। మంత్రేణ శస్త్రైర్గలపీడనాద్వా వేద్యాం బహిశ్చాపి వధస్స మానః। స్వర్గో యదిస్యా న్మఖహింసితానాం స్వబాంధవై ర్యజ్ఞవిధిర్న కింతు ॥" కర్మబాహ్యుండును జాతిమతభేదరహితుండు నగునితఁడు వేదాంతప్రతిపాదిత బ్రహ్మపదార్థమే వేద్యమయినట్లు తెలిపియుండెను.

"వైరాగ్యం జ్ఞానసంపత్తి రసంగస్థిరచిత్తతా। ఊర్మిస్మయ సహత్వంచ పంచ యోగస్య హేతవః। పరే బ్రహ్మణ్యనూచానో ధృతిమైత్రీ దయాన్వితః। అన్యత్ర సూనృతాద్వాక్యాన్నిత్యం వాచంయమీ భవేత్। జాతిర్జరామృతిః పుంసాం త్రయీ సంసృతికారణం। ఏషా త్రయీ యత స్త్రయ్యాః క్షీయతే సాత్రయీ మతా। అహింసస్సద్వ్రతోజ్ఞానీ నిరీహో నిష్పరిగ్రహః। యస్స్యాత్స బ్రాహ్మణస్సత్యం నతు జాతి మదాంధలః ॥"

వేదబాహ్యమతబోధకంబగుటచేతనే యీగ్రంథము ప్రసిద్ధికెక్కనది గాదని తలంచెదను.

## *ధనంజయుఁడు.

-,o:-

ఇతఁడు బ్రాహ్మణుఁడు; విష్ణుపుత్రుఁడు; ధారానగరాధిపతియగుభోజమహారాజుపెత్తండ్రియు వాక్పతిరాజనామాంతరుండు నగుముంజమహీపాలునియాస్థానమం దున్నవాఁడు. ఇందులకు దశరూపంబుచివరనున్న "విష్ణో స్సుతేనాపి ధనంజయేన విద్వన్మనో రాగనిబంధహేతుః। ఆవిష్కృతం ముంజమహీశగోష్ఠీ వైదగ్ధ్యభాజా దశరూపమేతత్"

అనుశ్లోకమే* ప్రమాణము. భోజరాజు కాలమును బట్టి చూడఁగా నీ ముంజుఁడును మనకవియుఁగూడఁ గ్రీ॥ ౯౯౬ ప్రాంతమున నున్నవారని తేలుచున్నది.

ఇతఁడు దశరూపంబు తుదను, ధనికుఁడు దానివ్యాఖ్యానంబగు నవలోకంబు తుదను, విష్ణుపుత్రులమని వ్రాసికొనుటచే వీరిరువురు సోదరులైనఁ గావలయుననియు లేక ధనంజయుఁడే వ్యాఖ్యాకర్తృత్వంబునఁ దననామాంతరం బగు ధనికపదము నుపయోగించి యుండుననియు నూహింప వలసి యున్నది. ఇతఁడు భరతాదినాట్యశాస్త్రములను సంగ్రహించి సులభమార్గంబున దశవిధరూపంబులకు లక్షణముగా నీదశరూపంబును నిర్మించెను. ఇదియే తరువాతివారిరూపకనిర్మాణంబున కత్యుత్తమాధారంబై యనన్యసదృశంబై యొప్పుచున్నది.

---

* ద్విసంధాన కావ్యము రచించిన శ్రీదేవీవసుదేవులపుత్రుఁ డగుధనంజయుఁడు జైనుఁడు నీతనికంటె నన్యుండును రాజశేఖరకవికిఁ బూర్వుండునని యొఱుంగునది.

# శ్రీ భోజమహారాజు

-:0:-

మహాకవియనియు మహారాజనియు జగంబున నుత్తమయశస్సునవన్నెకెక్కిన యీసంస్కృతభాషాసామ్రాజ్యపాలకుని యుదంతమును వేనోళ్ళనుతించు భోజప్రబంధము, కవిసమయంబులఁ దెలుప సరియయిన యాధారంబు కాక యతిశయోక్తిభూయిష్ఠంబైనదే యైన నీతనివైదుష్య సాహసౌదార్యంబులట్టివే యై యుండునని మన మిపుడు విశ్వసింప నాధారంబుగా వచ్చునని తలంపవచ్చును.

విదర్భదేశమందలిధారానగర మీతనిరాజధాని; ఇతఁడు పార మారవంశస్థుఁడు; ఈతనితండ్రి సింధురాజదేవుఁడు. § పెత్తండ్రి (ముంజుఁడు) వాక్పతిరాజదేవుఁడు. తాత (శ్రీహర్షుఁడు) సీయకరాజదేవుఁడు ఇతఁడు శివభక్తుఁడు; అద్వైతమతస్థుఁడు; బ్రాహ్మణహితుఁడు; విద్యాప్రియుఁడు; కవితాపోషకుఁడు; దానకర్ణుఁడు; యశోభూషణుఁడు; వేయేలఁ? నిరుపమానుఁడు. ప్రాచీనలేఖమాలలో ముద్రితమైన యీతని † దానపత్రమునుబట్టి యితఁడు ౧౦౨౨ లో నున్నట్లు తెలియుచున్నది ౧౦౨౮ లో నున్న కాశ్మీరరాజగునవంతభూపాలున కీతఁడు సమకా

---

§ ముంజాపరనామధేయుఁ డగునీవాక్పతిరాజు భోజరాజునకుఁ బెత్తండ్రియయినట్లును, ఈతఁడే స్వరాజ్యంబున భోజుని నభిషిక్తునిఁ జేసినట్లును, భోజరాజునాస్థానమందలి ధనపాలుఁడు రచించినతిలకమంజరీకథాముఖంబునఁ దెలియుచున్నది. "భోజరాజు, పినతండ్రి ముంజుఁడు" అని లోకమున వాఁడబడు కథగూడ నిజమైనదికాకపోయినను బినతండ్రి పెత్తండ్రియనుభేదములో దీనికి సరివచ్చుచున్నది. కాని, కొందఱీతఁడు భోజునకుఁ బితామహుఁడని వ్రాసియుండిరి. భోజునిదానశాసనమునుబట్టియైన నీయంశము విస్పష్టముగాఁ దెలియుటలేదు. కాని, ముంజుఁడే యీతనికి రాజ్యమిచ్చినట్లుండుటచే నతఁడీతనికిఁ బెత్తండ్రియైయుండుననుట నిజమని నమ్మవచ్చును.

† ".....మహారాజాధిరాజ పరమేశ్వర శ్రీసీయకదేవపాదానుధ్యాత పరమభట్టారక...శ్రీవాక్పతిరాజదేవపాదానుధ్యాత పరమభట్టారక ... శ్రీసింధురాజదేవపాదానుధ్యాత పరమభట్టారక మహారాజాధిరాజపరమేశ్వర శ్రీభోజనరేంద్రః కుశలీ... యథా, అతీతాష్టసప్తత్యధికసాహస్రికసంవత్సరే మాఘాసితతృతీయాయాం రవావుదగయనపర్వణి శ్రీమద్ధారాయామవస్థితై రస్మాభి స్స్నాత్వా భవానీపతిమభ్యర్చ్య ... ఉపరి లిఖితోఽయం గ్రామః ... బ్రాహ్మణధనపతిభట్టాయ భక్త్యా శాసనేనోదకపూర్వకం ప్రతిపాదితః .................. ఇతి॥ సంవత్ ౧౦౭౮ చైత్ర సుది ౧౪ స్వయమాజ్ఞా మంగలం మహాశ్రీః స్వహస్తోఽయం శ్రీభోజదేవస్య" (దానశాసనసంగ్రహంబే యిందు వ్రాయఁబడినది).

లికుఁడు బంధువునని‡ రాజతరంగిణి చెప్పుచున్నది. ఈపైహేతువులంబట్టి యు నింకను గొన్ని శాసనంబులఁగనుఁగొనియుఁ గొందఱు చరిత్రకారులు క్రీ॥ శ॥ ౯౯౬—౧౦౫౧ నడుమ నీతఁ డుండెనని నిర్ణయించిరి. మఱికొందఱు ౧౦౧౦ మొదలు ౧౦౫౫ వఱకు నున్నట్లు నిశ్చయించిరి. కొందఱీతఁడు ౧౦౮౦ లో మృతినొందినట్లు వ్రాసియుండిరి. ఎట్లయిన నివియన్నియు నీషద్వైషమ్యముగా సరిపడుచున్నవి గావున నీతనికాలముంగూర్చి చర్చింపవలసినపని లేదు.

ఈమహాత్ముఁ డనేకకవులను విద్వాంసులను నాదరించినవాఁడనుటలో లేశమైనను సంశయము లేదుగాని యీతనికిఁబూర్వమందు భిన్నభిన్నకాలంబుల నున్నశాకుంతలాదికర్త యగుకాళిదాసు, భవభూతిమొదలగు మహాకవు లీతనిసమకాలికు లని భ్రమపెట్టుభోజప్రబంధము నిజముగా నీతనియాస్థానమందలికవులను దెలుప సరియయినయాధారము గాక ముఖపిధానముగావించుచున్నదిగదా యనిమాత్రము విచారింపవలసియున్నది. కాళిదాసాదికవిరత్నాశ్రయుఁడు ముజ్జునీరాజు నగువిక్రమాదిత్యుఁడే దేవభాషను బోషింపఁ దనిపేరెఱక వేయేండ్లకుఁబిదప మరల ధారానగరంబున జన్మించెనో యనఁదగు నీకవిరాజభోజుని యాస్థానంబునఁ గూడ నాంధ్రదేశీయుఁడైనకాళిదాసనునొకమహాకవిగలఁడని కెంవదంతి గలదు గాని యీతనిం దెలుపునాధార మించుకైన లభింపలే దనుటయెంతయుఁ జింత్యముగా నున్నది. కాని తిలకమంజరీకర్త యగుధనపాలకవిమాత్ర మీతనియాస్థానములోనివాఁడైనట్లు కనుపడుచున్నది. భోజుఁడనఁగా విద్యాప్రియుఁడని లోకంబున నర్థముగల్పింప హేతుభూతుఁ

‡ సచ భోజనరేంద్రశ్చ దానోత్కర్షేణ విశ్రుతౌ ।
సూరీ తస్మిన్ క్షణే తుల్యం ద్వావాస్తాం కవిబాంధవౌ ॥

డగుమహాయశస్వియైన సుధీధీరుఁడు నుదారుఁడు నుత్తమజ్ఞానియు నగు నీతనిప్రజలుగూడఁ బండితులై జ్ఞానవంతులై యుందు రనుట కనుమానమే మున్నది? కావుననే "భోజరాజు మొగముచూచినఁ గవిత్వమబ్బిన" ట్లన్నలోకోక్తి జగంబునఁ బ్రసరించియున్నది. ఇది సత్యమై చిరకాలంబు క్రిందనే వాడుకలో నున్నట్లుగా లక్ష్మణసూరికృతం బగునీక్రిందిగురు భోజరాజవర్ణనముగూడఁ దెల్పుచున్నది.

§ "దృష్టే యత్ర యదృచ్ఛయాపి వచసాం దేవీ పురో వర్తతే।
సారస్యం మహ దభ్యుపైతి సదసి ప్రాగల్భ్య ముజ్జృంభతే।
జాయంతే సకలాః కలా అపి నృణాం జాగర్తి కీర్తి ర్ఘనా।
చేత స్స్నిహ్యతి తత్ర దైశికపదాంభోజేచ భోజే నృప॥"

ఇతఁడు సకలసామంతమూర్ధన్యుఁడయ్యు రాజ్యమత్తుఁడును విషయలంపటుఁడును గానివిరాగియైనవిద్వద్వరిష్ఠుఁ డని దానశాసనమందలి యీతనిస్వహస్తలిఖితపద్యములే వాకొనుచున్నవి.

† "వాతాభ్రవిభ్రమ మిదం వసుధాధిపత్య।
మాపాతమాత్రమధురో విషయోపభోగః।
ప్రాణా స్తృణాగ్రజలబిందుసమా నరాణాం।
ధర్మ స్సఖా పర మహో పరలోకయానే॥"

---

§ ఎవని నొకసారి విలాసార్థముగాఁ జూచినంత మాత్రమున వాగ్దేవి ప్రత్యక్షమగునో రసగ్రాహిత్వము వృద్ధియగునో సభలలోఁ బ్రౌఢిమ హెచ్చునో యెల్లవిద్యలు వచ్చునో గొప్పకీర్తి సంభవించునో యట్టి గురువునందును భోజరాజునందును నామనస్సు లగ్నమగుచున్నది.

† ఈప్రభుత్వమా? మహావాయుపథములోని మేఘము యొక్క శోభవలె మిక్కిలి యస్థిరమయినది. విషయసుఖమా? అప్పటికపుడు రుచించునది. ప్రాణములా? గడ్డిపోఁచతుదనున్న నీటిచుక్కవంటివి. ఆహా! నరులకుఁ బరలోకయానంబున నొక్క ధర్మమేకదా? పరమమిత్రమగును.

‡ " భ్రమత్సంసారచక్రాగ్ర ధారాధారా మిమాం శ్రియం।
ప్రాప్య యే న దదుస్తేషాం పశ్చాత్తాపః పరం ఫలం ॥ "

ఈరాజకవిచంద్రుఁడు సరస్వతీకంఠాభరణ మనునొకగొప్పయలంకారగ్రంథంబును రామాయణచంపువును రచించెను. ఈతనియలంకారగ్రంథము మిక్కిలి ప్రామాణికమై సాహిత్యశిరోభూషణమై యకాలంబున నే వన్నెకెక్కియుండినట్లు కావ్యప్రకాశకారాదులు దీనిఁజేరొక్కనుటయే ప్రమాణము ఇది యెల్లకావ్యాలంకారలక్షణంబులకు నాకరంబై సాహిత్యగసరత్నాకరంబై యలరారుచున్నది.

కవి యీప్రబంధనామమునకును గ్రంథవిషయంబునకును గూడన నుగుణంబుగాఁ గావించిన సరస్వతీస్మరణరూపమంగళాచరణమే దీని యుద్దేశముం దెల్పుచున్నది.

" ధ్వని ర్వర్ణాః పదం వాక్య మిత్యాస్పదచతుష్టయం।
యస్యా స్సూక్ష్మాదిభేదేన వాగ్దేవీం తా ముపాస్మహే ॥ "

ఇతఁడు వాల్మీకిరామాయణము ప్రతికాండములోనికథను సంగ్రహించి పద్యగద్యరూపంబుగా వ్రాసి యాయాభాగంబులకుఁ గాండములను పేర్లే పెట్టి రామాయణచంపువు రచించెను. ఏందుచేనీకవి దీనిని సుందరకాండాంతమువఱకే వ్రాసి విరమించెనో దాని నూహింపఁజాలువరు లే ప్రమాణము. మిగిలినయుద్ధకాండమును లక్ష్మణసూరి యనుమహాకవి యీగ్రంథశైలినే యనుసరించి పూరించెను.

భోజునికవిత్వశైలి యతిసులభమై సరసమై వసుధాధిపత్యముం బోలి కవితాధిపత్యముం బ్రకటించుచున్నది. పఠనపాఠవ్యవహారంబున వన్నెకెక్కిన దీనికథ లోకప్రసిద్ధ మగుటచే నిందువివరింప నక్కఱలేదు.

---

‡ గిఱ్ఱున దిరుగు సంసారమనెడు చక్రముయొక్క యంచే యాధారముగాఁ గల యీసంపదను జెంది దానముచేయనివారికిఁ బశ్చాత్తాపమే ఫలమగును.

ఇందలిమంగళాచరణశ్లోక మీతనియాస్తిక్యమును వైదుష్యమును బ్రాహ్మణప్రియత్వమును దెల్పుచు నెంతనీతిదాయకముగాఁ బ్రాభవ్యదోతకముగానున్నదో చూడుఁడు?

* " ఉచ్చైర్గతి ర్జగతి సిధ్యతి ధర్మతశ్చ ।
త్తస్య ప్రమా చ వచనైః కృతకేతరైశ్చేత్ ।
తేషాం ప్రకాశనదశాపి మహీసురైశ్చే ।
త్తా నంతరేణ నిపతే త్క్వను మత్ప్రణామః ॥ "

ఈకావ్యమాద్యంత మొక్కరీతిగా సరసకల్పనంబులను, నవవిధరసభరణంబునను, సదలంకారంబులను మృదుపదలాలిత్యంబునను జెంపొందుచు నఖిలజనహృద్యముగానున్నది. అడవికి వెళ్ళుచుఁ గైకేయితో రాముఁడన్నవాక్యమెంత భావగర్భితమై శాంతరసస్ఫూరితముగా నున్నది?

† " అమ్మా కైకేయీ! అడవిలో, నన్నుఁబోషించుకొనునట్టిభారమే నాకు నియోగించితివి. సకలభూభరణభారము తమ్ముని నెత్తినుంచితివి. మాయిద్దఱిసౌకర్యము తలఁచినయెడలఁ దల్లీ! నీకు నాయందే పక్షపాతము కన్నుపడుచున్నది "

* ఉత్తమగతి, ధర్మమువలనే సిద్ధించునేని యాధర్మజ్ఞానము వేదవాక్యములచేతనే సంభవించునేని యావేదార్థప్రకటనము బ్రాహ్మణులచేతనే కాఁదగునేని వారిని విడిచి నా నమస్కారము మఱియొక్కఁడఁ బడును? ఇందు శ్రుతివిహితంబుగ వేదవేత్తలకు వందనము విధింపఁబడుచున్నది

† వనభువి తనుమాత్రత్రాణమాజ్ఞాపితం మే ।
సకలభువనభారస్థాపితో వత్సమూర్ధ్ని ।
తదిహ సుకరతాయా మావయో స్తర్కితాయాం ।
మయి పతతి గరీయా నంబ! తే పక్షపాతః ॥

కల్పనాచాతుర్యము—

“గగనసంచారకులకుఁ గూడఁ గనుపడనిసీత యడవికి వెళ్ళునపుడు పౌరులకంటఁ బడునేమో యని శంకించి బ్రహ్మ, సర్వజనులనేత్రములను బాష్పపూరితములుగాఁ జేసెను.” “సీత, యయోధ్యాపురము విడుచుటకుఁ బ్రయత్నించుచుండఁగానే రాక్షసరాజ్యలక్ష్మి లంకాపురము విడువ యత్నించుచుండెను.” మఱియు నీతఁడు ర్వాజమార్తాండము, కరణమృగాంకము, పాతంజల యోగసూత్రవృత్తియు, రచించినట్లు తెలియుచున్నది.

-:0:-

# ధనపాలకవి.

మధ్యహిందూదేశమందలి విశాలానగర మీతని మొదటినివాసము. ఇతఁడు మొదట వైదికమతప్రియుఁడయ్యు సోదరుఁ డగుశోభన పండితుని యుపదేశంబునఁ గ్రమముగా జైనమతము నవలంబించినట్లు ప్రబంధచింతామణి వలనఁ దెలియుచున్నది. ఇందులకుఁ దిలకమంజరి మంగళాచరణము గూడ జినస్తవ మగుటయు నిదర్శన మగుచున్నది.

“స వః పాతు జినః కృత్స్నమీక్షతే యః ప్రతిక్షణం।
రూపై రనంతైరేకైకజంతో ర్వ్యాప్తం జగత్త్రియం॥”

ఈతని తండ్రి సర్వదేవపండితుఁడు. ఇతఁ డాతనియొద్దనే సకల శాస్త్రంబుల నభ్యసించి కాలక్రమంబున ధారానగరము చేరి శ్రీభోజమహారాజు నాస్థానంబున మహాకవి పదంబును గాంచినవాఁడు; ముంజాపరనాముఁడును భోజునిపెత్తండ్రియు నగు వాక్పతిరాజుచే సభలో “సరస్వతి” యని పిలువఁబడినవాఁడు; జినాగమకథలను వినఁగుతూహలం

బుగలిగిన భోజరాజునానతిచేఁ దిలకమంజరి యను గద్యకావ్యము రచించినవాఁడు. * ఈవిషయమంతయు నీతని కావ్యముఖంబున నున్నశ్లోకములవలననే తెలియుచున్నది. కావున నీతఁడు భోజరాజసమకాలికుఁడై వాక్పతిరాజునకుఁగూడఁ బూజ్యుఁడై ౧౦౦౦—౧౦౫౦ నడుమనున్నవాఁడని ధ్రువ మగుచున్నది.

ఈతని తిలకమంజరి చాలవిధములఁ గాదంబరిని బోలియున్నది. ఈకథానకము శైలిమాత్ర మంతకఠినము గాక యత్యద్భుతరసభరితంబై శ్రవణరంజకంబుగా నుండును. ఇందయోధ్యాపురరాజగు మేఘవాహనునకు మదిరావతి యనుభార్యయందుఁ జిరకాలమునకు హరివాహనుఁ డనుకుమారుఁడు జన్మించుటయు, యౌవనవంతుఁ డగునతనికిని విద్యాధరకన్య యగుతిలకమంజరికిని జరిగిన పరస్పరానురాగపరిణయంబులు నతి విచిత్రముగా శృంగారరసప్రధానంబులుగా వర్ణింపఁబడినవి.

---

* తస్మిన్నభూద్రిపుకళత్ర కపోలపత్రవల్లీవితానపరశుః పరమారవంశే । శ్రీవైరిసింహ ఇతి దుర్ధరసైన్యదంతిదంతాగ్రభిన్న చతురర్ణవకూలభిత్తిః । తత్రాభూద్వసతిశ్శ్రియా పరమయా శ్రీహర్ష ఇత్యాఖ్యయా । విఖ్యాతశ్చతురంబురాశిగశనాదామ్నః ప్రశస్తాభువః । భూపః ఖర్వితవైరిగర్వగరిమా శ్రీసీయకస్సాయకాః ; పంచేషోరివ యస్య పౌరుషగుణాః కేషాంన లగ్నా హృది ॥ తస్యోదగ్రయశాస్సమస్తసుభటగ్రామాగ్రగామీసుత । స్సింహో దుర్ధరశత్రుసింధురతతే శ్శ్రీసింధురాజో౽భవత్ । ఏకాధిజ్య చతుర్జితాబ్ధివలయావచ్ఛిన్నభూర్యస్య స । శ్శ్రీమద్వాక్పతిరాజదేవనృపతిర్వీరాగ్రణీరగ్రజః ॥ ఆకీర్ణాంఘ్రితలస్సరోజకలశ చ్ఛత్రాదిభిర్లాంఛనై । స్తస్యాజాయత మాంసలాయతభుజశ్శ్రీభోజఇత్యాత్మజః । ప్రీత్యాయోగ్య ఇతి ప్రతాపవసతిః ఖ్యాతేన ముంజాఖ్యయా । యస్స్వే వాక్పతిరాజభూమిపతినా రాజ్యే౽భిషిక్తస్స్వయం.

నిశ్శేషవాఙ్మయవిదో౽పిజినాగమోక్తాః । శ్రోతుం కథా స్సముపజాతకుతూహలస్య । తస్యావదాతచరితస్యవినోదహేతో । రాజ్ఞస్స్ఫుటాద్భుతరసారచితా కథేయం.

తస్యాత్మజన్మా సమభూన్మహాత్మా । దేవస్స్వయంభూరివ సర్వదేవః ॥ తజ్జ్ఞాజనకాంఘ్రిపంకజ రజస్సేవాప్తవిద్యాలవో । విప్రశ్శ్రీధనపాల ఇత్యవిశదామేతామబధ్నాత్కథాం । అక్షుణ్ణోఽపి వివిక్తసూక్తరచనే యస్సర్వవిద్యాబ్ధినా । శ్రీముంజేన సరస్వతీతి సదసి క్షోణీభృతా వ్యాహృతః.

—:0:—

# క్షేమేంద్రుఁడు.

కవితాప్రపంచంబున నపారయశస్సు గాంచిన కాళిదాస భవభూతి మహాకవులకుఁ దరువాతివారిలోఁ గవితాస్వయంవరుఁడును, వశ్యవాక్కు నగు క్షేమేంద్రుఁడే యగ్రగణ్యుఁడు. కావ్యాంతగద్యంబులనున్న వ్యాసదాసబిరుదంబున కీతఁడెంతయుఁ దగియుండు నని యీతని భాషాపటిమయే వేనోళ్ళఁ బొగడుచున్నది.

ఇతఁడు బ్రాహ్మణుఁడు; అద్వైతమతస్థుఁడు; అంచును శివభక్తుఁడు. త్యాగభోగపరాయణుఁడు, బ్రహ్మవేత్తయు, నగు ప్రకాశేంద్రపండితుఁడీతని తండ్రి (సర్వమనీషి) గంగకోపాధ్యాయుం డీతనిగురువు. ఈ మహాకవి కాశ్మీరపరిపాలకుఁ డైనయనంతభూపాలకునియాస్థాన మలంకరించినవాఁడు. ఈతని యొల్లకావ్యములకుద నీపైయంశములు వ్రాయఁబడియున్నవి. వానిలో నౌచిత్యవిచారచర్చ కడపటిపద్యంబుల నిందులకు దాహరించెదను.

„ ఆసీత్ప్రకాశేంద్ర ఇతి ప్రకాశః కాశ్మీరదేశే త్రిదశేశ్వరశ్రీః ।
......తస్యాత్మజస్సర్వమనీషిశిష్య శ్శ్రీవ్యాసదాసాపరపుణ్యనామా ।
క్షేమేంద్ర ఇత్యక్షయకావ్యకీర్తి శ్చక్రే నవౌచిత్య విచారచర్చాం ।
......ఆశీ శ్శీతలతాం నయత్యవిరతం యస్య ప్రతాపానల। స్తస్య శ్రీమదనంతరాజనృపతేః కాలే కిలాయం కృతః ॥ ”

ఈయనంతరాజు క్రీ॥ ౧౦౨౮—౧౦౬౩ వఱకుఁ గాశ్మీరము నేలినట్లు రాజతరంగిణీవలనఁ దెలియుచున్నది. ఇది యీతనిసరియయిన కాలమని తెల్పుటకు, దానశాసనాములవలనఁ దప్పక క్రీ॥ ౯౯౬—౧౦౫౧ నడుమ నున్నవాఁడని తెలియుచున్న భోజమహారాజున కీతఁడు సమకాలికుఁడు బంధువునని చెప్పు రాజతరంగిణిలోని యనంతరాజవర్ణనంబు ననున్న "సచ భోజనరేంద్రశ్చ దానోత్కర్షేణ విశ్రుతౌ। సూరీ తస్మిన్ క్షణే తుల్యం ద్వావాస్తాం కవిబాంధవౌ॥" అనుశ్లోకమే ప్రబలప్రమాణము. కావున మనకవి శ్రీమదనంతరాజపూజితుఁడై క్రీ॥ ౧౦౨౦—౧౦౬౩ నడుమ నున్నవాఁడని నిశ్చయింపవచ్చును.

ఈమహాకవి, రామాయణమంజరి, భారతమంజరి, బృహత్కథామంజరి, సమయమాతృక, కలావిలాసము, చతుర్వర్గసంగ్రహము, కవికంఠాభరణము, సువృత్తతిలకము, సేవ్యసేవకోపదేశము, చారుచర్య, ఔచిత్యవిచారచర్చ, అమృతతరంగకావ్యము, కనకజానకి, దశావతారచరితము, ముక్తావళి, దేశోపదేశము, నీతికల్పతరువు, పద్యకాదంబరి, వాత్స్యాయనసూత్రసారము, శశివంశమహాకావ్యము, చిత్రభారతనాటకము, పవనపంచాశిక, లోకప్రకాశకోశము, బోధిసత్త్వావదానకల్పలత, లావణ్యవతి, రాజావళి, అవసరసారము, నీతిలత, మునిమతమీమాంస, లలితరత్నమాల, వినయవల్లి, యను ననేకకావ్యముల రచించెను. ఇవన్నియు విమర్శింపఁబూనినచోఁ బ్రత్యేకమొకపుస్తకము గావలసివచ్చును గావున నందందలి కొన్నివిషయంబుల నిందుఁజూపెదను. లోకానుభవమున కితనికలావిలాసమువలె నుపకరించున దింకొకటి మృగ్యమే. ఇది పదిసర్గల చిన్నకావ్యము. ఇందు మోహము, దంభము, కామము మొదలుగాఁగల వానిదుర్లక్షణంబులు విశదీకరింపఁబడినవి. నాల్గవసర్గలో వెలవెలఁదుల యటువదినాలుఁగు కలలను జక్కఁగా వివరించి లోకమున

కు నీతిబోధించెను. మఱియు నేనిమిదవసర్గలో సువర్ణకారజాతినిగూర్చి సానుభవముగా వ్రాయఁబడినది.

చారుచర్య నూఱుశ్లోకముల చిన్నకావ్యమేయైనను మిక్కిలి చక్కగా నున్నది. ఇందు మనుష్యుఁడు జీవితకాలంబున నభ్యసింపఁదగిన సత్ప్రవర్తనంబునకు రామాయణభారతకథలలోని మహాపురుషులయుదంబు ప్రతిపద్యము దృష్టాంతీకరింపఁబడినది. ఇందుండి యొకపద్యము—

§ " నత్యజే ద్ధర్మమర్యాదా మపి క్లేశదశాం శ్రితః।
హరిశ్చంద్రోహి ధర్మార్థీ సేహే చండాలదాసతాం॥"

ఈతని సేవ్యసేవకోపదేశము ప్రభుభృత్యుల మర్లక్షణసులక్షణంబులఁ దెల్పుచు సరసముగానున్నది.

సువృత్తతిలకము. పద్యకవిత్వంబున వినియోగింపఁదగినవృత్తముల యౌచిత్యమును దెలుపుచు నీతని ఛందశ్శాస్త్రశక్తిని బొగడుచున్నది చతుర్వర్గసంగ్రహము ధర్మార్థకామమోక్షముల యాచరణమార్గ మువదేశించుచున్నది. ఈతనిరాజావళి కాశ్మీరరాజుల చరిత్రను దెల్పుచున్నది. దీనినే కల్హణపండితుఁడు సరిగా లేదని యాక్షేపించెను. ఉత్తమంబులగు నీతని మొదటిమూఁడుకావ్యంబులును సులభశైలిలో రామాయణ భారతబృహత్కథాసారమును బోధించుచు వన్నెగాంచుచున్నవి.

మఱియు నీతని యౌచిత్యవిచారచర్చ పదార్థాలంకారౌచిత్యము నుబోధించుచుఁ గవులకుఁ బ్రమాణగ్రంథముగా నలరారుచున్నది. ఈ గ్రంథమునుబట్టియే యీతనికవిత్వ మెంతసరసముగా శాస్త్రసమ్మతముగా సుబోధకంబు గానుండునో చదువరు లూహింపవచ్చును. అసంఖ్యాకంబులగు సరసకావ్యంబులను లోకంబునకుఁ బ్రసాదించిన యీవ్యాసదాసుని కృతుల నెంతయని విమర్శింపఁగలను.

§ కష్టదశ వచ్చినను ధర్మము విడువరాదు. హరిశ్చంద్రుఁడు సత్యధర్మము నకై చండాలుని సేవించెను

మునిమతమీమాంస, కనకజానకి, నీతికల్పతరువు, నీతిలత, అవసర సారము, మొదలుగా నీతనికొన్నికావ్యములు నామమాత్రావశిష్టములై స వనుట యెంతయు విచారకరముగానున్నది. మఱియు నీతనికొన్నికావ్యములు జర్మనీమొద లగుపరదేశములలో విహరించుచున్నవని యిపుడిపుడు తెలియుటయు సంతోషకరముగా నున్నది. పైనిబేర్కొనిన గ్రంథములలోని శ్లోకములు చాలవఱకీతని యౌచిత్యవిచారచర్చలోఁ గనుపడుచున్నవి.

———:o:———

# సోమదేవభట్టుఁడు.

ఇతఁడు రామభట్టసూనుఁడు; కాశ్మీరనివాసి; క్షేమేంద్రునివలెనే యనంతరాజు నాస్థానంబుననున్నవాఁడు. గ్రంథాంతమున నున్న గ్రంథకర్తృప్రశస్తినిబట్టి యనంతరాజు పట్టమహిషి యగుసూర్యవతీదేవి సరసకథాశ్రవణకుతూహలంబునఁ గోరఁగా నితఁడు కథాసరిత్సాగరమను గ్రంథము వ్రాసినట్లు కనుపడుచున్నది. ఇతనిసమకాలికుఁ డగుక్షేమేంద్రుఁడు బృహత్కథామంజరి వ్రాసియుండఁగా మరల దానినే యెట్లు వ్రాయు ననుసంశయ మాగ్రంథప్రశస్తిని, వీరిరెండుకృతులను జదివినవారికిఁ గలుగదు. క్షేమేంద్రునికృతికంటె నీతని కృతి విపులముగా సరసముగా సుగమముగా వినవింపుగాఁ జదువసొంపుగా నున్నది. క్రీ॥ ౧౮౩౯ లో బ్రోకాసుపండితునిచే సంగ్రహింపఁబడిన యీగ్రంథము జర్మనీదేశములో నిపుడు మిక్కిలి వన్నెకెక్కియున్నట్లు తెలియుచున్నది. బహుప్రాచీనుఁ డగుగుణాఢ్యుఁ డనుమహాకవి పిశాచభాషలో రచించి

న లక్షశ్లోకములు గలబృహత్కథ కిది నాతిసంక్షిప్త నాతివిపుల మగుసంస్కృతభాషాంతరీకరణమయినట్లు దీనికథాపీఠలంబకమువలనఁ దెలియుచున్నది ౧౮ లంబకములు ౧౨౪ తరంగములు గలిగిన యీ మహాగ్రంథము గీర్వాణభాషాభిజ్ఞులకు హృదయరంజకముగా నున్నది. ఇందుఁ గౌశాంబీనాథుఁడును వత్సరాజు నగునుదయనరాజు వృత్తాంతము విపులముగా వర్ణింపఁబడినది. సుప్రసిద్ధము లగురత్నావళీ నాగానందాది రూపకంబులకును, కాదంబర్యాద్యాఖ్యాయికలకును, పంచతంత్రాది కథాకోశంబులకును మూలాధారం బగుబృహత్కథకు రూపాంతరం బగునీతని కృతి లోకమున కెంతయుపకారకమో తెలుపుటకు సంస్కృతభాషలో నిట్టిదింకొకటి లేదనుటకంటె వేఱుగా నుతింపనక్కఱలేదు. శివభక్తుఁడు నద్వైతమతస్థుఁడు నగునీమహాకవిని సుకవికంఠభూషణం బగునీతని కృతిని గూర్చి యింతకంటె నధికముగా వ్రాయఁజాలను.

-:0:-

## బిల్హణుఁడు.

ఇతని యుదంత మీతని విక్రమాంకదేవచరితము తుదిసర్గలోని కడపటిశ్లోకంబులవలన నీక్రిందివిధముగాఁ దెలియుచున్నది.

" కాశ్మీరదేశంబునఁ బ్రవర మనునొక నగరము గలదు. దానికి మూఁడుక్రోసులదూరమున జయవనమునకు సమీపమున ఖోనముఖ మను గ్రామము గలదు. అందు గోపాదిత్యమహీపాలునిచే మధ్యదేశమునుండి తీసికొనిరాఁబడి స్థాపింపఁబడిన శ్రౌతస్మార్తకర్మాచరణపరాయణులును కౌశికగోత్రులు నగుబ్రాహ్మణోత్తములు గలరు. వారిలో వేదవేదాంగ

వేత్త యగుముక్తికలశుఁ డనుపండితమణికి రాజకలశుఁ డనుపుత్రుఁడు గలఁడు. అతనికి మహాభాష్యవ్యాఖ్యాత యగుజ్యేష్ఠకలశుఁ డనుకుమారుఁడు జన్మించెను. అతనికి నాగాదేవియందు నానారాజసమ్మానము వడసిన యిష్టరామకవి, కవితానిలయుఁ డగునానందకవి, సర్వవిద్యాపారంగతుఁ డగుబిల్హణమహాకవియు ననుముగ్గురుపుత్రులు గలిగిరి. వీరిలో బిల్హణుఁడు బాల్యంబుననే సంస్కృతభాషాపారంగతుఁ డై యౌవనంబుననఁగా ననంతరాజుకుమారుఁడు కలశదేవుఁడు కాశ్మీరమేలుచున్నకాలమున దేశసంచరణకుతూహలుండయి కాశ్మీరము విడిచి, మధుర, బృందావన, కాన్యకుబ్జ, కాశీ, ప్రయాగాయోధ్య, దాహల, గూర్జర, సోమనాధ పురాది స్థలంబుల సంచరించి యాయారాజుల సమ్మానంబులు వడసి తుదకు దక్షిణదేశమందలి చాళుక్యరాజుల రాజధాని యగుకల్యాణపురముఁ బ్రవేశించి చాళుక్యవంశభూషణుఁడును, కర్ణాటదేశాధీశుఁడును, గుంతలేంద్రుఁడును, పాణ్డ్యాదిభూపతియుఁ ద్రిభువనమల్లాపరనామధేయుఁడు నగునాహవమల్లునిచే సత్కరింపఁబడి యాతనివలన విద్యాపతి బిరుదంబువడసి యాతని కుమారుఁ డగువిక్రమాంకదేవరాజు సమయంబునఁగూడ నందేయుండి యాతని చరిత్రను విక్రమాంకదేవచరిత మనుపేర నొక మహాకావ్యముగా రచించెను. ”

దీనింబట్టి కవి వంశ జన్మ నివాస నైపుణ్య రాజ సమ్మానాదులు విశదమగుచున్నవి. ఈ కవి యీ గ్రంథంబుననే కాశ్మీరరాజగునసంత దేవుని మరణమును వర్ణించెను. క్రీ॥ ౧౦౭౦—౧౧౯౪ నడుమ నణహిల పట్టణము రాజధానిగా దాహలదేశము నేలుచున్న భీమదేవసూనుఁ డగుకర్ణరాజు తన్ను గౌరవించినట్లు వర్ణించెను. అప్పటి యుత్తమభూపాలకులలో నొకఁడును ధారానగరాధిపతియు నగుభోజరాజును దాను జూడలేదని వచించెను. మఱియుఁ బైనిజెప్పిన కర్ణరాజునే కథానాయ

కుఁడిగాఁజేసి కర్ణసుందరినాటిక రచించెను. ఈ పైవిషయంబుల కనుగుణంబుగా § రాజతరంగిణి 2 వ తరంగములోని బిల్హణవర్ణనమందలి " అనంతరాజు మనుమఁడు, కలశదేవుని కుమారుఁడు నగుహర్షదేవునిఁ గవిబాంధవునిఁగా బిల్హణుఁడు వినె " నను వాక్యముగూడ నిదర్శనమగుచున్నది. ఈ పైయంశములనుబట్టి ‡ మనకవి క్రీ॥ ౧౦౩౦ ప్రాంతమున జన్మించి యనంతరాజు కాశ్మీరంబు నేలుచున్నకాలముననే పరిపూర్ణ పాండిత్యము సంపాదించిన యుత్తమకవియు యవిష్ణుఁడునై క్షేమేంద్రసోమభట్టులకు సమకాలికుఁడై క్రీ॥ ౧౦౬౨ లోఁ దండ్రి యగునసంతరాజువలన రాజ్యము గ్రహించిన కలశభూపతికాలములో నేకారణంబుననో యాతని యాస్థానమున నుండక రాజాంతరదర్శనోత్సుకుఁడై దేశాటనము వెడలి యనేకరాజసమ్మానముం బడయుచు ౧౦౬౦ ప్రాంతమందలి భోజరాజును జూడనివాఁడైన నతనికి సమకాలికుఁడై ౧౦౭౦ ప్రాంతమునఁ గర్ణరాజునాశ్రయించి యాతని కంకితముగాఁ గర్ణసుందరి నాటిక రచించి పిదపఁ ద్రిభువనమల్లవిక్రమాంకదేవుల యాదరణంబునఁ గల్యాణపురమున స్థిరపడి పిదప ౧౦౮౦ లో విజయక్షేత్రమున మృతినొందిన యనంతరాజు మరణవార్త నెఱింగి ౧౦౮౮ లోఁ గాశ్మీరమునకు రాజైన కలశభూపతి కుమారుఁ డగుహర్షదేవునిఁ జూచి చిరకాలజీవియై ౧౧౦౦ ప్రాంతమునఁ గాలధర్మము నొందియుండునని స్పష్టమగుచున్నది. గూర్జరదేశరా జగునైరిసింహభూపాలుని పుత్రిక యగుశశికల

---

§ కాశ్మీరేభ్యో వినిర్యాంతం రాజ్యే కలశభూపతేః ।
విద్యాపతిం యం కర్ణాట శ్చక్రే పర్మాడిభూపతిః ।
త్యాగినం హర్షదేవం స శ్రుత్వా సుకవి బాంధవం ।
బిల్హణో వంచనాం మేనే విభూతిం తావతీ మపి ॥

‡ ఈవిషయమున డాక్టరు బహులరు మతముగూడ నేకీభవించుచున్నది.

నీతఁడు పరిణయంబగు నుదంతమును దెల్పు బిల్హణచరిత మనుఖండకావ్య మితరదేశములలోను, యామినీపూర్ణతిలక యను రాజకన్య నీతఁడు పెండ్లియాడె నని తెలుపు బిల్హణీయ మనుచిన్నకావ్యము సంస్కృతాంధ్రభాషలలో నాంధ్రదేశమందును, వ్యాపించియున్నవి. కాని, చమత్కృతికై కల్పింపఁబడిన యాకథలు నమ్మఁదగినవి గావు.

ఇతఁడు వివిధరాజసమ్మానమును బొంది, విక్రమాంకదేవునివలన గొప్పనైశ్వర్య మనుభవించినవాఁడయ్యుఁ దుదకాతనివలనఁ గొంతకష్టము నొందినట్లుగా నీతని † చౌరపంచాశిక మొదటిశ్లోకమువలనఁ దెలియుచున్నది.

ఉత్తమసాహితీనిలయుఁ డగు నీతఁడు కర్ణసుందరినాటిక, విక్రమాంకదేవచరితము, చౌరపంచాశిక, క్రమముగా రచించినవాఁడు. ‡ ఇతఁడు తనకావ్యంబులలోఁ గావించుకొనిన యాత్మప్రశంసకుఁ దగినం

---

† సర్వస్వం గృహవర్తి కుంతలపతి ర్గృహ్ణాతు తన్మే పునః ।
భాండాగార మఖండమేవ హృదయే జాగర్తి సారస్వతం ।
రే క్షుద్రా స్త్యజత ప్రమోదమచిరా దేష్యంతి మన్మందిరం ।
హేలాందోళిత కర్ణతాలకరటి స్కంధాధిరూఢ శ్రియః ॥
అయి కి మనిశం రాజద్వారే సముద్ధురకంధరే ।
కువలయదళస్నిగ్ధే ముగ్ధే విముంచసి లోచనే ।
అమరరమణీ లీలావల్గ ద్విలోచన వాగురా ।
విషయపతితో న వ్యావృత్తిం కరిష్యతి బిల్హణః ॥

‡ యన్మాలం కరుణానిధి స్స భగవా న్వల్మీకజన్మా మునిః ।
యస్యైకేకవయః పరాశరసుతప్రాయాః ప్రతిష్ఠాం దధుః ।
సద్యో యః పథి కాళిదాసవచసాం శ్రీబిల్హణ స్సోఽధునా ।
నిర్వ్యాజం ఫలిత స్సహైవ కుసుమోత్తంసేన కల్పద్రుమః ॥
సాంద్రై ర్వేదధ్వనిభి రనభివ్యక్తమంజీరనాదా ।
మాంజీబంధా త్ప్రభృతివదనే యస్య వాగ్దేవతాసీత్ ॥

త సరసముగా నుండకున్న నీతని కవిత్వము వైదర్భీరీతి గలిగి శ్రావ్యముగానే యుండును. ఏలనో చేతనో కాని యీతని కావ్యములకుమాత్రము లోకములోఁ బ్రశస్తి రాలేదు. నాటికలోఁ జాళుక్యరాజగు కర్ణభూపాలుఁడు కర్ణసుందరి యనువిద్యాధరకన్యను వరించుట యనుకథ కల్పింపఁబడినది. చాళుక్యవంశవర్ణనము విక్రమాంకదేవుని శౌర్యవర్ణనము నధికముగాఁగల యీతని రెండవకృతియే సర్వవిధముల నుత్తమంబుగాఁ గన్పడుచున్నది. స్వపోషకులచరితము కావ్యముగా వ్రాయుటలో బాణునకీతఁడు రెండవవాఁడు. శైలి తెలుపుటకై శ్రీమదప్పయదీక్షితులు లాక్షేపాలంకారమునకుదాహరించిన గ్రంథముఃపద్యములలో రెండుదాహరించెదను

§ " సాహిత్యపాథోనిధిమంథనోత్థం।
కర్ణామృతం రక్షత హే కవీంద్రాః।
యత్తస్య దైత్యాఇవ లుంఠనాయ।
కావ్యార్థచోరాః ప్రగుణీభవంతి॥ "

† " గృహ్ణంతు సర్వే యది వా యథేచ్ఛం।
నాస్తి క్షతిః క్వాపి, కవీశ్వరాణాం।
రత్నేషు లుప్తేషు బహుష్వమర్త్యై।
రద్యాపి రత్నాకరఏవ సింధుః॥ "

---

§ ఓకవులారా! సాహిత్యసముద్రమును మథించి తెచ్చిన కర్ణామృతమును రక్షింపుఁడు. దీనిని దొంగిలింపఁ గావ్యచోరు లనురాక్షసులు హెచ్చుచున్నారు.

† యథేచ్ఛముగా నీయమృతము గ్రహింపుఁడు. ఏమియు లోపములేదు. పెక్కురత్నములను దేవతలు గ్రహించినను సముద్రమిప్పటికిని రత్నాకరమే.

# మమ్మటభట్టు.

-:0:-

ఈ పండితాగ్రణి కాశ్మీరనివాసి యయినట్లీతని కావ్యప్రకాశమునకు దర్పణవ్యాఖ్య రచించిన విశ్వనాథపండితుని యభిప్రాయంబునఁ దెలియుచున్నది. మఱియు నీతని గ్రంథమునకే సుధాసాగరవ్యాఖ్య రచించిన భీమసేనపండితుఁడు గూడ “అయం మమ్మటః కాశ్మీరదేశీయో జైయటపుత్రః వారణాసీమాగత్యాధీతశాస్త్రః అస్యచ మమ్మటస్య పతంజలిప్రణీతవ్యాకరణమహాభాష్యటీకాకర్తా కైయటః వేదచతుష్టయభాష్యకర్తా, ఉవటాపరనామా ఔవటశ్చేతి ద్వావపి కనిష్ఠభ్రాతరౌ” అని వర్ణించుటచే నితఁడు కాశ్మీరవాసియనియు జైయటపుత్రుఁడనియు నితనికి భాష్యవ్యాఖ్యాత యగుకైయటుఁడు, వేదభాష్యకర్త యగునౌవటుఁడు ననుసోదరులు గలరనియుఁ దెలియుచున్నది. కాని, వాజసనేయసంహితాభాష్యముననున్న “ఋష్యాదీంశ్చ పురస్కృత్య అవంత్యా మువటోవసత్। మంత్రభాష్య మిదం చక్రే భోజే రాష్ట్రం ప్రశాసతి॥” అను శ్లోకంబువలన భోజరాజు కాలంబున మంత్రభాష్యము వ్రాసిన యువటుఁడు జీవించియున్నట్లు కనుపడుటచే భోజరాజానంతరకాలమందున్న మమ్మటున కీతఁడు సోదరుఁడగుట సంభవింపదు. కావున నువటుఁడు మమ్మటుని సోదరుఁడనుటలో భీమసేనపండితుఁడు ప్రమాదపడియుండు నని యొకానొకరు వ్రాసిరి. కాని, వజ్రటపుత్రుఁ డగునువటుఁడను నింకొకఁడు భోజరాజుకాలంబున మంత్రభాష్యము వ్రాసె” నని తెలియుచుండగాఁ నామసామ్యంబున నతఁడే మమ్మటుని తమ్ముఁడై యుండు నని భ్రమపడి భీమసేనుని వ్రాఁత తప్పనుట యుక్తముగా లేదు. అ

యనను సుప్రసిద్ధుఁ డగుమమ్మటునికాలంబు నిర్ణయింప నిది యభ్యంత రము గలిగించునది గాదు గావున నీప్రసంగము విసర్జించెదను. మఱియు నీతని కాలముంగూర్చి యనేకవైకమత్యము నొందియుండుటచే విశేషించి వ్రాయ నక్కఱలేదు.

ఇతఁడు తనకావ్యప్రకాశము దశమోల్లాసంబున నుదాత్తాలంకారంబున కుదాహరణముగా " ముక్తాః కేళివిసూత్రహారగలితా స్సమ్మార్జనీభిర్హృతాః। ప్రాతః ప్రాంగణసీమ్ని మంథరచల ద్బాలాంఘ్రిలాక్షారుణాః। దూరాద్దాడిమబీజశంకితధియః కర్షంతి కేళీశుకాః। యద్విద్వద్భవనేషు భోజనృపతే స్తత్త్యాగలీలాయితం॥" అని భోజరాజవర్ణనముదాహరించుటచేఁ గ్రీ॥ ౧౦౫౧ లో నున్న యామహారాజునకుఁ దరువాతివాఁడై తనకావ్యప్రకాశమునకు సంకేతాఖ్యవ్యాఖ్య నొనరించిన క్రీ॥ శ॥ ౧౧౬౦ లోని మాణిక్యచంద్రునికంటెఁ బూర్వుఁడై సర్వవిమర్శకసమ్మతముగాఁ గ్రీ॥ ౧౦౭౦—౧౧౭౦ సమము నున్నవాఁడని నిశ్చితం బగుచున్నది.

ఈతని కావ్యప్రకాశంబునకు నిదర్శనవ్యాఖ్య రచించిన యానందకవి వ్రాసిన " ఏతత్పర్యంతం మమ్మటాచార్యాణాం కృతిః॥ కృత శ్రీమమ్మటాచార్యవర్యైః పరికరావధిః। ప్రబంధః పూరిత శ్శేషో విధాయాల్లటసూరిణా॥" అను పద్యము వలన నితఁడు పరికరాలంకారము వఱకు రచించె ననియు మిగిలిన కించిద్భాగంబును నల్లటపండితుఁడు పూరించెననియుఁ దెలియుచున్నది.

ఇతఁడు సర్వశాస్త్రసమర్థుఁడు. ఈతనికావ్యప్రకాశమలంకారశాస్త్రమున ననన్యసామాన్యమయినదని దీనియనేకవ్యాఖ్యాతలలో నొకఁ డగుమహేశ్వరభట్టు తెల్పిన " కావ్యప్రకాశస్య కృతా గృహేగృహే టీకా, తథాప్యేష తథైవ దుర్గమః। సుఖేన విజ్ఞాతు మిమం య ఈహ

తే। ధీర స్సపతాం విపులం విలోకతాం ॥" అను శ్లోకమే ప్రకటించుచున్నది. ఇందుండి మంగళాచరణ శ్లోకంబును గావ్యప్రయోజనబోధక పద్యంబు నుదాహరించెదను.

"నియతికృతనియమరహితాం హ్లాదైకమయీ మనన్యపరతంత్రాం।
నవరసరుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవే ర్జయతి॥"
‡ కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే।
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మిత తయోపదేశయుజే॥"

‡ కావ్యము, కీర్తికి ధనమునకు లోకజ్ఞానమునకు నశుభహారణమునకు నుత్తమసుఖమునకు భార్యవలె నుపదేశించుటకు వినియోగించును.

-:0:-

# శంభుకవి.

శివభక్తుం డగునీబ్రాహ్మణునికృతి యగురాజేంద్రకర్ణపూరములోని "శేష! క్లేశమశేష ముత్సృజ భజ త్వం కూర్మ! కర్మ స్వకం। స్వైరం ఖేలత సింధుసైకతలతా కుంజేషు దిక్కుంజరాః। అధ్యైతాం సకులాచలాం సనగరాం సాంభోనిధిం సాపగాం। సద్వ్యాంచ భువం బిభర్తి హి భుజ శ్శ్రీహర్షపృథ్వీభుజః॥" అనువర్ణనముంబట్టి యితఁడు కాశ్మీరరాజగు శ్రీహర్షదేవుని కాలంబున నున్నవాఁడని తెలియుచున్నది. ఈరాజు క్రీ॥ ౧౦౮౮—౧౧౦౧ నడుమ నున్నవాఁడని రాజతరంగిణివలన స్పష్టపడుచున్నది. ఈశ్రీహర్షుఁడు కాన్యకుబ్జాధిపతియే మోయని భ్రాంతిగలుగకుండ నీతనివర్ణనమందేయున్న "యత్రా గచ్ఛతి గోచరం నయనయోః కాశ్మీర మీనధ్వజః" అను పద్యభాగంబును, భోజరాజు పెత్తండ్రియగు ముంజమహీపాలుని పిసప నీరాజే సర్వసుగుణసంపద

గలవాఁడని తెల్పు §« కిం తాన్తిః కిమనిర్వృతిః కిమధృతి ర్వాగ్దేవి! ముంజే గతే। కిం శూన్యాసి కిమాకులాసి కిమితి క్లాంతాసి కోఽయం క్రమః। పతం విద్ధి తమేవ సాస్య హి మతి స్సా విశ్రుతి స్సాద్యుతి। స్సత్యాగ స్సనయ స్ససూక్తిషు రస స్సా స్సన్మతా స్సంపదః ॥ " అను వర్ణనంబు నుదాహరణములు కావచ్చును. కావున మనకవి పూర్వోక్త కాలంబుననే యున్నవాఁడనుట నిశ్చయము.

ఇదికాక యీతఁడు రచించినగ్రంథ మింకొకటి కానరాదు. ఇది కేవల మీశ్రీహర్షుని సాహసౌదార్యశౌర్యాదులందెల్పు స్తుతికావ్యముగా నున్నది. కవిత్వరీతి తెలియుట కిదివఱ కుదాహరించిన పద్యమే చాలును.

§ అమ్మా! భారతీ! ముంజుఁడు గతించెనని యధైర్యపడి విచారించెదవేల? సర్వగుణంబులచేత నీశ్రీహర్షభూపాలు నాముంజునిఁగానే భావింపుము.

-:0:-

# గోవర్ధనాచార్యుఁడు

ఈతనికాలము సరిగా విర్ణయింప నాధారము లేదుగాని జయదేవుఁడు గీతగోవిందము నొకట « శృంగారోత్తరసత్ప్రమేయ వచనై రాచార్యగోవర్ధన స్పర్ధీకోఽపి నవిశ్రుతః " అని వర్ణించుటచే నతని కీతఁడు పూర్వుఁ డైన సమకాలికుఁ డైయుండునని దుర్గాప్రసాదపండితులు వ్రాసియుండిరి. ఈజయదేవుఁడు వంగదేశాధిపతి యగుబల్లాలసేనుని పుత్రుఁ డగులక్ష్మణసేనుని సభలో నున్నవాఁడని సనాతనగోస్వామి మతమయినట్లు కనుపడుచున్నది. ఈక్రిందిశ్లోకము లక్ష్మణసేనుని సభామందిరద్వారముమీఁది శిలపై వ్రాయఁబడియున్నట్లు తెలియుచున్నది. « గోవర్ధనశ్చ శరణో జయదేవ ఉమాపతిః। కవిరాజశ్చ రత్నాని సమి

తౌ లక్ష్మణస్యచ ॥ ” ఈలక్ష్మణసేనుఁడు క్రీ॥ శ॥ ౧౧ వ శతాబ్దంబు తుదను వంగరాజ్యము నేలినట్లు చరిత్రకర్తల యభిప్రాయము. కావున నీగోవర్ధనుఁడు ౧౦౭౦—౧౧౪౦ నడుమ నున్నవాఁడని యూహింపఁదగును

ఇతఁడేకవంశల యార్యావృత్తములు గలయార్యాసప్తశతి యనుకావ్యము రచించెను. ఇందు వాల్మీకి మొదలుగా భవభూతివఱకును గలపూర్వకవులు నుతింపఁబడిరి. ఇతఁడు వంగదేశస్థుఁడు. బ్రాహ్మణుఁడు; ఈతని తండ్రి మహాకవియుఁ గర్మపరతంత్రుఁడు నగునీలాంబరసోమయాజి; సోదరుఁడు బలభద్రుఁడు, శిష్యుఁడు, ఉదయనుఁడు. ఈ పై యంశములెల్ల నీతని కావ్యమువలననే తెలియుచున్నవి.

ఈకావ్య మొకకథను దెలుపునది గాక వివిధనాయికానాయకల క్షణంబులను వారిసఖుల లక్షణంబులను బోధించుచుఁ బరస్పరచాటు సంభాషణరూపకంబుగా నున్నది. ఇందకారాది క్షకారాంతము గలవర్ణము లాదియందుఁ గ్రమముగాఁ గలకొన్నికొన్ని పద్యములు వ్రజ్యలను నామములతో విభజింపఁబడినవి. ఈతని కవిత్వము సులభమై సరసదృష్టాంతోపమాలంకృతంబై యలరారుచున్నది. ఈక్రిందిపద్యము నాయికదృష్టివిశేషసౌందర్యముం దెల్పుచు జినసిద్ధాంతమును నిరసించుచు నెంతయు హృద్యముగా నున్నది.

“ అతిపూజిత తారేయం దృష్టి శ్రుతిలంఘనక్షమా సుతను! ।
జినసిద్ధాన్తస్థితి రివ సవాసనా కం నమోహయతి ॥ ”

మఱియు నీక్రింది నాయికాసఖీవచన మన్యనాయికారక్తుఁ డగునాయకుని ధర్మము దెల్పుచు విగ్రహారాధనవిధిని బోధించుచున్నది.

“ అన్యాస్వపి గృహిణీతి ధ్యాయ న్నభిలషిత మాప్నోతి ।
పశ్య న్పాషాణమయీః ప్రతిమాఇవ దేవతాత్వేన ॥ ”

---

† ఓరమణి! శ్రుతిలంఘనసమర్థ మగునీదృష్టి జైనసిద్ధాంతస్థితివలె నెవని మోహపెట్టదు. ‡ జారుఁడు, రాతివిగ్రహములను దేవత లనిభావించు వానివలెనే పరభామలనుగూడ స్వభార్యగాఁ దలంచి యభీష్టముఁ బొందును.

ఇట్లే యీకావ్య మాద్యంతము సకలలోకధర్మములం దెలుప నాదర్శముగా నున్నది.

——:o:——

## జయదేవుఁడు.

గోవర్ధనాచార్యజీవితమునఁ జదివినట్లుగా నతనికి సమకాలికుఁడై లక్ష్మణసేనుని సభలోఁ గొంతకాలమున్న యీకవిగూడ, క్రీ ౧౦౮౦---౧౧౪౦ నడుమ నున్నవాఁడనియే తెలియనగును. ఉత్కలదేశంబున జగన్నాథక్షేత్రమునకు సమీపమున నున్నకిందుబిల్వ మీతని నివాసగ్రామము. ఈతని తండ్రి భోజదేవుఁడు; తల్లి రాధాదేవి; భార్య పద్మావతి; మిత్రుఁడు పరాశరపండితుఁడు; ఉమాపతి, శరణుఁడు, ధోయీ కవిరాజు ననువారు సమకాలికులు. పురాణప్రసిద్ధు లగుప్రహ్లాదనారదాదులవలెఁ బరమభక్తాగ్రగణ్యుఁ డైనయీకవి స్వదేశజనులచే నిప్పటికిని గొనియాడఁబడుచు గీతగోవిందకావ్యరూపంబున జీవించియున్నవాఁడు. ౧౫ వ శతాబ్దములోని చంద్రదత్తకవి భక్తమాల యనుగ్రంథము రచించుచు దానిలో ౩౯ వ సర్గ మొదలుగా ౪౧ వ సర్గ వఱకు నీతని యుదంతము నే చక్కఁగా వర్ణించెను. దీనింబట్టిచూడఁగా నీభక్తుఁడు స్వకాలంబునఁ గూడ సర్వజనస్తోత్రపాత్రుఁ డైనపుణ్యాత్ముఁ డైయుండు ననితోఁచుచున్నది. చిరకాలము జగన్నాథస్వామినుపాసించి భక్తుఁడును, విరక్తుఁడును, జ్ఞానియు నైనయీమహాత్ముఁడు రాగతాళనృత్యంబులకు సరిపడునట్లుగా ఛందోబద్ధంబుగా ద్వాదశసర్గాత్మకం బగుగీతగోవిందకావ్యమును రచించెను. పదకవిత్వంబునట్టి కావ్యములు రచించిన సంస్కృతకవులలో నుత్తమపదవికి నర్హుఁడితడేయని యూహింపఁదగును.

---

* ఇతఁడు ప్రసన్నరాఘవకర్తకంటె నన్యుఁడు.

భక్తపతనయోగ్యం బగుదీనినుండి యొకఁడు కీర్తనముదాహరించెదను. రామకరీ రాగ యతి తాళములచే గానము చేయఁబడును.

చందనచర్చిత నీలకళేబర పీతవసన వనమాలీ।
కేళి చలన్మణికుండల మండిత గండయుగ స్మితశాలీ। ౧
హరిరిహ ముగ్ధవధూనికరే విలాసిని విలసతి కేలిపరే ॥ధ్రువం॥ (ప॥)
పీనపయోధరభారభరేణ హరిం పరిరభ్య సరాగం।
గోపవధూ రనుగాయతి కాచిదుదంచిత పంచమరాగం ॥ ౩ ॥
కాపి విలాసవిలోల విలోచన ఖేలన జనిత మనోజం।
ధ్యాయతి ముగ్ధవధూ రధికం మధుసూదనవదనసరోజం ॥ ౪ ॥
కాపి కపోలతలే మిలితా లపితుం కిమపి శ్రుతిమూలే।
కాపి చుచుంబ నితంబవతీ దయితం పులకై రనుకూలే ॥ ౫ ॥
కేలి కలాకుతుకేనచ కాచిదముం యమునాజలకూలే।
మంజులవంజులకుంజగతం విచకర్ష కరేణ దుకూలే ॥ ౬ ॥
శ్లిష్యతి కామపి చుంబతి కామపి కామపి రమయతి రామాం।
పశ్యతి సస్మితచారుతరా మపరా మనుగచ్ఛతి వామాం ॥ ౭ ॥
శ్రీజయదేవ భణితమిద మద్భుతకేశవకేళి రహస్యం।
బృందావనవిపినే లలితం వితనోతు శుభాని యశస్యం ॥ ౮ ॥

* ఇతఁడు ప్రసన్నరాఘవకర్తకంటె నన్యుఁడు.

——:0:——

## జల్హణపండితుఁడు.

ఇతఁడు కాశ్మీరదేశస్థుఁడు. క్రీ॥ ౧౨ వ శతాబ్దము మధ్యభాగం బున నున్న శ్రీకంఠచరితకర్త యగుమంఖకవిచే నుతింపఁబడినవాఁడ గుట

చే క్రీ॥ ౧౧౨౦—౧౧౫౦ నడుమ నున్నవాఁడని తెలియుచున్నది. ఇతఁడు సోమపాలవిలాస మనునొక మహాకావ్యమును రచించినట్లు కింవదంతి గలదు. ఈసోమపాలుఁడు కాశ్మీరప్రాంతమందలి రాజపురికిఁ బ్రభువుగా నున్నవాఁడని రాజతరంగిణి చెప్పుచున్నది.

ఇతఁడు రచించిన ముగ్ధోపదేశముమాత్రము కావ్యమాలలో ముద్రితమై యున్నది. ఇందలి విషయము దీనినామమే తెల్పుచున్నది. ఈ కావ్యము చాలవఱకు వారకాంతల దుశ్చరిత్రమును బోధించుచుఁ గాముకుల జారవృత్తిరోగమును మాన్పునట్టి సిద్ధౌషధముగా నున్నది. ఇందుండి యొకపద్యము—

‡ "ఆజీవః కపటానురాగకలయా దోషో న మశ్శీలతా।
వైధవ్యంచ నబాధతే నదసతో స్వంభావనా వ్యాయాత్।
యత్కించిత్కరణే పరస్వహరణే వ్రీడా న పీడాకరీ।
నోవా రాజభయం చ హీ బత సుఖం జీవంతి వారస్త్రియః॥"

‡ దొంగప్రేమచే సంపాదనము. దుస్స్వభావము తప్పుగాదు. వైధవ్యము బాధించదు. ఏమిచేయుటకును సిగ్గులేదు. రాజభయము లేదు. ఛీ ఛీ, వారాంగనలు సుఖముగా జీవింతురఁట.

—:o:—

## క్షేమేంద్రుఁడు.

ఈమహాత్ముఁడు రచించిన ప్రబోధచంద్రోదయ మనునాటకము లనాటకము శృంగారాది నవరసయుతంబయ్యుఁ బ్రధానశాంతరసంబై సకలనాట్య ధర్మానుగుణంబై యధ్యాత్మవిద్యావిషయంబై జీవన్ముక్తి బోధపర్యవసాయియై పండితలోకంబలంకరించుచున్నదనుట సర్వవిదిత

మే. అఖిలవిద్యాపారంగతుఁడును సంపూర్ణవిరాగియు నగునీతఁడు సన్యసించి బ్రహ్మానందమనుభవించుచు శిష్యులకధ్యాత్మవిద్య బోధించుచుండ వారిలో నైహికవిషయలోలుఁ డగునొక ఛాత్రుఁడు శృంగారరసకావ్యముల నెల్లెడఁ జదువుచు నాత్మవిద్యాపరాఙ్ముఖుఁడైయుండె ననియు నంత నీపరివ్రాజకుఁడు వాని నెట్లయిన బ్రహ్మవిద్యాసంపన్నునిఁ జేయవలె నని యభిలషించి యఖిలరసభరితం బగునీనాటకమును రచించి వానినిఁ జదివింపఁజేసి సన్మార్గమునకుఁ ద్రిప్పె ననియు నీనాటకోత్పత్తినిఁగూర్చి యొక కింవదంతి గలదు,

ప్రస్తావనంబట్టి యీ కృష్ణమిశ్రుఁడు తనశిష్యుఁ డగుగోపాలభూపాలునకానందసంధాయకముగా నీనాటకమును రచించి యిచ్చినట్లును, ఈ గోపాలరాజు తన ప్రియస్నేహితుఁడును జంద్రవంశపురాజు నగుకీర్తివర్మను రాజ్యాభిషిక్తునిఁజేయు సమయంబునఁ జిత్తవిశ్రాంతికై దీనినభినయింపఁజేసినట్లును గనుపడుచున్నది.

ఈగోపాలుఁడు నీకీర్తివర్మయు నేకాలంబున నేరాజధానుల నలంకరించియుండిరో తెలియఁదగిన యాధారంబులు లేమిచే నీతని కాలము సంశయాస్పదంబుగా నున్నది. కాని, * పెకర్ంద్రు హూణవిమర్శకు లీతఁడు క్రీ॥ ౧౧౦౦ ప్రాంతమున నుండె నని నిర్ణయించిరి. దీనికిఁ దథ్యముగా వామనుఁడు మొదలుగా క్షేమేంద్రమునివఱకును గలయాలంకారికులెవ్వరు నీయుత్తమనాటకములోని శ్లోకముల నుదాహరింపకపోవుట గూడ సంభవించినది. కావునఁ దప్పక వారికర్వాచీనుఁడు గాఁదగిన యీతఁడు ౧౧ వ శతకము చివరనో ౧౨ వ శతకము మొదటనో యుండు ననియూహింపవచ్చును.

* ఇంపీరియల్ గెజటీరు

ఈనాటకవిషయంబును దీనినామమే తెల్పుచున్నది. అవాఙ్మనసగోచరం బగుబ్రహ్మపదార్థమును వాఙ్మనసగ్రాహ్యంబుగా నొనరించు నీరూపకము చదువరులను వివేకరాజ్యపదవి నొందించి సచ్చిదానందరసమగ్నులం గావించుచున్నది

ఇందు మతివివేకములు కథానాయకులు; ప్రబోధోదయము విషయము. ఇందు బౌద్ధకాపాలికాది మతఖండనము, కామక్రోధాది నిరసనము శమదమాది షట్కసంపత్తియుఁ జక్కగా నుపన్యసింపఁబడినవి. ఇందలి కొన్నివచన మిప్పటి వేదాంతోపన్యాసకుల యనుభవము నేఁతయుఁ బ్రకటించుచున్నది.

§ “ ప్రభవతి మనసి వివేకో విదుషామపి శాస్త్రసంభవస్తావత్ ।
నిపతంతి దృష్టివిశిఖా యావన్నేందీవరాక్షీణాం ॥ ”

ఈక్రింది శ్రద్ధావచనము సర్వమతసారం బగునద్వితీయబ్రహ్మజ్ఞానమును బోధించుచున్నది.

† “ జ్యోతి శ్శాంత మనంత మద్వయ మజం తత్తద్గుణోన్మీలనా ।
బ్రహ్మేత్యచ్యుత ఇత్యుమాపతిరితి ప్రస్తూయతేఽ నేకధా ।
తైస్తై రేవ సదాగమై ర్శ్రుతిముఖై ర్నానాపథప్రస్థితై ।
ర్గమ్యోఽసౌ జగదీశ్వరో జలనిధీ ర్వారాం ప్రవాహైరివ ॥ ” అం

ఇంకొక్క ప్రబోధోదయవచనంబు నుదాహరించెదను.

---

§ విద్వాంసుల మనస్సులోఁగూడ, యువతుల దృష్టిబాణము పడునంతవఱకు శాస్త్రజనితమైన వివేకము నిలుచును. ఆపైని నిలువదని తాత్పర్యము.

† అద్వితీయమైన జ్యోతిస్సొక్కటియే బ్రహ్మము, విష్ణువు, శివుఁడు నని పెక్కువిధములుగాఁ జెప్పఁబడుచున్నది. కాని, వేదశాస్త్రబోధితము లగునానామార్గముల బయలువెడలినవారికి, సర్వనదులకు సముద్రమువలెనే యాయనంతతేజోరూపుఁ డగునీశ్వరుఁడొక్కఁడే పొందఁదగినవాఁడు.

‡ "కిం వా ప్తం కిముపోహితం కిముదితం కిం వా సముత్సారితం।
స్యూతం కింను విలాయితం ను కిమిదం కించిన్నవా కిం చన।
యస్మిన్నభ్యుదితే వితర్కపదవీం నైవం సమారోహతి। ఽలం
త్రైలోక్యం సహజప్రకాశదలితం సోఽహం ప్రబోధోదయః॥"

‡ తా॥ జ్ఞానోదయమైన పిదపఁ బరిబూర్ణబ్రహ్మాకారవృత్తిచే బాధితంబైన యీజగత్తు పుట్టినదా, నశించినదా? ఉన్నదా పోయినదా? అనువిచారమే కలుగదు. అనఁగా జ్ఞానిని, ఈనశ్వ మగుసంసార మేమియు బాధింపదని భావము.

-:0:-

# కల్హణపండితుఁడు.

ఇతఁడు కాశ్మీరదేశస్థుఁ డగుబ్రాహ్మణుఁడు; శివభక్తుఁడు; సంస్కృతభాషాపారంగతుఁడు. అల్పసంఖ్యాకు లగుపూర్వచరిత్రకర్తలలో నుత్తముఁ డగునీకవి కాశ్మీరరాజులచరిత్రను రాజతరంగిణి యనుపేర రచించి నవీనచరిత్రకారులకు మార్గదర్శి యయ్యెను. ఇతఁడు సుసలభూపాలుని కుమారుఁ డగుజయసింహభూపరునికాలమున నున్నవాఁడని రాజతరంగిణి * కడపటిశ్లోకమువలనఁ దెలియుచున్నది. గ్రంథముఖంబుననున్న "లౌకికేఽబ్దే చతుర్వింశే శకకాలస్య సాంప్రతం। సప్తత్యాభ్యధికం యాతం సహస్రం పరివత్సరాః॥" (శాలి॥ శ॥ ౧౦౭౦) అనుశ్లోకమువలననే మనకవి క్రీ॥ శ॥ ౧౧౪౮ లో నున్నట్లు స్పష్టపడుచున్నది. మఱియు క్షేమేంద్రుని ‡ రాజావళి నీతఁడు స్మరించుటగూడ నాతనికంటెఁబరుఁ డగునీతని పైకాలము స్థిరపఱుప నివర్శన మగుచున్నది.

* సుతస్సుసలభూభర్తు స్సంప్రత్యప్రతిమక్షమః।
నందయత్యేష మేదినీ మాస్తే జయసింహో మహీపతిః॥

‡ అంశోఽపి నాస్తి నిర్దోషః క్షేమేంద్రస్య నృపావళౌ।

ఈతని గ్రంథ మెనిమిది తరంగములు గలది. ఇది చరిత్రజ్ఞానమున కేగాక భాషాజ్ఞానంబునకుఁగూడ ననుకూలముగా నున్నది. ఇది పేరునకుఁ గాశ్మీరరాజచరిత మేయైన నితరదేశ రాజులను గవులను దెలుపుచునే యున్నది. తనకుఁ బూర్వము సువ్రతుఁడు, హేలరాజు, పద్మమిహిరుఁడు క్షేమేంద్రుఁడు, నీలముని మొదలుగా ననేకులు రాజచరిత్రలు వ్రాసినను వానిలోఁ గొన్ని జీర్ణించిపోవుటచేతను గొన్ని దుష్కరంబులగుటచేతను గొన్ని యనేకస్ఖాలిత్యములు గలిగియుండుటచేతను, బూర్వరాజదత్తశాసనాదుల ననుసరించి సవరించి సుబోధకంబుగా దీని రచించితి నని యితఁడు చేసినప్రతిజ్ఞంబట్టి కాలనిర్ణయాదుల నితనిగ్రంథము ప్రమాణమగునని యూల్లవిమర్శకు లంగీకరించియుండిరి. ఈతని పిదప జోనరాజపండితుఁడు, జయసింహుఁడు మొదలుగా జైనోల్లాబదీనరాజపర్యంతము ద్వితీయరాజతరంగిణిని, ఆతనిశిష్యుఁడు శ్రీవరపండితుఁడు, ఫతిహాశాహారాజువఱకు మూఁడవరాజతరంగిణిని, పిదపఁ బ్రాజ్యభట్టుఁడు, ఫాతిశాహి అక్బరు బల్లాలదీనునివఱకును నాల్గవరాజతరంగిణిని క్రమముగా రచించిరి.

ఈకవి చంద్రుఁడీ కావ్యంబున నొనరించిన కవికర్మస్తవ మెంతయు శ్లాఘ్యముగా నున్నది. దానినిందుఁ దెలిఁగించి వ్రాసెదను. "దేనిచేఁదనకును బరునకుఁగూడఁ గీర్తిశరీరము సంప్రాప్తంబగునో యట్టియమృతరసము చిలుకు సుకవిగుణంబే వంద్యంబగును. రమ్యనిర్మాణసమర్థులగు కవిబ్రహ్మలుగాక యతిక్రమించినకాలమును దృష్టిగోచరంబు గావింపనింకనెవ్వఁడు సమర్థుఁడు గలఁడు? దేనియనుగ్రహంబు లేక యభయప్రదముగాఁ జతురబ్ధిపరీతమహీతలంబును బోషించిన చక్రవర్తులుగూడ స్మరణకు రాఁజాలరో యట్టికవికృత్యమునకు నమస్కరించెదను. ఓయన్నా! సత్కవికృత్యమా! నీయనుగ్రహంబు లేనికారణంబున సకలైశ్వర్యంబుల నుభవించినవారేయైన ననేకపూర్వరాజులు పుట్టినట్లే లోకమునకుఁ దె

లియకుండఁగఁబోయిరి. నిన్నెవని నుతింతును? నీవు లేనిచో. జగమంత యు నంధప్రాయం బగును. దీనికనుగుణంబుగనే యీమహాకవి యనేక రాజులతోఁ గూడ యశశ్శరీరంబున జీవించి లోకోపకర్తయగుచున్నాఁడు

—:O:—

# శ్రీహర్షకవి.

చింతామణిమంత్రోపాసకుఁ డగునీకవి మామల్లదేవీ శ్రీహీరుల కుఁ బుత్రుఁ డనియుఁ గాన్యకుబ్జేశ్వరునివలన గౌరవింపఁబడినవాఁ డని యు నితని నైషధకావ్యాంత † శ్లోకములవలననే తెలియుచున్నది. ఈతని నాదరించినరాజు జయచంద్రాపరనాముఁ డగుజయంతచంద్రుఁ డైనట్లు పండితశివరామశాస్త్రిగారిచే నైషధపీఠికలో వ్రాయఁబడిన ‡ రాజశేఖరసూరి కృతప్రబంధకోశాది దృష్టాంతమువలన నీక్రిందివిధముగా స్థిరపడుచున్నది.

" కాన్యకుబ్జపరిపాలకుఁడయి వారణాసిలో నివసించియున్న గోవిందచంద్రుఁ డనురాజునకు విజయచంద్రుఁ డనుపుత్రుఁడు గలఁడు. అతఁడు జయంతచంద్రు డనుతనకుమారునకు రాజ్యమిచ్చి యోగమార్గంబునఁ బరలోకమునొందెను. మేఘచంద్రుఁ డనుతనయుఁడు గలయీ జయచంద్రుఁ డేడువందలయామడ పరిమితిగల భూభాగమును బాలించుచుం

† శ్రీహర్షం కవిరాజరాజిమకుటాలంకారహీరస్సుతం ।
శ్రీహీరస్సుషువే జితేంద్రియచయం మామల్లదేవీ చ యం ॥
తాంబూలద్వయమాసనం చ లభతే యః కాన్యకుబ్జేశ్వరా
ద్యస్సాక్షాత్కురుతే సమాధిషు పరం బ్రహ్మప్రమోదార్ణవం ॥ ౨౨వ సర్గ

‡ ఇతఁడు క్రీ॥ ౧౩౪౮ లోనివాఁడు.

డెను. ఇతని సభలో ననేకపండితులు గలరు. వారిలో శ్రీహీరుఁ డను వాఁడొకఁడు. ఇతనికి శ్రీహర్షుఁ డనుకొడుకు గలఁడు. శ్రీహీరుఁడొక నాఁడు శాస్త్రవాదమున నుదయనుఁ డనుపండితునివలన నోడి నాఁటినుండియు నాతనిపై వైరమూనియుండి తుదకుఁ బ్రాణావసానసమయమునఁ గుమారునిఁ బిలిచి "కుమారా! నీవు సుపుత్రుఁడవే యయితి వేని నాశత్రువును రాజసభలో జయింపఁగలవు" అనిచెప్పి కాలధర్మము నొందెను. పిదప శ్రీహర్షుఁడు బాల్యంబుననే విదేశములకేగి సకలశాస్త్రములఁబఠించి దివ్యకవితాధోరణి గలిగి సభాజయంబు గలుగ సద్గురూపదేశంబున గంగాతీరంబునఁ జింతామణిమంత్రము నొకసంవత్సరము జపించి మంత్రసిద్ధికలవాఁడై ఖండనఖండఖాద్యాది గ్రంథములు గొన్నిరచించి కాశీపురములో నున్నజయచంద్రుని సభకేగి తనతండ్రి విరోధిని జయించి యాతనివలనను రాజువలనను మెప్పువడసెను. మఱియు రాజాజ్ఞచే నైషధకావ్యము రచించి కాశ్మీరమునకుఁబోయి యచటి పండితులకు వినిపించి యందలి సరస్వతీదేవి పీఠంబున నాకావ్యముంచి యాదేవివలన సత్కావ్యమనిపించుకొని యెట్టకేల కప్పటికాశ్మీరరాజగుమాధవదేవుని సత్కారము లందికొని మరలఁ గాశికివచ్చెను" అని యింకనేదో యొకపెద్దకథ శ్రీహర్షజయంతచంద్రులనుగూర్చి కలదు.

ఈజయంతచంద్రుఁడు క్రీ॥ శ॥ ౧౧౭౭ లో నున్నట్లాతని యీ క్రింది * దానశాసనసంగ్రహంబే నిదర్శనమగుచున్నది. "......మహారాజాధిరాజపరమేశ్వర నిజభుజోపార్జిత కాన్యకుబ్జాధిపత్య శ్రీచంద్రదేవ పాదానుధ్యాత పరమభట్టారక ... శ్రీమదనపాలదేవపాదానుధ్యాత... శ్రీగోవిందచంద్రదేవపాదానుధ్యాత...శ్రీమజ్జయచంద్రో విజయీ... యథోపరి లిఖితగ్రామ స్సగిరిగహననిధానకి, త్రిచత్వారింశదధికద్వాదశ

* ఇండియన్ ఆంటిక్వెరీ ౧౫-౧౧ ప్రాచీన లేఖనముల ౨౩

శతసంవత్సరే, ఆషాఢే మాసి శుక్లపక్షే సప్తమ్యాం తిథౌ రవిదినే (సంవతు ౧౨౪౩ క్రీ॥ ౧౧౮౭) అద్యేహ శ్రీమద్వారాణస్యాం గంగాయాం స్నాత్వా, ఉమాధిపతిశకలశేఖరం సమభ్యర్చ్య ... భారద్వాజగోత్రాయ ఠోడరాఉత శ్రీఅణంగాయ చంద్రార్కం యావచ్ఛాసనీకృత్య ప్రదత్త ఇతి మత్వా ... సమస్తదాయదాజ్ఞా విధేయీభూయ దాస్యథఇతి ... యానీహ దత్తాని పురా నరేంద్రై ర్దానాని ధర్మార్థయశస్కరాణి। నిర్మాల్య వాంతప్రతిమాని తాని కో నామ సాధుః పున రాదదీత ॥ ”

మఱియుఁ బ్రాచీనలేఖమాలలోని ౨౨ వ లేఖలో జయచంద్ర యౌవరాజ్యదానపత్రి సంవత్ ౧౨౨౫ (అనఁగాఁ క్రీ॥ ౧౧౬౯) అని యున్నది. కాన్యకుబ్జరాజులలోఁ జివరివాఁ డగునీజయచంద్రునే క్రీ ౧౧౯౪ లో యవనులు రాజ్యమునుండి తొలఁగించిరని చరిత్రలవలనఁ దెలియుచున్నది. కావున నీపైయాధారములంబట్టి క్రీ॥ ౧౧౬౯—౧౧౯౪ నడుమఁ గాన్యకుబ్జంబు నేలిన జయచంద్రభూపాలునకు మనకవి సమకాలికుఁ డై యుండు ననిధ్రువమగుచున్నది. కావుననే యీశ్రీహర్షుఁడు తనప్రభువుతండ్రి యగువిజయచంద్రుని ప్రశస్తిని వర్ణించుచు విజయప్రశస్తి యనుగ్రంథము రచించినట్లు నైషధపంచమసర్గసమాప్తిశ్లోకమువలనఁ గనుపడుచున్నది. ఈతని యీకాలనిర్ణయంబునుగూర్చి ‡డాక్టరుబహాలరు సమ్మతించినట్లుకూడఁ గనుపడుచున్నది. దీనిపై నిటఁడింతకంటెఁ బూర్వుఁ డనికొందఱు వాదోపవాదములు జరిగించినట్లు తెలియుచున్నదిగాని దుర్బలంబు లగు వాని నెల్ల ఖండించిన పండితశివరామశాస్త్రిగారిమతమే యాధునికసిద్ధాంతమయినట్లుండుటచే గ్రంథవిస్తరభీతివలన నావాదముల నిందు వ్రాయఁబూనలేదు. ఇదియుంగాక, వామనుఁడు

‡ చూ॥ రాయల్ ఏషియాటిక్ సొసైటీవారి ప్రబోధనగ్రంథము PP ౨౭౯—౨౮౭

మొదలుగా మమ్మటభట్టువఱకును గల ప్రసిద్ధాలంకారికులలో నొకఁడైన
నతని పద్యమొకఁడైనను దాహరింపకపోవుటయే యీతఁ డంతకంటెఁ
బ్రాచీనుఁడు కాఁడనుటకు గొప్పనిదర్శనముగాఁ గలదు.

ఇతఁడు గౌడదేశీయ బ్రాహ్మణుఁడు కావుననే గౌడకులప్రశస్తి
కావ్యము రచించె ననికొందఱియభిప్రాయము. నిరుపమాన విద్వత్కవి
సార్వభౌముఁ డగునీమహాకవి, స్థైర్యవిచారప్రకరణము, శ్రీవిజయప్రశ
స్తి, ఛందఃప్రశస్తి, గౌడోర్వీశకులప్రశస్తి, ఖండనఖండఖాద్యము, అర్ణవ
వర్ణనము, శివశక్తిసిద్ధి, నవసాహసాంకచరితచంపువు, నను మహాకావ్య
ములను రచించిన ట్లీతని నైషధీయచరిత ప్రతిసర్గాంతశ్లోకములవలనఁ దె
లియుచున్నది. కాని, యివియన్నియు లోకమున నంతప్రసిద్ధిగాంచినవిగా
లేవు. ఈతని కృతులలో నెల్లనుత్తమమై విద్వదౌషధమని పేరుగాంచిన
ది నైషధీయచరితము. ఇది యిరువదిరెండు సర్గల మహాకావ్యము. ఇందు
మహాభారతప్రసిద్ధమై జగమెల్ల నెఱిఁగిన నలదమయంతులచరిత్ర వర్ణింపఁ
బడినది. దీనిని శ్రీనాథుం డను నాంధ్రకవి శృంగారనైషధమను పేర మి
క్కిలి చక్కఁగా నాంధ్రీకరించెను. దీనిశైలి కఠినమైనదేయైనను సరస
భావగర్భితమై విచిత్రవర్ణనకల్పనలచే పండితులహృదయంబు నలంకరిం
చుచున్నది. ఇందుఁ బరస్పరసౌందర్యాదిగుణముల విని నలదమయంతు
లకు రాజహంస యధికానురాగంబు గలిగించుట, నలానురక్తయగు ద
మయంతీ విరహము, దమయంతీస్వయంవరప్రకటనము, ఇంద్రాదులతో
నారదుని సంభాషణము, దిక్పాలురు నలునిఁ బ్రార్థించుట, యతఁడు వా
రిదౌత్యము నంగీకరించుట, దమయంతీ సర్వాంగవర్ణనము, నలుని దౌత్య
ము, దమయంతి యాతనిఁ దనమనోరంజకునిఁగా నెఱుంగుట, దమయం
తీస్వయంవరము, వాగ్దేవి స్వయంవరమునకు వచ్చిన రాజులను వర్ణించి
చూపుట, నలరూపధారు లగునింద్రాదుల నెఱింగించుట, దమయంతి న

లుని వరించుట, పౌరస్త్రీలు నలుని వర్ణించుట, నలదమయంతుల వివాహము, వారి నైషయికసుఖవర్ణనము, నలుని రాజ్యపద్ధతి, యాతని కర్మతత్వము, దశావతారవర్ణనము, రామనామమాహాత్మ్యము, దంపతులసౌఖ్యము, ననుభాగంబులు ప్రధానముగా వర్ణింపఁబడినవి.

శృంగారము ప్రధానరసముగాఁ గలయీకావ్యంబున సందర్భానుసారంబుగ నంధంబెల్లరసములు ప్రదర్శింపఁబడినవి మఱియు ౧౭వ సర్గలో నైయాయిక మీమాంసక పౌరాణిక స్మృతిప్రామాణికాది సర్వమతఖండనం బొనరించి తన సర్వవేదశాస్త్రమతవిద్యాప్రావీణ్యముం బ్రకటించెను. కావ్యరచననుబట్టి యితఁడు సకలశాస్త్రములను జదివినవాఁడని తోఁచుచున్నది గాని పదియవసర్గచివరిశ్లోకమునుబట్టి తర్కశాస్త్రమున నధికశ్రమ చేసినవాఁడని కనుపడుచున్నది. అయిన నీతఁడు రామభక్తుడైన యద్వైతమతస్థుఁ డనియిరువదియొకటవసర్గయే తెల్పుచున్నది కలినాశనం బగునీకావ్యమునుండి శృంగారరసంబునకు రెండుపద్యములు దాహరించెదను.

§ "అధరం కిల బింబనామకం ఫల మస్మాదితి భవ్యమన్వయం।
లభతేఽధరబింబ మిత్యదః పద మాస్యా రదనచ్ఛదం దధత్॥"

† "శిరీషకోశాదపి కోమలాయా వేధావిధాయాం గమశేషమస్యాః।
ప్రాప్తప్రకర్షస్సుకుమారసర్గే సమాప యుద్వాచి మృదుత్వముద్రాం॥"

---

§ దమయంతి క్రీఁ జెదవినిబట్టి యధరబింబము (దొండపండువంటి పెదవి) అనుపదము, బింబఫలమీపెదవికంటెఁ దక్కువదిగావున నిది యధరబింబమయినది ను మంచియన్వయమును బొందుచున్నది. అనఁగా నామె పెదవి దొండపండును మించియున్నదని భావము.

† బ్రహ్మ, దిరిసెనపువ్వుకంటె మిక్కిలి మృదువయిన దమయంతి సర్వావయవములను జేసి సుకుమారసృష్టియందు ఘనతనుజెంది, వాక్కునందు మృదుత్వముద్రను రచించి సమాప్తిచేసెనఁట. వాణిమిగుల మృదువైనదని తాత్పర్యము.

# వేదాంతాచార్య శ్రీవేంకటనాథకవి.

ఇతఁడు ద్రవిడదేశస్థుఁ డగు శ్రీవైష్ణవుఁడు. ఈకవి ౧౩ వ శతాబ్దము త్తరభాగంబున నున్నాఁ డని జయపురవాసు లగు ద్రవిడనరసింహాచార్యులు తమకుఁ దెలిపినట్లుగా దుర్గాప్రసాదపండితులు వ్రాసియున్నారు గ్రంథాంతగద్యమునుబట్టి కవితార్కికసింహుఁడు, సర్వతంత్రస్వతంత్రుఁడు నని యితనికి బిరుదనామములు న్నట్లు కనుపడుచున్నది.

ఇతఁడు, అధికారసంగ్రహము, తత్త్వముక్తాకలాపము, న్యాయసిద్ధాంజనము, పాదుకాసహస్రము, రహస్యత్రయసారము, సుభాషితనీవి, సంకల్పసూర్యోదయము, యాదవాభ్యుదయము, నను పెక్కుగ్రంథముల రచించిన విద్వత్కవి. వీనిలోఁ జిన్నదైనను సుభాషితనీవి భర్తృహరినీతిశతకమును బోలి రమ్యముగా నున్నది. ఇందుండి యొకటిరెండుపద్యము లుదాహరించెదను.

"దృష్టసారంగయూథోఽపి దంష్ట్రానఖరవానపి ;
భూభృత్కటకసంస్థోఽపి సారమేయో నసింహతి ॥"
"అపి సంతాపశమనా శ్శుద్ధా స్సురభిశీతలాః ।
భుజంగసంగాజ్జాయంతే భీషణా శ్చందనద్రుమాః ॥"

సంకల్పసూర్యోదయము కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయముద్వైతమతమును బోధించునట్లుగా విశిష్టాద్వైతమతమును దెల్పుచున్నది.

———:o:———

# విద్యానాథకవి.

ఇతఁడు బ్రాహ్మణుఁడు; కాకతీయరా జగు ప్రతాపరుద్రదేవున కంకితముగాఁ బ్రతాపరుద్రయశోభూషణం బను పేర నలంకారశాస్త్ర

గ్రంథమును రచించిన సాహితీచక్రవర్తి. రుద్రమదేవీగణపతిరాజులకుదౌహిత్రుఁడైనయీప్రతాపరుద్రుఁడోరుగల్లురాజధానిగా నాంధ్రదేశమును క్రీ॥ శ॥ ౧౨౯౬—౧౩౨౩ వఱకును రాజ్యముచేసినట్లు దేశచరిత్రలు వాకొనుచున్నవి. కావున నాతనియాస్థానములోనివాఁ డగుటనీకవికాలముకూడ జగద్విదితమైనదై యున్నది. ఈకవి నిజచరితమేమియుఁ దెలియదుగాని యితఁ డీగ్రంథము వ్రాసి రాజును జూడవచ్చినప్పటి కతఁడు ఢిల్లీశ్వరునిచేఁ జెఱఁగొనఁబడెననియుఁ బిదప నాకస్మికమున నతనినిజూడసంభవించినపు డేవోమాటలసందర్భంబున నతఁడే తనరాజనియెఱుఁగక ప్రతిపక్ష్యముగ నతనినే తగులవేసితి ననియనినట్లును బిదప రాజువిముక్తుఁడైవచ్చి యీకవిని గౌరవించినట్లును నొక కింవదంతి గలదు.

ఇతనిగ్రంథమునకుఁ బ్రతాపరుద్రీయ మనునామాంతరము గలదు ఇందుఁ గావ్యనాటక రసాలంకార లక్షణంబులు సోదాహరణముగా విశదీకరింపఁబడినవి. ఇందుఁ గవి, దండి భామహోద్భట రుద్రభట్ట భోజ మమ్మటాది ప్రాచీనాలంకారికుల సబహుమానముగాఁ బేర్కొనెను. అర్వాచీనాలంకారగ్రంథములలో నిదియే యిపుడు లోకమున మిక్కిలి యుపయోగకరముగా నున్నదనుటకంటె దీనివిశేషము వేఱుఁగా దెలుపనక్కఱలేదు.

—:0:—

# విశ్వనాధకవిరాజు.

ప్రాగ్వంగదేశీయుఁ డును, చంద్రశేఖరమహాకవికిఁ బుత్రుఁడు నగునీబ్రాహ్మణుఁడు క్రీ॥ ౧౪ వ శతాబ్దములో నున్నవాఁ డని* చాల మంది యాశయము. ౧౨ వ శతాబ్దములోనివాఁ డైనజయదేవుని గీత

* చూ॥ బొంబాయి గీతగోవిందపీఠిక.

గోవిందములోని “ఉన్మీలన్మధుగంధలుబ్ధ” ఇత్యాదిపద్యము సాహిత్యదర్పణము ౧౦ వ పరిచ్ఛేదములో నుదాహరింపఁబడుటచే నంతకుఁ బరుఁదుకాఁదగిన యీతని కాలము పైయభిప్రాయంబునకే తగియుండు నని తోఁచుచున్నది. ఇతఁడు సాహిత్యదర్పణ మనుగొప్ప యలంకారగ్రంథము ను రచించెను. ఇందుదాహరింపఁబడిన శ్లోకములనుబట్టి, యితఁడు రాఘవవిలాసము, చంద్రకలానాటిక మొదలుగాఁ గొన్నిగ్రంథములు రచించినట్లు కనుపడుచున్నది గాని వాని ప్రచార మెందును గానరాదు. ఇతఁ డీగ్రంథమునఁ గాళిదాసాది పూర్వమహాకవుల శ్లోకంబుల నాయాసందర్భంబుల నుదాహరించుచుఁ దినపద్యంబులనుగూడఁ జెక్కుచోట్ల నుపయోగించెను. సర్వాలంకారికగ్రంథములలో ను త్తమప్రమాణంబగునీతని కావ్యము సాహిత్యజిజ్ఞాసువుల కత్యంతోపయోగకరముగా నున్నది. ఈతని కవిత్వము పేశలమై మనోహరముగా నుండును. కవి, తనరాఘవవిలాసమునుండి కరుణరసమున కుదాహరించిన యీపద్యము చూడుఁడు.

† “ విపినే క్వ జటానిబంధనం తవ చేదం క్వ మనోహరం వపుః ।
అనయో ర్ఘటనావిధేస్స్ఫుటం నను ఖడ్గేన శిరీషక ర్తనం ॥ ”

చంద్రకలానాటికలోని యీక్రింది స్త్రీవర్ణనమెంత మనోహరముగా నున్నది?

‡ “ తారుణ్యస్య విలాస స్సమధికలావణ్యసంపదో హాసః ।
ధరణీతలస్యాభరణం యువజనమనసో వశీకరణం ॥ ”

† రామా! నీమనోహరమైన దేహమెక్కడ? అడవిలో జటలు ధరించియుండుట యెక్కడ? దైవమీరెంటినిఁ గూర్చుట కత్తితో శిరీషపుష్పమును గోయుటయే.

‡ ఈకాంత, యౌవనముయొక్క విలాసము, లావణ్యముయొక్క హాసము, భూమికాభరణము, యువజనుల చిత్తవశీకరణముగా నున్నది.

—:0:—

# నారాయణకవి

ఈతని నివాసాదులంగూర్చి సరియయిన ప్రమాణము లేవియుఁ గానరావు గాని, పి. పేటర్సనుపండితుఁడు* వ్రాసినదానినిబట్టి యితఁడు, జయార్జునదేవుఁడు నేపాలదేశమును బాలించుకాలమున నేపాలశకము ౪౯౩ లో ననఁగాఁ క్రీ॥ శ॥ ౧౩౭౩ లో హితోపదేశము రచించినట్లు కనుపడుచున్నది. మఱియు మేగ్డోనలుపండితుఁడు హితోపదేశము ౧౪ వ శతకము మొదటఁ బుట్టియుండు ననియు, ఇంపీరియల్ గేజటీరు వారు ౧౦—౧౪ నడుమఁ బుట్టియుండు ననియుఁ దలంచిరిగాని యిందు మేగ్డోనలుపండితుని యభిప్రాయంబుగూడఁ బైపేటర్సు నుద్దేశయంబునకుఁ గొంచెము హెచ్చుతక్కువగా సరిపోవుటచే హితోపదేశము క్రీ॥ ౧౪ వ శతాబ్దంబు పరభాగంబునఁ బుట్టియుండు ననివిశ్వసింతము. దీనిచివరనున్న "శ్రీమాన్ధవళచంద్రోఽసౌ జీయాన్మాండలికో రిపూన్। యేనాయం సంగ్రహో యత్నా ల్లేఖయిత్వా ప్రచారితః॥" అను శ్లోకంబునుబట్టి ధవళచంద్రరాజీకావ్యమును వ్రాయించి లోకంబునఁ బ్రకటింపఁజేసినట్లు కనుపడుచున్నది గాని యీతఁ డెపు డేదేశమును బాలించెనో తెలియదు.

ఈకవి బ్రాహ్మణుఁడు. అద్వైతమతస్థుఁడు. "కథాచ్ఛలేన బాలానాం నీతి స్తదిహ కథ్యతే। మిత్రలాభ స్సుహృద్భేదో విగ్రహ స్సంధిరేవచ। పంచతంత్రా త్తథాన్యస్మా ద్గ్రంథాదాకృష్య లిఖ్యతే॥" అను శ్లోకములవలన నితఁడు విష్ణుశర్మ పంచతంత్రమునే యాధారముగాఁ

---

* బొంబాయిప్రతి హితోపదేశపీఠిక.

జేసికొని సందర్భానుసారంబుగ నితరుల శ్లోకంబుల నందందు సమకూర్చుచు బాలురకుంగూడ సుబోధకం బగునట్లుగా చక్కని శైలిని నాలుగుప్రకరణంబులతో నీతికథాసంగ్రహ మగు హితోపదేశమును రచించె నని తెలియుచున్నది.

సంస్కృతాక్షరములు నేర్చినవారెల్ల నెఱింగిన దీనింగూర్చి యితరం బేమియు వ్రాయనక్కఱలేదు. గ్రంథాది నితఁడు వ్రాసిన రెండు పద్యముల నిం దుదాహరించెదను.

“ అజరా మరవ త్ప్రాజ్ఞో విద్యా మర్థంచ సాధయేత్ ।
గృహీతఇవ కేశేషు మృత్యునా ధర్మమాచరేత్ ॥ ”
“ విద్యా దదాతి వినయం వినయా ద్యాతి పాత్రతాం ।
పాత్రత్వా ద్ధనమాప్నోతి ధనా ద్ధర్మం తత స్సుఖం ॥ ”

———:o:———

## జయదేవుఁడు.

ఇతఁడు వంగదేశీయుఁ డగుబ్రాహ్మణుఁడు; కౌండిన్యగోత్రుఁడు సుమిత్రా మహాదేవులకుఁ బుత్రుఁడు. ఈతనికాలము సరిగాఁ దెలియదు గాని వామనుఁడు మొదలుగా విశ్వనాథకవిరాజువఱకును గలయాలంకారికులలో నొకఁడును నీతని శ్లోకము లుదాహరింపకపోవుటచూడఁగా ౧౪ వ శతాబ్దములోని విశ్వనాథకవిరాజుకంటె నితఁడు పూర్వుఁడై ౧౨ వ శతకము మొదట నుండియుండు ననికొందఱూహించిరి.

ఇతఁడు మిక్కిలి కవిత్వప్రియుఁడయినట్లీతని శ్లోకమే చెప్పుచున్నది.

‡ న బ్రహ్మవిద్యా నచ రాజ్యలక్ష్మీ స్తథాయథేయం కవితా కవీనాం ।
లోకోత్తరే పుంసి నివేశ్యమానా పుత్రీవ హర్షం హృదయే కరోతి ।

ఇతఁడు ప్రసన్నరాఘవనాటకము, చంద్రాలోకము, రతిమంజరి యను గ్రంథములు రచించెను. వాల్మీకిరామాయణకథాశ్రయం బగునీత నినాటకమన్నివిధముల మురారి యనర్ఘరాఘవమును బోలియుండుటచే నీతనికిఁ బిల్లమురారి యనియాంధ్రదేశమున నొకవాడుక గలదు. ఈనా టకకవిత్వము యుక్తియుక్తసంభాషణంబున సభారంజకంబుగా నుండును నాల్గవయంకములోని యీక్రిందిపాత్రల యెత్తిపొడుపుమాటల లెంతవిన సొంపుగా నున్నవో చూడుఁడు.

జామదగ్న్యుఁడు—రామా! యెవనికౌఁగిటిలోఁ జిక్కుకొనిన కుమార స్వామి తనతలలకుఁ దగినట్లు భుజములను నిర్మించినాఁడుకాఁడ ని కోపముతో శివునిచేతిలోనున్న బ్రహ్మశిరస్సును జూచెనో యాపరశురాము నెఱుఁగవా?

రాముఁడు—ఓబ్రాహ్మణా! మీతో మాకు యుద్ధవార్తయైనను సంఘ టింపదు. మీరుబలవంతులు మేము బలహీనులము.

లక్ష్మ—సత్యమే. రాజుల కొకటే గుణము (అంపత్రాడు). గలిగినశరాస నము బలము. బ్రాహ్మణులకో తొమ్మిదిగుణములు (పోఁగులు) గ లిగిన యజ్ఞోపవీతము బలము.

జామ—ఓరీ! ఇది మీతప్పుగాను క్షత్త్రియవంశమున దయతలఁచుట నా కుఠారము తప్పు.

రామ—క్షీరకంఠుఁడు వానితో నేమి?

జామ—వీఁడు క్షీరకంఠుఁడు గాఁడు. విషకంఠుఁడు.

లక్ష్మ—విషకంఠశిష్యా!

జామ—ఓరీ దుర్మార్గా! అక్షరసామ్యంబున నాకు నీవు గురువవగుము వా? భూమిని రాజరక్తధారచే నీరేణుకను జేసిన నాకుఠార మె ఱుఁగవు

లక్ష్మ—ఔను నీగొడ్డలి భూమిని నీరేణుకను (పరశురాముని తల్లి రేణుక) జేసెనుగాదా?

రామ—మాతల్లిగొడవ యెత్తెనే

శతానందుఁడు—మునీ! శమము మఱచితివా?

రామ—ఓరీ! నీకు శమగుణము నింద్రుఁడు నేర్పెనా? గౌతముఁడు నేర్పెనా? అని యిట్టివిధంబుగాఁ బాత్రసంభాషణంబు రుచికరము గానుండును,

రాముని విప్రలంభావస్థను దెల్పునొకపద్య ముదాహరించెదను.

" సౌమిత్రే! నను సేవ్యతాం తరుతలం చండాంశు రుజ్జృంభతే।
చండాంశో ర్నిశి కా కథా రఘుపతే చంద్రోఽయ మున్మీలతి।
వత్సైతద్విదితం కథంను భవతా ధత్తే కురంగం యతః।
క్వాసి ప్రేయసి హా కురంగనయనే చంద్రాననే జానకి! ॥ "

సర్వాలంకారములకు లక్ష్యలక్షణరూపంబులగు సులభశ్లోకములతో నున్న యీతని చంద్రాలోక మలంకారశాస్త్ర మభ్యసించువారికి మహోపకారకముగా నున్నది. ఇందలి శ్లోకంబులనే గ్రహించి వివరించి శ్రీమదప్పయదీక్షితులు కువలయానందమును రచించిరి.

ప్రతీపాలంకారోదాహరణము.

" ప్రతీప ముపమానస్యోపమేయత్వ ప్రకల్పనం।
త్వల్లోచనసమం పద్మం త్వద్వక్త్రసదృశో విధుః ॥ "

మూఁడవది యగురతిమంజరి కేవలము శృంగారకావ్యము. ఇందు నాయికానాయకలక్షణాదులు వర్ణింపఁబడినవి.

—:o:—

# రామచంద్రకవి.

ఇతఁడు బ్రాహ్మణుఁడు. అయోధ్యాపురవాసి. ఈతని తండ్రి లక్ష్మణభట్టు. ఈకవి శృంగారవైరాగ్యంబులకు సమానార్థకంబుగా ౧౨౫ శ్లోకములతో రసికరంజన మనుద్వ్యర్థికావ్యము రచించి స్వయముగా వ్యాఖ్యానము రచించెను. ఈగ్రంథంబున వ్రాసిన ప్రతిజ్ఞాపద్యంబుననే యీయంశము స్పష్టమగుచున్నది.

« ఏకశ్లోకకృతౌ పురస్స్ఫురితయా సత్రత్త్వగోష్ఠ్యా సమం ।
సాధూనాం సదసి స్ఫుటాం విటకథాం కోవాచ్యవృత్త్యానయేత్
ఇత్యాకర్ణ్య జనశ్రుతిం వితనుతే శ్రీరామచంద్రః కవిః ।
శ్లోకానాం సహపంచవింశతిశతం శృంగారవైరాగ్యయోః ॥ ”

కావ్యాంతమునను న్న « శృంగారవైరాగ్యశతం సపంచ । వింశత్యయోధ్యానగరే వ్యధత్త । అబ్దే వియద్వారణబాణచంద్రే । శ్రీరామచంద్రోఽనుచ తస్య టీకాం ॥ ” అను పద్యంబుననే ౧౫౮౦ విక్రమార్కశకమనఁగాఁ క్రీ॥ శ॥ ౧౫౨౪ లో నితఁ డీకావ్యమును రచించెనని తెలియుచున్నది.

ఇది శ్లేషకావ్యమైనను సుగమంబై మృదులసరసంబై యలరారుచున్నది. ఇందుండి యొకపద్య ముదాహరించెదను.

« విద్యాధనాభిజన కామమదేషు పుంసా ।
దుర్వారపేష చరమ స్తదహం బ్రవీమి ।
రామాత్మకం జగదిదం హృది భావయంతః ।
కందర్పమేక మవలంబితు ముత్సహేరన్ ॥ ”

ఈకావ్యము శృంగారవిషయంబునఁ గొన్నిచోట్ల నీతిబాహ్యముగా నున్నను భక్తివిషయంబున ననుకూలముగానే యున్నది.

# కవికర్ణపూరకవి.

ఈకవి స్మార్తబ్రాహ్మణుఁడు. ఈతని కావ్యాద్యంతపద్యములంబట్టి యితఁడు శా॥ శ॥ ౧౪౯౪ లోఁ జైతన్యచంద్రోదయము రచించినట్లును, కపిలేశ్వరదేవునకుఁ బౌత్రుండును, బురుషోత్తమదేవునకుఁ బుత్రుండును నీలగిరిప్రభువును నగుగజపతిప్రతాపరుద్రదేవుని యానతిచే శా॥ శ॥ ౧౫౦౧ లోఁ జైతన్యచంద్రోదయము రచించినట్లును గనుపడుటచే నితఁడు క్రీ॥ ౧౫౨౦—౧౫౮౦ నడుమ జీవించియున్నట్లు తెలియుచున్నది.

ఈతని యీరెండుకావ్యములుగూడ గౌరాంగుఁడు లేక చైతన్యుఁడనుపేర శా॥ శ॥ ౧౪౦౭ లో భూమిపై నవతరించిన భగవంతునిచరితము నతని ధర్మాచరణమును, సదుపదేశమును దెల్పుచు ముముక్షువులకు మార్గదర్శకములుగా స్పృహమధురశైలి నలరారుచున్నవి. వీనిలో రెండవది యగుపదియంకముల నాటకము (ప్రకరణము). సర్వవిధములఁ బ్రబోధచంద్రోదయమును బోలియున్నదనుటకంటె దానియుత్తమత్వమును వేఱుగా వ్రాయనక్కఱలేదు. శైలిదెలుపుటకిందుండి యొకటిరెండుదాహరించెదను.

విరాగము—“ నశౌచం నో సత్యం నచ శమదమౌ నాపి నియమో।
న శాంతి ర్న క్షాంతి ర్నివశివ చ మైత్రీ నచ దయా।
అహో మే నిర్వ్యాజప్రణయిహృదో౽మీ కలిజనైః
కిమున్మీలీభూతా విదధతి కి మజ్ఞాతవసతిం॥ ”

“ షష్ఠీకర్మణి కేవలం కృతధియ స్స్నాతౌ కిచిహ్నద్విజా।
స్సంజ్ఞామాత్రవిశేషితా భుజభుజో నైశ్యాస్తు బౌద్ధాఇవ।
శూద్రాః పండితమానినో గురుతయా ధర్మోపదేశోత్సుకాః।
వర్ణానాం గతిరీదృగేవ కలినా హా హంత సంపాదితా॥ ”

అద్వైతము—“ధర్మార్థకామేషు పరైవ కృత్వా।
లిప్సా న మోక్షస్య చ కర్హిచిన్నః।
ఏభి స్సమస్తై స్తవ దేవలోకై।
ర్లోకాంతరేష్వస్తు సదైవ వాసః॥”

-:0:-

## రుద్రకవి.

న్యాయవాచస్పతిబిరుదాంకితుఁ డగునీతఁడు స్మార్తుఁడు; జయపురనివాసుఁడు; విద్యావిలాససుధీమణికిఁ బుత్రుఁడు; జయపుర (బొంబాయిరాజధానిలోనిది) రాజ్యరమానాథుఁ డగుమానసింహమహీపాలునకు మారుఁ డగుభావసింహమహీపతి యాశ్రితుఁడు.

* ఈపైయంశము లీతని కావ్యమువలననే తెలియుచున్నవి.

ఈభావసింహమహారాజిప్పటిజయపురమహారాజునకుఁ బదునాఱవపూర్వపురుషుఁ డనియు నితనితండ్రి యగుమానసింహరాజు ఢిల్లీపాదుషా యగునక్బరుచక్రవర్తికి సమకాలికుఁ డనియుఁ బ్రస్తుతజయపురరాజాస్థానపండితు లగుదుర్గాప్రసాదపండితులు వ్రాసియున్నారు.

కావున నీకవి క్రీ॥ ౧౫౭౦—౧౬౨౦ నడుమ నున్నవాఁడనుట నిర్వివాదము.

ఇతఁడు తనపోషకుని పేరనే భావవిలాసంబన నన్యాపదేశముగా నీతిదాయకముగా నొకచిన్నపద్యకావ్యమును రచించెను. ఇంక నీతని

---

* అన్యాపదేశవినివేశ విదగ్ధబుద్ధి ।శ్రీభావసింహనరసింహనియోగయోగాత్॥ విద్యావిలాసపుత్రస్య న్యాయవాచస్పతేరియం ॥ సద్గుణానాం సముద్రేణ రుద్రేణ గ్రథితా గుణైః । కంఠస్థా శ్లోకమాలేయం కేషాం నకురుతే శ్రియం ॥

గ్రంథములు గలవని తెలియుచున్నదిగాని యవినాకు లభింపలేదు. ఈతని విత్వశైలి మిక్కిలిసరసముగా నుండును. ఇందుండి రెండుదాహరించెదను

" సంపాదితా స్సపది దగ్ధురదీర్ఘవాదా।
యతోఽకిలాకలరుతాని నిరాకృతాని।
నిష్ఫీత మంబు లవణం నతు దేవనద్యాః।
పర్జన్య! తేన భవతా నకృతో వివేకః॥ "
" ఆరోపిత శ్శిరసి య స్స్వయమీశ్వరేణ।
సిక్త స్సదైవ సురశైవలినీజలేన।
నక్షామతాం తదపి ముంచతి సోఽయమిందు।
రేత ద్ద్వయస్య మరతిక్రమమేవ దైన్యం॥ "

—:0:—

# అప్పయదీక్షితులు.

ఈశ్వరుఁడు కలియుగములో మొదట శంకరాచార్యావతారమెత్తి మరల నప్పయదీక్షితులై పుట్టెనని మతవేత్తలయభిప్రాయము. ఈ మహాత్ముని చరిత మొకరిద్దఱు సంస్కృతాంధ్రముల వ్రాసియుండుటచేఁ గవిప్రశంసాపరముగా నిందు సంగ్రహించి వ్రాయుచున్నాను.

కాంచీమండలములోని " అడెపోల " మనుగ్రామమీతనినివాసము ఇతఁడు భారద్వాజగోత్రుఁడు; ఈతని పితామహుఁడు ఆచార్యసర్వతోముఖమహావ్రతయాజి; తండ్రి విశ్వజిద్యాజిరంగరాజమఖి. ఈవిషయమీతని మధ్వతంత్రముఖమర్దనము చివరి § శ్లోకములవలనఁ దెలియుచున్నది

§ విద్వద్గురో ర్విహితవిశ్వజిదధ్వరస్య। శ్రీసర్వతోముఖమహావ్రతయాజిసూనోః। శ్రీరంగరాజమఖిన శ్శ్రితచంద్రమౌళే। ర స్త్య ప్పదీక్షిత ఇతి ప్రథిత స్త

ఇతఁడు పండ్రెండు సంవత్సరములకే వేదము సాంతముగాఁ జదివి పిదప నెల్లశాస్త్రములయందుఁ గృతపరిశ్రముఁడై యద్వైతశాస్త్రనిధియై తత్కాలమందలి వైష్ణవుల యౌద్ధత్యంబు సహింపక వీరశైవమతస్థాపకుఁడై శివభక్తుఁడై శైవమతపరముగా ననేకగ్రంథంబు లొనరించి యనేకవైష్ణవుల ధిక్కరించి యనేకదేశంబులఁ దిరిగి యనేకరాజులసభల సన్మానంబు వడసి కావేరీనదీతీరంబున ననేకక్రతువులు సలిపి వేత్తయై ముముక్షువై కాశికిఁబోవుచుఁ దనభక్తుల నిర్బంధంబునఁ జిదంబరములోఁ గొంతకాలముండి యందే డెబ్బదిసంవత్సరముల వయస్సున శరీరము పరిత్యజించె నని యీతని జీవనచరితసంగ్రహము తెలియుచున్నది.

ఈమహాకవి క్రీ॥ ౧౫౮౫—౧౬౧౪ నడుమఁ జంద్రగిరి రాజధానిగాఁ గర్ణాటదేశము నేలినవాఁడును, కృష్ణదేవరాయల కుటుంబములోనివాఁడును నగు ‡ వేంకటపతిరాయల యాస్థానంబున నున్నట్లీతనికువలయానందాంతిమశ్లోకంబునఁ దెలియుటచేతను నతనిగురు వగుతిరుమల తాతాచార్యుని శాస్త్రవాదంబున నోడించి యాతనివలన సన్మానంబు నొందినవాఁ డని లోకప్రసిద్ధముగా నుండుటచేతను, ఇతని సోదరునిపౌత్రుఁ డగునీలకంఠదీక్షితులు క్రీ॥ ౧౬౩౬ లో నీలకంఠచంపువు రచించినట్లా † కావ్యాద్యపద్యంబుననే తెలియుచుండుటచేతను, క్రీ॥ ౧౫౫౦---

నూజః ॥ సోఽయం మితపదమకరో న్మహితార్థం మధ్వతంత్రముఖభంగం । ప్రీత్యై పురామరాతే శ్రీకామాక్షీసమేతస్య ॥ శ్రీమద్భారద్వాజకులజలధికౌస్తుభ శ్రీమదద్వైతాచార్య విశ్వజిద్యాజి శ్రీరంగరాజాధ్వరి వరసూనో రప్పయదీక్షితస్య కృతిస్సమాప్తా ॥

‡ అముం కువలయానంద మకరో దప్పదీక్షితః ।
నియోగా ద్వేంకటపతే ర్నిరుపాధికృపానిధేః ॥

† అష్టత్రింశదుపస్కృత సప్తశతాధిక చతుస్సహస్రేషు (౪౭౩౮) కలివర్షేషు గతేషు గ్రథితః కిల నీలకంఠవిజయోఽయం.

౧౬—౧౭ నడుమ జీవించియున్నవాఁడని స్పష్టమగుచున్నది. ఈతనిసామర్థ్యమాహాత్మ్యములనుగూర్చి యనేకకథలు లోకములోఁ గలవుగాని వానితత్త్వమును లోకమేయెఱుంగుఁ గని యిందు వ్రాయఁబూనలేదు. ఎట్లయిన నీతఁడు వైష్ణవమతస్థులతోఁ బెద్దవిరోధముపెట్టుకొని పెక్కు సార్లు వారిని జయించినవాఁ డనుట స్పష్టము.

ఇతఁడు, శివకర్ణామృతము, శివతత్త్వవివేకము, శివాదిత్యమణిదీపిక, శైవాద్వైతనిర్ణయము, శివార్చనచంద్రిక, వీరశైవము, ఆత్మార్పణస్తుతి, ఉపక్రమపరాక్రమము, చతుర్మతసారసంగ్రహము, చంద్రకలాస్తుతి నామసంగ్రహమాల, బ్రహ్మతర్కస్తవము, భక్తిశతకము, వరదరాజస్తవము, వాదనక్షత్రమాలిక, రత్నత్రయపరీక్ష, విధిరసాయనసుఖోపజీవిని, వృత్తివార్త్తికము, భారతతాత్పర్యసంగ్రహము, రామాయణసారస్తవము, హరివంశసారచరితము, శబ్దప్రకాశము, మధ్వతంత్రముఖమర్దనము, కువలయానందము, దశకుమారచరితసంక్షేపము, శారీరకన్యాయరక్షామణి, సిద్ధాంతలేశసంగ్రహము, రసికజనరంజని, (కువలయానందటీక), చిత్రమీమాంస, వైరాగ్యశతకము మొదలుగా నూఱుగ్రంథములు రచించినట్లు తెలియుచున్నది. ఇందుఁ గొన్నియముద్రితములై యున్నవి. మఱికొన్ని నామమాత్రావశిష్టంబులై యున్నవి. అలంకారగ్రంథము లగుకువలయానంద, చిత్రమీమాంసలుమాత్రము లోకప్రఖ్యాతిం గాంచియున్నవి. " నగృహీతం శ్రుతిహృదయం నచ నగృహీతం పరిప్లవం హృదయం। ఇచ్ఛామిచ ధామ పరం గచ్ఛామితు విశ్వనాథపురీం॥ " అనుశ్లోకమును బట్టి యీతఁడు కాశికిఁబోవఁదలఁచినకాలమున వైరాగ్యశతకము నిర్మించినట్లు కనుపడుచున్నది. ఇది వేదాంతసారంబై యెల్లవిధముల భర్తృహరివైరాగ్యశతకమును స్మరింపఁజేయుచున్నది. ఇతఁడు వెంకటపతిరా

యలయానతిచే జయదేవకవి చంద్రాలోకములోని శ్లోకములనే తల చుగా గ్రహించి వివరించి సర్వాలంకారలక్ష్యలక్షణంబులతోఁ గువలయా నందము రచించి దానికి స్వయముగా రసికజనరంజని యనువ్యాఖ్య ర చించినట్లు తెలియుచున్నది. కాని యావ్యాఖ్య యిపుడెందును గానరా దు. రామచంద్రసూరిపుత్రుఁ డగువైద్యనాథపండితుని యలంకారచంద్రి కతోఁగూడిన యీకువలయానందము సార్థకముగా నలంకారంబులకు సత్ప్రమాణముగా లోకోపకారము గావించుచున్నది. మొదటఁ బద్యకా వ్యములుగా రచించిన మధ్వతంత్రముఖమర్దన శివకర్ణామృతములకు స్వ యముగా నిరుడే వ్యాఖ్యానములు రచించెను. ఏకారణంబుననో సమా ప్తముగాని యలంకారగ్రంథ మగునీతని చిత్రమీమాంసపై నితనికి వార్ధ కదశలో సమకాలికుఁ డగుపండితరాజ జగన్నాథకవి ఖండనము చేసెను ఈచిత్రమీమాంస నప్పయదీక్షితులు వ్రాయుచున్నకాలములోనే పండిత రాయలుఁడు దీనిపై ఖండనము ప్రారంభించెననియు నందుచే దీనిసమాప్తి గావింపకయే దీక్షితులు విడిచినట్లును లోకప్రవాదము గలదు. కువలయా నందము రూపకప్రకరణములోనున్న "చిత్రమీమాంసాయాం ద్రష్టవ్యం" అనువాక్యమునుబట్టి కువలయానందముకంటె దీనినే పూర్వము రచించి నట్లు కనుపడుచున్నది. అందుచేఁ బైలోకప్రవాదము సత్యమేమైయుండ వలెననియు, లేదా! దానిపరభాగము పండితరాయలకు సంభవింపకుండ వలెననియుఁ, గాదా! దీనిచివరిభాగ మాతనిఖండనముతోఁగూడ నశించి యుండు ననియుఁ దోఁచుచున్నది. ఎట్లయినను వీరిరువురు కొంచెము కా లము సమకాలికులై యుండి రనుట సత్యమని నమ్మఁదగినది.

దీక్షితుల కవిత్వము మిగులహృదయరంజకముగా సుగమముగా నుండను. శైలి తెలుపుటకొరకు పద్య ముదాహరించెదను.

* "ప్రాదేశమాత్ర ముదరం పరిపూరయితుం కియా నయం యత్నః।
చులకే నాంభః పాతుం ఖనితవ్యః కిం తటాకోఽపి॥"

* ఈచిన్నపొట్టపోసికొనుట కెంతయత్నము గావలయును? పుడిసిటితో నీరుద్రాగుటకుఁ జెఱువు త్రవ్వవలయునా?

—:0:—

# పండితరాజజగన్నాథకవి.

గోదావరీమండలమునం దమలాపురమునకు దగ్గఱగానున్న ముంగండగ్రామ మీతని జన్మభూమి ఇతఁడు వేగినాటి యాంధ్రబ్రాహ్మణుఁడు. వీరియింటిపేరు, ఉపద్రష్టవారని చెప్పుదురు. ఇప్పటికిని వారివంశస్థులు కొందఱాగ్రామమునఁ గలరు. ‡ ఈతని తండ్రి పేరుభట్టు; తల్లి లక్ష్మీదేవి. అత్యద్భుతం బగునీతనిచరిత మొకటిరెండు విధములుగా లోకమున వ్యవహరింపఁబడుచున్నదిగాని ప్రధానవిషయంబున [illegible]వించునవి కొంచెమెచ్చుతక్కువగా సరిపడుచుండుటచే వానికి సామరస్యము మాత్రము గల్పించుకొని సత్యము గ్రహింపవలసియున్నది. ఇతఁడు తురుష్కస్త్రీని బెండ్లియాడె ననుట సత్యమే కాని దానిఁగూర్చి యొకకింవదంతి లోకమున నిట్లు గలదు.

"జగన్నాథపండితుఁడు చిన్నతనముననే † తండ్రియొద్దఁ దర్కవ్యాకరణాలంకారశాస్త్రములఁజదివి సాహిత్యాలయం దధికసమర్థుఁడై యిరువదియైదుసంవత్సరములప్రాయముననే ధనార్జనంబునకై దేశాంతర

‡ [illegible]ంగాన్వయ మంగలాలయమహాలక్ష్మీదయా లాలితః।
శ్రీమత్పేరమభట్టసూను రనిశం విద్వల్లలాటం తపః॥

† పాషాణాదపి పీయూషం స్యందతే యస్య లీలయా।
తం వందే పేరుభట్టాఖ్యం లక్ష్మీకాంతం మహాగురుం॥

జిగమిషంబూని కర్ణాటజయపురరాజాదుల యాస్థానంబుల కేగియందలిపండితులజయించి యందుఁగొందఱివలన సమ్మానంబులు వడసి యా కాలంబున ననఁగాఁ క్రీ॥ శ॥ ౧౫౫౬——౧౬౦౫ నడుమ రాజ్యము చేయుచున్న ఢిల్లీఫాదుషా యగునక్బరుచక్రవర్తి సంస్కృతవిద్యాభిమాని యని విని యాతని సందర్శింప నేగెనఁట. అట్లేగి చక్రవర్తిదర్శనము కాంక్షించునతనికి దైవికముగా నెవరోయిరువురు తురుష్కులు వాగ్వాదపడుచుండ వినుటయు నందులకై యక్బరునొద్దకు సాక్ష్యమీయ నేగుటయు సంభవించెనఁట. అప్పటికి ఫార్సీ భాషయేమియు రానియీపండితుఁడావాదవిషయమంతయుఁ దానువిన్నట్లుగాఁ జక్రవర్తియొద్దఁ జెప్పఁగా నతఁడీతని బుద్ధివైశద్యమున కానందించి యేకసంథాగ్రాహిత్వమును బరీక్షింప మహమ్మదీయవేదములోని కొంతభాగము చదువఁగా నీపండితుఁడు దానిని మరలఁ జదివెనఁట. అంత నక్బరు మిక్కిలిసంతసించి యతనిఁదన యాస్థానంబున నుంచుకొనెనఁట. ఇట్లుండ నక్బరుచక్రవర్తికి రాజస్త్రీయందుఁబుట్టిన లవంగి యనుకన్య తండ్రియానతిచేఁ బానీయపూరితం బైనబంగారుకలశము శిరస్సుమీఁదఁబెట్టుకొని వచ్చుచుండఁగా నక్బరు దీనిరాకను వర్ణింపు మని మనకవిని గోరెనఁట. అంత నతఁడు——

“ ఇయం సుస్తనీ మస్తకన్యస్తకుంభా ।
కుసుంభారుణం చారుచేలం దధానా ।
సమస్తస్య లోకస్య చేతః ప్రవృత్తిం ।
గృహీత్వా ఘటే స్థాప్య యాతీవ భాతి ॥ ”

అనివర్ణింపఁగాఁ జక్రవర్తి నీకేమిగావలయు ననియడుగుటయు నతఁడు

‡ నయాచే గజాళిం నవా వాజిరాజిం ।
నవిత్తేషు చిత్తం మదీయం కదాచిత్ ।
ఇయం సుస్తనీ మస్తకన్యస్తహస్తా ।
లవంగీ కురంగీ దృగంగీ కరోతు ॥ ”

‡ నాకు గజతురగాదులక్కఱలేదు. ఈలవంగియే కావలయును.

యువతీ నవనీత కోమలాంగీ శయనీయే యది నీయతే కదాచిత్ ।
అవనీతలమేవ సాధు మన్యే న వనీ మాఘవనీ వినోదహేతుః ॥

అని చెప్పెనఁట. అంత నాఁడు తప్పనియా ప్రభువు నీవు నాతోఁ గూడి భుజించినయెడల దీనినిచ్చి పెండ్లిగావించెద నని చెప్పి యందుల కంగీకరించిన యా పండితున కదివఱకే జగన్నాథకవియందు మోహము గలిగినలవంగిక నిచ్చి పెండ్లి గావించె నఁట. ఈవిషయంబున మన కవి పెండ్లియాడిన లవంగి యక్బరుపుత్రిక యగునా కాదా యనియు నీతని యసఫవిలాసజగదాభరణాది కావ్యములం బట్టి యీఁ డక్బరుచక్రవర్తిపౌత్రుఁ డగు శహాజహానుచక్రవర్తిని, అతనికుమారుఁ డగు దారాశాహప్రభువును నాశ్రయించినట్లు కనుపడుటచే నితఁ డక్బరుకాలంబున నుండుట యెట్లు సంభవించు ననియుఁ గొందఱు సంశయించుచుండిరి. కాని, యిందు మొదటిసందేహము సందేహమే కాని ముందు తెలుపఁబోవునట్లుగా నీతని జీవచరిత్రను, ఈతని గ్రంథరచనను, ఈతని సమకాలికపండితులకాలమును బట్టి చూడఁగా నెనుబదిసంవత్సరములకుఁ బైగా జీవించి పరిపూర్ణాయుర్దాయ మనుభవించిన యితఁ డక్బరుసంస్థానంబునఁ గూడ నాతని రాజ్యావసానకాలంబున నుండియుండు ననుటమాత్రము సత్యమైనట్లు తోఁచుచున్నది. ఇంతకు ముందుగా నీతని జీవితకాలము నాకుఁ దెలిసినట్లుగా స్థూలదృష్టితోఁ బరిగణించి వ్రాసెదను. ఇందేమయినఁ గొంచెము హెచ్చుతక్కువలున్నను నితని సర్వకావ్యంబుల నందముఁ గనుపడుచున్నశ్లోకంబులం గనియు, నీతనిసమకాలికు లగు నప్పయదీక్షితాదులవలనో యితనికి సంబంధించినకథలు వినియు, నితఁడు చిరకాలము జీవించినవాఁ డని కర్ణపరంపరాయత్తమై వచ్చుచున్నవార్త నెఱింగినవారి కిది విశ్వసనీయము కాకపోదు.

§ కోమలాంగి యగులవంగి నా పడకఁ జేరనేని నందనంబు కంటె భూతలమే

జగన్నాథపండితుఁడు క్రీ॥ శ॥ ౧౫౯౦ ప్రాంతమున జన్మించి యిరువదియైదేండ్లప్రాయమునందే దేశాటనము వెడలి కర్ణాటజయపురాదిరాజుల సందర్శించి ౧౬౨౦ సంవత్సరప్రాంతమున ఢిల్లీకిఁ జేరి ౧౬౦౫ వఱకు నశ్వరునొద్దనుండి యప్పుడే యొక తురుష్కస్త్రీని బరిణయంబై యది మొదలుగా ౧౬౨౭ వఱకు జహంగీరు రాజ్యకాలంబున నందేయుండి సంస్కృతవిద్యాభిమానముగల యాతని కుమారుఁ డగుశహాజహానుతో మైత్రిసలుపుచుఁ బిదప నాతని రాజ్యకాలమున విశేషగౌరవముం జెందుచు నపుడే యాతని పెద్దకుమారుఁడు పండితమిత్రుఁడు నగుదారాశాహతో మైత్రియొనరించి యాతని యశోవర్ణనంబునే జగదాభరణకావ్యముగా నొనరించి ౧౬౫౮ ప్రాంతమునఁ దనప్రభువులు నశించిన వెనుక నిరాలంబుఁడై పశ్చాత్తప్తుఁడై వృద్ధుఁడై విరక్తుఁడై కాశికిఁ జేరి గంగాలహరి రచించి గంగాప్రార్థనంబు గావించి లవంగితోఁగూడ శరీరము పరిత్యజించె నని తెలియుచున్నది. ఇందులకు క్రీ॥ ౧౫౮౫—౧౬౧౪ నడుమ చంద్రగిరి, రాజధానిగాఁ గర్ణాటరాజ్యమేలిన వేంకటపతిరాయల యాస్థానంబున నధికగౌరవము నొందిన శ్రీమదప్పయదీక్షితులతో శాస్త్రవాదమొనరింప నితఁడు పెక్కుసారులుద్యమించినట్లును, ఇతఁడు జాతిభ్రష్టుఁడయ్యెనను కారణంబున దీక్షితులీతనిఁ జూడ నిష్టములేనివారై కన్పడకుండినట్లును బిదప నీతఁడాతని నుద్దేశించియే భామినీవిలాసములో "దిగంతే శ్రూయంతే" యనుపద్యము చెప్పినట్లును దెలియు కథగూడ నిదర్శనము కాఁగలదు. మఱియు నీతఁడు స్వకాలమందలి పండితులతోఁ బోర్లాట్టము గలవాఁడైనట్లు తెలియుకథమాత్రము సత్యమే. పమనఁగాని అవసానకాలమందలి యుద్యానంబగుటచేతనో మత్సరముచేతనో యప్పయ్యదీక్షితుల చిత్రమీమాంసపై నంతవఱకే ఖండన మొనరించెను. భట్టోజీదీక్షితుల మనోరమపై మనోరమాకుచమర్దన మను

ఖండనము రచించెను. ఇట్లే తత్కాలమందలి ప్రతిగ్రంథకారకృతుల నీతఁడు ఖండించె నని వాడుక గలదు. కావున నప్పయదీక్షితులకు సమకాలికుఁ డగుటచే నకవి యక్బరుకాలముననుండె నని తలంచుట యాశ్చర్యము గాదు. ఇదియుంగాక యితఁడు రాజపండిత నిందాపరముగా నన్యాపదేశముగా వ్రాసిన భామినీవిలాసము చూడఁగా నకాలమందుఁ దన్ను సన్మానము చేయని కర్ణాటాదిరాజులను వారియాస్థానపండితులను నిందించినట్లును "ఢిల్లీవల్లభపాణిపల్లవతలే నీతం నవీనం వయః" అని యందే కనుపడుటచే నవయౌవనము నక్బరుకాలంబునఁ గడపినట్లును, ఇదియాతని ప్రథమప్రయత్నమైనట్లును దోఁచుచున్నది. ఒకవేళ నప్పయదీక్షితులు గతించిన వెనుకనే యాతని చిత్రమీమాంస నీతఁడు ఖండించియుండు నని యూహింపఁదగినను లోకములోని వారిపరస్పరకథలనుబట్టియు నీతని జీవితకాలమును గూర్చిన కథలనుబట్టియు దీక్షితులయవసానకాలంబున నితఁ డాతనికి సమకాలికుఁడై యుండునని కనుపడుటచే నక్బరు రాజ్యావసానకాలమున నితఁడు ఢిల్లీకిఁ జేరెననుట యసంగతము గాదు. ఏదియెట్లయిన నితఁడు చిరకాలము జీవించినవాఁడనుటయు శహజహాను దారాశాహప్రభువులఁ జిరకాల మాశ్రయించినవాఁ డనుటయు నిర్వివాదాంశంబులు. ఇతఁడు జాతిభ్రష్టుఁడయ్యును మతమాత్రము విడువక శివకేశవస్తుతులు చేయుచు నద్వైతజ్ఞానియై మరణమునకుఁ గాశినిజేరి ముక్తుఁడైన ట్లీగంగాలహరీపద్యమే తెల్పుచున్నది.

ఈమహాకవి, భామినీవిలాసము, చిత్రమీమాంసాఖండనము, మనోరమాకుచమర్దనము, యమునావర్ణనచంపువు, అసఫవిలాసము, జగదాభరణము, రసగంగాధరము, ప్రాణాభరణము, సుధాలహరి, పీయూషలహరి, కరుణాలహరి, లక్ష్మీలహరి, అమృతలహరి, గంగాలహరి యనుపదినాల్గుగ్రంథములు రచించినట్లిప్పటికిఁ దెలియుచున్నది. ఇంకైదవది «అ

సఫఖానునవాబుచరితముం దెల్పు నొకయాఖ్యాయిక. దీనిచివర † గద్యముంబట్టి శహాజహానుచక్రవర్తి యీతనికి "పండితరాజ" బిరుదమిచ్చినట్లు కనుపడుచున్నది. ఆఱవదానిలోఁ గొంచెముగా శహాజహానువర్ణనంబును విశేషించి దారాశాహా యశోవర్ణనంబును గలవు. ఈతని కృతులలో నెల్ల నిరుపమానమైనది రసగంగాధరము. ఇది యైదాననముల నెము ప్రకరణములుగల గొప్ప యలంకారగ్రంథము. ఇందు ముందుగా, ననేకాలంకారికసమ్మతమైన "అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్య" మ్మనులక్షణంబునకు భిన్నముగా "రమణీయార్థప్రతిపాదకశబ్దః కావ్య" మ్మని కావ్యలక్షణమొనరించెను ఇట్లే యీతనిగ్రంథ మామూలాగ్రముగాఁ బ్రాచీనమతముల ఖండించుచు మిక్కిలి ప్రౌఢముగా నున్నది. ఇందుదాహరింపఁబడిన శ్లోకములన్నియు నితఁడే స్వయముగా రచించినవి. ఈతని ప్రాణాభరణము ‡ కామరూపదేశాధీశుఁ డగు ప్రాణనారాయణమహీవరుని స్తవముగా నున్నది ఇందుఁ బ్రతిపద్యమొక్కొక్కయలంకారమునకు లక్ష్యముగా నున్నది. ఇఁక నీతని చిన్నకావ్యము లగు సుధాలహర్యాదు లైదును సూర్య కేశవ లక్ష్మీ గంగాది స్తవరూపములై యీతని * పశ్చాత్తాపమును, చిత్తనైర్మల్యమును, దైవభక్తిని, బోధించుచున్నవి. కవితామృతనిధి యగునీతని కావ్యములనుండి యెన్నియు దాహరింపఁగలను. అయిన నొకటి రెండు—

† ... కవిభిరుపాస్యమానేన ... మూర్తిమతేవ నవాబాసఫఖానమనఃప్రసాదేన మాథురకులసముద్రేందునా రాయముకుందేనాదిష్టేన సార్వభౌమ శ్రీశాహజహానప్రసాదాధిగత పండితరాజపదవీ విరాజితేన జగన్నాథేనాసఫవిలాసాఖ్యాయికేయం నిరమీయత.

‡ జాగర్తి క్షితిమండలే చిరమిహ శ్రీకామరూపేశ్వరః ॥

* అయి దీనతరం దయానిధే దురవస్థం సకలై స్సమూర్ఛితం ।

౨. అద్యాపి [illegible] సృజసే హా కథమకస్మా చ్చిత్తా [illegible]

"విద్వాంసో వసుధాతలే పరవచః శ్లాఘా సువాంఛం యమా।
భూపాలాః కమలావిలాస మదిరో నీ లన్మదాఘూర్ణితాః।
ఆస్యే ధాస్యతి కస్య లాస్య మధునా ధన్యస్య కామాలస।
స్వర్గాప్యమాధరమాధురీ మధరయన్ వాచాం విలాసో మమ॥"

"పురాతనానాం వచసా మగోచరం।
మహీశితారం పురుషోత్తమం పతిం।
అపాస్య తం త్వాం నిరపత్రపా సతీ।
పతీ మతిర్మే కథ మన్య మేష్యతి॥"

-:0:-

# నీలకంఠదీక్షితులు.

శ్రీమదప్పయదీక్షితుల తమ్ముని పౌత్రుండును, భూమిదేవీ నారాయణ దీక్షితులకుఁ బుత్రుండును, ననేకాధ్వరకర్తయు, బ్రహ్మవేత్తయు నగునీతఁడు క్రీ॥ ౧౬౩౭ లో నున్న ట్లీతనినీలకంఠవిజయకావ్యంబుననున్న "అష్టత్రింశదుపస్కృత సప్తశతాధికే చతుస్సహస్రేషు (౪౭౩౮) కలివర్షేషు గతేషు గ్రథితః కిల నీలకంఠవిజయోఽయం" అను శ్లోకమువలనఁ దెలియుచున్నది. ఈతని తల్లిదండ్రులు బాల్యంబుననే కాలధర్మంబు నొందఁగా నప్పయదీక్షితు లీతనిఁ జేరఁదీసి పెంచి విద్యల నేర్పి రనియు నితఁడు చిరకాలము మధురాపురములో నివసించి మీనాక్షిసేవయొనరించుచుఁ దత్కాలంబునఁ దత్పురరాజునొద్దఁ బదునాలుగుసంవత్సరములు మంత్రిపదం బలంకరించియుండి రనియు దక్షిణదేశంబున నొకవాడుక కలదు. నీలకంఠచంపువులోని యీక్రిందిశ్లోకంబువలనఁగూడ నితఁ డప్పయదీక్షితులయొద్ద విద్య నేర్చినట్లు కనుపడుచున్నది.

వరదరాజావతారమహిమవర్ణనరూపకంబుగాఁ బద్యగద్యాత్మకంబుగా నైదువిలాసంబులతోనున్న కరిగిరిచంపు వను నామాంతరంబుగలిగిన యీతని వరదాభ్యుదయము, కేవలశ్లేషయమకోద్యమంబై శబ్దజాలంబు నేర్చుకొనుటకుపయోగించునట్లుగా నున్నదిగాని శ్రవణపఠనమాత్రరమ్యముగా లేదు. శ్రీకృష్ణసూనుఁ డగుప్రద్యుమ్నుఁడు కథానాయకుఁడుగాఁగలిగి వీరశృంగారరసాత్మకం బగునీతని ప్రద్యుమ్నానందనాటకము సరసముగా నున్నదిగాని దానికి లోకవిఖ్యాతిమాత్రము రాలేదు. శైలి తెలుపుటకై యీతని కృతులనుండి యొకటి రెండుదాహరించెదను. యజ్ఞపశ్వాలంభనము దోషముగా దనుటకుఁ జెప్పినయుక్తి చూడుఁడు.

† "హింసాంతరేష్వివ మఖాశ్రితహింసనేఽపి।
జైనేతరో యది జనో భజతే జుగుప్సాం।
నార్యంతరేష్వివ ననిందతి నందనానాం।
నిష్పాదనం కి మనఘోఽపి నిజే కళత్రే॥ వి॥ గు॥"

సహసా కుర్వతాం కర్మ శర్మహాని రసంశయం।
సులభా శలభానాం హి వహ్నౌ వహ్నోయ విందతాం॥"

† బౌద్ధుఁడు కానివాఁడు యాగపశుహింసనుగూడ నితరజంతుహింసవలెనే నిందించెనేని పరస్త్రీయందువలెనే స్వభార్యయందుఁగూడఁ బిల్లలను గనుట యేల నిందింపఁడు?

‡ తొందరపడి కార్యములు చేయువారు వేగముగా వచ్చి నిప్పులోఁబడుమిడుతలవలెనే నశింతురు.

———:0:———

# నారాయణభట్టపాదుఁడు.

కేరళదేశమున కలంకారముగానున్న నీలానది కతిసమీపంబున నుత్తరతీరంబుననున్న "మేల్పాత్తూరు" అను గ్రామమీతని నివాసము. బ్రాహ్మణోత్తముఁడగు నితఁడు బాల్యంబునఁ గావ్యపరిచయముగలవాఁడై యచ్యుతనామక వైష్ణవగురువునొద్ద నెల్లశాస్త్రములఁ జదివెను. ఇట్లుండఁగాలవశంబున నితనికిఁ బురాకృతకర్మఫలంబో యన నొకగొప్పరోగము సంభవించెనఁట. దానికైవ్యాధంబునను ప్రతిక్రియ గానక తపోబలంబున రోగశాంతియగునని తలంచి "గురువాయుపురం" బను పుణ్యక్షేత్రమునకుఁబోయి శ్రీమన్నారాయణునిఁ గొలుచుచుఁ బ్రతిదినము భాగవతార్థపరంబుగా నారాయణస్తోత్రము శ్లోకరూపంబుగాఁ జేయుచు గొన్నాళ్ళకు నిరామయుండయ్యెనఁట. అదిమొదలుగా నితఁడు భాగవతబిరుదాంకితుఁడయ్యె నని యీ హృదయశ్రవణరంజకంబుగానున్న యీసహస్రాధికపద్యస్తోత్రమిప్పటికి నా కేరళదేశవాసులతిభక్తితో నిత్యము పఠించుచుందు రనియు నొకరు వ్రాసిరి. ఈస్తోత్రనిర్మాణకాలము దాని యంతిమ శ్లోకంబుననున్న "ఆయురారోగ్యసౌఖ్యం" అనుపదంబునఁ గలికాలదివససంఖ్యారూపకంబుగాఁ దెలియుచున్నదని మద్రాసుప్రసాదపండితులు వ్రాసియున్నారు. కాని వారు చెప్పినట్లు భాగింపఁగాఁ గ్రీ॥ ౧౫౮౭ వచ్చుచుండఁగా నెందుచేతనో వారు ౧౫౮౦ అని నిర్ణయించిరి. ఆశ్లోకంబును, కలిదివససంఖ్యారూపకాలంబు నిందుఁజూపెదను.

"అజ్ఞాత్వా తే మహత్త్వం యదిహ నిగదితం విశ్వనాథ క్షమేథా ।
స్తోత్రం చైతత్సహస్రోత్తరమధికతరం త్వత్ప్రసాదాయ భూయాత్ ।

ద్వేధా నారాయణీయం శ్రుతిషుచ జనుషాం స్తుత్యతా వర్ణనేన।
స్ఫీతం లీలావతారై రిదమిహ కురుతా మాయురారోగ్యసౌఖ్యం ॥"

గీతపై పదియును వరరుచివాక్యం బగుకటపయాదిక్రమంబున సరిచూచినయెడఁ గలికాలదినసంఖ్య ౧౭౧౨౨౧౦ అని వచ్చుచున్నది. దీనిని సంవత్సరములలోనికిమార్చి క్రీస్తుశకాబ్దములతో సరిచూచినయెడల గ్రంథసమాప్తికాలముగా ౧౫౮౭ వచ్చుచున్నది. కావున నిదియే యీ కవికాల మని తెలియఁబడుచున్నది.

ఇతఁడు ప్రక్రియాసర్వస్వ మను వ్యాకరణగ్రంథమును స్వాహాసుధాకర మను నొకచిన్నకావ్యమును రచించెను.

ఒకనాఁడు బాలచంద్రునిఁజూడ నొకచోటకుఁజేరిన బ్రాహ్మణులు « లోకులీచంద్రునిఁగూర్చి యొకనూలుపోఁగువిడిచి నమస్కరించుటకుఁ గారణమే" మనియడుగఁగా నితఁడాశుకవనంబున స్వాహాసుధాకరకావ్యముగూర్చె నట్లీకావ్యమందే కలదు. ఇందుడియొక పద్య ముదాహరించెదను.

« రవి రయమస్తం యాత స్సమాగతో హంతహంత చంద్రోఽయం।
యాతి వికాసనషీయం కుముద్వతీ కిం విలంబసే భృంగ! ॥"

ఈకవి వృత్తమంతయుఁ గేరళదేశములోని కటథనదభూపాలుఁ డగునుదయవర్మరాజు వ్రాసినట్లుగాఁ గావ్యమాలాధిపతులు వ్రాసియుండిరి.

——:o:——

# శ్రీకృష్ణకవి. ౧౬౫౪—౧౭౦౦

ఇతఁడు పైనారాయణభట్టపాదుని కుమారుఁడైనట్లీతని « శ్రీకృష్ణరాజకర్ణశ్లోక నికేతనేన కృష్ణేన భాగవత ఇత్యభిశబ్దితస్య। నారా

యణస్య తనయేన సమీరితేయం తారాసుధాకరకథా విమషాం ముదేఽస్తు ॥ " అను పద్యమువలననే తెలియుచున్నది.

ఇతఁడు మందారమరందచంపువు, తారాశశాంక మనుచిన్నకావ్యమును రచించెను. ఇది కేవలశృంగారరసప్రధానము. ఇందు బృహస్పతి భార్యయగుతారకును జంద్రునకు జరిగినవృత్తాంతమును బుధుని జన్మమును వర్ణింపఁబడినవి. దీనిననుసరించియే తెలుఁగులోఁ దారాశశాంకవిజయము వ్రాయఁబడియుండు నని గ్రహింపవచ్చును. ఇందుండియొకటి పద్యము--

" ఏకం ద్విధాకలయితుం సకలా స్సమర్థాః ।
ద్వావేక మారచయితుం త్వదృతే నకోఽపి ।
త్వామర్థయామి తదహం సుచిరం త
సంతాపితౌ ఘటయనౌ భగవన్మనోజ! ॥ "

ఈకావ్యము సరసముగానున్నను శృంగారరసంబున నీతిక్రమమతిక్రమించి తలఁపరానివిషయంబును దెల్పుటచే లోకములోఁ బ్రశస్తిని గాంచకున్నదని చెప్పవచ్చును.

మందారమరందచంపువు. ఇందు వృత్తవిషయము, కావ్యభేదములు, రసభేదములు, తల్లక్షణములు, నాటకలక్షణములు, అలంకారభేదములు, వానిలక్షణములు చక్కగా సంస్కృతభాషాభిజ్ఞుల కత్యుపయోగముగా వర్ణింపఁబడినవి.

———;0:———

## విశ్వేశ్వరపండితుఁడు.

ఈతఁడు నర్వాచీనమహాకవులలో నొకఁడు. ఈతనిజీవచరిత్రమిట్లు తెలియుచున్నది. " హిమాలయంబునకు మిక్కిలి చేరియున్న ఆల్మోడా

నగరప్రాంతమున నున్నయొకపల్లె యీతని నివాసము. "ప్ాడియాకే పాండే" అను బ్రాహ్మణకులంబున లక్ష్మీధరపగపండితునకుఁ క్రీ॥౧౭౨౦ ప్రాంతమున నితఁడు జన్మించెను. ఈతని మెనిమిదవపురుఁ డిప్పటికిని జీవించియుండెనఁట. ఈతని జీవితకాలమంతయు ౩౪ సంవత్సరములు పదియవయేటనే కవిత్వము మొదలుపెట్టి యితఁ డీక్రిందిగ్రంథములను రచించెను " అలంకారకౌస్తుభము, అలంకారముక్తావళి, కావ్యతిలకము, కావ్యరత్నము, రసచంద్రిక, కవీంద్రకర్ణాభరణము, నవమాలికానాటకం, శృంగారమంజరీసట్టకము, తర్కకుతూహలము, సిద్ధాంతసుధానిధి, మందారమంజరి, ఆర్యాసప్తశతి. వీనిలో మొదటిమూడుగ్రంథము లాలంకారికములు. ఆఱవది వ్యస్తసమస్తాదు లగు ౫౮ జాతులను సోదాహరణముగాఁ దెల్పునట్టి లక్షణకావ్యము. సప్తమాష్టమములు దృశ్యకావ్యములు. నవమదశమములు శాస్త్రవిషయకములు. ఏకాదశము గద్యకావ్యము. కడపటిది, దేవీస్తోత్రము. వీనిలో మొదటి రెండలంకారగ్రంథములకును మనదేశములో నక్కడక్కడఁ గొంచెము ప్రచారము గలదు గాని మిగిలినవాని నామములైన మనదేశస్థులెఱుఁగ రని చెప్పవచ్చును. ఆర్యాసప్తశతిమాత్రము పఠనపాఠయోగ్యమై రొహిల్లఖండదేశము నలంకరించి యున్నది గ్రంథవిస్తరభీతిచే వీనివిమర్శనమునకుఁ గడంగక కవితాచమత్కారమును దెలుపఁ గవీంద్రకర్ణాభరణమునుండి యొకటి యుదాహరించెదను. ద్విస్సమస్తజాతికు దాహరణము—

"కాముకకదంబసద్భట పూర్ణేందు నిశీథినీ భానాః।
వాచ్యాః కథం చకాసతి కాంచనకలశాశ్చ కీదృశాః॥"

అనఁగా, జారుని, కడిమిచెట్టును, భటుని, పూర్ణిమను, అంగారకుని, క్రమముగాఁ దెలుపుచున్న సమాసపదము, బంగారుకుండ లెట్లుండునో తెల్పునది గావలెను అని ప్రశ్నము దీనికుత్తరము— "కామినీప

ద్యూధర్మాకారాః" ఇతి ప్రత్యేకము పైవానిం జెప్పుచు సువర్ణకలశము లు కాంతాకుచములవంటివని తెలుపుచున్నది.

——:0:——

# శివరామత్రిపాఠి.

ఇతఁడు స్మార్తుఁడు; త్రిలోకచంద్రుని కుమారుఁడు; కృష్ణరామ సూరిశిష్యుఁడు. మహావైయాకరణుఁడు. గ్రంథముఖంబుల నున్న కాశీగంగాది వర్ణనలంబట్టి కాశీవాసుఁ డని తెలియుచున్నది. ఇతఁడు తనగ్రంథంబుల క్రీ॥ శ॥ ౧౮ వ శతాబ్దము పూర్వభాగమందలి నాగేశభట్టుని పరిభాషేందుశేఖరమును స్మరించినవాఁ డగుటచే నతనికిఁ బరుఁడై క్రీ॥ ౧౭౫౦—౧౮౦౦ నడుమనుండియుండు నని కొందఱు విద్వాంసులూహించిరి. ఈతని నక్షత్రమాలావ్యాఖ్యాంతమందలి ‡ శ్లోకమునుబట్టి యితఁడనేకకావ్యములను బెక్కుగ్రంథములకు వ్యాఖ్యానములను వ్రాసినట్లు కనుపడుచున్నది. కాని వానిలో సటీకరసరత్నహారము, నక్షత్రమాల, కాదంబరీ వాసవదత్తా దశకుమారచరిత వ్యాఖ్యానములును గనుపడుచున్నవి. వ్యాకరణశాస్త్రంబున నితఁడపారప్రజ్ఞగలవాఁడనుట కీతఁడు రచించినట్లు తెలియనుణాదికోశమును, సవ్యాఖ్యనక్షత్రమాలయుఁ జాలును. నక్షత్రమాలలోని శ్లోకములు వ్యాకరణపరిభాషలయర్థమును సులభముగా బోధించుచు శృంగారరసభరితం బగులౌకికార్థమును దెల్పుచు నెంతయు హృద్యంబులుగాఁ విద్వద్గ్రాహ్యంబులుగా నున్నవి.

‡ కావ్యాని పంచ తను తేఽపిచ పంచసంఖ్యాః।
టీకాస్తు సప్త దశచైక ఉణాదికోశః।
భూపాలభూషణమథో రసరత్నహారో।
విద్యావిలాసఇన పూర్వశరత్కలాద్యాః॥